శ్రీ ర స్తు

శ్రీరామచంద్రాయనమః

శ్రీ పరమేశ్వర కరుణాకలితానవద్య కవిత్వవిద్యావినుతానుపమసాహిత్య

సహజపాండిత్య

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

(రెండవ భాగము)

పరిష్కర్త : లఘుటీకాకారులు

వ్యాకరణాలంకారాది లక్షణవేత్తలు

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు




పబ్లిషర్సు

బాలసరస్వతీ బుక్ డిపో

విద్యావిషయక ప్రచారకులు, కర్నూలు

6, సుంకురామశెట్టి స్ట్రీట్, మద్రాసు-1

తెలంగాణా : సోల్ డిస్ట్రిబ్యూటర్సు

టాగూర్ పబ్లిషింగ్ హౌస్

హైదరాబాదు

1975

వెల : 25-00

# ద్వితీయసంపుటము - విషయసూచిక

## అష్టమ స్కంధము



## నవమ స్కంధము



## దశమస్కంధము - పూర్వభాగము

దశమస్కంధము, ఉత్తరభాగము

## ఏకాదశస్కంధము



## ద్వాదశస్కంధము

శ్రీరామచంద్రాయ నమః

# శ్రీమహాభాగవతము

## అష్టమస్కంధము



శ్రీమన్నామ! పయోద
శ్యామ! ధరాభృల్లలామ! జగదభిరామా!
[1] రామాజనకామ! మహో
ద్దామ! గుణస్తోమధామ! దశరథరామా! 1

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

క. వినంబడియెను స్వాయంభువ, మనువంశము వర్ణధర్మమర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల, జననంబులు [2] స్రష్ట లెల్ల జనియించుటయున్. 3

ఉ. ఏ మనుకాలమందు హరి యీశ్వరుం డేటికి సంభవించె? నే
మేమి యొనర్చె? నమ్మనువు లే? రతం డేక్రియం జేయుచున్నవాం?
డేమి నటించు మీంద? గత మెయ్యది? నజ్జను లైనవారు ము
న్నే మని చెప్పుచుందురు? మునీశ్వర! నా కెఱింగింపవే దయన్. 4

వ. అనిన శుకుం డిట్లనియె. 5

క. ఈ కల్పంబున [3] మనువులు, ప్రాకటముగ నార్వురైరి పదునలువురలోఁ;
లోకములు జనుల పుట్టువు, [4] లాకథితము లయ్యె వరుస నఖిలములు నృపా! 6

---

1. రామాజనకామ – స్త్రీలకు మన్మథుండా! 2. స్రష్టలు - బ్రహ్మలు, 3. మనువులు – డెబ్బదియొక్క మహాయుగములపాటు పాలించునారు, 4. ఆకథితములు - వివరింపంబడినవి.

వ. ప్రథమమను వైన స్వాయంభువునకు నాకూతిదేవహూతు లను నిరువురు గూఁతులు గలరు; వారికిఁ గ్రమంబునఁ గపిల యజ్ఞనామంబుల లోకంబులకు ధర్మజ్ఞానబోధంబు సేయుకొఱకు హరి పుత్రత్వంబు నొందె; నందుఁ గపిలుని చరిత్రంబు మున్న చెప్పం బడియె; యజ్ఞుని చరిత్రంబు సెప్పెద వినుము. 7

మ. శతరూపాపతి కామభోగవిరతిన్ సంత్యక్తభూభారుఁడై
సతియుం దానును [1]గాన కేఁగి శతవర్షంబుల్ సునందానదిన్
వ్రతియై యేకపదస్థుఁడై నియతుఁడై [2]వాచంయమస్ఫూర్తితో
గతదోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా! 8

వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు దన మనంబులోన. 9

సీ. సృష్టిచే నెవ్వఁడు [3]చేతనపడకుండు? సృష్టి యెవ్వని చేఁతచే జనించు?
జగములు నిద్రింప జాగరూకత నొంది యెవ్వఁడు బ్రహ్మాండ మెఱుఁగుచుండు?
నాత్మ కాధారంబు నఖిలంబు నెవ్వఁడౌ? నెవ్వని నిజధనం బింతవట్టు
బొడగాన రాకుండఁ బొడగను? నెవ్వఁడే నెవ్వని దృష్టికి నెదురు లేదు?
ఆ. జననవృద్ధివిలయసంగతిఁ జెందక, యెవ్వఁ డెడపకుండు నెల్లయెడల?
దన మహత్త్వసంజ్ఞఁదత్త్వ మెవ్వఁడు దాన, విశ్వరూపుఁ డనఁగ విస్తరిల్లు? 10

వ. అని మఱియు నిరహంకృతుండును బుధుండును నిరాశియుఁ బరిపూర్ణుండును ననన్య ప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గసంస్థితుండును నిఖిలధర్మభావనుండును నైన పరమేశ్వరునకు నమస్కరించెద నని యుపనిషదర్థంబులు వలుకుచున్న మనువుం గనుంగొని. 11

క. రక్కసులు దినఁగఁ గదఁగిన, [4]వెక్కసముగ యజ్ఞనామవిష్ణుఁడు వారిం
జక్కడిచెఁ జక్రధారల, మిక్కుటముగ వేల్పు లెల్ల మేలని పొగడన్. 12

వ. ఇది ప్రథమ మన్వంతరం; బింక ద్వితీయమన్వంతరంబు వినుము, 13

సీ. స్వారోచిషం దన సప్తార్చిబిడ్డఁడు, మనువు; వానికి నా ద్యుమత్సుషేణ
రోచిష్మదాదు లారూఢపుత్రులు ధాత్రి నేలిరి; రోచనుఁ డింద్రుఁ డయ్యె;
నధికులు తుషితాదు లమరు లూర్జస్తంబ, ముఖ్యు లాద్యులు సప్తమునులు నాఁడు
వేదశిరుం డను విప్రునిదయితకుఁ, దుషితకుఁ బుత్రుఁడై తోయజాక్షుఁ

1. వనంబు కేఁగి - పాఠాంతరము. 2. వాక్సంయమ - పాఠాంతరము. 3. చేపడ కుండును-పాఠాంతరము. 4. వెక్కసముగ - అధికముగా.

ఆ. దవతరించెను విభుఁ డన; [1]నశీత్యష్టస, హస్రమునులు నధికు లయినవారు;
ఘనులను గ్రహింపఁ గౌమారక బ్రహ్మ,చారి యగుచు నతఁడు సలిపె వ్రతము. 14

వ. తదనంతరంబ. 15

సీ. మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర! యుత్తముం డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు
పాలించె నిల యెల్లఁ; బవనసృంజయ యజ్ఞ హోత్రాదు లాతని పుత్రు లధిక
గుణులు; వసిష్ఠునికొడుకులు ప్రమథాదు లైరి సప్తర్షులు; నమరవిభుఁడు
సత్యజి త్తనువాఁడు, సత్యభద్రాద్యులు సురలు, ధర్మునికిని సూనృతకును
ఆ. బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య సేనుఁ డనఁగ దుష్టశీలయుతుల
దనుజయక్షపతుల దండించె సత్యజిన్మిత్రుఁ డగుచు జగము మే లనంగ. 16

—: గజేంద్రమోక్షణకథాప్రారంభము :—

వ. చతుర్థమనువుకాలప్రసంగంబు వివరించెద. 17

సీ. మానవాధీశ్వర! మనువు నాలవవాఁడు, తామసుం డనఁగ నుత్తమునిభ్రాత;
పృథివీపతులు కేతువృషనరఖ్యాత్యాదు, లతనిపుత్రులు [2]పద్గు రధికబలులు;
సత్యకహరివీరసంజ్ఞులు వేల్పులు; త్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు;
మునులు జ్యోతిర్వ్యోమముఖ్యులు; హరి పుట్టె హరిమేధునకుఁ బ్రీతి హరిణియందు;
ఆ. [3]గ్రాహబద్ధుఁ డయిన గజరాజు విడిపించి, ప్రాణభయమువలనఁ బాపి కాచె
హరి దయాసముద్రు డఖిలలోకేశ్వరుఁ, డనిన శుకునిఁ జూచి యవనివిభుఁడు. 18

క. నీరాటవనాటములకుఁ, బోరాటం బెట్లు గలిగెఁ? బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను, ఘోరాటవిలోని భద్ర [4]కుంజరమునకున్. 19

క. మునినాథ! యీ కథాస్థితి, వినిపింపుము; వినఁగ నాకు వేడుక పుట్టెన్;
వినియెదఁ గర్ణేంద్రియముల, పెనుఁబండువు సేయ మనముఁ బ్రీతిం బొందన్. 20

క. ఏ కథలయందుఁ బుణ్య, శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే
నా కథలు పుణ్యకథ లని, యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్. 21

1. అశీత్యష్టసహస్రమునులు- నలువదియెనిమిదివేలనుంది మునులు, 2. పద్గురు - పదిమంది, 3 గ్రాహబద్ధుఁడు - మొసలిచేఁ బట్టుకొనఁబడినవాఁడు, 4. కుంజరము - ఏనుఁగు.

వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగెనని చెప్పి సభాసదులయిన మునుల నవలోకించి సూతుండు పరమహర్షసమేతుండై చెప్పె; నట్లు శుకుండు రాజున కిట్లనియె. 22

సీ. రాజేంద్ర! విను [1]సుధారాశిలో నొక పర్వతము త్రికూటం బనఁ దనరుచుండు;
యోజనాయుతమగు నున్నతత్వంబును, నంతియ వెడలుపు నతిశయిల్లుఁ;
[2]గాంచనాయస్సారకలధౌతమయములై, మూఁడు శృంగంబులు మొనసియుండుఁ;
దటశృంగబహురత్న ధాతుచిత్రితములై, దిశలు భూనభములుఁ దేజరిల్లు;
తే. భూరిభూజలతాకుంజపుంజములును, మ్రోసి పఱతెంచు సెలయేటిమొత్తములును
మరగి తిరిగెడు దివ్యవిమానములును, జఱులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి. 23

వ. అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుల వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగపున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికా మతల్లికాప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్యసంప దంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహాలంకృతంబును, మణివాలుకానేక విమల పులినతరంగిణీసంగతవిచిత్రవిద్రుమలతామహోద్యాన శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుట నిర్దళిత శాఖిశాఖాంతర పరిపక్వఫలరంధ్రప్రవర్షిత రసప్రవాహబహుళంబును గనకమయసలిలకాసారకాంచనకుముదకహ్లార కమల పరిమళ మిళిత కబళాహారసంతతాంగీకారభారపరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్తమధుకర విటసముదయ సమీపసంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక [3]కోయష్టిక ముఖర జలవిహంగవిసర వివిధకోలాహల బధిరీభూత భూనభోంతరాళంబును దుహినకరకాంత మరకత కమలరాగ వజ్రవైదూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌతమయానేక శిఖరతట దరీవిహరమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథున సంతత సరససల్లాప సంగీత ప్రసంగమంగళాయతనంబును గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖిలమృగనాథ సమూహసమరసన్నాహసంరంభ సంచకితశరణాగతసమన కింకరంబునై యొప్పు నప్పర్వతసమీపంబునందు. 24

---

1. సుధారాశి - పాలసముద్రము, 2. కాంచనాయస్సార కలధౌతమయములు- బంగారు, ఇనుము, వెండిమయములు, 3. కోయష్టికము-గ్రుడ్డికొంగ.

క. ఖిల్లీ భిల్ల [1]లులాయక, భల్లుక ఫణి ఖడ్గ గవయ [2]వలిముఖ చమరీ
[3]ఝిల్లీ హరి శరభక కిటి, మల్లాద్భుత కాక ఘూక మయమగు నడవిన్. 25

శా. అన్యాలోకనభీకరంబులు జితాశా[4]నేకపానీకముల్
వన్యేభంబులు గొన్ని మత్తతనులై [5]వ్రజ్యావిహారాగతో
దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సౌ
జన్యక్రీడల నీరుగాలి వడి కాసారావగాహార్థమై. 26

ఆ. అంధకార మెల్ల నద్రిగుహాంతర వీథులందుఁ బగలు వెఱచి డాఁగి
[6]యెడరు వేచి సంధ్య నినుఁడు వృద్ధత నున్న, వెడలెననఁగ గుహలు వెడలెఁ గరులు. 27

క. తలఁగవు కొండలకైనను, [7]మలఁగవు సింగములకైన; మార్కొనుకడిమిం
గలఁగవు పిడుగులకైనను, నిల బలసంపన్నవృత్తి నేనుఁగుగున్నల్. 28

సీ. పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు; ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు;
[8]భూదారములు నేల బొఱియలలో డాఁగు; హరిదంతముల కేఁగు హరిణచయము;
మడువుల జొరఁబాఱు మహిషసంఘంబులు; గండశైలంబులఁ గపులు ప్రాఁకు;
వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు; నీలకంఠంబులు నింగి కెగయు;
తే. వెఱచి చమరీమృగంబులు విసరు వాల చామరంబుల విహరణశ్రమమువాయ
భయదపరిహేల విహరించు భద్రకరుల, గాలివాఱినమాత్రన జాలిఁ బొంది. 29

క. మదగజదానామోదము, గదలని తమకములఁ ద్రావి కడుపులు నిండం
బొదలును దుమ్మెదకొదమల కదుపులు [9]జుంజు మ్మటంచు గానము సేసెన్. 30

క. తేఁటి యొకటి యొరుప్రియకును, మాటికి మాటికిని నాగమదజలగంధం
బేటి కని తన్నుఁ బొందెడి బోటికి నందిచ్చు నిండుబోటుఁదనమునన్. 31

క. అంగీకృతరంగ [10]న్మాతంగీమదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీతవిశేషంబుల, భృంగీగణ మొప్పె ప్రమానుపెట్టెడిమాడ్కిన్. 32

క. వల్లభలు పాఱి మునుపడ, వల్లభ మని మునరి రేని వారణదానం
బొల్లక మధుకరవల్లభు లుల్లంబులఁ బొంది రెల్ల యుల్లాసంబుల్. 33

---

1. లులాయకము - అడవిదున్న, 2. వలిముఖము - కోఁతి, 3. ఝిల్లి - ఈల పురుగు, 4. అనేకపానీకముల్ - ఏనుఁగులగుంపులు, 5. వ్రజ్య-తిరుగుట, 6. ఎడరు - సమయము, 7. మలఁగవు - మఱలవు, 8. భూదారములు - వరాహములు, 9. ఝుంఝుమ్మటంచు—పాఠాంతరము, 10. మాతంగి-ఆఁడేనుఁగు.

వ. అప్పుడు. 34

మ. [1]కలభంబుల్ సెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్
ఫలభూజంబులు రాయుచుం జివురుజొంపంబుల్ వడిన్ మేయుచుం
బులులం గాఱెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచుం
గొలకుల్ సొచ్చి కలంచుచున్ గిరులపై గొబ్బిళ్లు గోరాడుచున్. 35

క. తొండంబుల మదజలవృత గండంబులఁ గుంభములను ఘట్టన సేయం
గొండలు దలక్రిందై పడు, [2]బెండుపడున్ దిశలు చూచి బెగడున్ జగముల్. 36

క. ఎక్కడఁ జూచిన లెక్కకు నెక్కువయై యడవి నడచు నిభయూథములో
నొక్క కరినాథుఁ [3]డెడతెగి, చిక్కె నొక కరేణుకోటి సేవింపంగన్. 37

వ. ఇట్లు వెనుక ముందట నుభయపార్శ్వంబులఁ [4]దృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగు గములం గానక తెఱంగు దప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తం బైన చిత్తంబు నంవిత్తంబు గాకుండుటంజేసి తానును దనకరేణుసముదయంబును నొక్క తెరువై పోవుచు. 38

సీ. పల్వలంబుల లేఁతపచ్చిక మచ్చికఁ జెలుల కందిచ్చు నచ్చికము లేక;
నివురుజొంపములఁ గ్రొవ్వేలయు పూఁగొమ్మలఁ బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు;
ఘనదానశీతల కర్ణతాళంబుల దయితల చెమటార్చుఁ దనువు లరసి;
మృదువుగాఁ గొమ్మల మెల్లన గళములు నివురుచుఁ బ్రేమతో [5]నెఱపువలపు;
తే. పిఱుఁదుచక్కట్ల దగ్గఱి ప్రేమతోడ డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు;
[6]వెద వివేకించుఁ; గ్రీడించు; విశ్రమించు; మత్తమాతంగమల్లంబు మహిమతోడ. 39

సీ. తన కుంభములపూర్ణతకు డిగ్గి యువతులు కుచములు పయ్యెదకొంగు లీఁగఁ,
దన యానగంభీరతకుఁ జాల కబలల యానంబు లందెల నండగొనఁగఁ,
దన కరశ్రీఁ గని తలఁగి బాలల చిఱు దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ,
దన దంతరుచికోటి తరుణుల నగవులు ముఖచంద్రదీప్తుల ముసుఁగు దిగువఁ,
తే. దనదులావణ్యరూపంబుఁ దలఁచి చూడ, నంజనాభ్రము కపిలాదిహరిదిభేంద్ర
దయితలందఱుఁ దనవెంటఁ దగిలినడవఁ, గుంభివిభుఁ డొప్పె నొప్పులకుప్పవోలె. 40

1. కలభముల్ - పసఁగుగున్నలు. 2. బెండుపడు - నిస్సారములగు 3. ఎడతెగి - విడిపోయి, 4. తృషార్దితంబు - దప్పిచే బాధపడినవి, 5 నెలవుగఅవు—పాఠాంతరము. 6. వెద - పశువుల ఋతుసమయము.

వ. మఱియు నానాగహనవిహరణమహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి విపాసాపరాయత్తచిత్తంబున మత్తకరేణువులమొత్తంబునుం దానునుం జనిచని, 41

మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవపుల్లాంభోజకహ్లారమున్
నటదిందీవరవారముం గమఠమీనగ్రాహదుర్వారమున్
వట [1]హింతాల రసాల సాల సుమనో వల్లీకుటీతీరముం
జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁ గాసారమున్. 42

వ. ఇట్లనన్యపురుషసంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగని 43

సీ. తోయజగంధంబు దోఁగిన చల్లని, మెల్లని గాడ్పుల మేను లలరఁ,
గమలనాళాహారవిమలవాక్కలహంసరవములు సెవులపండువులు సేయ;
పుల్లదిందీవరాంభోరుహామోదంబు, ఘ్రాణరంధ్రంబుల గారవింప,
నిర్మలకల్లోలనిర్గతాసారంబు వదనగహ్వరముల వాడు దేర్పఁ,
తే.ద్రిజగదభినవసౌభాగ్యదీప్తమైన విభవ [2]మీక్షణములకును విందు సేయ
నరిగి పంచేంద్రియవ్యవహారములను మఱచి మత్తేభయాథంబు మడుఁగు సొచ్చె. 44

క. తొండంబులఁ బూరించుచు, గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్
మెండుకొన [3]వలుఁదకడుపులు నిండన్ వేదండకోటి నీటిం ద్రావెన్. 45

వ. అప్పుడు. 46

మ. ఇభలోకేంద్రుఁడు [4]హస్తరంధ్రముల నీ రెక్కించి పూరించి చం
ద [5]ఖమార్గంబున కెత్తి నిక్కి వడి [6]నుద్ఘాడించి వింజింప నా
రభటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహపాఠీనముల్
నభమం దాడెడు మీనకర్కటముల న్బట్టెన్ సురల్ మ్రాన్పడన్. 47

వ. మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున. 48

సీ. కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోఁగి సెలయేటినీలాద్రి చెలువుఁ దెగడు;
హస్తినీహస్తవిన్యస్తపద్మంబుల వేయిగన్నులవాని వెరపు సూపుఁ;
గలభసముత్కీర్ణ [7]కహ్లారరజమునఁ గనకాచలేంద్రంబుఘనతఁ దాల్చుఁ
గుంజరీపరిచితకుముదకాండంబుల ఫణిరాజమండనప్రభ వహించు

---

1. హింతాలము—ఒకవిధమగు తాడి, 2. ఈక్షణములు—చూపులు, 3. వలుఁద-పెద్ద. 4 హస్తము-తొండము, 5. ఖమార్గంబు-ఆకాశము, 6. ఉద్ఘాడించి - కలఁచివేసి. 7. కహ్లారరజము - కలవపుప్పొడి,

ఆ. మదకరేణుమౌక్తికశుక్తుల మెఱుఁగుమొగిలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజమల్లంబు వనజగేహకేళి వ్రాలునపుడు. 49

వ. మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధవిహారవ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై యనంగవిద్యానిరూఢ [1]పల్లవ ప్రబంధపరికంపిత శరీరాలంకార యగు కుసుమ కోమల యునుంబోలె వ్యాకీర్ణ చికురమత్తమధుకర నికరయు విగతరసవదనకమలయు నిజ స్థానచలిత కుచరథాంగయుగలయు లంపటిత జఘనపులినతలయునైయుండె; నంత. 50

సీ. భుగభుగాయితభూరి బుద్బుదచ్ఛటలతోఁ గదలుచు దివికి భంగంబు లెగయ;
భువన భయంకరఫూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ,
వాలవిక్షేపదుర్వారఝుంఝానిలవశమున ఘుమఘుమావర్త మడరఁ,
గల్లోలజాలసంఘట్టనంబులఁ దటీతరులమూలంబులై ధరణిఁ గూల,
తే. సరసిలోనుండి పొడగని సంభ్రమించి, యుదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది, నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె. 51

క. వడిఁ దప్పించి కరీంద్రుఁడు నిడుదకరం బెత్తి వ్రేయ నీరాటంబుం
బొడ వడఁగినట్లు జలములఁ బడి కడువడిఁ బట్టెఁ [2]బూర్వపదయుగళంబున్. 52

చ. పదములఁ బట్టినం దలఁకుఁబా టొకయింతయు లేక శూరతన్
మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంతఘట్టనం
జెదరఁగఁ జిమ్మె నమ్మకరిచిప్పలు పాదులు దప్పనొప్పఱన్
వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరెఁ [3]గోఱలన్. 53

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ, గరి దరికిని మకరిఁ దిగుచుఁ [4]గరకరి బెరయన్
గరికి మకరి మకరికిఁ గరి భర [5]మనుచును నతలకుతలభటు లరుదుపడన్. 54

వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండదండంబులై తలపడి నిఖిల లోకాలోకనభీకరంబులై యన్యోన్యవిజయశ్రీవశీకరంబులై సంక్షోభిత కమలాకరంబులై [6]హరి హరియును, గిరి గిరియునుం దాఁకి పిఱుతివియక పెనంగు తెఱంగున నీరాటం బయినపోరాటంబునం బట్టుచు వెలికిలోికిం దిగుచుచుఁ గొలంకు గలంకంబొందఁ గడువడి నిట్టట్టుఁ బడి తడఁబడి బుడబుడానుకారంబులై బుగులుబుగుల్లను చప్పుళ్లతో నురువులు గట్టుచు జలంబు [7]లుప్పరం బెగయం జప్పరించుచుఁ దప్పక వదనగహ్వరం

1. పల్లవుఁడు - విటుఁడు, 2. పూర్వపదయుగళంబు - ముందరిరెండుకాళ్లు, 3. గోరులన్-పాఠాంతరము, 4. కరకరి-ద్వేషము, 5. మనఁగా నతలకుతల పతులరుద్రు పడన్. పాఠాంతరము, 6. హరి-సింహము, 7. ఉప్పరంబు-ఆకాశము,

బుల నవ్వళించుచు నిశితనితాంతదురంతదంత కుంతంబుల నింతింతలు దునియలయి [1]నెవ్వళంబునం బునుక చిప్పలు గుదుళ్లుదవ్వి రక్తంబులు గ్రమ్ము దేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతరసమాకర్షణంబులం గదలక పదంబుల మొదలిపట్టు వదలక కుదురై వర్తించుచుఁ బరిభ్రమణవేగంబున జలంబులం దిరుగుచు మకరకమఠ కర్కట [2]గండకమండూకాది సలిలనిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం [3]దాఁకు రభసంబున నిక్కలువడ మ్రక్కం ద్రొక్కుచు మెండుచెడి బెండువడి నాఁచు గుల్లచిప్పతండంబులఁ బరస్పరతాడనంబులకు సడ్డంబుగా నొడ్డుచు నోలమానగొనక గెలుపుఁ దలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుంబోలెఁ గ్రమక్రమ విజృంభ మాణంబులై బహుకాలకలహవిహారంబులై నిర్గత నిద్రాహారంబులై పోరుచున్న సమ యంబున. 55

క. జవమును జలమును బలమును వివిధములుగఁ బోరు కరటివీరతకు భువిన్
దివి మకరమీనకర్కట నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్. 56

శా. ఆటోపంబునఁ జిమ్ము టొమ్మగల వజ్రాభీలదంతంబులం
దాటించున్ మెడఁ జుట్టిపట్టి హరిదోర్దండాభశుండాహతిన్
నీటన్ మాటికి మాటికిం దిగువఁగా నీరాటమున్ నీటిపో
[4]రాట న్నోటమిపాటుఁ జూవుట కరణ్యాటంబు వాచాటమై. 57

వ. అప్పుడు. 58

ఆ. మకరితోడఁ బోరు మాతంగవిభుని నొక్కరుని డించి పోవఁ గాళ్లు రాక
కోరి చూచుచుండెఁ గుంజరీయూథంబు మగలు దగులు గారె మగువలకును? 59

వ. అంత. 60

ఆ. [5]జీవనంబు దనకు జీవనంబై యుంట నలవుఁ జలము నంతకంత కెక్క
మకర మొప్పె; డస్సె మత్తేభమల్లంబు బహుళపక్షశీతభానువగిది. 61

మ. ఉఱుకుం గుంభయుగంబుపై హరి క్రియన్ హుమ్మంచుఁ; బాదంబులన్
[6]నెఱయం గంఠము వెన్ను దన్ను; నెగయున్ హేలాగతిన్; వాలముం
జఱచున్; నుగ్గుగఁ దాఁకు; ముంచు; మునుఁగున్; శల్యంబులున్ దంతముల్
విఱుగన్ వ్రేయుచుఁ బొంచిపొంచి కదియున్ వేదండయూథోత్తమున్. 62

1. నెవ్వళఁబు-వేగము 2. గండకము-ఖడ్గమృగము, 3. దాఁకుచు - పాఠాంతరము
4. రాట్టంబోటమి—పాఠాంతరము. 5. జీవనంబు—నీరు, 6. దిరుగుం—పాఠాంతరము

మ. పొరి గానంబడకుండ డాఁగు ; వెలికిం[1]బోవంగఁ దా నడ్డమై
పొరిచూపుం ; జరణంబులం బెనఁగొనుం బోరాక రారాక బు
గ్గడిలం గూలఁగఁ [2]దాఁచు ; లేచుతటి నుద్ఘాటించు ; లంఘించు ; బ
ల్విడిఁ జీరుం ; దలఁగున్; మలంగు ; నొడియన్ వేధింనుఁ గ్రోధించుచున్. 63

వ. ఇట్లు విస్మితనక్రచక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞానదీపంబు నతిక్ర
మించు మహామాయాంధకారంబునుంబోలె నంతకంతకు నుత్సాహకలహసన్నాహబహు
విధ జలావగాహంబయిన [3]గ్రాహంబు మహాసాహసంబున. 64

శా. పాదద్వంద్వము నేల మోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ [4]మాఁజాకు [5]హత్తించి ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రుమ
ర్యాదన్ నక్రము [6]విక్రమించెఁ గరిపాదాక్రాంతినిర్వక్రమై. 65

ఆ. వనగజంబు నెగచు వనచారిఁ బొడగని వనగజంబ కాన వక్రిగజము
వెల్లనై సురేంద్రు వేచి సుధాంధులు పట్టఁ బట్టనీక బయలు ప్రాఁకె. 66

ఉ. ఊహ గలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహా
మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగలేక సం
దేహముఁబొందు దేహిక్రియ దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై. 67

వ. ఇవ్విధంబున. 68

క. అలయక సొలయక వేసట నొలయక కరి మకరితోడ నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు సలిపెం బో రొక్కవేయి సంవత్సరముల్. 69

మ. పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం
శిథిలంబై తన లావు వైరిబలముం జింతించి మిథ్యామనో
రథ మిం కేటికి ? దీని గెల్వ నరి పోరం జాలరా; దంచు న
వ్యథమై యిట్లనుఁ బూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్. 70

శా. ఏరూపంబున దీని గెల్తు ? నిట మీఁ [7]దేవెంటఁ జింతింతు? నె
వ్వారిం జీరుదు ? నెవ్వ రడ్డ ? మిఁక నివ్వారిప్రచారోత్తమున్

---

1. బోఁబోవఁదానడ్డమై — పాఠాంతరము. 2. దూఁటు — పాఠాంతరము
3. గ్రాహంబు-మొసలి, 4. మాఁజాకు —ప్రాఁకుడుఁగొయ్య-తన్నుకట్టి 5. బొత్తించి-
పాఠాంతరము, 6. మతిక్రమించె-పాఠాంతరము, 7. దేవేల్పు-పాఠాంతరము.

వారింపం దగువార లెవ్వ ? రఖిలవ్యాపారపారాయణుల్
లేరే ! మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రవుణ్యాత్మకుల్ ! 71

శా. నానా [1]నేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబున స
న్మానింపన్ దశలక్షకోటికరిణీనాథుండనై యుండి మ
ద్దానాంభః పరిపుష్టచందనలతాంతచ్ఛాయలం దుండ లే
కీనీరాస ని టేల వచ్చితి ? భయం బెట్లో కదే యిశ్వరా ! 72

ఉ. ఎవ్వనిచే జనించు జగ; మెవ్వనిలోపల నుండు [2]లీనమై;
యెవ్వనియందు [3]డిందుఁ ? బరమేశ్వరుఁ డెవ్వఁడు ? మూలకారణం
బెవ్వఁ ? డనాదిమధ్యలయుఁ డెవ్వడు ? సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు ? వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్. 73

క. ఒకపరి జగములు వెలి నిడి యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థసాక్షి యగు నయ్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్. 74

క. లోకంబులు లోకేశులు లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. 75

క. [4]నర్తకునిభంగిఁ బెక్కగు మూర్తులతో నెవ్వఁ డాడు ? మునులు దివిజులుం
గీర్తింప నేర ? రెవ్వని వర్తన మొరు లెఱుఁగ, రట్టివాని నుతింతున్. 76

ఆ. ముక్తసంగులైన మునులు దిదృక్షులు సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని దివ్యపదము, వాడుదిక్కు నాకు. 77

సీ. [5]భవము దోషంబు రూపంబుఁ గర్మంబు నాహ్వాయములు గుణము నెవ్వనికి లేక
జగములఁ గలిగించు నమయించుకొఱకునై నిజమాయ నెవ్వఁ డిన్నియును దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు
ఆ. మాటలను [6]నెఱుకల మనములఁ జేరంగఁ గానిశుచికి సత్యగమ్యుఁ డనుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చువాని కే నొనర్తు వందనములు. 78

1. అనేకపయూథముల్ – ఏనుఁగుల గుంపులు, 2. లీనము - అణఁగియున్నది, 3. డిందు – లయమగును, 4. నర్తకుఁడు - నాట్యము చేయువాఁడు, 5. భవము - పుట్టువు, 6. ఎఱుకలు - జ్ఞానములు.

సీ. శాంతున కపవర్గసౌఖ్యనంవేదికి నిర్వాణభర్తకు నిర్విశేష
నకు ఘోరునకు గూఢునకు గుణధర్మికి సౌమ్యున కధికవిజ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహు క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి
ఆ. నెఱి నసత్య మనెడి నీడతో వెలుఁగుచు నుండు [1]నెక్కటికి మహోత్తరునకు
నిఖిలకారణునకు నిష్కారణునకు న, మస్కరింతు నన్ను మనుచుకొఱకు. 79

క యోగాగ్నిదగ్ధకర్ములు యోగీశ్వరు లే మహాత్మ నొం డెఱుఁగక స
ద్యోగవిభావితమనముల బాగుగ వీక్షింతు; రట్టి పరము భజింతున్. 80

సీ. సర్వాగమామ్నాయజలధికి నపవర్గమయునికి నుత్తమమందిరునకు
సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ దనయంత రాజిల్లు ధన్యమతికి
గుణలయోద్దీపితగురుమానసునకు సంవర్తితకర్మనిర్వర్తితునకు
దిశ లేని నాబోఁటి పశువులపాపంబు లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ
ఆ. డై వెలుంగువాని కచ్ఛిన్ననకు భగవంతునకుఁ దనూజపశునివేశ
దారసక్తు లయినవారి కందఁగరానివాని కాచరింతు వందనములు. 81

వ, మఱియును. 82

సీ. వరధర్మకామార్థవర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు ? చేరి కాంక్షించువారి కవ్యయ దేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ ?
ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు ? రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు ?
ఆ. రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మయోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మమయినవానిఁ బరుని నతీంద్రియు నీశు [2]స్థూలు సూక్ష్ము నే భజింతు. 83

వ. అని మఱియు నిట్లని వితర్కించె. 84

సీ. [3]పావకుం డర్చుల భానుండు దీప్తుల, నెట్లుంగి నిగిడింతు, రెట్లడంతు
రా క్రియ నాత్మకరావళిచేత బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘననామరూపభేదములతో మెఱయించి తగ నడంచు
నెవ్వఁడు, మనము బుద్ధీంద్రియములుఁ దానయై గుణసంప్రవాహంబు నెఱపు,
తే. స్త్రీ నపుంసక పురుషమూర్తియును గాక తిర్యగమరనరాదిమూర్తియును గాక
కర్మగుణభేదసదసత్ప్రకాశి గాక వెనుక నన్నియుఁ దానగు విభుఁ దలంతు. 85

1. ఎక్కటి—ఒంటరి, 2. దూరు—పాఠాంతరము. 3. పావకుఁడు—అగ్ని.

క. కలఁ డందురు దీనులయెడఁ, గలఁ డందురు పరమయోగిగణములపాలం,
గలఁ డందు రన్నిదిశలను, గలఁడు కలం డనెడువాఁడు గలఁడో లేఁడో ? 86

సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ గలిమిలేములులేక కలుగువాఁడు ;
వా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాఁడు ;
చూడఁడే నా [1]పాటుఁ జూపులఁ జూడక [2]చూచువారలఁ గృపఁ జూచువాఁడు ;
లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల మొఱలెఱుంగుచుఁ దను మొఱఁగువాఁడు ;
తే. అఖిలరూపముల్ దనరూప మైనవాఁడు; [3]ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు వినఁడె చూడఁడె తలఁపఁడె వేగ రాఁడె ! 87

క. విశ్వకరు విశ్వదూరుని విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్. 88

వ. అని పలికి తనమనంబున నగ్గజేంద్రుం డీశ్వరసన్నిధానంబు కల్పించుకొని
యిట్లనియె. 89

శా. [4]లా వొక్కింతయు లేదు; ధైర్యము విలోలం బయ్యెఁ ; బ్రాణంబులున్
[5]ఠావుల్ దప్పెను; మూర్ఛ వచ్చెఁ; దనువున్ డస్సెన్; శ్రమం బయ్యెడిన్;
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ; మన్నింపం దగున్ దీను నిన్;
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! 90

క. విను దఁట జీవులమాటలు చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్థీ ! 91

ఉ. ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో కవియోగివంద్య! సుగుణోత్తమ ! యో శరణాగ [6]తామరా
నోకహ ! యో మునీశ్వరమనోహర ! యో విమలప్రభావ ! రా
వే కరుణింపవే తలఁపవే [7]శరణార్థిని నన్నుఁ గావవే ! 92

వ. అని పలికి మఱియు నరక్షితరక్షకుండైన యీశ్వరుం [8]డాపన్నుండైన నన్నుం గాంచుఁ
గాక యని నింగి నిక్కి చూచుచు నిట్టూర్పులు నిగిడించుచు బయలాలకించుచు నగ్గ
జేంద్రుండు మొఱ సేయుచున్న సమయంబున. 93

1. పాటు - కష్టము, 2. చూచెడువారలఁ జూచువాఁడు — పాఠాంతరము,
3. ప్రథమమధ్యాంతములు గానఁబడనివాఁడు—పాఠాంతరము, 4. లావు - బలము,
5. ఠావుల్ - చోటులు, 6. అమరానోకహము - కల్పవృక్షము, 7. వే వినవే శరణార్థిఁ
గావవే—పాఠాంతరము, 8. ఆపన్నుండు - ఆపదను పొందినవాఁడు.

ఆ. విశ్వమయత లేమి వినియు నూరక యుండి రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుఁడు భక్తియుతున కడ్డపడఁ దలంచె. 94

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబుదా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పల[1]పర్యంకరమావినోది యగు నాపన్నప్రసన్నుండు [2]వి
హ్వలనాగేంద్రము [3]పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభి యై. 95

మ. సిరికిం జెప్పఁడు; శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ; డే
పరివారంబును జీరఁ; [4]డభ్రగపతిం [5]బన్నింపఁ; డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు; వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. 96

వ. ఇట్లు భక్తజనపాలనపరాయణుండును, నిఖిలజంతుహృదయారవిందసదన సంస్థితుండును నగు నారాయణుండు కరికులేంద్రవిజ్ఞాపిత నానావిధదీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతావినోదంబులం [6]దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయునప్పుడు. 97

మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, దానివె
న్కను బక్షీంద్రుఁడు, వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును, నారదుండు, [7]ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్. 98

వ. తదనంతరంబ ముఖారవింద మకరందబిందుసందోహ పరిష్యందనానందదిందిందిరయగు నయ్యిందిరాదేవి గోవిందకరారవిందసమాకృష్యమాణ సంవ్యానచేలాంచల యయి పోవుచు. 99

మ. తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ; డనాథస్త్రీజనాలాపముల్
వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్,
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధుఁ డేడి చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్. 100

1. పర్యంకము = పడక, 2. విహ్వలనాగేంద్రము = అవయవములు స్వాధీనము తప్పిన గజము. 3. పాహి = కాపాడుము, 4. అభ్రగపతి = గరుడుఁడు, 5. బల్లింప— పాశాంతము, 6. తగులు = ఆసక్తి, 7. ధ్వజినీకాంతుండు = విష్వక్సేనుఁడు.

వ. అని వితర్కించుచు. 101

శా. తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్లబంధంబుతో,
శాటీముక్తకుచంబుతో, నదృఢచంచత్కాంచితో, శీర్ణలా
లాటాలేపముతో, మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ,
గోటీందుప్రభతో, నురోజభరసంకోచద్విలగ్నంబుతోన్. 102

క. అడిగెద నని కడు వడిఁ జను, నడిగినఁ దను మగుడ 1నుడుగఁ డని నెడ నుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ నడు గిడు; నడు గిడదు జడిమ నడు గిడునెడలన్. 103

సీ. నిటలాలకము లంట నివుర జుంజుమ్మని, ముఖసరోజము నిండ ముసరుఁ దేంట్లు;
నళులఁ జోఁపఁగ జిల్క లల్ల నల్లన చేరి, యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు;
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మందాకినీ2పాఠీనలోక మెసఁగు;
మీనపంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ 3శంపాలతలు మింట సరణి గట్టు;
ఆ. శంపలను జయింపఁ జక్రవాకంబులు కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుసూపు;
మెలఁత మొగిలుపిఱిఁది మెఱుఁగుఁదీవయుఁబోలె జలదవర్ణు వెనుకఁ జనెడునపుడు. 104

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతిజీ
వనసంపత్తినిరాకరిష్ణుఁ గరుణావర్థిష్ణు యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లసదిందిరావరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్. 105

వ. ఇట్లు పొడగని. 106

మ. చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె! హరిపజ్జం గంటిరే లక్ష్మి? శం
ఖనినాదం బదె; చక్ర మల్లదె; భుజంగధ్వంసియున్ వాఁడె క్ర
న్నన యేతెంచె నటంచు వేల్పులు నమోనారాయణాయేతిని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 107

వ. అయ్యవసరంబునం గుంజరేంద్రపాలనపారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీక
రింపక మనస్సమానసంచారుండై పోయి పోయి కొంతదూరంబు శింశుమారచక్రంబునుం
బోలె గురుమకరకులీరమీనమిథునంబై కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ

1. నుడుగఁడు - మాఱుపలుకఁడు, 2. పాఠీనము - చేప, 3. శంపాలతలు - మెఱుపుఁదీఁగలు.

నరకచ్ఛపంబై భాగ్యవంతుని భాగధేయంబునుం బోలె సరాగజీవనంబై వైకుంఠంబునుం బోలె శంఖచక్రకమలాలంకృతంబై సంసారచక్రంబునుంబోలె ద్వంద్వసంకులపంక సంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని. 108

మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగా బంపె స
త్వరితాకంపితభూమిచక్రము మహోద్య[1]ద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరశుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిల[2]సుధాంధశ్చక్రముం జక్రమున్. 109

వ. ఇట్లు పంచిన. 110

శా. అంభోజాకరమధ్యనూతననలిన్యాలింగనక్రీడనా
రంభుండైన [3]వెలుంగుఱేనిచెలువారన్ వచ్చి నీటన్ గుభుల్
గుంభధ్వానముతోఁ గొలంకువు గలంకం బొందఁగాఁ జొచ్చి దు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై. 111

శా. భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశుక్రియన్
హేమక్ష్మాధరదేహముం జకితవన్యేభేంద్రసందోహముం
గామక్రోధనగేహమున్ గరటిరక్తస్రావగాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్. 112

వ. ఇట్లు నిమిషస్పర్శనంబున సుదర్శనంబు మకరితలఁ ద్రుంచు నవసరంబున. 113

క. [4]మకర మొకటి రవిఁజొచ్చెను [5]మకరము మఱియొకటి ధనదుమాటున డాఁగెన్;
మకరాలయమునఁ దిరిగెడు మకరంబులు కూర్మరాజుమఱువున కరిగెన్. 114

మ. తమముం బాసిన [6]రోహిణీవిభుక్రియన్ దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్నవిరక్తచిత్తునిగతిన్ గ్రాహంబుప ట్టూడ్చి పా
దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభస్స్నానవిశ్రాంతుఁడై. 115

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్

---

1. విస్ఫులింగచ్ఛట-అగ్నికణములగుంపు, 2. సుధాంధశ్చక్రము-దేవతలగుంపు గలది, 3. వెలుంగుఱేఁడు-సూర్యుఁడు, 4. మకరము-మకరరాశి, 5. మకరము-ఒక నిధి, 6. రోహిణీ విభుఁడు-చంద్రుఁడు.

సారోదారశితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్న దైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్. 116

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్; జలరుహామోదంబులై వాయువుల్
దిరిగెం; బువ్వులవానజల్లు గురిసెన్; దేవాంగనాలాస్యముల్
పరఁగెన్; దిక్కులయందు జీవజయశబ్దధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగెఁ దరంగ చుంబితనభోగంగాముఖాంభోజమై, 117

క. నిడుద యగు కేల గజమును మడుపున వెడలంగఁ దిగిచి మదజల రేఖల్
దుడుచుచు మెల్లన పుడుకుచు [1]నుడిపెన్ విష్ణుండు దుఃఖ మూర్వీనాథా! 118

క. శ్రీహరికరసంస్పర్శను దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీసం
దోహంబుఁ దాను గజపతి మోహనఘీంకారశబ్దములతో నొప్పెన్. 119

క. కరమున మెల్లన నివురుచుఁ [2]గర మనురాగమున మెఱసి కలయం బడుచుం
గరి హరికతమున బ్రదుకుచుఁ గరపీడన మాచరించెఁ గరిణుల మరలన్, 120

సీ. జననాథ! దేవలశాపవిముక్తుఁడై పటుతరగ్రాహరూపంబు మాని
ఘనుఁడు హూహూనామగంధర్వుఁ డప్పుడు దన తొంటి నిర్మలతనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి కీర్తించి గీతములుపాడి
యా దేవుకృప నొంది యందంద మఱియును వినతశిరస్కుఁడై వేడ్కతోడ
ఆ. దళితపాపుఁ డగుచుఁ దనలోకమునకేఁగె, నపుడు శౌరి గేల నంటి నడవ
హస్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁడై, విష్ణురూపుఁడగుచు వెలుగుచుండె 121

మ. అవనీనాథ! గజేంద్రుఁ డా మకరితో [3]నాలంబు గావించె, మున్
ద్రవిళాధీశుఁ డతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్ననాముండు వై
ష్ణవము ఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్ము నారాయణుం
సవిశేషంబుగఁ బూజ సేసెను మహాశైలోగ్రభాగంబునన్. 122

మ. ఒకనాఁ డా నృపుఁ డచ్యుతున్ మనములో నూహించుచున్ [4]మౌనియై
యకలంకస్థితి నున్నచోఁ గలశజుం డచ్చోటికిన్ వచ్చి లే
వక పూజింపక యున్నమౌనిఁ గని నవ్యక్రోధుఁడై 'మూఢ! లు
బ్ధ! కరీంద్రోత్తమయోనిఁ బుట్టు' మని శాపం బిచ్చె భూవల్లభా! 123

---

1. ఉడిపెన్ - పోఁగొట్టెను, 2. కరము - మిక్కిలి, 3. ఆలంబు - యుద్ధము,
4. మౌని - మాటలాడనివాఁడు.

క. మునిపతి నవమానించిన ఘనుఁ డింద్రద్యుమ్నవిభుఁడు కుంజరయోనిం
జననం బందెను; విప్రులఁ గని యవమానింపఁదగదు ఘనపుణ్యులకున్. 124

క. కరినాథుఁ డయ్యె నాతఁడు కరు లైరి భటాదు లెల్ల; గజముగ నయ్యున్
హరిచరణసేవకతమునఁ గరివరునకు నధికముక్తి గలిగె మహాత్మా! 125

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు నుభయనియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మ మెల్ల శిథిల మై మెల్లన బ్రబల మైన విష్ణుభక్తి చెడదు. 126

క. చెడుఁ గరులు హరులు ధనములఁ జెడుదురు నిజసతులు సుతులుఁ; జెడు చెనఁటులకుం
జెడక మనునట్టి గుణులకుఁ జెడని పదార్థములు విష్ణుసేవానిరతుల్. 127

వ. అప్పుడు జగజ్జనకుండగు నప్పరమేశ్వరుండు దరహసితముఖకమల యగు న[1]క్కమల
కి ట్లనియె. 128

క. 'బాలా! నా వెనువెంటను [2]హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ
చేలాంచలంబుఁ బట్టుట, కాలో నేమంటి నన్ను నంభోజముఖీ! 129

క. ఎఱుఁగుదు తెఱవా యెప్పుడు మఱవను సకలంబు నన్ను మఱచినయెడలన్
మఱతు నని యెఱిఁగి మొఱఁగక మఱవక మొఱ యిడిరయేని మఱి యన్యములన్.' 130

వ. అని పలికిన నరవిందమందిర యయిన యిందిరాదేవి మందస్మితచంద్రికా సుందరవద
నారవింద యగుచు ముకుందున కిట్లనియె. 131

క. 'దేవా! దేవరయడుగులు భావంబున నిలిపి కొలుచుపని నా పని గా,
గోవల్లభ! యే మనియెద నీ వెంటను వచ్చుచుంటి నిఖిలాధిపతీ! 132

క. దీనుల కుయ్యాలింపను దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును దీనపరాధీన! దేవదేవ! మహేశా! 133

వ. అని మఱియును సముచితసంభాషణంబుల నంకించుచున్న యప్పరమవైష్ణవీ రత్నంబును
సాదరసరసల్లాపమందహాస పూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గరుడ
గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుండగుచు నిజసదనంబునకుం
జనియె; నని చెప్పి శుకయోగీంద్రుం డి ట్లనియె. 134

సీ. నరనాథ! నీకును నాచేత వివరింపఁబడిన యీ కృష్ణానుభావమైన
గజరాజమోక్షణకథ వినువారికి యశము లిచ్చును; గల్మషాపహంబు;

---

1. కమల-లక్ష్మి, 2. హేల-విలాసము.

దుస్స్వప్ననాశనంబు; దుఃఖసంహారంబుఁ; బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు;
తే. సంపదలు గల్గుఁ; బీడలు శాంతిఁ బొందు; సుఖము సిద్ధించు; వర్ధిలు శోభనములు;
మోక్ష మఱచేతిదై యుండు; ముదము సేరు ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె. 135

వ. అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె; నెవ్వరేని [1]నపరరాత్రాంతంబున మేల్కాంచి సమాహితమనస్కులయి నన్నును నిన్నును నీ సరోవరంబును శ్వేతద్వీపంబున నాకుం బ్రియంబైన సుధాసాగరంబును హేమనగంబును నిగ్గిరకందరకాననంబులను [2]వేత్ర కీచకవేణులతాగుల్మ సురపాదపంబులను నేనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించి యుండు నక్కొండశిఖరంబులను గౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను శ్రీదేవిని శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదులను మత్స్యకూర్మవరాహాద్యవతారంబులను దదవతార కృతకార్యంబులను సూర్య సోమ పావకులను బ్రణవంబును ధర్మపస్సత్యంబులను వేదంబును వేదాంగంబులను శాస్త్రంబులను గో భూసుర సాధు పతివ్రతా జనంబులను జంద్రకాశ్యపజాయా సముదయంబును గౌరి గంగా సరస్వతి కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీనిచయంబును నమరులను నమరతరువులను నైరావతంబును నమృతంబును ధ్రువుని బ్రహ్మర్షినివహంబును బుణ్యశ్లోకులయిన మానవులను సమాహిత చిత్తులై తలంతురు, వారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తు నని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామరవందిత చరణారవిందుండై విహగపరివృఢవాహనుండై వేంచేసె; విబుధానీకంబు సంతోషించె నని చెప్పి శుకుండు రాజున కిట్లనియె. 136

క. గజరాజమోక్షణంబును, [3]నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజవరదుఁ డిచ్చును, గజతురగ[4]స్యందనములుఁ గైవల్యంబున్. 137

క. తామసు తమ్ముఁడు రైవత నామకుఁడై వెలసె మనువు; నలువురమీఁదన్
భూమికిఁ బ్రతివింధ్యార్జున నామాదులు నృపులు మనువునందనులు నృపా. 138

సీ. మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశీర్షుం డనుపేరు మొదలు
నమరులు భూతరయాదులు శుభ్రుని పత్ని వికుంఠాఖ్య పరమసాధ్వి;
యా యిద్దఱకుఁ బుత్రుఁడై తన కళలతో వైకుంఠుఁ డనఁ బుట్టి వారిజాక్షుఁ
డవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁ గల్పించె నెల్లలోకములు మ్రొక్క;

---

1. అపరరాత్రాంతము-తెల్లవాఱుజాము, 2. వేత్రము-పేము, 3 నిజముగ-మనఃపూర్వకముగా, 4. స్యందనములు-రథములు.

తే. రమ యెదుర్కోలు సేకొనె రాజముఖ్య! తదనుభావంబు గుణగణములఁ దలఁపఁదరమె?
యీ ధరారేణుపటలంబు నెఱుగవచ్చుఁ గాని రాదయ్య హరిగుణగణమునంఖ్య. 139

వ. తదనంతరంబ 140

సీ. చక్షుస్తనూజుండు చాక్షుషుం డనువీరుఁ డాఱవమను వయ్యె నవనినాథ!
భూమీశ్వరులు 1పురుఃపురుషసుద్యుమ్నాదు లాతని నందను; లమరవిభుఁడు
మంత్రద్యుమాఖ్యుఁ డమర్త్యు లాప్యాదికు లాహవిష్మద్వీరకాదిఘనులు
మును, లందు విభుఁడు సంభూతికి వైరాజునకుఁ బుట్టి యజితుండునాఁగ నొప్పె;
ఆ. నతఁడకాఁడె కూర్మమై మందరాద్రిని నుదధిజలములోన నుండి మోచె;
నతఁడ చువ్వె దివిజు లర్థింప 2నమృతాబ్ధిఁ ద్రచ్చి యిచ్చె నా సుధారసంబు. 141

—: క్షీరసాగర మథనకథా ప్రారంభము :—

వ. అని పలికినఁ బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె. 142

మ. విను; మున్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు? కూర్మాకృతిన్
వనిధిం జొచ్చి య దెట్లు మోచె బలుకవ్వం బైన శైలంబు? దే
వ[3]నికాయం బమృతంబు నెట్లు వడసెన్? వారాశి నేమేమి సం
జనితం బయ్యె? మునీంద్ర! చోద్యము గదా సర్వంబుఁ జెప్పంగదే! 143

క. అప్పటినుండి బుధోత్తమ చెప్పెడు భగవత్కథావిశేషంబులు నా
కెప్పుడుఁ దనివి జనింపదు సెప్పఁ గదే చెవులు నిండ శ్రీహరికృతముల్. 144

వ. అని మఱియు నడుగంబడినవాఁడై యతని నభినందించి హరిప్రసంగంబు సెప్ప నుపక్రమించె నని సూతుండు ద్విజుల కిట్లనియె; నట్లు శుకుండు రాజుం జూచి. 145

క. 4కసిమసఁగి యసురవిసరము లసిలతికల సురల నెగవ నసువులు వెడలం
బసఁ జెడిరి; పడిరి; కెడసిరి యసమసమరవిలసనముల [5]నను వెడలి నృపా! 146

క. సురపతివరుణాదులతో సురముఖ్యులు గొంద అరిగి సురశైలముపై
సురనుతుఁడగు నజుఁ గని యా సురదుష్కృతిఁ జెప్పి రపుడు సొలయుచు నతులై. 147

క. దుర్వాసుశాపవశమున నిర్వీర్యత జగము లెల్ల నిశ్శ్రీకములై
[6]పర్వతరిపుతోఁ గూడ [7]నవర్వము లయి యుండె హతసుపర్వావళులై. 148

---

1. పూరుపూరుష—పాఠాంతరము, 2. అమృతాబ్ధి-పాలసముద్రము, 3. నికాయంబు-గుంపు, 4 కసిమసఁగి-చంపి, 5. అసమెడలి—పాఠాంతారము, 6. పర్వతరిపుఁడు-ఇంద్రుఁడు, 7. అపర్వములు-పండుగలులేనివి.

ఆ. [1]నెలవు వెడలి వచ్చి నిస్తేజులై; రట్టి వేల్పుగములఁ జూచి వేల్పుఁబెద్ద
పరమపురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంపుల్ల పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ 149

క, ఏనును మీరును గాలము మానవతిర్యగ్లతాద్రుమస్వేదజముల్
మానుగ నెవ్వనికళలము వానికి మ్రొక్కుదము గాక వగవఁగ నేలా? 150

క [2]వధ్యుండు రక్షణీయుఁడు సాధ్యుఁడు మాన్యుఁడని లేని సర్గత్రాణా
వధ్యాదు లొనర్చునతం డాధ్యంతవిధానమునకు నర్హుఁడు మనకున్. 151

క. వరదునిఁ బరము జగద్గురు గరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ
జ్వరములు సెడు నని సురలకు [3]సరసిజజని చెప్పి యజితు సదనంబునకున్. 152

వ. తానును దేవతాసమూహంబును నతిరయంబునం జని వినయంబునఁ గానం బడని
యవ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని
స్తుతియించె. 153

సీ. ఎవ్వనిమాయకు నంతయు మోహించుఁ దఱిమి యెవ్వనిమాయ దాఁట రాదు;
తనమాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ డెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు,
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁ దనచేత జనిత మయిన
ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని ముఖంబు గన్నులు సోమకమలహితులు,

తే. చెవులు దిక్కులు, రేతంబు సిద్ధజలము, మూఁడు మూర్తుల పట్టిల్లు, మొదలినెలవు
గర్భ మఖిలంబు, మూర్ధంబు గగన మగుచు [4]మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు. 154

వ. మఱియు నెవ్వనిబలంబున మహేంద్రుండును, [5]ప్రసాదంబున దేవతలును, గోపంబున
రుద్రుండును, బరుషంబున విరించియు, నింద్రియంబులవలన వేదంబులును మునులును,
మేఢ్రంబునఁ బ్రజాపతియును, వక్షంబున లక్ష్మియు, ఛాయవలనఁ బితృదేవతలును, స్తనం
బులవలన ధర్మంబును, బృష్ఠంబులవలన నధర్మంబును, శిరంబువలన నాకంబును, విహా
సంబువలన నప్సరోజనంబులును, ముఖంబువలన విప్రులును, గుహ్యంబున బ్రహ్మంబును,
భుజంబులవలన రాజులును బలంబును, [6]నూరువులవలన వైశ్యులును నైపుణ్యంబును,
బదంబులవలన శూద్రులును నవేదంబును, నధరంబున లోభంబును, [7]నుపరిరదచ్ఛదంబు
వలనఁ బ్రీతియు, నాసాపుటంబువలన ద్యుతియు, స్పర్శంబునఁ గామంబును, భ్రూయుగ

1. నెలవు — నివసించుచోటు. 2 క. ఆద్యుండు రక్షకుండు న, నాద్యుఁడు మాన్యుండు లోకసర్గత్రాణాం, తాద్యాదులొనర్చునతం, డాద్యంతవిధానములకు నర్హుఁడు మనకున్ – పాఠాంతరము 3 సరసిజజని – బ్రహ్మ. 4. మలయును-తిరుగును, 5. ప్రసాదంబు-అనుగ్రహము 6. ఊరువులు-తొడలు, 7 ఉపరిరదచ్ఛదంబు-మీఁది పెదవి.

శంబున యమంబును, బక్షంబునఁ గాలంబును సంభవించె; నెవ్వని యోగమాయావి హితంబులు ద్రవ్య వయఃకర్మగుణవిశేషంబులు చతుర్విధ సర్గం బెవ్వని యాత్మతంత్రం బెవ్వనివలన సిద్ధించి లోకంబులను లోకపాలురును బ్రదుకుచుందురు, పెరుగుచుందురు, దివిజులకు నాయువు సంధంబు బలంబునై నగంబులకు నీశుండై ప్రజలకుఁ బ్రజనుండై బ్రజాపన క్రియాకాండనిమిత్తనంభవుండగు [1]జాతవేదుండై యంతస్సముద్రంబున ధాతు సంఘాతంబులం [2]బ్రపంచించుచు బ్రహ్మమయుండై ముక్తికి ద్వారంబై యమృతమృత్యు స్వరూపుండై చరాచరప్రాణులకుఁబ్రాణంబై యోజస్సహోబలవాయురూపంబులైన ప్రాణేం ద్రియాత్మశరీర నికేతనుండై పరమమహాభూతి యగు నప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుండగుం గాక! యని మఱియును. 155

క. మొదల జల మిడిన భూజము తుది నడుమను జల్లఁదనము దొరఁకొను మాడ్కిన్
మొదలను హరికిని మ్రొక్కిన ముద మొందుదు మెల్ల వేల్పుమూఁకలు నేనున్. 156

క. ఆపన్నులగు [3]దిదృక్షుల కోపుణ్యా! భవన్ముఖాబ్జ మొయ్యన తఱితోఁ
బ్రాపింపఁజేయు సంవద నో పరమదయానివాసః యుజ్జ్వలతేజా! 157

వ. అని యిట్లు దేవగణనమేతుండై యనేకవిధంబులం గీర్తించుచు నున్న పరమేష్ఠియందుఁ గరుణించి దయాగరిష్ఠుండగు విశ్వగర్భుం డావిర్భవించె. 158

మ. ఒకవేయర్కులు గూడి గట్టి [4]కరువై యుద్యత్ప్రభాభూతితో
నొకరూపై చన దెంచుమాడ్కి హరి దా నొప్పారె నా వేలుపుల్
వికలాలోకనులై విషణ్ణమతులై విభ్రాంతులై మ్రోలఁ గా
నక శంకించిరి కొంతప్రొద్దు; విభుఁ గానం బోలునే వారికిన్. 159

వ. అప్పుడు. 160

సీ. హారకిరీటకేయూరకుండలపాదకటక కాంచీలతాకంకణాది
కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీశంఖచక్రశరాననసంయుతంబు
మరకతశ్యామంబు సరసిజనేత్రంబుఁ గర్ణాభరణకాంతిఖండయుగము
గలితకాంచనవర్ణ [5]కౌశేయవస్త్రంబు శ్రీవనమాలికాసేవితంబు

ఆ. నై మనోహరంబునై దివ్యసౌభాగ్య మైన యతనిరూపు హర్ష మెసఁగఁ
జూచి బ్రహ్మ హరుఁడు సురలును దాసను బొంగి సమ్మదగుచుఁ బొగడదొడఁగె 161

1. జాతవేదుండు-అగ్ని, 2. బచరించుచు-పాఠాంతరము, 3 దిదృక్షులు-చూడఁ గోరువారు. 4. కదుపై-పాఠాంతరము, 5 కౌశేయము-పట్టు

క. జననస్థితిలయదూరుని మునిసుతు నిర్వాణసుఖసముద్రుని సుగుణుం
[1]దనుతనునిఁ [2]బృథులపృథులుని ననఘాత్ము మహానుభావు నభినందింతున్. 162

క. పురుషోత్తమ నీ రూపము పరమశ్రేయంబు భువనపంక్తుల కెల్లన్;
స్థిరవైదికయోగంబున వరుసను మీయంద కానవచ్చెను మాకున్. 163

క. మొదలును నీలోఁ దోఁచెను; దుదియును నటఁ దోచె; నడుముదోఁచెను; నీవే
మొదలు నడుము దుది సృష్టికిఁ గదియఁగ ఘటమునకు మన్నుగతియగుమాడ్కిన్. 164

క. నీ మాయచేత విశ్వము వేమాఱు సృజింతు వనుచు విష్ణుఁడ వనుచున్
ధీమంతులు గుణపద విని నేమంబున నగుణుఁడైన నినుఁ గాంతు రొగిన్. 165

ఆ. అన్న మవనియందు, నమృతంబు గోవులయందు, వహ్ని నమిధలందు నమర
యోగవశతఁ బొందునోజను బుద్ధిచే నగుణు నిన్నుఁ గాంతు రాత్మవిదులు, 166

మత్త. వట్టు లేక బహుప్రకారవిపన్నచిత్తుల మైతి; మే
మెట్టకేలకు నిన్నుఁ గంటి మభీప్సితార్థ[3]ము వచ్చుఁ; బె
న్వెట్ట యైన దవానలంబున వేఁగు నేనుఁగుమొత్తముల్
నిట్ట వేర్చిన గంగలోపల నీరు గాంచినచాడ్పునన్. 167

మత్త. నీకు నే మని విన్నవింతుము! నీవు సర్వమయుండవై
లోక మెల్లను నిండి యుండఁగ లోకలోచన! నీపదా
లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ వహ్నిఁ దనర్చు కేతుతతిక్రియన్. 168

వ. అని కమలసంభవప్రముఖులు వినుతిసేసి రనిచెప్పి నరేంద్రునకు శుకుం డిట్లనియె. 169

శా. ఈ రీతిం జతురాననాదినుతుఁడై యేపార జీమూతగం
భీరంబైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం
డారోమాంచితకాయులన్ నవవిముక్తాసాయులం బ్రేయులం
బ్రారబ్ధోగ్రమహార్ణవోన్మథనవాంఛానల్పులన్ వేల్పులన్. 170

---

1 తనుకనుఁడు-సూక్ష్మముకంటె సూక్ష్ముఁడు, 2. పృథులపృథులుఁడు—పెద్దవాని కంటెను పెద్ద-అణోరణీయాన్ మహతో మహీయాన్, 3. మవంచు—పాఠాంతరము

క. ఓ నలువ! యో సురేశ్వర! యో నిటలతటాక్ష! యో సురోత్తములారా!
దానవులతోడ నిప్పుడు మానుగఁ [1]బోరామి గలిగి మనుటే యొప్పున్. 171

వ. అది యెట్లంటిరేని. 172

క. ఎప్పుడు దనకును సత్త్వము సొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ
గప్పికొని యుండవలయును నొప్పగ నహి మూషకమున కొదిగినభంగిన్ 173

క. అమృతోత్పాదనయత్నము విమలమతిం జేయుటొప్పు; వేల్పులు వినుఁడీ!
యమృతంబుఁ ద్రావి జంతువు లమృతగతిన్ బ్రదుకుచుండు నాయుర్వృద్ధిన్. 174

సీ. పాలమున్నీటిలోపల సర్వతృణలతౌషధములు దెప్పించి చాల వైచి
మందరశైలంబు [2]మంథానముగఁ జేసి తనర వాసుకిఁ [3]దరిత్రాడు సేసి
నాసహాయతచేత[4]నలి నందఱును మీరు తరువుఁడు వేగ మతంద్రు లగుచు;
ఫలము మీఁ దయ్యెడు; బహుళదుఃఖంబులఁ బడుదురు దైత్యులు పాపమతులు;
ఆ. అలన చేమి లేక యఖిలార్థములుఁ గల్గు [5]విషధిలోన నొక్క విషము పుట్టుఁ
గలఁగి వెఱవ వలదు; కామరోషంబులు వస్తుచయమునందు వలదు చేయ. 175

వ. అని యాదేశించి. 176

క. అంతాదిరహితుఁ డచ్యుతుఁ డంతర్ధానంబు నొందె నజపాలాక్షుల్
సంతోషంబునఁ దమ తమ కాంతాలయములకుఁ జనిరి గౌరవ మొప్పన్. 177

క. కయ్యంబు సేయ నొల్లక నెయ్యంబున నతులు వెట్టి నిర్జరనికరం
బియ్యప్పనములు వెట్టుచుఁ దియ్యంబునఁ గొల్చె బలిని [6]దేవద్వేషిన్. 178

క. పసచెడి తనకును వశమై, సుసరవుగఁ గొల్చుచున్న సురసంఘముల
గసిమసఁగి చంపఁ బూనిన, నసురుల వారించె బలియు నతినయయుక్తిన్. 179

వ అట్లు వారించి వైరోచని రాక్షససముదయంబున కిట్లనియె. 180

క. వగవారు శరణుచొచ్చిన మగతనములు నెఱపఁ దగనె మగవారలకున్
దగుసమయ మెఱుఁగ వలదే మగఁటిమిఁ బాటింప వల దమర్త్యులతోడన్. 181

---

1. పోరామి-స్నేహము 2. మంథానము-కవ్వము 3 తరిత్రాడు-కవ్వపుత్రాడు,
4. నలి-యోగ్యముగా, 5. విషధి-సముద్రము, 6. దేవద్వేషి-రాక్షసుఁడు

వ. అని పలికి కొలువుకూటంబున సురనికరపరివృతుండై నిఖిలలోకరాజ్యలక్ష్మీ సహితుండై యఖిలవిబుధవీరవిజయాహంకారనిజాలంకారుండై సుఖంబునం గొలువున్న విరోచననందనుం గని శచీవిభుం డుత్తమసచివుండునుంబోలె సాంత్వన వచనంబుల శాంతిం బొందించి పురుషోత్తమశిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి, యరిష్టనేమి ననునయించి, త్రిపురవాసులగు దానవుల నొడంబఱిచి, జంభుని సమ్మతంబు సేకొని, హయగ్రీవుని విగ్రహంబు మాన్చి, నముచితారకబాణాదులతో సఖ్యంబు నెఱపి, విప్రచిత్తికిం బొత్తు హత్తించి, శకుని విరోచన ప్రహేతులకుం బోరామి సూపి, మయమాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి, కుంభనికుంభులకు సౌజన్యంబు గైకొలిపి, పౌలోమకాలకేయనివాతకవచాదులయెడబాంధవంబు ప్రకటించి,వజ్రదంష్ట్రికి[1]వశుండై యితర దానవదైత్యసమూహంబువలన నతిస్నేహంబు సంపాదించి, మనకు నక్కచెలియండ్ర బిడ్డలకు [2]నొడ్డారంబు లేమిటికి; నేక కార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రదుకుద; మన్యోన్యవిరోధంబు లేల ? తొల్లి యన్యోన్యవిరోధంబున నలంగితి; మిది మొదలు దనుజ దివిజసముదయంబులకు రాజు విరోచననందనుండ; మనమందఱ మతనివంపు సేయం గలవార; ముభయకులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతు నని యమృతజలధి మథనప్రారంభకథనంబు దెలియంజెప్పె; నట్లు సురాసురయూథంబులు [3]బలారాతిబలి ప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాదనాయత్తచిత్తులై యైకమత్యంబు నొంది యమందగమనంబున మందరనగంబునకుం జని. 182

సీ. వాసవ[4]వర్ధకి వాఁడిగాఁ జఱచిన [5]కుద్దాలముఖములఁ గొంత ద్రవ్వి
ముసలాగ్రములు చొన్పి మొదలిపాఁతగలించి దీర్ఘపాశంబుల [6]దిండ్రు సుట్టి
పెకలించి బాహులఁ బీడించి కదలించి పెల్లార్చి తమతమపేరు వాడి
పెఱికి మీఁదికి నెత్తి పృథులహస్తంబులఁ దలల భుజంబులఁ దరలకుండ
తే. నాని మెల్లన కుఱుతప్పటడుగు లిడుచు భార మధికంబు[7]మఱవక పట్టుఁ డనుచు
మందరనగంబుఁ దెచ్చి రమందగతిని దేవదైత్యులు జలరాశితెరువు పట్టి. 183

క. మందరము మోవ నోపమి నందఱుపైఁ బడియె నడియు నతిచోద్యముగాఁ;
గొందఱు నేలం గలిసిరి కొందఱు మగ్గయిరి; చనిరి కొందఱు భీతిన్. 184

క. ఏలా హరికడ కేఁగితి మేలా దొరఁకొంటి మధిక హేలన శైలో
న్మూలనము సేసి తెచ్చితి మేలా పెక్కండ్రు మడిసి రేలా నడుమన్ ? 185

---

1 నశక్తుండై -పాఠాంతరము, 2. ఒడ్డారంబులు-విరోధములు, 3. బలారాతి-ఇంద్రుడు, 4. వర్ధకి-వడ్రగి, 5 కుద్దాలము-త్రవ్వుకోల, 6 ద్రిండు-నట్టి, 7 మఱుకుఁడీ-పాఠాంతరము

క. ఏటికి మముఁ బని పంచెను? నేటికి మనఁబోఁటివారి కింతలు పను? లిం
కేటికి రాఁడు రమేశ్వరుఁ? డేటి కుపేక్షించెఁ? మఱవనేటికి మనలన్? 186

వ. అని కులకుధరపతనజన్యంబగు దైన్యంబు సహింపనోపక పలవించుచున్న దివిజదితిజుల
భయంబు మనంబున నెఱింగి సకలవ్యాపకుండగు హరి తత్సమీపంబున. 187

మ. గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై
[1]హరికోటిప్రభతో నాహో [2]వెలవకుం దంచుం బ్రదీపించి త
ద్గిరిఁ గేలన్ నలు వొందఁ [3]గందుకముమాడ్కిం బట్టి క్రీడించుచున్
గరుడాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్. 188

క. వారలు గొలువఁగ హరియును [4]వారాన్నిధికరుగు మనఁగ వసుధాధరమున్
వారిజనయనునిఁగొంచు నవారితగతిఁ జనియె విహగవల్లభుఁ డలుకన్. 189

క. చని జలరాశితటంబున వనజాక్షుని గిరిని డించి వందనములు స
ద్వినుతులు సేసి ఖగేంద్రుఁడు [5]పనివినియెను భక్తినాత్మభవనంబునకున్. 190

వ. అప్పుడు. 191

సీ. భూనాథ! వినవయ్య భోగీంద్రు వాసుకిఁ బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి
ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁ జేసి మెల్లన చేతుల మేను నివిరి
'నీవ కా కెవ్వరు నేర్తు? రీ పని కియ్యకొ'మ్మని యతని[6]కైకోలు వడసి
కవ్వంపుఁగొండ నిష్కంటకంబుగఁ జేసి [7]ఘర్షించి యతని[8]భోగంబు జుట్టి
ఆ. కడఁగి యమృతజలధిఁగలశంబు గావించి త్రచ్చునవసరమునఁ దలఁపు లమర
బద్ధవస్త్రకేశభారులై యా రెండు [9]గములవారు తరువఁ గదిసి రచట. 192

వ. తదనంతరంబ 193

క. హరియును దేవానీకము సురగేంద్రునితలలు పట్ట నుద్యోగింపన్
హరిమాయాపరవశులై సురవిమతులు గూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్. 194

---

1. హరి–సూర్యుఁడు, 2. వెలకుఁడియంచుం–పాఠాంతరము, 3. కందుకము–బంతి, 4. వారాన్నిధి–సముద్రము, 5 పనివినియెను–వెడలిపోయెను, 6. కైకోలు–సమ్మతి, 7. గర్జించునతని–పాఠాంతరము, 8. భోగంబు–శరీరము. 9. గనులు–గుంపులు.

మత్త. స్వచ్ఛమైన ఫణంబు మీరలు చక్కఁ బట్టి మథింపఁగాఁ
[1]బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగ? బూరుషత్వము గల్గి మే
మచ్ఛమైన తపోబలాధ్యయనాన్వయంబులవారమై
యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి? నిండు మాకు ఫణాగ్రముల్. 195

వ. అని పలుకు దనుజులం జూచి. 196

క. విస్మయముఁ బొంది దానవ[2]ఘస్మరుఁ డహిఫణము విడువ గైకొని యసురుల్
విస్మితముఖులై యార్చి రవిస్మితముగఁ గొనిరి సురలు వీఁకం దోఁకన్. 197

వ. ఇట్లు సమాకర్షణస్థానభాగనిర్ణయంబు లేర్పఱచుకొని దేవతలు పుచ్ఛంబును, [3]బూర్వదేవతలు ఫణంబులుం బట్టి పయోరాశిమధ్యంబునం బర్వతంబు వెట్టి పరమాయత్తచిత్తులై యమృతార్థంబు ద్రచ్చుచున్నసమయంబున. 198

క. విడువిడఁడని ఫణిపలుకఁగఁ గడుభరమున మొదలఁ గుదురు గలుగమి [4]గెడవై[5]
బుడబుడరవమున నఖిలము వడవడ వడఁకఁగ మహాద్రి వనధి మునింగెన్. 199

ఉ. గౌరవమైన భారమునఁ గవ్వపుఁగొండ ధరింపలేక దో
స్సారవిహీనులై యుభయసైనికులుం గడు సిగ్గుతోన కూ
పారతటంబునం బడిరి పౌరుషముం జెడి పొందవేయ! యె
వ్వారికి నేరఁబోలు బలవంతపుదైవము నాక్రమింపఁగన్? 200

క. వననిధిజలములలోపల మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్
మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్. 201

—: కూర్మావతారకథాప్రారంభము :—

సీ. [6]సవరనై లక్షయోజనములవెడలుపై కడుఁ గఠోరమునైన కర్పరమును
నదనైన బ్రహ్మాండమైన నాహరించు ఘనతరంబగు ముఖగహ్వరంబు
సకలచరాచరజంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొనునట్టి మేటికడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ నాఁగినఁ గదలని యట్టి కాళ్ళు
తే. వెలికి లోనికిఁ జనుదెంచువిపులతుండ, మంబుజ బుఁ బోలెడు నక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి, కూర్మి చెలువొంద నొకమహాకూర్మమయ్యె. 202

1. పుచ్ఛము తోఁక, 2 ఘస్మరుఁడు-తిండిపోతు 3. పూర్వదేవతలు-రాక్షసులు,
4. వెడఁగై-పాఠాంతరము, 5. కెడవు-పతనము, 6. సవరనై-చక్కనై.

మ. [1]కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘుముక్తాశుక్తి చందంబునన్
సమదద్రీంద్రము నెత్తె వాసుకిమహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళికంపములతో నౌ నౌఁ గదే! బాపురే!
కమలాక్షా! శరణంచు భూదిశలు నాకాశంబునన్ మ్రోయఁగన్. 203

వ. ఇవ్విధంబున. 204

క. [2]తరిగాండ్రలోన నొకఁడఁట, తరిగడవకుఁ గుదురు [3]నాఁకత్రాడఁట చేరుల్;
దరిగవ్వంబును దానఁట, హరిహరి! హరిచిత్రలీల హరియే యెఱుఁగున్. 205

ఆ. జలధిఁ గడవ సేయ, శైలంబుఁ గవ్వంబు సేయ, భోగిఁ ద్రాడు సేయఁ, దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడుదక్క నొరుఁడు శక్తిమంతుఁడొకఁడు గలఁడె? 206

ఆ. గొల్లవారిబ్రదుకు గొఱఁ తన వచ్చునె గొల్లరీతిఁ బాలకుప్పఁ ద్రచ్చి
గొల్లలైరి సురలు, గొల్లయ్యె విష్ణుండు, చేటులేనిమందు సిరియుఁ గనిరి. 207

వ. ఇట్లు సురాసురయూథంబును హరిసనాథంబులయి కవచంబులు [4]నెట్టంబులు వెట్టికొని, పుట్టంబులు విరిచుట్లు సుట్టికొని, కరంబులు కరంబుల నప్పళించుచు, భుజంబులు భుజంబుల నొరయుచు, లెండు లెండు దరువఁ దొడంగుండు రండని యమందగతిం బెరుఁగుం ద్రచ్చు మందగొల్లచందంబున మహార్ణవమధ్యంబున మంథాయమాన మందరమహీధర విలగ్నభోగిభోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ, బెనుబొబ్బలం బ్రహ్మాండ [5]కటాహంబు నిర్భరంబయి గుబ్బుగుబ్బనియురలు కొండకవ్వంబుగుత్తి జిఱజిఱం దిరుగు వేగంబున ఛటచ్ఛటాయమానంబులయి బుగులుబుగుల్లను చప్పుళ్లప్పరం బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మలచెక్కులనిక్కలువడు మిసిమిగల మీఁది మీఁగడపాల తేట నిగ్గుఁదుంపరల పరంపరలవలస నిజకరక్రమక్రమాకర్షణ పరిభ్రాంత ఫణిఫణాగర్భ నముద్భూత నిర్భరవిష[6]కీలికీలజాలంబుల నప్పనప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొండొక మందగతిం జెందక [7]యకూపారవేలాతటకుటజకుసుమగుచ్ఛపిచ్ఛిల స్వచ్ఛమకరందసుగంధి గంధవహంబులం గ్రొంజెమటనీటి పెనువఱదగము లొడళ్ల నిగుర నొండొరులం బరిహసించుచుఁ బేరువాడి విలసించుచు, మేలుమే లని యుగ్గడించుచుఁ, గాదు కాదని భంగించుచు, నిచ్చ మెచ్చుని మచ్చరంబువలన వనధివలమాన [8]వైశాఖవసుంధరాధర పరి

---

1. కమఠంబు-తాఁబేలు, 2. తరిగాండ్రు-మథించువారు, 3 ఆఁకత్రాఁడు-కవ్వమునుతగిలించుటకై కంబమునకుఁ గట్టెడుత్రాఁడు, 4. నెట్టంబులు-దట్టీలు, 5 కుడ్యంబు-పాఠాంతరము, 6. కీలి-అగ్ని, 7. అకూపారము-సముద్రము, 8. వైశాఖము-కవ్వము.

వర్తనమునుజ్జనితఘుమఘుమారావంబును, మథనగుణాయమాన మహాహీంద్రముఖ ముహుర్ముహురుచ్చలిత భూరి ఘోరఫూత్కార ఘోషంబును, కుల[1]కుధర పరిక్షేపణక్షోభిత సముల్లంఘన సమాకులితంబులై వెఱచఱవి గుబురుగుబురులై యొరలు కమఠ కర్కట కాకోదర మకర తిమితిమింగిల మరాళచక్రవాకబలాకభేకసారసానీకంబుల మొఱలునుం గూడికొని ముప్పిరిగొని, దనుజదివిజభటాట్టహాస తర్జనగర్జనధ్వనులు [2]నలువురియై మొత్తినట్టైన దశదిగంత భిత్తులును బేఁటెత్తి పెల్లగిలం ద్రుళ్ళుచుఁ గికురు పొడుచుచు నొకఁ డొకనికంటె వడియునుం [3]గడువునుం గలుగఁ ద్రచ్చుచుఁ బంతంబు లిచ్చుచు సుధాజననంబుఁ జింతించుచు నూతన పదార్థంబులకు [4]నెదుళ్లు సూచుచు నెంతదడవు ద్రత్తుమని హరి నడుగుచు నెడపడని తమకంబుల నంతకంతకు మురువుడింపక త్రచ్చు సమయంబున. 208

క. అప్పాలవెల్లిలోపల నప్పటి కప్పటికి మందరాగము దిరుగం
జప్పుడు నిండె నజాండము సెప్పెడి దే మజునిచెవులు నిండఁ గొనియెన్. 209

వ. అంత నప్పయోరాశిమధ్యంబున. 210

క. ఎడమఁ గుడి మునుపు దిరుగుచుఁ గుడి నెడమను వెనుకఁ దిరుగు కులగిరి గడలిం
గడ లెడల సురలు నసురలుఁ [5]దొడితొడి ఫణిఫణము మొదలుఁ దుదియును డిగువన్. 211

క. వడిగొని కులగిరిఁ దరువఁగ జడనిధి ఖగకమఠఝష ఫణిగణముల్
సుడివడఁ దడఁబడుఁ గెలఁకులఁబడు; భయపడి నెగసి బయలఁబడు; నురలిపడున్. 212

క. అసురాసురకరవిపరిభ్రమణధరాధరవరేంద్రభ్రమణంబును దాఁ
గమఠేంద్రుఁ డీఁపుతీఁటను శమియింపఁగఁ జాలదయ్యె జగతీనాథా! 213

వ. తదనంతరంబ 214

క. ఆలోల జలధిలోపల నాలో నహి విడిచి సురలు నసురలుఁ బఱవం
గీలాకోలాహలమై హాలాహలవిషము పుట్టె నవనీనాథా! 215

వ. అదియునుం బ్రళయకాలాభీల ఫాలలోచన లోచనానలశతంబుచందంబున సమందంబై, విలయదహనసహస్రంబుకైవడి వడియై, కడవటి పట్టపగలింటి వెలుఁగుల లక్ష తెఱంగున

---

1. కుధరము-పర్వతము, 2. నలువురి-నాలుగురెట్లు, 3. దడవునుం - పాఠాంతరము. 4. ఎదుళ్లు సూచుచు-నిరీక్షించుచు, 5. తొడితొడి-త్వరత్వరగా.

దుర్నిరీక్షితంబై తుదిరేయి వెలింగిన [1]మొగిలు గములవలనం బడు బలువిడుగులవడువున బెడిదంబై పంచభూతంబులుం దేజోరూపంబులైన చాడ్పున దుస్సహంబై భుగభుగాయమానంబులైన పొగలను జిటజిటాయమానంబులైన విస్ఫులింగంబులును, ధగధగాయమానంబులైన నెఱమంటలును, గలిగి మహార్ణవమధ్యంబున మందరనగం బమంథరంబుగం దిరుగునెడ జనియించి పటపటాయమానంబై సింగికిం బొంగి, దిశలకుం గేలు సాంచి, బయళ్లు ప్రబ్బికొని, తరిగప్పంపుఁగొండ నండగానక, నిగిడి కడల నలుగడలకుం బఱచి దరుల కుఱికి సురాసురసముదయంబులన్ దరికొని గిరవర గుహాగహ్వరంబుల సుడివడక కులశిఖరిశిఖరంబుల [2]నెరగలివడి గహనంబుల దహించి, కుంజమంజరీపుంజంబుల భస్మంబు సేసి, జనపదంబు లేర్చి, నదీ నదంబు లెరియించి, దిక్కుంభికుంభంబుల నిక్కి, [3]తరణితారా మండలంబులపై మిట్టించి, మహర్లోకంబు దరికొని, యుపరిలోకంబునకు మాఱుగొన లిడి, సుడివడి, మునరుకొని, బ్రహ్మాండగోళంబు చిటిలిపడన్ దాఁటి పాతాళాదిలోకంబులకు వేళ్లువాఱి, సర్వలోకాధికంబై శక్యంబుగాక యెక్కడఁ జూచినం దానయై [4]కురంగంబుక్రియం గ్రేళ్లుఱుకుచు, భుజంగంబువిధంబున నొడియుచు, సింగంబుభంగి లంఘించుచు, విహంగంబువగిది నెగయుచు, మాతంగంబుపోలికి నిలువంబడుచు, నిట్లు హాలాహలదహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున [5]మెలకుసెగల మిడుకం జాలక నీఱైన దేవతలును, నేలం గూలిన రక్కసులును, డుల్లిన తారకలును, గీటడఁగిన కిన్నర మిథునంబులును, గమరిన గంధర్వవిమానంబులును, జీకాకుపడిన సిద్ధచయంబులును, జిక్కుపడిన గ్రహంబులును జిందఱవందఱయిన వర్ణాశ్రమంబులును, నిగిరిపోయిన నదులును, నింకిన సముద్రంబులును, గాలినకాననంబులును, బొగిలిన పురంబులును, బొనుఁగుపడిన పురుషులును, బొక్కిపడిన పుణ్యాంగనాజనంబులును, బగిలిపడిన పర్వతంబులును, భస్మంబులైన ప్రాణిసంఘంబులును, వేఁగిన లోకంబులును, వివశలైన దిశలును, [6]నొడ్డగెడవులైన భూజచయంబులును, నఱవఱలైన భూములును నై, యకాల విలయకాలంబై తోఁచుచున్నసమయంబున. 216

క. [7]ఒడ్డారించి విషంబున కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్
[8]గొడ్డేటి మ్రందిరాలన బిడ్డన నెడ లేక జనులు పృథ్వీనాథా. 217

వ. అప్పుడు. 218

1. మొగిలు-మేఘము, 2. ఎరగలి-అగ్ని. 3 తరణి-సూర్యుఁడు, 4. కురంగంబు-జింక, 5. మెలకుసెగలు - మ డుచున్న తాపములు. 6. ఒడ్డగెడవులు - తలక్రిందులు, 7 ఒడ్డారించి-సాహసించి, 8 గొడ్డేఱి-సంతువిడిచి.

మ. చని కైలాసముఁ జొచ్చి శంకరునివాసద్వారముం జేరి యా
శునిదౌవారికు లడ్డపడ్డఁ దల మంచుం జొచ్చి 'కుయ్యో! మొఱో!
విను; మాలింపుము; చిత్తగింపుము; దయన్ వీక్షింపు' మం చంబుజా
ననముఖ్యుల్ గని రార్తరక్షణకళానందభునిన్ శంభునిన్. 219

క. వారలు దీనత వచ్చుటఁ గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురు దానుం
బేరోలగమున నుండి దయారతుఁడై చంద్రచూడుఁ [1]డవసర మిచ్చెన్. 220

వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగదండప్రణామంబులు గావించి ప్రజాపతి ముఖ్యు లి
ట్లని స్తుతియించిరి. 221

సీ. భూతాత్మ! భూతేశ! భూతభావనరూప! దేవ! మహాదేవ! దేవవంద్య!
యీ లోకముల కెల్ల నీశ్వరుండవు నీవ; బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ;
యార్తశరణ్యుఁడ వగు గురుండవు; నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు;
సకలసృష్టిస్థితిసంహారకర్తవై బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరఁగు దీవు;
ఆ. పరమగుహ్య మయిన బ్రహ్మంబు సదసత్తమంబు నీవ; శక్తిమయుఁడ వీవ;
శబ్దయోని వీవ; జగదంతరాత్మవు నీవ; ప్రాణ మరయ నిఖిలమునకు. 222

క. నీయంద సంభవించును నీయంద వసించి యుండు నిఖిలజగములున్;
నీయంద లయముఁ బొందును నీ యుదరము సర్వభూతనిలయము రుద్రా! 223

సీ. అగ్ని ముఖంబు పరాపరాత్మక మాత్మ, కాలంబు గతి రత్నగర్భ పదము
శ్వసనంబు నీయూర్పు, రసన జలేశుండు దిశలు కర్ణంబులు దివము నాభి
సూర్యుండు గన్నులు శుక్లంబు సలిలంబు జఠరంబు జలధులు చదలు శిరము
సర్వౌషధులు రోమచయములు శల్యంబు లద్రులు మానస మమృతకరుఁడు
తే. [2]ఛందములు ధాతువులు ధర్మనమిత హృదయ మాస్యపలచక ముపనిషదాహ్వయంబు
నయిన నీరూపు పరతత్త్వమై శివాఖ్య మై స్వయంజ్యోతియై యెప్పు నాద్య మగుచు. 224

క. కొందఱు గలఁ డందురు నినుఁ గొందఱు లేఁ డందు రతఁడు గుణిగాఁ డనుచుం
గొందఱు గలఁ డని లేఁడని [3]కొందల నుందుదురు నిన్నుఁ గూర్చి మహేశా! 225

సీ. తలఁపఁ బ్రాణేంద్రియద్రవ్యగుణస్వభావుఁడవు; కాలక్రతువులును నీవ;
సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును నీవ ముఖుండవు నిఖిలమునకు;

1. అవసరము-సమయము, 2. ఛందములు-వేదములు, 3. కొందలము - తత్తఱ
పాటు.

ఛందోమయుండవు; సత్త్వరజస్తమశ్చక్షుండవై యుందు సర్వరూప;
కామపురాధ్వరకాలగరాదిభూత[1]ద్రోహభయము చోద్యఁబు గాదు;
తే. లీల లోచనవహ్ని స్ఫులింగశిఖల నంతకాదులఁ గాల్చినయట్టి నీకు
[2]రాజఖండావతంస పురాణపురుష దీనరక్షక కరుణాత్మ! దేవదేవ! 226

ఆ. మూఁడుమూర్తులకును మూఁడు లోకములకు మూఁడు కాలములకు మూల మగుచు
భేద మగుచుఁ దుది నభేదమై యొప్పారు బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన! 227

క. సదసత్తత్త్వచరాచర సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్
పెదవులు గదలువ వెఱతురు వదలక నిన్నుఁ బొగడ నెంతవారము దేవా! 228

మత్త. బాహుశక్తి సురాసురల్ చని [3]పాలవెల్లి మథింప హా
లాహలంబు జనించె; నేరి కలంఘ్యమై భువనంబు గో
లాహలంబుగఁ జేసి చిచ్చును [4]లాగముం గొని ప్రాణిసం
దోహమున్ బ్రదికింపవే? దయ దొంగలింపఁగ నీశ్వరా! 229

క. లంపటము నివారింపను సంపదఁ గృపసేయ జయము సంపాదింపం
జంపెడివారి వధింపను సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా! 230

క. నీకంటె నొం డెఱుంగము, నీకంటెం బరులు గాన నేరరు జగముల్;
నీకంటె నొడయఁ డెవ్వఁడు లోకంబుల కెల్ల నిఖిలలోక స్తుత్యా! 231

వ. అని మఱియు నభినందించుచున్న ప్రజాపతిముఖ్యులం గని సకలభూతసముండగు నద్దే
వుండు దన ప్రియసతి కిట్లనియె. 232

శివుండు దేవప్రార్థితుండై హాలాహలమును పానము సేయుట

క. కంటే జగముల దుఃఖము వింటే జలజనితవిషము వేఁడిమి ప్రభువై
యుంటకు నార్తుల యాపద గెంటింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ! 233

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన ప్రాణుల రక్షింపవలయుఁ; బ్రభువుల కెల్లం
బ్రాణుల కిత్తురు సాధులు, ప్రాణంబులు నిమిషభంగురము లని మగువా! 234

---

1. ద్రోహిచయము-పాఠాంతరము, 2. రాజఖండావతంస-చంద్రరేఖశిరోభూషణమ్ముగాఁ గలవాఁడా! 3. పాలవెల్లి-పాలసముద్రము. 4. లాగము-అవలీల.

క. పరహితము సేయ నెవ్వఁడు పరమహితుం డగును భూతపంచకమునకుం;
బరహితమె పరమధర్మము పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ! 235

క. హరి మది నానందించిన హరిణాక్షి జగంబు లెల్ల నానందించున్;
హరియును జగములు మెచ్చఁగ [1]గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షీ! 236

క. శిక్షింతు హాలహలమును భక్షింతును మధురసూక్ష్మ[2]ఫలరసము క్రియన్;
రక్షింతుఁ బ్రాణికోట్లను వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ! 237

వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ 'దేవా! దేవరచిత్తంబుకొలంది నవధరింతురుగాక!'
యని పలికె నని చెప్పిన నరేంద్రుం డి ట్లనియె. 238

మ. అమరన్ లోకహితార్థమంచు నభవుం డౌఁ గాక యం చాడెఁ బో
యమరుల్ భీతిని మ్రింగవే యనిరివో యంభోజగర్భాదులుం
[3]దముఁ గావన్ హర లెమ్ము లె మ్మనిరివో తాఁ జూచి కన్గొంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్. 239

వ. అనిన శుకుం డి ట్లనియె. 240

క. మ్రింగెడువాఁడ విభుం డని మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్
మ్రింగు మనె [4]సర్వమంగళ మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో? 241

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ [5]బొబ్బిడన్
ఘనగంభీరవంబుతో శివుఁడు లోకద్రోహి! హుం పోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బన్ సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 242

వ ఆయ్యవిరళమహాగరళదహనపానసమయంబున. 243

మ. కదలం బాఱవు పాఁపపేరు; లొడలన్ ఘర్మాంబుజాలంబు వు
ట్టదు నేత్రంబులు నెఱ్ఱ గావు; నిజజూటాచంద్రుఁడుం గందఁడున్;
వదనాంభోజము వాడ; దా విషము నాహ్వానించుచో డాయుచోఁ
బదిలుండై కడి సేయుచో ఁరుగుచో భక్షించుచో మ్రింగుచోన్. 244

1. గరళము-హాలాహలము, 2. ఫలము క్రియన్ వే. పాఠాంతరము, 3 దమ క్షేమి-పాఠాంతరము, 2. సర్వమంగళ-పార్వతి, 5. బొబ్బ ఇడన్ - ధ్వని చేయఁగా.

క. ఉదరమున లోకంబులకును [1]సదనం బగు టెఱిఁగి శివుఁడు చటులవిషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమునఁ బదిలంబుగ నిలిపె సూక్ష్మఫల[2]రసముక్రియన్. 245

క. మెచ్చిన మచ్చిక గలిగిన నిచ్చిన నీవచ్చుఁ గాక యిచ్చ నొరులకుం;
జిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె [3]చిచ్చఱరూ పచ్చుపడిన శివునకుఁ దక్కన్ 246

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ [4]గప్పు గలిగి తొడవుకరణి నొప్పె;
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న భూషణంబు గాదె భూవరేంద్ర! 247

వ. తదనంతరంబ. 248

క. గరళంబుఁ గంఠబిలమున హరుఁడు ధరించుటకు మెచ్చి యౌ నౌ ననుచున్
హరియు విరించియు నుమయును సురనాథుఁడుఁ బొగడి రంత సుస్థిరమతితోన్. 249

క. హాలాహలభక్షణకథ హేలాగతి విన్న వ్రాయ నెలమిఁ బఠింపన్
[5]వ్యాళానలవృశ్చికముల పాలై చెడ రెట్టిజనులు భయవిరహితు లై. 250

వ. మఱియు నా రత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ. 251

—: పాలకడలిం దరుచునెడ నైరావతాదులు జనించుట :—

క. తెల్లనిమేనును నమృతము జిల్లున జల్లించు పొదుఁగు [6]శితశృంగములుం
బెల్లుగ నర్థులకోర్కులు వెల్లిగొలుపు [7]మొదవు పాలవెల్లిం బుట్టెన్. 252

ఆ. అగ్నిహోత్రి యనుచు నా సురభిని దేవమునులు పుచ్చికొనిరి మున్నెఱింగి
విబుధసంఘములకు వెరవుతో నధ్వర హవులు పెట్టుకొఱకు నవనినాథ! 253

వ. మఱియు నా జలరాశియందు. 254

క. సచ్చంద్రపాండురంబై యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురగ మొగి జనియించెం;
బుచ్చికొనియె బలి దైత్యుం డిచ్చగొనం డయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్. 255

క. ఒఱ పగు నురమును బిఱుఁదును నెఱిఁ దోకయు ముఖముసిరియు నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ దెలిగన్నులుఁ దఱచగు [8]కందంబుఁ జూడఁ దగు నా హరికిన్. 256

1. సదనంబు-గృహము-నివాసము 2. గతి నధిపా. పాఠాంతరము, 3. చిచ్చఱరూపు-అగ్నిరూపము 4. కప్పు-నలుపు, 5. వ్యాళము-సర్పము 6. శితశృంగములు-వాఁడికొమ్ములు, 7. మొదవు-గోవు 8. కందము-మూఁపురము

వ. అంత నప్పాలకుప్పయందు. 257

క. దంతచతుష్టాహతి శైలాంతంబులు విఱిగి పడఁగ నవదాతకుభృ
త్కాంతంబగు నైరావణ [1]దంతావళ ముద్భవించె ధరణీనాథా! 258

క. తడ లేని నడపువడి గల యొడలును బెనునిడుదకరము సురుకుంభములున్
బెడఁగై యువతుల మురిపపు నడకలకున్ మూలగురు వనన్ గజ మొప్పెన్. 257

వ. మఱియు నత్తరంగిణీవల్లభు మథించునయ్యెడ. 260

ఆ. ఎల్ల ఋతువులందు నెలరారి పరువమై యింద్రువిరులతోఁట కేపు దెచ్చి
కోరి వచ్చువారి కోర్కెల నీనెడు [2]వేల్పుమ్రాను బాలవెర్లెఁ బుట్టె. 261

వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె; నంత.

క. క్రొక్కారుమెఱుఁగు మేనులు గ్రిక్కిరిసిన చన్నుఁగవలుఁ గ్రిస్సిన నడుముల్
పిక్కటిలియున్న తుఱుములుఁ జక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్. 263

వ. మఱియు నా రత్నాకరంబునందు సుధాకరుం డుద్భవించి, విరించియనుమతంబునఁ దన
యథాస్థానంబునం బ్రవర్తించుచుండె: నంత. 264

క. తొలుకారుమెఱుఁగుకైవడిఁ దళతళ మని మేను మెఱవ ధగధగ మనుచున్
గలుముల నీనెడు చూపుఁ జెలువంబుల [3]మొదలిటెంకి సిరి పుట్టె నృపా! 265

సీ. పాలమున్నీటిలోపలిమీఁది మీఁగడ మినిమి [4]జిడ్డునఁ జేసి మేను వడసి
క్రొక్కారుమెఱుఁగులకొనలక్రొత్తళుకులమేనివే గలనిగ్గు మెఱుఁగుసేసి
నాఁటినాఁటికి బ్రోదినవకంపుఁదీవల నునుఁబోదనెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారుకెందమ్మికొలఁకునఁ బ్రొద్దునఁ బొలసినవలపునఁ బ్రోది వెట్టి

తే. వసిఁడిచంపకదామంబు బాగుఁగూర్చి వాలుక్రొన్నెల [5]చెలువున వాఁడి దీర్చి
జాణతనమునఁ జేతుల జడ్డు విడిచి నలువ యీ కొమ్మ నొఁగి జేసినాఁడు నేఁడు. 266

క. కెంపారెడు నధరంబును జంపారెడినడుము నతికి [6]శంపారుచులన్
సొంపారు మోముఁ గన్నులుఁ బెంపారుచు నొప్పు గొప్పవిఱుదును గుచముల్. 267

---

1. దంతావళము-ఏనుఁగు, 2. వేల్పుమ్రాను-కల్పవృక్షము, 3. మొదలిటెంకి-మూలస్థానము, 4. జిడ్డుఁ బసేసి - పాఠాంతరము, 5. చెన్నున - పాఠాంతరము, 6. శంపారుచులు-మెఱపుకాంతులు.

వ. అని జనులు పొగడుచుండ. 268

సీ. తరుణికి మంగళస్నానంబు సేయింత మని పెట్టె నింద్రుఁ డనర్ఘమైన
మణిమయపీఠంబు; మంగళవతులైన వేలుపుగరితలు విమలతోయ
పూర్ణంబులై యున్న పుణ్యాహకలశంబు లిడిరి; పల్లవముల నిచ్చె భూమి;
[1]గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చెఁ మలసి వసంతుఁడు మధు వొసంగె;
తే. మునులు కల్పంబుఁ జెప్పిరి మొగిలుగములు పణవగోముఖకాహళపటహమురజ
శంఖవల్లకీవేణునిస్వనము లిచ్చెఁ బాడి రాడిరి గంధర్వపతులు నతులు. 269

క. వందితసూక్తులతోడుతఁ దుండంబులు సాఁచి దీర్ఘతోయము లెల్లం
దుండముల ముంచి [2]దిగ్వేదండంబులు జలక మార్చె దరుణీమణికిన్. 270

సీ. కట్టంగఁ బచ్చని పట్టుఁబుట్టపుదోయి ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె;
మత్తాళినికరంబు మధు వాన మూఁగిన వైజయంతీమాల వరుణుఁ డిచ్చెఁ;
గాంచన కేయూరకంకణకింకిణీకటకాదులను విశ్వకర్మ యిచ్చె;
భారతి యొక మంచి తారహారము నిచ్చెఁ; బాణిపద్మము నిచ్చెఁ బద్మభవుఁడు;
ఆ. [3]కుండలివ్రజంబు గుండలముల నిచ్చె; శ్రుతులు భద్రమైననుతులు సేసె;
నెల్లలోకములకు నేలికసానివై బ్రదికె దనుచు దిశలు పలికె నధిప! 271

వ. మఱియును. 272

సీ. పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించె వాఁడెపో బ్రహ్మ యనఁగ;
నెలయించి కెంగేల నెవ్వని వరియించె వాఁడె లోకములకు వల్లభుండు;
మెయిదీఁగె నెవ్వనిమేనితోఁ గదియించె వాఁడెపో పరమసర్వజ్ఞ మూర్తి;
నెలఁతుక యెప్పుడు నివసించె నే యింట నా యిల్లు పరమగు నమృతపదము;
ఆ. నింతిచూపు వాఱె నెచ్చోటి కచ్చోటు జిష్ణుధనదధర్మజీవితంబు;
గొమ్మ విన్ననగవు గురుతరదుఃఖనివారణంబు సృష్టికారణంబు. 273

వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున. 274

సీ. భావించి యొకమాటు బ్రహ్మాండమంతయు నాటల బొమ్మరిల్లని తలంచుఁ;
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతు లని తలంచుఁ;

1. కడిమి-ఆధిక్యము, 2. దిగ్వేదండంబులు - దిగ్గజములు, 3 కుండలివ్రజంబు - సర్పసమూహము.

బాటించి యొకమాటు బ్రహ్మాది [1]సురులను దనయింటిలో బొమ్మ లని తలంచుఁ;
గొనకొని యొకమాటు [2]కుంభినీచక్రంబు నలవడ బొమ్మపీఁ టని తలచు;
ఆ సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల నచటి దీపకళిక లని తలంచు;
భామ యొక్కమాటు భారతీదుర్గల నాత్మసఖు లటంచు నాదరించు. 275

వ. తదనంతరంబ. 276

ఆ. [3]చంచరీకనికరఝుంకారనినదంబు దనరు నుత్పలములదండ వెట్టి
మేఘకోటినడిమి మెఱుఁగుఁ [4]బుత్తడిమాడ్కి సురలనడుమ నిలిచె సుందరాంగి, 277

క. ఆ కన్నులు నా చన్నులు, నా కురు లా పిఱుఁదు నడుము నా ముఖ మా న
వ్యాకారముఁ గని వేల్పులు సీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 278

వ. అట్లు నిలుచి దశదిశలం బరివేష్టించియున్నయక్షరక్షస్సిద్ధసాధ్య దివిజగరుడగంధర్వ
చారణప్రముఖనిఖిలయూథంబులం గనుంగొని యప్పురాణ ప్రౌఢకన్యకారత్నంబు దన
మనంబున ని ట్లని వితర్కించి. 279

సీ. [5]ఐదువనై యుండ నలవడ దొక చోట; నొక చోట సవతితో నోర్వరాదు;
తగ నొకచోట నంతతవైభవంబు గా; దొకచోట వేఁడిమి నుండఁ బోల;
దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన; నొకచోట దగ్గఱి యుండ బెట్టి
నెరయఁగ నొకచోట నిలుకడ సాలదు; చర్చింప నొకచోట జడత గందు;
ఆ. కొన్నిచోట్ల కామగుణగరిష్ఠంబులు; క్రోధసంయుతములు గొన్ని యెడలు;
గొన్ని మోహలోభకుంఠితంబులు; గొన్ని ప్రమదమత్సరానుభావకములు. 280

వ. అని సకలసత్పురుషజనవర్తనంబులు [6]మానసించి పరిహరించి. 281

సీ. అమర ముత్తైదువనై యుండ వచ్చును; వరునకు సవతు లెవ్వరును లేరు;
వెలయంగ నక్రాంతవిభవ మీతనియిల్లు; శృంగారచందనశీతలుండు;
గలఁగఁ డెన్నఁడు; శుద్ధకారుణ్యమయమూర్తి; విమలుండు; గదిసి సేవింపవచ్చు;
నెఱి నాడి తిరుగఁడు; నిలుకడ గలవాఁడు; సకలకార్యములందు జడత లేదు;
ఆ. సాధురక్షకుండు; షడ్వర్గరహితుండు నాథుఁ డయ్యెనేని నడవ నోపు;
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ బుష్పదామకమునఁ బూజసేసె. 282

---

1. జంతువులను వండులో బొమ్మ-పాతాళతరము, 2. కుంభినీచక్రంబు-భూమండలము, 3 చంచరీకము-తుమ్మెద, 4. పుత్తడి-ప్రతిమ, 5. ఐదువ - ముత్తయిదువ-సుమంగళి-మంగళసూత్రము, పసుపుకుంకుమములుఁ, గాజులు, కర్ణభూషణము కలది, 6. మానసించి-ఆలోచించి.

క. ఇందీవరదామమున ము కుందుని( బూజించి తనకు( గూడి వసింపన్
మందిరముగ( దద్వక్షము నందంద సలజ్జదృష్టి నాలోకించెన్. 283

ఆ. మోహరుచులవలన ముద్దియ దల యెత్తు; సిగ్గువలన బాల శిరము వంచు;
సింతి వెఱపువలన నెత్తదు వంపదు తనమనముఖము ప్రాణదయితు( జూచి. 284

క. హరి నూచిన సిరి సూపదు సిరి సూచిన హరియు( జూడ సిగ్గును బొందున్;
హరియును సిరియును దమలో నరిచూపుల(జూడ మరు(డు నందడి [1]పెట్టెన్. 285

చ. జగములతండ్రియై తనరు శౌరి జగంబులతల్లి నిందిరం
దగ నురమందు( దాల్చె: నట( దత్కరుణారసదృష్టిచే( బ్రజల్
మగుడ(గ( దొంటిభంగి నతిమంగళసాధ్విపతిత్వసంపదన్
నెగడిన లోకముల్ గని; రనేకశుభంబుల( బొంది రత్తఱిన్. 286

వ. అట మున్న యబ్ధిరాజు దనయందు నున్న యమూల్యంబయన కౌస్తుభంబు పేరిటి యనర్ఘమణిరాజంబు నయ్యంబుజాక్షునకు సమర్పించిన దానిం దన వక్షస్థలంబున ధరియించె; నప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీవనమాలికా తారహారాద్యలంకృతంబైన పుండరీకాక్షువక్షస్థలంబున వసియించె; నయ్యవసరంబున. 287

మ. మ్రోసెన్ శంఖమృదంగవేణురవముల్ మున్నాడి; పెంజీ(కటుల్
వాసెన్; నర్తనగానలీలల సురల్ భాసిల్లి; రార్యుల్ జగ
ద్వ్యాపుల్ విష్ణుని బ్రహ్మదేవముఖరుల్ దల్లింగమంత్రంబులం
బ్రానక్తిన్ వినుతించి రుల్లసితపుష్పశ్రేణి వర్షించుచున్. 288

క. ఆ పాలవెల్లికూ(తురు దీవులమాపులను దో(గి తిలకింప( బ్రజల్
చేపట్టిరి సంపదలను బ్రాపించెరు మేలు; జగము బ్రదికె నరేంద్రా! 289

క. [2]పాలేటిరాచకన్నియ మే లారెడు చూపురేక [3]మిడుమిడు కంచుం
జాలిం బురపుర( బొక్కుచు దూలిరి రక్కసులు కీడు దో(చిన నధిపా! 290

క. వారిధి( దరువ(గ నంతట వారుణి యన నొక్కకన్య వచ్చిన నసురుల్
వారిజలోచనునమ్మతి వారై కైకొనిరి దాని వారిజనేత్రన్. 291

వ. మఱియుం దరువం దరువ నప్పయోరాశియందు 292

---

1. సేసెన్-పాఠాంతరము, 2. పాలేటిరాజు-పాలసముద్రము, 3. మిడుక మిడుకుచుం-పాఠాంతరము

సీ. తరుణుఁడు దీర్ఘదోర్దండుఁడు గంబుకంధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాసితభూషణాలంకృతుం డరుణాక్షుఁ డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నీలకుంచితకేశనివహుండు జలధరశ్యాముండు మృగరాజసత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతుసంశాంశసంభవుం డమలమూర్తి
ఆ. భూరియాగభాగభోక్త ధన్వంతరి యనఁగ నమృతకలశహస్తుఁ డగుచు
నిఖిలవైద్యశాస్త్రనిపుణుఁ డాయుర్వేది [1]వేల్పువెజ్జు గదలి వెడలివచ్చె. 293

వ. తదనంతరంబ. 294

ఆ. అతనిచేత నున్నయమృతకుంభము సూచి [2]కెరలువొడిచి సురలఁ [3]గికురువెట్టి
పుచ్చికొనిరి యసురపుంగవు లెల్లను మాఱులేని బలిమి మానవేంద్ర! 295

వ. వెండియు. 296

ఆ. చాపు లేని మందు చక్కఁగ మన కబ్బె ననుచుఁ గడప నసురు [4]లాఁచికొనిన
వెఱచి సురలు హరికి మొఱలువెట్టిరి సుధాపూర్ణఘటము వోయెఁ బోయెఁ ననుచు. 297

### శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట

వ. ఇట్లు శరణాగతులైన వేల్పులదైన్యంబు వొడగని భృత్యజనకామదుండగు నప్పరమేశ్వరుండు 'మీరలు దుఃఖింపవలదు; నేను నా మాయాబలంబుఁజేసి మీ [5]యర్థంబు మరల సాధించెద' నని పలికెఁ; దత్సమయంబున నయ్యమృత పూరంబు నేమ త్రావుదు మని తమకించు దైత్యదానవజనంబులలోపల నమంగళంబగు [6]కలి సంభవించిన కతంబునఁ బ్రబలులగు రక్కసులు విలోకించి సత్త్రయాగంబునందు నడచు చందంబునఁ దుల్యప్రయాసహేతువులగు సురలును సుధాభాగంబున కర్హులగుదురు గావునఁ బంచి కుడుచుట కర్తవ్యం; బిది సనాతనంబగు ధర్మం బగుటంజేసి యియ్యమృతకుంభంబు విడువుం డని దుర్బలులగు నిశాచరుల జాతమత్సరులై ప్రబలులైన తమవారల వారించు చున్నసమయంబున. 298

ఆ. ఒకనిచేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై పుచ్చికొనిన వానిఁ బొదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ డమృతకుంభము నెత్తికొంచుఁ బాఱెఁ బరులు [7]గుయ్యిడంగ. 299

వ. అంత. 300

---

1. వేల్పువెజ్జు - దేవవైద్యుఁడు, 2. కెరలువొడిచి-విజృంభించి, 3. కికురువెట్టి-త్రోసిపుచ్చి 4. లాఁచికొనిన-అపహరింపఁగా, 5. అర్థంబు-కోరిక-కోరినవస్తువు. 6. కలి-కలహము, 7. కుయ్యిడంగ-అఱవఁగా.

సీ. మెత్తని యడుగుల మెఱుఁగారుజానువు లరఁటికంబముల [1]దోయైన తొడలు
ఘనమగు జఘనంబుఁ గడు లేఁతనడుమును బల్లవారుణకాంతి పాణియుగముఁ
గడుదొడ్డపాలిండ్లుఁ గంబుకంఠంబును బింబాధరముఁ జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁగవయును నలికుంతలంబును బాలేందుసన్నిభఫాలతలము
తే. సమరఁ గుండలకేయూరహారకంకణాదు లేపార మంజీరనాద మొప్ప
నల్ల [2]నవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర పతుల నడఁగింప నాఁడు రూపంబు దాల్చి. 301

వ. అయ్యవసరంబున జగన్మోహనాకారంబున. 302

సీ. పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు; జాఱించి మెల్లన చక్క నొత్తు;
[3]దళుకుదళ్కను గండఫలకంబు లొలయించు; నొలయించి కెంగేల నుజ్జగించు;
గడుమెఱుంగులు [4]వాలు కడకన్ను లల్లార్చు; నల్లార్చి తెప్పల నందగొలుపు;
నవరనిదరహాసచంద్రికఁ జిలికించుఁ; జిలికించి కెమ్మోవిఁ జిక్కవఱచు;
తే. దళిత [5]ధమ్మిల్లకుసుమగంధమ్ము నెఱపుఁ; గంకణాదిఝుంకృతుల్ గదలుకొలుపు;
నొదలికాంతులు పట్టులే కులుకఁబాఱు; సన్నవలిపంపుఁబయ్యెద [6]చౌకళించి. 303

వ. ఇవ్విధంబున నక్కపటయువతీరత్నంబు జగన్మోహనదేవతయునుంబోలె నెమ్మొ
గంబుతావికి మత్తిల్లిన తేఁటిమొత్తంబులన్ గెలిచి చిగురుజొంపంబుల నెడగలుగ
ఇడియుచు మురియుచుండ రాక్షసవరులు గనుఁగొని. 304

సీ. అవుఁగదే లావణ్య, మవుఁగదే మాధుర్య, మవుఁగదే సతి నవయౌవనాంగి!
యెటనుండి వచ్చితి? వేమి యిచ్చించెదు? నీ నామ మెయ్యది నీరజాక్షి?
యమరగంధర్వసిద్ధాసురచారణమనుజకన్యలకు నీమహిమ గలదె?
ప్రాణచిత్తేంద్రియపరిణామ మాయియై నిర్మించె బోవిధి నిన్నుఁ గరుణ;
తే. వనిత! గశ్యపుసంతతివార మేము భ్రాతలము [7]సురలక; సిద్ధపౌరుషులము
జ్ఞాతులకు మాకు నేకార్థసంగతులకుఁ [8]బాలు దీరని యర్థంబు పంచి యిమ్ము. 305

క. సభయై యుండెద మిందఱ, మభయంబున వచ్చుకొలంది నమృతంబును నీ
విభరాజగమన! తప్పక, విభజింపు [9]విపక్షపక్షవిరహితమతివై. 306

1. దోయి-రెండు, 2. నగుచును-పాఠాంతరము, 3. తళుక్కుదళుక్కన-పాఠాంతరము, 4. వాలుఁగడకన్ను-పాఠాంతరము, 5. ధమ్మిల్లము-కొప్పు, 6. చౌకళించి-చలించి, 7. కృతసమయత్న-పాఠాంతరము, 8. పాలు-భాగము. 9. విపక్షపక్ష విరహితమతి-శత్రు, మిత్ర భేదములేని బుద్ధికలది.

వ. అని మందలించిన దైత్యులం గని మాయాయువతిరూపుండగు హరి తన వాఁడి వాలు చూపుటంపఱవలన వారల [1]తాలుములు నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యి ట్లనియె. 307

క. సుందరులగు పురుషులఁ గని పొందెడు నాయందు [2]నిజము పుట్టునె మీకున్ ?
బృందారకరిపులారా చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్. 308

క. పలుకులు మధురసధారలు దలఁపులు నానాప్రకారదావానలముల్;
పెలుములు [3]సాలావృకములు సెలువల నమ్మికలు వేదసిద్ధాంతములే ! 309

క. నా నేర్పుకొలఁది మీకును మానుగ విభజించి యిత్తు; మానుఁడు శంకం;
గా నిం డనవుడు నిచ్చిరి దానవు లమృతంపుఁగడవఁ దరుణీమణికిన్. 310

క. ఆ శాంతాలోకనములు నా శీతలభాషణములు నా లాలితముల్
రాశిపరంపర లగుచుం బాశములై వారినోళ్లు బంధించె నృపా! 311

వ. ఇట్లు సుధాకలశంబు కేల నందికొని మందస్మితభాషణంబుల సుందరీరూపుండగు ముకుందుండు 'మేలు గీ డనక నేను బంచి యిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం' బనవుడు 'నగుం గాక' యని సురాసురదైత్యదానవసమూహం బుపసంచి కృతస్నానులై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాది దానంబులు సేసి తదాశీఃప్రపచనంబును గైకొని ధవళపరిధానులై గంధమాల్యధూపదీపాలంకృతంబగు కనకరత్నశాలామధ్యంబునఁ బ్రాగగ్రకుశపీఠంబులం బూర్వదిశాభిముఖులై పంక్తులుగొని యున్న సమయంబున. 312

క. శ్రోణీభర కుచయుగభర వేణీభరములను డస్సి వివిధాభరణ
క్వాణ యయి యువిద వచ్చెను బాణినరోజమున నమృతభాండముఁ గొంచున్. 313

క. భాసురకుండలభాసిత నాసాముఖకర్ణగండనయనాంచలయై
శ్రీసతి యగు సతిఁ గని దే వాసురయూథంబు మోహ మందె నరేంద్రా! 314

వ. అప్పుడు. 315

క. 'అసురుల కమృతము వోయుట పొసఁగదు; పాములకుఁ బాలు వోసినమాడ్కిన్
దొసఁ గగు' నంచును వేఱొక దెసఁ గూర్చుండంగఁబెట్టె దేవాహితులన్. 316

---

1. తాలుములు-ఓర్పులు. 2. బుద్ధి-పాఠాంతరము; నిజము-యథార్థభావము-నమ్మిక, 3. సాలావృకములు-తోఁడేళ్ళు.

వ. ఇట్లు రెండు పంక్తులుగా నేర్పరించి. 317

సీ. వేగిరపడకుఁడీ విడుఁడు దానవులార! తడవు సేయక వత్తు దైత్యులార!
యటు సక్కఁ గూర్చుండుఁ డని కన్ను లల్లార్చి చనుఁగవపయ్యెద జాఱఁ దిగిచి
పదినే[1]మఱందలి [2]వావులు కల్పించి మర్మంబు లెడలించి మఱుఁగు సేసి
మెల్లనినగవుల మేనులు మఱపించి కడుజాణమాటలఁ [3]గాకుపఱచి
ఆ. యసురవరులనెల్ల నడకించి సుకలను, 'దడవు సేయ వలదు; ద్రావుఁ' డనుచు
వచ్చుకొలది నమృతవారి విభాగించెఁ దరుణి దివిజు లెల్లఁ దనిసి పొగడ. 318

వ. అయ్యవసరంబున. 319

సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁ బంచి పెట్టెద నని పడఁతి పూనెఁ;
దా నేల తప్పును? దప్పదు; తరళాక్షి గాక రమ్మనుచును గడఁకఁ బిల్వ
మరుమాటలాడదో, మఱి చూడకుండునో చనుఁగవఁ గప్పునో చాలు ననుచు;
నొండాడఁ గలఁగుచు నొక్కింత సొలయునో మనయెడఁ గందునో మగువ యనుచు
ఆ. నెలఁతచూడ్కిగముల నీరై కరఁగుచుఁ బ్రణయభంగభీతి బద్ధు లగుచు
నూరకుండ్రు గాని, 'యువిద తే తె'మ్మని యడుగఁజాల రప్పు డసురవరులు. 320

వ. అప్పుడు. 321

మ. అమరవ్రాతములోనఁ జొచ్చి దివిజుండై రాహు [4]పీయూషపా
నము సేయం గని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్తమై
యమరత్వంబును జెందె మూర్ధము దదన్యాంగంబు నేలం బడెన్. 322

ఆ. అజుఁడు వానిశిరము నంబరవీథిని గ్రహము సేసి పెట్టి గారవించె;
వాఁడు పర్వములను వైరంబు దప్పక భానుచంద్రములను బట్టుచుండు. 323

క. ఒకబొట్టుఁ జిక్క కుండఁగ సకలసుధారసము నమర[5]సంఘంబులకుం
బ్రకటించి పోసి హరి దన సుకరాకృతిఁ దాల్చె నసురశూరులు బెడగన్. 324

మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్
సములై లబ్ధవికల్పు లైరి యమరుల్ సంశ్రేయముం బొంది ర

---

1. మఱందులు-పాఠాంతరము, 2 వావులు-బంధుత్వపు వరుసలు, 3. కాకుపఱిచి-అణఁచి, 4. పీయూషము-అమృతము, 5. సంఘము కెల్లన్-పాఠాంతరము.

యీమరారుల్; బహుదుఃఖముల్ గనిరి తా మత్యంతదోర్గర్వులై;
కమలాక్షున్ శరణంబు వేడని జనుల్ గల్యాణసంయుక్తులే? 325

—: దే వా సు ర యు ద్ధ ము :—

క దానవు లమృతము ద్రావం బూని పయోరాశిఁ ద్రచ్చి పొగిలినమాడ్కిన్
శ్రీనాథపరాఙ్ముఖు లగు హీనులు వొందంగఁజాల రిష్టార్థంబుల్. 326

క. శోధించి జలధి నమృతము సాధించి నిలింపవైరిచక్షుర్గతులన్
[1]రోధించి సురల కిడి హరి బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా! 327

క. శుద్ధముగ సురల కమృతము సిద్ధించిన నసురవరులు [2]సిడిముడిపడుచున్
గ్రుద్ధులు నానాయుధసన్నద్ధులునయి యుద్ధమునకు నడచిరి బలిమిన్, 328

క. ధన్యులు [3]వైరోచని శత మన్యుప్రముఖులు మదాభిమానులు దమలో
నన్యోన్యరణము బాహాసిన్యాసంబులను బేర్చి చేసిరి కడిమిన్. 329

మ. అరుదై కామగమై, మయాసురకృతంబై లోకితాలోక్యమై
వరశస్త్రాస్త్రసమేతమై తరళమై వైహాయసంబై మహా
సురయోధాన్వితమైన [4]యానమున నంశోభిల్లెఁ బూర్ణేందు సు
స్థిరకాంతిన్ బలి చామరధ్వజచమూదీప్తస్థితిన్ ముందటన్. 330

వ మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జం భాయోముఖ ప్రహేతి
హేతి భూతసంత్రాస హయగ్రీవకపి లేల్వ లోత్కల మేఘదుందుభి మయత్రిపురాధివ
విప్రచిత్తి విరోచన వజ్రదంష్ట్రి తార కారి ష్టారిష్టనేమి శుంభ నిశుంభ శంకుశిరఃప్రముఖు
లును, పౌలోమ కాలేయులును, నివాత కవచప్రభృతులును, దక్కిన దండయోధులునుం
గూడికొని యరదంబులం దురంగంబుల మాతంగంబుల హరిణంబుల హరి
కిరి శరభ మహిష గవయ ఖడ్గగండభేరుండ చమరీ జంబుక శార్దూల గోవృషాదిమృగం
బులను గంక గృధ్రి కాక కుక్కుట బక శ్యేన హంసాదివిహంగంబులను దిమితిమింగి
లాది జలచరంబులను, నరులను, నసురసురనికరవికృతవిగ్రహరూపంబులగు జంతు
వులను నారోహించి, తమకు [5]నడియాలంబులగు గొడుగులు [6]పడగలు జోడుఁ
గైదువులు పక్కెరలు టొమిడికంబులు మొదలగు [7]పోటుము ట్లాయితంబుగఁ గైకొని

1. రోధించి-అడ్డుకొని, 2. చిటిముడి-తత్తఱపాటు, 3 వైరోచని శతమన్యుప్రముఖులు-బలి, ఇంద్రుఁడు మున్నగువారు, 4. యానము-వాహనము, 5. అడియాలంబులు-చిహ్నములు, 6. పడగలు-పతాకలు, 7 పోటుముట్లు-యుద్ధసాధనములు.

వేఱువేఱ మొనలై విరోచననందనుండు బలిముందట నిలువంబడిరి; దేవేంద్రుండును నైరావతారూఢుం డై వైశ్వానరవరుణవాయుదండధరా ద్యనేకనిర్జరవాహినీసందోహంబును దాను నెదురుపడి విఱుతివియక మోహరించె; నట్లు సంరంభసన్నాహసముత్సాహంబుల రెండుదెఱంగులవారును బోరాడు వేడుకల మీఁటగు మాటల సందడించుచున్న సమయంబున. 331

సీ. వజ్రదంష్ట్రాంచితవ్యజనంబులును బర్హచామరంబులు సితచ్ఛత్త్రములును
చిత్రవర్ణధ్వజచేలంబులును వాతచలితోత్తరోష్ణీషజాలములును
జప్పళ్ళ నెనఁగు భూషణకంకణంబులుఁ జండాంశురోచులశస్త్రములును
వివిధఖేటకములు వీరమాలికలును బాణపూర్ణములైన తూణములును

ఆ. నిండి పెచ్చురేఁగి నిర్జరాసురవీరసైన్యయుగ్మకంబు సాల నొప్పె
గ్రాహతతులతోడఁ గలహంబునకు వచ్చు సాగరములభంగి జనవరేణ్య! 332

క. భేరీభాంకారంబులు వారణఘీంకారములును వరహరిహేషల్
భూరిరథనేమిరవములు ఘోరములై వెల్లగిందెఁ గులశైలములన్, 333

వ. ఇవ్విధంబున నుభయబలంబులును [1]మోహరించి బలితో నింద్రుండును, దారకునితో గుహుండును, హేతితో వరుణుండును, బ్రహేతితో మిత్రుండును, గాలనాభునితో యముండును, మయునితో విశ్వకర్మయు, శంబరునితోఁ ద్వష్టయు, విరోచనునితో సవితయు, నముచితోఁ బరాజితుండును, వృషపర్వునితో నశ్విదేవతలును, బలిసుతబాణాది పుత్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, శుంభనిశుంభులతో భద్రకాళిదేవియు, జంభునితో వృషాకపియును, మహిషునితో విభావసుండును, నిల్వలవాతాపులతో బ్రహ్మపుత్రులును, దుర్మర్షునితోఁ గామదేవుండును, నుత్కలునితో మాతృకాగణంబును శుక్రునితో బృహస్పతియు, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతో వసువులు నమరులును, బౌలోములతో విశ్వేదేవగణంబును [2]క్రోధవశులతో రుద్రులును నివ్విధంబునం గలసి పెనంగి ద్వంద్వయుద్ధంబు సేయుచు మఱియు రథికులు రథికులను, పదాతులు పదాతులను, వాహనారూఢులు వాహనారూఢులనుం దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు నాహ్వానంబు లొనంగుచు, నన్యోన్యతిరస్కారంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెనుబొబ్బల నుబ్బి రేఁగుచు, హుంకరించుచు, నహంకరించుచు,

1. మోహరించి వ్యూహముపన్ని, 2. నక్రోధవశులైన రుద్రవిశ్వేదేవతలును గ్రోధవశులై తక్కిన రక్కసులును దక్కిన సురలను దాఁకి—పాఠాంతరము.

ధనుర్గుణంబులఁ దంకరించుచు, శరంబుల నాఁటించుచు, బరశువుల నఱకుచుఁ, చక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులఁ బొడుచుచు, గదల నడఁచుచు, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁ, బట్టిసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచు, బాశంబులం గట్టుచుఁ, బరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోదుచు, ముద్గరంబులన్ [1]జడియుచు, ముష్టివలయంబుల ఘట్టించుచు దోమరంబుల నఱుముచుఁ, శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీరుచుఁ, దరుశైలంబుల నువ్వుచు, [2]నుల్ముకంబులం [3]జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపునవసరంబున భిన్నంబులైన శిరంబులును, విచ్ఛిన్నంబులైన కపాలంబులును, వికలంబులైన కపోలంబులును జిక్కువడిన కేశబంధంబులును, భగ్నంబులైన దంతంబులును, [4]గృత్తంబులైన భుజంబులును ఖండితంబులైన కరంబులును, విదళితంబులైన మధ్యంబులును, వికృతంబులైన వదనబింబంబులును, వికలంబులైన నయనంబులును, వికీర్ణంబులయిన కర్ణంబులును, విశీర్ణంబులైన నాసికలును విఱిగిపడిన యూరుదేశంబులును, విసంధులయిన పదంబులును, జిరిగిన కంకటంబులును రాలిన భూషణంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్త్రంబులును మ్రొగ్గిన గజంబులును, [5]నుగ్గయిన రథంబులు [6]నుఱుమైన హయంబులును జిందఱవందఱలైన భటసమూహంబులును, నొఱలెడు కొఱప్రాణంబులును, బొరలెడు మేనులును, నుబ్బియాడెడు భూతంబులును, బాఱెడు రక్తప్రవాహంబులును, గట్టలుగొన్న మాంసంబులును, నెగసి తిరిగెడి కళేబరంబులును గలకలంబుసేయు కంకగృధ్రాదివిహంగంబులు నయి యొప్పు నప్పో రతిఘోరంబయ్యె; నప్పుడు. 334

శా. నాకాధీశుఁ బదింట, మూఁట గజమున్, నాల్గింట గుఱ్ఱంబులన్,
ఏకాస్త్రంబున సారథిం జొనిపె, దైత్యేంద్రుండు దా నాకస
ల్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని [7]దోడ్తో నన్ని [8]భల్లంబులన్
రాకుండన్ [9]రిపువర్గముం దునిమె గీర్వాణారి యగ్గింపఁగన్. 335

సీ. తనతూపు లన్నియుఁ దర మిడి శక్రుండు నఱికిన జోదు విన్ననువు మెఱసి
బలి మహాశక్తి చేఁ బట్టిన నదియును నతఁడు ఖండించె నత్యద్భుతముగ;
మఱి ప్రాసశూలతోమరములు గైకొన్నఁ దోడ్తోడ నవియును దునిమివైచె;
నంతటఁ బోక యెయ్యది వాఁడు సాగించెఁ దొడరి తా నదియును దుమురుసేసె;

---

1 జడియుచు—తొలఁగించుచు, 2. ఉల్ముకంబులు—కొఱవులు, 3. చూఁడుచు—కాల్చుచు, 4. కృత్తంబులు. తెగినవి, 5,6. నుగ్గు, నుఱుము—చూర్ణము—పొడి 7. తోడ్తోన్—వెంటనే, 8. భల్లంబు—బాణములు, 9. రిపుసర్వముం దునుము నిర్వాణార్థభంగిన్ వెన్—పాఠాంతరము.

ఆ. ననురభర్త విరథుఁడై తన పగఱకుఁ గానఁబడక వివిధకపటవృత్తి
నేర్పు మెఱసి మాయ నిర్మించె మిఁటను వేల్పుగములు నూచి వెఱఁగుపడఁగ. 336

వ. ఇట్లు దానవేంద్రుని మాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులువడియె; దావాగ్నిదందహ్యమానతరువర్షంబులు గురిసె; నటంకశిఖర నికరశిలాసారంబులుగప్పె; మహోరగదందశూకంబులు గఱచె; వృశ్చికఁబులు మీటె; వరాహవ్యాఘ్రసింహంబులు గదిసి విదళింపన్ దొరఁకొనియె; వనగజంబులు మట్టి మల్లాడఁజొచ్చె శూలహస్తులు దిగంబరులునై రఁడు రం డని బలఁరక్కసులు శతసహస్రసంఖ్యలు ఛేదనచ్ఛేదన భాషణంబులు సేయందొడంగిరి; వికృతవదనులు గదాదండధారులు నాలంబితకేశ భారులునై యనేక రాక్షస వీరులు పోనీకు 'పోనీకుఁడు; తునుము తునుముం'డని వెనుతగిలిరి; పరుషగంభీర [1]నిర్ఘాతనమేతంబులయిన జీమూతసంఘాతంబులు వాతాహతంబులై యుప్ప తిల్లి నిప్పులకుప్పలు మంటలప్రోవులం గురిసె; మహాపవనవిజృంభితంబైన కార్చిచ్చు ప్రళయానలంబుచందంబునం దరికొనియెఁ; బ్రచండఝంఝానిలప్రేరిత నముత్తుంగ తరంగావర్తభీషణం బయిన మహార్ణవంబు సెలియలికట్ట దాఁటి వెల్లివిరిసి ట్లమేయంబై యుండె; నా నమయంబునం బ్రళయకాలంబునుంబోలె మిన్ను మన్నును, రేయుం బగలు నెఱుంగ రా దయ్యె; నయ్యవసరంబున. 337

క. ఆ యసురేంద్రునిబహుతరమాయాజాలంబులకును మా తెలియఁగక వ
జ్రాయుధ [2]ముఖరాదిత్యు లపాయంబును బొంది చిక్కు వడిరి నరేంద్రా! 338

వ. అప్పుడు. 339

క. ఇయ్యసురులచేఁ జిక్కితిమెయ్యది దెరు? వెందుఁ జొత్తు? మిటు వాలయఁ గదే
యయ్యా! దేవ! జనార్దన! కుయ్యో మొఱ్ఱో యటంచుఁ గూయిడి రమరుల్. 340

వ. అని మొఱయిడు నవసరంబున. 341

మ. విహగేంద్రాశ్వనిరూఢుఁడై మణిరమావిభ్రాజితోరస్కుఁడై
బహుశస్త్రాస్త్రరథాంగనంకలితుఁడై భాస్వత్కిరీటాదిదు
స్సహుఁడై నవ్య [3]పిశంగచేలధరుఁడై నంపుల్లపద్మాక్షుఁడై
విహితాలంకృతిదోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్. 342

చ అసురులమాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్
[4]గసిబిసియై నిరర్థము బ్రక్కునఁ బోయెన; నిద్ర నొంది నం

1. నిర్ఘాతము—పిడుగు, 2 ముఖర—మొదలైన, 3. పిశంగచేలము — పసుపుపచ్చ వస్త్రము, 4. కసిబిసియై—పటుత్వము తగ్గి.

తనమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలఁగిరి వేల్పు లందఱుం;
జన సెఱ కేల యుండు హరిపాదపరిష్కృతిసేయ నాపదల్? 343

వ. అయ్యెడ. 344

ఆ. కాలనేమి ఘోర [1]కంఠీరవము నెక్కి తార్క్ష్యుశిరము శూలధారఁ బొడువ
నతనిపోటుమట్టు హరి గేల నంకించి దానఁ జావఁబొడిచె దానవునిని. 345

క. పదపడి మాలిసుమాలులు బెదరించినఁ డలలు ద్రుంచెఁ బృథుచక్రహతిన్;
గదఁగొని గరుడునిఱెక్కలు సెదరించిన మాల్యవంతు శిరమున్ ద్రేసెన్ 346

వ. ఇట్లు పరమపురుషుండగు హరి కరుణాపరత్వంబున బ్రత్యుపలబ్ధమనస్కులైన వరుణ వాయువాసవప్రముఖులు పూర్వంబున నెవ్వ రెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు, వారు వారలం దలపడి నొప్పించి; రయ్యవసరంబున 347

క. బాహుబలంబున నింద్రుఁడు సాహసమున బలిని గెలువ నమకట్టి నము
త్సాహమున వజ్ర మెత్తిన హాహానినదంబు సేసి రఖిలజనములున్. 348

వ. ఇట్లు సముద్యత [2]భిదురహస్తుండై యింద్రుండు దన పురోభాగంబునం బరాక్రమించు చున్న విరోచననందను నుపలక్షించి యి ట్లనియె. 349

మ. 'జగతిన్ వైరి మొఱంగి గెల్చు టదియున్ శౌర్యంబె? ధైర్యంబె? తా
మగవాఁ డయ్యునుఁ దన్నుదా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్
బగవానిం గని డాఁగెనేని మెయి సూపం జాలఁడేనిం గటా!
నగరే బంధులు? దిట్టరే బుధులు? గన్యల్ గూర్తురే? దానవా! 350

శా. మాయల్ సేయఁగ రాదు పో; నగవులే మాతోడిపోరాటముల్?
[3]దాయా! చిక్కితి; వ్రక్కలించెదఁ గనద్దంభోళిధారాహతిన్;
నీ యిష్టార్థము నెల్లఁ జూడుము వెసన్ నీవారలం గూడుకో
నీ యాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁ డాజిలో దుర్మతీ! 351

వ. అని [4]యుపాలంభించిన విని విరోచననందనుం డి ట్లనియె. 352

శా. నీవే పోటరివే? సురేంద్ర తెగడన్ నీకేల? గె ల్పోటముల్
లేవే? యెవ్వరిపాలఁ బోయినవి? మే ల్గీడున్ విరించాదులుం

1. కంఠీరవము-సింహము, 2 భిదురము-వజ్రాయుధము 3, దాయ-విరోధి,
4 ఉపాలంభించిన-నిందింపఁగా.

ద్రోవం జాలుదు రెవ్విధానమున సంతోషింప శోకింప నా
దైవం బేమి? [1]కరస్థలామలక మే! దర్పోక్తులుం బాడియే? 353

ఆ. జయము లపజయములు, సంపద లాపద లనిలచలితదీపికాంచలములు
చంద్రకళలు మేఘచయములు దరఁగలు మెఱుఁగు లమరవర్య! మిట్టిపడకు. 354

వ. అని యి ట్లాక్షేపించి. 355

క. వీరుఁడు దానవనాథుఁడు [2]నారసముల నింద్రు మేన నాఁటించి మహా
ఘోరాయుధకల్పములగు శూరాలాపములు సెవులఁ జొనిపెన్ మరలన్. 356

వ. ఇట్లు తథ్యవాది యైన బలిచే నిరాకృతుండై. 357

క. శత్రువు నాక్షేపంబునఁ [3]దోత్త్రాహతగజముభంగిఁ ద్రుళ్లచు బలి నా
వృత్రారి వీచి వైచిన గోత్త్రాకృతి నతఁడు నేలఁ గూలె నరేంద్రా! 358

క. చెలికానిపాటు గనుఁగొని బలిసఖుఁడగు జంభుఁ డతులబాహాశక్తిం
జెలితనము సాల నెఱపుచు నిలు నిలుమని [4]వీఁకఁ దాఁకె నిర్జరనాథున్. 359

క. పంచాననవాహనుఁడై చంచద్గద జంభుఁ డెత్తి శైలారిని దాఁ
కించి [5]సురేభంబును నొప్పించి విజృంభించి యార్చి పేర్చెం గడిమిన్. 360

క. వీఁక సెడి ఘనగదాహతిఁ దోఁకయుఁ గదలింపలేక దుస్సహపీడన్
మ్రోఁకరిలఁ బడియె నేలను సోఁ కోర్వక దిగ్గజంబు సుడిసుడిగొంచున్. 361

వ. అయ్యెడ 362

క. సారథి వేఱుహయంబుల తే రాయితపఱిచి తేర దేవేంద్రుఁడు దా
నారోహించెను దైత్యుఁ డుదారత మాతలిని శూలధారం బొడిచెన్. 363

ఆ. శూలనిహతి నొంది స్రుక్కక యార్చిన సూతు వెఱకు మంచు సురవిభుండు
వాసిశిరముఁ దునిమె వజ్రఘాతంబున దైత్యసేనలెల్లఁ దల్లడిల్ల. 364

చ. చని సురనాథుచేఁ గలన జంభుఁడు నచ్చుట నారదుండు సె
ప్పిన విని వానిభ్రాతలు గభీరబలాధికుఁ డా బలుండు పా

1. కరస్థలామలకము.అఱచేతిలోని యుసిరికకాయ, 2. నారసములు-బాణములు, 3. తోత్త్రము—అంకుశము, 4 వీఁక-పరాక్రమము, 5. సురేభంబు — దేవగజము-ఐరావతము.

కనముచు లా పురందరునిఁ గాంచి [1]ఖరోక్తులఁ దూలనాడుచున్
ఘనజలధారలన్ నగముఁ గప్పినచాడ్పునఁ గప్పి రమ్ములన్. 365

సీ విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల నన్నికోలల బలుఁ డదర నేసె
నిన్నూట మాతలి నిన్నూట రథమును నా రీతి నింద్రు [2]ప్రత్యంగకమును
వేధించెఁ; బాకుండు వింట వాఁ డస్త్రంబు లేయుట దొడుగుట యెఱుఁగరాదు;
కనకపుంఖంబులకాండంబు లొకపదియేనింట నముచియు నేసి యార్చె;
ఆ బలిమి నిట్లు ముగురు పగవాని రథసూత సహితు ముంచి రస్త్రజాలములను
[3]వనజలోకసఖుని వానకాలంబున మొగిలుగములు మునుఁగ మూఁగినట్లు. 366

వ. అయ్యవసరంబున 367

మ. అమరారాతుల బాణజాలములపాలై పోయితే చెల్ల రే!
యమరాధీశ్వర! యంచు భిన్నతరులై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబులక్రియన్ దైత్యాధిపవ్యూహమ
ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విపద్ధ్వానంబులం జేయుచున్. 368

శా. 'ఓహో దేవతలార! కుయ్యిడకుఁ; డే నున్నాఁడ' నం [4] [5]చంబుభృ
ద్వాహుం డా శరబద్ధపంజరము నంతం జించి తేజంబునన్
వాహోపేతరథంబుతోడ వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్లన
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచు నా మార్తాండుచందంబునన్. 369

వ. ఇట్లు వెలువడి. 370

చ. [6]విఱిగినసేనఁ గాంచి సురవీరుఁ 'డొహో!' యని బిట్టు చీరి క్ర
మ్మఱఁ బురికొల్పి పాకబలమ స్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసిన తీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వానిచుట్టముల్
వెఱచిరి; తచ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితోన్. 371

వ. అప్పుడు నముచి నిలువంబడి. 372

మ. తనచుట్టంబులఁ జంపెఁ వీఁ డనుచు నుద్యత్క్రోధశోకాత్ముఁడై
కనకాంతంబును నశ్మసారమయమున్ ఘంటానమేతంబునై

---

1 ఖరోక్తులు–పోటుమాటలు 2. ప్రత్యంగముకమును–ఒక్కొక్క అవయవమును
3. వనజలోకసఖుఁడు – సూర్యుడు, 4. చుం బృహద్వాహుం — పాఠాంతరము.
5. అంబుభృద్వాహుండు – మేఘవాహనుఁడగు నింద్రుఁడు, 6. విఱిగిన–వెనుకకువచ్చిన.

జనదృగ్దుస్సహమైన శూలము నొగిన్ సారించి వైచెన్ సురేం
ద్రుసిపై 'దీన హతుండ వౌ' దని మృగేంద్రుం బోలి గర్జించుచున్. 373

శా. ఆకాశంబున వచ్చు శూలమును జంభారాతి ఖండించి, నా
నాకాండంబుల వానికంఠము దెగ [1]దంభోళియున్ వైచె న
స్తోకేంద్రాయుధమున్ సురారిగళముం ద్రుంపంగ లే దయ్యె; వాఁ
డాకంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యముం బొందఁగన్. 374

వ. ఇట్లు నిలిచి యున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం బగుటకు శంకించి బల
భేది దన మనంబున. 375

సీ. 'కొండలఱెక్కలు ఖండించివైచుచో వజ్ర మెన్నఁడు నింత వాఁడి సెడదు;
వృత్రాసురాదుల విదళించుచో నిది దిరుగ దెన్నఁడు పనిఁ దీర్చికాని;
యింద్రుండఁ గానొకో యేను; దంభోళియుఁ గాదొకో యిది; ప్రయోగంబుసెడెనా;
దనుజాధముఁడు మొనతాఁకుఁ దప్పించెనో; [2]భిదురంబు నేఁ డేల బెండువడియె?'
ఆ. ననుచు వజ్రి వగవ 'నార్ద్రశుష్కంబులఁ జావకుండఁ దపము నలిపె నీతఁ;
డితర మెద్ది యైన నింద్ర! ప్రయోగింపు వైరి' ననుచు దివ్యవాణి పలికె. 376

వ. ఇట్లాదేశించిన దివ్యవాణిపలుకు లాకర్ణించి పురందరుండు. 377

ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి యార్ద్రంబు శుష్కంబు గాని సాధనంబు [3]ఫేన మనుచు
నది యమర్చి దాన నమరులు మెచ్చంగ నముచిశిరముఁ ద్రుంచె నాకవిభుఁడు. 378

వ. అయ్యవసరంబున. 379

సీ. పురుహూతు నగ్గించి పుష్పాంజలులు సేసి మునులు దీవించిరి ముదముతోడ;
గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుఁడును బరావసుఁడు నింపెసయఁ బాడి;
రమరాంగనాజను లాడిరి; దేవతాదుందుభులును మ్రోసె [4]దురములోన;
వాయువహ్నికృతాంతవరుణాదులను ప్రతిద్వంద్వుల గెల్చి రుద్దండవృత్తి;
తే. నల్పమృగముల సింహంబు లట్ల తోలి రమరవర్యులు దనుజుల [5]నదటు వాయ
నజుఁడు పుత్తెర నారదుఁ డరుగుదెంచె దైత్యహరణంబు వారింప ధరణినాథ! 380

వ. వచ్చి సురలకు నారదుం డి ట్లనియె. 381

1. దంభోళి-వజ్రాయుధము, 2. భిదురంబు-వజ్రాయుధము, 3. ఫేనము-నురుగు,
4. దురము-యుద్ధము, 5. అదటు-గర్వము.

శా. 'సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్; శ్రీనాథసంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్లవారలును; విద్వేషుల్ మృతిం బొంది; రీ
యుద్ధం బేటికిఁ? నింకఁ జాలుఁ; బనిలే దోహో పురే!' యంచు సం
బద్ధాలాపము లాడి మాన్చె సురలం బాండవ్యవంశాగ్రణీ! 382

వ. ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడిసంగ్రామంబు సాలించి సకలదేవ ముఖ్యులును [1]త్రివిష్టపంబునకుం జనిరి; హతశేషులైన దైత్యదానవులు విపన్నుండైన బలిం దోడ్కొని పశ్చిమశిఖరిశిఖరంబుఁ జేరిరి; విధ్వంసమాన కంధరులై వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుం డమృతసంజీవనియైన తనవిద్య పెంపునం జేసి బ్రదికించె; బలియును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై పరాజితుం డయ్యును లోకతత్త్వవిచక్షణుం డగుటం జేసి దుఃఖింపకయుండె నని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె. 383

సీ. 'కైలాసగిరిమీఁద ఖండేందుభూషణు డొకనాఁడు గొలువున నున్న వేళ
నంగనయై విష్ణుఁ డసురుల వంచించి సురలకు నమృతంబు [2]సూఱలిడుట
విని దేవియును దానువృషభేంద్రగమనుఁడై కడువేడ్క భూతసంఘములు గొలువ
మధుసూదనుఁ డున్న మందిరంబున కేఁగి పురుషోత్తమునిచేతఁ బూజ వడసి
తే. తాను గూర్చుండి పూజించె దనుజవైరిఁ గుశలమే మీకు మాకును గుశలమనుచు
మధురభాషల హరిమీఁదమైత్రినెఱపి హరుఁడు పద్మాక్షుఁజూచి యిట్లనియెఁ బ్రీతి. 384

సీ. దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ! కాలజగద్వ్యాపకస్వరూప!
యఖిలభావములకు నాత్మయు హేతువు నైన యీశ్వరుఁడ; వాద్యంతములకు
మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణమై యమృతమై భూరిసత్య
మానందచిన్మాత్ర, మవికార మాద్య; మనన్య, మశోకంబు, నగుణ, మఖిల
తే. సంభవస్థితిలయముల [3]దంభకంబు నైన బ్రహ్మంబు నీవ; నీ యంఘ్రియుగము
నుభయసంగవిసృష్టులై యున్నమునులు గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు. 385

సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని తలపోసి కొందఱు ధర్మ మనియుఁ,
జర్చించి కొందఱు సదసదీశ్వరుఁ డని సరవిఁ గొందఱు శక్తిసహితుఁ డనియుఁ.
జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుం డధికుఁ డనియుఁ,
దొడరి యూహింతురు, తుది సద్వయద్వయసదసద్విశిష్టసంశ్రయుఁడ వీవు;

---

1. త్రివిష్టపంబు - స్వర్గము, 2. చూఱలిడుట - యథేచ్ఛముగా నిచ్చుట,
3. దంభకంబు-వచించునది.

తే. తలఁప నొక్కింత వస్తుభేదంబు గలదె కంకణాదులు పసిఁడి యొక్కటియ కాదె?
కడలు వెక్కైన వార్ధి యొక్కటియకాదె? భేద మందును నిను వికల్పింపవలదు. 386

సీ. [1]యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు; నిత్యుఁడ వై యున్న నేను నెఱుఁగ
యన్మాయ నంధులై యమరాసురాదులు వనరెద రఁట! యున్నవార లెంత?
యేరూపమునఁ బొంద కేపారుదువు నీవు; రూపి వై నకలంబు రూపు సేయ
రక్షింపఁ జెఱుపఁ గారణ మైన సచరాచరాఖ్యమై విలసిల్లు దంబరమున:
తే. ననిలుఁ డేరీతి విహరించు నట్ల నీవు గలసి వర్తింతు నర్వాత్మకత్వ మొప్ప;
జగములకు నెల్ల బంధమోక్షములు నీవ నీవ నర్వంబుఁ దలపోయ నీరజాక్ష! 387

మ. ఘనతన్ [2]నీమగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁ గన్నార; మే
నిను విన్నారము; చూడ మెన్నఁడును మున్ నీయాఁడుఁజందంబు; మో
హినివై దైత్యులఁ [3]గన్నుఁద్రామి యమృతం బింద్రాదిదేవాళి కి
చ్చిన నీరూపముఁ జూవుమా! కుతుకముం జిత్తంబునం బుట్టెడిన్, 388

క. మగవాఁడవై జగంబులఁ దగిలిచి చిక్కులను బెట్టుదంటకు నీకున్
మగువతనంబున జగములఁ దగులము బొందింప [4]నెంతదడవు ముకుందా! 389

వ. అని పలుకుచున్న శూలపాణిచే నవేక్షితుండై విష్ణుండు భావగంభీరంబగు నవ్వు నివ్వటిల్ల నవ్వామదేవున కిట్లనియె.

శా. 'శ్రీకంఠా! నిను; నీవ యేమఱకుమీ చిత్తంబు రంజించెదన్;
నాకద్వేషుల [5]డాఁగురించుటకునై నాఁ డేను గైకొన్న కాం
తాకారంబు జగన్నిమజ్జనము నీకై చూచెదేఁ జూపెదం;
గైకో నర్హము లింద్రు కాముకులు నంకల్పప్రభావంబులన్.' 391

—: హరి తన మోహినీ రూపంబుచే నీశ్వరుని మోహింపఁ జేయుట :—

వ. అని పలికి కమలలోచనుం డంతర్హితుం డయ్యె; నయ్యుమానహితుం డయిన భవుండు విష్ణుం డెటు వోయెనో, యెందుఁ జొచ్చెనో యని దశదిశలం గలయ నవలోకించు చుండం దనవురోభాగంబున. 392

1. యద్విలాసము - ఎవ్వని వేడుక, 2. మగపోఁడుముల్ - పురుషవిలాసములు, 3. కన్నుఁద్రామి - మోసపుచ్చి, 4. గొంత తడవె - పాఠాంతరము 5 డాఁగురించుట - మోసపుచ్చుట.

సీ. ఒక యెలదోఁటలో నొకవీథి నొకనీడఁ గుచకుంభములమీఁదికొంగు దలగఁ,
గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ జికురజాలంబులు సిక్కువడఁగ,
[1]ననుమానమై మధ్య మల్లాడఁ, జెక్కులఁ గర్ణకుండలకాంతి గంతు లిడఁగ.
[2]నారోహభరమున నడుగులు దడఁబడి దృగ్దీప్తిసంఘంబు దిశలఁ గప్ప,
తే. వామకరమున జాఱిన వలువఁ బట్టి కనకనూపురయుగళంబు గల్లనంగఁ
గంకణంబులఝుణత్కార మెసఁగ బంతిచే నాడు ప్రాయంపుటింతిఁ గనియె. 393

వ. కని మున్ను మగువ మరగి సగమైన మగవాఁ డమ్మగువవయోరూపగుణ విలాసం
బులు దన్ను నూరింప గనుఱెప్ప వ్రేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున 394

శా. 'ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో ? యీ యాఁడురూపంబు ము
న్నే కల్పంబులయందుఁ గాన; మజుఁ డీ యింతిన్ సృజింపంగఁ దా
లే కుం డెల్ల నిజంబు; వల్లభత నీ లీలావతిం జేరఁగా
నే కాంతుండు గలండొ క్రీడలకు నా కీ యింతి సిద్ధించునే?' 395

వ. అని మఱియుం జెఱకువిలుతునిమెఱవడిఁ దరసిన నెఱబిరుదు వెఱంగుపడం దెఱవ
దుఱిమిన తుఱుము బిగిముడివదలి కదలి భుజముల మెడల నదరి చెదరిన కురులు
నొసలిమృగమదతిలకంబుపుటసలు మసల. విసవిస నగుమొగము మెఱుంగులు దశదిశలం
[3]బసలుకొలుపఁ, జిఱునగవు మెఱయ నునుఁజెమటం దడంబడి పులకరములు [4] గులక
రములుగొన, హృదయానందకందంబగుకందుకంబు గరారవిందంబునం దమర్చి,
యక్కునం జేర్చి, చెక్కున హత్తించి, చుబుకంబు మోపి. చూచుకంబులం గదియించి,
నఖంబులు మీటుచు, మెల్లమెల్లన [5] గెల్లాడు కరకమలంబులఁ గనకమణివలయంబుల
ఝుణఝుణ యనం గుచకలశంబు లొండొంటి నొరయ, నెడమఁ గుడిం దడంబడ
గ్రమ్మన నెగురఁ జిమ్ముచు, నెగురఁ జిమ్మి తనకుఁ దానె కొన్ని చిన్నపన్నిదంబులు
సేసికొని బడుగునడుము బెడఁకి వడవడ వడంక [6] నఱితినరులు గలయంబడఁ దిరు
గుచుఁ, దిరుగునెడఁ బెనఁకువలుగొనఁ జెవుల తొడవులరుచులు [7] గటముల నటనములు
నఱుపఁ, బవిరితిరిగి యొడియుచు, నొడిసి కెలంకులన్ జడియుచు, జడిసి జడమువడక
వలువనెఱవు వదలి దిగంబడం గటిస్థలంబునఁ గాంచీకనకమణి కింకిణులు మొరయఁ,
జరణకటకమ్ములు గల్లుగల్లుమనం. గరకంకణమణిగణములు మెఱయ, వెనుకొని

1. అనుమానమై-ఉన్నదా, లేదా యనుసందేహము కలిగించునదై, 2.ఆరోహము-పిరుదు 3. పసలుకొలుప-ప్రకాశింపఁజేయఁగా, 4. గులకరములుగొన-అంకురింపఁగా, 5. గెల్లాడు-చలించు, 6. అఱితిసరులు-మెడలోనిహారములు, 7. గటిరముల—పాఠాంతరము.

యుఱికి పట్టుచుఁ, బట్టి పుడమింబడవైచి పాటు వెంటన మింటి కెగసి గుంటక కరం బునం గరంబు దిరంబయి పలుమఱు నెగయ నడుచుచు, నెగయునెడం దిగంబడుతఱిని నీలంపుమెఱుంగునిగ్గు సోగపగ్గంబులవలలు వైచి రాఁ దిగిచినపగిది వెనుకొనంగ విలోక నజాలంబులు నిగిడించుచు, మగిడించుచుఁ, గరలాఘవంబున నొకటి పది నూఱు వేయి నేసి నేర్పులు వాటించుచు, నరుణచరణకమలరుచుల నుదయశిఖరిశిఖరతరణికరణి సేయుచు, ముఖచంద్ర చంద్రికలఁ జంద్రమండలంబులు గావించుచు, నెడనెడ నురోజదుర్గనిర్గతచేలాంచలంబుఁ జక్క నొత్తుచుఁ, గపోలఫలకాలోల [1] ఘర్మజలబిందు బృందంబుల నఖాంకురంబుల నోసరించుచు, నధరబింబారుణసంభ్రాంతసమాగత రాజకీ రంబులం జోవుచు, ముఖసరోజపరిమళాసక్తమత్త మధుపంబుల నివారించుచు, మందగ మనాభ్యాసకుతూహలాయత్త మరాళయుగ్మంబులకుం దలంగుచు, విలాసవీక్షణానందిత మయూరమిథునంబులకు నెడగలుగుచుఁ, బొదరిండ్ల [2] యీఱమ్ములకుంబోక మలం గుచుఁ, గరకిసలయాస్వాదకాముక [3] కలకంఠ దంపతులకు దూర మగుచుఁ, దీఁగె యుయ్యేలల నూఁగుచు, మాధవీమండపంబు లెక్కుచుఁ, గుసుమరేణుపటలంబుల [4] గుబ్బళ్ల ప్రాఁకుచు, మకరందస్యందబిందుబృందంబు నుత్తరించుచుఁ, గృతకశైలం బుల నారోహించుచుఁ, బల్లవపీఠంబులం బథిశ్రమంబు వుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొదనూపుచు, నున్నత కేతకీస్తంభంబుల నొరగుచుఁ, బుష్పదళరచితవాతాయనంబులం దొంగి చూచుచుఁ, గమలకాండపాలికల నాలంబించుచుఁ, జంపకదేహళిమధ్యంబుల నిలువంబడుచుఁ, గదళికాపత్త్రి కవాటంబున నుద్ఘాటించుచుఁ, బరాగనిర్మితసాలభంజి కానివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంతవేదికల నొలయుచు, రత్నపంజరశారికానివహంబులకుం జదువులు సెప్పుచుఁ, గోరిన క్రియం జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు, మెచ్చినక్రియ వెఱఁగుపడుచు, వెఱఁగుపడినక్రియ మఱచుచు. మఱవక యేకాంతం బగు నవ్వనాంతంబున ననంత విభ్రమంబుల జగన్మో హినియై విహరించుచు నున్న సమయంబున. 396

ఆ. వాలుఁగంటి వాఁడి వాలారుఁజూపుల శూలి ధైర్య మెల్ల [5] గోలుపోయి
తఱలి యెఱుకలేక మఱచె గుణంబుల నాలి మఱచె; నిజగణాలి మఱచె. 397

వ. అప్పుడు. 398

ఆ. ఎగుర వైచి పట్ట నెఱలేమిఁ జేదప్పి ప్రాలుబంతిఁ గొనఁగ వచ్చునెడను
బడఁతివలువ వీడి పడియె మారుతహతిఁ జంద్రధరునిమనము సంచలింప. 399

1. ఘర్మజలము-చెమట, 2 యిఱుములకుం-పాఠాంతరము, 3. కలకంఠము-కోకిల, 4. గుబ్బళ్లు-గుట్టలు, 5. కోలుపోయి-పోఁగొట్టుకొని.

మ. రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ రోమాంచవిభ్రాజితం
గుచభారానమితం గరద్వయపుటీగూఢీకృతాంగిం జల
త్కచబంధం గని మన్మథాతురత నాకంపించి శంభుండు ల
జ్జ చలింపం దనకాంత చూడఁ గదిసెం జంద్రాస్యకేల్దమ్మికిన్. 400

ఆ. పదము సేరవచ్చు ఫాలాక్షుఁ బొడగని చీర వీడి పడిన సిగ్గుతోడ
మగువ నగుచుఁ దరులమాటున డాఁగెను వేల్పుఱేఁడు నబల వెంటఁ బడియె. 401

మ. ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చు లీలన్ శివుం
'డబలా! పోకుము; పోకుమీ యనుచు డాయం బాఱి కెంగేలఁ ద
త్కబరీబంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్ల నోలార్చె నం
త [1]బహిఃప్రక్రియ నెట్టకేలఁ గదియం దద్బాహునిర్ముక్తయై 402

సీ. వీడి వెన్నున నాడు వేణీభరంబుతో జఘనభారాగతశ్రాంతితోడ
మాయావధూటియై మరలి చూచుచుఁ బాఱు విష్ణు నద్భుతకర్ము వెంటఁ దలిగి
యీశాను మరల జయించె మరుం డనఁ గరిణివె న్నను కరికరణిఁ దాల్చి
కొండలు నేఱులుఁ గొలఁకులు వనములు దాటి శంభుఁడు ననం దన్మహాత్ము
తే. నిర్మలామోఘవీర్యంబు నేలమీఁదఁ బడినచో టెల్ల వెండియుఁ బైఁడి యయ్యె;
ధరణి వీర్యంబువడఁ దన్నుఁదా నెఱింగి దేవమాయాజడత్వంబు దెలిసె హరుఁడు. 403

క. జగదాత్మకుఁడగు శంభుఁడు మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్;
[2]విగతత్రపుఁడై నిలిచెను మగువతనం బుడిగి హరియు మగవాఁ డయ్యెన్. 404

ఆ. కాము గెలువవచ్చుఁ; [3]గాలారి గావచ్చు; మృత్యుజయము గలిగి మెఱయవచ్చు;
నాఁడువారిచూపుటంపఱ గెలువంగ వశము గాదు త్రిపురవైరి కైన. 405

వ. ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కి ట్లనియె. 406

సీ. 'నిఖిలదేవోత్తమ ! నీ వొక్కరుఁడు దక్క నెవ్వఁడు నామాయ లెఱుఁగనేర్చు ?
మానిని యైన నామాయచే మునుఁగక ధృతి మోహితుండ వై తెలిసి నీవు;
కాలరూపంబునఁ గాలంబుతోడ నాయందును నీమాయ యధివసించు;
నీమాయ నన్ను జయింప నేరదు; నిజ మకృతాత్ములకు నెల్ల ననుపలభ్య;

1. బహుప్రక్రియ — పాఠాంతరము, 2 విగతత్రపుఁడు — సిగ్గులేనివాఁడు,
3. కాలారి — యమునికి విరోధి.

తే. మిపుడు నీ నిష్ఠ పెంపున నెఱిఁగి' తనుచు సత్కరించిన సఖ్యంబు సాల నెఱపి
దక్షతనయ గణంబులుఁ దన్నుఁ గొలువ భవుఁడు విచ్చేసెఁ దగ నిజభవనమునకు. 407

శా. పారావారముఁ ద్రచ్చుచో గిరినముద్యద్భారమై కచ్ఛపా
కారుండైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప నం
సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముం బొంది వి
స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయున్ భూవరా! 408

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి [1]పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని
ర్మలరేఖల్ విలసిల్లు శ్రీవిభునిఁ దన్మాయావధూరూపముం
దలఁతున్; మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్కరూపంబుగన్. 409

వ. అని చెప్పి శుకుం డి ట్లనియె. 410

తే. నరవరాధీశ! యిప్పుడు నడుచుచున్న వాఁడు సప్తమమనువు వైవస్వతుండు;
శ్రాద్ధదేవుం డనం దగు జనవరేణ్య! [2]పదురు నందను లతనికిఁ బ్రకటబలులు. 411

వ. వార లిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, బృషద్ధ్రుండును, వసుమంతుండును ననువారు పదుగురు రాజులు; పురందరుం డనువాఁ డింద్రుం; డాదిత్యమరుదశ్వి వసు రుద్రసంజ్ఞలు గలవారు దేవతలు; గౌతమకశ్యపాత్రి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ వసిష్ఠు లనువారు సప్తర్షులయి యున్నవా; రందుఁ గశ్యపున కదితిగర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి [3]యింద్రావరజుం డయ్యె; నివ్వి యేడేడు మన్వంతరంబులు సెప్పంబడియె; రాఁగల మన్వంతరంబులును శ్రీహరిపరాక్రమంబునుం జెప్పెద; దత్తావధానుండవై విను మని శుకుం డి ట్లనియె. 412

సీ. జననాథ! సంజ్ఞయు ఛాయయు ననువారు గల రర్కునకు విశ్వకర్మతనయ
లిరువురు [4]వల్లభ లిటమున్న చెప్పితిఁ; బరఁగుఁ దృతీయయు బడబ యనఁగ;
సంజ్ఞకు యముఁడును, శ్రాద్ధదేవుండును, యమునయుఁ బుట్టిరి హర్ష మెనఁగ;
ఛాయకుఁ దపతియు, సావర్ణియును, శనైశ్చరుఁడును గలిగిరి; సంవరణుఁడు

1. పీయూషము—అమృతము, 2. పదురు—పదిమంది, 3. ఇంద్రావరజుఁడు—ఇంద్రునికిఁ దమ్ముఁడు—ఉపేంద్రుఁడు, 4. వల్లభలు—భార్యలు.

తే. దపతి నాలిఁగఁ గైకొనెఁ దా వరించి [1]యశ్వియుగళంబు బడబకు నవతరించె;
వచ్చు నష్టమవసువు సావర్ణి; వాఁడు తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ! 413

క. ఒకవరి సూచిన వెండియు నొకపరి సూడంగ లేక యుండు సిరులకై
యొకనొకని [2]చేటువేళకు నొకఁ డొక్కఁడు మనువుఁ గాచి యుండు నరేంద్రా! 414

వ. సూర్యసావర్ణిమన్వంతరంబున నతని తనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును, సుతపోవిరజోమృతప్రభులనువారు దేవతలును గాఁగలరు; గాలవుండును, దీప్తిమంతుండును, బరశురాముండును, ద్రోణపుత్రుండగు నశ్వత్థామయుఁ, గృపుండును, మజ్జసకుండగు బాదరాయణుండును, ఋశ్యశృంగుండును, సప్తర్షులయ్యెదరు; వార లిప్పుడు దమ తమ యోగబలంబుల నిజాశ్రమ మండలంబులం జరియించుచున్నవారు; విరోచననందనుండగు బలి యింద్రుండయ్యెడు నని చెప్పి శుకుం డిట్లనియె 415

సీ. బలి మున్ను నాకంబు బలిమిమైఁ జేకొన్న వామనుండై హరి వచ్చి వేఁడఁ
బాదత్రయం బిచ్చి భగవన్నిబద్ధుఁడై సురమందిరముకంటె సుభగమైన
సుతలలోకంబున సుస్థితి నున్నాఁడు [3]వెతలేక; యటమీఁద వేదగుహికి
నాసరస్వతికిఁ దా నట సార్వభౌముండు నాఁ బ్రభు వయి, హరి నాకవిభునిఁ
ఆ. బదవిహీనుఁ జేసి బలిఁ దెచ్చి నిలుపును బలియు నిర్జరేంద్రుపదము నొందు;
నింద్రపదము హరికి నిచ్చినకతమున దానఫలము సెడదు ధరణినాథ! 416

వ. అట మీఁదటికాలంబున వరుణనందనుం డగు దక్షసావర్ణి తొమ్మిదవ మనువయ్యెడు; నతనికొడుకులు ధృతకేతు దీప్తకేతుప్రముఖులు రాజులును బరమరీచిగర్గాధులు నిర్జరులును, నద్భుతుం డనువాఁ డింద్రుండును, ద్యుతిమత్ప్రభృతు లగువారలు ఋషులును నయ్యెద రందు. 417

ఆ. దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతునకు జనించి రక్షణంబు సేయ
మూఁడులోకములను మోదంబుతోనేలు నద్భుతాఖ్య నొప్పు నమరవిభుఁడు. 418

వ. మఱియు నుపశ్లోకసుతుం డగు బ్రహ్మసావర్ణి దశమమను వయ్యెడిఁ; దత్పుత్రులు భూరిషేణాదులు భూపతులును, హవిష్మత్ప్రముఖులు మునులును, శంభుం డనువాఁ డింద్రుండును, విబుద్ధాద్యులు నిర్జరులును నయ్యెద; రందు. 419

ఆ. విశ్వసృజునియింట విభుఁడు విషూచికి సంభవించు నంశసహితుఁ డగుచుఁ;
జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ డనఁగ జగముఁ గాచు నవనినాథ! 420

1. అశ్వియుగళంబు—ఇద్దఱశ్వినీదేవతలు, 2. చేటువేళ—ఆపత్సమయము, 3. తెలఁగొప్ప నటమీఁద—పాఠాంతరము.

వ. మఱియుం [1]దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవమను వయ్యెడి; మను
తనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణిపతులును, విహంగమకామగమననిర్మాణ
రుచు లనువారు సురలును, వైధృతుం డనువాఁ డింద్రుండును, నరుణాదులు ఋషులును
నయ్యెద; రందు. 421

ఆ. అంబుజాతనేత్రుఁ డా సూర్యసూనుఁ డై ధర్మసేతు వనఁగఁ దగ జనించి
వైభవాఢ్యుఁ డగుచు వైధృతుఁ [2]డలరంగఁ గరుణఁ ద్రిజగములను గావఁగలఁడు. 422

వ. మఱియుఁ [3]దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవమను వయ్యెడి; నతని
నందనులు దేవవదుపదేవ దేవశ్రేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతుధాముం డనువాఁ
డింద్రుండును, హరితాదులు వేల్పులును, దపోమూర్తితపాగ్నీధ్రకాదులు ఋషులును
నయ్యెద; రందు. 423

ఆ. జలజలోచనుండు సత్యతపస్సూనృతలకు సంభవించుఁ దనయుఁ డగుచు;
ధరణిఁ గాచు నంచితస్వధామాఖ్యుఁ డై మనువు సంతసింప మానవేంద్ర! 424

వ. మఱియుం [4]దదేష్యత్కాలంబున నాత్మవంతుండగు దేవసావర్ణి పదుమూఁడవమను
వయ్యెడి; మనుకుమారకులు చిత్రసేనవిచిత్రాదులు జగతీనాయకులును, సుకర్మసుత్రామ
సంజ్ఞలు గలవారు [5]బృందారకులును, దివస్పతి యనువాఁ డింద్రుండును, నిర్మోహతత్త్వ
దర్శాద్యులు ఋషులును నయ్యెద; రందు. 425

ఆ. ధరణి దేవహోత్ర దయితకు బృహతికి యోగవిభుఁడు వాఁగ నుద్భవించి
వనజనేత్రుఁ డా దివస్పతి కెంతయు సౌఖ్య మాచరించు జగతినాథ! 426

వ. మఱియు నట వచ్చు కాలంబున నింద్రసావర్ణి పదునాలవమను వయ్యెడి; మనునంద
నులు గంభీరవస్త్వాదులు రాజులును, బవిత్రచాక్షుష లనువారు దేవగణంబులును, శుచి
యనువాఁ డింద్రుండును, సగ్నిబాహుశుచిశుక్రమాగధాదులు ఋషులును నయ్యెద;
రందు. 427

తే. తనర సత్రాయణునకు వితానయందు భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ
విస్తరించుఁ [6]గ్రియాతంతువిసరములను నాకవాసుల ముద మంద నరవరేణ్య! 428

1. తదాగమిష్యత్కాలంబు-అతనికిఁ దర్వాత వచ్చెడికాలము, 2 డేలంగ-పాఠాం
తరము, 3. తద్భవిష్యత్సమయంబు-అతనికిఁ దర్వాత రాఁగల కాలము, 4. తదేష్యత్కా
లంబు-అతనికిఁ దర్వాతికాలము, 5. బృందారకులు-దేవతలు, 6. క్రియాతంతు విసర
ములు-కార్యసూత్రసమూహములు.

క. జగతీశ! త్రికాలములను బొగడొందు మనుప్రకారములు సెప్పఁబడెం;
దగఁ బదునలువురు మనువులఁ [1]దెగ యుగములు వేయు నడవ దివ మజునకగున్. 429

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగీంద్రున కిట్లనియె. 430

ఆ. ఈ పదంబులందు నీ మనుప్రముఖుల నెవ్వ [2]రనుచు? వార లేమికతన
నధికవిభవులైరి? హరి యేల జనియించె? నెఱుఁగఁ బలుకు నాకు సిద్ధచరిత!

వ. అనినం బారాశర్యకుమారుం డిట్లనియె. 432

సీ. మనువులు, మునులును, మనుసుతు, లింద్రులు నమరులు, హరియాజ్ఞ నడఁగువారు;
యజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు; లా మనువులు దత్సహాయశక్తి
జగముల నడపుదు; రొగి నాలుగుయుగముల కడపడఁ గాలు[3]సంగ్రస్తమైన
నిగమచయంబును నిజతపోబలముల మరలఁ గాంతురు ఋషివరులు; దొంటి
తే పగిది ధర్మంబు నాల్గు పాదములును గలిగి వర్తిల్లు; మనువులు గమలనేత్రు
నాజ్ఞఁ దిరుగుదు; రేలుదు రవనిపతులు, జగతి భాగించి తమతమసమయములను. 433

వ మఱియుం బ్రాపులయినవారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను,
హరి ప్రతిష్ఠించుచుండు; వారలు విహితకర్మంబుల జగత్త్రియంబును బరిపాలింతురు;
లోకంబులు సువృష్టులై యుండు. 434

సీ యోగీశరూపుఁడై యోగంబు జూపుచు మౌనిరూపమునఁ గర్మంబు దాల్చి;
సర్గంబు సేయుఁ బ్రజాపతిరూపుఁడై; యింద్రుఁడై దైత్యుల నే పడంచు;
జ్ఞానంబు నెఱిఁగించుఁ; జతురసిద్ధాకృతిఁ గాలరూపమునఁ బాకంబు సేయుఁ
నానావిధము లైన నామరూపంబులఁ గర్మలోచనులకుఁ గానఁబడఁడు;

ఆ. చనిన రూపములను జను రూపముల నింకఁ జనఁగనున్న రూపచయము నతఁడు
వివిధుఁడై యనేకవృత్తుల వెలిఁగించు విష్ణుఁ డవ్యయుండు విమలచరిత! 435

—: వామన చరిత్ర కథా ప్రారంభము :—

వ. అనిన భూవరుం డిట్లనియె 436

మ. బలి నంభోరుహనేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడె? ని
శ్చలుఁడుం బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమానందప్రన్నుఁ [4]డై తాఁ [5]బర

1. తెగన్-నశింపఁగా, 2. అనుచు-పంపును, 3, సంగ్రస్తము - మ్రింగబడినది,
4. డున్నై పర - పాఠాంతరము, 5. పరస్థలి - ఇతరుల (విరోధుల) చోటు.

స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం? ద ప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధన మేల చేసెను? వినం గౌతూహలం బయ్యెడిన్. 437

వ. అనిన శుకుం డి ట్లనియె. 438

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే బలి యెట్టకేలకు బ్రదికి వారి
చిత్తంబు రాఁ గొల్చి శిష్యుఁడై వర్తింప వారు నాతనిభక్తివలన మెచ్చి
విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప భవ్యకాంచనపట్టబద్ధరథము
[1]నర్కవాజులఁ బోలు హరులఁ [2]గంఠీరవధ్వజము, మహాదివ్యధనువుఁ, బూర్ణ
తే. తూణయుగళంబుఁ, గవచంబుఁ, దొలుత హోమ పావకుం డిచ్చె నమ్లానపద్మమాలఁ
[3]గలుషహరుఁడగు తనతాత కరుణ నొసఁగె సోమసంకాశశంఖంబు శుక్రుఁడిచ్చె. 439

వ ఇవ్విధంబున. 440

క. పాణియు రథియుఁ గృపాణియుఁ దూణియు ధన్వియును [4]స్రగ్వి తురగియు దేహ
త్రాణియు ధిక్కృతవిమత ప్రాణియు మణికనకవలయపాణియు నగుచున్. 441

మ. బలుదానంబుల విప్రులం దనిపి తత్పద్భోక్తులం బొంది పె
ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి ని
ర్మలుఁ బ్రహ్లాదుసఁ జీరి నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై
వెలిఁగెన్ దానవభర్తశైలశిఖరోద్వేల్లద్దవాగ్ని ప్రభన్. 442

క. దండితమృత్యుకృతాంతులు ఖండితసురసిద్ధసాధ్యగంధర్వాదుల్
పిండితదిశు లసురాహిత దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్. 443

క. చూపుల గగనము మ్రింగుచు నేపున దివి భువియు [5]నాతలీతల సేయన్
రూపించుచు దనుజేంద్రుఁడు ప్రాపించెను దివిజనగరపథము నరేంద్రా ! 444

వ. ఇట్లు బలవంతుండగు బలి సురేంద్రుని సాధింప నమకట్టి దండగమనంబులు సేసి నిడుద
పయనంబులం జని చని. 445

మ. కనియెం బుణ్యజనౌకమున్ విగతరోగస్వప్నపీడాన్న భా
దనసంశోకముఁ బుష్పపల్లవ ఫలోద్దామద్రుమానీకమున్

3. అర్కవాజులు - సూర్యుని గుఱ్ఱములు, 4. కంఠీరవధ్వజము - సింహధ్వజము
1. గమలజుఁడిచ్చెనతనికిఁ గరుణతోడ — పాఠాంతరము, 2. స్రగ్వి — హారముకలవాఁడు,
8. అతలీతల — తలక్రిందులు,

[1]స్వనితోద్ధూతపతాకముం బ్రవిచరద్వైమానికానీకమున్
ఘనగంగానలిలైకమున్ మఘవయుక్తశ్రీకమున్ [2]నాకమున్ 443

వ. కనిరక్కసులఱేఁడు వెక్కసంబై [3]చాల్పు గల వేల్పులనెలవు దఱియం జొచ్చి, చెచ్చెర ముందటికిం జని నని, ముందట నెడపడక మొనమోని యిగురుచు చిగురు తలిరాకు జొంపంబు నన మొగుడు మొగ్గ యరవిరి నెఱవిరిగుత్తి పిందె పూఁప దోరగాయ పండు గెల [4]కతంబుల [5]వ్రేఁగులాఁగలేక మూఁగివీఁగి వ్రేఁకలగు మ్రాఁకులప్రోకలకుఁ బేఁటలగు పెందోఁటలును, దోఁటల గాటంబులై నిప్పటిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు విప్పక [6]కసిమసలు గలిగి మసరి కొసరి పూని పోనితేనియ లాని విసరు గలిగి మసరు కవిసి క్రొవ్వి [7]రిమ్మగొని ఝుమ్ముఝుమ్మనుచు ఝంఝాటించు తేఁటిదాఁటులును, దాఁటు వడక నాఁటుకొని కూడి జోడువీడక క్రొమ్మావుల కమ్మనికొమ్మల నిమ్ముల ముసరి వసిమి గల కిసలయమ్ములు వొసంగ మెసంగి [8]కిసరువడక కసరు సెడి బిట్టరట్టడి తనంబు లలమి [9]కరాళించు కోయిలల మొత్తంబులును, మొత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ దత్తఱంబునం దియ్యని పండ్లకుఁ గయ్యంబులు సేసి చయ్యన సేసరేఁగి బేసంబులు [10]గాసంబులుగొని వానికెక్కు వలుబాసలాడుచు బహుప్రకారంబులగు కీరంబులును, కీరంబులకు నరిగడచి మింటి నంట నెగసి పెట్టలం బట్టి చీర యిట్టట్టుఁ జనక నెట్టుకొని నెలవుల వ్రాలుచు నింపుగల రవమ్ములుగలుగు [11]కలరవమ్ములును, [12]గలరవమ్ము లలరం గొలంకుల కొలంకులకెలంకులఁ గడంకలం బ్రియల నిడుకొని క్రమ్మి దొమ్మిసేసి యెలదమ్మి తూఁడుల వాఁడులగు చంచువులం జించి మెక్కి చొక్కి మిక్కిలి కలఁకలం బడుచు నలబలంబులు సేయు కలహంసంబులును, హంసరుచిజనిత వికసనముల వికవిక నగుచుం బస గలిగి మినమిన మెఱచు పసిఁడికెందమ్ము లిందిరామందిరమ్ములచందమ్ములుగ నందమ్ములగు కొలంకులును, కొలంకుల [13]కరళ్లఁ దడిసి వడవడ వడంకుచునల్లిబిల్లులు గొని సాఁగిన తీగెయిండ్ల గండ్లయొఱములం దోరములు సెడి వలువిరుల కమ్మవలపుల వ్రేఁగునం దూఱలేక యొడిగిలంబడు గాడ్పులును, గాడ్పులవలన నెగసి గగనమున విరిసి పలువన్నెలం జెన్నగు మేలుకట్టుఁబుట్టంబుల తెఱంగున దట్టంబులయిన కుసుమపరాగంబులును, బరాగంబుల సరాగంబులగు వాఁగు వ్రంతలచెంతల గుంపులుగొని గఱిక

---

1. స్వనిత - ధ్వనిచేయు, 2. నాకము-స్వర్గము, 3. చాల్పు - వైశాల్యము, 4. కతఁబులు - కారణములు, 5 వ్రేఁగు - బరువు. 6 కసిమసలు - విజృంభణము, 7. రెమ్మలు గొని - పాఠాంతరము, 8. కిసరు - చూపోపమి, 9 కరాళించు - బొబ్బలిడు, 10. గాసంబులుగొని - తిని 11. కలరవమ్ములు-పావురములు, 12. లమరం దల్లఁ కొన్ని కొలకుల - పాఠాంతరము, 13. కరళ్లు-అలలు.

జొంపంబుల లంపులు దిని మంపులుగొని పెల్లు నెమర్లువెట్టుచు నొదుఁగుల పొదుఁగులు గదల వాడలవాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకం గూడుకొని యిండ్ల వాకిండ్లకుఁజేరి పౌరులకోరికల ననుసారికలగుచు నమృతంబు గురియు కామధేనువులును, గామధేనువులకునిలువ నీడ లగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బుడుకు కల్పతరువులును, కల్పతరువుల పల్లవమంజరులఁ గుంజరులకువిఱిచి యిచ్చుచు మచ్చికల కలిమి నిచ్చ మెచ్చుచుఁ గృతకగిరులచఱులసిరులనడరు పడఁతులనడలకుగురువు లగుచు మెఱయు మరువుల నొత్తరించు మత్తేభంబులును, నిభంబులసరన నొరసికొని వరుసఁ బరసఁగనము లెదలి సుకరములగు మకరతోరణస్తంభంబులును, తోరణ స్తంభంబులఁజేరువ నిలిచి చెఱకువిలుతుం డొఱ వెఱికిన బెడిదములగు నవకంవుమెఱుఁగుం జిగురు [1]టడిదములంతెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపలసొంపునం గరచర బాదిశాఖలు గల చంద్రరేఖలపోఁడిమిని వాహిని గల మోహినీ విద్య [2]గ్రద్దనఁ జూపులకుం దీపులొదవించుచు మర్మకర్మంబువశంబు లరయు యశంబు గలిగి యనూ నంబులగు విమానంబు లెక్కి చచ్చివచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురుచని [3]తూకొని తోకొనిపోవు రంభాదికుఁభికుఁభకుచలకలకలంబులును, గలహంసకారండవ కోకసారసబృంద సుందర సుందరియు నిందీవరారవిందనంద దిందిందిరయు నభంగ యునగు గంగ నింగికిం బొంగెనో యని మిగుల దిగులపడఁ బొగడ్తల కెక్కిన యగ డ్తలును, నగడ్తలమిన్నేటి తేటనీట నీటులీను పాటి నూటిచల్లులాటల మేటికూటువలు గొనచు నేచిన ఖేచర కన్యకావారంబులును, వారవనితానుహూ జిత రాజిత దేహళిపాట వంబులగు గోపురకనకకవాటంబులును, గవాట వేదికాఘటిత మణిగణకిరణోదారంబు లగు నింద్రనీల స్తంభగంభీరతలును, గంభీర విమలకమలరాగ పాలికామాలికావారంబు లగు చతుర్ద్వారంబులును ద్వారదేశంబుల చావిళ్లం [4]గావళ్లుండి ప్రొద్దువోక రక్కసుల వేల్పుల కయ్యంబులు నెయ్యంబులం జెప్పికొనుచున్న యస్త్రశస్త్రధారులు శూరులునయిన మహాద్వారపాలకవీరులును, వీరరసజలధివేలోదారంబులయి శుద్ధ స్ఫటికబద్ధమహో త్తానంబులగు సోపానసుభగాకారంబులును, సుభగాకార ప్రదీప్రంబులగు వజ్రమహారజత వప్రంబులును, వప్రోపరివజ్రకుడ్యశిరోభాగ చంద్రకాంతతరుణహిమకరకిరణముఖ రంబులగు సాలశిఖరంబులను, శిఖర స్తోమధామనికృత్తతారకంబులును, దారతారమణి శిలాకతోరంబు లగుచు మిగుల [5]గరిత యగు నగరిసిరి [6]మీఱ నమరు మొగులు వొడగని నిలుకడలకు నలువనడిగికొని వడసిన పసిండి తెరలవలువల బెడంగునం దోరం

1. అడిదములు-కత్తులు, 2. గ్రద్దన-వేగముగా, 3. తూకొని-గౌరవించి 4. కావళ్ళుండి- రక్షణలకైయుండి, 5 గరిత-యువతి. 6. పరిమితి గల మొగములు— పాఠాంతరము,

బులగు ప్రాకారంబులును, ప్రాకారకాంచనాంచితయుద్ధసన్నద్ధమహోఖర్వ గంధర్వ వాహినీ పాలకంబులగు మరక [1]అట్టాలకంబులును, నట్టాలకోత్తుంగవజ్రమయ స్తంభోదంచనంబులును, బరభటప్రాణవంచనంబులు సముదంచనంబులు నగు [2]దంచనంబులును, దంచనంబులతుదను రథంబులయిరుసులు నొరసికొనంగోట యీవలియావలి తివియని దివి యలకరణి రుచిరములగుచుఁ బచరించు [3]నహిమకరహిమకరమండలంబులును, హిమకరమండలంబు నిద్దంపుటద్దంబని మూఁగి తొంగి చూచుచు నళికఫలకంబులఁ గులకములుగొను నలకములం దరపి తిలకములం దెఱఁగుఱుచుకొనుసమయముల వెనుక నొదిఁగి కదిసి ముకురంబులం బ్రతిఫలితులైన పతులితర సతులరతుల కనుషతులని [4]కనుకనిన్ మరలి నీడ తలంగినం గలఁగి చని కాంతులు వొలయ ముగుదలకు నేకాంతంబులై గగనసముత్సేధంబులైన రాజసౌధంబులును, సౌధంబులసీమల ముత్తియంపుసరులతోడి నిబ్బరపుగుబ్బచన్నులు చెన్నులం బ్రక్కలం జుక్కపదుపులుండ మండిత సౌధశిఖరంబులకు శృంగారంబులయిన [5]భృంగారంబులును, భృంగారశయనజాలక డోలికానిశ్రేణికాదివిశేషరమ్యంబులైన హర్మ్యంబులును, హర్మ్యకనకగవాక్షరంధ్రనిర్గత కర్పూరకుంకుమాగురుధూపధూమంబులను, ధూమంబులు జీమూతస్తోమంబు లని ప్రేమంబులుబ్బ గొబ్బునం [6]దబ్బాటు వబ్బంబు లబ్బె నని మరలుగొని పురులవన్నియల సిరులునరులుగొనం గుటవిటపములం దటపెట నటించుచుం బలుకులు విరిసి కికురువొడుచు [7]వలఱేనిమఱువుఁ జదువులటీకలనం గేకలిడు నెమిళ్లును, నెమిళ్ల పురుల నారలు నారులగు రతనంపువీఁడ్లనినదములను తలంపులం దోఁకలు జడిసి వీఁకలు మెఱసి మూఁకలు గొని దివి కెగరి రవికిం గవిసిన రాహువుక్రియం దివిఁ దడంబడు [8]పడగలును, బడగలును గొడుగులును దమకు నాలంబులకు నడియాలంబులుగఁ దోరంబులైన సారంబుల బీరంబులు మెఱసి బెబ్బులుల గబ్బునం గరులసిరుల సింగంబులభంగుల శరభంబులరభసంబుల ధూమకేతువులరీతుల వైరిం జీరికిఁగొనక శంక లుడిగి ఱంకెలిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు రక్కసులచక్కడ యెక్కటికయ్యముల దయ్యములెఱుంగం దిరుగు వీరభటకదంబంబులును, గదంకరవాలశూలాదుల మెఱుంగులు మెఱుపుల తెఱంగుల దిశలచెఱంగులం దఱంగలింప నేమినినదంబులు దరములగు నుఱుములుగ నడ మొగిళ్ల పెల్లునం బ్రవర్షిత రథికమనోరథంబులగు రథంబులగములును, లగములుగొని గమనవేగములవలన హరిహరుఁ జాలింనగి గాలిం బడం గేలికొనిఘనంబులగు మనం

---

1. అట్టాలకంబులు-కోటబురుజులు, 2. దంచనంబులు-గుండ్లనుపయోగించు శిలాయంత్రములు. 3. అహిమకరుఁడు-సూర్యుడు, 4. కనుకని-తత్తఱపాటు, 5. భృగారంబులు-బంగారుకలశములు, 7. గిడ్వాటు - పాఠాంతరము, 8. వలఱేఁడు-మన్మథుఁడు, పడగలు-పతాకలు.

బులం దెగడి నెగడు సురంగంబులగు తురంగంబులును, రంగదుత్తుంగవిశదమదకల కరటికటతటజనిత మదసలిలకణగణవిగళితదశశతనయనభుజపరశ మిళితలలితనిఖిల దిగధిపతి శుభకరకరకనకకటకఘటితమణిసముదయసముదిత రేణువర్గదుర్గమంబు లయిన నిర్వక్రమార్గంబులును, మార్గస్థలోపరిగతాగత శతశతాయుతానేక గణనాతీతరోహణా చలతటవిరాజమానంబులగు విమానంబులును, విమానవిహరమాణ సుందరసుందరీ సందోహ సంవాదిత భూరిభేరీవీణాపణవమృదంగకాహళశంఖాదివాదనాసూన గానసాహిత్య నృత్యవిశేషంబులును, విశేషరత్నసంఘటితశృంగార [1]శృంగాటక వాటికాదేహ దేహళీ ప్రదీపంబులును, దీపాయమానమానిత సభామండప ఖచిత రుచిరచింతారత్నంబులునుం గలిగి [1]రత్నాకరంబునుంబోలె [3]సనిమిషకౌశిక వాహినీవిశ్రుతంబయి, శ్రుతివాక్యంబునుం బోలె నకల్మష సువర్ణప్రభూతంబయి, భూతపతికంఠంబునుంబోలె భోగిరాజకాంతంబయి కాంతాకుచంబునుంబోలె సువృత్తంబయి, వృత్తజాతంబునుంబోలె సదాగురులఘునియ మాభిరామంబయి, రామచంద్రుని తేజంబునుంబోలె ఖరదూషణాదిదోషాచరానుపలబ్ధం బయి, లబ్ధవర్ణుచరిత్రంబునుంబోలె నమలాంతరంగద్యోత మానంబయి మానధనుని నడ వడియునుంబోలె సన్మార్గభాతిసుందరంబయి, సుందరోద్యానంబునుంబోలె [4]రంభాంచితా శోక [5]పున్నాగంబయి, పున్నాంగంబునుంబోలె సురభిసుమనోవిశేషంబయి, శేషాహి మస్తంబునుంబోలె నున్నతక్షమావిశారదంబయి, [6]శారదసముదయంబునుంబోలె [7]ధవళ జీమూత ప్రకాశితంబయి, సితేతరాజినదానంబును బోలె సరసతిలోత్తమంబై, యుత్తమ పురుషవచనంబునుంబోలె ననేకసుధారసప్రవర్షంబై, వర్షాదియునుం బోలె [8]నుల్లసదింద్ర గోపంబయి, గోపతిమూఁపురంబునుంబోలె [9]విచక్షురార్యాలంకృతంబయి, కృతార్థ బయిన యమరావతీనామనగరంబు సేరం జని కోటచుట్టునుం బట్టు గలుగ బలంబులఁ జలంబున విడియం బంచి పొంచి మార్గంబు లెల్ల నరికట్టుకొని యేమఱక యుండె; నంత. 447

క. మాయరు నగవులకును; గను మూయరు; కాలంబుకతన ముదియరు; ఖలులన్
డాయరు; పుణ్యజనంబులఁ బాయరు సురరాజువీటి ప్రమదాజనముల్. 448

వ. అప్పుడు. 449

1. శృంగాటకము-చతుష్పథము-నాల్గుమార్గములు కలియుచోటు, 2. రత్నా కరంబు-సముద్రము, 3. అనిమిష-చేఁప, దేవత, 4. రంభ-ఒక అప్సరస, అరఁటి, 5. పున్నాగము-మగయేనుఁగు, పొన్న, 6. శారదసముదయంబు-శరత్కాలము, 7. ధవళజీమూతము-తెల్లమబ్బు, 8. ఉల్లసదింద్రగోపంబు-ప్రకాశించు ఆరుద్రపురుగులు కలది, ప్రకాశించు రక్షకుఁడగు ఇంద్రుఁడుకలది, 9. విచక్షురార్యాలంకృతంబు- పార్వతీపరమేశ్వరులచే అలంకరింపఁబడినది, దేవతలచే అలంకరింపఁబడినది.

క. దుర్భరదానవశంఖావిర్భూతధ్వనులు నిండి విబుధేంద్రవధూ
గర్భములు పగిలి లోపలి యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్. 450

వ. అంత. 451

సీ. బలి వచ్చి విడియుట బలభేది వీక్షించి గట్టిగాఁ గోటకుఁ గాపు వెట్టి,
దేవవీరులుఁ దాను దేవతామంత్రిని రప్పించి సురవైరిరాకఁ జెప్పి,
'ప్రళయానలునిభంగి భాసిల్లుచున్నాఁడు; ఘోరరాక్షసులను గూడినాఁడు;
మన కోడి చని నేఁడు మరల వీఁ డేతెంచె; నేతపంబున వీని కింత వచ్చె?
ఆ నీదురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె? నింక వీని గెల్వ నేది త్రోవ?
యేమి సేయువార? మెక్కడి మగఁటిమి? నెదురు మోహరింప నెవ్వఁ డోపు? 452

క. మ్రింగెడు నాకాశంబును బొంగెడు [1]నమరాద్రికంటెఁ బొడవై వీఁడున్
మ్రింగెడుఁ; గాలాంతకుక్రియ భంగించును మరలఁ బద్మఁ బంకజగర్భున్. 453

క. ఈరాదు రాజ్య మెల్లను బోరాదు రణంబు సేయఁ; బోయితిమేనిన్
రారాదు దనుజుచేతను జారా; దిట మీఁద నేమి జాడ మహాత్మా !' 454

ఆ. అనిన సురరాజునకు నాచార్యుం డిట్లనియె. 455

సీ. 'వినవయ్య దేవేంద్ర! వీనికి సంపద బ్రహ్మవాదులు భృగుప్రవరు లర్థి
నిచ్చిరి; రాక్షసునెదురను నిలువంగ హరి యీశ్వరుఁడు దక్క నన్యజనులు
నీవును నీనముల్ నీకంటెనధికులుఁ జాలరు; రాజ్యంబు సాలు; నీకు
విడిచిపోవుట నీతి విబుధనివాసంబు; విమతులు [2]నలఁగెడువేళ నూచి
తే. మరలి మఱునాఁడు వచ్చుట మామతంబు; విప్రబలమున వీడికి వృద్ధి వచ్చె;
వారిఁ గైకొన కిటమీఁద వాఁడి సెడును దలఁగు మందాఁక రిపుపేరు దడవవలదు. 456

క. పరు గెలువవలయు నొండెను; నరి పోరఁగవలయు నొండెఁ; జా వలె నొండెన్;
నరిగెలుపు మృతియు దొరకమి నరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్. 457

వ. అనినఁ గార్యకాలప్రదర్శి యగు బృహస్పతివచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమతమపొందువట్లకుం జనిరి; బలియునుం బ్రతిభట వివర్జిత యగు [3]దేవధాని [4]నధిష్ఠించి జగత్త్రియంబునుం దనవశంబు సేసికొని విశ్వవిజయుండై పెద్ద

1. అమరాద్రి-మేరువు. 2. నలఁగెడు-కష్టములుపడునట్టి. 3 దేవధాని-దేవతల రాజధాని-అమరావతి. 4. (బ్రతిష్ఠించి-పాఠాంతరము.

కాలంబు రాజ్యంబు సేయుచుండె; శిష్యవత్సలు లగు భృగ్వాదు లతనిచేత శతాశ్వ
మేధంబులు సేయించిరి; తత్కాలంబున. 458

శా. [1]అర్థుల్ వేఁడరు; దాతలుం జెడరు; సర్వారంభముల్ పండుఁ; [2]ప్ర
త్యర్థుల్ లేరు; మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁ; బూ
ర్ణార్థుల్ విప్రులు; వర్షముల్ గురియఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థం బయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశురాజ్యంబునన్. 459

వ. అంత. 460

సీ. తనతనూజుల ప్రోలు దనుజులు గొనుటయు, వేల్పులెల్లను డాఁగ వెడలుటయును,
భావించి [3]సురమాత పరితాపమునఁ బొంది వగ ననాథాకృతి వనరుచుండ
నా యమ్మ పెనిమిటి యగు కశ్యపబ్రహ్మ మఱి యొకనాఁడు సమాధి మాని
తనకుటుంబిని యున్న ధామంబునకు నేఁగి నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వ్రాలి కుంది వాడిన యిల్లాలి పదనవారిజంబువడువుఁ జూచి
చేరఁ దిగిచి మగుపచిబుకంబు పుడుకుచు వారిజాక్షి! యేల వగచె దనుచు. 461

వ. అమ్మహాత్ముం డి ట్లనియె. 462

మ. 'తెఱవా! విప్రులు పూర్ణులే? చెలఁగునే దేవార్చనాచారముల్?
తఱితో వేలుతురే గృహస్థులు? సుతుల్ ధర్మానుసంధానులే?
నెఱి సభ్యాగతికోటి కన్న మిడుదే? నీరంబునుం బోయుదే?
మఱి లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే? పైదలీ! 463

ఆ. అన్నమైనఁ [4]దక్రమైనఁ దోయంబైన శాకమైనఁ దనకు జరుగుకొలఁది
నతిథిజనుల కడ్డ మాడక యిడరేని లేమి! వారు గలిగి లేనివారు. 464

వ. మఱియు. 465

ఆ. నెలఁత! విష్ణునకును నిఖిలదేవాత్మున కాననంబు శిఖియు నవనిసురులు;
వారు దనియఁ దనియు వనజాతలోచనుఁ డతఁడు దనియ జగములన్ని దనియు. 466

క. బిడ్డలు వెఱతురె నీ [5]కలగొడ్డంబులు సేయ కెల్లకోడండ్రును మా
[6]ఱొడ్డారింపక నడతురె [7]యెడ్డము గాకున్న దే మృగేక్షణ! యింటన్! 467

1. అర్థుల్ - యాచకులు 2. ప్రత్యర్థుల్ - విరోధులు, 3 సురమాత - అదితి,
4. తక్రము-మజ్జిగ, 5. అలగొడ్డంబులు - దుండగములు, 6. ఒడ్డారింపక - పలుకక,
7. ఎడ్డము-కష్టపాటు,

వ. అని పలికినం బతికి సతి యి ట్లనియె. 468

ఉ. ప్రేమ యొకింత లేక దితిబిడ్డలు బిడ్డలబిడ్డలున్ మహా
భీమబలాఢ్యులై తనదుబిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామితవైరు లయ్యు నమరావతి నేలుచునున్నవారు; నీ
కే మని విన్నవింతు? హృదయేశ్వర! మేలు దలంచి చూడవే! 469

క. అక్కాచెల్లెం డ్రయ్యును దక్కరు నాతోడిపోరు; దానున్ దితియున్
రక్కసులు సురల మొత్తఁగ నక్కట వల దనదు చూచు నౌనౌ ననుచున్. 470

సీ. [1]ఎండక న్నెఱుఁగని యింద్రునియిల్లాలు పలుపంచలను జాలిఁ బడియె నేఁడు;
త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు;
గలిమి గారాబుబిడ్డలు జయంతాదులు [2]శబరార్భకులవెంటఁ జనిరి నేఁడు;
నమరుల కాధారమగు నమరావతి యసురుల కాటప ట్టయ్యె నేఁడు;
ఆ. బలి జగముల నెల్ల బలియుచున్నాఁడు; వాని గెలువరాదు వానవునకు;
యాగభాగ మెల్ల నతఁ డాహరించుచుఁ, గడఁగి సురల కొక్కకడియు నీఁడు. 471

క. ప్రజలకు నెల్లను నముఁడవు; ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నయ్యుం
బ్రజలందు దుష్టమతులను నిజముగ శిక్షింప వలదె నీవు? మహాత్మా! 472

మ. సురలన్ సభ్యుల నార్తులన్ విర[3]థులన్ శోకంబు వారించి ని
ర్జరధానిన్ నిలువంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్య మే
[4]వెర వేరీతి ఘటిల్లు నట్టిక్రమమున్ వేగంబ చింతింపవే?
కరుణాలోక[5]సుధాఝరిం దనుపవే? కల్యాణసంధాయకా! 473

వ. అనిన మనోవల్లభపలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞాన దృష్టి నవలం
బించి భావికాలకార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యి ట్లనియె. 474

మ. 'జనకుం డెవ్వఁడు? జాతుఁ డెవ్వఁడు? జనుస్థానంబు లెచ్చోటు? నం
జననం బెయ్యది? మేను లే కొలఁది? సంసారంబు లే రూపముల్?
వినుమా యింతయు విష్ణుమాయ దలఁపన్ వే ఱేమియున్ లేదు; [6]మో
హనిబద్ధంబు నిదాన మింతటికి [7]జాయా! విన్నఁబో నేటికిన్? 475

వ. అగు; నయిననుం గాలోచితకార్యంబు సెప్పెద. 476

---

1. ఎండక న్నెఱుఁగని-ఇల్లువిడిచి యెఱుఁగని. 2. శబరార్భకులు - బోయపిల్ల వాండ్రు, 3. థులన్-పాఠాంతరము, 4. వెరవు-ఉపాయము, 5. సుధాంబుధిం-పాఠాంతరము, 6. మోహనిబద్ధం బదిమూల-పాఠాంతరము, 7. జాయ-భార్య.

మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరి సేవసేయు; మతఁడున్ సాంగత్యముం బొంది నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు; నిఖిలార్థావాప్తి సేకూరెడిన్
భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ!' 477

వ. అనిన గృహస్థునకు గృహిణి యి ట్లనియె. 478

క. 'నారాయణుఁ బరమేశ్వరు, నే రీతిఁ దలంతు? మంత్ర మెయ్యది? విహితా
చారంబు లే ప్రకారము? లారాధనకాల మెద్ది? యానతి యీవే.' 479

వ. అనినఁగశ్యపప్రజాజతి నతికిఁ బయోభక్షణం బను వ్రతం బుపదేశించి తత్కాలంబును, దన్మంత్రంబును, దద్విధానంబును, దదువవానదానభోజన ప్రకారంబులును నెఱింగించిన నదితియును ఫాల్గునమాసంబు శుక్లపక్షంబునఁ బ్రథమ దివసంబునన్ దొరఁకొని పంద్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబు సేసి వ్రతాంతంబున నియతయై యున్న యెడఁ జతుర్బాహుండును, పీత వాసుండును శంఖచక్రగదాధరుండునునై నేత్రంబుల [1]కగోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని. 480

క. కన్నులసంతోషాశ్రులు చన్నులపైఁ బఱవఁ, బులకజాలము లెసఁగన్,
నన్నతులును నన్నుతులును నున్నతరుచిఁ జేసి నిటలయుక్తాంజలియై. 481

క. చూపుల శ్రీపతిరూపము, [2]నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై
వాపుచ్చి మందమధురాలాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 482

సీ. 'యజ్ఞేశ! విశ్వంభ! రాచ్యుత! శ్రవణమంగళనామధేయ! లోకస్వరూప
యాపన్నభక్తజనార్తివిఖండన! దీక్షిలోకాధార? తీర్థపాద!
విశ్వోద్భవస్థితివిలయకారణభూత! [3]సంతతానంద! శశ్వద్విలాస!
యాయువు దేహంబు ననుపమలక్ష్మియు వసుధయు దివముఁ [4]త్రివర్గములును
తే. వైదికజ్ఞానయుక్తియు వైరిజయము నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁ గలదె?
వినుతమందార! గుణహార! వేదసార! ప్రణతవత్సల!పద్మాక్ష! పరమపురుష! 483

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి నాక మేలుచున్న నాఁటనుండి
కన్నకడుపు గాక కంటఁ [5]గూరుకు రాదు కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య!' 484

వ. అనిన విని దరహసితవదనుండయి యాశ్రితకామధేను వైన యప్పరమేశ్వరుం డిట్లనియె.

---

1. అగోచరుండు-కానరానివాఁడు, 2. అపోవక-తనివితీరక, 3. సంతతైశ్వర్య - పాఠాంతరము, 4. త్రివర్గములు-ధర్మార్థ కామములు. 5. కూరుకు-నిద్ర.

శా. 'నీకోడం(డ్రును,నీకుమారవరులున్, నీనాథుఁడున్, నీవు [1]సం
శ్లోకింపన్ నతులుం బతుల్ మిగుల నమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్, భవదీయగర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక వుట్టు నీసుతుఁడనై నర్తించి వర్తింపఁగాన్, 486

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునం గాని; సం
చలనం బొందకు; నేను నీనియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్,
బలివిద్వేషియు నా నిలింపగణముం [2]బౌలోమియున్ మెచ్చ దై
త్యుల రాజ్యంబు హరింతు, నింద్రునికి నిత్తున్; దుఃఖ మిం కేటికిన్? 487

క. నీరమణుని సేవింపుము నా రూపము నూనసించి నలి నీ గర్భా
గారంబు వచ్చి చొచ్చెద గారామునఁ బెంపవమ్మ కరుణన్ నన్నున్. 488

క. ఏలింతు దినము సురలను బాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలం
దూలింతు దానవుల నిర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్? 489

వ. అని యిట్లు భక్తజనవరతంత్రుం డగు పురాణపురుషుం డానతిచ్చి తిరోహితుండయ్యె; నయ్యదితియుఁ గృతకృత్యయై నంతోషంబునఁ దన మనోవల్లభుండగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె; నంత నొక్కదినంబున. 490

ఆ. ఘనసమాధినుండి కశ్యపుఁ డచ్యుతు నంశ మాత్మ నొలయ నదితియందుఁ
దనదువీర్య మధికతరము సేర్చెను గాలి శిఖిని దారువందుఁ జేర్చినట్లు 491

వ. ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృతవీర్యప్రతిష్ఠితగర్భయై సురలతల్లి యుల్లంబున నుల్లసిల్లుచునుండె; నంత. 492

క. చలచలనై పిదపిదనై [3]గలలంబై కరుడు గట్టి గళనాళముతోఁ
దల యేర్పడి గర్భంబై నెల మసలం [4]జీరచిక్కె నెలఁతకు నధిపా! 493

క. నెలఁతకుఁ [5]జూలై నెల రెన్నెలలై మఱి మూడు నాల్గునెలలై వరుసన్
నెల లంత కంత కెక్కఁగ, నెలలును దగ్గఱిన నసురనిర్మూలతకున్. 494

క. మహితతరమేఘమాలావిహితాయుతచండభానుబింబప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు గృహిణీగర్భమున శిశువు గ్రీడించె నృపా! 495

---

1. సంశ్లోకింపన్-కొనియాడఁగా, 2. పౌలోమి—ఇంద్రునిభార్యశచీదేవి, 3. కలకలమై —పాఠాంతరము, 4, చీరచిక్కు-గర్భమువచ్చు, 5. చూలు-గర్భము.

క. తనకడుపున నొక [1]యిరువున, వనరుహగర్భాండభాండవనధిచయంబుల్
గొనకొని జగముల నిడుకొని తనుగతిఁ గడు నడఁగి మడఁగి తనరెన్ బెడఁగై. 496

వ. అంత నక్కాంతాతిలకంబు క్రమక్రమంబున, 497

మ. నిలిపెన్ ఉప్పల [2]బృందిమన్, విశదిమన్ నేత్రంబులం, జూచుకం
బుల నాకాళిమ, మేఖలం [3]ద్రఢిమ, నెమ్మో మారఁగాఁ బాండిమన్,
బలిమం జన్నుల, శ్రోణి [4]పాళి గరిమ, న్మధ్యంబునన్ బృంహిమ,
న్లలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్ గర్భదుర్వారమై. 498

క. పెట్టుదురు నుదుట భూతిని బొట్టిడుదురు మేనఁ బట్టుఁబుట్టపుదోయిం
బెట్టుదురు; వేల్పులమ్మకుఁ గట్టుదురు సురక్ష పడఁతిగర్భంబునకున్. 499

వ. ఇవ్విధంబున. 500

తే. విశ్వగర్భుఁడు దనగర్భవివరమందుఁ బూఁటపూఁటకుఁబూర్ణుఁడై పొటకరింప
వ్రేఁకఁజూలాలితనమున వేల్పుఁబెద్ద పొలఁతి కంతట నీళ్లాడు ప్రొద్దులయ్యె. 501

వ. తదనంతరంబున జతురాననుం డరుగుదెంచి యదితిగర్భ పరిభ్రమవిభ్రముం
డగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె. 502

సీ. 'త్రిభువనజయరూఢ! దేవ త్రివిక్రమ! పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ
ప్రీతత్రిణాథ! త్రిపృష్ఠ! జగంబుల కాద్యంతమధ్యంబు లరయ నీవ;
జంగమస్థావరజనాదిహేతువు నీవ కాలంబ పై నిఖిల మాత్మ
లోపల ధరియింతు; లోనిజంతుల నెల్ల [5]స్రోతంబుకోఁ గొని సుందరతను
తే. బ్రహ్మలకు నెల్ల సంభవభవన మీవ దివమునకుఁ బాసి దుర్దశ దిక్కు లేక
శోకవార్ధి మునింగిన సురలకెల్లఁ దేల నాధార మగుచున్న తెప్పవీవ. 503

క. విచ్చేయు మదితిగర్భము చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్
[6]విచ్చలవిడి లేకిమరులు ముచ్చటపడి యున్నవారు ముదమందింపన్. 504

—: వామనమూర్త్యావిర్భావఘట్టము :—

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతిసేయు నయ్యవసరంబున. 505

1. ఇరవు-చోటు, 2 బృందిమము-మనోహరత్వము, 3 గ్రశిమ-పాఠాంతరము,
4. పాళిఁ బ్రథిమన్—పాఠాంతరము, 5. స్రోతంబు - ప్రవాహము, 6. విచ్చలవిడి -
స్వేచ్ఛ.

మ. రవి మధ్యాహ్నమునం జరింప, గ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు [1]శ్రోణ నభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరుమాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్. 506

వ మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండును, పిశంగవర్ణ వస్త్రుం డును, మకరకుండలమండితగండభాగుండును, శ్రీవత్సవక్షుండును, నలినచక్షుండును, నిరంతర శ్రీవిరాజిత [2]రోలంబకదంబాలంబిక వనమాలికా పరిష్కృతుండును, మణికనక కాంచీవలయాంగదకిరీటహారనూపురాలంకృతుండును, గమనీయకంఠకౌస్తుభాభరణుం డును, నిఖిలజనమనోహరుండునునై యవతరించిన సమయంబున. 507

శా. చింతం బాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్;
సంతోషించిరి సాధ్యచారణమునీశబ్రహ్మవిద్యాధరుల్;
గాంతిం జెందిరి భానుచంద్రములు; రంగద్గీతవాద్యంబులన్
గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్. 508

క. దిక్కుల[3]కావిరి వాసెను; నెక్కువ నిర్మలత నొందె నేడుపయోధుల్;
నిక్కమెయి నిలిచె ధరణియుఁ; జుక్కలత్రోవయును విప్రసురసేవ్యములై. 509

క. ముంపుగొని విరులవానల జొంపంబులు గురియు సురలు సుమనోమధువుల్
తుంపర లెగయఁ బరాగపు రొంపుల భూభాగ మతినిరూషిత మయ్యెన్. 510

వ. తదనంతరంబ. 511

ఆ. ఈ మహానుభావుఁ [4]డె ట్లింత కాలంబు నుదరమందు నిలిచి యుండె ననుచు
నదితి వెఱఁగుపడియె నానందజయశబ్దములను గశ్యపుండు మొగి నుతించె. 512

వ. అంత నవ్విభుండు సాయుధసాలంకారంబగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటునిచందంబున నుపనయనవయస్కుండైన వామనబాలకుండై దల్లి ముంగటఁ గుమారసముచితాలాపంబు లాడుచుఁ [5,6]గ్రీడించుసమయంబున నదితియుం దనయవిలోకన పరిణామపారవశ్యంబున. 513

ఆ. నన్నుఁ గన్నతండ్రి! నాపాలిదైవమ! నాతపఃఫలంబ! నాకుమార!
నాదుచిన్నివడుగ! నా కులదీపక! రాఁగదయ్య! భాగ్యరాశి వగుచు. 514

1. శ్రోణ-శ్రవణనక్షత్రము, 2. రోలంబకదంబము-తుమ్మెదలగుంపు, 3. కావిరి-ఉత్సాహమును సూచించు కావిరంగు, 4. డేలకో యీ కాల - పాఠాంతరము. 5. గ్రీడించు .ఆటలాడు, 6. గ్రీడించు-పాఠాంతరము.

క. అన్నా రమ్మని దగ్గఱఁ జన్నులపాలేఱువాఱ నంశ్లేషిణియై
చిన్నారిమొగము నివురుచుఁ గన్నారం జూచెఁ గన్నకడుపై యుంటన్. 515

క. [1]వురు డీబోటికి నిందిర వురు డంటిక గాక యొరులు వురుదే? యనుచున్
బురుటాలికిఁ బదిదినముల పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యవుగరితల్. 516

వ. అంత నబ్బాలునకు నంతనంబున మహర్షులు గశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయనకర్మకలాపంబులు సేయించిరి; [2]సవిత సావిత్రి నుపదేశించె; బృహస్పతి యజ్ఞోపవీతంబును, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి కృష్ణాజినంబును, దండంబు వనస్పతియగు సోముండును, [3]గగనాధిష్ఠానదేవత ఛత్త్రంబును, గమండలువు బ్రహ్మయు, సరస్వతి [4]యక్షమాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి; మఱియును. 517

క. భిక్షాపాత్రిక నిచ్చెను [5]యక్షేశుఁడు వామనునకు; నక్షయ మనుచున్
సాక్షాత్కరించి పెట్టెను భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా! 518

క. శుద్ధబ్రహ్మర్షి సమారాద్ధుండై విహితమంత్రరాజిఁ జదువుచుం
[6]బ్రోద్ధంబగు ననలంబున వృద్ధాచారమున వటుఁడు వేల్చెం గడఁకన్. 519

—: బలిచక్రవర్తికడకు వామనమూర్తి యేతెంచుట :—

వ. ఇట్లు కృతకృత్యుండైన మాయా[7]మాణవకుండు దేశాంతరసమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె. 520

క. వత్తురె విప్రులు? వేఁడఁగ నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం?
దెత్తురె మీరును సంపద? [8]లి త్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ చెవుఁడా. 521

వ. అనిన [9]నఖిలదేశీయు లగు భూసురు లి ట్లనిరి. 522

మ. 'కలరున్ దాతలు; నిత్తురున్ ధనములుం; గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేతెంతురు; గాని [10]యీవిని బలిం బోలన్ వదాన్యుండు లేఁ;
డలఘుండై యొనరించె నధ్వరశతం బా భార్గవానుజ్ఞ చేఁ;
బలి వేఁడం బడయంగవచ్చు బహుసంపల్లాభముల్ వామనా!' 523

---

1. పురుడు-పోలిక, 2. సవిత-సూర్యుఁడు, 3 గగనంబు-గొడుగును-పాఠాంతరము, 4. అక్షమాలిక-జపమాల, 5. యక్షేశుఁడు-కుబేరుఁడు, 6. ప్రోద్ధము-మిగులపరిశోభించునది, 7. మాణవకుండు బ్రహ్మచారి, 8. లి త్తెరవుగ-పాఠాంతరము, 9. నిఖిలదేవజ్ఞు లగు బ్రాహ్మణు లిట్లనిరి-పాఠాంతరము, 10. ఈవి-త్యాగము.

వ. అని తెలియంజెప్పిన బ్రాహ్మణుల వచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతి పుట్టింపం బయనంబై లాభవచనంబులు గైకొనుచుఁ దల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలి. 524

క. ప్రక్షీణదివిజవల్లభరక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం
డా క్షణమున బలియింటికి భిక్షాగమనంబు సేసెఁ బేదఱికముతోన్. 525

క. హరిహరి! సిరి యురమునఁ గల హరి హరిహయుకొఱకు దనుజు నడుగం జనియెం;
బరహితరతిమతియుతులగు దొరలకు నడుగుటయు నొడలితొడవగుఁ బుడమిన్. 526

క. సర్వప్రపంచగురుభరనిర్వాహకుఁ డగుటఁజేసి నెఱిఁ జనుదేరన్
[1]ఖర్వుని ద్రేఁగు సహింపక నుర్వీస్థలి గ్రుంగె; గ్రుంగె మొగ్గె నురగేంద్రుడుండున్. 527

వ. ఇట్లు సని చని. 528

క. [2]శర్మద యమదండక్షతవర్మద నతికఠినముక్తివనితాచేతో
మర్మద నంబునివారితదుర్మద నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్. 529

వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తరతటంబునందు, 530

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబు ను
ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు వే
దండాశ్వధ్వజినీకవాటము మహోద్యద్ధూమసంఛన్న మా
ర్తండస్యందనఘోటమున్ బలిమఖాంతర్వేదికావాటమున్. 531

వ. కని దానవేంద్రుని హయమేధవాటి దఱియంజొచ్చు నయ్యవసరంబున. 532

శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో
[3]దంభాకారత వచ్చెఁ గాక, ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁ డీ
శుంభద్యోతనుఁ డీమనోజ్ఞతనుఁ డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్. 533

క. గుజగుజలు వోవువారును గజిబిజిఁబడువారుఁ జాలఁ గలకలపడుచున్
గజిబిజి యైరి సభాస్థలిఁ బ్రజ లెల్లను బొట్టిపడుగుఁబాపనిరాకన్. 534

1. ఖర్వుఁడు - పొట్టివాఁడు, 2. శర్మద - సుఖమునిచ్చునది, 3. దంభాకారత - మోసపురూపులతో - మారువేసముతో.

వ. ఆ సమయంబున బలిసభామండపంబుఁ దఱియంజొచ్చి. 535

సీ. [1]చవులుగాఁ జెవులకు సామగానంబులు [2]సదువు నుద్గాతలచదువు వినుచు,
మంత్రతంత్రార్థసంబంధభావములు వేర్కొనెడి హోతలతోడఁ గూడికొనుచు,
హోమకుండంబులం దున్న [3]త్రేతాగ్నుల వెలిఁగించు యాజకవితతిఁ గనుచు,
దక్షులై బహువిధాధ్వరవిధానంబులు సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచు,
తే. బెట్టు గోరెడు వేడుక వట్టుపఱుచు నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు
గోరి చరియించె సభలోనఁ గొంతదడవు పుట్టువెన్నుఁడు నెఱుఁగని పొట్టిపడుగు. 536

వ. మఱియును. 537

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు నఱిముఱి గుబురులకుఁజనుచు హరిహరి యనుచున్
మఱుఁగుచు నులుకుచు [4]దిఱదిఱఁ గుఱుమట్టపుఁబొట్టివడుగు గొంత నటించెన్. 538

క. కొందఱతోఁ జర్చించును, గొందఱతో [5]జటలు సెప్పు గోష్ఠిం జేయుం;
గొందఱతోఁ దర్కించును, గొందఱతో ముచ్చటాడుఁ; గొందఱ నవ్వున్. 539

వ. మఱియు ననేకవిధంబుల నందఱకు నన్నిరూపులై వినోదించుచు. 540

క. వెడవెడ నడకలు నడచుచు, నెడనెడ నడు గిడఁగ నదరి యిల దిటఁబడఁగా
బుడిబుడి నొడువులు నొడువుచుఁ [6]జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్, 541

వ. ఇట్లు డగ్గఱి మాయాభిక్షుకుండు రక్షోవల్లభుం జూచి యి ట్లనియె. 542

మ. ఇతఁడే దానచక్రవర్తి సురలోకేంద్రాగ్నికాలాదిది
క్పతిగర్వాపనయప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానామఖ
వ్రతదానప్రపణానువర్తి, సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి, సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి దాన్. 543

వ. అని కుశపవిత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబు సాఁచి యి ట్లనియె. 544

ఉ. [7]స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు, హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునీం

---

1. చవులుగా-రుచ్యములుగా-మధురములగునట్లు, 2. సదివెడు హోతల చదువు వినుచు-పాఠాంతరము, 3. త్రేతాగ్నులు-ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్నిఅను మూఁడగ్నులు, 4. దిరుగుచు-పాఠాంతరము, 5. జంటలు-వేదపఠనములోని ఒక భాగము-(క్రమము-జట-ఘనము అని ఇవి మూఁడు). 6. చిడిముడి-సిగ్గు, 7. స్వస్తి-ఆశీస్సు.

ప్రస్తుతమంగళాధ్వరవిధానవిహర్తకు, నిర్జరీగళ
న్యస్తసువర్ణ సూత్రపరిహర్తకు, దానవలోకభర్తకున్, 545

వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుంబోలె ముందట నకుటి లుండును, జటిలుండును, సదండచ్ఛత్రుండును, గక్షలంబితభిక్షాపాత్రుండును, గరకలిత జలకమండలుండును, మనోహరవదనచంద్రమండలుండును, మాయావాదనటుండును నగు వటువుం గని దినకరకిరణ [1]పిహితంబులైన గ్రహంబులచందంబునం దిరోహితులై భృగువులు గూర్చున్నయెడల లేచి సేమం బడిగి తియ్యనిమాటల నాదరించిరి; బలియును నమస్కరించి తన గద్దియ నునిచి పాదంబులు దుడిచి తనప్రాణపల్లభ పసిండిగిండి నుదకంబులువోయ వడుగుం గొమరుని చరణంబులు గడిగి తడి యొత్తి తత్సమయంబున.

ఆ. వటునిపాద [2]శౌచవారి శిరంబునం బరమభద్ర మనుచు బలి వహించె,
నే జలము గిరీశుం డిందుజూటుండు దేవ [3]దేవుం డుద్వహించె ధృతి శిరమున, 547

వ. మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 548

మ. వడుగా! యెవ్వరివాఁడ? వెవ్వఁడవు? సంవాసస్థలం బెయ్య? ది
య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫల మయ్యెన్ వంశమున్ జన్మమున్;
గడు ధన్యాత్ముఁడనైతి; నీ మఖము యోగ్యం బయ్యె; నాకోరికల్
గడతేఱెన్; సుహుతంబు లయ్యె శిఖులుం; గల్యాణ మిక్కాలమున్, 549

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
[4]హారులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో [5]నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా! 550

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచనివచనంబులు విని సంతోషించి యీశ్వరుం డిట్లనియె. 551

సీ. 'ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు? నొక చోటనక యెందు నుండ నేర్తు;
నెవ్వనివాఁడ నం చేమని పలుకుదు? నాయంతవాఁడనై నడవ నేర్తు;
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ? బూని ముప్పోకలఁ బోవ నేర్తు;
నది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ? నేరుపు లన్నియు నేన నేర్తు;

---

2 పిహితంబులు-కప్పఁబడినవి, 3. శౌచము-శుద్ధి, 4. తాపిభుఁడు దాల్చెఁదన శిరమున. పాఠాంతరము, 5. హారులు-గుఱ్ఱములు. 1. నికేతనములు-గృహములు,

ఆ. నారులు గారు నాకు; నారులకు నే నౌదు; నొంటివాఁడఁ; జుట్ట మొకఁడు లేఁడు;
సిరియుఁ దొల్లి గలదు; చెప్పెద నా [1]టెంకి సుజనులందుఁ దఱచు సొచ్చియుందు. 552

వ. అది య ట్లుండ నిమ్ము. 553

సీ. జననాథ! నీమాట సత్యంబు; సత్కీర్తిదంబుఁ, గులార్హంబు, ధర్మయుతముఁ;
గరుణానువర్తులు ఘనతత్త్వమూర్తులు గాని మీకులమందుఁ గలుగ రొరులు;
రణ [2]భీరువులు [3]వితరణభీరువుల లేరు; ప్రత్యర్థు లర్థులు ప్రబ్బకొనిన
దానశౌండిమముసఁ దనువుదు; రథికులై మీతాత లందఱు మేటిమగలు;
ఆ. మీకులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు మించిచంద్రుమాడ్కి మేలిరుచులఁ
బ్రథితకీర్తితోడ భవదీయవంశంబు నీరరాశిభంగి నెగడుచుండు. 554

వ. తొల్లి మీమూఁదవతాత హిరణ్యాక్షుండు విశ్వజయంబునేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక నంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని [4]నమయించెఁ; దద్భ్రాత యగు హిరణ్యకశిపుం డది విని హరిపరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తన జయంబును బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజమర్దను మందిరంబు నకుంజనియె; నప్పుడు. 555

క. శూలాయుధహస్తుండై కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండుం
గాలజ్ఞత మాయాగుణ శీలత ని ట్లని తలంచెఁ జిత్తములోనన్. 556

మ. ఎదురై పోర జయింప రా దితనిఁ; గా కెందేనినిం బోవ భీ
ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువుక్రియం బై వచ్చు నంచుం గ్రియా
విదుఁ డబ్జాక్షుడు సూక్ష్మరూపమున నావేశించి నిశ్శ్వాసరం
ధ్రదిశన్ దైత్యుహృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁడై. 557

వ. అంత నద్దైత్యవల్లభుండు [5]వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక కోపంబు మానక మిన్ను మన్ను నన్వేషించి, [6]త్రిదివంబున నరసి, దిశలం బరికించి, భూవివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, జగంబున నదృష్ట శత్రుండై [7]మార్గణంబు సాలించి, తనలో నిట్లనియె. 558

క. 'పగవాఁడు మడియనోపును దెగఁడేనిని నెదురువడఁడె? దేహధరులకుం
దెగినయెడఁ బగఱమీఁదను బగ గొనఁ దగ'దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్, 559

1. టెంకి-నివాసము, 2. భీరువు-భయస్వభావుఁడు, 3. వితరణము - త్యాగము,
4. నమయించె-చంపెను. 5. వైష్ణవాలయంబు—విష్ణుని గుడి, 6. త్రిదివంబు-స్వర్గము,
7. మార్గణంబు—వెదకుట.

వ. అతండు మీ ప్రపితామహుం; డతనిగుణంబు లనేకంబులు గల; వవి యట్లుండ నిమ్ము. 560

క. ఆతురభూసురగతిఁ బురు, హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొం డనుచున్
మీతండ్రి యిచ్చె నాయువు [1]నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్? 561

క. ఏలితివి మూఁడుజగములఁ దోలితి వింద్రాదిసురులఁ; దొల్లిటివారిం
బోలితివి దానగుణముల సోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్ 562

వ. అదియునుంగాక. 563

క. రాజ్యంబు గలిగెనేనిం బూజ్యులకును, యాచకులకు, భూమిసురులకున్
భాజ్యముగ బ్రదుకఁడేనిం [2]ద్యాజ్యంబులు వానిజన్మధనగేహంబుల్, 564

క. మున్నెన్నఁడురు వదాన్యుల నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్;
ఇన్నిదినంబులనుండియు నెన్నఁడు నినఁ బెట్టు మనుచు [3][4]నింద్రము సేయన్, 565

ఆ. ఒంటివాఁడ; నాకు నొకటి రెండడుగుల మేర యిమ్ము; సొమ్ము మేర యొల్లఁ;
గోర్కి దీర బ్రహ్మ [5]కూఁకటి ముట్టెడ దానకుతుకసాంద్ర! దానవేంద్ర! 566

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యి ట్లనియె. 567

ఆ. 'ఉన్నమాట లెల్ల నొప్పును విప్రుండ; సత్యగతులు వృద్ధసమ్మతంబు;
లడుగఁ దలఁచి కొంచె మడిగితి వో చెల్లి! దాతపెంపుఁ సొంపుఁ దలఁపవలదె?' 568

వ. అని మఱియు ని ట్లనియె. 569

మ. వసుధాఖండము వేఁడితో? గజములన్ వాంఛించితో? [6]వాజులన్
వెల నూహించితొ? కోరితో యువతులన్ [7]వీక్షించి కాంక్షించితో?
పసిబాలుండవు: నేర వీ వడుగ; నీభాగ్యంబు లీపాటి గా
కసురేంద్రుండు, పదత్రయం బడుగ నీయల్పంబు నీనేర్చునే?' 570

వ. అన మొగంబునం జిఱునగవు మొలకలెత్త గృహమేధికి మేధావి యి ట్లనియె, 571

మ. 'గొడుగో, జన్నిదమో, కమండలువొ, నాకున్ ముంజియో, దండమో,
వడు గే నెక్కడ? భూము లెక్కడ? కరుల్, వామాక్షు, లశ్వంబు లె

1. ఏతన్మాత్రుఁడవె?-మాన్యుఁడవా? 2 సాసొత్యాజ్యంబులు-విడువఁదగినవి - నిరుప యోగములు, 3. ఈంద్రము-బాధించుట, 4 నింట్రము-పాఠాంతరము, 5. కూఁకటి-శిరోభాగము, 6. వాజులు-గుఱ్ఱములు, 7. వీడైన-పాఠాంతరము,

క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదాకాంక్షామితం బైన మూఁ
డడుగుల్ మేరయ [1]త్రోవ కిచ్చు టది బ్రహ్మాండంబు నాపాలికిన్ 572

వ. అదియునుం గాన. 573

క. వ్యాప్తిం బొందక వగవక ప్రాప్తం బగు [2]లేశ మైనఁ బదివే లనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు సప్తద్వీపముల నయినఁ జక్కం బడునే? 574

శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! నా
రాశిప్రావృత మేదినీవలయసామ్రాజ్యంబు సేకూడియుం
గాసిం బొందిరి గాక వైన్యగయభూకాంతాదులు; న్నర్థకా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే. 575

సీ. సంతుష్టుఁ డీ మూఁడుజగములఁ బూజ్యుండు; సంతోషి కెప్పుడు జరుగు సుఖము;
సంతోషి గాకుంట సంసార హేతువు; సంతసంబున ముక్తిసతియు దొరకుఁ;
బూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభతుష్టిని దేజంబు దోన పెరుఁగుఁ;
బరితోషహీనతఁ [3]బ్రభ సెడి పోవును జలధార ననలంబు నమయునట్లు;
ఆ. నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట దగవు గాదు నాకుఁ; దగినకొలఁది
యేను వేఁడికొనిన యీ పదత్రయమును జాలు దనక యిమ్ము; చాలుఁ జాలు! 576

వ. అని యిట్లు పలుకుచున్న భర్వునకు నుర్వీదానంబు సేయం దలంచి కరకలిత సలిలకల
శుండైన యవ్వితరణముఖరునిం గని నిజవిచారయుక్తదనుజరాజ్యచక్రుండగు శుక్రుం
డి ట్లనియె. 577

సీ. 'దనుజేంద్ర! యీతఁడు ధరణీసురుఁడు గాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితిగర్భంబునఁ గశ్యపసూనుఁడై కలిగె; నకట!
యెఱుఁగ కీతనికోర్కి కిచ్చెద నంటివి; దైత్యసంతతి కుపద్రవము వచ్చు;
నీ లక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చుఁ దా వాసవునకు;
ఆ. మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వధనము [4]విష్ణుసంసర్జనము సేసి బడుగుపగిది నెట్లు బ్రదికె దీవు? 578

క. ఒక్కపదంబున భూమియు నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దానై వెక్కసమై యున్న నెందు వెడలెదు చెపుమా! 579

1. త్రోవక-త్రోసిపుచ్చక - తిరస్కరింపక, 2. లేశము-స్వల్పము, 3. ప్రభ-తేజస్సు, 4. విష్ణుసంసర్జనము-విష్ణువునకు విడిచిపెట్టుట.

సీ. ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబు ద్రోవ నీవును సమర్థుఁడవు; గావ
యే దానమున నాశ మే తెంచు నదియును దానంబుగా దండ్రు తత్త్వవిదులు;
దానంబు యజ్ఞంబుఁ దపము గర్మంబును దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ;
దనయింటఁ గల సర్వధనముసు నైదు భాగములుగా విభజించి కామమునకు,
ఆ. నర్థమునకు ధర్మయశముల కాశ్రిత బృందములకు సమతఁ బెట్టునట్టి
పురుషుఁడిందు నందుఁ బూర్ణుఁడై [1]మోదించుఁ దస్నుమాని [2]చేఁత దగవు గాదు- 580

వ. అదియునుంగాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచగీతార్థంబు గల; దొక్కటి సావధానుండ వై యాకర్ణింపుము. 581

సీ. అంగీక [3]రించిన నఖిలంబుఁ బోవుచో నన్ృతంబు గాదు లే దనిన నధిప!
యాత్మవృక్షముమూల మనృతంబు నిశ్చయ మనృతమూలము గల్గ నాత్మ సెడదు;
పుష్పఫలము లాత్మభూజంబునకు నత్య మా మ్రాను బ్రదుకమి నదియుఁ జెడును;
ఫలపుష్పములు లేక పస సెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁ బొందుఁ గాదె?
తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండ నిచ్చు పురుషుండు సెడకుండు నిద్ధచరిత,
కాక యంచితసత్యసంగతి నటంచు నిజధనం బర్థి కిచ్చిన నీకు నేదు. 582

ఆ. సర్వమయినచోట సర్వధనంబులు నడుగ 'లే' దటంచు నన్ృత మాడు
చెనఁటిపంద నేమి సెప్పఁ బ్రాణముతోడి శవము వాఁడు; వానిజన్మ మేల? 583

వ. వఱియు నిం దొక్కవిశేషంబు గలదు; వివరించెద. 584

ఆ. [4]వారిజాక్షులందు వైవాహికములందుఁ బ్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మ రక్షణమందు- బొంక వచ్చు; [5]నఘము వొందఁ దధిప! 585

మ. కులమున్ రాజ్యముఁ దేజరూన్ నిలుపుమీ! [6]కుబ్జుండు విశ్వంభరుం
డలఁతిం బోఁడు; త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండముం
గలఁడే మాన్ప నొకండు? నా వలుకు లాకర్ణింపు కర్ణంబులన్;
వల దీ దానము గీనముం; బనుపుమా [7]వర్ణిన్ వదాన్యోత్తమా! 586

వ. అని యిట్లు హితంబు వలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్రనిమీలిత లోచనుండయి యశస్వి యిట్లనియె. 587

1. మోదించు-సంతోషించును 2. చేఁత-కార్యము-పని, 3 రించెదనన్న సత్యం బైన-పాఠాంతరము. 4. వారిజాక్షులందు-స్త్రీలవిషయమున, 5. అఘము-పాపము, 6. కుబ్జుండు-పొట్టివాఁడు, 7. వర్ణి-బ్రహ్మచారి,

సీ. నిజమానతిచ్చితి; నీవు మహాత్మక ! మహిని గృహస్థధర్మంబు నిదియ ;
యర్థంబుఁగామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు ? పలికి లే దనుకంటెఁ బాప మెద్ది ?
'యెట్టి దుష్కర్ముని వే భరించెదఁ గాని సత్యహీనుని మోవఁ జాల' ననుచుఁ
తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ;సమరమున నుండి తిరుగకఁ జచ్చుకంటె
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె మానధనులకు [1]భద్రంబు మఱియుఁ గలదె? 588

క. ధాత్రిని [2]హలికునకును సు క్షేత్రము బీజము [3]లు నాకటఁ జేకుఱుభంగిం
[4]జిత్రముగ దాత కీవియుఁ బాత్రము నమకూరునట్టి భాగ్యము గలదే ? 589

శా. కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వా రేరీ సిరి మూటకట్టుకొని పోవం జాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా! 590

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ బొడగనఁ జననట్టిపొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట! నను బోఁటికి నిడ రాదె మహానుభావ ! యిష్టార్థంబుల్. 591

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ, దనువుపై, [5]నంసోత్తరీయంబుపైఁ,
బాదాబ్జంబులపైఁ, గపోలతటిపైఁ, బాలిండ్లపై, నూత్నమ
ర్యాదం జెందు కరంబు గ్రిం దగుట. మీఁదై నాకరం బుంట మేల్
గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు [6]నాపాయమే? 592

మ. [7]నిరయంబైన, నిబద్ధమైన, ధరణీనిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ, గులాంతమైన, నిజమున్ రా నిమ్ము; కానిమ్ము పో;
హరుఁడైనన్, హరియైన, నీరజభవుం డభ్యాగతుండైన నాఁ;
దిరుగన్ నేరదు నాదుజిహ్వ; వినుమా! ధీవర్య! వే యేటికిన్?

ఆ. నాడివినంతపట్లు [8]నుసలక యిచ్చునో, నేల కట్టు విష్ణుఁ? డేటిమాట? 593
గట్టితేనిఁ దాన కరుణించి విడుచును, విడువకుండ నిమ్ము విమలచరిత! 594

క. మేరువు దలక్రిం దైనను, బారావారంబు లింకఁబాఱిన, లోలో
భారుణి రజమై పోయినఁ, [9]దారాధ్వము [10]బద్ధమైనఁ దప్పక యిత్తున్. 595

1. భద్రింబు-మేలు, 2. హలికుఁడు—కర్షకుఁడు, రైతు. 3. ల నలుకఁ—పాఠాంతరము. 4. జిత్రింబుగ రాజునకును--పాఠాంతరము. 5. అంసోత్తరీయంబు-పైఁట, 6. న+అపాయము - అపాయము లేనిది, 7 నిరయంబు-నరకము, 8. నుసలక —ఆలసింపక. 9. తారాధ్వము-ఆకాశము, 10. ఖండమైనఁ—పాఠాంతరము.

మత్తకోకిలము. ఎన్నఁడుం బసు వేఁడఁ బోఁడఁట! [1] [2]యేకలుం డఁట! కన్నవా
రన్నదమ్ములు నైన లే రఁట! యన్నివిద్యలమూలగో
ష్ఠి న్నెఱింగినప్రోఢగుజ్జఁట! చేతు లొగ్గి వసింప నీ
చిన్నిపాపనిఁ దోసి పుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా! 596

వ. అని యిట్లు సత్యపదవీప్రమాణతత్పరుండును, వితరణకుతూహలసత్వరుండును, విమల యశస్కుండును, దృఢమనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజనబంధుండును నైన బలిం జూచి శుక్రుండు గోపించి మదీయశాసనం బతిక్రమించితివి గావున శీఘ్ర కాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శాపం బిచ్చె; బలియును గురుశాపతప్తుండయ్యు [3]ననృతమార్గంబున కభిముఖుండు గాకుండె; నప్పుడు. 597

ఆ. బ్రదుకవచ్చుఁగాక; బహుబంధనములైన, వచ్చుఁగాక; లేమి వచ్చుఁగాక;
జీవధనములైనఁ జెడుఁగాక, పడుఁగాక, మాటఁ దిరుగలేరు మానధనులు. 598

వ. అయ్యవసరంబున. 599

ఆ. దనుజలోకనాథదయిత వింధ్యావళి రాజవదన మదమరాళగమన
వటునికాళ్లు గడుగ వరహేమఘటమున జలము దెచ్చె భర్తసన్న యెఱిఁగి. 600

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు సద్దానవేంద్రుం డి ట్లనియె. 601

క. రమ్మా! మాణవకోత్తమ! తెమ్మా! నీవాంఛితంబు లే దన కిత్తుం;
దెమ్మా యడుగుల నిటు; రా, నిమ్మా కడుగంగవలయు; నేఁటికిఁ దడయన్? 602

వ. అని విని. 603

మ. బలిదైత్యేంద్రకరద్వయీకృతజలప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థిత శ్రీదముం
గలితానమ్రమరమాలలాటపద వీకస్తూరికా [4]శాదమున్
నళినామోదము రత్ననూపురితనానావేదముం బాదమున్. 604

క. సురలోకసముద్ధరణము నిరతశ్రీకరణ మఖిల [5]నిగమాంతాలం
కరణము భవసంహరణము, హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్. 605

1. ఏకతంబుఁట—పాఠాంతరము, 2. ఏకలుండు-అసహాయుఁడు, 3. నూన్నృత మార్గంబున కభిముఖుండై యుండె—పాఠాంతరము, 4. శాదము-బురద, 5. నిగమాంతము-వేదాంతము.

వ. ఇట్లు ధరణీసురదక్షిణచరణప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాదిపరిగణనంబు సేసి. 606

శా. 'విప్రాయ ప్రకటవ్రతాయ [1]భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య [2]విదే త్రిపాదధరణిం దాస్యామి' యంచుం బ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి పూజించి 'బ్ర
హ్మప్రీత'మ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్. 607

వ. తత్కాలంబున. 608

ఆ. నీరధారఁ బడఁగనీక యడ్డంబుగాఁ గలశరంధ్ర మాఁపఁగను దెలిసి
హరియుఁ [3]గావ్యనేత్ర మటఁ గుశాగ్రంబున నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁడు. 609

వ. అంత. 610

మ. అమరారాతికరాక్షతోజ్ఝితపవిత్రాంభఃకరశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండితదివౌకస్స్వామిజిన్మస్త్రముం
గమలాకర్షణసుప్రశస్తము రమాకాంతాకచోపాస్తమున్
విమలశ్రీకుచశాతచూచుకతటీవిన్యస్తమున్ హస్తమున్. 611

క. మునిజననియమాధారను, జనితాసురయువతినేత్రజలకణధారన్
దనుజేంద్రనిరాధారను, వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్. 612

ఆ. కమలనాభు నెఱిఁగి, కాలంబు దేశంబు నెఱిఁగి, శుక్రుమాట లెఱిఁగి, నాశ
మెఱిఁగి, పాత్రమనుచు నిచ్చె దానము బలి మహి [4]వదాన్యుఁ డొరుఁడు మఱియుఁ గలఁడె 613

క. బలి సేసిన దానమునకు, నలినాక్షుఁడు నిఖిలభూతనాయకుఁ డగుటం
గలకల మని దశదిక్కులు, బళిబళి యని పొగడె భూతపంచక మనఘా! 614

క. [5]క్షితిదాన మిచ్చునతఁడును, నతికాంక్షఁ బరిగ్రహించునతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు శతమఖలోకమునఁ గ్రీడ నలుపుదు రెలమిన్. 615

వ. అట్లు గావున నే దానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు; గావున వసుంధరాదానం బిచ్చితి; వుభయలోకంబులం గీర్తిసుకృతంబులు వడయుమని పలికి యమ్మాయావటుం డిట్లనియె. 616

1. భవతే-నీకొఱకు, 2. విధేః త్రిపాద-పాఠాంతరము, 3. కావ్యుఁడు,-శుక్రుఁడు. 4 వదాన్యుఁడు-దాత, 5 క్షితిదానము-భూదానము.

క. 'ఇది యేమి వేఁడితని నీ మది వగవక ధార వోయుమా! సత్యము పెం
పొదవఁగఁ గోరిన యర్థం బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 617

వ. అని వనికిన వటునిపలుకులకు హర్షనిర్భర చేతస్కుండై వైరోచనుండు. 618

ఆ. 'పుట్టి నేర్చుకొనెనొ, పట్టక నేర్చెనో, చిట్టిబుద్ధు లిట్టి పొట్టివడుగుఁ;
బొట్ట నున్న వెల్ల [1]'బూమెలు' నని నవ్వి యెలమి ధరణిదాన మిచ్చె నపుడు. 619

—: వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట :—

ఆ గ్రహమునీంద్రసిద్ధగంధర్వకిన్నరయక్షపక్షి దేవతాహిపతులు
వొగడి రతనిపెంపుఁ; బుష్పవర్షంబులు గురిసె దేవతూర్యకోటి మొరసె. 620

వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి 621

శా. ఇంతింతై, వటుఁ డింతయై, మఱియుఁ దా నింతైఁ నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై, 622

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
[2]ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్. 623

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి భువియును, నభంబును, దివంబును, దిశలును, [3]దిశాఛిద్రంబులును, సముద్రంబులును, జలదఖిలభూతనివహంబులుం దానయై యేకీభవించి క్రమక్రమంబున భూలోకంబునకుం బొడవై, భువర్లోకంబు నతిక్రమించి, సువర్లోకంబును [4]దలకడచి, మహర్లోకంబు దాఁటి, జనోలోకంబునకు మీఁదై, తపంబునకు [5]నుచ్ఛ్రితుండై, సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి, యెడ లిఱుములు సందులు రంధ్రంబులు లేకుండ నిండి, మహాదేహమహితుండై చరణతలంబున రసాతలంబును, పాదంబుల మహియును, జంఘల [6]మహీధ్రంబులును, జానువులఁ బతత్త్రిసముదయంబులును, నూరువుల నింద్రసేనమరుద్గణంబులును, వాసస్స్థలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున దనుజులును, నాభిని నభంబును,

1. బూమెలు-మాయలు, 2. ఛవిమత్కంకణము – కాంతితోఁగూడినకడియము, 3. దిశాఛిద్రంబులు – విదిక్కులు - మూలలు, 4. తలకడచి – అతిక్రమించి, 5 ఉచ్ఛ్రితుండు–అతిక్రమించినవాడు, 6. మహీధ్రంబులు – పర్వతములు.

నుదరంబున నుదధినపకంబును, నురంబునఁ దారకానికరంబును, హృదయంబున ధర్మంబును, నురోజంబుల ఋతసత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబున గమలహస్తయగు లక్ష్మియుఁ, గంఠంబున సామాదిసమస్త వేదంబులును, భుజంబులం బురందరాది దేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణి నఖిలచ్ఛందస్సముదయంబును, [1]రసనను జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, బృష్ఠంబున నధర్మంబును, గ్రమణంబుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవున ననేక మాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షి గణంబులును, గాత్రంబున జంగమ స్థావర జంతుసంఘంబులును గలవాఁడై, జలధరనినదశంఖ శార్ఙ్గ సుదర్శన గదా దండఖడ్గాక్షయబాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కటక కంకణ కౌస్తుభమణిమేఖలాంబరవనమాలికావిరాజితుండును, సునందనంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీసందోహ పరివృతుండును, నమేయ తేజోవిరాజితుండునునై బ్రహ్మాండంబు దనమేనికప్పు తెఱంగున నుండ విజృంభించి. 624

మ. ఒక పాదంబున భూమిఁ గప్పి, దివి వే ఁటొంటన్ [2]నిరోధించి, యొం
డొకటన్ మీఁదిజగంబు లెల్లఁ [3]దొడి, యొం టొంటిన్ [4]విలంఘించి, ప
ట్టిక బ్రహ్మాండకటాహముం [5]బగిలి వేంద్రంబై పరుల్ గానరా
కొకఁడై వాగ్గ్రగలభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్. 625

ఆ. ఒకపదంబు క్రింద నుర్వి పద్మము నంటికొన్న పంకలవము కొమరుఁ దాల్చె;
నొకటి మీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటినా వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున. 626

వ. తత్సమయంబున. 627

ఆ జగము లెల్ల దాఁటి చనిన త్రివిక్రము చరణనఖర చంద్ర చంద్రికలను
[6]టొనుఁగువడియె సత్యమున బ్రహ్మతేజంబు దివసకరునిరుచుల దివియవోలె. 628

సీ. భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ గాఁపురంబులు సేయు ఘనులు రాజు,
లామరీచ్యాదులు, నా సనందాదులు నా దివ్య యోగీంద్రులచట నెపుడు

1. రసన - నాలుక, 2. నిరోధించి - అడ్డగించి, 3. తొడి-ధరించి 4. విలంఘించి - నాఁటి, 5. బెటిలి — పాఠాంతరము, 6. టొనుఁగువడియె - కాంతివిహీనమయ్యెను.

మూర్తిమతంబులై ప్రమేయ పురాణతర్కామ్నాయనియమేతిహాసధర్మ
సంహితాదులు గురుజ్ఞానాగ్ని నిర్దగ్ధకర్ములై మఱి మును గలుగునట్టి

ఆ. వార లెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తి
దమమనంబులందుఁ దలఁచు [1]నిధానంబుఁ గంటి మనుచు నేఁడు [2]నుంటిమనుచు. 629

మ. తన[3]పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి, నటించి. యున్నతపదంబుం జూచి, తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి; తత్తోయముల్
వినువీథిం [4]బ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్. 630

వ తత్సమయంబున, 631

సీ యోగమార్గంబున నూహించి బహువిధపుష్పదామంబులఁ బూజసేసి,
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి,
భూరిలాజాక్షతంబులు నల్లి, ఫలములు గానిక లిచ్చి, రాగములఁ బొగడి,
శంఖాదివరములు జయఘోషములుఁ జేసి, 'కరుణాంబునిధి! త్రివిక్రమ!' యటంచు
ఆ బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి; రెల్లదిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరిధ్వని వెలయఁజేసి విష్ణువిజయ మనుచు, 632

క. అన్నిజగంబులఁ దానై యున్న జగన్నాథుఁ జూడ నొగి భావింపం
గ న్నందక మన మందక సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్. 633

వ. అంత నయ్యైన పూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్న వామనునిం గని
'పదత్రయ [5]వ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించె; గపటవటురూప
రోహితుండగు విష్ణుం డని యెఱుంగక మన దానవేంద్రుండు సత్యసంధుండు గావున
మాట దిరుగక యిచ్చె; నతనివలన నేరంబు లే; దీకుబ్జుం డప్రతిహత తేజః ప్రభావంబున
[6]సజ్జకంబుగా నిజ్జగంబులం బరిగ్రహించి, [7]పర్జన్యాదులకు వినర్జనంబు సేయం దలంచి
యున్నవాఁ, డీ పాఱుని [8]దూఁటి పొఁలనీక నిర్జించుట కర్జం' బని తర్జనంబులును గర్జ
నంబులును జేయుచు వజ్రాయుధాది మరుజ్జేతలగు హేతిప్రహేతివిప్రచిత్తిముఖ్యులయిన
రక్కసులు పెక్కండ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశుపట్టినభల్లాదిసాధనం
బులు ధరియించి, [9]కసిమసంగి మునరికొని దశదిశలం బ్రసరించినం జూచి హరిపరిచరులు

1. నిధానంబు- నిధి, 2. నుంటిమి-బ్రతికితిమి, 3. పుట్టిల్లు జన్మస్థానము, 4. ప్రభవించె-పాఠాంతరము, 5. వ్యాజంబు-నెపము, 6. సొజ్జంబు గా — పాఠాంతరము, 7. పర్జన్యుఁడు - ఇంద్రుఁడు, 8. దూఁటి పొఁలనీక - వరుగెత్తి పోనీయక, 9. కసిమసంగి-విజృంభించి.

నుదరంబున నుదధినప్తకంబును, నురంబునఁ దారకానికరంబును, హృదయంబున ధర్మంబును, నురోజంబుల ఋతసత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబున గమలహస్తయగు లక్ష్మియుఁ, గంఠంబున సామాదినమస్త వేదంబులును, భుజంబులం బురందరాది దేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణి నఖిలచ్ఛందస్సముదయంబును, [1]రసనను జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, బృష్ఠంబున నధర్మంబును, గ్రమణంబుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవున ననేక మాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షి గణంబులును, గాత్రంబున జంగమ స్థావర జంతుసంఘంబులును గలవాఁడై, జలధరనినదశంఖ శార్ఙ్గ సుదర్శన గదా దండఖడ్గాక్షయబాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కటక కంకణ కౌస్తుభమణిమేఖలాంబరవనమాలికావిరాజితుండును, సునందనంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీసందోహ పరివృతుండును, నమేయ తేజోవిరాజితుండును నై బ్రహ్మాండంబు దనమేనికప్పు తెఱంగున నుండ విజృంభించి. 624

మ. ఒక పాదంబున భూమిఁ గప్పి, దివి వే ఁ డొంటన్ [2]నిరోధించి, యొం
డొకటన్ మీఁదిజగంబు లెల్లఁ [3]దొడి, యొం డొంటిన్ [4]విలంఘించి, ప
ట్టక బ్రహ్మాండకటాహముం [5]బగిలి వేంద్రంబై పరుల్ గానరా
కొకఁడై వాగ్భృగలభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్. 625

ఆ. ఒకపదంబు క్రింద నుర్వి పద్మము నంటికొన్న పంకలవము కొమరుఁ దాల్చె;
నొకటి మీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటినా వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున. 626

వ. తత్సమయంబున. 627

ఆ జగము లెల్ల దాఁటి చనిన త్రివిక్రము చరణనఖర చంద్ర చంద్రికలను
[6]బొనుఁగువడియె సత్యమున బ్రహ్మతేజంబు దివసకరునిరుచుల దివియవోలె. 628

సీ. భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ గాఁపురంబులు సేయు ఘనులు రాజు,
లామరీచ్యాదులు, నా సనందాదులు నాదివ్య యోగీంద్రు లచట నెపుడు

1. రసన - నాలుక, 2. నిరోధించి - అడ్డగించి, 3. తొడి-ధరించి 4. విలంఘించి - దాఁటి, 5. బెటిలి — పాఠాంతరము, 6. బొనుఁగువడియె - కాంతివిహీన మయ్యెను.

మూర్తిమతంబులై త్రయీ పురాణశాస్త్రామ్నాయనియమేతిహాసధర్మ
సంహితాదులు గురుజ్ఞానాగ్ని నిర్దగ్ధకర్ములై మఱియును గలుగునట్టి

ఆ. వార లెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు సంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తి
దమమనంబులందుఁ దలఁచు [1]నిధానంబుఁ గంటి మనుచు నేఁడు [2]నుంటిమనుచు. 629

మ. తన [3]పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి, నటించి. యున్నతపదంబుం జూచి, తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి; తత్తోయముల్
వినువీథిం [4]బ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్. 630

వ తత్సమయంబున, 631

సీ యోగమార్గంబున సూహించి బహువిధపుష్పదామంబులఁ బూజసేసి,
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి,
భూరిలాజాక్షతంబులు నల్లి, ఫలములు గానిక లిచ్చి, రాగములఁ బొగడి,
శంఖాదివరములు జయఘోషములఁ జేసి, 'కరుణాంబునిధి! త్రివిక్రమ!' యటంచు
ఆ బ్రహ్మ మొదలు లోకపాలురు గొనియాడి; రెల్లదిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ దరిగి చాటె భేరిధ్వని వెలయఁజేసి విష్ణువిజయ మనుచు, 632

క. అన్నిజగంబులఁ దానై యున్న జగన్నాథుఁ జూడ నొగి భావింపం
గ న్నందక మన మందక సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్. 633

వ. అంత నాయ్యన పూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్న వామనునిం గని 'పదత్రయ [5]వ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించె; గపటవటురూప రోహితుండగు విష్ణుం డని యెఱుంగక మన దానవేంద్రుండు సత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చె; నతనివలన నేరంబు లే; దీకుబ్జుం డప్రతిహత తేజః ప్రభావంబున [6]సజ్జకంబుగా నిజ్జగంబులం బరిగ్రహించి, [7]పర్జన్యాదులకు విసర్జనంబు సేయం దలంచి యున్న వాఁ, డీ పాటియిం [8]దూఱి పాఱనీక నిర్జించుట కర్జం' బని తర్జనంబులును గర్జనంబులును జేయుచు వజ్రాయుధాది మరుజ్జేతలగు హేతిప్రహేతివిప్రచిత్తి ముఖ్యు లయిన రక్కసులు పెక్కండ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశుపట్టిసభల్లాదిసాధనంబులు ధరియించి, [9]కసిమసంగి మునరికొని దశదిశలం బ్రసరించినం చూచి హరిపరిచరులు

1. నిధానంబు- నిధి, 2. నుంటిమి-బ్రతికితిమి, 3. పుట్టిల్లు జన్మస్థానము, 4. బ్రభవించె-పాఠాంతరము, 5. వ్యాజంబు-నెపము, 6. సొజ్జంబుగా — పాఠాంతరము, 7. పర్జన్యుఁడు - ఇంద్రుఁడు, 8. దూఱి పాఱనీక - పరుగెత్తి పోనీయక, 9. కసిమసంగి-విజృంభించి.

సునందనందజయజయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వతప్రముఖులగు దండనాథు [1]లయుత వేదండసముద్దండ బలులు దమతమ యూథంబుల నాయుధంబులతోడం గూప్పుకొని దానవానీకంబుఁ బర లోకంబున కనుచువారలై వారల నెదుర్కొని కదనంబునకున్ [2]బరవసంబు సేయు చున్నం గనుంగొని శుక్రశాపంబుఁ దలంచి దనుజవల్లభుం డి ట్లనియె. 634

సీ. 'రాక్షసోత్తములార! రండు పోరాడక; కాలంబు గా దిది కలహమునకు;
సర్వభూతములకు సంపదాపదలకుఁ బ్రభువైన దైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె? తొల్లి మనకు రాజ్యంబును, సురలకు నాశంబు సొరిది నిచ్చి
విపరీతముగఁ జేయువేల్పు నే మందము మనపాలిభాగ్యంబు మహిమ గాక;
తే. వెలచి పలుమాఱుఁ బాతెడి విష్ణుభటులు మిమ్ము నెగచుట దైవంబుమేర గాదె?
మనకు నెప్పుడు దైవంబు మంచిదగును నాఁడు గెలుతము పగవారి; నేఁడు వలదు. 635

వ. అదియునుంగాక. 636

క. బలుదుర్గంబులు నచివులు. బలములు మంత్రౌషధములు బహు [3]శేముషియుం
గలిగియు సామోపాయంబులఁ గాల మెఱింగి నృపుఁడు వోరుట యొప్పన్. 637

వ. అట్లు గావున రణంబున కిప్పుడు శత్రుల మోహరించుట కార్యంబు గాదు; మనకుం దగు కాలంబున జయింతము; నలంగకతొలగుఁ డనినఁ దలంగి భాగవతభటభీతులై చిక్కరక్క సులు రసాతలంబునకుం జని; రంత హరి హృదయంబెరిగి తార్క్ష్యనందనుండు యాగ [4]సుత్యాహంబున వారుణపాశంబుల నరవల్లభుని బంధించె; నంత. 638

క. బాహులఁ బదములఁ గట్టిన 'శ్రీహరికృపగాక యేమిసేయుదు?' నని సం
దేహింపక బలి నిలిచెను; హాహారవ మెసఁగె దశదిగంతములందున్. 639

క. సంపద సెడియును దైన్యముఁ గంపంబును లేక తొంటికంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యము పంపని సురవైరిఁ జూచి పటుఁ డిట్లనియెన్. 640

సీ. '[5]ధానవ త్రిపదభూతల మిత్తు నంటివి; [6]ధరణిఁ జంద్రార్కు లెందాఁక నుందు
రంతభూమియు నొక్క యడుగయ్యె నాకును; స్వర్లోకమును నొక్క చరణమయ్యె;
[7]నీసొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు; గడమ పాదమునకుఁ గలదె భూమి?
యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు నిరయంబుఁ బొందుట నిజము గాదె?

1. అయుత -పదివేలు, 2. బరవసంబు-ధైర్యము 3 శేముషి-బుద్ధి, 4. సుత్యాహంబు -సోమపానముచేయు దినము, 5. దానము — పాఠాంతరము, 6. తరుణచంద్రార్క—పాఠాంతరము, 7. నన్ననీసొమ్ము రెండడుగులు—పాఠాంతరము.

తే. కాస దుర్గతికిని గొంతకాల మగును; కాక యిచ్చెదనేని వేగంబు నాకు
నిపుడు మూఁడప పదమున కిమ్ము జూపు బ్రాహ్మణాధీనములు దోవ బ్రహ్మవళమె?

వ. అని యిట్లు వామనుండు పలుక సత్యభంగసందేహవిషదిగ్ధశల్యానికృత్త [1]హృదయుం డయ్యును విషణ్ణుండు గాక వైరోచని ప్రసన్నవదనంబుతోడఁ జిన్ని పోడవడుగున కి ట్లనియె, 642

ఆ. [2] సూనృతంబుగాని [3]నుడియదు నాజిహ్వ; బొంకఁజాల; నాకు బొంకు లేదు;
నీతృతీయపదము నిజము నా శిరమున నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ! 643

ఆ. నిరయమునకుఁ బ్రాప్త [4]నిగ్రహంబునకును బదవిహీనతకును బంధనమున
కర్థభంగమునకు నఖిలదుఃఖములకు వెఱవ, దేవ! బొంక వెఱచినట్లు. 644

వ. అదియునుంగాక. 645

సీ. తల్లిదండ్రులు, నన్నదమ్ములుఁ, జెలికాండ్రు, గురువులు, శిక్షింపఁ గొఱఁతవడునె?
విదప మేలుగఁగాక! పృథుమదాంధులకును దానవులకు మాకుఁ దఱియెఱింగి
విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁ జేసి గురువులలో నాదిగురువ వీవ;
నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో తలంప
తే. నిన్ను నెపెరించి పోరాడి నిర్జరారు లాదియోగీంద్రు లందెడునట్టి చెంకి
నందరే తొల్లి పెక్కండ్రు? హర్షమూర్తి! [5]యీశ! నీయెడ దుర్లభ మేమిలగదు? 646

మ. చెలియే మృత్యువు; చుట్టమే యముఁడు; సంసేవార్థులే కింకరుల్:
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను; దృఢమే జీవంబు; నోచెల్లరే!
చలితం బౌట యెఱుంగ కీ కపటసంసారంబు నిక్కంబుగాఁ
దలఁచున్ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై, 647

సీ. చుట్టాలు దొంగలు; సుతులు ఋణస్థులు; కాంతలుసంసారకారణములు;
ధనము లస్థిరములు; దను పతిచంచల; గార్హ్యార్థు లన్యులు; గడచుఁ గాల;
మాయువు నత్వర; మైశ్వర్య మతిశీఘ్ర మని కాదె తమతండ్రి [6]నతకరించి
మా తాత సాధునమ్మతుఁడు ప్రహ్లాదుండు నీ పాదకమలంబు నియతిఁ జేసె;
తే భద్రుఁడతనికి మృతి లేనిబ్రదుకు గలిగె; వైరులై కాని తొల్లి మావారు గాన
రర్థివై వచ్చి నీవు నన్నడుగు టెల్లఁ, బద్మలోచన! మాపుణ్యఫలము గాదె? 648

1. భగ్నచిత్తుండయ్యు—పాఠాంతరము, 2. సూనృతంబు - సత్యము, 3. నుడియదు - తిరగదు, 4. నిగ్రహంబు-చెఱ, 5. 'వైరిభక్తులు గట్టిగావలయుఁగాక!' అని మఱియొక పాదము కొన్ని ప్రాంతప్రతులలో ఉన్నదఁట !, 6. అతకరించి-తిరస్కరించి.

వ. అని యిట్లు వలుకుచున్న యవసరంబున. 649

శా. ఆ దైత్యేంద్రుఁడు పీనవక్షు, నవపద్మాక్షుం, బిశంగాంబరా
చ్ఛాదున్, నిర్మలసాధువాదు, ఘనసంసారాదివిచ్ఛేదు, సం
శ్రీదున్, భక్తిలతాతిరోహితహరిశ్రీపాదు, నిఃఖేదుఁ, బ్ర
హ్లాదున్ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్. 650

వ. ఇట్లు సమాగతుం డైన తనతాతం గనుంగొని విరోచనందనుండు వారుణపాశబద్ధుండు గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామింజేసి సంకులాశ్రువిలోలలోచనుండై సిగ్గుపడి నతశిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కు సెల్లించె; నంతఁ బ్రహ్లాదుండు ముఖమండపంబున సునందాది [1]పరికరసమేతుండై కూర్చున్న వామన దేవునిం గని యానందబాష్పంబులుఁ బులకాంకురంబులున్ నెఱయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె. 651

సీ. ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు;
మోహనాహంకృతిమూలంబు గర్వాంధతమసవికారంబు; దాని మాన్పి
కరుణ రక్షించుటగాక బాధించుటే? తత్త్వజ్ఞునకు మహేంద్రత్వ మేల?
నీ పాదకమలంబు నియతిఁ గొల్చినవానిఁ బోలునే సురరాజ్యభోగపరత ?
తే. గర్వ మేపారఁ గన్నులుఁ గానరావు; చెవులు వినరావు; చిత్తంబు సిక్కుపడును;
మఱచు నీ సేవ లన్నియు; మహిమ మాన్పి, మేలు సేసితి; నీ మేటి మేర నూపి 652

వ. అని పలికి జగదీశ్వరుండు నఖిలలోక సాక్షియు నగు నారాయణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున. 653

మ. తతమత్తద్విపయానయై కచనిరుంధచ్చోళసంవ్యానయై
ధృతబాష్పాంబువితానయై కరయుగాధీనాలికస్థానయై
'[2]పతిభిక్షాం మమ దేహి కోమలమతే! పద్మాపతే!' యంచుఁ ద
త్సతి వింధ్యావలి సేర వచ్చెఁ ద్రిజగద్రక్షామనున్ వామనున్. 654

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునం బ్రణతయై నిలువంబడి యిట్లనియె. 655

క. 'నీకుం గ్రీడార్థము లగు లోకంబులఁ జూచి పరులు లోకులు [3]కుమతుల్
లోకాధీశుల మందురు లోకములకు రాజ వీవ, లోకస్తుత్యా! 656

---

1. పరికరము - పరివారము. 2. పతిభిక్షాం మమ దేహి-నాకు పతిభిక్షను పెట్టుము.
3. కుమతుల్-చెడ్డబుద్ధి కలవారు.

క. కాదనఁడు; పొమ్మ లే దీరా దనఁడు; జగత్త్రియైకరాజ్యము నిచ్చెన్
నా దయితుఁ గట్ట నేటికి ? శ్రీదయితాచిత్తచోర ! శ్రితమందారా! 657

వ అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున [1]హిరణ్యగర్భుండు
సనుదెంచి యి ట్లనియె. 658

సీ. భూతలోకేశ్వర! భూతభావన! దేవదేవ జగన్నాథ! దేవవంద్య!
తనసొమ్ము సకలంబుఁ దప్పక నీకిచ్చె; దండయోగ్యుఁడు గాఁడు దానపరుఁడు;
గరుణింప నర్హుండు, గమలలోచన! నీకు; విడిపింపు మీతని [2]వెఱవు దీర్చి;
తోయపూరము సల్లి దూర్వాంకురంబులఁ జేసి నీపదము లర్చించునట్టి
తే. భక్తియుక్తుఁడు; లోకేశపదము నందు నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్యమంతయు నిచ్చినట్టి బలికిఁ దగునయ్య దృఢపాశబంధనంబు ? 659

వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డి ట్లనియె. 660

సీ. 'ఎవ్వనిఁ గరుణింప [3]నిచ్చించితిని వాని యఖిలవిత్తంబు నే నపహరింతు.
సంసారగురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు దెగడి లోకముఁ, నన్ను ధిక్కరించు,
నతఁ డెల్ల కాలంబు నఖిలయోనులయందుఁ బుట్టును; దుర్గతి బొందుఁ బిదప;
విత్తవయోరూప విద్యాబలైశ్వర్యకర్మజన్మంబులగర్వ ముడిగి,
తే. యేకవిధమున విమలుఁడై యెవ్వ డుండు వాఁడు నాకూర్చి రక్షింపవలయువాఁడు;
స్తంభలోభాభిమానసంసారవిభవమత్తుఁడై చెడ నొల్లఁడు మత్పరుండు. 661

శా. బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధువ్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యముం గరుణయున్ సొంపేమియుం దప్పఁ డు
ద్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే ? 662

ఆ. అసురనాథుఁ డనుచు ననఘుని మర్యాద యేను జూత మనుచు నింత వలుక
నిజము పలికె నితఁడు నిర్మలాచారుండు మేలు మేలు నాకు మెచ్చువచ్చు, 663

క. సావర్ణిమనువు వేళను దేవేంద్రుం డగు నితండు దేవతలకు; దు
ర్భావిత మగునా చోటికి రావించెద; నంతమీఁద రక్షింతు దయన్. 664

క. వ్యాధులుఁ దప్పులు నొప్పులు బాధలుఁ జెడి విశ్వకర్మభావితదనుజా
రాధితసుతలాలయమున [4]'నేధితవిభవమున నుండు నితఁ డందాఁకన్,' 665

---

1. హిరణ్యగర్భుండు-బ్రహ్మ, 2. వెఱవు-భయము, 3. ఇచ్ఛించితిని - కోరితిని.
4. ఏధితవిభవము-వృద్ధిపొందిన యైశ్వర్యము.

వ. అని పలికి బలిం జూచి భగవంతుం డి ట్లనియె 666

సీ. సేమంబు నీ కింద్రసేనమహారాజ! వెఱనకు; మేలు నీ [1]వితరణంబు!
వేలుపు లం దు డి వేడుకపడుదురః; దుఃఖంబు లిడుములు దుర్మరణము
లాతురతలు నొవ్వు లం దుండువారికి నొందవు; సుతలమం దుండు నీవు;
నీ పంపు సేయని నిర్జరారాతుల నా చక్ర మేతెంచి నఱకుచుండు;
అ. లోకపాలకులకు లోను గా నక్కఱ; నన్యు లెంతవార లచట? నిన్ను
నెల్లప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ గరుణతోడ నీకు గానవత్తు. 667

క. దానవదైత్యులసంగతిఁ బూనిన నీయసురభావమును దోడ్తో మ
ద్ధ్యానమునఁ దలఁగి పోవును, మానుగ సుతలమున నుండుమా మాయాజ్ఞన్! 668

వ. అని యిట్లు పలుకుచున్న - [2][3]ముమ్మూర్తులముదుక వేల్పు దియ్యనినెయ్యంపుఁ బలుకుఁ
జెఱకురనంపు [4]సోనలు వీనుల తెరువులం జొచ్చి లోను బయలు నిండి ఱెప్పలకప్పు
దప్పం దోచికొని కనుఁగవకొలంకుల [5]నలుఁగులు వెడలినచందంబున సంతసంబునం
గన్నీరు మున్నీరై పఱవ, నురః ఫలకంబునం బులకంబులు కులకంబులయి తిలకంబు
లొత్తఁ, గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం ద్రొక్కుడుపడుచుఁ జిక్కనిచిత్తంబునఁ
జక్కని మాటల రక్కసులఱేఁ డి ట్లనియె. 669

ఉ. ఎన్నఁడు లోకపాలకుల నీకృపఁ జూడని నీవు నేఁడు న
న్నున్నతుఁ జేసి నా బ్రదుకు [6]నోజయు నానతి యిచ్చి కాచి; తీ
మన్నన లీ దయారసము, మాటలు పెద్దఱికంబుఁ జాలవే?
పన్నగతల్ప! ని న్నెఱిఁగి పట్టిన నావద గల్గ నేర్చునే?' 670

వ. అని పలికి హరికి నమస్కరించి, బ్రహ్మకుం బ్రణామంబుసేసి, యిందుధరునకు వందనం
బాచరించి, బంధవిముక్తుండై తనవారలతోఁ జేరికొని బలి సుతలంబునకుఁ జనియె;
నంత హరికృపావశంబునం గృతార్థుండై కులోద్ధారకుండయిన మనుమనిం గని సంతో
షించి ప్రహ్లాదుండు భగవంతున కి ట్లనియె. 671

సీ. 'చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు; శర్వుఁ డీ లక్ష్ములఁ జాడఁ బొందఁ;
డన్యుల కెక్కడి? దసురులకును మాకు బహ్మాదిపూజితపదుఁడ వయిన

---

1. వితరణంబు-త్యాగము, 2. ముమ్మూల — పాఠాంతరము, 3. ముమ్మూర్తుల ముదుకవేల్పు-త్రిమూర్తిస్వరూపుఁడగు తొలివేల్పు - విష్ణువు 4 సోనలు-వర్షములు, 4. అలుఁగులు—గండిదారులు, 6. ఓజ-తేజము.

దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి; పద్మజాదులు భవత్పాదపద్మ
మకరందసేవనమహిమ నైశ్వర్యంబు లందిరి కాక; మే మల్పమతుల
తే. మధికదుర్యోధులము కుత్సితాత్మకులము, నీ కృపావృష్టిమార్గంబు నెలవు సేర
నేమి తప మాచరించితి మెన్నఁగలమె? మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ! 672

వ. అదియనుం గాక, 673

ఆ. నర్వగతుఁడవయ్యు నమదర్శనుఁడవయ్యు, నొకటి [1]విషమవృత్తినుండు; దరయ
నిచ్చ లేనివారి కీవు; భక్తులు గోరు. [2]తలఁపు లిత్తు కల్పతరువుమాడ్కి? 674

ప. అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి పరమపురుషుం డి ట్లనియె. 675

తే. వత్స! ప్రహ్లాద మేలు, నీ వారి నీవు, సొరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకుఁ
బయనమైపొమ్ము నే గదాపాణినగుచుఁ, జేరి రక్షింతు దురితంబు సెంద దచట.' 676

వ. అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు నమస్కరించి వలగొని కరకమల పుట
ఘటితనిటలతటుండై వీడ్కొని బలిం దోడ్కొని సకలసురయూథంబునుం దాను నొక్క
మహాబిలద్వారంబు సొచ్చి ప్రహ్లాదుండు సుతలలోకంబునకుం జనియె; నంత బ్రహ్మ
వాదులయిన యాజకుల సభామధ్యంబునం గూర్చున్న శుక్రునిం జూచి నారాయణుం డి
ట్లనియె. 677

ఆ. 'ఏమి గొఱఁతపడియె నీబలి జన్నంబు, [3]విస్తరింపు కడమ విప్రవర్య!
విషమమయిన కర్మ [4]విసరంబు బ్రాహ్మణజనులు సూచినంత నమతఁ బొందు.' 678

వ. అనిన శుక్రుం డి ట్లనియె. 679

సీ. అఖిలకర్మంబుల కధినాథుఁడవు నీవ; యజ్ఞేశుఁడవు నీవ యజ్ఞపురుష!
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ గడ మేల కల్గు నేకర్మములకు?
ధనదేశకాలార్హ తంత్రమంత్రంబులఁ గొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను;
నయినఁ గావింతు నీయానతి; భవదాజ్ఞ మెలఁగుట జనులకు మేలుగాదె?
తే యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు? ననుచు హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁ దసురేంద్రుజన్నంబు కడమదీర్చె మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప.

వ. ఇవ్విధంబున వామనుం డయి హరి బలి నడిగి మహిం బరిగ్రహించి తనకు [5]నగ్ర
జుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు నదయుం డయి యొసంగె; నత్రయి దక్షభృగు

---

1. విషమవృత్తి-భేదభావము, 2. తలఁపులు — కోర్కెలు, 3. విస్తరింపు-పూర్తి చేయుము, 4. విసరంబు-సముదాయము, 5. అగ్రజుండు-ముందుపుట్టినవాఁడు-అన్న.

ప్రముఖప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షి పితృగణంబులును, రాజులును, దానును గూడికొని చతురాననుండు గశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోకపాలురకు 'వామనుండు వల్లభుం' డని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబులకు స్వర్గాపవర్గంబులకు 'నుపేంద్రుండు ప్రధానుం' డని సంకల్పించె; నా సమయంబున. 681

క. కమలజుఁడు లోకపాలురు నమరేంద్రునిఁగూడి దేవయానంబున న
య్యమరావతికిని వామను నమరం గొనిపోయి రంత నటమీఁద నృపా! 682

ఆ. [1]బల్లిదంపుఁదోడు ప్రాపున నింద్రుని కింద్రపదము సేరు టిట్లు గలిగెఁ;
దనకు [2]నాఢ్యుఁడైన తమ్ముఁడు గలిగిన గోర్కి అన్న కేల కొఱఁత నొందు? 683

క. [3]పా లడుగఁడు; మే లడుగఁ; డేలడు భిక్షించి యన్న కిచ్చెఁ ద్రిజగమున్
వేలుపులతల్లి కడపటి చూలింతఁ బోలంగఁ గలరె [4]సొలయనితమ్ముల్. 684

క. కడుపు [5] [6]బదరగాఁగఁ గొడుకులఁ గనుకంటెఁ దల్లి కొకఁడె చాలు బల్లిదుండు;
త్రిదశగణముఁ గన్న యదితి గాసుపు దీఱఁ జిన్ని మేటివడుగుఁ గన్నయట్లు. 685

వ. ఇట్లు దేవేంద్రుండు వామనభుజపాలితంబగు త్రిభువనసామ్రాజ్యవిభవంబు మరల నంగీకరించె; నప్పుడు బ్రహ్మయు, శర్వుండును, గుమారుండును, భృగుప్రముఖులయిన మునులును, పితృదేవతలును, దక్షాదిప్రజాపతులును, సిద్ధులును, వైమానికులును మఱియుం దక్కినవారలును, పరమాద్భుతంబైన విష్ణునిసుమహాకర్మంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ, బ్రశంసించుచు, నాడుచుం, బాడుచుఁ, దమతమ నివాసంబులకుం జని; రని చెప్పి శుకుం డిట్లనియె 686

తే. మనుజనాథ! త్రివిక్రమమహిమకొలఁది యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁడోపుఁ?
గుంభినీ రేణుకణములు గుఱుతుపెట్టు వాఁడు నేరఁడు; దక్కినవారివశమె? 687

క. అద్భుతవర్తనుఁడగు హరి సద్భావితమైన విమల చరితము వినువాఁ
డుద్భటవిక్రముఁడై తుది నుద్భాసితలీలఁ బొందు నుత్తమగతులన్. 688

1. బల్లిదము - బలముగలది, 2 ఆఢ్యుఁడు-ఉత్తముఁడు 3. పాలు-భాగము, 4. సొలయని - శ్రమపడని, 5. బరువు—పాఠాంతరము. 6. బదరగాఁగ - పగులఁగా.

తే. తగిలి మానుష, పైతృక దైవకర్మ వేళలందుఁ [1]త్రివిక్రమవిక్రమంబు
లెక్క దెక్కడఁ గీర్తించు రెవ్వరేనిఁ బొందుదురు నిత్యసౌఖ్యంబు భూనరేంద్ర![2] 689

మత్స్యావతార కథాప్రారంభము

వ. అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు సెప్పె నని సూతుండు మును
లకుం జెప్పిన విని, వార లతని కి ట్లనిరి. 690

సీ. 'విమలాత్మ! విన మాకు వేడ్క యయ్యెడుఁ; మున్ను హరి మత్స్యమైన వృత్తాంతమెల్ల;
గర్మబద్ధునిభంగి ఘనుఁ డీశ్వరుఁడు లోక నిందితంబై [3]తమో [4]నిలయమైన
మీనరూపము నేల మే లని ధరియించె? నెక్కడ వర్తించె? నేమి సేసె?
నాద్యమై వెలయు నయ్యవతారమునకు నెయ్యది కారణంబు? గార్యంబు లెట్లు?
ఆ. నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ; దెలియఁ జెప్ప వలయు; దేవదేవు
చరితమఖిలలోక సౌభాగ్యకరణంబు, గాదె! విస్తరింపు క్రమముతోడ,' 691

వ. అని మునిజనంబులు సూతు నడిగిన నతం డి ట్లనియె; మీర లడిగిన యీ యర్థంబుఁ
బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుడగు [5]బాదరాయణి యిట్లనియె. 692

సీ. 'విభుఁ డీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధు ధర్మార్థములఁ గావఁ దనువుఁ దాల్చి,
గాలిచందంబున [6]ఘనరూపములయందుఁ [7]దనురూపములయందుఁ దగిలియుండు;
నెక్కువ దక్కువ లెన్నఁడు నొందక నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు;
గురుతయు గొఱఁతయు గుణసంగతివహించు; మనుజేశ! చోద్యమే మత్స్యమగుట?
తే. వినుము పోయిన కల్పాంతవేళఁ దొల్లి ద్రవిళదేశపురాజు సత్యవ్రతుండు
నీరు ద్రావుచు హరిఁ గూర్చి నిష్ఠతోడఁ దపముఁ గావించె నొక యేటితటమునందు. 693

వ. మఱియు నొక్కనాఁ డమ్మేదినీకాంతుండు కృతమాలిక యను నేటిపొంత హరి సమర్ప
ణంబుగా జలతర్పణంబు సేయుచున్న సమయంబున నా రాజు దోసిట నొక్క మీను

---

1. త్రివిక్రముఁడు – వామనుఁడు, 2. ఈ పద్యమునకుఁ దర్వాతఁ గొన్నిప్రతు
లలోఁ గ్రింది పద్యమున్నది

మ. జడులై నాకము కోలుపోవుసురలం జంభారినిం బ్రోవఁగా
వడుగై భూమిఁ బదత్రయం బిచ్చటకై వైరోచనిన్ వేఁడి రెం
డడుగుల్ సాఁచి త్రివిక్రమస్ఫురణ బ్రహ్మాండంబుఁ దా నిండుచున్
గడుమోదంబున నుండు వామనుని కెక్కాలంబునన్ మ్రొక్కెదన్

3. తమోనిలయము – అజ్ఞానమునకు స్థానము 4. నియతమైన – పాఠాంతరము,
5. బాదరాయణి – శుకుఁడు, 6. ఘనము – పెద్దది, 7. తనువు – సూక్ష్మము.

పిల్ల దవిలి వచ్చిన నులికిపడి మరలం [1]దరంగిణీజలంబు నందు [2]శకులశాబకంబు విడిచె
నట్లు విడివడి నీటిలో నుండి జలచర [3]పోతంబు భూతలేశ్వరున కిట్లనియె. 694

మత్త. "పాటు వచ్చిన జ్ఞాతిఘాతులు పాపజాతి [4]ఝషంబు లీ
యేటఁ గొందొక మీనపిల్లల నేఁటి పట్టి వధింప న
చ్చోట నుండక నీదుదోసిలి సొచ్చి వచ్చిన నన్ను న
ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే? కృప యింత లేక దయానిధీ? 695

ఆ. వలలు దారు నింక వచ్చి జాలరివేఁట కాఁడు వేలు గలఁచి [5]కారవెట్టి,
మిడిసి పోవనీక మెడఁ బట్టుకొనియెద; రప్పు డెందుఁ జొత్తు? ననఘచరిత! 696

క. భక్షించు నొండె ఝషములు; శిక్షింతురు ధూర్తులొండెఁ; జెడకుండ ననున్
రక్షింపు దీనవత్సల! ప్రక్షీణుఁ గాచుకంటె భాగ్యము కలదే?" 697

వ. అనిన విని కరుణాకరుండగు నవ్విభుండు మెల్లన యయ్యంభశ్చరడింభకంబును గమండలు
జలంబునం బెట్టి తన నెలవునకుం గొనిపోయె, నదియు నొక్క రాత్రంబునం గుండిక
నిండి తనకు నుండ [6]నిమ్ము సాలక రాజున కిట్లనియె. 698

క. 'ఉండ నిది గొంచె; మెంతయు, నొండొకటిం దెమ్ము భూవరోత్తమ?' యనుడున్
[7]గండకముఁ దెచ్చి విడిచెను మండలపతి సలిలకలశమధ్యమునందున్. 699

వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడుచేతుల నిడుపై [8]యుదంచనంబు నిండి నట్టు
సాలక వేఱొండు దెమ్మనవుడు నారాచపట్టి కరుణాగుణంబునకు నీడపట్టు గావున గండకంబు
నొండొక్క చిఱుతమడుఁగున నునిచె; నదియు నా సరోవరజలంబునకు నగ్గలంబై
'తనకు సంచరింప నిది గొంచెం' బని పలికినం బుడమిఱేఁడు మంచివాఁ డగుటం జేసి
యా [9]కంచరంబు ననంచిత జలాస్పదంబైన [10]హ్రదంబునందు నిడియె; నదియు నా సలి
లాశయంబునకును నధికంబై పెరుఁగ నిమ్ము చాల దని చెప్పికొనిన నప్పుణ్యుం డొప్పెడి
నడవడిం దప్పనివాఁడైన కతంబున నమ్మహామీనంబును మహార్ణవంబున విడిచె; నదియును
మకరాకరంబునం బడి రాజున కిట్లనుఁ బెను 'మొసళ్లు ముసరికొని కసిమసంగి మ్రింగెడి;
నింతకాలంబు నడపి కడపట దిగవిడువకు; వెడలఁ దిగువు' మని [11]యెలింగింపం దెలిసి
యన్నీటి తిరుగుడుఁ ద్రోవకుం బుడమిఱేఁ డిట్లనియె. 700

---

1. తరంగిణి - నది, 2. శకులశాబకంబు-చేపపిల్ల, 3. పోతంబు-పిల్ల, 4. ఝషంబులు - చేపలు, 5. కారవెట్టి - బంధించి, 6. ఇమ్ము - స్థలము, 7. గండకము - చేపపిల్ల 8. ఉదంచనంబు-వెడల్పుపాత్ర, 9. కంచరంబు-జలచరము-చేప, 10. హ్రదంబు-కొలను, 11. ఎలింగింప - మొఱపెట్టంగా.

సీ. "ఒకదినంబున శతయోజనమాత్రము విస్తరించెదు నీవు; విసము చూడ
మిటువంటి ఝషముల నెన్నఁడు నెఱుఁగము; మీనజాతుల కిట్టిమేను గలదె ?
యేమిటి కెవ్వఁడ ? వీ లీలఁ బ్రదిప్పెదు; కరుణ నాపన్నులఁ గావ వేఁడి
యంభశ్చరంబైన హరివి నే నెఱిఁగితి; నవ్యయ ! నారాయణాభిధాన
తే. జననసంస్థితిసంహార చతురచిత్త! దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ:
నీదులీలావతారముల్ నిఖిలభూత, భూతిహేతువుల్ మ్రొక్కెదఁ బురుషవర్య! 701

క. ఇతరులము గాము చిత్సంగతులము; మాపాల నీవు గలిగితి భక్త
స్థితుడవగు నిన్ను నెప్పుడు నతి సేసినవాని కేల నాశము గలుగున్ ? 702

క. శ్రీలలనాకుచవేదికఁ గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించు సుఖా
లోలుండవు; దామసాకృతి,; నేలా మత్స్యంబ వైతి వెఱింగింపు హరీ!" 703

వ. అని పలుకు సత్యవ్రతమహారాజునకు నయ్యుగంబుకడపటఁ బ్రళయవేళా సముద్రంబున
నేకాంతజనప్రీతుండయి విహరింప నిచ్చించి మీనరూపధరుండైన హరి యిట్లనియె

సీ. ఇటమీఁద నీ రాత్రి కేడవదినమునఁ బద్మగర్భుని కొక్కపొగలు నిండ;
భూర్భువాదికజగంబులు మూఁడు విలయాబ్ధిలోన మునుంగు; నాలోనఁ బెద్ద
నావ సేరఁగ వచ్చు; నా పంపు పెంపున దానిపై నోషధితతులు బీజ
రాసులు నిడి పయోరాశిలో విహరింపఁగలవు; సప్తర్షులఁ గలిసి తిరుగ
ఆ. మ్రోలఁ గాన రాక ముంచు పెంజీఁకటి. [1]మిడుకుచుండు మునుల మేనివెలుఁగు
దొలఁకుచుండు, జలధి [2]దోధూయమానమై, నావ దేలుచుండు నరవరేణ్య! 705

వ. మఱియు నన్నావ మున్నీటికరళ్లకు లోనుగాకుండ నిరుగెలంకుల వెనుక ముందట
నేమరకుండఁ బెన్నెఱు లగు నా [3]గఱులన్ [4]జడియుచుఁ. బొడువ వచ్చిన బలుగ్రహం
బుల నొడియుచు సంచరించెద; నొక్క పెనుఁ బాము చేరువ నాయనుమతిం బొడసూ
పెడు, దానంజేసి సుడిగాడ్పులకతంబున నావ వడిం [5]దిరుగంబడకుండ నాకొమ్ముతుదిం
బదిలముచేసి నీకును మునులకును సలజశి నెందకుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలి
రేయి పేగునంతకు మెలంగెద; నది కారణంబుగా జలచరరూపంబుఁ గయికొంటి; మఱి
యునుం బ్రయోజనంబు గలదు; నా మహిమ వరబ్రహ్మం బని తెలియుము; నిన్ను
నను గ్రహింతు నని సత్యవ్రతుండు నూడ హరి తిరోహితుం డయ్యె: నయ్యవసరంబున.

ఆ. మత్స్యరూపి యైన మాధవు [6]నుడుగులు, దలఁచికొనుచు రాచతపసియొక్క
దర్భశయ్యఁ దూర్పు దలగడగాఁ బండి, కాచి యుండె నాఁటికాలమునకు, 707

1. మినుకుచుండు-పాఠాంతరము, 2. దోధూయమానము-మిక్కిలి కదలుచున్నది.
3 గఱులు-ఱెక్కలు, 4. జడియుచు-చలించుచు, 5, దిరుగుడుబడకుండ-పాఠాంతరము
6. నుడుగులు- మాటలు.

వ. అంతఁ గల్పాంతంబు డాసిన. 708

క. ఉల్లసిత మేఘపంక్తులు [1]జల్లించి మహోగ్రవృష్టి జడిగొని కురియన్
వెల్లి విరిసి జలరాసులు సెల్లెలికట్టలను దాఁటి [2]సీమల ముంచెన్. 709

వ. తదనంతరంబ 710

తే. మున్ను పోయిన కల్పాంతమున నరేంద్ర! బ్రాహ్మ మనఁగ నైమిత్తిక ప్రళయవేళ
నింగిపై [3]నట్టతొలఁకు మున్నీటిలోనఁ గూలె భూతాళి జగములకొలఁదు లెడలి. 711

వ. అంత నమ్మహారాత్రియందు. 712

మ. నెఱి నెల్లప్పుడు సిల్పి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి పీ
[4]ఱిఱియన్ [5]నీల్గుచు, నావులించుచు సజుం డే సృష్టియున్ మాని మే
నొఱగన్ ఱెప్పలు మూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్
గుఱు వెట్టందొడఁగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా! 713

ఆ. అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి ముఖమునందు వెడలె మొదలిశ్రుతులు
నపహరించె నొక హయగ్రీవుఁడను దైత్య! భటుఁడు; [6]దొడరఁ బరులవళమె! 714

క. చదువులు దన చేపడినం జదువుచుఁ బెన్ బయల నుండ శంకించి పడిం
జదువులముదుకఁడు గూఁకఁ, జదువుల తస్కరుఁడు సొచ్చె జలనిధికడుపున్. 715

వ. ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన వాని జయింపవలసియు, బ్రామనుదీఁగెల విత్తనంబుల [7]పొత్తరలు పెన్నీట నాని చెడకుండ నునుపవలసియు నెల్లకార్యంబులకుం గావలి యగు నా పురుషోత్తముం డప్పెను రేయి [8]చొరుదలయందు.

క. [9]కుఱుగఱులు, వలుఁద మీసలు చిఱుదోఁకయుఁ, బసిఁడియొడలు సిరిగలపొదలున్
[10]నెఱి మొగము, నొక్కకొమ్మును మిఱుచూపులుఁగలిగి విభుఁడు మీనంబయ్యెన్. 717

వ. అట్లు లక్షయోజనాయతంబగు [11]పాఠీనంబై విశ్వంభరుండు జలధి సొచ్చి. 718

సీ. ఒకమాటు జలజంతుయూథంబుతోఁ గూడు నొకమాటు దరులకు నుఱికి వచ్చు;
నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు నొకమాటు లోపల నొదిఁగి యుండు;

---

[1]. జల్లించి-స్రవించి. 2. జీవుల-పాఠాంతరము, 3. బొట్టి-దొట్టి-పాఠాంతరములు, 4. ఱిఱియన్-బిగియంగా, 5 నీల్గుచు-శరీరము పెంచుచు, 6. తొడర — అనుసరింపంగా, 7. పొత్తంబులు - పాఠాంతరము. 8 చొరుదల - ప్రారంభము, 9. కుఱుగఱులు - చిన్న ఱెక్కలు, 10. నెఱి - అందమైన, 11. పాఠీనంబు - చేప,

నొకమాటు వారాశి నొడలుముంపఁగఁజూచు నొకమాటు బ్రహ్మాండ మొరయఁ దలఁచు;
నొకమాటు ఋషకోటి నొడిపి యాహారించు నొకమాటు జలముల నుమినివైచు

తే. గఱులు సారించు; మీసలు గదలుకొలుపుఁ;
బొదలు మెఱయించుఁ; గన్నుల [1]పొలవ మార్చుఁ;
నొడలు జళిపించుఁ; దళతళ లొలయు మీస
వేషి వెప్పిట [2]నిగమగవేషి యగుచు. 719

వ. అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచు నవసరంబున భక్తవరాధీనుండగు హరిం దలంచుచు నుండ నారాయణ ప్రేరితయై యొక్క నావ వచ్చినం గనుగొని. 720

మ. చని సత్యవ్రతమేదినీదయితుఁ డోజం బూని బ్రాహ్మీంగవి
త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై
మునిసంఘంబులు దాను నెక్కి [3]వెఱతో మున్నీటిపైఁ దేలుచుం
గనియెన్ ముందట భక్తలోక [4]హృదలంకర్మీణమున్ మీనమున్. 721

వ. కని జలచరేంద్రుని కొమ్మున నొక్కపునుఁబాఁపత్రాట నన్నావఁ గట్టి సంతసించి డెందంబు నివురుకొని తపస్విలుం దాను నారాచపెద్ద మీనాకారుండగు వేల్పుతేని నిట్లని పొగడందొడంగె. 722

మ. 'తమలోఁ బుట్టు నవిద్య గప్పిగొనుడుం దన్మూలసంసారవి
భ్రమములై కొందఱు దేఱచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో
గమునం దే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదంబందుదు, రట్టి నీవు కరుణం బాలింపు మీశ్వరా! 723

ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగా
జన్న తెఱంగు మూఢునకు నన్మతి దా గురుఁడౌట సూర్యుఁడే
కన్నులుగాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై గురుడవై యల సద్గతిజాడఁ జూపవే! 724

క. [5]ఇంగలముతోడి నంగతి బంగారము వన్నెగలుగుభంగిని ద్వత్సే
వాంగీకృతుల యఘంబులు భంగంబులఁబొందు ముక్తి ప్రాపించు హరీ! 725

---

1. పొలపము - ప్రకాశము, 2. నిగమగవేషి - వేదములను వెదకువాఁడు, 3. వెఱ - భయము 4. హృదలంకర్మీణము-హృదయమున కలంకారముగా నుండునది, 5. ఇంగలము-నిప్పు.

క. హృదయేశ! నీ ప్రసన్నత వదివేలవపాలి లేశభాగముకతనం
ద్రిదశేంద్రత్వము గలదఁట! తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా!

క. [1]పెఱవాఁడు గురుఁ డటంచును గొఱగానిపదంబు నూఁపఁ గుజనుండగు నీ
[2]నెఱత్రోవ నడవ నేర్చిన నఱమఱ లేనట్టి పదమునందు దయాబ్ధీ! 727

మ. చెలివై చుట్టమవై మనస్స్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కులపంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నొల్లకే
పలువెంటంబడి లోక మక్కట! వృథా బద్ధాశమై పోయెడిన్;
నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా! 728

ఆ. నీరరాశిలోన నిజకర్మబద్ధమై యుచితనిద్రఁ బొంది యున్న లోక
మే మహాత్ముచేత [3]నెప్పటి మేల్కాంచు నట్టి నీవు గురుఁడ వగుట మాకు. 729

క. ఆలింపుము విన్నప మదె వేలుపుగమిఱేని నిన్ను వేఁడికొనియెదన్;
నాలోని చిక్కు మానిచి నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా!" 730

వ. అని యిట్లు సత్యవ్రతుండు పలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరి పురాణపురుషుం డగుటం జేసి సాంఖ్యయోగక్రియా సహితయగు పురాణ సంహిత నుపదేశించె నమ్మహారాజు మునిసమేతుండై భగవన్నిగదితంబై [4]సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు విని కృతార్థుం డయ్యెః నతం డిమ్మహాకల్పంబున వివస్వంతుం డనం బరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుండన జన్మించి శ్రీహరి కృపావశంబున నేడవ మను వయ్యెః నంత నవ్విధంబునఁ బెనురేయి నిండునంతకు సంచరించి జలచరాకారుం డగు నారాయణుండు ద [5]న్నిశాంతసమయంబున. 731

మ. ఉఱ కంభోనిధి [6]రోసి, వేదముల కుయ్యున్ దైన్యముం జూచి, వే
గఱు లల్లార్చి, ముఖంబు సాఁచి, బలుపీఁకం దోఁక సారించి, మే
న్మెఱయన్ దౌడలు దీటి, మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁడ
[7]క్కఱటిం దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్. 732

వ. అంతం బ్రళయావసానసమయంబున. 733

సీ. ఎప్పుడు వేగునం చెదురుచూచుచు నుండు మునులడెందంబులు ముదమువొందఁ,
దెలివితోఁ బ్రక్క నిద్రించుభారతి లేచి యోరపయ్యెద జక్క నొత్తికొనగ,

---

1. పెఱవాఁడు-పరుఁడు. 2 నెఱత్రోవ-ఉత్తమమార్గము, 3. ఎప్పటి-ఎప్పటివలె, 4. సనాతనంబు-శాశ్వతము, 5. నిశాంతసమయంబు-తెల్లవాఱుసమయము, 6. రోసి-వెదకి, 7. కఱటి-దుష్టుఁడు

మలినమై పెనురేయి [1]మ్రక్కిన తేజంబు దొంటిచందంబునఁ దొంగలింపఁ,
బ్రాణుల సంచితభాగధేయంబులు గన్నులకొలుకులఁ గానఁబడఁగ,
తే. నవయవంబులు గదలించి, యావులించి నిదురఁదెప్పిఱి, మేల్కాంచి, నీల్గి, మలఁగి,
యొడలు విఱుచుచుఁ, గనుఁగవ [2]లుసుముకొనుచు ధాత గూర్చుండె సృష్టిసంధాతయగుచు

వ. అయ్యవసరంబున. 735

ఆ. వాసవారిఁ జంపి వానిచే పడియున్న వేదకోటి చిక్కు విచ్చి తెచ్చి
నిదుర మాని యున్న నీరజాసనునకు నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు. 736

క. జలరుహనాభునికొఱకై జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁ డా
జలధి బ్రదికి మను వయ్యెను జలజాక్షునిఁ గొలువ కెందు సంపద గలదే ? 737

ఆ. జనవిభుండు దపసి సత్యవ్రతుండును, మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు వినినవాఁడు బంధవిరహితుండు. 738

క. హరిజలచరావతారముఁ, బరువడిఁ బ్రతిదినముఁ జదుపఁ బరమపదంబున్
నరుఁ డొందు వాని కోర్కులు ధరణీశ్వర! సిద్ధిఁబొందుఁ దథ్యము సుమ్మీ! 739

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రం జెందు వాణీశుమో
ముల వేదంబులు [3]గొన్న దైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు [4]రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్. 740

వ. అని చెప్పి. 741

క. రాజేంద్ర! దైత్యదానవరాజమహాగహనదహన! రాజస్తుత్యా!
రాజావతంస! మానితరాజధరార్చిత! గుణాఢ్య! [5]రాఘవ రామా! 742

మాలిని. దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ! భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!
ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ! ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ! 743

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య
పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతపురాణంబను మహాప్రబంధంబునందు

---

1. మ్రక్కిన-కాంతిహీనమగు, 2. ఉసుముకొనుచు-తుడుచుకొనుచు, 3. కొన్న-అపహరించిన, 4. రాజన్మూర్తి-ప్రకాశించుచున్న రూపుకలవాఁడు, 5. రాజార్కనిభా-పాఠాంతరము.

స్వాయంభువస్వారోచిషోత్తమతామసమనువుల చరిత్రంబును, గరిమకరంబుల యుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవతచాక్షుషమనువుల వర్తనంబును. సముద్రమథనంబును, గరళ భక్షణంబును, నమృతాదిసంభవంబును, దేవాసురకలహంబును, హరి గపటకామినీ రూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయును, రాక్షసవధంబును, హరిహరసల్లాపంబును, హరికపటకామినీరూపవిభ్రమణంబును, వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణీంద్రసావర్ణి మనువుల వృత్తాంతంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును, వామనావతారంబును, శుక్రబలిసంవాదంబును, త్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షసుల సుతలగమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును నను కథలు గల యష్టమస్కంధము.

———

శ్రీరామచంద్రాయ నమః

# శ్రీమహాభాగవతము

## నవమస్కంధము



శ్రీ రాజిత! మునిపూజిత! వారిధి [1]గర్వాతిరేకవారణబాణా!
సూరిత్రాణమహోజ్జ్వలసారయశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా! 1

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీ సమేతుం డయిన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డయిన పరీక్షిన్నరేంద్రుండు శుక యోగీంద్రుం గనుంగొని. 2

సీ. మునుపుల నడవళ్ల[2] మర్యాదలును వింటి; మన్వంతరంబున మాధవుండు
దిరిగిన జాడలు దెలిసె; సత్యవ్రతుండను రాజు ద్రవిళదేశాధిపుండు
పోయిన కల్పాంతమున విష్ణు సేవించి విజ్ఞానమును బొంది [3]వెలుఁగుఱేని
కతఁడు వైవస్వతుండై పుట్టి మను వయ్యె; నతనికి నిక్ష్వాకుఁ డాదిగాఁగఁ
తే. బదురు గొడుకులు గల రంద్రు; పరఁగ వారి వంశ మే రీతి వర్తించెఁ? వారిలోనఁ
జనినవారిని జనువారిఁ జనెడువారిఁ జెప్పవే వ్యాసనందన! చిత్తగించి. 3

క. చెవులార నేఁడు వినియెద రవివంశమునందుఁ గలుగు రాజులకీర్తుల్
వివరింపు వరుసతోడను భువిఁ బుణ్యులకీర్తి వినినఁ బుణ్యము గాదే! 4

వ. అనినం బరాశరమునిమనుమం డిట్లనియె. 5

---

1. గర్వాతిరేకము-ఎక్కువగర్వము, 2. నడవళ్లు-క్రమములు, 3. వెలుఁగుఱేఁడు-సూర్యుడు.

—: వైవస్వతమనువంశకథనము :—

ఆ. వినుము మనువుకులము వేయినూఱేండ్లును బరఁగ విస్తరించి పలుక రాదు
నాకుఁ దోఁచినంత నరనాథ! వేగంబు యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు. 6

క. ఎక్కువదక్కువ [1]పొడవుల, కెక్కటిమొదలయిన పురుషుఁడింతయుఁ జెడఁదా
నొక్కఁడుఁ గల్పాంతంబున నక్కజమై నిల్చె విశ్వ మతఁడై యుంటన్. 7

సీ. భూమీశ! యమ్మహాపురుషుని నాభిమధ్యమున బంగారుఁ [2] గెందమ్మి మొలిచె;
నా దమ్మిపూవులో నటమీఁదఁ దనయంత నాలుగు మోముల [3]నలువ పుట్టె;
నాబ్రహ్మమనమున నట మరీచి జనించెఁ; గశ్యపుం డతనికిఁ గలిగె; నంత
నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁడై [4]చీఁకటిగొంగ వొడమె;
తే. జలజబంధుని పెండ్లాము సంజ్ఞ యందు శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁ డయ్యె,
మనువునకు శ్రద్ధ యనియెడి మగువయందుఁ బదురు గొడుకులు గలిగిరి భద్రయశులు. 8

వ. వార లిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండును, ధృష్టుండును, గరూశకుండును, నరిష్యంతుండును, బృషద్ధ్రుండును, నభంగుండును, గవియు నన నెగడి; రట మున్ను మనువు గొడుకులు లేవివాఁడై మిత్రావరుణుల నుద్దేశించి.

సీ. మనువు బిడ్డలు పుట్ట [5]మఖ మాచరించుచో నతని భార్యయు హోత నాశ్రయించి
కూఁతురు పుట్ట నాకుం జేయు మని పల్కి వర భక్తితోఁ బయోవ్రతము సలిపె;
నా సతి చెప్పిన ట్లధ్వర్యుఁడును [6] హోత 'నగుఁ గాక! వేలువు' మనుచుఁ బలికె;
హవి సందుకొని 'కూఁతు రయ్యెడు' మని వషట్కారంబు చెప్పుచుఁ గదిసి వేల్వ
తే. హోతపెడచేత విల యను [7]నువిద పుట్టె; దానిఁ బొడగని మనువు సంతాప మంది
"కొడుకు మేల్ గాక! యేటికిఁ గూఁతు? రకట! చెప్పవే" యని పోయె వసిష్ఠకడకు. 10

వ. చని యిట్లనియె. 11

క. "అయ్యా! కొడుకులకొఱకై యియ్యాగము నీ యనుజ్ఞ నేఁ జేయంగా
నియ్యాఁడు దేల పుట్టెను? [8]మీయంతటివారి కొండుమేరయుఁ గలదే! 12

వ. అదియునుం గాక మీరు బ్రహ్మవాదులరు; మంత్రవాదులరు; పాపంబు లంద కుండం జేయించువా; రిదియేమి?" యనవుడు మా తాత వసిష్ఠుండు హోతృ [9]వ్యభిచారం బెఱింగి మనువున కిట్లనియె. 13

1. పొడవులు-రూపులు-అవతారములు, 2. కెందమ్మి-ఎఱ్ఱతామరపూవు, 3.నలువ-బ్రహ్మ, 4. చీఁకటిగొంగ-సూర్యుఁడు, 5.మఖము-యాగము 6. కూతురగుఁగాక-పాఠాంతరము, 7. ఉవిద-యువతి 8. ఇచటప్రాసము చింత్యము, 9. వ్యభిచారంబు-తప్పిచరించుట, వేలుగుట.

తే 'అధిప! సంకల్ప [1]వైషమ్య మగుటఁజేసి హోత [2]కల్లతనంబున నువిద గలిగె;
నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజునిని నీవు మెచ్చంగఁ; జూడు నా నేర్పుబలిమి,' 14

వ. అని పలికి [3]భగవంతుం డగు వసిష్ఠుండు గీ_రితత్పరుండు గావున మనువు కూఁతు మగతనంబుకొఱకు నేకచిత్తంబున నాదిపురుషుఁడగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసికోరిన వరం బిచ్చె; నది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుమ్నుం డను కుమారుండయి రాజ్యంబు సేయుచు. 15

సీ. ప్రొద్దు వో కొకనాఁడు వోయి పేరడవులవెంట వేఁటాడుచు వేడ్కతోడఁ
గొందఱు మంత్రులు గూడ రా సైంధవం బయిన గుఱ్ఱము నెక్కి యందమైన
బలువిల్లు, గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి పెనుమెకంబులవెంట [4]బిఱుసుతోడ
నుత్తరదిశను మహోగ్రుఁడై చని చని మేరువుపొంతఁ గుమారవనముఁ
తే. జేరె; [5]నందు మహేశుండు [6]శివయు నెపుడు రతి సలువుచుందు; రందుఁ జొరంగఁబోవ
నాఁడు దయ్యెను రాజు; రాజానుచరులుఁ బడఁతులైరి తదశ్వంబు [7]బడబ యయ్యె. 16

వ. ఇట్లు మగతనంబు సెడి మగువలై యొండొరుల మొగంబులు సూచి [8] [9]మఱుఁగుచుండి; రనిన విని శుకునకు రా జి ట్లనియె. 17

ఆ. 'రాజుఁ దోడివారు రమణులైరేఁటివి, కాంతలగుట యేమికారణమున ?
నిట్టి [10]దేశమెఱుఁగ మెన్నఁడు; నా కథల్ వేడ్కదీర నాకు విస్తరింపు. 18

వ. అదియునుం గాక. 19

ఆ. మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ గాక పేరుఁ బెంపు [11]గాని గాఁగ
మగతనంబు మాని మగువ గావచ్చునె, మానవంతుఁడైన మానవునకు? 20

వ. అని యడిగిన నర్జునపౌత్రునకు వ్యాసపుత్రుండిట్లనియె. 21

సీ. 'పురవైరి కొకనాఁడు పొడసూపువేడుకఁ దద్దయు దిక్కులతమము లెల్లఁ
దమతమవెలుఁగులు దగిలి గొందులు సొరఁ గొందఱు మౌనులు గోరి రాఁగఁ
బ్రాణేశుతొడలపై భాసిల్లునంబిక వారలఁ జూచి మై వలువ లేమి
సిగ్గు పుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి దేవియు దేవుండు దీర్ఘలీల

1. వైషమ్యము-వేఱగుట, 2. కల్లతనంబు-మోసము, 3. భగవంతుడు-పూజ్యుడు, 4. బిఱుసు-కాఠిన్యము, 5. నవ్వేళ శంభుడు శివయుఁ దాను, నందుఁ గ్రీడింపఁ బొచ్చిన యంత్రమాత్ర, నాఁటదయ్యెను-పాఠాంతరము, 6. శివ-పార్వతి, 7. బడబ-ఆఁడుగుఱ్ఱము, 8. మఱుఁగు-దుఃఖించు, 9. నగుచు-పాఠాంతరము, 10. దే మెఱుంగ-పాఠాంతరము, 11. గాసిగాఁగ-నశింపఁగా,

తే. నొంటి దమలోనఁ గ్రీడించుచున్నవారు మనకు సమయంబు గాదని మరలి మునులు
నరుఁడు నారాయణుండు ననారతంబు మెలఁగు చోటికి నడచిరి మేదినీశ! 22

వ. అది కారణంబుగా భగవంతుండగు శివుండు దన ప్రియురాలివేడుకలకొఱకు నిట్లని
వక్కాణించె, 23

క. [1]ఈనెల వెవ్వఁడు సొచ్చిన మానిని యగు ననిన తొంటిమాటకతమునన్
మానవుఁడు మగువపోఁడిమి మానక పేరడవులందు మఱియుం దిరిగెన్. 24

వ. ఇట్లు చెలికత్తియలమొత్తంబులుం దానును నారావపూఁబోడి వాఁడిచూపుల [2]నాఁడు
పోఁడిమి నెఱపుచు దైవయోగబున [3]సోమసుతుండును భగవంతుండునునగు బుధుని
యాశ్రమంబు సేరి మెలఁగుచున్నయెడ. 25

ఆ. [4]రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర; రాజవదనఁ జూచె రాజుపట్టి;
దొంగకాముఁడంత దొందడిఁ జిగురాకు వాలు వెఱికి యుఱికి వారి మొత్తె, 26

వ. ఇట్లలరువిల్తుని నెఱబిరుదు చిగురుటడిదఁబుమొనకు [5]నోహటించి వార లిరువురుం
బైపడి వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుండను కుమారుండు వుట్టె;
నివ్విధంబున. 27

ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలితనమున, గొడుకుఁ గాంచి విసివి కుందికుంది
చింతఁ బొంది గురు వసిష్ఠుని భావించె నతనితలఁపుతోన యతఁడు వచ్చె. 28

వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాఁ డగుకొఱకు నమ్మునిపుంగవుండు శంకరు నారాధింప
నీశ్వరుండును దపస్ప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె. 29

మ. 'శనము న్నాడినమాటయున్ నిజముగాఁ దన్మౌనికిం బ్రీతిగా
[6][7]మనుజుండున్ నెల వో నెలం బురుషుఁడై మాసాంతరం బైనఁ గా
మినియై యీగతి వీడుపా టమర భూమిం దాన రక్షించుఁ బొ
మ్మనినన్ వచ్చె వసిష్ఠుఁ; డా మనుసుతుం డారీతి రాజ్యస్థుఁడై. 30

ఆ. మగువ యగుచు మరల మగవాఁడునగుచును, [7]భూతధాత్రి యంత నాతఁడేలెఁ
బ్రజలు సంతసింప బాహాబలముతోడ గురునికరుణఁజేసి కువలయేశ! 31

---

1. ఈ నేలెవ్వఁడు పాఠాంతరము. 2. ఆఁడుపోఁడిమి-స్త్రీత్వము, 3. సోమసుతుండు-చంద్రునిపుత్రుఁడు, 4. రాజుకొడుకు-బుధుఁడు, 5. ఓహటించి-భయపడి. 6. మనుజేంద్రుండు నెలనెన్నెలం-పాఠాంతరము, 7. మనుజుండు-మనుపుత్రుఁడు, 8. భూతధాత్రి-భూమి,

వ. అతనికి సుత్కలుండును, గయుండును, విమలుండును నను కొడుకులు మువ్వురు గలిగి ధర్మపరులై [1]యుత్తరాపథంబునకు రాజు లయిరి; సుద్యుమ్నుండు ముదుసలియై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి యిచ్చి వనంబునకుం జనియె నివ్విధంబున. 32

సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ [2]వందుచు మనువు వైవస్వతుండు
దనకు బిడ్డలుగల్గఁ దప మాచరించెను హరిఁగూర్చి నూతేండ్లు యమునలోన;
హరియంత నిక్ష్వాకుఁడాదిగాఁ బదుగురు పుత్రులనిచ్చెను బొసఁగ; వారి
యందుఁ బృషద్ధ్రాఖ్యుఁడనువాఁడు గురునాజ్ఞ విమలధర్మంబులు వెలయఁబూని
తే. పసుల [3]కదుపులఁగాచుచు బలు మొగిళ్లు వచ్చి నడురేయి జోరున వాన గురియ
మంద విడియించి చుట్టు నేమఱకయుండె నడవిమెకములు సొరకుండ నరసికొనుచు. 33

వ. అంత. 34

క. ప్రబ్బికొనిన పెంజీఁకటి నిబ్బరముగ [4]నడిఁకి నడికి నింగికి వడితో
గొబ్బున నెగసి తటాలున బెబ్బులి మందావుఁ బట్టెఁ [5] [6]బెలుకుఱి యఱవన్. 35

క. ఉల్లములు గలఁగి మొదవుల [7]వెల్లువ లన్నియును లేచి విచ్చలవిడితోఁ
జెల్లాచెదరై పాఱెను బెల్లుగ నంబే యటంచు బెబ్బులిగాలిన్. 36

వ. అయ్యవసరంబున. 37

శా. ఆ పెంజీఁకటి మ్రోల గాన [8]కడిదం బంకించి శార్దూల మం
చా[9]పుల్లావుశిరంబుఁ ద్రుంచి తెగదో యంచుం, బులిన్ వెండియున్
వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గర క్తంబుచేఁ
బై పై గీఱుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వంబడ్డ యద్ధేనువున్, 38

వ. చూచి దుఃఖితుడై యున్న పృషధ్రునిం గని కులగురుండగు వసిష్ఠుండు కోపించి 'నీవు రాజత్వంబునకుఁ బాసి యీ యపరాధంబున శూద్రుండవుగ' మ్మని శపియించె; నతండును గృతాంజలియై తన కులాచార్యునివలన మరలం గైకోలువడిసి యతని యనుమతంబున, 39

సీ. అఖిలాత్ముఁ డగుచున్న హరియందుఁ బరునందు భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి
యూర్ధ్వరేతస్కుఁడై యున్న ప్రాణులకెల్ల నాప్తుడై సర్వేంద్రియములు గెల్చి,

1. ఉత్తరాపథంబు-ఉత్తరభారతదేశము, 2. వందుచు-సంతాపము పొందుచు. 3. కదుపులు-మందలు, 4. నడిఁకి-బఱిఁగి, 5. పెలుకుఱి-భయముచే 6, బెంబడినఅవన్-పాఠాంతరము, 7. వెల్లువలు-గుంపులు, 8. ఆడిదంబు-కత్తి 9. పుల్లావు-కపిలగోవు.

సంగంబునకుఁ బాసి శాంతుండు [1]నపరిగ్రహుండునై కోరక యుండి, తనకు
వచ్చినయదియ జీవనము గావించుచుఁ; దనుఁ దాన నిలువుచు ధన్యబుద్ధి
తే. జడుని తెఱఁగున, సంధుని చందముననుఁ. జెవిటిభంగిని మహి నెల్లఁ జెల్లఁ దిరిగి
యడవులకు నేఁగి కార్చిచ్చునందుఁ జొచ్చి చిక్కి నియతుఁడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు.

క. కవియను కడపటి కొమరుఁడు భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ
గి వనమునఁ బరమపురుషునిఁ బ్రవిమలమతిఁ దలఁచి తలచి [2]పరముం బొందెన్. 41

వ. మఱియుఁ గరూశుం డను మానవునివలనం గొందఱు కారూశులు క్షత్త్రియులు గలిగి ధర్మంబుతోడిప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి; దృష్టునివలన ధార్ష్టం బను పంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభూయంబు నొంది నెగడె; నృగునివంశంబున సుమతి పుట్టె; నతనికి భూతజ్యోతి పుట్టె; నతనికి వసువు జనించె; వసువునకుం బ్రతీతుండు గలిగెఁ; బ్రతీతునికి నోఘవంతుఁడు జనించె; నతని కూఁతు నోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహం బయ్యె ; నరిష్యంతుండను మనుపుత్త్రునికి జిత్రసేనుం, డా విభునకు దక్షుం, డా పుణ్యునకు మీఢ్వాంసుం, డా సుజనునికి శర్యుం, డమ్మహాత్మునికి నింద్రసేనుం, డా రాజునకు వీతిహోత్రుం, డా సుమతికి సత్యశ్రవుం, డా ఘనునికి నురుశ్రవుం, డా వీరునకు దేవదత్తుం, డా పండితునకు నగ్నివేశుండు సుతు లయి జనియించి: రయ్యగ్నివేశుండు గానీనుం డన నెగడి జాతకర్ణుం డను మహర్షియై వెలసె; నతనివలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు గలిగె; నివ్విధంబున. 42

క. తెలుపఁబడె నరిష్యంతుని కుల మెల్లను నీకు; దిష్టకులముం దెలియం
దెలిపెద రాజేంద్రోత్తమ! తెలియును సర్వంబు నీకుఁ దేటపడంగన్. 43

వ. దిష్టుని కొడుకు నాభాగుం డనువాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందె: నా నాభాగునికి హలంధనుండు కలిగె; నతనికి వత్సప్రీతియు, వత్సప్రీతికిఁ బ్రాంశువు, నతనికిఁ బ్రమతియుఁ, బ్రమతికి ఖమిత్రుండు. ఖమిత్రునికిఁ జాక్షుషుండు, నతనికి వివింశతియు, వివింశతికి రంభుండు, రంభునికి ధార్మికుం డైన ఖనినేత్రుండు, నతనికిఁ గరంధనుండు, గరంధనున కవిక్షిత్తు, నా యవిక్షిత్తునకు మరుత్తుండు జనియించి; రా మరుత్తుఁడు చక్రవర్తి యయ్యె; నతనిచరిత్రంబు వినుము. 44

సీ. [3]అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ డతనియాగమునకు యాజకుండు,
దిరిగి యుండెవారు; మరుదాఖ్యగణము లాహ్వారు విశ్వేదేవు లచటిసభ్యు

---

1. అపరిగ్రహుఁడు-ఇతరులవలన నేమియుఁ దీసికొననివాఁడు, 2. పరము - మోక్షము, 3. అంగిరసుండు. పాఠాంతరము.

లధిక దక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను; సోమపానంబున సురవరుండు
మది నుబ్బి బంగారుమయము గావించెను యాగవస్తువు లెల్ల; నధికనియతి

తే. నా మరుత్తుఁడు సేసినయట్టిభంగి ధీరభావంబుఁ [1]జాగంబుఁ [2]దెంపుఁగలిగి
మఖము సేసినవారిని మఱియు నెఱుఁగ మెల్లలోకములందు నరేంద్రముఖ్య! 45

వ. ఆ మరుత్తునకు దముండును, దమునకు రాజవర్ధనుండును, రాజవర్ధనునకు సుధృతియు, సుధృతికి సౌధృతేయుండను, సౌధృతేయునకుఁ గేవలుండును, కేవలునకు బంధుమంతుండును, నతనికి వేదవంతుండును, వేదవంతునికి బంధుండును, బంధునకుఁ దృణబిందుండును సంభవించి; రంత. 46

క. అచ్చరకన్య యలంబుస [3]గ్రచ్చఱఁ దృణబిందుఁ జూచి కామించి తుదిం
బచ్చవిలుకానియమ్ముల [4]ముచ్చిచ్చున [5]వెచ్చి పొందె మోహాతురయై 47

వ. ఆ దంపతులకు నిలబిల యనుఁగూఁతురు జన్మించె: నా కొమ్మను విశ్రవసుండు వొందిన నైలబిలుం డనం గుబేరుండు వుట్టె; మఱియు నా తృణబిందునకు విశాలుండును, శూన్యబంధుండును, ధూమ్రకేతుండును ననువారు మువ్వురు గొడుకులు గలిగి, రందు విశాలుండు వంశవర్ధనుండై వైశాలి యను నగరంబు నిర్మించె; నా రాజునకు హేమచంద్రుం, డా నరేంద్రునకు ధూమ్రాక్షుం, డా పుడమిఱేనికి సహదేవుం, డా బలిష్ఠునకుఁ గృశాశ్వుం, డాతనికి సోమదత్తుండు జన్మించె; నతండు. 48

ఆ. అమరవిభుఁడు మెచ్చ నశ్వమేధము సేసి భూరిపుణ్యగతికిఁబోయె నెలమి;
సోమదత్తుకొడుకు సుమతికి జనమేజయుం డనంగఁ గొమరుఁ డుప్పతిల్లె. 49

వ. వీరులు వైశాలు రనంబరఁగి తృణబిందునికీర్తి వహించి రాజ్యంబు సేసిరి. మఱియును 50

సీ. శర్యాతియను రాజు జనియించె బ్రహ్మపరుండైన మనువుకు రూఢితోడ;
నతఁ డంగిరునిసత్త్రమందు రెండవనాఁటి విహితకర్మము నెల్ల వెలయఁ జెప్పె;
నతనికూఁతురు సుకన్యక యను వనజాక్షి దన తండ్రితోఁ దపోవనికి నరిగి
చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును ఫలపుష్పములు గోయఁ బాఱి తిరిగి

ఆ. యొక్కపుట్టలోన నొప్పారు జ్యోతుల రెంటిఁగాంచి వాఁడిముంటఁ బొడిచెఁ;
గన్య ముగుద మఱచి [6]ఖద్యోతయుగ మంచు దైవవశముకతనఁ [7]దమకి యగుచు. 51

---

1. చాగంబు-త్యాగము, 2. తెంపు-సాహసము. 3. గ్రచ్చఱ - వెంటనే, 4. ముచ్చిచ్చు-అగ్ని, 5. వెచ్చి-తపించి, 6. ఖద్యోతము-మిణుఁగురుపురుగు, 7. తమకి-తొందరపాటుకలది

క. జ్యోతుల ముంటం బొడిచిన వాతుల నెత్తురులు గురిసె వసుధేశభట
వ్రాతముల కెల్ల; నచ్చట నా తటి మలమూత్రబంధ మయ్యె నరేంద్రా! 52

వ. వారలం జూచి రాజర్షి యగు శర్యాతి విస్మితుండై 'మీర లియ్యాశ్రమదూషణంబు సేయ నోపుదు; రది కారణంబుగా మీకీ నిరోధంబు సిద్ధించె' నని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్యక యిట్లనియె. 53

తే. 'అయ్య! యీ పుట్టచేరువ నాడి యాడి యిందులో రెండు జ్యోతుల నేను గాంచి
[1]కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె; నే విధంబునఁ గురిసెనో యెఱుఁగు మీవు 54

వ. అనిన శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబుకడకుం జని యందుఁ దపంబు సేయుచున్న చ్యవనుని గని తన నేర్పున నతనివలనఁ బ్రసన్నత వడసి తపసిచిత్తంబు నెఱింగి తన పుత్రిక నిచ్చి యెట్టకేలకున్ బ్రదికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం జనియె; నంత. 55

ఆ. పరమకోపుఁ డయిన భార్గవుఁబతిఁ జేరి మిగులఁ బనులయెడల మెచ్చఁదరిగి
యతనిపర్ణశాల నా సుకన్యక యను మగువ గొన్ని యేండ్లు [2]మనువు మనియె. 56

వ. అంత నొక్కనాఁ డయ్యాశ్రమంబునకు వేల్పువెజ్జులైన యాశ్వను లిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి సూపి చ్యవనుం డిట్లనియె; 'మీకు మున్ను యాగభాగంబుల లేని సోమపానంబు నేడు గల్పించి యిచ్చెద; సోమపానసమయంబునఁ బానపాత్రంబు మీకు నందిచ్చెద; నాముదిమి మానుపుం' డని యిట్లనియె. 57

క. [3]నవకంబగు ప్రాయంబున జవరాండ్రఁ గరంచు మేని చక్కఁదనంబున్
శివతరముగఁ గృప సేయుఁడు దివిజాధిపవైద్యులార! దీవింతు మిమున్.' 58

వ. అనిన నశ్విదేవతలు సంతోషించి సిద్ధనిర్మితం బయిన యీ మడుఁగున మునుఁగు మని పలికి. 59

సీ. ముసలితాపసుఁబట్టి మొగి నెత్తుకొని పోయి ముగురు నా మడుఁగున మునిఁగి లేచి
వనితాజనము నెల్ల వలపించువారలై సుందరమూర్తులై సుభగు లగుచుఁ
గమలమాలికలతోఁ గనకకుండలములతో మంచిచీరలతోడఁ దుల్యు
లై సూర్యతేజస్కులై యున్నవారల ముగ్గురఁ బొడగాంచి ముగుదబాల
తే. యిందు, బెనిమిటి వీఁ డని యెఱుఁగలేక [4]గరిత గావున నిజనాథుఁ గానఁగోరి
'సుభగమతులార! నానాథుఁ జూపు'డనుచు [5]నశ్విదేవతలకవు దయ్యబల మ్రొక్కె. 60

1. కంటకంబు - ముల్లు, 2. మనువుమనియె - కాఁపురముచేసెను, 3. నవకంబు - సుందరము, 4. గరిత-పతివ్రత, 5. నశ్వినీదేవతల కయ్యబల—పాఠాంతరము,

వ. వార లా పతివ్రత [1][2]నిజచరితనంబునకు మెచ్చి వయోరూపసంపన్నుండయిన చ్యవనుం
జూచి దంపతులవీడ్కొని విమానారూఢులై వేలువులప్రోలికిం జని; రంత. 61

సీ. యాగంబు సేయంగ నర్థించి శర్యాతి చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ
గూఁతు నల్లునిఁ దోడుకొని పోవ వేడుక వచ్చి పుత్రికకుఁ బార్శ్వంబునందు
సూర్యతేజంబున సొంపారునరుఁ గని 'వీఁ డెవ్వఁడో' దీవిభుఁడు గాఁడ;
చెల్లరే!' యని పుత్రి సేసిన ప్రియములు మ్రొక్కులు నొల్లక మోము వాంచి
తే. మాఱుమాటాడ దీవింప మనసుకోని "చ్యవకుఁ డధికుండు మునిజన సత్తముండు
భువనసన్నుతుఁ డతఁడెందుఁ బోయె? నాతఁ డెట్లు వంచింపఁబడియె? వీడెవ్వఁ డబల! 62

మ. తగవే? ధర్మమె! శీలమే కులజవై దర్పించి మోదింప నా
జగదారాధ్యుని బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమనస్సమ్మతున్
మగనిన్ మాని భుజంగుఁ బొందఁ దగునే మానంబు వాటింపఁగాఁ
దగదే! దుర్గతిఁ ద్రోచితే కఠినవై తండ్రిం బతిం గూఁతురా ! 63

ఆ. [3]పద్మనయన! మగఁడు ప్రాయంపువాఁడైనఁ గావువెట్టి కొంతఁ గావ నేర్చుఁ;
[4]గడఁగి ముసలితపసి గావంగ నేర్చునే యువతి ముదుకఁ గూర్ప నొప్ప దెందు." 64

వ. అని పలికిన నప్పరమపతివ్రతాలలామంబు చిఱునగవు సెక్కుటద్దంబులఁ జిడిముడిపడఁ
దండ్రి కిట్లనియె. 65

క. 'నీ [5]యల్లుఁ డితఁడు భార్గవుఁ డయ్యా! జారుండు గాఁడు; హర్షముతోడన్
[6]నెయ్యంబు నిల్పు' మంచును దొయ్యలిసర్వంబు దండ్రితో వినిపించెన్. 66

వ. అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతుం గౌగిలించుకొని గారవంబున 'నయిదువవు గ'
మ్మని దీవించె; నంత భార్యాసహితుండై చ్యవనుండు సని తనమామకు యాగంబు
సేయించి యొక్కపాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజతపోబలంబున నశ్విదేవతల
కిచ్చినం జూచి. 67

క. కోపముతోడను వాసవుఁ డేపున ముని పైని వజ్రమెత్తిని మరలం
దాపసుఁడు వజ్రిభుజమున నా [7]పవి నిలిపెన్ జగంబు లాశ్చర్యపడన్. 68

---

1. నిజగరితతనంబునకు — పాఠాంతరము, 2. నిరమరితనంబు - సత్యశీలము,
3. ప్రమద—పాఠాంతరము, 4. గపతి—పాఠాంతరము, 5. ప్రాసము విచార్యము,
యకారము ద్విత్వముపొందినను లేకున్నను ప్రాసమున నిలుపుట యితనిరచనలఁ గాన
వచ్చుచున్నది.[చూ.స్కం. 9. ప. 12.], 6. నెయ్యంబు-ప్రేమ, 7. పవి-వజ్రాయుధము.

వ. ఇవ్విధంబున నశ్విదేవత లిద్దఱు వైద్యులై సోమభాగంబు లేనివారయ్యుఁ జ్యవనుసామర్థ్యంబునఁ [1]ప్రాప్తభాగులయి చనిరి; శర్యాతికి నుత్తానబర్హియు, నానర్తుండును, భూరిషేణుండు నను ముప్వురు కొడుకులు గలిగి; రందు. 69

సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె! నతఁడు కుశస్థల యనుపురంబు
నీరధిలోపల నిర్మించి పెంపుతో నానర్తముఖవిషయంబు లేలెఁ;
గనియెఁ గకుద్మిముఖ్యం బైన పందనశతము; రైవతుఁడు విశాలయశుఁడు;
దనకూఁతు రేవతి ధాతముందటఁ బెట్టి తగు వరు నడిగెడి తలఁపుతోడఁ
తే. గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేఁగి యచట గంధర్వకిన్నరు లజునిమ్రోల
నాటపాటలు సలుపఁగ [2]నవసరంబు గాక నిలుచుండె నతఁ డొక్కక్షణము తడవు. 70

వ. అంత నవసరంబైన నజునికి నమస్కరించి రైవతుండు రేవతిం జూపి యిట్లనియె. 71

అ. 'చాల ముద్దరాలు జవరాలు గొమరాలు నీ శుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ
మగఁడు? సెప్పు' మనిన మదిఁ జూచి పకపక నవ్వి భూమిపతికి నలువ పలికె. 72

సీ. 'మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచినవార లెల్లరు గాలవశతఁ జనిరి;
వారల బిడ్డల వారల మనుమల వారలగోత్రంబువారినైన
వినము మేదినిమీఁద; వినుము; నీవచ్చిన యీలోన నిరువదియేడు మాఱు
లొండొండ నాలుగు యుగములుఁ జనియె; నీ వటు గాన ధరణికి నరుగు మిపుడు.
తే. దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ భూమిభారంబు మాన్పంగఁ బుట్టినాఁడు;
సకలభూతాత్మకుఁడు నిజాంశంబుతోడ యుపతిమణి నిమ్ము [3]జనమణి కున్నతాత్మ!', 73

వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకంబునకుఁ జనుదెంచి సోదరస్వజనహీనంబగు తన నగరంబున కా రాజు వచ్చి బలభద్రుం గాంచి రేవతీకన్య నతనికిచ్చి నారాయణాశ్రమంబగు బదరికావనంబునకు నియమంబునఁ దపంబు సేయం జనియె. 74

క. నభగుఁడను మనుజపతికిని శుభమతి నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెం;
బ్రభులై [4]మసియెడుఁ దలఁపున విభజించిరి భ్రాత లతని [5]విత్తము నధిపా! 75

వ. అంత నాభాగుండును బ్రహ్మచారియై తన తోడంబుట్టువులను ధనంబులపాలడిగిన వారలు 'దండ్రి చెప్పినక్రమంబున నిచ్చెద' మనిన నాభాగుండు తండ్రియగు నభగు కడకుం జని 'విభాగంబు సేయు' మని పలికిన నతం 'డిందు నంగిరసులు మేధ గలవార

1. ప్రాప్తభాగులు-పొందబడిన భాగము కలవారు-వంతుకలవారు, 2. అవసరంబు సమయము. 3. జనమణి - ఉత్తమజనుఁడు-బలరాముఁడు, 4. కవియను-పాఠాంతరము. 5. వీటిడిధనమున్-పాఠాంతరము.

లయ్యును సత్త్రియాగంబు సేయుచు నాఱవ దినంబున నర్హకర్మంబులు దోఁపక మూఢులయ్యెదరు; వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండెఱింగించినఁ గవి యనం బ్రసిద్ధి కెక్కెదవు; దానంజేసి వారు కృతకృత్యులై స్వర్గంబునకుఁ బోవుచు, సత్త్రి [1]పరిశేషితంబైన ధనంబు నీ కిచ్చెద' రని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు సని యట్లు సేసిన నంగిరసులు సత్త్రిపరిశేషితధనంబు లతని కిచ్చి నాకంబునకుం జని; రంత. 76

క. అంగిరసు లిచ్చు పసిఁడికి మంగళమతిఁ జేరు నృపుని మానిచి యొకఁ [2]డు
త్తుంగుఁడు [3]గృష్ణాంగుఁడు దగ ముంగల నిలుచుండి విత్తముం జేకొనియెన్. 77

వ. వానిం జూచి నాభాగుండు దనకు మును లిచ్చుటంజేసి తన ధనం బని పలికిన నమ్మహాపురుషుండు 'మీతండ్రి సెప్పిన క్రమంబ కర్తవ్యం' బనిన నాభాగుండు నభగు నడిగిన నతండు యజ్ఞమందిరగతంబై [4]యుచ్ఛిష్టం బగు ధనంబు దొల్లి మహామునులు రుద్రుని కిచ్చి; రది కారణంబుగా నా దేవుండు సర్వధనంబునకు నర్హుం' డనిన విని వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి 'దేవా! యీ ధనంబు నీయధీనం' బని మా తండ్రి సెప్పె; నే నపరాధంబు సేసితి; సహింపు' మనవుడు భక్తవత్సలుండగు నమ్మహాపురుషుండు నభగు సత్యవచనంబునకు నాభాగుని నిజంబునకు మెచ్చి 'నీవు దప్పక పలికితివి కావున సత్త్రిపరిశేషితంబగు ధనబు నీకు నిచ్చితి' నని పలికి [5]యంతర్దర్శిత్వంబును, సనాతనంబగు బ్రహ్మజ్ఞానంబును నుపదేశించి తిరోహితుండయ్యె; నివ్విధంబున. 78

క. భువిలో నాభాగునికథ దవిలి మతిన్ రేపు మాపుఁ దలఁచినమాత్రం
గవి యగు; మంత్రజ్ఞుం డగుఁ బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై. 79

వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె; నతనియందు జగ [6]దప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె ననిన విని యేమి కారణంబున దురంతంబైన బ్రహ్మదండంబువలన నతండు విడువంబడియెననిన నప్పుడమితేనికి శుకుం డి ట్లనియె. 80

## అంబరీషోపాఖ్యానము

శా. సప్తద్వీపవిశాలభూధరము [7]దోఃస్తంభంబునం బూని సం
ప్రాప్తశ్రీయుతుఁడై మహీవిభవసంపద్చాతురిం గల్గి దు

1. పరిశేషితంబు-మిగిలినది, 2. ఉత్తుంగుఁడు-పొడగరి, 3. జలద నిభాంగుఁడు-పాఠాంతరము. 4. ఉచ్ఛిష్టంబు-విడువఁబడినది. 5. అంతర్దర్శిత్వంబు - లోపలిచూపు, 6. అప్రతిహతంబు-అడ్డులేనిది, 7. దోఃస్తంభంబు-స్తంభమువంటి భుజము.

రాజ్యప్తిం జెందక వైష్ణవార్చనలమేరం గాలముం బుచ్చుచున్
[1]సుప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్. 81

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద; పలుకులు హరిగుణపఠనమంద;
కరములు విష్ణుమందిర [2]మార్జనములంద; శ్రవములు హరికథాశ్రవణమంద;
చూపులు గోవిందరూపవీక్షణమంద; శిరము గేశవనమస్కృతులయంద;
పదము లీశ్వరగేహ [3]పరిసర్పణములంద; కామంబు చక్రి [4]కైంకర్యమంద;
తే. సంగ మచ్యుతజనతనుసంగమంద; ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికమలమంద;
[5]రసన దులసీదళములంద; రతులు పుణ్యసంగతులయందు యా రాజచంద్రమునకు 82

వ. మఱియు నమ్మహీవిభుండు. 83

సీ. ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై యజ్ఞేశు నీశు నబ్జాక్షుఁగూర్చి
[6]మొనసి వసిష్ఠాదిమునివల్లభులతోడఁ దగిలి సరస్వతీతటమునందు
మేధతో బహువాజిమేధంబు లొనరించె గణుతింపరాని దక్షిణలు వెట్టి
[7]సమలోష్టహేముఁడై సర్వకర్మంబులు హరిపరంబులుగాఁగ నవని యేలె;
ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గలంక మెడల మనసు లంకె పెట్టి
విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై యతఁడు రాచతపసి యనఁగ నొప్పె. 84

వ. వెండియు నమ్మహాభాగవతుండు. 85

క. హరి యని [8]సంభావించును; హరి యని దర్శించు; నంటు; నాఘ్రాణించున్;
హరి యని రుచిగొనఁ దలఁచును; హరి హరి ! ఘను నంబరీషు నలవియె పొగడన్? 86

వ. ఇట్లు పుణ్యచిత్తుండు, నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న సమయంబున. 87

ఆ. అతని [9]కీహ మానె హరులందుఁ గరులందు ధనములందుఁ గేశివనములందుఁ
బుత్రులందు బంధుమిత్రులయందును బురమునందు నంతిపురమునందు. 88

వ. అంతఁగొంతకాలంబున కమ్మేదినీకాంతుండు సంసారంబుపలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుండయి యుండ నా రాచతపసికి భక్తలోకవత్సలుం డగు పురుషోత్తముండు ప్రతిభటశిక్షణంబును, నిజజనరక్షణంబును, నిఖిలజగదవక్రంబును నగు చక్రంబు నిచ్చి చనియె; నంత. 89

1. సుప్తి-మాంద్యము, 2. మార్జనములు-ఊడ్చుటలు, 3. పరిసర్పణములు-నడచుటలు, 4. కైంకర్యము-సేవ, 5. రసన - నాలుక, 6. మొనసి-పూని. 7. సమలోష్ఠహేముఁడు - తాతియందును బంగారమునందును సమానమగు బుద్ధికలవాఁడు, 8. సంభావించును - గౌరవించును, 9. ఈహ- కోరిక.

క. తనతోడినీడ కైవడి ననురూపగుణాఢ్య యైన యాత్మమహిషితో
జనవిభుఁడు ద్వాదశీవ్రత మొనరఁగ హరిఁ గూర్చి చేసె నొక యేఁ డధిపా! 90

వ. ఇట్లు వ్రతంబు చేసి యా వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడురాత్రులుపవసించి, కాళిందీజలంబుల స్నాతుండయి, మధువనంబున మహాభిషేక విధానంబున విహితపరికర సంపన్నుండయి, హరి నభిషేకంబుసేసి మనోహరంబులయిన గంధంబులు సమర్పించి యభినవామోదంబులైన పుష్పములం బూజించి తదనంతరంబ. 91

శా. పా లేత్రై [1]ప్రవహింప [2]దగ్గఱుచు లేఁబ్రాయంబులన్ రూపము
ల్మేలై ధూర్తలు గాక వేఁడి [3]గొరిజ ల్హేమోరుశృంగంబులుం
గ్రాలం [4]గ్రేపుల యఱ్ఱు నాఁకుచును [5]రంగచ్ఛాయలై యున్నమం
దాలన్ [6]న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వైదికశ్రేణికిన్. 92

క. పెక్కండ్రు విప్రవరులకు గ్రక్కున నతిభక్తితోడఁ గడుపులు నిండం
జొక్కపుటన్నం బిడి విభుఁ డొక్కెడఁ [7]బారణము సేయ నుద్యోగింపన్. 93

వ. అయ్యవసరంబున. 94

క. భాసురనిగమపదోపన్యాసుఁడు సుతపోవిలాసుఁ డనువమయోగా
భ్యాసుఁడు రవిభాసుఁడు దుర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్. 95

వ. అట్లతిథియై వచ్చిన నమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు చేసి కూర్చుండ గద్దియయిడి పాదంబులు గడిగి పూజించి సేసం బరసి తనయింట నన్నంబు గుడువుమని నమస్కరించిన నమ్మహాత్ముఁడు సంతసించి భోజనంబునకు నంగీకరించి నిర్మలంబులగు కాళిందీజలంబులం బరమధ్యానంబు సేయుచు మునింగి లేచి రాక తడవుసేసిన ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశియందేఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నద్దేశించి. 96

క. 'ముని నీరు సొచ్చి వెడలఁడు చనియెడు ద్వాదశియు; నింత సనియె; న్నీలో
నన పారణయున్ వలయును, [8]వినిపింపుం డర్హధర్మవిధ మెట్టిదియో?' 97

వ. అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి. 98

---

1. పఱవంగ దగ్గఱుచు లేఁబ్రాయంబులై - పాఠాంతరము 2. నంగరుచులం - పాఠాంతరము 3. గొరిజల్-గిట్టలు, 4. క్రేపులు - దూడలు, 5. రంగచ్ఛాయలు - ప్రకాశించు చాయలుకలవి, 6. న్యర్బుదషట్కము - అఱువది అర్బుదములు, 7. పారణము- ఉపవాసానంతరభోజనము, 8. వినుఁడర్హంబైన - పాఠాంతరము.

ఆ. 'అతిథి వోయి రామి నధిప! యీ ద్వాదశి పారణంబు మానఁ బాడి గాదు;
గుడువకుంట గాదు కుడుచుటయును గాదు; [1]సలిలభక్షణంబు సమ్మతంబు.' 99

వ. అని ధర్మసందేహంబు నాపిన సా రాజర్షి శ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు
పారణంబు సేసి జలంబుల మునింగిన తపసిరాక కెదురుసూచుచున్న సమయంబున. 100

సీ. యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజుచే సేవితుండై రాజుచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో నదరెడిమేనితో నాగ్రహించి
రెట్టించి యాఁకలి [2]గొట్టుమిట్టాడంగ 'నీ సంపదున్మత్తు నీ నృశంసు
నీ దురహంకారు లిందఱుఁ గంటిరే? విష్ణుభక్తుఁడు గాఁడు; వీఁడు నన్నుఁ
తే. గుడువరమ్మని మునుముట్టఁగుడిచినాఁడు; ధర్మభంగంబు సేసి దుష్కర్ము డయ్యె!
నయిన నిప్పుడు సూపెద; నన్నిదిశల నేరు గోపింప మాన్పువాఁ డెవ్వఁ? డనుచు. 101

చ. పెటపెటఁ బండ్లుగీటుచును, భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్
పొటపొట రాల, [3]గండములు పొంగ, మునీంద్రుఁడు హుంకరించున్.
జటమొద లంటఁగాఁ బెఱికి చక్కన దానన కృత్య నాయుధో
త్కట [4]వరశూలహస్తయుతఁగా నొనరించి [5]కవించె రాజుపై. 102

వ. అంత. 103

క. కాలానలసన్నిభయై శూలాయుధహస్త యగుచు సుఱుసుఱ స్రుక్కన్
నేలఁ బదంబులఁ ద్రొక్కుచు, [6]వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్. 104

ఆ. ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుఁడు 'వెఱ్ఱితపసి సేయు [7]వేడబంబుఁ
జక్కఁబెట్టు' మనుచుఁ జక్రంబుఁ బంచిన వచ్చెనదియుఁ బ్రళయవహ్నిపగిది. 105

వ. వచ్చి ముని పంచిన కృత్యను దహించి తనివి నసక మునివెంటం బడిన మునియును
మేరుగుహ సొచ్చిన నడియు [8]వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన
చొచ్చి మఱియును- 106

మ. భువిఁ దూఱన్ భువిఁ దూఱు నబ్ధిఁ జొర నబ్ధుల్ సొచ్చు; నుద్వేగియై
దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు; దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ; జి

---

1, సలిల భక్షణంబు నీరుత్రావుట; 2. కొట్టుమిట్టాడంగ-అధికముకాఁగా, 3. గండములు - కపోలములు, 4, వలమానహస్త — పాఠాంతరము 5. కవించె - పైకొలిపెను నంపెను, 6. వాలి-అతిశయించు, 7. వేడబంబు - మాయ, 8. వ్యాళంబు - పాము.

క్కి వెనం గ్రుంగినఁ గ్రుంగు; నిల్వ నిలుచుం; [1]గ్రేడింపఁ గ్రేడించు; నొ
క్కవడిన్ దాపసువెంట నంటి హరిచక్రం బన్యదుర్వక్రమై. 107

శా. ఏ లోకంబునకైన వెంటఁ బడి, తో నేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ జని [2]దేవజ్యేష్ఠు [3]లోకేశు వాఁ
డాలోకించి 'విధాత! విశ్వజననవ్యాపారపారీణ రే
ఖాలీలేక్షణ! చూడవే! కరుణఁ జక్రంబున్ నివారింపవే.' 108

వ. అనిన బ్రహ్మ యి ట్లనియె. 109

మ. కర మర్థిన్ ద్విపరార్ధసంజ్ఞ గల యీ కాలంబుఁ [4]గాలాత్ముఁడై
సొరిదిన్ నిండఁగఁ జేసి, లోకములు, నాచోటున్, విభుం డెవ్వఁడో
పరిపూర్తిన్ గనుఁగ్రేవఁ గెంపు గదురన్ భస్మంబు గాఁ జేయు, నా
హరి చక్రానలకీల కన్యుఁ డొకరుం డడ్డంబు గానేర్చునే? 110

ఆ. ఏను, భవుఁడు, దక్షుఁ, డింద్రాదులును, బ్రజా పతులు, భృగుఁడు, భూతపతులు శిరము
లందుఁ దాల్తు మతనియాజ్ఞ జగద్ధితం బంచు, భూరికార్య[5]మతుల మనుచు. 111

వ. కావున సుదర్శనానలనివారణంబునకు నోప' నని విరించి పలికిన దుర్వాసుండు గైలాసంబునకుఁ జనుదెంచి, శర్వు నాలోకించి చక్రానలంబు తెఱం గెఱింగించిన నమ్మహాదేవుం డి ట్లనియె. 112

సీ. 'వినవయ్య! తండ్రి! యీ విశ్వేశ్వరునియందుఁ [6]జతురాస్యజీవకోశములు పెక్కు
వేలసంఖ్యలు గూడి, వేళతో నిబ్బఁగి నగుచుండుఁ; జనుచుండు; నదియుఁగాక
యెవ్వానిచే భ్రాంతి నే మందు చున్నార, మేను, దేవలుఁ. డసురేంద్రసుతుఁడు,
నారదుఁ, డజుఁడు, సనత్కుమారుఁడు, ధర్ముఁ, డా కపిలుఁడు, మరీచ్యాదు లన్య
ఆ. పారవిదులు, సిద్ధపతులు, నెవ్వనిమాయ, లెఱుఁగలేము, దాన నింత పడుదు
మట్టి నిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ, దొలఁగఁజేయ మాకు దుర్లభంబు. 113

వ. మునీంద్రా! నీవు నమ్మహాత్ముని శరణంబు వేఁడు' మతండు మేలు సేయం గలవాఁ'డని పలికిన నీశ్వరునిపలన నిరాశుండై దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని. 114

---

1. క్రేడింప - తొలఁగఁగా, 2. దేవజ్యేష్ఠుఁడు - బ్రహ్మ, 3 బ్రహ్మాన్ బుధుం. పాఠాంతరము, 4 కాలాత్ముఁడు-కాలస్వరూపుఁడు. 5. హతులమగుచు — పాఠాంతరము, 6. చతురాస్యజీవకోశములు—బ్రహ్మాండములు.

శా. ఆ వైకుంఠములోని ¹భర్మమణిసౌధాగ్రంబుపై లచ్చి దా
గ్రేవన్ మెల్లన ²నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్
దేవాధీశ్వరుఁ గాంచి 'యో వరద! యో దేవేశ! యో భక్తర
క్షావిద్యావరతంత్ర! మానుపఁగదే చక్రానలజ్వాలలన్. 115

ఉ. నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగ లేక, నీ
ప్రేమకు వచ్చు దాసులకుఁ ³గ్రించుఁదనంబున నెగ్గు సేసితిన్;
నా ⁴మఱపున్ సహింపు మట ⁵నారకుఁడైన మనంబులో భవ
న్నామము చింత సేసిన ననంతసుఖస్థితి నొందకుండునే?' 116

వ. అనిపలికి పాదకమలంబులకు మ్రొక్కి లేవకయున్న దుర్వాసునింగని హరి యిట్లనియె. 117

చ. 'చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం
గిలి కొని పోవుచుండుదు రకిల్బిషభక్తిలతాచయంబులన్;
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్;
వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతం జనకుందుఁ దాపసా! 118

ఆ. నాకు మేలు గోర, నాభక్తులక కాని; భక్తజనుల కేన పరమగతియు;
భక్తుఁడెందు జనినఁ బఱతెంతు వెనువెంటఁ గోవువెంటఁ దగులు కోడెభంగి. 119

వ. అదియునుంగాక. 120

ఆ. తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల, నాలి విడిచి, సంపదాలి విడిచి,
నన్నకాని యన్య మెన్నఁడు నెఱుఁగని వారి విడువ నెట్టివారినైన, 121

క. పంచేంద్రియముల తెరువుల వంచించి మనంబునందు పరమతుఁ బ్రతి
ష్ఠించి వహింతురు నన్నును, మంచివరుం బుణ్యసతులు ⁶మరిగిన భంగిన్. 122

క. సాధులహృదయము నాయది; సాధులహృదయంబు నేను; జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు; సాధు లెఱుఁగుదురు నాదుచరితము విప్రా! 123

ఆ ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు ముక్తిసేయుచుండు ముదముతోడ;
దుర్వినీతు లగుచు దుర్జను లగువారి కివియెఁ గీడుసేయ కేల యుండు? 124

---

1. భర్మమణిసౌధము-రత్నములు పొదిగిన మేడ, 2 నర్మభాషణములు-చలోక్తులు, 8. క్రించుఁదనంబు-దుష్టత్వము, 4. మఱపు-అజ్ఞానము, 5. నారకుఁడు-పాపాత్ముఁడు, 6. మరగు-ఆశించు.

క. నా తేజము సాధులలో నాతతమై యుండు; వారి నలంచు జనులకున్
[1]హేతిక్రియ భీతి నిచ్చుం; జేతోమోదంబుఁ జెఱుచు సిద్ధము సుమ్మీ! 125

క. అదె పో! బ్రాహ్మణ! నీకును సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుతగుణా
స్పదుఁ డిచ్చు నభయ; మాతని మది సంతసపఱచి వేఁడుమా శరణంబున్. 126

మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ
జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదితశ్వాసుండు దుర్వాసుఁ డ
ల్లన యేతెంచి సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్యవేషున్ [2]విదో
షు నయోదారమనీషు మంజుమితభాషు న్నంబరీషున్ వెసన్. 127

వ. కని దుఃఖితుండయి యమ్మహీవల్లభుపాదంబులువట్టి విడువకున్న నా నరేంద్ర చంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరుణారసభరితహృదయుండయి హరిచక్రంబు నిట్లని స్తుతియించె. 128

సీ. 'నీవ పావకుఁడవు; నీవ సూర్యుఁడవు, నీవ చంద్రుండవు; నీవ జలము;
నీవ నేలయు; నింగి నీవ; సమీరంబు నీవ; భూతేంద్రియనికర మీవ;
నీవ బ్రహ్మంబును; నీవ సత్యంబును; నీవ యజ్ఞంబును; నీవ ఫలము;
నీవ లోకేశులు; నీవ సర్వాత్మయు; నీవ కాలంబును నీవ జగము;
తే. నీవ బహుయజ్ఞ భోజివి; నీవ నిత్య, మూలతేజంబు; నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మన్నించునట్టి, శస్త్రముఖ్యమ! కావవే చాలు! మునిని. 129

మ, హరిచే నీవు [3]విసృష్టమై చనఁగ మున్నాలించి నీధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్క మంచు మునుపే దైత్యేశ్వరవ్రాతముల్
శిరముల్ బాదములున్ భుజాయుగళముల్ ఛేదిల్లి యంగంబుల
న్బోరగం బ్రాణసమీరముల్ వదలు నీ యుద్ధంబులం జక్రమా! 130

ఆ, కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన, నిన్నుఁ జూచి [4]దీర్ఘ నిద్ర వోదు
రసురవరులు శయ్యలం దున్న సతులు ప్రభాతమందు లేచి వలవరింప. 131

ఉ. చీకటిఁ బాపుచున్ వెలుఁగు సేయుచు సజ్జనకోటి నెల్ల స
శ్రీకను జేయు నీరుచులు సెల్వుగ ధర్మసమేతలై నినున్

1. హేతి-ఆయుధము, 2. విదోషుఁడు-దోషములులేనివాఁడు, 3. విసృష్టము-విడువఁబడినది, 4. దీర్ఘనిద్ర-మరణము.

వాకున నిట్టి దట్టి దని వర్ణన సేయ విధాత నేరఁ డ
స్తోకము [1]నీదురూపు గలదుం దుది లేదు పరాత్పరాద్యమై. 132

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ బాలు సేయ నీవు పాలు పడితి;
వైన నింకఁ జాలు; నాపన్నుఁడై యున్న, తపసిఁ గావు మీవు ధర్మవృత్తి. 133

వ. అని వినుతించి కేలుఁదమ్మిదోయి నొసలం బొసంగించి యిట్లనియె. 134

ఆ. ఏ నమస్కరింతు [2]నింద్రశాత్రవధూమకేతువునకు ధర్మసేతువునకు
విమలరూపమునకు విశ్వదీపమునకుఁ, జక్రమునకు [3]గుప్తశక్రమునకు. 135

వ. అని మఱియు నిట్లనియె. 136

ఆ. విహితధర్మమందు విహరింతు నేనియు [4]నిష్టమైన ద్రవ్య మిత్తునేని,
ధరణిసురుఁడు మాకు దైవతం బగునేని విప్రునకు శుభంబు వెలయుగాక ! 137

క. అఖిలగుణాశ్రయుఁడగు హరి సుఖియై నాకొలువువలనఁ జొక్కెడినేనిన్.
నిఖిలాత్మమయుం డగుటకు సుఖమందుంగాక భూమిసురుఁ డివ్వేళన్ ? 138

వ. అని యివ్విధంబునం బొగడు పుడమిఱేనివలన మన్నించి తపసిని [5]దాహంబు నొందిం
పక రక్కసులగొంగ చక్రంబు తిరిగి చనియె; నంత దుర్వాసుండు శాంతిం బొంది
మెల్లని మాటల నా రాజున్ దీవించి యిట్లనియె. 139

మ. 'నరనాథోత్తమ ! మేలు సేసితి కదా! నాతప్పు మన్నించి; శ్రీ
హరిపాదాబ్జము లింత ముట్టఁ గొలుతే ? యాశ్చర్యమౌ నెన్నఁచో;
నరుదం; డ్రే నినుబోఁటి సాధునకుఁ దానై యిచ్చుటల్ గాచుటల్
[6]సొరిదిన్ నైజగుణంబులై నరస వచ్చుం గాదె మిత్రాకృతిన్. 140

వ. అదియునుంగాక. 141

మ ఒక మా టెవ్వనిపేరు కర్ణములలో నొయ్యాకమై సోఁకినన్
సకలాఘంబులుఁ [7]బల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో, నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవ దేవేశు ని
న్నకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ ! 142

---

1 నీ మహామహిమ, దోషనివారి పరాపరాద్యమున్-పాఠాంతరము. 2. ఇంద్ర...కేతువు-ఇంద్రునికిశత్రువులగు రాక్షసులవినాశ సూచకమగు తోఁకచుక్క. 3. గుప్తశక్రము-ఇంద్రునికాపాడునది 4. ఇష్టమైన-కోరిన 5. దాహంబు-తాపము 6. సొరిది-క్రమము 7. పల్లటిల్లి-చలించి.

మత్తకోకిలము. తప్పు [1]లోఁగొని చక్రపావకదాహముం బెడఁబాపి; తొ
నొప్పు నొప్పు భవద్దయారస; మోనరేశ్వర ! ప్రాణముల్
సెప్ప మున్మను వోయి క్రమ్మఱ జేరె; ధన్యుఁడ నైతి; నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా!' 143

క. అనిన విని రాజముఖ్యుడు మునివల్లభు పాదములకు మ్రొక్కి కడున్ మ
న్ననసేసి యిష్టభోజన మనువుగఁ బెట్టించెఁ దృప్తుఁ డయ్యె నతండున్ 144

వ. మఱియు నమ్మునీంద్రుం డిట్లనియె 145

శా. " కంటిన్ నేఁటికి నిన్ను నీవచనముల్ కర్ణద్వయిం బ్రీతిగా
వింటి న్నన్నముఁ గొంటి నీగృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె నే
మంటిం బోయెద ! నీచరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁగల రీ మీఁదన్ నరేంద్రాగ్రణీ!" 146

వ అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి కీర్తించి మింటితెరువున బ్రహ్మలోకంబు
నకుం జనియె మునీశ్వరుండు వచ్చి మగుడం జను వేళకు నొక్కవత్సరంబు నిండి
వ్రతంబు పరిపూర్ణంబైన 147

ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రం బైన వంటకంబు భూమివరుఁడు గుడిచెఁ
దపసి [2]సెగులు మాన్పఁ దా నెంతవాఁడను హరికృపామహత్త్వ మనుచుఁ దలఁచి. 148

వ. మఱియును 149

క. హరిఁ గొల్చుచుండువారికిఁ బరమేష్ఠిపదంబు మొదలు [3]పదభోగంబుల్
నరకసమము లను తలఁపున ధరణీరాజ్యంబుతోడి [4]తగులము మానెన్! 150

వ. ఇట్లు విరక్తుండై. 151

ఆ తనకు సదృశులైన తనయుల రావించి ధరణిభరము వారిఁ దాల్పఁబంచి
కాననంబు సొచ్చెఁ గామాదివిజయుఁడై వరవిభుండు హరిసనాథుఁ డగుచు 152

క. ఈ యంబరీషచరితముఁ [5]దీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా ! 153

1. లోఁగొని - అణంచుకొని లెక్కింపకయనుట. 2. సెగులు-బాధ, 3. ఫలభోగం
బుల్ - పాఠాంతరము. 4. తగులము - సంబంధము 5. తీయంబున - ప్రియముగా.

వ. విను మయ్యంబరీషునకు విరూపుండును గేతుమంతుండును శంభుండును నను వారు ముగ్గురు గొడుకు లందుఁ గేతుమంతుండును శంభుండును హరిం గూర్చి తపంబు సేయు వారై వనంబునకుం జనిరి విరూపునికిఁ బృషదశ్వుండును బృషదశ్వునకు రథీతరుం డును గలిగి; రమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుం డను మునీంద్రుం డతని భార్యయందు బ్రహ్మతేజోనిధులయిన కొడుకులం గలిగించె వారలు రథీతరగోత్రులు నాంగిరసులను బ్రాహ్మణులునై యితరులందు ముఖ్యులయి ప్రవర్తిల్లి' రని చెప్పి శుకుం డిట్లనియె 154

### ఇక్ష్వాకువంశానుక్రమము

క. ఒకనాఁడు మనువు దుమ్మిన వికలుఁడు గా కతని [1]ఘ్రాణవివరము వెంటం
బ్రకటయశుం డిక్ష్వాకుం డకలంకుఁడు పుట్టె [2]రవికులాధీశుండై. 155

సీ. ఇక్ష్వాకునకుఁ బుత్రు లెలమిఁ బుట్టిరి నూర్వు రమర వికుక్షియు నిమియు దండ
కుండు నాతని పెద్దకొడుకులు ముప్వ రార్యావర్తమందు హిమాచలంబు
వింధ్యాద్రిమధ్య ముర్వీమండలము గొంత యేలిరి యిరువదియేవు రొక్క
పొందున నా తూర్పుభూమి పాలించిరి యందఱు పడమటి కధిపు లైరి
తే. యున్న నలువదియేడ్వురు నుత్తరోర్వి దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రి యంత
[3]నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్గ సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమైన
మాంసఖండంబు దెమ్మనె మహితయశుఁడు. 156

మ. అగుఁ గా కంచు వికుక్షి వేఁట సని ఘోరారణ్యభూమిం దగన్
మృగసంఘంబులఁ జంపి బిట్టడవి తా, మే నొల్లఁ బో నాఁకటన్
సగమై యొక్క [4]శశంబుఁ బట్టి తిని శేషంబైన మాంసంబు శీ
ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చి యిచ్చె నకలంకస్ఫూర్తి వర్తిల్లఁగాన్. 157

తరలము. కులగురుండు వసిష్ఠుఁ డంత వికుక్షి కుందెలు దింట లో
పల నెఱింగి 'యనర్హ మెంగిలి పైతృకం బొనరింపఁగా
వలదు వీఁడు దురాత్మకుం' డన వానితండ్రియు వానిఁ జెం
తలను జేరఁగనీక దేశము దాఁటి పో నడిచెన్ వడిన్. 158

ఆ. కొడుకు వెడలఁగొట్టి గుణవంతుఁ డిక్ష్వాకు డా వసిష్ఠుఁ డేమి యాన తిచ్చె
నదియుఁజేసి యోగియై వనంబునఁ గళేబరము విడిచి ముక్తిపదము నొందె 159

---

1 ఘ్రాణవివరము - ముక్కుచెరమ, 2. రవికులము - సూర్యవంశము, 3. అష్టకాశ్రాద్ధము - హేమంతశిశిరర్తువులలోఁ జేయు శ్రాద్ధము 4. శశంబు - కుందేలు.

చ. జనకుఁడు ముక్తిఁ జేఁగ నయశాలి వికుక్షి [1]శశాదుఁ డంచు భూ
జనులు నుతింప నీ ధరణిచక్ర మశేషము నేలి యాగముల్
గొనకొని చేసెఁ బ్రీతి హరిఁగూర్చి పురంజయుఁ బుత్రుఁ గాంచెఁ బే
ర్కొనె "సమరేంద్రవాహుఁడు [2]గకుత్స్థుఁడు" నంచును వాని లోకముల్ 160

సీ. కృతయుగాంతంబున దితిసుతామరులకు రణమయ్యె నందు నా రాక్షసులకు
నమరవల్లభుఁ డోడి హరితోడఁ జెప్పిన జలజనేత్రుఁడు పురంజయునియందు
వచ్చి నే నుండెద వాసన! వృషభంబవై మోవు' మని పల్క నమరవిభుఁడు
గోరాజమూర్తిఁ గకుత్ప్రదేశంబున నా పురంజయు మోచె నంత నతఁడు
తే. విష్ణు తేజంబు దనయందు విస్తరిల్ల, దివ్యచాపంబు చేఁబట్టి, దీర్ఘనిశిత
బాణములఁ బూని వేల్పులు ప్రస్తుతింప నంతఁ గాలాగ్నిచాడ్పున నని కి నడచె. 161

చ. నడచి శరావళిన్ దనుజనాథుల మేనులు [3]చించి, కంఠముల్
[4]దొడిఁదొడిఁ ద్రుంచి కాలపురిత్రోవకుఁ గొందఱఁ బుచ్చి కొందఱన్
వడి [5]నురగాలయంబున నివాసము సేయఁగ దోలి యంత నూ
ఱడక నిశాచరేంద్రుల పురంబులు గూల్చెఁ బురంజయాఖ్యతన్. 162

వ. ఇవ్విధంబున శశాదపుత్రుండు రాక్షసుల మరంబులు జయించిన కతన బురం
జయుండును వృషభరూపుండైన యింద్రుండు వాహనం బగుటంజేసి యింద్రవాహ
నుండును నతనిమూఁపురం బెక్కి రణంబు సేసిన కారణంబునఁ గకుత్స్థుండును నన
నీ మూఁడు నామంబులం బ్రసిద్ధికెక్కి దైత్యుల ధనంబుల నింద్రున కిచ్చె నప్పురంజ
యుని పుత్రుం డనేనసుం డతనిపుత్రుండు పృథుండు పృథుకొడుకు విశ్వగంధుండు
విశ్వగంధునకు నందనుండు చంద్రుండు చంద్రసుతుండు యవనాశ్వుండు యవనాశ్వ
తనూభవుండు శవస్తుం డతండు శావస్తినామనగరంబు నిర్మించె శవస్తితనయుండు
బృహదశ్వుండు బృహదశ్వతనూజుండు గువలయాశ్వుం డా నరేంద్రచంద్రుండు 163

క. లావు మెఱసి యిరువది యొక వేవురు నందనులుఁ దాను వీరుఁ డతఁడు భూ
దేవుఁ డుదంకుఁడు వనుప దు రావహుఁడై చంపె ధుంధు [6]నమరాబంధున్. 164

వ. ఆదికారణంబుగా ధుంధుమారుం డన నెగడె సయ్యసురముఖానలంబునఁ గువలయాశ్వ
కుమారు లందఱు భస్మంబై రందు దృఢాశ్వుండును గపిలాశ్వుండును భద్రాశ్వుండును

1. శశాదుఁడు - కుందేటిని తిన్నవాఁడు, 2 కకుత్స్థుఁడు - ఎద్దుమూఁపునైఁ గూర్చున్నవాఁడు, 3. చించి - ఛేదించి, 4. తొడిఁదొడి - తొందరగా 5. ఉరగాలయంబు - నాగలోకము. 6. అమరాబంధుఁడు - దేవ విరోధి - రాక్షసుఁడు.

ననువారలు ముగ్గురు నిక్క; రందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తును, సేనజిత్తునకు యువనాశ్వుండును జనించి; రయ్యువనాశ్వుండు గొడుకులు లేక నూర్వురు భార్యలుం దానును నివ్వెఅపడి యుండ నా రాజునకు మునులు గృపచేసి యింద్రునిఁగూర్చి సంతతికొఱకు నైంద్రయాగంబు సేయించి; రందు.

సీ. భూమీశుభార్యకుఁ బుత్రలాభమునకై పోయు తలంపున భూమిసురులు
జలములు మంత్రించి జలకలశము దాఁచి నియమంబతోఁ గూడి నిద్రనోవ,
ధరణీశ్వరుఁడు [1]పేరుదప్పితో నారాత్రి ధృతి లేక యజ్ఞమందిరముఁ జొచ్చి,
యానీరు ద్రావిన నంత మేల్కని వార 'లెవ్వఁడు ద్రావె? నీ రెందుఁ బోయె?'
ఆ. ననుచు రాజు ద్రావు టంతయు భావించి యెఱిఁగి చోద్యమంది యీశ్వరాజ్ఞ
యెవ్వఁ డోపఁ గడవ! నీశ్వరునకు నమస్కార' మనుచు నేది కార్య మనుచు. 166

వ. వారలు దుఃఖించుచుండు నంతఁ గొంత దడవునకు యువనాశ్వుని కడుపు [2]ప్రక్కలించుకొని చక్రవర్తి చిహ్నంబులు గల కుమారుండు జన్మించి తల్లిలేని కతంబునం గడుపునకు లేక యేడ్చుచుండ వచ్చి శిశువునకు నాఁకలి దీఱుకొఱకు వానినోటం [3] దన [4] దేశిని నిడినం ద్రావిన కతంబున వానిపేరు మాంధాత యని నిర్దేశించి చనియె; నివ్విధంబున. 167

ఆ. కడుపు పగుల ముద్దుకొడుకు జన్మించినఁ [5]దీఱఁ డయ్యెఁ దండ్రి; దేవవిప్ర
కరుణ యట్లకాదె? కడిఁది దైవములావు గలుగువాఁడు బ్రదుకుఁ గాక చెడునె? 168

వ. ఇట్లు బ్రదికియున్న యువనాశ్వుండు గొంత కాలమునకుఁ దపంబు సేసి సిద్ధిం బొందె; నంత. 169

సీ. పదమటఁ బొడమెడు బాలచంద్రునిమాడ్కిఁ బూటపూటకు వృద్ధిఁబొందె బాలుఁ;
డల్లన పరిపూర్ణయౌవనారూఢుఁడై రావణాదిరిపుల రాజవరుల
దండించి, తనుఁ ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ [6]డంకింప శూరుఁడై యఖిలదేవ
మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము నజుని యజ్ఞాధీశు నాత్మఁ గూర్చి
తే. చేసెఁ గ్రతువులు భూరిదక్షిణల నిచ్చి ద్రవ్యయజమానవిధిమంత్రధర్మయజ్ఞ
కాలఋత్విక్ప్రదేశముఖ్యంబులెల్ల విష్ణురూపంబు లనుచు భావించి యతఁడు. 170

---

1. పేరుదప్పి-ఎక్కువదాహము, 2 ప్రక్కలించుకొని-చీల్చుకొని, 3. పెమ్రేలిని-పాఠాంతరము. 4. దేశిని-చూపుడుప్రేలు, 5. తీఱఁడయ్యె-చావలేదు, 6. అంకింప-స్తుతింపఁగా.

క. బలిమి [1]నడచుచు నరులం [2]జలివెలుఁగున్ [3]వేఁడివెలుఁగుఁ జనుచో ట్లెల్లన్
జలరుహనయనుని కరుణను జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్. 171

వ. అంత నా రాజునకు శతబిందునికూఁతురగు బిందుమతియందుఁ బురుకుత్సుండు, నంబ
రీషుండును, ముచుకుందుఁడును ననువారు ముగ్గురు గొడుకులు, నేఁబండ్రు గూఁతులును
జనియించి పెరుఁగుచున్నయెడ. 172

సీ యమునాజలములోన నధికుఁడు సౌభరి తపము సేయుచు జలస్థలమునందుఁ
బిల్లలఁ దన ప్రాణవల్లభయును గూడి మెలఁగ నానందించు మీనరాజుఁ
గనుఁగొని సంసారకాంక్షియై మాంధాత నొక కన్య నడుగ నృపోత్తముండు
'దురుణి నిత్తును, స్వయంవరమునఁ జేకొను' మనవుడు 'ననుఁ జూచి యౌవనాంగి
ఆ. యేల మునలిఁ గోరు? నిట్టట్టు వడఁకెడి, వాఁడఁ; జాల నరసినాఁడ; నొడల
[4]జిగియుబిగియు లేని శిథిలుండఁ గలఁగింప, బాలఁ [5]దిగిచికొను నుపాయ మెట్లు? 173

వ. అదియునుం గాక. 174

ఆ. బాల పువ్వుఁబోఁడి ప్రాయంపువానిని [6]జెన్నువాని ధనముఁ జేర్చువాని
మరగెనేని గొంత మరగుఁగా కెదిరిఁ ద న్నెఱిఁగి మునలితపసి నేల మరగు?' 175

వ. అని విచారించి సౌభరి దన తపోబలంబునంజేసి మునలితనంబు విడిచి యెల ప్రాయంపుఁ
గొమరుం దయి యలంకరించుకొనిముందట నిలువంబడిన మాంధాతయుఁ గన్నియల
నగరు గాచికొని యున్నవారికి సెలవు సేసిన వా రమ్మునీంద్రుని నా రాజపుత్రిక
లున్నయెడకుం గొనిపోయి చూపిన. 176

ఉ. 'కోమలులార! వీఁడు నలకూబరుఁడో: మరుఁడో? జయంతుఁడో?
యేమటి వచ్చె; వీనిఁ దడ వేల వరింతుము నేమ యేమ' యం
బా మునినాథుఁ జూచి చలితాత్మికలై సౌరిదిన్ వరించి రా
భామిను లందఱుం గుసుమబాణుఁడు గీ యని [7]ఘంట వ్రేయఁగన్, 177

వ. ఇట్లు రాజకన్యకల నందఱం జేకొని సౌభరి నిజతపః ప్రభావంబున ననేకలీలా వినో
దంబులఁ గల్పించి, 178

1. నిలయేడుసెలుఁగులు–పాఠాంతరము. 2. చలివెలుఁగు చంద్రుఁడు, 3. వేఁడివె
లుఁగు. సూర్యుఁడు, 4. జిగియు, బిగియు-కాంతియు, పటుత్వమును, 5. తిగిచికొను-
లోబఱచుకొను 6. చెన్నువాఁడు-అందమైనవాఁడు, 7. ఘంటవ్రేయఁగన్ - వెల్లడి
చేయఁగా,

సీ. గృహరాజములయందుఁ [1] [2]గృతకాచలములందుఁ, గలువలు విలసిల్లు కొలఁకులందుఁ,
గలకంఠశుకమధుకరనినాదములచే వర్ణనీయము లైన వనములందు,
మణివేదికలయందు, మహనీయపర్యంక పీఠలీలా శైలబిలములందు,
శృంగారవతులగు చెలువలు పలువురు తనపంపు సేయ సుస్థలములందు
తే. వస్త్రమాల్యానులేపసువర్ణహార భూరిసంపద సిష్టాన్నభోజి యగుచుఁ 179
బూఁటపూటఁకు నొకవింతపొలుపుఁ దాల్చి, రాజకన్యల నందఱ రతులఁ దేల్చె,

క. పెక్కండ్రు రాజముఖులకు నొక్కఁడు మగఁడయ్యు దనియకుండె మునీంద్రుం
డెక్కుడు ఘృతధారలచే నక్కజమై తృప్తి లేని యనలునిభంగిన్. 180

వ. ఇవ్విధంబున. 181

క. ఆరామంబున మునివరుఁ డా [3]రామలతోడ బహువిహారమయుండై
[4] [5]గారాములఁ దనకిట్టటు [6]పోరాములు సేసి కొన్నిప్రొద్దులు వుచ్చెన్. 182

వ. అంత నొక్కనాఁడు మాంధాతృమేదినీవల్లభుండు 'మునీశ్వరుం డెందుఁ బోయెఁ? గూఁతు లెక్కడ నలజడి పడుచున్న వారలో?' యని తలంచి వెదక వచ్చి యొక్క మహాగహనంబున మణిమయసౌధంబులం జక్రవర్తియుంబోలె గ్రీడించుచున్న తాపసరాజుం గని నంతసించి వెఱఁగుపడి మన్ననలం బొంది మెల్లన కూఁతులం బొడగని సత్కరించి యిట్లనియె. 183

క. 'నాతోడులార! మీపతి మీతోడే? పనులయెడల మే లే?' యనుడున్
'నాతోడిదె నాతోడిదె, [7]తాతా! మే' లనుచు ననిరి తరుణులు వరుసన్. 184

వ. అంతఁ గొంతకాలంబునకు గృహగతచర్యుండగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁ దాన చింతించుకొని మీనమిథునసంగదోషంబునం గాఁపురంబు దనకు సగపడుట యెఱింగి పశ్చాత్తాపంబున ని ట్లనియె. 185

మ. ఉపవాసంబుల దయ్యుటో? విషయసంయోగంబు వర్జించుటో?
తపముం బూని చరించుటో? హరిపదధ్యానంబునన్ నిల్చుటో?
[8]యపలాపంబున నేల పొందితి? హతం బయ్యెం దపం బెల్ల; నీ
కపటస్త్రీపరిరంభముల్ మునులకుం గైవల్యసంసిద్ధులే? 186

1. గేహిగృహములందుఁ గుసుమవల్లరులందు పాఠాంతరము, 2. కృతకాచలములు-కల్పించినకొండలు, 3. రామలు-యువతులు, 4. నారాముల-పాఠాంతరము, 5. గారాములు - ప్రియములు, 6. పోరాములు-ఆప్తతలు, 7. తాతా- తండ్రీ, 8. అపలాపంబు-ప్రేమ.

చ. మునినఁట! తత్త్వవేదినఁట! మోక్షము కాని సుఖంబు లెవ్వియుం
జనవఁట! కాంత లేఁబదఁట! సౌధచయంబఁట! వాసదేశముం,
దనయులు నైదువేలఁట! [1]నిదానము మీనకుటుంబి సౌఖ్యముం
గను టఁట! చెల్లరే! నగవుగాక మహాత్ములు సూచి మెత్తురే? 187

ఆ. తపము సేయువాఁడఁ, దత్త్వజ్ఞుఁడగువాఁడు నేమి మోక్ష మిచ్చ నేఁచువాఁడు,
[2]నేకతంబు విడిచి యేర్పడనేరఁడు కాఁపురంబుసేయఁ [3]గఅటితపసి,' 188

వ. అని దుఃఖించి తన్ను దాన నిందించుకొని తన పేదఱంబు [4]వివేకించుచు నిహపర సాధకుండై కాఁపురంబు విడిచి సతులుం దానును [5]వానప్రస్థధర్మంబున నడవికిం జని ఘోర తపంబు సేసి శరీరంబు గుదియించి యగ్నిసహితుండై పరబ్రహ్మంబు సొచ్చె; నంత. 189

క' మునిపతి వనమున కరిగిన, వనితలుఁ దో నరిగి ప్రాణవల్లభుగతికిం
జనిరి వెనుతవిలి విడువక యనలునితో శిఖలు నిలువ కరిగినభంగిన్. 190

వ. అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషునిం దత్పితామహుం దగుటంజేసి యువనాశ్వుండు దనకుఁ బుత్రుండు గావలయు నని కోరి తెచ్చుకొనియె; నయ్యంబరీషునకు యౌవనాశ్వుం. డతనికి హారితుండు జనియించి, రది కారణంబుగా నంబరీషయౌవనాశ్వ హారితులు మాంధాతృగోత్రంబునకుఁ [6]బ్రవరులైరి; మాంధాత రెండవకొడుకు పురుకుత్సుం; డతని నురగలోకంబునకుఁ గొనిపోయి భుజంగకుమారులు దమచెల్లెలి నర్మద యను కన్యకనువివాహంబుచేసిరి; పురుకుత్సుండు నక్కడ ననేకగంధర్వనాథుల వధించి తన నాగలోక సంచరణంబు దలంచువారికి నురగభయంబు లేకుండ వరంబు వడసి తిరిగివచ్చె; నా పురుకుత్సునకుఁ ద్రసదస్యుండుఁ, ద్రసదస్యునకు ననరణ్యుండు, నా యనరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుఁడుఁ, ద్రిబంధనునకు సత్యవ్రతుండును జన్మించి; రాసత్యవ్రతుండు త్రిశంకుఁ డనంబరఁగె; నతండు. 191

సీ. గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి
యతని [7]లావున దివిజాలయంబున కేఁగ మన్నింపకమరులు మరలఁ ద్రోయఁ,
దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ గౌశికుఁ డెప్పటిఘనత మెఱసి
నిలిపె నాకనమున; నేఁడునున్నాఁడు త్రిశంకుఁ; డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె:

1. నిదానము - మూలకారణము, 2. ఏకంతబు - ఏకాంతము, 3. కఅటితపసి-మూర్ఖముని, 4 ప్రపంచంబుసేయుచు—పాఠాంతరము, 5. వానప్రస్థుఁడు- భార్యతోఁ గూడ అడవిలో నివసించువాఁడు, 6. ప్రవరులు-ప్రధానపురుషులు, 7. లావు శక్తి - ప్రభావము.

తే. నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁజేరి యాగదక్షిణామిషమున నఖిలధనముఁ
గొల్లగొని మీఁదఁ గులహీనుఁ గొలువఁబెట్ట బొంక [1]కలఁజడిఁ బొందె నాభూవరుండు. 192

వ. అట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రుని [2]గృధ్రమ్మవు గమ్మని శపించె; విశ్వామిత్రుండును వసిష్ఠుని బకంబవు గమ్మని శపించెఁ; బక్షిరూపు లయ్యును వైరంబు మానక యయ్యిరువురును యుద్ధంబు సేసి రంత హరిశ్చంద్రుండు పుత్రులు లేక నారదు నుపదేశంబున వరుణోపాసనంబు నతిభక్తితోఁ జేయ నా వరుణుండు ప్రత్యక్షంబైన నతనికి మ్రొక్కి యి ట్లనియె.

అ. 'వరుణదేవ! నాకు వరవీరగుణముల కొడుకు పుట్టెనేనిఁ గొడుకుఁ బట్టి
పశువుఁజేసి నీవు [3]పరిణమింపఁగ వేల్తుఁ, గొడుకునీఁగదయ్య కొసరు లేక.' 194

వ. అని వలికినం గుమారుండు గలిగెడు మని వరంబిచ్చి వరుణుండు సనియె; నంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుం డను కుమారుండు జన్మించె; వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి. 195

సీ. పురిటిలోపలవచ్చి పుత్రు వేలువు మన్నఁ బురుడువోయినఁగాని పొసఁగ దనియెఁ;
బలురాకమును వచ్చి బాలు వేలువు మన్నఁ బండ్లు లేకుంట నభావ్యఁ డనియెఁ;
బండ్లు రాఁజూచి డింభకుని వేలువు మన్నఁ బడిపండ్లురామి నభావ్యఁ డనియెఁ;
పడపండ్లు సొడమినఁ గొడుకు వేలవు మన్నఁ [4]బోరుల కొదవక పోల దనియెఁ;
ఆ. దొడరి యెట్లు గొడుకుతోడిమోహంబునఁ బ్రొద్దు గడపుచుండె భూవరుండు;
దండ్రితలఁపుకొలఁదిఁ దనలోనఁ జింతించి యింట నుండ కడవి కేఁగెఁ గొడుకు.

వ. ఇట్లు వనంబునకుం జని శరశరాసనధరుం డయి రోహితుండు దిరుగుచుండి వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు [5]మహోదరవ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని పురంబునకుం దిరిగి రా [6]గమకింప నింద్రుండు మునలితపసియై వచ్చి యి ట్లనియె. 197

ఆ. 'పుణ్యభూము లరుగు; పుణ్యతీర్థంబులఁ, గ్రుంకు; పుణ్యజనులఁ గోరి చూడు;
పుణ్యకథలు వినుము భూపాలపుత్రక; మేలు గలుగునట్టిమేర గలదు.' 198

వ. అనియిట్లు మగిడించినం దిరిగి చని రోహితుం డొక్క యేఁ డవ్వనంబునం దిరిగి క్రమ్మఱఁ జనుదేర నింద్రుండు వచ్చి తొంటియట్ల నివారించె; నివ్విధంబున. 199

---

1. అలజడి-క్లేశము. 2. 'నాడేలవు'-పాఠాంతరము, 3. పరిణమింపఁగ-సంతోషింపఁగా, 4. పోరులకు ఒదవక-యుద్ధముల కుపయోగింపక-యువకుఁడుకాక, 5 బరికడుతో—బగగడుపుతో సంజీవని—పాఠాంతరము, 6. గమకింప-సిద్ధపడఁగా.

సీ. ఐదేండ్లు మరలించె నమరేంద్రుఁ డా బాలు; నా లవయేటఁ దా నడవినుండి
యింటికి వచ్చుచు నెలమి నజీగర్తుమధ్యమపుత్రు సన్మాన్యచరితు
ఘను శునశ్శేపునిఁ గొని యాగపశువుగ నా హరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ;
బురుష మేధము సేసి భూపాలవర్యుఁడు వరుణాదినిఖిలదేవతలఁ దనిపె
తే. హోత కౌశికుఁ; డధ్వర్యుఁ డొనర భృగువు; బ్రహ్మ జమదగ్ని; సామంబు పాడువాఁడు
ముని వసిష్ఠుఁ డా [1]మఖమున ముదముఁ బొంది కనకరథ మిచ్చె నింద్రుఁడా మనుజపతికి.

వ. శునశ్శేపుని ప్రభావంబు వెనుక వివరించెద; నంత భార్యాసహితుం డైన హరిశ్చంద్రువలన నత్యంత ప్రీతుండై విశ్వామిత్రుం డతనికి ముఖ్యజ్ఞానంబు గృపజేసిన మనంబన్నమయంబు గావున, నన్నరూపియైన పృథివి నెఱిఁగి పృథివిని జలంబువలన నడంచి, జలంబుఁ దేజంబువలన నింకించి, దేజంబు వాయువువలనం జేర్చి, వాయువు నాకాశంబునం గలిపి, యాకసంబు దామసాహంకారంబునందు లయంబుజేసి, యహంకారత్రయంబు మహత్తత్త్వంబునందు డిందించి, [2]పరతత్త్వంబునకు లోకంబులు సృజించెదనను తలంపైన మహత్తత్త్వంబునందు విషయాకారంబు నివర్తించి విషయ వివర్జితుండై పరతత్త్వంబు నెఱుంగుచు న [3]య్యెఱుకవలన సంసార హేతువైన ప్రకృతిని భస్మంబు జేసి, యయ్యెఱుకను [4]నిర్వాణసుఖపారవశ్యంబునం బరిహరించి, సకలబంధవిముక్తుండై హరిశ్చంద్రుం డవాఙ్మానసగోచరం బయిన నిజరూపంబుతో వెలుంగుచుండె; నతనికుమారునకు హరితుండు పుట్టె; హరితునకుఁ జంప నామధేయుండు జనియించె నతండు దనపేరఁ జంపానగరంబు నిర్మించె; నా చంపునికి సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురుకుండు, రురునకు వృకుండు, వృకునకు బాహుకుండు జనియించి; రందు బాహుకుండు.

సగరచక్రవర్తికథాప్రారంభము

సీ. దండించి పగవారు దనభూమిఁ జేకొన్న నంగనలును దాను నడవి కేఁగి
యడవిలో ముసలియై యాతఁడు సచ్చిన నాతనిభార్య దా ననుగమింపఁ
గదియుచో నాస్త్రీకి గర్భంబు గలుగుట యౌర్వమునీశ్వరుఁ డాత్మ నెఱిఁగి
వారించె; నంత నవ్వనజాక్షి సవతులు సూలు నిం డారినఁ జూడఁజాల
తే. కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి విషమువెట్టిరి; పెట్టిన విరసి పడక
[5]గరముతోఁ గూడ సగరుఁడు ఘనుండు పుట్టి వరయశస్స్ఫూర్తితోఁ జక్రవర్తియయ్యె 202

---

1. మఖము యాగము. 2. తనకుఁ దలంపైన — పాఠాంతరము, 3. ఎఱుక-జ్ఞానము, 4. నిర్వాణము-మోక్షము, 5. గరము-విషము,

శా. చండస్ఫూర్తి నఖండు తండ్రిపగతై సంగ్రామరంగంబులం
జెండెన్ఁ; హైహయబర్బరాదుల వధించెం; దాళజంఘాదులన్
[1]ముండీభూతులుగా నిరంబరులుగా [2]మూర్తుల్ సబీభత్సలై
యుండం జేసె నిజారులన్ సగరనామోర్వీవిభుం డల్పుఁడే. 203

క. ఖగరాజరుచులు గల యిల పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్
నగరాజధీరు శూరున్ సగరున్ హతవిమతనగరుఁ జను వినుతింపన్. 204

సీ. ఔర్వుండు సెప్పంగ నమర వేదాత్మకు హరి నీశు నమృతు ననంతుఁగూర్చి
వాజిమేధంబులు వసుధేశ్వరుఁడు సేసె; నం దొక్కమఖమున హయము విడువ
[3]నగభేది గొనిపోయి నాగలోకంబునఁ గపిలునిచేరువఁ గట్టి తొలఁగె;
నంత గుఱ్ఱము గాన కారాజు దనపుత్రనివహంబు దిశలకు నెమకబంప
తే. వారు నిల యేడుదీవుల వరుస వెదకి, మఖతురంగంబు లేకున్న మగిడి రాక
ప్రాభవంబున దోర్దండబలము మెఱసి గ్రొచ్చి కోరాడి త్రవ్విరి [4]కుతలమెల్ల. 205

వ. ఇట్లు సుమతికొడుకులు నేలం ద్రవ్వి పాతాళంబునం దూర్పు ముట్టియున్న యుత్తరభాగం
బునం గపిలమునిపొంత నున్న తురంగంబుఁ గని, 206

చ. 'ఎఱిఁగితి మద్దిరయ్య తడ వేటికి ? గుఱ్ఱపుదొంగ వీఁడె! యీ
జలభువిఁ బట్టి చంపు; డతిసాధుమునీంద్రుఁడువోలె నేత్రము
ల్దెఱవక [5]బాకినోరు మెదలింపక '[6]బైసుక [7]పట్టె' నంచు న
య్యఱువది వేవురున్ నిజకరాయుధముల్ జళిపించి డాయుచోన్. 207

చ. కపిలుఁడు నేత్రముల్ దెఱవ గా దమ మేనుల మంట పుట్టి తా
రపగతధైర్యులై పడి [8]యహంకరణంబున మూఢచిత్తులై
నృపసుత లందఱున్ ధరణి [9]నీఱయి రాక్షణమంద; సాధులం
దపసులఁ గాసిఁ బెట్టెడి మదస్ఫురితాత్ములు నిల్వనేర్తురే? 208

సీ. కొందఱు కపిలుని కోపానలంబున మ్రందిరి సగరకుమారు లనుచు
నందు; రా ముని శాంతుఁ; డానందమయమూర్తి తొడరి కోపించునే ? [10]దువ్వ నేలఁ
గాక జన్మించునే గగనస్థలంబున ? నే సాంఖ్యమతమున నిద్ధమతులు
భవసముద్రము మృత్యుభయమును లంఘింతు రా బుద్ధిఁ జేయు పరాత్మభూతుఁ

---

1. ముండీభూతులు-తలలుగొఱుగఁబడినవారు, 2. మూర్తుల్ - స్వరూపములు, 3. నగభేది - ఇంద్రుడు, 4. కుతలము - భూమి, 5. సొక్కనోరు—పాఠాంతరము, 6. బైసుకపట్టె - నియమముపట్టెను, 7. పెట్టె - పాఠాంతరము, 8 అహంకరణంబు - గర్వము, 9. నీఱు - భస్మము, 10. దూరనేల - పాఠాంతరము.

తే. దఖిలబోధకుఁ దతనికి నరసి చూడ నఖు [1]లమిత్రులు నెవ్వరు ? సగరసుతులు
దాము దమచేయు నేరమిఁ దనువులందు ననలకీలలు పుట్టి నీఱైరి గాక ? 209

వ. మఱియు సగరుండు గేశినియందుఁ గన్న పుత్రుం డసమంజసుం డనువాఁడు [2]సమంజన గుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుండై యుండి సంగదోషంబువలన యోగ భ్రష్టుం డయి సగరునకు జన్మించి జాతిస్మరజ్ఞానంబు గలిగి లోకంబు వారలకుఁ దమ వారలకు నప్రియంబగు వర్తనంబునం దిరుగుచు నొక్కనాఁడు 210

చ. వరున నయోధ్యలోనఁ గలవారల నాడెడు పిన్నవాండ్ర నా
నరయుపులోన వైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ
డురుమతిఁ గొన్నిప్రొద్దులకు యోగబలంబునఁజేసి బాలురం
దిరిగి పురంబులోపలికిఁ దెచ్చిన [3]నివ్వెఱఁ గంది రందఱున్. 211

వ. అయ్యసమంజసుని కొడు కంశుమంతుం డనువాఁడు వినీతుండయి తనయొద్దఁ బనులు సేయుచుండ నంత సగరుం డమ్మనుమని నంశుమంతు నశ్వంబు వెదకి తెమ్మని పంచిన నంతడు దనతండ్రుల [4]చొప్పునంజని వారలు త్రవ్విన మహా [5]ఖాతంబు సొచ్చి యందు భస్మరాసులపొంత నున్న హయంబుఁ గని హయసమీపంబునం దున్న కపిలా ఖ్యుండయిన విష్ణునికి దండప్రణామంబు సేసి యిట్లని స్తుతియించె. 212

సీ. మతి నిక్కఁ బట్టి సమాధిగౌరవమున వ్రాలియుఁ దనకు నవ్వల వెలుంగు
నినుఁ గానఁ డొకనాఁడు నిన్నెఱుంగునె ? బహ్మ యజునిమనంబున నవయవముల
బుద్ధి జన్మించిన భూరిజంతువులందు హీనులమైన మా కెఱుఁగ వశమె ?
తమలోన నీ వుండఁ దా మెఱుంగరు నిన్ను గుణములఁ జూతురు గుణములైన
తే. గాన రాకవేళఁ జీకటిఁ గందు రాత్మ లందుఁ దెలియరు వెలుపల నమరుబొందు
లరయుదురు దేహధారు లత్యంధు లగుచుఁ గడిఁది నీమాయ నెన్నఁడు గడవలేక 213

వ. అని వినుతి సేయుచు హయంబు విడువు మని చెప్పక తన దండ్రులు నీ అగుటం [6]దడవక మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణావిపులుం డగు కపిలుం డిట్లనియె 214

క. 'గుఱ్ఱముఁ గొనిపో [7]బుద్ధుల, కుఱ్ఱఁడ ! మీతాతయొద్దకున్ నీతండ్రుల్
వెఱ్ఱులు నీఱైరదె ! యీ [8]మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ మగున్'

1. అమిత్రులు - విరోధులు, 2 సమంజస - యోగ్యమైన, 3. నివ్వెఱఁగు - గొప్పయాశ్చర్యము. 4, చొప్పు - మార్గము, 5. ఖాతంబు-గొయ్యి, 6. తడవక - ప్రస్తావింపక 7. ముద్దుల - పాఠాంతరము 8. మిఱ్ఱు - ఎత్తుచోటు, దిబ్బ.

వ. అని పల్కిన నమ్కరించి తురంగంబుఁ గొని వచ్చి యా నగరుని కిచ్చిన సగరుం డా పశుపువలన జన్నంబు కడమ నిండించి యంశుమంతునకు రాజ్యం బిచ్చి ముక్తబంధ నుండై యౌర్వుండు సెప్పినమార్గంబున నుత్తమగతికింజనియె నంత 216

క. జనకులు క్రమ్మగ్గినచోటికి [1]ననిమిషనదిఁ దెత్తు ననుచు నటవీస్థలికిం
జని తపము సేయఁజాలక మనమున [2]వగ లొలయ నంశుమంతుఁడు డీఱెన్. 217

క. ఆతనికొడుకు దిలీపుఁడు భూతలమున గంగ దెచ్చి పొందించుటకై
ప్రీతిం దపంబు సేయుచు భాతిగఁ దేలేక కాలపరవశుఁ డయ్యెన్. 218

క. అతనిసుతుఁడు భగీరథుఁ డతితప మొనరించి కనియె నమృతాపాంగన్
సుతరంగన్ ముఖవనరుహరతభృంగన్ శివజటాగ్రరంగన్ గంగన్. 219

వ. కని నమస్కరించిన గంగ గృపసేసి వరంబు వేఁడుమనిన నారాచపట్టి యిట్లనియె 220

క, 'మావారి భస్మరాసుల [3]నీవారిం గలపికొనుము నెఱి మావారల్
నీవారిఁ గలయ నాకము మావారికిఁ గలుగు నిది ప్రమాణము తల్లీ! 221

ఇంద్ర. చెల్లన్ మదిన్ నిన్ను భజింతు గంగన్ ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగం
గల్లోలలక్ష్మీజితకాశమల్లిం దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్' 222

వ. అని వినుతి సేయుచున్న రాజకుమారునకు లోకపావని యి ట్లనియె. 223

మ. 'వినువీథిం బఱతెంచి నేలఁ బడ నా వేగంబుసున్ నిల్ప నో
వినవాఁ డెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళమున్
జనుదున్; వచ్చితినేని నా జలములన్ సంస్నాతులై మానవుల్
ననుఁ బొందించు [4]నఘవ్రజం బెచట వే నాశంబుఁ బొందించెదన్. 224

వ. అది కారణంబుగా విచారించెద' నని పలుకుచున్న లోకమాతకు రాజన్యవర్యుండగు భగీరథుం డి ట్లనియె. 225

మ. 'పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపఃపారీణు లార్యుల్ ఘనుల్
పురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి! భవ [5]దంభోగాహముల్ సేయఁగా
నరసంఘాఘము నిన్నుఁ బొందునె? జగన్నాథుండు నానాఘసం
హరుఁ డా విష్ణుఁడు వారిచిత్తములఁ దానై యుంట మందాకినీ! 226

---

1. అనిమిషనది – గంగానది 2. వగ-దుఃఖము 3. నీవారి-నియందలి నీరు, 4. అఘవ్రజంబు - పాపములగుంపు, 5. అంభోగాహముల్ - నీటిలో స్నానములు,

మ. తనలో నిన్నిజగంబులుం గలుగుటం, దా నిన్నిటం గల్గుటన్,
జననీ' [1]తంతువులందుఁ జీర గల యా చందంబునన్ విశ్వభా
వనుఁడై యెవ్వ శివుండు గాక మఱి నీవారిన్ నివారింప నే
ర్చినవా రెవ్వరు ? నిన్ ధరించుకొఱకై [2]శ్రీకంఠునిం గొల్చెదన్ ! 227

వ. అని యెఱింగించి వీడ్కొని చని భగీరథుండు మహేశ్వరు సుద్దేశించి [3]గ్రద్దనఁ దపంబు సేసిన. 228

ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డా భగీరథుని మెచ్చి నిజశిరంబునందు
శౌరిపాదపూత సలిలయై దివినుండి ధరకు వచ్చు గంగఁ దాల్చె నవుడు. 229

—: శ్రీపరమేశ్వరజటానిర్గతగంగాప్రవాహమహిమాభివర్ణనము :—

వ. ఇట్లమ్మహానది పురారాతిజటాజూటరంధ్రంబులవలన దిగంబడి, నిరర్గళ ప్రవాహంబై నేలకు [4]జల్లించి నెఱసి నిండి పెల్లువెల్లిగొని పెచ్చుపెరగి విచ్చలవిడిం గ్రేవువెంబడి నుఱక క్రేళ్ళుఱుకుమఱకప్రాయంపుఁ గామధేనువు చందంబున ముందఱికి నిగుడుచు, మద్దుఁజందురుతోడి నెయ్యంబునఁ [5]గ్రయ్యనదరి చొప్పుదప్పక సాఁగి చనుచెంచు సుధార్ణవంబుకై వడిఁ బెంపు గలిగి, మహేశ్వరు వదనగహ్వరంబువలన నోంకారంబు [6]పిఱుంద వెలువడు శబ్దబ్రహ్మంబుభంగి నదభ్రవిభ్రమంబై, యమ్మహీపాలతిలకంబు తెరువువెంట నంటివచ్చు వెలియేనుఁగుతొండంబుల ననుకరించి పఱచు వఱదమొగంబులును, వఱద [7]మొగంబులపిఱుంద నందంద క్రందుకొని పొడచూపి తొలంగు బాలశారదకుచకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గల [8]సంగడంబునం బారిజాతకుసుమస్తబకంబుల చెలువంబుల దెగడు వెలినురువులును, వెలినురువులచెంగట నర్థోన్మీలితకర్పూరతరుకిసలయంబులం గేలికొను సుళ్ళును, సుళ్ళ కెలంకుల ధవళజలధర రేఖాకారంబులబాగు మెచ్చని నిడుదయేఱులును, నేఱులం గలసి వాయువంబున నొండొంటిం దాఁకి బిట్టు మిట్టించి మీఁది కెగయు దురితభంగంబులైన భంగంబులును, భంగంబుల కొనల ఛిన్నభిన్నంబులై కుప్పించి యుప్పరం బెగసి ముత్తియంపుసరులవడువున, మల్లికాదామంబుల తెఱంగునఁ, గర్పూరఖండకదంబంబుల చెలువంబునఁ, నిందుశకలంబుల తేజంబునఁ, దారకానికరంబులపోలువున మెఱయుచు ముక్తికన్యావశీకరంబులైన శీకరంబులునుం గలిగి, మధ్యమలోక శ్రీకరంబై శ్రీకరంబు తెఱంగున [9]విష్ణుపదంబు ముట్టి, విష్ణుపదంబుభాతి నుల్లసితహంసరుచిరంబై, [10]రుచిరపక్షంబురీతి నతిశోభిత[11]కువలయంబై,

1. తంతువులు - దారములు, 2 శ్రీకంఠుఁడు - శివుఁడు, 3. గ్రద్దన - వెంటనే, 4. జల్లించి - స్రవించి, 5. క్రయ్యనదరి - కాలువకట్టి. 6. పిఱుంద - వెనుక, 7. మొగంబులు - మందఱిభాగములు, 8. సంగడంబు - స్నేహము, 9. విష్ణుపదంబు - ఆకాశము విష్ణుపాదము, 10. రుచిరపక్షంబు - శుక్లపక్షంబు, 11 కువలయంబు - నల్లకలువ.

కువలయంబుచెన్నున బహుజీవనంబై, జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై, ప్రధానపర్వంబుపోలుపున నేకచక్ర బకభీమ మహాభంగసుభద్రార్జున చరిత్రాభిరామంబై రామచిత్రంబు మెలఁపునం దనవారిలోఁ జొచ్చిన దోషాచరుల కథయప్రదాన చరణంబై, ప్రదానచణవర్తనంబుభాతి సముపాసితమృత్యుంజయంబై, మృత్యుంజయురూపంబుపోలిక విభూతిసుకుమారంబై, కుమార చరిత్రంబు తేవను గ్రౌంచప్రముఖవిజయంబై, విజయ రథంబుభాతి హరిహయామంథరంబై, మంథరవిచారంబుగ్రద్దన మహారామగిరివనప్రవేశ కామంబై, కామకేతనంబుపెల్లున సుద్దీపితమకరంబై, [1]మకరకేతనుబాణంబుకైవడి విలీనవరవాహినీ కలితశంబరంబై, శంబరారాతి [2]చిగురుగొంతంబునూటి [3]నధ్వగ వేదనాశమనంబై, శమనదండంబుజాడ న్నిమ్నోన్నత సమవృత్తంబై, వృత్తశాస్త్రంబు విధంబున వడి గలిగి, సదా గురులఘు వాక్యచ్ఛటా పరిగణితంబై, గణితశాస్త్రంబుకొలందిని ఘన ఘనమూల వర్గమూల సంకలిత భిన్న మిశ్రప్రకీర్ణ ఖాతభీష్మంబై; భీష్మపర్వంబు పెంపున ననేకభగవద్గీతంబై, గీత శాస్త్రంబు నిలుకడను మహా [4]సుషిరతనుఘననానాశబ్దంబై, శబ్దశాస్త్రంబు మర్యాద నచ్చు వడి హల్లు కలిగి, మహాభాష్యరూపావతారవృత్తివృద్ధిగుణ సమర్థంబైన, యర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజనప్రమాణ దృష్టాంతంబై, దృష్టాంతంబు తెఱంగున సర్వసామాన్యగుణవిశేషంబై, శేషవ్యాపారంబు కరణిని సుస్థిరోద్ధరణతత్పరంబై, పరబ్రహ్మంబుగరిమ నతిక్రాంతానేక నిగమంబై, నిగమంబు నడవడిని బ్రహ్మవర్ణపదక్రమ సంగ్రహంబై, గ్రహశాస్త్రంబు పరిపాటిని గర్కట మీన మిథున మకరరాశిసుందరంబై, సుందరి ముఖంబుపోఁడిమిని నిర్మల చంద్రకాంతంబై, కాంతాధరంబురుచిని శోణచ్ఛాయావిలాసంబై, విలాసవతికొప్పు నొప్పునఁ [5]గృష్ణనాగాధికంబైన, యధికమతి శాస్త్రసంవాదంబుసొంపున నపారసరస్వతీవిజయవిభ్రమంబై, విభ్రమవతి చనుదోయి పగిది నిరంతరపయోవ్యాప్తాఖిలలోకజీవనప్రద తుంగభద్రాతిరేఖా సలలితంబై, లలితవతి నగవుమించున నపహసిత చంద్రభాగధేయంబై, భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖలకన్యకావిస్తారంబై, తారకెంగేలి యొడికంబున [6]నాక్రాంతసూర్యతనయంబై, సూర్యతనయు శరవర్షంబుపోలిక భీమరథ్యాటోపవారణంబై, వారణంబుపరుసునం [7]బుష్కరోన్నతసంరంభంబై, రంభనెమ్మోముడాలున సురసాతిశయదశంబై, దశరథతనయుబొమముడిచాడ్పున సింధుగర్వప్రభంజనంబై ప్రభంజనతనయుగదపెట్టుమాడ్కిని సమీపగతదుశ్శాసనదుర్మదనివారకంబై, వారకన్యక

1. మకరకేతనుఁడు - మన్మథుఁడు, 2. చిగురుగొంతంబు - చిగురాకు ఖడ్గము, 3. అధ్వగుఁడు - బాటసారి, 4. సుషిరము- రంధ్రము, వాద్యము 5. కృష్ణనాగము - నల్లతాచు, 6. ఆక్రాంత సూర్యతనయంబు - ఆక్రమింపఁబడిన సుగ్రీవుఁడుకలది, యమునానదికలది, 7. పుష్కరము - ఏనుఁగు తొండముచివఱ, జలము.

ముంజేతిగతిని ముహుర్మురురుహురుచ్ఛలిత [1]కంకణాలంకృతంబై, కృతయుగంబునోజ నపంకంబై, పంకజాసనముఖంబునాఁ బ్రభూతముఖవర్ణంబై, వర్ణగుణితంబు తెఱఁగువను బహుదీర్ఘబిందువిసర్గంబై, సర్గబంధకావ్యంబు విన్ననువున గంభీరభావమధురంబై, మధురాపురంబునా బగున మహానందనందనంబై, నందనవనంబు పొందున విహరమాణకౌశికంబై, కౌశికహయంబురీతి సుదళద్ధ్రువంబై, ధ్రువుతలంపు క్రియం [2]గ్రియాపరిశీలితవిశ్వంభరంబై, విశ్వంభరునిశంఖంబురూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబుచందంబునఁ బ్రముదితనరంబై, నరసింహునఖరంబులభాతి నాశ్రితప్రహ్లాదగురువిభవప్రధానంబై, దానకాండంబు నిరిం గామధేనుకల్పలతాద్యభినవంబై [3]నవసూతికాకుచంబు వేర్మి నిరంతర పయోవర్ధనంబై, ధనదునిలయంబు తూనికను సంభృత మకర పద్మ మహాపద్మ కచ్ఛపంబై, కచ్ఛపకర్పరంబుబలిమిని బలితశైల సముద్ధరణంబై, ధరణిధరంబుసాటి నుత్తుంగతటముఖ్యంబై, ముఖ్యవరాహంబుగరిమ నున్నతక్షమంబై, క్షమాసురహస్తంబుగరగరికను సత్పవిత్రమనోభిరామంబై, రామచంద్రుబాణంబు కడింది నభ్యాగతఖరదూషణమదాపహరణముఖరంబై, [4]ముఖరరామకుఠారంబు రీతిని భూభృన్మూలచ్ఛేదనప్రబలంబై, బలరామహలంబుభాతిని బ్రతికూల సన్నికర్షణప్రబుద్ధంబై, బుద్ధదేవుని మేనియొఱపున [5]నభియాతి రక్షోదార మనోహరంబై, హరతాండవంబు మేర నుల్లసితానిమిషంబై, [6]యనిమిషావతారంబుకీర్తిని శ్రుతి మంగళప్రదంబై, ప్రదాత యీగి సూటి నర్థపరంపరావామనంబై, వామనచరణరేఖను బలివంశవ్యపనయంబై, నయశాస్త్రంబు మార్గంబున సామభేదమాయోపాయచతురంబై, చతురాననాండంబు భావంబున నపరిమిత [7]భువనజంతుజాలసేవ్యమానంబై, మానినియన లోఁతు సూపక, గరిత యన నడిచప్పుడు సేయక, ముగుద యన బయలు పడక, ప్రమద యన [8]గ్రయ్యంబాఱుచుఁ, బతివ్రత యన నిట్టట్టు చనక, తల్లి యన నెవ్వియైన లోఁగొనుచు, దైవం బన భక్త మనోరథంబు లిచ్చుచు నంతకంతకు గుఱి గడచి యవాఙ్మనసగోచరంబై ప్రవహించి 230

మ. జగతీనాథురథంబుపజ్జ బహుదేశంబుల్ వడిన్ దాఁటి, త
త్సగరక్ష్మావకుమార భస్మములమీఁదన్ ముంచిపాఱన్ మరు
న్నగరావాసము వారు వొందిరి నవీనశ్రీలతో; గంగసీ
రుగతిం గాక మహాదురంత నుజనద్రోహానలం బాఱునే? 231

---

1. కంకణము కడియము, జలబిందువు, 2. సుపరిశీలితవిశ్వంబై - పాఠాంతరము, 3. నవసూతిక - క్రొత్తగా ప్రవించినయువతి, 4. ముఖరరాముఁడు పరశురాముఁడు, 5. అభియాతి- విరోధి, 6. అనిమిషావతారంబు - మత్స్యావతారము, 7. భువనము- లోకము, నీరు, 8. క్రయ్యంబాఱు-కలిసి తిరుగు- క్రమముగాఁ బ్రవహించు.

మ. హరు మెప్పించి మహా తపోనియతుఁడై యాకాశగంగానదిన్
ధరకుం దెచ్చి నితాంతకీర్తిలతికా స్తంభంబుగా నవ్యసు
స్థిరలీలం బితృకృత్య మంతయు నొనర్చెన్ వారితానేకదు
స్తరవంశవ్యథుఁ డా భగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుఁడే? 232

క. హరుఁ దమ మనములలో నిడి హరిపాదాంభోజజనితమైన నదిన్ సు
స్థిరులై మునింకి మునీంద్రులు హరిఁ గలిసిరి త్రిగుణరహితులై యవ్వేళన్. 233

వ. అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభావరుండును, నాభావరునకు సింధుద్వీపుండ ను,సింధుద్వీపునికి నయుతాయువును,నయుతాయువునకు ఋతుపర్ణుండును జనియించె; నతండు. 234

ఆ. నయవిశాలబుద్ధి నలచక్రవర్తితో [1]సంగడీనితనము సాలఁ జేసి
యక్షహృదయ మతని కవ్యస్తముగ నిచ్చి యశ్వవిద్య నేర్చె నతనివలన. 235

వ. ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీవల్లభుం డైన సుదాసుండును బుట్టె; నా రాజశేఖరుని మిత్రసహుండును గల్మాషపాదుండునని చెప్పుదు; రాఘవరుండు వశిష్ఠుని శాపంబున, రాక్షసుఁడయి తన కర్మంబున ననపత్యుండయ్యె; ననిన విని పరీక్షిన్న రేంద్రుం డేమికారణంబున సుదాసునకు గురు శాపంబు ప్రాప్తం బయ్యె నని యడిగిన శుకుం డిట్లనియె. 236

సీ ఆ సుదాసుఁడు వేఁటకై వనంబున కేఁగి గర్వించి యొక్క రక్కసునిఁ జంపి
వానితోఁ బుట్టినవానిఁ బోవిడిచిన వాఁడును దనతోడివాని చావు
వోసీక కపటియై భూపాలుగృహమున [2]నడబాలతనమున నర్థిఁ గొలిచి,
యుండ వసిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ డన్నంబు సేయఁగ నతనిఁ బనుప-
తే. వాఁడు మానవమాంసంబు వండితెచ్చి మునికి వడ్డింపఁ గోపించి ముని నరేంద్రుఁ
బిలిచి మనుజామిషంబును [3]బెట్టి తనుచు నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె. 237

వ. ఇట్లు శపియించి పదంపడి రాక్షసుండు వండి తెచ్చుటయు సుదాసుం డెఱుంగమియుఁ దన మనంబున నెఱిఁగి వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండవయి యుండు మని నియమించె; నయ్యవసరంబున. 238

1. సంగడీనితనము - స్నేహము, 2. అడబాల- వంటవాఁడు, 3. తెప్పించితనుచు - పాఠాంతరము.

మ. గురువున్ మాఱు శపింతు నంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ దత్సతి పతి న్వారింప మిన్నుం దిశల్
ధరయున్ జీవమయంబ కా నిఖిలముం దాఁ జూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయపదంబులం [1]గరపుటీవాఃపూరముంబొక్కుచున్. 239

వ. ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండై శపియింప నొల్లక సుదానుఁడు రాక్షసభావంబు నొంది [2]కల్మాషవర్ణంబు లయిన పాదంబులతో నడవులం దిరుగుచు.

క. ఆఁకట మలమల మాఁడుచు వీఁక నతం డడవి నున్న విప్ర మిథునముం
దాఁకి తటాలున విప్రునిఁ గూఁకటిచేఁ బట్టి మ్రింగఁ గొనిపోవుతఱిన్. 241

వ. అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి [3]డగ్గుత్తికతోఁ బతికి నడ్డంబు వచ్చి యేడ్చుచు రాచరక్కసున కిట్లనియె. 242

క 'మానుషదేహము గలుగుట భూనాయక! దుర్లభంబు; పుట్టినమీఁదన్
దానముఁ బరోపకారము భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్ ? 243

మ. రవివంశాగ్రణివై, సమస్తధరణీరాజ్యానుసంధాయివై,
భువనస్తుత్యుఁడవై పరార్థరతివై, బుధ్యానుకూలుండవై,
వివరం బేమియు లేక నా పెనిమిటిన్ విప్రుం దపశ్శీలు స
త్ప్రవరున్ బ్రహ్మవిదున్ [4]జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే? 244

శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం
డం; డ్రామాటలు లేవె ? భూమిసురగోహత్యాభిలాషంబు గై
కొండ్రే మీయటువంటి సాధువులు ? రక్షోభావ మిట్లేల ? మీ
తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే! ధర్మంబునం బోఁగదే ! 245

శా. అన్నా ! చెల్లెల నయ్యెదన్; విడుపు నీ కన్నంబు వెట్టింతు; నా
ప్రాణనాథున్ ద్విజు [5] [6]గంగికుట్టి నకటా! హింసింప నేలయ్య ? నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె? నిజం బిట్టైన మున్ముట్ట నా
వన్నన్ నన్ను శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే!' 246

1. కరపుటి- దోసిలి, 2. కల్మాష వర్ణంబులు-నల్లనిరంగుకలవి, 3. డగ్గుత్తిక-హీనస్వరము, 4. జగజ్జననమున్-పాఠాంతరము, 5. గంగికుట్టి-పరమసాధువు, 6. ధర్మవర్తి - పాఠాంతరము.

క. అని కరుణ పుట్టనాడుచు వనితామణి పలవరింప వసుధాదేవుం
దినియె నతఁడు పులి పశువుం దినుక్రియ శాపంబుకతన ధీరహితుండై. 247

వ. ఇంత నాబ్రాహ్మణి గోపించి కామార్తనయిన నాదుపెనిమిటి భక్షించితివి గావున నీవు నెలంతలం బొందఁజేరినవేళ మరణంబుఁ బొందు మని కల్మాషపాదుని శపించి పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు సేసి సుగతికిం జనియె; నంతఁ బండ్రెండేండ్లు నసిన నారాజు మునిశాపనిర్ముక్తుండై. 248

ఆ. రతులకొఱకు నాలి రావింప నదియును. బెదరి విప్రసతి శపించు టెఱిఁగి
మగని నడ్డపెట్టి మైథునకర్మంబు, మాన్పె; సతులగోష్ఠి మానె నతఁడు. 249

క. అది కారణముగఁ బుత్రాభ్యుదయము లేదా సుదానభూపాలునకుం;
దదనుమతి నవ్వసిష్ఠుఁడు మదయంతికిఁ గడుపుసేసె మదన క్రీడన్. 250

వ. ఇట్లు సుదాసుఁభార్య యగు మదయంతిఁ వసిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరించి నీల్గాడ [1]సంకటపడుచున్న వసిష్ఠుండు వాఁడి యగు [2] [3]నశ్మంబున నా గర్భంబుఁ జీరిన నశ్మకుం డను కుమారుండు పుట్టె; నతనికి మూలకుండు పుట్టె; నతండు. 251

క. వీరుఁడగు పరశురాముఁడు ఘోరకుఠారమున నృపులఁ గూలుచువేళన్
నారీజనములు దాఁచిన నారీకవచుం డనంగ [4]నలి నుతి కెక్కెన్. 252

వ. ఆ నారీకవచుండు నిర్మూలం బయిన రవివంశంబునకు మూలం బగుటంజేసి మూలకుం డనం బరఁగె; నా మూలకునకు [5]విశ్వసహుండు పుట్టె; విశ్వసహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తి యయ్యె; నతండు. 253

సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁ దన బ్రదుకుకాల
మెంత యని యడిగిన' నిదె నిండుచున్నది; తడవు లే; దేమైన నడుగు' మనిన
వరములు గోరక వరవిమానం బెక్కి తనపురి కేతెంచి తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరునియంద భావంబుఁ గీలించి కులదైవతద్విజకులముకంటె
తే. నంగనాప్రాణరాజ్యపుత్రాదు లెల్లఁ గావు ప్రియములు; ధర్మంబు గడిచి నాదు;
మతి ప్రవర్తింప దెన్నఁడు; మదినెఱుంగ నన్య మాయీశ్వరునిఁ దక్క' ననుచు మఱియు

1. సంకటపడుచున్న - కష్టపడుచుండఁగా, 2. అశ్మంబు - ఱాయి, 3. యగుఱాతనయ్యంగన గర్భంబు - పాఠాంతరము 4. నవి - సామర్థ్యము, 5. దశరథుండను కుమారుండు పుట్టె నతనికి సైబలుండును నతనికి విశ్వసహుండు - పాఠాంతరము.

మ. ఇలమీఁదన్ బ్రదుకేల? వేల్పులపరం బేలా? ధనం బేల? చం
చల [1]గంధర్వపురీవిడంబనము లైశ్వర్యంబు లేలా? జగం
బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై తుదిం బాసి ని
ర్మలమై వాఙ్మనసామితం బగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్. 255

వ. అని నిశ్చయించి. 256

మ. కలసెన్ [2]సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁ [3]డశ్రాంతమై,
కల దయ్యున్ మఱి మీఁదలే దనెడిదై కల్యాణమై యాత్మలోఁ
దలఁపం బల్కఁగరానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ
జ్జలజాతంబుల వాసుదేవుఁ డని సంస్థాపించు నా బ్రహ్మమున్. 257

వ. అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును బుట్టె; రా దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుం డైన హరి నాల్గువిధంబులై శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్న నామంబుల నిజాంశసంభూతుండై జన్మించెఁ; దచ్చరిత్రంబు వాల్మీకిప్రముఖులైన మునులచేత వర్ణితంబైనది; [4]యైననుం జెప్పెద; సావధానమనస్కుండవై యాకర్ణింపుము. 258

## —: శ్రీ రా మ చ రి త్ర :—

మ. [5]అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుం డైనట్టు నారాయణాం
శమునం బుట్టె మదాంధ రావణశిరస్సంఘాతసంభేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుం గౌసల్యకున్, నన్నుతా
సమనైర్మల్య కతుల్య కంచితజనుస్సంసారసాఫల్యకున్. 259

మ. [6]సవరక్షార్థము దండ్రి పంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడ రా
నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకం గరవిరాజ [7]త్ఖేటకం దాటకన్. 260

క. గా రామునఁ గౌశికముఖ మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి తోలెను మారీచున్ నీచుఁ గపటమంజులరోచున్. 261

---

1. గంధర్వపురి - మిథ్యానగరము - అసత్యమైనది. 2. సంగములు - సంబంధములు, 3. అశ్రాంతము-ఎడతెగనిది - శాశ్వతము, 4. వినఁబడుచుండు నాకర్ణింపు - పాఠాంతరము 5. అమరేంద్రాశ-తూర్పు దిక్కు, 6. సవము-యాగము, 7. ఖేటము-డాలు.

మ. ఒక [1]మున్నూఱు గదల్చి తెచ్చిన [2]లలాటోగ్రాక్షచాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱుకుఁ గోరం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులుఁ జూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహక్షమా
వక గేహంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్ 262

క. భూతలనాథుఁడు రాముఁడు ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణిసం
ఘాతన్ భాగ్యోపేతన్ సీతన్ ముఖకాంతివిజిత [3]సితఖద్యోతన్. 263

క. రాముఁడు నిజబాహుబల స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దామున్ విదళీకృతనృపభామున్ రణరంగభీము భార్గవరామున్. 264

క. దశరథుఁడు మున్ను గైకకు వశుఁడై తా నిచ్చినట్టి వరముకతన వా
గ్దశ నెడక యడవి కనిచెను దశముఖముఖకమలతుహినధామున్ రామున్. 265

క. జనకుఁడు పనిచిన మేలని [4]జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను జనపాలారాధ్య ద్విషదసాధ్య నయోధ్యన్. 266

క. భరతున్ నిజపదసేవానిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్
సురుచిరరుచిపరిభావితగురు [5]గోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. 267

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యము దాపసోత్తమశరణ్యము నుద్ధత [6]బర్హి బర్హలా
వణ్యము గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్ 268

సీ. ఆ వనంబున రాముఁ డనుజసమేతుఁడై సతితోడ నాకపర్ణశాల నుండ,
రావణుచెల్లెలు రతిఁ గోరి వచ్చిన మొగి లక్ష్మణుఁడు దానిముక్కు గోయ,
నది విని ఖరదూషణాదులు పదునాల్గువేలు వచ్చిన, రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబు గావింప, జనకనందన మేనిచక్కఁదనము
తే. విని [7]దశగ్రీవుఁ డంగజవివశుఁ డగుచు నర్థిఁ బంచినఁ [8]బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె; నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు. 269

---

1. మున్నూరు - మూఁడువందలమంది, 2. లలాటోగ్రాక్షచాపంబు - శివునివిల్లు,
3. సితఖద్యోతుఁడు - చంద్రుఁడు, 4. జనకజ - సీత, 5. గోత్రాచలము - కులపర్వతము,
6 బర్హి - నెమిలి, 7. దశగ్రీవుఁడు - రావణుఁడు, 8. పసిఁడిఱ్ఱి - బంగారులేడి.

ఉ. ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము సేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన, ఘో
రాయత హేతిఁ ద్రుంచె ననహాయత రామనరేంద్ర కార్యద
త్తాయువుఁ బక్షవేగపరిహాసితవాయువు నజ్జటాయువున్. 270

వ. అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై సీత వెదక నరుదెంచి, నిజ కార్యనిహతుండైన జటాయువునకుఁ బరలోక క్రియలు గావించి ఋశ్యమూకంబునకుం జని. 271

క. [1]'నిగ్రహము నీకు వల దొక నగ్రజు వాలిన్ వధింతు' నని నియమముతో
నగ్రేసరుఁ గా నేలెను సుగ్రీవుం జరణఘాతచూర్ణగ్రావున్. 272

క. లీలన్ రామవిభుం డొక [2]కోలం గూలంగ సేసె గురునయశాలిన్
శీలిన్ సేవితశూలిన్ మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మూలిన్. 273

క. ఇలమీఁద సీత వెదకఁగ నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్ఛలవంతున్ మతిమంతున్, బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్. 274

క. [3]అలవాటుకలిమి మారుతి లలితామితలాఘవమున లంఘించె నుదై
వలినీగణసంబంధిన్ జలపూరితధరణిగగనసంధిన్ [4]గంధిన్. 275

వ. అట్లు సముద్రంబు దాఁటి సీతం గని హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి. 276

క. నమదగ్రత ననిలసుతుం డమరాహితదత్తవాలహస్తాగ్నుల భ
స్మము సేసె నిరాతంకన్ సమదాసురసుభటవిగతశంకన్ లంకన్. 277

వ. ఇట్లు లంకాదహనంబు సేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథయూథంబులుఁ దానును జని చని, 278

శా. ఆరాజేంద్రుఁడు గాంచె భూరివిధరత్నాగారమున్ మీన [5]కుం
భీరగ్రాహకఠోరమున్ విపులగంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబరపారమున్ [6]లవణపారావారముం జేరవన్. 279

---

1. నిగ్రహము - నిర్బంధము, 2. కోల - బాణము, 3. అలవాటుకలిగి-పాఠాంతరము 4. గంధి - సముద్రము, 5. కుంభీరము- మొసలి, 6 లవణపారావారము - ఉప్పుసముద్రము.

వ. కని తనకుఁ ద్రోవ యి మ్మని వేఁడిన నదియు మార్గంబు సూపక మి న్నుందిన నా రాచ పట్టి రెట్టించిన కోపంబున. 280

క. మెల్లని నగవున నయనము లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ బెల్లలు నై జలధి పెద్దబీదై యుండెన్, 281

వ. ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁ గూడి మూర్తిమంతుండయి చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబుఁజొచ్చి యిట్లని స్తుతియించె. 282

శా. 'ఓ కాకుత్స్థకులేశ! యో గుణనిధీ! యో దీనమందార! నే
నీకోపంబున కెంతవాఁడ?' [1]జడధిన్; నీ వేమి భూరాజవే?
లోకాధీశుఁడ; వాదినాయకుఁడ; వీ లోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిం బ్రభవించు; నుండు; నడఁగున్; నిక్కంబు సర్వాత్మకా! 283

క. [2]ధాతల రజమున, దేవవ్రాతము సత్త్వమున, భూతరాశిఁ దమమునన్
[3]జాతులఁగా నొసరించు గుణాతీతుఁడ వీపు గుణగణాలంకారా! 284

క. కట్టుము సేతువు; లంకం, జుట్టుము; నీబాణవహ్ని సురవైరితలల్
గొట్టుము నేలం బడఁ; జే పట్టుము నీ యబల నధిక భాగ్యప్రబలన్. 285

ఆ. హరికి మామ నగుదు; నదిమీఁద శ్రీదేవి, తండ్రి; నూర కేల? [4]తాగడింపఁ
గట్టఁ గట్టి దాఁటు కమలాప్తకులనాథ! నీయశోలతలకు నెలవుగాఁగ,' 286

వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు; పొమ్మని వీడుకొల్పె నంత. 287

క. ఘనశైలంబులుఁ దరువులు ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్
ఘనజలరాశిం గట్టిరి [5]ఘనవాహప్రముఖదివిజగణము నుతింపన్. 288

వ. ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణుతమ్ముం డైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి, కూడుకొని లంకకుఁ జని విడిసి [6]వేడె పెట్టించి [7]లగ్గలు పట్టించిన, 289

1. జడుఁడన్-పాఠాంతరము 2. ధాతలు-బ్రహ్మలు, 3. జాతులు-పుట్టువారు. 4. తాకడింప-పాఠాంతరము 5. ఘనవాహుఁడు-ఇంద్రుఁడు 6. వేడెపెట్టించి-ముట్టడింపఁజేసి, 7. లగ్గలుపట్టించిన-ఎగఁబ్రాఁకించిన.

సీ. ప్రాకారములు ద్రవ్వి, పరిఖలు పూడిచి కోటకొమ్మలు నేలఁగూలఁ ద్రోచి,
[1]వప్రంబు లగలించి, వాకిళ్లు వెకలించి, తలుపులు విఱిచి, యంత్రములు నెఱిచి,
మన [2]విటంకంబులు ఖండించి [3]పడవైచి, గోపురంబులు నేలఁ గూలఁ దన్ని,
మకరతోరణములు మహిఁగూల్చి, కేతనంబులు సించి, సోపానములు గదల్చి,
ఆ గృహము లెల్ల [4]వ్రచ్చి గృహరాజముల [5]గ్రొచ్చి ఖర్మకుంభచయము పాలువైచి,
కరులు కొలను సొచ్చి కలఁచినకై వడిఁ గపులు లంకఁజొచ్చి కలఁచి రప్డు. 290

వ. అంత నయ్యసురేంద్రుండు వంచినం గుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సురాంతక నరాంతక దుర్ముఖ ప్రహస్త మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శరశరాసన తోమరగదాఖడ్గశూలభిందిపాలపరశుపట్టిసప్రాసముసలాది సాధనంబులు ధరియించి మాతంగతురంగ [6]స్యందనసందోహంబుతో బవరంబుసేయ సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమాదన నీలాంగద కుముద జాంబవదాదు లా రక్కసుల [7]నెక్కటి కయ్యంబులందుఁ దరుల గిరులఁ గరాఘాతంబుల నుక్కడంచి; రంత. 291

క. అయెడ లక్ష్మణుఁ డుజ్జ్వల సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళమాయోపాయున్ నయగుణవిధేయు నయ్యతికాయున్. 292

ఆ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె, మేటికడిమి నీలమేఘవర్ణు
బాహుశక్తిపూర్ణుఁ బటుసింహనాదనంకునితదిగిభకర్ణుఁ గుంభకర్ణు. 293

క. అలవున లక్ష్మణుఁ డాజిస్థలిఁ గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్
బలభేదిజయవినోదున్ బలజనితసుపర్వసుభటభావవిషాదున్. 294

వ. అంత. 295

క. తనవా రందఱు [8]మ్రగ్గిన ననిమిషపతివైరి పుష్పకారూఢుండై
యనికి నడచి రామునితో ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెన్. 296

వ. అయ్యవసరంబున. 297

---

1. వప్రంబులు-కోటగోడలు, 2. విటంకంబులు-ముంజూరులు. 3. గోపురంబులు విప్పి పీథుల పొందుఁజెఱిచి-పాతాఁతరము, 4 వ్రచ్చి-చీల్చి, 5 గొచ్చి-త్రవ్వి, 6. స్యందనము - రథము, 7. ఎక్కటికయ్యంబులు - ద్వంద్వ యుద్ధములు, 8 మ్రగ్గిన-మరణింపఁగా,

క. సురపతిపంపున మాతలి గురుతరమగు దివ్యరథముఁ గొని వచ్చిన, నా
ధరణీవల్లభుఁ డెక్కె ను [1]ఖరకరుఁ డుదయాద్రి నెక్కు-కైవడి దోఁపన్. 298

వ. ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు రావణున కిట్లనియె. 299

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో,
కపటబ్రాహ్మణమూర్తివై యబల నా కాంతారమధ్యంబునం
దపలావించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్నిసం
తపనం బేగతి నోర్చువాఁడవు? దురంతం బెంతయున్ రావణా! 300

క. నీచేసినపాపములకు నీచాత్మక! యముఁడు వలదు; నేఁ డిట నా [2]నా
రాచములఁ [3]ద్రుంచివైచెద ఖేచరభూచరులు గూడి క్రీడం జూడన్. 301

వ. అని పలికి. 302

మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండభీమంబుగాఁ
బ్రళయోగ్రానలసన్నిభంబగు మహాబాణంబు సంధించి, రా
జలలాముండగు రాముఁ డేసె ఖరభాషాద్రావణున్ దేవతా
బలవిద్రావణు' వైరిదారజనగర్భస్రావణున్ రావణున్. 303

క. దశరథసూనుం డేసిన [4]విశిఖము హృదయంబుఁ దూఱ వివశుండగుచున్
దశకంధరుండు గూలెను దశవదనంబులను రక్తధారలు దొరఁగన్. 304

వ. అంత నా రావణుండు దెగుట విని. 305

సీ. కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో నంసభాగంబుల నావరింప
సేనముత్యంబులు సెదరఁ గర్ణిక లూడఁ గంఠహారంబులు గ్రందుకొనఁగ
వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ గన్నీళ్లవఱద లంగములు దడుప
సన్నపునడుములు జవ్వాడఁ బాలిండ్లబరువులు [5]నడుములఁ బ్రబ్బికొనఁగ
ఆ. నెత్తి మోఁదికొనుచు నెఱిఁ బయ్యెదలు జాఱ నట్టునిట్టుఁ దప్పటడుగులిడుచు
నసురసతులు వచ్చి రట భూతవేతాళ సదనమునకు ఘోర [6]కదనమునకు 306

---

1. ఖరకరుఁడు-సూర్యుఁడు, 2. నారాచములు - బాణములు. 3 నాజ్ఞసేసెద-పాఠాంతరము. 4. విశిఖము-బాణము, 5. చనువుల-పాఠాంతరము. 6. కదనము-యుద్ధరంగము,

వ ఇట్లు వచ్చి తమతమనాథులం గని శోకించి; రందు మండోదరి రావణుం జూచి యిట్లనియె. 307

ఉ. 'హా దనుజేంద్ర ! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రునికోలల కోర్వలేక సో
న్మాదముగన్ రఘుప్రవరుమానిని నేటికిఁ దెచ్చి? తప్పు దేఁ
గా దని చెప్పినన్ వినక కాలవశంబునఁ బొంది తక్కటా! 308

ఆ. ఎండఁగాయ వెఱచు నినుఁడు వెన్నెలఁగాయ వెఱచు [1]విధుఁడు గాలి వీవ వెఱచు
లంకమీఁద నిట్టి లంకాపురికి మాకు నధిప! విధవభావ మడరె నేఁడు 309

క. [2]దురితముఁ దలఁపరు గానరు జరుగుదు రెట కైన నిమిషసౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును బరధనసక్తులకు నిహముఁ బరముం గలదే? 310

వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రునిపంపు వడసి రావణునకు దహనాది క్రియలు గావించె నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి శింశుపాతరుసమీపంబు నందు- 311

శా. దైతేయప్రమదాపరీత, నతిభీతన్ గ్రంథిబంధాలక
వ్రాతన్, నిశ్శ్వసనానిలాత్రశుకజీవంజీవదారామభూ
జాతన్, శుష్కకపోలకీలితకరాబ్జాతం, బ్రభూతం, గృశీ
భూతం బ్రాణసమేత సీత గనియెన్ భూమీశుఁ డా ముందటన్. 312

వ. కని రామచంద్రుండును దాపంబు నొంది భార్యవలన దోషంబు లేకుండుట వహ్ని ముఖంబునం బ్రకటంబుసేసి, దేవతలపంపున దేవిం జేకొని. 313

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాక్షసేంద్రకా
శేషవిభూతిఁ గల్ప [3]సమజీవి గ మ్మని నిల్పె నర్థినం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నాద్యపోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్. 314

వ. ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుఁడు సీతాలక్ష్మణసమేతుండై సుగ్రీవ హనుమ దాదులం గూడికొని పుష్పకారూఢుండై వేల్పులు గురియు పువ్వుల సోనలం దడియుచుఁ దొల్లి వచ్చిన తెరువుజాడలు సీతకు నెఱిఁగించుచు మరలి నందిగ్రామంబునకు వచ్చె; నయ్యవసరంబున. 315

1. విధుఁడు-చంద్రుఁడు, 2. దురితము-పాపము, 3. సమము - సంవత్సరము.

ఆ. రామచంద్రవిభునిరాక వీనుల విని భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను లెల్లఁ గొలువ నన్న కెదురువచ్చె. 316

వ. వచ్చి పాదుకల ముందట నిడికొని [1]యెడనెడ సాష్టాంగ దండప్రణామంబులు సేయుచు మెల్లన డాసి రామచంద్రుని పాదంబులు దననొసలం గదియించి తచ్చరణ రేణువులు దుడిచి శిరంబునం జల్లికొని [2]తనివి సనక పట్టియు నప్పదకమలంబు లక్కున మోపి కొనుచు సంతసంబునఁ గన్నీటం గడిగి సేమంబు లరయుచుండె; నంత సీతాలక్ష్మణసహితుండై విభుండును దన కెదురువచ్చిన బ్రాహ్మణజనంబులకు నమస్కరించి తక్కిన వారలచేత మన్ననలు వొంది వారల మన్నించె నయ్యవసరంబున. 317

చ. 'నృపవర! [3]పెక్కునాళ్లఁగొలె [4]నిన్ గన కుండినయట్టి నేఁడు మా
తపములు పండె నిందఱును ధన్యుల మైతి మటంచుఁ బుట్టముల్
చపలతఁ ద్రిప్పి పువ్వులవసంతము లాడుచుఁ బాడుచున్ గత
త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగు సేసి రెల్లెడన్. 318

సీ. కవ గూడి యిరుదెసఁ గపిరాజు రాక్షసరాజు నొక్కటఁ జామరము వీవ,
హనుమంతుఁ డతిధవళాతపత్రముఁ బట్టఁ బాదుకల్ భరతుండు భక్తిఁ దేర
శత్రుఘ్నుఁ డమ్ములఁ జాపంబు గొని రాఁగ సౌమిత్రి భృత్యుఁడై చనవునూప,
జలపాత్ర చేఁబట్టి జనకజ గూడిరాఁ గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ

ఆ. [5] [6]బసిఁడికేడె మర్థి భల్లూకపతి మోచి కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి
గ్రహము లెల్లఁ గొలువఁ గడు నొప్పు సంపూర్ణ చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె 319

వ. ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు సేరి కొలువ శ్రీరాముం డయోధ్యకుం జనియె నంతకు మున్న యప్పురంబునందు 320

సీ. వీథులు సక్కఁ గావించి తోయంబులు సల్లి [7]రంభాస్తంభచయము నిలిపి
పట్టుఁజీరలు సుట్టి, బహుతోరణంబులఁ [8]గలువడంబులు మేలుకట్లుఁ గట్టి
వేదిక లలికించి వివిధరత్నంబుల ముగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథ లెల్ల వ్రాయించి ప్రాసాదముల దేవభవనములను
తే. గోపురంబుల బంగారుకుండ లెత్తి యెల్లవాకిండ్లఁ గానిక లేర్పరించి
జనులు గైసేసి తూర్య ఘోషములతోడ నెదురు నడతెంచి రా రాఘవేంద్రుకడకు. 321

---

1. ఎడనెడ-నడుమనడుమ, 2. తనివిసనక-తృప్తితీఱక, 3. పెక్కునాళ్లఁగొలె-చాలదినములనుండి. 4. నిన్నుఁ గనుంగొనఁగల్గె నేఁడు-పాఠాంతరము, 5 పసిఁడితోరణఁ బట్టి - పాఠాంతరము 6. పసిఁడికేడెము - బంగారుడాలు, 7. రంభాస్తంభచయము - అరటికంబములగుంపు, 8. కలువడంబులు - కలువపూదండలు.

క. సమదగజదానధారల [1]దుమదుమలై యున్న పెద్దత్రోవలతోడన్
రమణీయమయ్యె నప్పురి రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియపోలెన్. 322

ఆ రామభూవరేంద్రురాకఁ దూర్యములతో రథగజాశ్వసుభటరాజితోడ
నమరెఁ బురము చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు జంతుభంగమిళితజలధిభంగి. 323

వ ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి రాజమార్గంబున రామచంద్రుండరుగుచున్న
సమయంబున 324

మ. 'ఇతఁడే రామనరేంద్రుఁ డీయబలకా [2]యింద్రారి ఖండించె న
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డా పొంతవాఁడే మరు
త్సుతుఁ డా చెంగట నా విభీషణుఁ' డటంచుం జేతులం జూపుచున్
సతు లెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్రభాగంబులన్. 325

వ. ఇట్లు సమస్త జనంబుఁ జూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జని చని 326

సీ. పటికంపుగోడలుఁ బవడంపు వాకిండ్లు నీలంపుటరుఁగులు నెఱయఁ గలిగి
కమనీయ వైదూర్యక స్తంభచయముల [3]మకరతోరణముల మహిత మగుచుఁ
బడగల మాణిక్యబద్ధచేలంబులఁ జిగురుఁ దోరణములఁ జెలువు మీఱి
పుష్పదామకముల భూరి [4]వాసనలను బహుతరధూపదీపముల మెఱసి
తే. మాఱువేల్పులభంగిని మలయుచున్న సతులుఁ బురుషులు నెప్పుడు నందడింప
గుఱుతులిడరాని ధనముల కుప్పలున్న రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు 327

వ. ఇట్లు వచ్చి 328

ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి [5]తమతల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం
పుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాల మన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్. 329

వ. తత్సమయంబునఁ దల్లులు 330

చ. కొడుకులఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులం
బుడుకుచు మోములుం దలలు బోరన ముద్దుఁగొంచు నవ్వుచుం

---

1. దుమదుమలై-బురదకలిగి, 2. ఇంద్రారి-ఇంద్రశత్రువు-రావణుఁడు, 3. మకరతభూమముల్-పాఠాంతరము. 4. వాసనముల-పాఠాంతరము, 5. తమతల్లి-కౌసల్య.

దొడలకు వారి రాఁ దిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్
[1]వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టము లయ్యె నటంచు [2]నుబ్బుచున్. 331

వ. అంత వసిష్ఠుం డరుగుదెంచి శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి, కుల వృద్ధులుం దానును సమంత్రకంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతి చందంబున సముద్ర నదీజలంబుల నభిషేకంబు సేయించె; రఘువరుండును సీతాసమేతుండై జలకంబు లాడి మంచి పుట్టంబు గట్టికొని కమ్మని పువ్వులు దుఱిమి సుగంధంబు లలందికొని, తొడవులు తొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి యతని మన్నించి కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు జగత్పూజ్యంబుగ రాజ్యంబు సేయుచుండె; నప్పుడు. 332

సీ. కలఁగు బెల్లను మానెఁ గంధు లేడింటికిఁ; జలనంబు మానె భూచక్రమునకు;
జాగరూకత మానె జలజలోచనునకు; దీనభావము మానె దిక్పతులకు;
మాసి యుండుట మానె మార్తాండవిధులకు; గావిరి మానె దిగ్గగనములకు;
[3]నుడిగి పోవుట మానె నుర్వీరుహంబుల; [4]కడఁగుట మానెఁ ద్రేతాగ్నులకును;
ఆ. [5]గడిఁదివ్రేఁగు మానెఁ గరిగిరికిటినాగకమఠములకుఁ; బ్రజల కలఁక మానె
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు ధరణిభరణరేఖఁ దాల్చునపుడు. 333

వ. మఱియును, 334

సీ. పొలఁతులవాలుచూపులయంద చాంచల్య, మబలల నడుములయంద లేమి,
కాంతాలకములంద కౌటిల్యసంచార, మతివల నడవులయంద జడిమ,
ముగుదలపరిరంభములయంద పీడన, మంగనాకుచములయంద పోరు,
పడఁతులరతులంద బంధసద్భావంబు, సతులఁ బాయుటలంద [6]సంజ్వరంబు,
తే. ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పులంద చౌర్యంబు, వల్లభు లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్ళుపట్టులం దక్రమంబు రామచంద్రుఁడు పాలించు రాజ్యమందు. 335

క. తంద్రీక్రియ రామచంద్రుఁడు దంద్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపం
దంద్రుల నందఱు మఱచిరి దంద్రి గదా రామచంద్రధరణీపుఁ డనుచున్. 336

వ. మఱియు నా రామచంద్రుండు రాజర్షి చరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీవ్రతుండును, సర్వలోకసమ్మతుండును నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక

1. వెడలిన-పోయిన, 2. ఉబ్బుచున్-సంతోషించుచు. 3 ఉడిగిపోవుట-క్షీణించుట, 4. అడఁగుట - అణిపోవు, 5 గడిఁదివ్రేఁగు - గొప్పబరువు, 6. సంజ్వరంబు - తాపము

లనుభవించుచుఁ, ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబుఁ గావించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ రాజ్యంబు సేయుచుండె; నయ్యెడ. 337

ఆ. సిగ్గుపడుట గల్గి, సింగారమును గల్గి, భక్తి గల్గి చాల భయముఁ గల్గి,
నయముఁ బ్రియముఁ గల్గి, నరనాథుచిత్తంబు సీత దనకు వశముసేసికొనియె! 338

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 339

ఆ. 'భ్రాతృజనులయందు, బంధువులందును, ప్రజలయందు, రాజభావ మొంది
యెట్లు మెలఁగె రాఘవేశ్వరు? డెవ్వనిఁ గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె?' 340

వ. అనిన శుకుం డిట్లనియె. 341

సీ. భగవంతుఁడగు రామభద్రుండు ప్రీతితో దేవోత్తముని, సర్వదేవమయునిఁ,
దనుఁ దాన కూర్చి [1]యధ్వరములు సేసెను; హోతకుఁ దూరువు, నుత్తరంబు
సామగాయకునికి, [2]శమనదిగ్భాగంబు బ్రహ్మకుఁ, గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు, శేష మాచార్యునకు నిచ్చి సొమ్ములఁ బంచి భూసురుల కొసఁగి,
తే. తనదు రెండు వుట్టంబులుఁ దనకు నయిన మెలఁతమంగళసూత్రంబు [3]మినుకుఁ దక్క;
వినతుఁడై యుండె; నా రామువితరణంబు పాండవోత్తమ! యేమని పలుకవచ్చు? 342

వ. అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు దమతమ భూములు మరల సిచ్చి యిట్లనిరి. 343

ఆ. ధరణి వలదు; మాకుఁ దపసుల కేల? నీ వఖిలలోకగురుఁడవైన హరివి;
మా మనంబులందు మలయు [4]చీఁకటిఁ బాపు భవదుదారరుచులఁ బార్థివేంద్ర! 344

వ. అని పలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు నని రిట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి రాఘవేంద్రుం డొక్క దినంబున. 345

సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించుకొఱకునై రాముండు గూఢవృత్తి
నడురేయి దిరుగుచో, [5]నాగరజనులలో నొక్కఁడు దనసతి యొప్పకున్న
'నొరునింటఁ గొంపురం బున్న చంచలురాలిఁ బాయంగలేక చేపట్ట నేమి
తా వెఱ్ఱి యగు రామధరణీశ్వరుండనే? బేల పొమ్మ్మనుమాట బిట్టు వలుక

---

1 అధ్వరములు - యాగములు, 2. శమనదిగ్భాగంబు - దక్షిణదిక్కు, 3. మినుకు-బొట్టు, 4. చీఁకటి - అజ్ఞానము, 5. నాగరజనులు - పట్టణములోని ప్రజలు.

ఆ. నాలకించి మఱియు నా మాట చారుల వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రవోవఁ జెప్పక వాల్మీకి పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి. 346

వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె; వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె; లక్ష్మణునకు నంగదుండును జంద్రకేతుండును, భరతునకు దక్షుండును బుష్కలుండును, శత్రుఘ్నునకు సుబాహుండును శ్రుతసేనుండును సంభవించి; రయ్యెడ, 347

క. బంధురబలుఁడగు భరతుఁడు గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁడగు నన్న కిచ్చెను బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్. 348

ఆ. మధువనంబులోన మధునందనుం డగు లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ డన్న రామచంద్రుఁ డౌ ననంగ. 349

వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రునికొమారులయిన కుశలవు లిద్దఱును వాల్మీకివలన వేదాదివిద్యలయందు నేర్పరులై పెక్కుసభల [1] [2] సతానంబుగా రామకథాశ్లోకంబులు వాడుచు, నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని. 350

మత్త. వట్టి మ్రాకులు పల్లవింప నవారియై మధుధార దా
[3] నుట్టఁ బాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడుం బ్రజల్
బిట్టు నంతస మంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్
దొట్ట నౌదల లూఁచి వారలతోడి [4]మక్కువ పుట్టఁగాన్. 351

వ. అంత నా రామచంద్రుండు కుమారుల కిట్లనియె. 352

ఆ. చిన్నయన్నలార! శీతాంశుముఖులార! నళినదళవిశాలనయనులార!
మధురభాషులార! [5]మహిమీఁద నెవ్వరు, తల్లిదండ్రి మీకుఁ ధన్యులార! 353

వ. అనిన వార 'లేము వాల్మీకి [6]పౌత్రులము; రాఘవేశ్వరుని యాగంబు సూడవచ్చితి' మనవుడు మెల్లన నగి '[7]యెల్లిప్రొద్దున మీతండ్రి నెఱింగెద; రుండుండని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె; మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని యనేక ప్రకారంబుల వినుతించి యిట్లనియె 354

---

1. సుతానకంబుగా-పాఠాంతరము. 2. సతానంబుగ-చక్కనిస్వరముతో-మధురముగా, 3. ఉట్ట-స్రవింపఁగా, 4. మక్కువ-ప్రీతి, 5 మహి-భూమి, 6. శిష్యులము-పాఠాంతరము, 7. ఎల్లి-రేపు,

ఆ. 'సీత [1]ముద్దరాలు, చిత్తవాక్కర్మంబు లందు సత్యమూర్తి, యమలచరిత,
పుణ్యసాధ్వి, విడువం బోలదు ; చేకొను, రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర!' 355

వ. అని వాల్మీకి పలుక రామచంద్రుండు పుత్రార్థియై విచారింపఁ గుశలవులను వాల్మీకికి నొప్పగించి రామచంద్ర చరణధ్యానంబు సేయుచు నిరాశయై సీత భూవివరంబు సొచ్చె ; నయ్యెడ. 356

మ. 'ముదితా! యేటికిఁ గ్రుంకి తీవు ? మనలో మోహంబు చింతింపవే ?
వదనాంభోజము సూపవే ? మృదువు నీ వాక్యంబు విన్పింపవే ?
తుది సేయం దగ' దంచు [2]నీశ్వరుఁడునై దుఃఖించె భూపాలుఁ ; డా
పదగాదే ప్రియురాలిఁ బాసినయెడన్ భావింప నెవ్వారికిన్. 357

వ. అని వగచి రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి పదుమూఁడువేల యేండ్లెడతెగకుండ నగ్నిహోత్రంబులు సెల్లించి తా నీశ్వరుండు గావునఁ దన [3]మొదలినెలవునకుం జనియె ; నవ్విధంబున. 358

ఆ. ఆదిదేవుఁడైన యా రామచంద్రుని కబ్ధి గట్టు టెంత ? యసురకోటిఁ
జంపుటెంత ? కపులసాహాయ్య మది యెంత ? సురలకొఱకుఁ గ్రీడ సూపెఁగాక! 359

చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతానివర్తికిన్,
దశదిగధీశమౌళిమణిదర్పణమండిత దివ్యకీర్తికిన్,
దశశతభానుమూర్తికి, సుధారుచిభాషికి, సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని, దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్. 360

ఉ. నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, [4]మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు, గడు [5]విప్పగు వక్షమువాఁడు, మేలు పైఁ
జల్లెడువాఁడు, నిక్కిన భుజంబులవాఁడు, యశంబు దిక్కులం
జల్లెడువాడు నైన రఘుసత్తముఁ డిచ్చుత మా కభీష్టముల్. 331

ఆ. రామచంద్రుఁ గూడి రాకలఁ బోకలఁ గదిసి తిరుగువారుఁ, గన్నవారు,
నంటికొన్నవారు నా [6]కోసలప్రజ లరిగి రాదియోగు లరుగుగతికి. 362

---

1. ముద్దరాలు - పాఠాంతరము, 2. ఈశ్వరుఁడునై - భగవంతుఁడై యున్నను, 3. మొదలినెలవు - మూలస్థానము-పరమ పదము, 4. మహాశుగంబులు - గొప్పబాణములు, 5. విప్పు-విశాలము 6. నాకన్నప్రజలు దా. రరిగి-పాఠాంతరము.

క. [1]మంతనములు, సద్గతులకుఁ బొంతనములు, ఘనములైన పుణ్యముల [2]కిదా
నీంతనపూర్వమహాఘనికృంతనములు రామనామకృత చింతనముల్. 363

వ. ఆ రామచంద్రునకుఁ గుశుండును, గుశునకు నతిథియు, నతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును, బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకుఁ జలుండును, జలునకు నర్కసంభవుండగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియు, విధృతికి హిరణ్యనాభుండును జనియించె; రతండు జైమినిశిష్యుండైన యాజ్ఞవల్క్య మునివలన నధ్యాత్మయోగంబు నేర్చి హృదయ [3]కలుషంబులం బాసి యోగచర్యుం డయ్యె; నా హిరణ్యనాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండును బుట్టె; రా రాజయోగి సిద్ధుండయి, కలాపగ్రామంబున నున్నవాఁడు; కలియుగాంతంబున నష్టంబయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపం గలవాఁ; డా మరువునకుఁ బ్రశుశ్రుకుండును, నా ప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుండును, నా యమర్షణునికి మహస్వంతుండును, నా మహస్వంతునకు విశ్వసాహ్వుండును, నా విశ్వసాహ్వునకు బృహద్బలుండును జనియించి; రా బృహద్బలుఁడు భారతయుద్ధంబున మీ తండ్రి యగు నభిమన్యునిచేత హతుం డయ్యె; వినుము. 364

—: భ వి ష్య ద్రా జే తి హా స ము :—

తే. 'పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలుఁ దుదయుఁ గాఁ గలరాజులఁ [4]దోడుతోడ
నెఱుఁగఁ జెప్పితి నీవారి; నింకమీఁదఁ బుట్టఁగలవారిఁ జెప్పెద భూవరేంద్ర! 365

వ. ఆ బృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్షతుండును, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకు, బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సునక్షత్రుండును, సునక్షత్రునకు బుష్కరుండును, బుష్కరునకు నంతరిక్షుండును, నంతరిక్షునకు సుతపుండును, సుతపునకు నమిత్ర

1. మంతనములు-ఏకాంతములు, 2. ఇదానీం···నములు-ఇప్పుడును, పూర్వమును చేసిన గొప్ప పాపములను నశింపఁజేయునవి. 3. కలుషంబులు- కలఁతలు, 4. తోడుతోడ-క్రమక్రమముగా.

జిత్తును, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండును, నతనికి సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధాదుండును, శుద్ధాదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తును, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునను ఋణకుండును, ఋణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును బుట్టుదురు; సుమిత్రుని యనంతర కాలంబున సూర్యవంశంబు నశింపఁగలదు; వీరలు బృహద్బలుని నుండి క్రమంబునం బుట్టంగలవార' లని చెప్పి శుకుం డిట్లనియె. 366

సీ. 'ధన్యుఁ డా యిక్ష్వాకుతనయుఁ డౌ నిమి యాగ మాచరింపఁగఁగోరి యా వశిష్ఠు
[1]నా ర్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ 'డింద్రునిమఖము సేయింప, నియ్యకొనినాఁడ; మఱి వత్తుఁ; గొదవ లే దన వచ్చి సంసార మెంతయుఁ జంచలంబు
కాలయాపన మేల? క్రతువు సేసెద' నని యన్యఋత్విక్కుల నతఁడు గూర్చి
తే. చేయ నింద్రునియాగంబు నెల్లఁజేసి గురుఁడు ననుదెంచి శిష్యుపైఁ గోపమెత్తి
'యోరి! నావచ్చునందాఁక నుండ' వనుచు నతని దేహంబు వడుఁగాత మని శపించె.

వ. ఇట్లు వసిష్ఠుండు శపించిన నిమియును వసిష్ఠుని దేహంబు వడుఁగాక యని మరల శపియింప నవ్వసిష్ఠుండు మిత్రావరుణులవలనఁ గడపట నూర్వశికి జన్మించె; గురుశాపంబున బ్రహ్మజ్ఞానియైన నిమి విగతదేహుండైన; నతని దేహంబు మునీశ్వరులు గంధ [2]వస్తువులం బొదివి దాఁచి [3]దొరఁకొన్న సత్త్రియాగంబు సెల్లించిరి; గడపట దేవగణంబులు మెచ్చి వచ్చిన వారలకు నిమిదేహంబు సూపి 'బ్రదుకం జేయు' డనవుడు వారలు 'నిమి ప్రాణంబు వచ్చుంగాక' యని పలికిన నిమి దన దేహంబు సొర నొల్లక యి ట్లనియె.

మ. అతిమోహాకులితంబు, సాంద్ర మమతాహంకారమూలంబు, సంతతనానాసుఖదుఃఖపీడిత, మనిత్యం; బిట్టి దేహంబు [4]సంక్రుతి నా కేటికి? మీనదేహమునకుఁ భంగిన్ భీతబాహుళ్య మంచితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ హరిం గొల్చుచున్.' 369

వ. అని పలికిన నిమిమాటలు క్రమ్మఱింప నేరక శరీరులు గన్నులు దెఱచినప్పుడును మూసి నప్పుడును నిమి గానవచ్చుం గాక యని పల్కి దేవతలు చని; రంత. 370

ఆ. పెద్ద లైన మునులు పృథివీస్థలికి రాజు లేమిఁ జూచి నిమికళేబరంబు
[5]దరువ నొకఁడు వుట్టెఁ దనయుండు; వాసిని జనకుఁ డనుచుఁ బలికె జగము లెల్ల. 371

1. ఆర్త్విజ్యము-ఋత్విక్కుగానుండుట, 2 పుష్పంబుల-పాఠాంతరము, 3. దొరకొన్న-ప్రారంభించిన, 4. సంకృతి - ఆక్రమణము - ప్రవేశము. 5. తరువ-మథింపగా.

వ. మఱియు నతండు విదేహజుండు గావున వైదేహుం డనియు, మథనజాతుండు గావున మిథిలుం డనియు ననం బరఁగె; నమ్మిథులునిచేత నిర్మితం బయినది మిథిలానగరంబు నాఁ బరఁగె; నా జనకునకు నుదావసుండును, నుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతునకు దేవరాతుండును, దేవరాతునకు బృహద్రథుండును బుట్టె; నాతనికి మహావీర్యుండును, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండును, నతనికి మరువును, నతనికి బ్రతింధకుండును, నతనికిఁ గృతరయుండును, నతనికిఁ దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికి గీర్తిరాతుండును, నతనికి మహారోముండును, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టిరి, 372

ఆ. అతఁడు మఖము సేయ నవని దున్నింపంగ లాంగలంబుకొనను లక్షణాంగి
సీత జాద యయ్యెఁ; సీరధ్వజుం డనఁ దానఁ జెప్పఁబడియె ధన్యుఁ డతఁడు. 373

వ. ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకు గృతధ్వజ మితధ్వజు లనువా రిద్దఱుఁ బుట్టె; రందుఁ గృతధ్వజునకు గేశిధ్వజుం డుదయించె; నతండు తన్నుఁ దా నెఱింగెడి విద్యయందు నేర్పరియయ్యెఁ; మితధ్వజునకు ఖాండిక్యుం డనువాఁడు జన్మించి, తండ్రివలన నెఱుక గలవాఁడై కర్మతంత్రంబు నేర్చి కేశిధ్వజునివలన భీతుండై యేఁగె; ఖాండిక్యునకు భానుమంతుండును భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్నునికి శుచియు, శుచికి సనద్వాజుండు, సనద్వాజునకు నూర్ధ్వకేతుండును, నూర్ధ్వకేతునకు నజుండును, నజునకుఁ గురుజిత్తును, గురుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి శ్రుతాయువును, శ్రుతాయువునకుఁ బార్శ్వకుండును, బార్శ్వకునకుఁ జిత్రరథుండును, జిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమరథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, నుపగురునకు నగ్నిదేవు [1]ప్రసాదంబున నుపగుర్వుండును, నుపగుర్వునకు సావనుండును, సావనునకు సువర్చనుండును గల్గి; రతండె సుభూషణుండని వినంబడు; నా సుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ధృతుండును, ధృతునకు ననఘుండును, ననఘునకు వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁ గృతియు, గృతికి మహావశియును జన్మించిరి; వీరలు మైథిలు లగురాజు లని చెప్పంబడుదురు; యోగీశ్వర ప్రసాదంబున గృహస్థులై యుండియు బంధనిర్ముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి, నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచు నుందు; రని పలికి శుక యోగీంద్రుం డిట్లనియె. 874

1. ప్రసాదంబు - అనుగ్రహము.

—: చంద్ర వంశ్యులగు రాజుల యితిహాసము :—

ఆ. చంద్ర [1]గౌరమైన జంద్రవంశమునందుఁ జంద్రకీర్తితోడ జనితమైన
యట్టి పుణ్యమతుల నైళాదిరాజుల నిఁక వినుము మానవేంద్ర చంద్ర! 375

సీ. ఒకవేయితలలతో నుండు జగన్నాథు బొడ్డుఁదమ్మిని బ్రహ్మ పుట్టె మొదల;
నతనికి గుణముల సతసిఁ బోలిన దక్షుఁడగు నత్రి సంజాతుఁ డయ్యె; నత్రి
కడగంటిమాడ్కిఁ [2]గలువలసంగడీఁ డుదయించి విపుల కోషధులకు
[3]నమరఁ దారాతతి కజుని పంపున నాథుఁడై యుండి రాజసూయంబు చేసి,

తే. మూఁడులోకములను గెల్చి [4]మోరకమునఁ జని బృహస్పతిపెండ్లాముఁ [5]జారుమూర్తిఁ
దార నిలు సొచ్చి కొనిపోయి తన్ను గురుఁడు వేఁడుకొనఁ దాఁక నయ్యింతి విడుపఁ డయ్యె.

వ. అంత వేల్పులతో రక్కసులకుఁ గయ్యం బయ్యె; బృహస్పతితోడివైరంబునం జేసి రాక్ష సులుం దానును శుక్రుండు చంద్రునిం జేపట్టి సురాచార్యునిం బోఁదోలిన హరుండు భూత గణసమేతుండై [6]తన గురుపుత్రుం డైన బృహస్పతి జేపట్టె; దేవేంద్రుండు సురగణం బులుం దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె; నయ్యవసరంబున బృహస్పతిభార్యానిమి త్తంబున రణంబు సురాసురవినాశకరంబయ్యె; నాలోన బృహస్పతితండ్రి యగు నంగి రసుండు నెప్పిన విని బ్రహ్మదేవుండు వచ్చి చంద్రునిం గోపించి గర్భిణియైన తారను మరల నిప్పించినం జూచి బృహస్పతి దాని కిట్లనియె. 377

ఉ. 'సిగ్గొకయింత లేక [7]వెలచేడియకైవడి ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి, జారు శశిఁ బొంది కటా! కడు పేల తెచ్చుకొంటి?
బెగ్గ దలంపఁగా వలదె? యిప్పుడు గర్భము డించుకొమ్ము, నిన్
బ్రుగ్గఁగఁ జేసెదం [8]జెనఁటి! మానవతుల్ నినుఁ జూచి మెత్తురే?' 378

వ. అని కోపించుచుండ నా చెలువకుఁ బసిండిచాయ [9] మేను గల కుఱ్ఱండు పుట్టె; వాని జూచి మోహంబు సేసి బృహస్పతి దన కొడుకనియును, జంద్రుండు దనకన్నవాఁ డనియునుం జగడించి; రప్పుడు. 379

ఆ. వారి [10] వాదు సూచి వారింపగా వచ్చి యేర్పరింప లేక యెల్లమునులు
నమరవరుల నడుగ నా వేడుకలకత్తె, యెఱుఁగుఁగాని యితరు లెఱుఁగరనిరి. 380

---

1 గౌరము - తెల్లనిది, 2. కలువలసంగడీఁడు- చంద్రుఁడు, 3. నంబుగర్భము లకునజుని - పాఠాంతరము, 4. మోఱకము - మూర్ఖత్వము, 5 చారుమూర్తి-చక్కని యాకారము గలది, 6. యతనినిమిడికొనియె - పాఠాంతరము, 7. వెలచేడియ - వేశ్య. 8. చెనఁటి-నీచురాలు, 9. మేనితో నొక్కకుమారుండు పాఠాంతరము, 10. వాదు- జగడము.

వ. ఆ వలకులు విని సిగ్గుపడి యున్న తారకుఁ జిన్ని కొమరుం డిట్లనియె 381

క. 'ఇలువరున చెడఁగ బంధులు, దల వంపఁగ మగఁడు రోయఁ దల్లీ! కట్టా!
వెలి నేల నన్నుఁ గంటివి? కలిగించినవాఁడు శీతకరుఁడో [1]గురుఁడో?' 382

వ. అని పలుకుచున్న కొడుకునకు మఱుమాట లాడనేరక యూరకయున్న తార నేకాంతంబు
నకుర జీరి మంతనంబున బ్రహ్మ యి ట్లనియె. 383

మ. 'చెలువా! నీయెలసిగ్గు వాసి గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁ డీ
లలితాకారుఁ గుమారుఁ గన్నయకఁ దేలా దాఁప? నాపాటు నీ
తలనే పుట్టెనె? వెచ్చ నూర్పకుము; కాంతల్ గాముకల్ గారె? మా
టల నిం దేమియుఁ బోదు పో; యొరులతోడం జెప్పఁ; విన్పింపవే.' 384

వ. అని పలికిన బ్రహ్మకు నెదురు మాటాడ వెఱచి మంతనంబున నయ్యింతి చంద్రునికిం
గన్నదాన ననవుడు నా బాలకునకు బుధుం డని పేరు వెట్టి చంద్రున కిచ్చి బ్రహ్మ
సనియె; నంత. 385

ఆ. బుద్ధిమంతుఁడయిన బుధుఁడు పుత్రుండైన మేను వెంచి [3]రాజు మిన్ను ముట్టె;
బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి మిన్ను ముట్టఁ కేం మిన్నకుండు? 386

వ. ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యకవలనఁ బురూరవుండు వుట్టె; నా పురూరవున
కిం గల శౌర్యసౌందర్యగాంభీర్యాదిగుణంబులు నారదునివలన నింద్రసభలో నూర్వశి
విని మిత్రావరుణశాపంబున మనుష్యరూపంబు దాల్చి భూలోకంబునకు వచ్చి ముందట
నిలుపంబడి. 387

తరలము. నరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరాననచంద్రమండలశోభితున్ సుకుమారు నా
పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపఱజోదుచేఁ
దొరఁగు క్రొవ్విరితూపులన్ మది దూలిపోవఁగ [4]భ్రాంతయై. 388

వ. ఊర్వశి నిలిచి యున్నంత. 389

---

1. గురుఁడు-బృహస్పతి, 2. మంతనంబు - రహస్యము, 3. రాజు-చంద్రుడు.
4. భ్రాంత-వివశురాలు.

ఉ. 'భావజు [1]దీమమో, మొగులుఁ బాసి వెలుంగు మెఱుంగొ, మోహిని
దేవతయో? నభో [2]రమయొ? దీనికరగ్రహణంబు లేనిచో
జీవన మేటి కంచు మరుచేఁ జిగురాకడిదమ్ము జిమ్ములం
దా వడఁకెం బురూరవుఁడు దామరపాకుజలంబుకై పడిన్. 390

వ. ఇట్లూరాచపట్టి చెఱకువింటివానిదాడికి నోడి యెట్టకేలకు సైరణసేసి నిలుకడఁ దెచ్చికొని యచ్చెలువ కి ట్లనియె. 391

ఉ. 'ఎక్కడనుండి రాక ? మన కిద్దఱకుం దగు; నీకు దక్కితిన్;
మ్రుక్కడి వచ్చెనే యలరుములుక్కలవాఁ డడిదంబుఁ దిప్పు; చే
దిక్కనెఱుంగ! జూడునను; దేహము దేహము, గేలు గేల నీ
చెక్కునఁ జెక్కు మోపి తగుచెయ్వుల నన్నువిపన్నుఁ గావవే!' 392

వ. అనినఁ బ్రోడచేడియ యి ట్లనియె, 393

మ. ఇవె నాకూర్చు [3]తగళ్లు రెండు; దగ నీ వెల్లప్పుడుం గాచెదే
ని, వివస్త్రుండవు గాక నాకడఁ దగన్ నీ వుండు దేసిన్, విశే
షవిలాసాధిక! నీకు నా [4]ఘృతము భక్ష్యం బయ్యెనేనిన్, మనో
జవినోదంబుల నిన్నుఁ దేల్తు; నగునే చంద్రాన్వయగ్రామణీ!' 394

వ. అని పలికిన వేల్పులవెలయాలి ప్రతినమాట కియ్యకొని తనమనంబున. 395

క. 'మంచి దఁట! రూపు సంతతి, సంచిత యీ దేవగణిక యఁట! మరుచేతన్
సంచలితచిత్తయై కామించినదఁట! యింతకంటె మేలుం గలదే? 396

వ. అని నిశ్చయించుకొని. 397

ఆ. రాజు రాజముఖిని రతిఁ దేల్చె బంగారు మేడలందుఁ, దరులనీడలందుఁ
[5]దోఁటలందు, రత్నకూటంబులందును, కొలఁకులందు, గిరుల కెలఁకులందు. 398

వ. అంత నయ్యిద్దఱకుం [6]దగులంబు [7]నెలకొని, 399

---

1. దీమము - వశపఱచుటకై ఉంచిన యెర. 2. మణియొ - పాఠాంతరము. 3. తగళ్లు-గొఱ్ఱెలు. 4 మతము పథ్యంబయ్యె-పాఠాంతరము, 5. దోలలందు రత్నశాలలందును దమ్మి - పాఠాంతరము. 6. తగులంబు - ప్రేమ, 7. నెలకొని-స్థిరపడి.

క. ఒక దిక్కుకాని చనఁ బోఁ; రొకచోటన కాని నిలిచియుండరు; దమలో
నొకటియ కాని తలంపరు; నొకనిమిషముఁ బాయలేరు నువిదయు ఱేఁడున్. 400

క. దయ్యము మెఱుంగున్ వారల, నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్
[1] [2]వియ్యములను; నెడసండని యయ్యెడకొం గద్దమైనఁ బ్రాణము వెడలున్. 401

వ. ఇట్లూర్వశియుం బురూరవుండు నొండొరులవలన మక్కువలు చెక్కులొత్తం బగళ్లు
రేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండుతఱిఁ
గొలువున నూర్వశి లేకుండుటం జూచి, 402

క. ఇన్ని దినంబులకును మన మున్న సభామధ్యవేది యూర్వశి లేమిన్
విన్నఁదనంబున నున్నది వన్నె దఱిఁగి యున్న పసిడివడువున ననుచున్. 403

వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయిం జని చీఁకటి నూర్వశి పెంచుచున్న
[3]యేడకంబులం బట్టిన నవి రెండును మొఱవెట్టిన, వానిమొఱ విని రతి ఖిన్నుండై
మేను మఱచి కూరుకుచున్న పురూరవు కౌఁగిట నుండి యూర్వశి యిట్లనియె 404

మ. 'అదె నాబిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను
న్మదులై పోయెద; రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం డీ మగ [4] పంద; కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్
వదలంజాలఁడు నాదుకౌఁగిలియు దా వంధ్యాత్ముఁడై, చెల్లరే! 405

క. పగతురు [5]దొంగల రేఁపఁగ [6]మగఁటిమి వాటింప లేక మగతన మెల్లన్
మగువల కౌఁగిటఁ జూపెడు మగవాఁడగుకంటె మగఁడు మగువగు టొప్పున్. 406

ఆ. అధముఁ డైనవాని కాలగుకంటె నత్యధికునింట దాసి యగుట మేలు;
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల? యుపతిజనుల కూరకుంట లెస్స. 407

క. [7]ఏటిది నీరాచటికం [8]బాఁటది మొఱవెట్టఁ, బశువు లాతురపడనో
యాఁట దని లేచి దొంగల గీఁటవు వెడలంగ; శవము క్రియ నుండె దిదే 408

---

1. దియ్యము లౌనెడ సుందరి, పయ్యెద-పాఠాంతరము. 2. వియ్యములు-సంబంధములు, 3. ఏడకంబులు- పొట్టేళ్లు-గొఱ్ఱెపోతులు, 4. పంద-పిఱికివాఁడు, 5. దొంగలు నేఁపఁగ.. మగతన మెల్లన్,... కౌఁగిట నడఁగెడు మగవాఁ - పాఠాంతరము, 6. మగఁటిమి-పౌరుషము, 7. ఏటికి నీరాచటికము, బోటులు మొఱవెట్టఁ బశువు బోరనఁ బవన్,-యేటిదని లేచి దొంగల;-వేఁటలనీడ్చెడి దొంగల, గీటడఁపవు వెడలి శవముక్రియ నుండె దిదే.-అని పాఠాంతరము, 8. ఆఁటది-వేశ్య,

క. వినియు వినవు; రణభీరువు మనుజాధము నిదురపోతు మందుని నకటా!
నినుఁ జక్రవర్తిఁ జేసిన వనజాసనుకంటె [1]వెఱ్ఱివాఁడును గలఁడే?' 409

వ. అని పెక్కుభంగుల నయ్యింతి పరుసనిపలుకు లను కఱకువాలమ్ములు సెవులఁ జొనుప నా రాజశేఖరుం డంకుశంబుపోట్ల నదరు మదగజంబుచందంబునఁ జీర మఱచి దిగంబరుండై లేచి, వాలు కేల నంకించి యా నడురేయి దొంగల నఱకివైచి మేషంబుల విడిపించుకొని తిరిగి వచ్చునెడ. 410

ఆ. చీర లేని మగనిఁ జెలువ దా నీక్షించి [2]కన్ను మొఱఁగిపోయెఁ; గడఁక నతఁడు
వెఱ్ఱివానిభంగి వివశుఁడై వడి లేచి పౌరల తెరలి స్రుక్కి పొక్కిపడియె. 411

వ. మఱియుఁ బురూరవుండును మదనాతురుండై వెదకుచు సరస్వతీనదీతీరంబునం జెలికత్తెలతోఁ గూడియున్న యూర్వశిం గని వికసితముఖకమలుండై యి ట్లనియె. 412

మ. 'తనుమధ్యా! యిది యేల వచ్చి? తకటా! ధర్మంబె? శర్మంబె? మున్
మనలో [3] [4]నుంకుగ నాడికొన్నవలుకుల్ మర్యాదలుం దప్పెనే?
నిను నేఁ బాసినయంతనుండి తనువు న్నేలం బడం బాఱె నన్
దిను నుగ్రంపుమృగాళి దీనుఁ గరుణాదృష్టిన్ విలోకింపవే. 413

వ. అనిన నూర్వశి యి ట్లనియె. 414

క. మగువలకు నింత [5]లోంగెదు మగవాఁడవె నీవు? పశువుమాడ్కిన్ వగనం
దగవే మానుషపశువును మృగములుఁ గని రోయుఁ గాక మే లని తినునే? 415

వ. అదియునుంగాక. 416

మ. తలఁపుల్ [6]చిచ్చులు; మాట లుజ్జ్వలసుధాధారల్ విభుం డైన వు
వ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ
రలు; [7]తోడుం, బతి నైనఁ జంపుదు; రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాం డ్రెక్కడ? వారివేడబము లా వేదాంతసూక్తంబులే? 417

ఉ. ఇం కొకయేఁడు వోయిన నరేశ్వర! యాతలిరేయి నీవు నా
[8]లంకెకు వచ్చి యాత్మజుల లక్షణవంతులఁ గాంచె; దేమియుం

1. వెఱ్ఱివాఁడు, మూర్ఖుఁడు 2. కన్ను మొఱఁగి-మాయమై, 3. నుంకులాడికొన్న—పాఠాంతరము. 4. ఉఁకువ-అంగీకారము, 5. లోఁగెదు - పాఠాంతరము, 6. చిచ్చులు-అగ్నులు, 8. తోడు - తోఁబుట్టువు, 8. లంకె - కూడుట.

గొంకొక పొమ్మ నీ' వనుడుఁ గొమ్మను గర్భిణిఁ గా దలంచుచున్
శంక యొకింత లేక నృపసత్తముఁ డల్లనపోయె వీటికిన్. 418

వ. ఇట్లు మరలి చని తన పురంబున నొక్కయేఁ డుండి పిదప నూర్వశికడ కేఁగి యొక్క రేయి పురూరవుం డయ్యింతికడ నున్న, నా వెలందియు 'గంధర్వవరుల వేడుకొనుము; నన్ని చ్చెద' ననవుడు నతండు గంధర్వవరులం బ్రార్థించిన వార లతండు వొగడుటకు మెచ్చి యగ్నిస్థాలి నిచ్చిన, నయ్యగ్నిస్థాలి నూర్వశింగాఁ దలంచుచు దానితో నడవిం దిరుగుచుండి యొక్కనాఁ డది యూర్వశిగా దగ్నిస్థాలి యని యెఱింగి వనంబునం దిగ విడిచి యింటికిఁ జనుదెంచి నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ ద్రేతాయుగంబు సొచ్చిన, నా రాజుచిత్తంబునఁ గర్మబోధంబులయి వేదంబులు మూఁడు మార్గంబులం దోఁచిన, నా భూవరుండు స్థాలికడకుం జని యందు, శమీగర్భజాతంబైన యశ్వత్థంబుఁ జూచి యా యశ్వత్థంబుచేత నరణులు రెండు గావించి, ముందటియరణి దానును, వెను కటియరణి యూర్వసియును రెంటినడుమ నున్న కాష్ఠంబు పుత్రుండు నని మంత్రంబు సెప్పుచుం ద్రచ్చుచుండ జాతవేదుండను నగ్ని సంభవించి విహితారాధన సంస్కారం బునంజేసి యాహవనీయాది రూపియై [1]నెగడి పురూరవునిపుత్రుండని కల్పింపంబడియె, నా యగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుఁ బనుపఁ గారణంబగుటంజేసి 419

క. ఆ యగ్నిచేఁ బురూరవుఁ డా యజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయున్
శ్రీయుతుఁ గూర్చి యజించె గుణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడుకొఱకై. 420

ఉ. ఒక్కఁడ వహ్ని; వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ; సర్వవాఙ్మయం
బొక్కడ వేదః మా ప్రణవ మొక్కఁడ; వర్ణము దొల్లి త్రేతయం
దెక్కటి మాన్చి మూఁడుగను నేర్పఱిచెం దనబుద్ధిపెంపుచేఁ
జక్కఁగ నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబులౌ గతిన్. 421

వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి యాగంబుచేసి పురూరవుం డూర్వశి యున్న గంధర్వ లోకంబునకుం జనియె; నతనికి నూర్వశిగర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యా యువు, రయుండు, జయుండు, విజయుం డన నార్గురు పుత్రులు గలిగి; రందు శ్రుతా యువునకు వసుమంతుండును, సత్యాయువునకు శ్రుతంజయుండును, రయునకు శ్రుతుండు నేకుం డను నిరువురును జయునకు నమితుండును. విజయునకు భీముం డును జనించి; రా భీమునకుఁ గాంచనుండు, కాంచనునకు హోత్రకుండు, హోత్రకు నకు గంగాప్రవాహంబు పుక్కిటం బెట్టిన జహ్నుండు, జహ్నునకుఁ బూరుండు, పూరు

[1] నెగడి - పర్థిల్లి.

నకు బాలకుండు, బాలకునకు నజకుం, దజకునకుఁ గుశుండు, గుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు వసువు కుశనాభుఁడను నలువురును సంభవించి; రందుఁ గుశాంబునకు గాధి యనువాఁడు గలిగె; నా గాధి రాజ్యంబు సేయుచుండ. 422

సీ. సత్యవతిని గాధిజాతను గన్యను విప్రుఁడు ఋచికుండు వేఁడికొనిన
గాధియు సుత కీడు గాఁ డని తెల్లని [1]నవకంపుమేనులు నల్ల చెవులు
గల గుఱ్ఱములు వేయి కన్యకు నీ [2]వుంకు విచ్చినఁ గూఁతు నే నిత్తు ననిన
వసుధామరుండును వరుణునికడ కేఁగి హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె;
ఆ. నా మహాత్మునతియు నత్తయుఁ గొడుకులఁ గోరి యడుగ నియ్యకొని యతండు
విప్ర రాజమంత్రవితతుల వేల్పించి [3]చరువు సేసి క్రుంకఁ జనియె నదికి. 423

వ. అయ్యెడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన చరువు దల్లికిచ్చి క్షాత్రిమంత్రంబులం దల్లికి వేల్పించిన చరువు దా నందుకొని యుండ నా ముని సను దెంచి చరువు పీడ్వడుట యెఱింగి భార్య కి ట్లనియె. 424

ఆ. 'తల్లి చరువు నీవు దాల్చి నీచరు వేల తల్లి పాల నిడితి? తరళనేత్ర !
కొమ్మ! యింక నీకుఁ గ్రూరుఁడు వుట్టు మీ యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు.' 425

వ. అనిన నయ్యింతి వెఱచి మ్రొక్కి వినయంబు లాడినం బ్రసన్నుండై 'నీ కొడుకు సాధువై, నీమనుమండు క్రూరుం డగు గాక!' యని ఋచికుం డనుగ్రహించిన నా సత్య వతికి జమదగ్ని సంభవించె; సత్యవతియు గౌశికీనదియై లోకపావనియై ప్రవహించె; నా జమదగ్నియు రేణువుకూఁతు రయిన రేణుకను వివాహంబై వసుమనాదికుమారులం గనియె; నందు. 426

క. పురుషోత్తమునంశంబున ధర జమదగ్నికి జనించి ధన్యుఁడు రాముం
డిరువదియొకమరి నృపతుల శిరములఁ జక్కడిచెఁ దనదుచేగొడ్డంటన్.' 427

వ అనిన విని భూవరుండు శుకున కి ట్లనియె. 428

## —: ప ర శు రా ము ని చ రి త్ర ము :—

ఉ. 'ఏటికిఁ జంపె రాముఁ డవనీశులఁ బల్వుర ? వారియందుఁ ద
ప్పేటికిఁ గల్గె? విప్రుఁ డతఁ డేటికి రాజసతామసంబులన్

1. నవకంపు మేనులు-మృదువైన శరీరములు, 2. ఉంకువ -శుల్కము, 3 చరువు-హవిస్సు

వాటముఁ బొందె? [1]భూభరము వారిత మౌ టది యేవిధంబు ? నా
మాటకు మౌనిచంద్ర! [2]మఱుమాట ప్రకాశము గాఁగఁ జెప్పవే!' 429

వ. అనిన విని శుకుం డి ట్లనియె. 430

సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు నారాధనము సేసి యతనివలనఁ
[3]బరిపంథిజయమును, [4]బాహుసహస్రంబు నణిమాదిగుణములు, యశము బలము
యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబు జెడని యింద్రియములు సిరియుఁ బడసి
తే. గాలికైవడి సకలలోకంబులందుఁ దనకుఁ బోరాని రారాని తావు లేక
యెట్టిచోనైనఁ దనయాజ్ఞ యేపుమిగుల ధరణి వెలుఁగొందె విసువీథిఁ దరణిమాడ్కి 431

మ. ఒకనాఁ డా మనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీటి నుం
డక రేవానది కేఁగి యందుఁ దెలినీటం [5]జల్లుపోరాడి దీ
ర్ఘకరాబ్జంబుల నా నదీజలములం గట్టెన్; వడిన్ నీరు మ్రో
లకుఁ బెల్లుబ్బి రణాగతుండయిన యా లంకేశుపైఁ [6]దొట్టఁగన్. 432

వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డా రాజుచేకట్టం దొట్టిన యేటినీటికి సహింపక
రోషంబునం [7]బోటరియుంబోలె నమ్మేటిమగనితోడి పోరాటకుం దొడరినఁ బాటింపక దన
బాహుపాటవంబున. 433

క. వీఁకమెయి నతఁడు రావణుఁ గూఁకటు లగలించి పట్టికొని మోఁకాళ్లం
దాఁకించి కోఁతికైవడి, [8]నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్. 434

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి. 435

క. ఆ రాజేంద్రుఁడు రావణు 'నోరీ! యిటమీఁద నూరకుండుము; జగతిన్
వీరుఁడ ననకుము; కాచితిఁ, బోరా!' యని సిగ్గుపఱిచి పుచ్చెన్ మరలన్. 436

వ. అంత. 437

సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున వేటకై కాంతారవీథి కేఁగి,
తిరిగి యాకట శ్రాంత దేహుఁడై జమదగ్ని మునియాశ్రమముఁ జేరి మ్రొక్కి విలువ,

1. భూభరము-భూమిబరువు, 2. మఱుమాట-సమాధానము, 3 పరిపంథి,-విరోధి 4. బాహుసహస్రంబు-వేయి చేతులు, 5 జల్లుపోరాడి-జలక్రీడలాడి 6. తొట్టఁగన్-వ్యాపింపఁగా, 7. పోటరి-మహావీరుఁడు, 8. ఆఁక-చెఱ.

నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ [1]బూజించి యా రాజునకు రాజుననుచరులకుఁ
దన హోమదేనువుఁ దడయక రప్పించి యిష్టాన్నములు గురియింప, నతఁడు

తే. గుడిచి కూర్చుండి [2]మొదవుపైఁ గోర్కెఁజేసి [3]'సంపద యదేల? యీ యావు చాలుఁగాక
యిట్టిగోవుల నెన్నండు నెఱుఁగ' మనుచుఁ 'బట్టి తెం'దని తనయొద్దిభటులఁ బనిచె. 439

క [4]'క్రేవుం బాపకుఁ' డంచును, 'హా వీడం బడితి' ననుచు 'నంబే' యనుచుం
[5]'జూపోవరు నృపు' లంచును, వాపోవన్ మొదవుఁ గొనుచు వచ్చిరి పురికిన్. 440

వ. అంత నర్జునుఁడు మాహిష్మతీపురంబునకు వచ్చునెడ రాముం డాశ్రమంబున కేతెంచి
తద్వృత్తాంతం బంతయు విని. 441

ఆ. 'అద్దిరయ్య! యింట [6]నళనంబు గుడిచి మా యయ్య వల దనంగ నాక్రమించి
కోరి మొదవు రాజు గొనిపోయినాఁడఁట! యేను రాముఁడౌట యెఱుఁగఁడొక్కొ!' 442

వ. అని పలికి. 443

మ. 'ప్రళయాగ్నిచ్ఛటభంగిఁ, [7]గుంభి విదళింపం బాఱు సింహాకృతిం
బెలుచన్ రాముఁ డిలేశువెంట నడచెం బృథ్వీతలం బెల్ల నా
కులమై క్రుంగఁ, [8]గుఠారియై కవచియై కోదండియై కాండియై
ఛలియై సాహసియై మృగాజినమనోజ్ఞక్రోడియై [9]తూణియై. 444

వ. చని మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్న సమయంబున 445

మ. కసియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు [10]సమిత్కాముం బ్రకామున్, శరా
ననతూణీరకుఠారభీము నతిరోషప్రోచ్ఛలద్భ్రూయుగా
ననేత్రాంచలసీము, నైజపటనానామాలికోద్దాము నూ
తనసంరంభనరేంద్రదారణభనూత్రక్షామునిన్, రామునిన్ 446

వ. కని కోపించి. 447

ఉ. బాలుఁడు, వెఱ్ఱిబ్రాహ్మణుఁడు బాహ్మణుకై వడి నుంట మాని భూ
పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబు దక్కి క

1. దీవించి-పాఠాంతరము. 2 మొదవు-ఆవు, 3. సంపదేటికి నీయావు-పాఠాంతరము. 4. క్రేపు-దూడ, 5. చూపోవరు-ఓర్వలేరు, 6. అళనంబు-తిండి, 7. కుంభి-ఏనుఁగు 8 కుఠారి-గొడ్డలిధరించినవాఁడు, 9. తూణి-అమ్ములపొది కలవాఁడు, 10. సమిత్కాముఁడు-యుద్ధమును కోరినవాఁడు.

య్యాలకు వచ్చినాఁడు మనయం దిఁకఁ [1]బాపము లేదు లెండు లెం
దేల సహింప? భూసురుని నేయుఁడు, వ్రేయుఁడు గూల్పుఁ డిమ్మహిన్' 448

వ. అని కదలించి దండనాయకులం బురికొల్పిన, వారు రథగజతురగపదాతిసమూహంబులతో లెక్కకుం బదియే దక్షౌహిణులతో నెదురునడచి శరచక్రగదాఖడ్గభిందిపాలశూల ప్రముఖసాధనంబుల నొప్పించిన నవ్విప్రుండు గన్నులకొలుకుల నిప్పులు గుప్పలుకొన రెట్టించిన కట్టల్క మిట్టిపడి యజ్ఞోపవీతంబు సక్క నిడికొని [2]కరాశించి బిట్టుదట్టించి కఠోరంబగు కుఠారంబు సారించి, మూఁకలపై కడిఁకి [3]తొలకరి మొగంబునం గ్రొచ్చెలిక వట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ బదంబులు ద్రెంచుచు, ననఁటికంబంబులఁ దెగనడుచు నారామకారుని పగిది మధ్యంబులఁ ద్రుంచుచుఁ, దాళఫలంబులు రాల్చు వృక్షారోహకునికైవడి శిరంబులు ద్రుంచుచు, మృగంబుల వండం [4]దుండించు సూపకారుని భంగి నవయవంబులం జెక్కుచు, నంతటం దనివిననక విలయకాల కీలి కేలిని మంట లుమియుచు, విల్లంది యెల్లెడం బిడుగులసోనలు గురియు బలు మొగిళ్లవడుపున నప్రమాణంబులగు బాణంబులఁ బఱపి సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు, నడ్డంబు లేని యార్భటంబులు గల బాణవర్షప్లుతంబులతో [5]రాహుతులాగోపానలంబున కాహుతులు సేయుచు, తురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబుల విశ్లథంబులఁ గా నొనర్చుచు, ద్విరదంబుల నరదంబులపైఁ బఱవందోలుచు నివ్విధంబున సేనల [6]నంపవానల ముంచి రూపుమాపిన. 449

క. మత్తిల్లి భూతజాలము చిత్తంబులఁ జొక్కి, వేడ్కఁ జిందులువాఱన్
జొత్తిల్లి సమిత్తలమున నెత్తురు మేదంబు పలలనికరం బయ్యెన్. 450

వ. అయ్యవసరంబున 451

క. 'మే లీబ్రాహ్మణుఁ డొక్కఁడు నేలం బడఁగూల్చె సైన్యనిచయము నెల్లన్
[7]బాలార్ప నేల? యీతనిఁ దూలించెదఁ గాక నాదుదోర్బలమువడిన్ 452

వ. అనిపలికి 453

మ. ఒక యేనూఱుకరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే
యొకయేనూట [8]గుణధ్వనుల్ నిగుడ, శాతోగ్రాస్త్రముల్ గూర్చి 'వి

1. పాపము-తప్పు, 2. కరాశించి బొబ్బలుపెట్టి, 3 దోలాయిడి మొగంబునం - పాఠాంతరము. 4. తుండించు-ముక్కలుచేయు 5. రాహుతులు-రౌతులు, 6. అంప వానలు-బాణవర్షములు, 7. పాలార్ప నేల - ఉపేక్షింపనేల, 8. గుణము-వింటిధారి,

ప్ర! కుఠారంబును, నిన్నుఁ గూల్తు' ననుచున్ భర్జించి పుంఖానుపుం
ఖకఠోరంబుగ నేసి యార్చె రయ రేఖాధామునిన్, రామునిన్. 454

క. వడిఁ [1]దూపు లెగయ గుడునులు పడి కార్ముకపంచశతము వరఁగ విభుఁడు సొం
పడరెఁ బరివేషమండలి నడుమఁ గరద్యుతుల వెలయు నలినాప్తక్రియన్. 455

వ. ఇట్లర్జునుండు బాణవిలాసంబు సూపిన. 456

మ. ధరణీదేవుఁడు రాముఁ డాఘ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు
ష్కరచాపం బొక టెక్కు వెట్టి శరముల్ నంధించి పెల్లేసి, భూ
పరు [2]కోదఁడము లొక్క [3]చూడ్కిఁ దునిమెన్ వాఁ డంతటం బోక వే
తరువుల్ ఋవ్వఁ గుఠారధార నఱకెన్ దద్బాహుసందోహమున్. 457

క. కరములు దునిసిన నతనికి శిర మొక్కటి చిక్క, శైలశిఖరముభంగిం
బరశువున నదియుఁ ద్రుంచెను బరసూదనుఁ డైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్. 458

ఆ. తండ్రి వడిన, నతనితనయులు పదివేలు, దలఁగి పోయి రతని దాఁకలేక;
పరభయంకరుండు భార్గవుం డంతనా గోవుఁ గ్రేవుతోడఁ గొనుచుఁ జనియె 459

వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి తన పరాక్రమంబు దండ్రికిం, దోఁబుట్టువుల
కుం దెలియం జెప్పిన జమదగ్ని రామున కిట్లనియె. 460

క. 'కల వేల్పు లెల్లఁ దమతమ, చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా!
బలువేల్పు రాజు వానిం, [4]జలమున ని ట్లేల పోయి చంపితి పుత్రా! 461

క. తాలిమి మనకును ధర్మము; తాలిమి [5]మూలంబు మనకు; ధన్యత్వమునం
దాలిమి గల దని యీశం డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్. 462

క. క్షమ గలిగిన సిరి గలుగును; క్షమ గలిగిన వాణి గలుగు; [6]సౌరప్రభయున్
క్షమ గలుగఁ దోన గలుగును; క్షమ గలిగిన మెచ్చు శౌరి సదయుఁడు దండ్రీ! 463

క. పట్టపురాజును జంపుట గట్టలుకన్ విప్రుఁ జంపుకంటెను బాపం;
బట్టి ట్టనకుము నీ వీ [7]చెట్ట సెడం దీర్ఘసేవ సేయుము తనయా! 464

---

1. తూపులు-బాణములు, 2. కోదండములు-విండ్లు, 3. చూడ్కి-పాఠాంతరము, 4, చలము-మాత్సర్యము, 5, మూలమగు ధర్మతత్త్వంబులకుం పాఠాంతరము, 6. సౌరప్రభ-సూర్యుని తేజస్సు, 7. చెట్ట-పాపము.

క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ బని పూని ప్రసాద మనుచు భార్గవుఁడు రయం
బున నొకయేఁడు ప్రయాణము నని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా! 465

ఉ. ఆ యెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమ [1]పిండుతోఁ
[2]దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజమా
లాయుతుఁ జూచుచుండెఁ బతియాజ్ఞ దలంపక కొంత ప్రేమతోన్. 466

వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబునం దడసి. 467

ఉ. 'అక్కట! వచ్చి పెద్దతడ వయ్యెను; హోమము వేళ దప్పె; నే
నిక్కడ నేల యుంటి? ముని యే మనునో?' యని భీతచిత్తయై
గ్రక్కునఁ దోయకుంభము శిరస్స్థలమం దిడి తెచ్చి యిచ్చి వే
మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందట నల్లన నిల్చె [3]నల్కుచున్. 468

వ. అప్పుడు. 469

క. చిత్తమున భార్య దడసిన వృత్తాంతం బెఱిఁగి తవసి వే కని సుతులన్
మత్తం దీనిం జావఁగ మొత్తుం డన మొత్తరైరి [4]మునుకుచు వారల్. 470

క. [5]కొడుకులు పెండ్లముఁ జంపమిఁ గొడుకులఁ బెండ్లాముఁ జంప గురుఁ [6]డానతి యీ
నడుగులకు నెఱిఁగి రాముఁం దడుగిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్. 471

శా. తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్నఁ బెం
పెల్లం బోవ శపించుఁ దండ్రి; తన [7]పంపేఁ జేయుడున్ మెచ్చినా
తల్లిన్ భ్రాతల నిచ్చు; నిక్కము తపోధన్యాత్మకుం; డంచు వే
తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు; లేదా చంపఁ జేయాడునే? 472

వ. ఇవ్విధంబున. 473

క. అడ్డము సెప్పక కడపటి బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్
గొడ్డంటం దెగ నడిచిన [8]జడ్డనఁ దల యూఁచి మెచ్చె జమదగ్ని మదిన్. 474

1. పిండు-గుంపు, 2. తోయవిహారముల్-జలక్రీడలు, 3. అల్కుచున్-బెదరుచు,
4. మునుకుచు - దుఃఖించుచు, 5. కడుఁకొని పెండ్లముఁ జంపని కొడుకుల-పాఠాంతరము,
6. తొసఁగినఁ దా-పాఠాంతరము, 7. పంపు-ఆజ్ఞ, 8. జడ్డన-తటాలున.

క. మెచ్చిన తండ్రిని గనుఁగొని చెచ్చెర నీ పడినవారిజీవంబులు నీ
'విచ్చితి' నను మని మ్రొక్కిన నిచ్చెన్; వారలును లేచి రెప్పటిభంగిన్. 475

ఆ. పడినవారి మరల బ్రదికింప నోపును జనకుఁ డనుచుఁ జంపె జామదగ్న్యుఁ;
డతఁడు సంపె ననుచు నన్నలఁ దల్లిని జనకునాజ్ఞ యైనఁ జంపఁదగదు. 476

సీ. పరశురాముని కోడి పరుగులు వెట్టిన యర్జునపుత్రకు లాత్మయందుఁ
దండ్రి [1]మ్రగ్గుటకు సంతప్తులై పొగులుచు నింతట నంతట నెదరు వేచి,
తిరిగి యాడుచు నొక్కదివసమం దా రాముఁ డడవి కన్నలతోడ నరుగఁ, బిదపఁ
బగఁదీర్పఁ దఱి యని పఱతెంచి హోమాలయంబున సర్వేశు నాత్మ నిలిపి
తే. నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న పుణ్యు జమదగ్ని నందఱుఁ బొదివిపట్టి
కదలకుండఁగఁ దలఁ ద్రెంచికొనుచుఁ జనిరి యడ్డమేతెంచి రేణుక యడిచికొనఁగ. 477

వ. మఱియును. 478

మ. 'జనకుం జంపిన వైరముం దలఁచి రాజన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి రామ రామ! రిపులన్ శాసింతు ర' మ్మంచు న
మ్మునిపై వ్రాలి లతాంగి మోఁదికొనియెన్ [2]ముయ్యేడుమాఱుల్ రయం
బున రాముం దరుదెంచి యెన్నికొన నాపూర్ణాపదాక్రాంతయై. 479

వ. అప్పుడు దల్లి మొఱ విని జమదగ్ని కుమారులు వచ్చి యిట్లని విలపించిరి. 480

క. 'వాకిలి వెడలవు కొడుకులు రాకుండఁగ; నట్టినీవు రాజసుతులచేఁ
జీకాకు నొంది పోవఁగ నీకా కెట్లాడెఁ దండ్రి! నిర్జర వురికిన్.' 481

వ. అని విలపించుచున్న యన్నలం జూచి రాముం డి ట్లనియె. 482

ఉ. 'ఏడువనేల? తండ్రి తను వేమఱకుండుఁడు తోడులార! నే
[3]సూడిదె తీర్తునంచుఁ బరశుద్యుతి [4]భీముఁడు రాముఁ డుగ్రుఁడై
యోడక యర్జునాత్మభవు లున్న పురంబున కేఁగి చొచ్చి [5]గో
డాడఁగఁ బట్టి చంపె పడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్. 483

క. ఖండించి రిపులశిరములు గొండలు గాఁ బ్రోగు లిడియె గురురక్తనదుల్
నిండుకొని పాఱ నుబ్బుచు [6]భండనమున [7]విప్రరిపులు భయ మంద నృపా! 484

1. మ్రగ్గుట-మరణించుట,. 2. ముయ్యేడు మాఱుల్-ఇరువదియొక్క పర్యాయములు, 3, సూడు-పగ, 4. భీముఁడు - భయంకరుఁడు 5. గోడాడఁగ — విలపింపఁగా. 6. భండనము - యుద్ధము, 7. విపులనృపులు - పాఠాంతరము.

వ. మఱియు నంతటఁ బోక. 485

ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల నిరువదొక్కమాఱు నరసి చంపె
జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ; సూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె? 486

వ. మఱియు న రాముండు [1]శమంతపంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుఁగులు గావించి, తండ్రిశిరంబు దెచ్చి శరీరంబుతో సంధించి, సర్వదేవమయుండగు దేవుఁడు దాన కావునఁ దన్ను నుద్దేశించి యాగంబు సేసి, హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నధ్వర్యునకుఁ బడమటి దిక్కును, నుద్గాతకు నుత్తరదిశయు, నున్న వారల కవాంతర దిశలును, గశ్యపునకు మధ్యదేశంబును, నుపద్రష్టకు నార్యావర్తంబును, సదస్యులకుం దక్కిన యెడలును గలయ నిచ్చి, బ్రహ్మనదియైన సరస్వతియం [2]దవభృథ స్నానంబు సేసి, కల్మషంబులం బాసి, మేఘ విముక్తుం డయిన సూర్యుండునుం బోలె నొప్పుచుండె; నంత. 487

క. ఆప్తుఁడగు పుత్రువలనను బ్రాప్తతనుం డగుచుఁ దపముబలిమిని మింటన్
[3]సప్తర్షి మండలంబున సప్తముఁడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా! 488

క. ఆ జమదగ్ని తనూజుఁడు రాజీవాక్షుండు ఘనుఁడు రాముఁ డధికుఁడై
యోజను సప్తర్షులలో రాజిల్లెడు మీఁదిమనువు రా నవ్వేళన్. 489

ఆ. శాంతచిత్తుఁ డగుచు సంగవిముక్తుఁడై భవ్యుఁడై మహేంద్రపర్వతమున
నున్నవాఁడు రాముఁ డోజతో గంధర్వ సిద్ధవరులు నుతులు సేయుచుండ. 490

క. భగవంతుఁడు హరి యీ క్రియ భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్
జగతీభారము వాయఁగఁ బగ గొని పలుమాఱుఁ జంపె బవరమున నృపా! 491

వ. అంత గాధికి నగ్నితేజుండగు విశ్వామిత్రుండు జన్మించి, తపోబలంబున రాజధర్మంబును మాని బ్రహ్మర్షియై యేకశతసంఖ్యాగణితులగు కొడుకులం గనియె; నయ్యెడ భృగుకుల జాతుం డయిన యజీగర్తునికొడుకు శునశ్శేపుండు దల్లి దండ్రులచేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు [4]నమ్ముడువడి బ్రహ్మాదుల వినుతిసేయుచు మెప్పించి, దేవతలచేత బంధవిముక్తుం డయిన, వానియందుఁ గృపగలిగి విశ్వామిత్రుండు పుత్రుల కి ట్లనియె. 492

---

1. రాజరక్తంబు శమంతపంచకంబున నేడుమడుఁగులు-పాఠాంతరము, 2. అవబృథస్నానము - యాగానంతరముచేయు స్నానము, 3. సప్తర్షి మండలము—కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు, జమదగ్ని - మిగిలిన మునులు, 4. అమ్ముడువడి - అమ్మఁబడి.

క. కన్నులఁ గంటిని వీనిని మన్నన కొమరుండు నాకు [1]మక్కువ మీ రో
యన్నన్న యనుచు నీతని, మన్నింపుం డనినఁ జూచి మదసంయుతులై. 493

క. ఇతఁ డన్నఁటవో మాకును! గృతకృత్యుల మయితి మనుచు [2]గేలి యొనర్పన్
నుతులన్ మ్లేచ్ఛులు గం డని ధృతిలేక శపించెఁ దపసి తిరుగుడువడఁగన్. 494

వ ఆయ్యెడ నతని శాపంబునకు వెఱచి యా సూర్వురయందు మధ్యముం డయిన మధు
చ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి 'తండ్రీ! నీ చెప్పిన క్రమంబున
శునశ్శేపుండు మా కన్న యని మన్నింపగలవార' మనవుడు నంతసించి మంత్రదర్శి
యైన శునశ్శేపుని వారలయందుఁ బెద్దజేసి మధుచ్ఛందున కి ట్లనియె, 495

ఆ. ' [3]పాడి సెడక వీఁడు నేఁడు మీకతమునఁ గొడుకు గలిగె నాకుఁ గొడుకులార!
కడుపులార మీరు గొడుకులఁ గనుఁ; డింకఁ, బ్రీతితోడ దేవరాతుఁ గూడి.' 496

వ. అని పలికె; నట్లు శునశ్శేపుండు దేవతలచేత విడివడుటంజేసి దేవరాతుఁ డయ్యెఁ; మధు
చ్ఛదుండు మొదలయిన యేఁబండ్రు దేవరాతునకుఁ దమ్ములైరి; పెద్దలయిన యష్టక
హారీత జయంత సుమదాదు లేబండ్రును వేత్రె చని; రీక్రమంబున విశ్వామిత్రు కొడు
కులు రెండు విధంబు లయినం బ్రవరాంతరంబు గలిగె నని చెప్పి శుకుం డి ట్లనియె;
నా పురూరవు కొడుకగు నాయువునకు నహుషుండును క్షత్త్రివృద్ధుండును, రజియును,
రంభుండును, ననేనసుండును ననువారు పుట్టి; రందు క్షత్త్రివృద్ధునకుఁ గుమారుండగు
సుహోత్రునకుఁ గాశ్యుండుఁ గుశుండు గృత్సమదుండు నన ముగ్గురు గలిగి; రా గృత్స
మదునకు శునకుండును, శునకునకు శౌనకుండును, నమ్మహాత్మునికి బహ్వృచ ప్రవరుండు
జన్మించి; రా బహ్వృచప్రవరుఁడు దపోనియతుండై చనియెఁ; గాశ్యునకుఁ గాశియుఁ,
గాశికి రాష్ట్రుండును, రాష్ట్రునకు దీర్ఘతపుండును జనియించిరి. 497

క. ఆ దీర్ఘతపుని కధికుఁడు శ్రీదయితాంశమునఁ బుట్టె సేవ్యుం; డా యు
ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి; భేదంబులు వాయు నతనిఁ గీర్తన సేయన్. 498

వ. వాసుదేవాంశసంభూతుండగు నాధన్వంతరి యజ్ఞభాగంబున కర్హుం; డతనికిఁ గేతు
మంతుండుఁ, గేతుమంతునకు భీమరథుండు, నతనికి దివోదాసుం డనం బరఁగు
ద్యుమంతుండు నుదయించి; రాద్యుమంతునికుఁ బ్రతర్దనుండు జన్మించె; నా ప్రతర్దనుండు
శత్రుజిత్తనియు ఋతధ్వజుం డనియుం జెప్పంబడె; నాతనికిఁ గువలయాశ్వుండు
సంభవించె. 499

1. మక్కువ - ప్రీతి, 2. గేలి - పరిహాసము, 3. పాడి – ధర్మము.

ఆ. వసుమతీశ! విను కువలయాశ్వభూభర్త లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె;
నాతఁ డేలె నేల నఱువదియాఱువే లేండ్లు; వానిభంగి నేల రెవరు. 500

వ. అయ్యలర్కునకు సన్నతియును, నతనికి సునీతుండును, నతనికి సుకేతనుండును, నతనికి ధర్మకేతువును, నతనికి నత్యకేతువును, నాతనికి ధృష్టకేతువును, నా ధృష్టకేతువునకు సుకుమారుండును, సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రునకు భర్గుండును, భర్గునకు భార్గభూమియు జనియించిరి. 501

ఆ. వాఁడు తుదయుఁ గాఁగ వరుస నా కాశ్యాది యైనవారు కాశు లనఁగ నెగడి
రవని మీఁద వార లాక్షత్త్రవృద్ధుని వంశజాతు లగుచు వంశవర్య! 502

వ మఱియు క్షత్త్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునికిఁ బ్రీతియును, వానికి సంజయుండును, సంజయునికి జయుండును, జయునికిఁ గృతుండును, గృతునికి హర్యధ్వనుండును. హర్యధ్వనునకు సహదేవుండును, సహదేవునికి భీముండును, భీమునకు జయత్సేనుండును, జయత్సేనునకు సంకృతియు, సంకృతికి జయుండును, జయునికి క్షత్త్రధర్ముండును బుట్టిరి; వీరలు క్షత్త్రవృద్ధునివంశంబునం గల రాజులు; రంభునికి రభసుండును, రభసునికి గంభీరుండును, గంభీరునికిఁ గృతుండును గల్గి; రా కృతునికి బ్రహ్మకులంబు పుట్టె; నయ్యనేనునకు శుద్ధుండును, శుద్ధునకు శుచియు, శుచికి బ్రహ్మసారథియైన త్రికకుత్తును జనించి; రతనికి శాంతరజుండు పుట్టె; నతండు విజ్ఞానవంతుండుఁ గృతకృత్యుండు విరక్తుండు నయ్యె. 503

సీ. రజి యనువానికి రాజేంద్ర! యేనూరు కొడుకులు గలిగిరి ఘోరబలులు;
వేల్పు లెల్లను వచ్చి వేఁడిన నారజి దైత్యులఁ బెక్కండ్ర ధరణిఁగూల్చి;
నాకంబు దేవేంద్రునకు నిచ్చె; నిచ్చిన రజికాళ్ల కెఱఁగి సురప్రభుండు
వెండియు నతనికి [1]విబుధగేహము నిచ్చి సంతోషబుద్ధి నర్చన మొనర్చె;
ఆ. నంత నా రజి మృతుఁడైన నతనిపుత్రు లమరవిభుఁడు తమ్ము నడిగికొనిన
నీక యింద్రలోక మేలిరి యాగభాగములు పుచ్చికొనిరి గర్వమంది. 504

క. వేలుపులఱేఁడు గురుచే [2]వేలిమి వేల్పించి బలిమి వెలయఁగ నిజ [3]దంభోళిని రజిసుతులను నిర్మూలము గావించి నాకముం గైకొనియెన్. 505

వ. అది యట్లుండె; నహుషునకు యతియు యయాతియు సంయాతియు నాయాతియు వియతియుఁ గృతియు నన నార్గురు గొడుకులు దేహికి నింద్రియంబుల చందంబున నంభవించి; రందుఁ బెద్దకొడుకగు యతికి రాజ్యం బిచ్చిన నతండు విరక్తుండై. 506

1 విబుధగేహము-స్వర్గము, 2 వేలిమి-హోమము, 3. దంభోళి-వజ్రాయుధము.

క. రాంజ్యము పాపమూలము రాజ్యముతో నొడ లెఱుఁగ రాదు; సుమతియున్ 507
రాజ్యమునఁ [1]బూజ్యు నెఱుఁగఁడు రాజ్యము గిజ్యమ్ము ముక్తిరతునకు నేలా?

వ అని పలికి వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె. 508

క. ఆ నహుషుఁడు మఖశతమును మానుగఁ గావించి [2]యింద్రమానిసిఁ గవయం
బూని మునీంద్రులు మోచిన [3]యానముపై నుండి కూలె [4]నహియై నేలన్, 509

ఉ. అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతియై చతుర్దిశల్
వన్నెగఁ గావఁ దమ్ములకుఁ [5]బా లిడి శుక్రునికూఁతురున్, సునం
పన్నగుణాభిరామ వృషపర్వునికూఁతురు నోలి నాంద్రుగా
నన్నయశాలి యీ ధరణిచక్రధురంధరుఁ డయ్యెఁ బేర్మితోన్! 510

వ. అనిన విని పరీక్షిన్న రేంద్రుం డిట్లనియె. 511

-: యయాతి చరిత్రము :-

ఆ. 'పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షి భార్గవుఁ డల్లుఁడగుట మామ యగుట యెట్లు? 512
రాజు రాచకూఁతు రతిసేయఁదగుఁగాక విప్రకన్యనొంద విహిత మగునె?'

వ. అనిన శుకుం డి ట్లనియె; 513

సీ. దనుజేంద్రుకూఁతురు తరళాక్షి శర్మిష్ఠ పురములో నొకనాఁడు ప్రొద్దు వోక
[6] వేవురు బోటులు వెంట రా గురునుత యగు దేవయానితో నాట మరగి,
పూచిన యెలదోఁటపొంత [7]జొంపముగొన్న క్రొమ్మావిచేరువకొలఁకుఁ జేరి,
యందుఁదమ్ములతేనెలాని చొక్కుచుఁమ్రోయు నళులఝుంకృతులకునదరివడుచు
ఆ. వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోనఁ బెల్లురేఁగి నీటఁ జల్లులాడ
నంది నెక్కి మౌళి నిందురేఁచులు పర్వ శూలి వచ్చెఁ [8]గొండచూలితోడ. 514

చ. [9] మలహరుఁ జూచి సిగ్గువడి మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచో దనుజవల్లభుకూఁతురు దేవయాని దు

1. పూజ్యుఁడు - గౌరవింపఁదగినవాఁడు, 2. ఇంద్రమానిని - ఇంద్రునిభార్య - శచీదేవి, 3. యానము-పల్లకి 4. అహి-పాము, 5 పాలు-భాగము, 6. వేవురు-వేయిమంది 7. జొంపము - గుబురు, 8. కొండచూలి - పార్వతి, 9. మలహరుఁడు - పాపములను హరించు శివుఁడు.

వ్వలువ ధరించి వేగమున వచ్చినఁ జూచి 'యెఱిం గెఱింగి నా
వలు విది యెట్లు కట్టికొన వచ్చును దానికి?' నంచుఁ దిట్టుచున్‌ 515

వ. దేవయాని యి ట్లనియె. 516

శా. 'ఆ లోకేశముఖంబునం గలిగె బ్రాహ్మణ్యంబు బ్రహ్మంబు నా
మేలై వైదికమార్గముల్‌ దెలుపుచున్‌ మి న్నంది; యందున్‌ మహా
శీలుర్‌ భార్గవు; లందు శుక్రుఁడు [1]సుధీసేవ్యుండు; నే వానికిం
జూలన్‌; నావలు వెట్లు గట్టితివి రక్షోజాతవై చేటికా? 517

క. మహిమవతులైన భూసుర మహిళల [2]విత్తమ్ములు పెఱమగువల కగునే?
మహిఁ బసిఁడిగొలుసు లిడినన్‌ విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్‌. 518

క. మీ తండ్రి మాకు శిష్యుఁడు; మా తండ్రి గురుండు; గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక పరిభూతం జేయుదువె తులువపోఁడిమిఁ జెనఁటీ! 519

వ. అని భర్జించుచున్న దేవయానిపలుకులువిని కిరాళించి మ్రోఁగుచున్న భుజంగి చందంబున
నిట్టూర్పులను నిగిడించి పెదవులు [3]గొఱుకుచు శర్మిష్ఠ యి ట్లనియె. 520

శా. 'భిక్షుండై తమతండ్రి మాజనకునిన్‌ భిక్షించినం దన్ను సం
రక్షింపం'దుది నింతయై మఱపుతో రాజప్రవనూనాకృతి
న్రక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిం;
[4] గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలు లీ కూపంబునం ద్రోవరే.' 521

వ. అని పలికి. 522

ఆ. తోటిపిండుచేతఁ దొడువంగఁ బట్టించి [5]రాజసమున దైత్యరాజతనయ
దొడరి దేవయానిఁ ద్రోపించె వలు పీక క్రుంకి నూతిలోనఁ [6]గుతిలకొనఁగ. 523

వ. ఇట్లు సేసి శర్మిష్ఠ వోయిన వెనుక యయాతిభూపాలుండు వేఁటమార్గంబు నడవిం దిరు
గుచు దైవయోగంబున నా దేవయాని యున్న నూయి సేరం జనుదెంచి యందు. 524

క. బంధువుల నెల్లఁ [7]జీరుచు [8] [9]నంధుజలామగ్నమధ్యయై పగచుచు ని
ర్బంధమునఁ జిక్కి పీడా సింధువున మునింగి యున్న చేడియఁ గనియెన్‌. 525

---

1. మహా – పాఠాంతరము, 2. విత్తమ్ములు – సొత్తులు, 3 విఱుచుచు – పాఠాంత రము, 4. కుక్షిస్ఫోటము – కడుపు పగులుట, 5. రాజసము – అహంకారము, 6 గుదిల కొనఁగ – పాఠాంతరము, 7. చీరుచు –పిలుచుచు, 8. నంధుజలామగ్ననగ్నయై–పాఠాం తరము, 9. అంధువు – నూయి,

వ. కనుగొని. 526

—: దేవయాని యయాతిని వరించుట :—

శా. సప్తాంభోనిధిమేఖలావృతమహాసర్వంసహాకన్యకా
ప్రాప్తోద్యద్వరదక్షదక్షిణకర [1]ప్రాలంబముం జేసి ప్రో
క్షిప్తం జేసె యయాతి గట్టుకొనఁ బైచేలంబు మున్నిచ్చి, ప
ర్యాప్తస్వేదజలాంగి నాళినముదాయస్వర్గవిన్ భార్గవిన్. 527

వ. ఇట్లు నూయి వెడలించిన రాజునకు రాజవదన యిట్టనియె. 528

మ. 'ననుఁ బాణిగ్రహణం బొనర్చితి కదా! నా భర్తవున్ నీవ; దై
వనియోగం; బిది [2]తప్ప; దప్పురుషతావాక్యంబు సిద్ధంబు; సౌ
ఖ్యనివాసున్ నిను మాని యొండువరునిం గాంక్షింప నే నేర్తునే?
వనజం బానెడి తేఁటి యన్యకుసుమావాసం బపేక్షించునే? 529

వ. అదియునుం గాక. 530

సీ. "సుగుణాఢ్య! విను నేను శుక్రునికూఁతురు దేవయానిని; దొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు మా తండ్రిచేత మృతసంజీవనిఁ దా నభ్యసించువేళ
నతనిఁ గామించిన, నతఁ డొల్ల ననపుడు నతఁడు నేర్చినవిద్య యడఁగి పోవ
నతనిఁ శపించిన, నతఁడు నా భర్త బ్రాహ్మణుఁడు గా కుండెడు మని శపించె;
తే. నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు ప్రాణనాథుఁడ వీ" వని పడఁతి పలుకఁ
దనదుహృదయంబు నెలఁత పైదగులు పడినఁ [3]దమక మొకయింతయును లేక తలఁచిచూచి.

మత్తకోకిలము. 'దైవయోగము గాక విప్రసుతన్ వరించునె నామనం?
బే విధంబున నీశ్వరాజ్ఞయు నిట్టి' దంచు వరించె ధా
త్రీవరుఁడును దేవయానిని, ధీరబుద్ధులకున్ మనో
భావ మొక్కటియే ప్రమాణ మభావ్యభావపరీక్షకున్. 532

వ. ఇట్లు వరించి యయాతి సనినవెనుక దేవయాని శుక్రునికడకుం జని శర్మిష్ఠ చేసిన
వృత్తాంతం బంతయుం జెప్పి కన్నీరు మున్నీరుగా వగచిన. 533

క. 'క్రూరాత్ముల మందిరములఁ బౌరోహిత్యంబుకంటె! పాపం బీ సం
సారముకంటె శిలల్ దిని యూరక [4]కాపోతవృత్తి నుండుట యొప్పున్! 534

1. ప్రాలంబము-అవలంబనము, 2. పౌరుషంబునకు నావాక్యంబు-పాఠాంతరము,
3. తమకము-తొందరపాటు, 4. కాపోతవృత్తి-పావురములవలె (రాళ్లతిని)జీవించుట.

వ. అని వృషపర్వుకడ నుండుట నిందించుచు శుక్రుం డా కూఁతుం దోడ్కొని పురంబు వెడలి చన నయ్యసురవల్లభుం డెఱింగి శుక్రునివలన దేవతల గెలువఁ దలంచి తెరువున కడ్డంబు వచ్చి పాదంబులపైఁబడి ప్రార్థించి ప్రసన్నుం జేసిన నా కోపంబు మాని శుక్రుండు శిష్యున కి ట్లనియె 535

తరలము 'చెలులు వేవురుఁ దాసు నీ సుత చేటికై వడి నా సుతం
గొలుచుచుండినఁ దీఱుఁ గోపము గొల్వఁ బెట్టెద వేని నీ
వెలఁదిఁ దోడ్కొని వత్తు' నావుడు వేగ రమ్మని [1]భార్గవిం
గొలువఁ బెట్టె సురారివర్యుఁడు గూఁతు నెచ్చెలివిందుతోన్ 536

మ. చల మిం కే లని తన్నుఁ దండ్రి వనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు [2]న్నజస్రంబుఁ ద
న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ వాయన్ [3]భూరికోపానలా
కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమస్థానికిన్. 537

ఉ. [4]అతతమైన వేడ్క దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దపూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిం
బ్రీతి మహోగ్రజాతికి నభీతికి సాధువినీతికిన్ సిత
ఖ్యాతికి భిన్నదుఃఖబహుకార్యభియాతికి నయ్యయాతికిన్ 539

వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు 'శర్మిష్ఠాసంగమంబు సేయకు' మని యతని నియమించి పనిచె; పిదప దేవయానియు నయ్యయాతివలన యదు తుర్వసు లను కుమారులం గనియె నొక్కరేయి సెలంగు మాని దేవయాని వెలుపల నున్నయెడ శర్మిష్ఠ యెదురు వేచి యేకాంతంబున యయాతికడకుం జని చెలఁకువింటిజోదుపువ్వుటం పఱ [4]కోహటించి తన తలంపు సెప్పిన.

—: శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట :—

ఉ. ఆ జవరాలిఁ జూచి మన మాఁపఁగ లేక [5]మనోభవార్తుఁడై
యా జనభర్త మున్ను కవి యాడినమాట దలంచి యైనఁ జే
తోజసుఖంబులం దనిపెఁ దోఁపఁగ వచ్చునె దైవయోగముల్ ?
రా జఁట! సద్రహస్య మఁట! రాజకుమారిని మాన నేర్చునే ? 541

1. భార్గవి-దేవయాని, 2. అజస్రంబు-ఎల్లపుడు, 3. భూరిచేతస్సమా, కలితగ్లానికి-పాఠాంతరము. 4. అతతము-విస్తారము. 5. ఓహటించి-భయపడి, 6 తనూభవార్థియై-పాఠాంతరము.

వ. ఇట్లు యయాతివలన శర్మిష్ఠ గర్భంబై క్రమంబున ద్రుహ్యుండు ననువుఁ బూరువు నను ముఫ్వురు తనయులం గాంచె నంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి కోపించి శుక్రుకడకుఁజని [1]క్రోధమూర్ఛితయై యున్న సమయంబున యయాతి వెంటఁ జని యి ట్లనియె. 542

ఆ. 'మామ కేల చెప్పఁ? మాను సరోజాక్షి! దనుజతనయఁ బొంది తప్పువడితిఁ
గామి నయిన నన్నుఁ గరుణింపు పతిమాట [2]తండ్రి మాటకంటెఁ దగును సతికి. 543

వ. అని పలికి పాదంబుల కెఱఁగిన నయ్యింతి యొడంబడక యుండె నంత నది యెఱింగి శుక్రుం డి ట్లనియె. 544

క. 'నామాట ద్రోచి దానవభామను బొందితివి ధరణిపాలక! తగవే?
యే మాట యేది రూపము? కాముకులకు లోలుపులకుఁ గలవే విజముల్ ?' 545

వ. అని పలికి 'నిన్ను వనితాజన హేయంబయిన ముదిమి నొందెదు' మని శపియించిన యయాతి యిట్లనియె. 546

క. [3]'మామా! నాపైఁ గోపము మామా నీపుత్రియందు మానపు నాకుం
గామోపభోగవాంఛలు ప్రేమన్ రమియించి [4]ముదిమిఁ బిదపం దాల్తున్. 547

వ అని పలికి యనుజ్ఞగొని దేవయానిం దోడ్కొని పురంబునకుం జని పెద్దకొడుకగు యదువుం బిలిచి యయాతి యిట్టనియె. 548

శా 'నీతల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁ డీ జరం బొందితిన్;
నా తండ్రీ! యదునామధేయ! తనయా! నా వృద్ధతం దాల్పవే?
నీతారుణ్యము నాకు నీవె; తనివోఁ! నిం డారఁ గొన్నాళ్ళు నేఁ
జేతోజాతసుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా!' 549

వ. అనిన విని తండ్రికి యదుం డి ట్లనియె. 550

శా. 'కాంతాహేయము, దుర్వికారము, [5]దురాకండూతిమిశ్రంబు, హృ
చ్చింతామూలము [6]పీనసాన్వితము, ప్రస్వేదవ్రణాకంపన
భ్రాంతి [7]స్ఫోటకయుక్త. మీ ముదిమి వాంఛం దాల్చి నానాసుఖో
పాంతం బైన వయోనిధాన మిది యయ్యా తేర యీవచ్చునే?' 551

1. క్రోధమూర్ఛిత క్రోపముచే నొడలు తెలియనిది. 2, తల్లిదండ్రి మోవఁదగును సతికి-పాఠాంతరము, 3. మామా - వద్దువద్దు (సంస్కృతము), 4 ముదిమి-ముసలితనము, 5, దురాకండూతి-ఎక్కువైనదురద, 6 పీనస - రొంప, 7. స్ఫోటకము - కురుపు.

వ. అని యదుం డొడంబడ కున్న యయాతి తుర్వసు ద్రుహ్యానుల నడిగిన వారును యదువు
వలికినట్ల పలికినఁ; గడగొట్టుకొమారుండైన పూరువున కి ట్లనియె. 552

ఉ. 'చిన్నవు గాని నీవు కడుఁ బెద్దవు బుద్ధులయందు రమ్ము నా
యన్న! మదాజ్ఞ దాఁటవుగదన్న! వినీతుఁడ వన్న! నీవు నీ
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకు మన్న! నా జరన్
మన్ననఁ దాల్చి నీతరుణిమం [1]బొనఁగూర్పుము నాకుఁ బుత్రకా!' 553

వ. అనిన విని గురుభక్తిగుణాధారుండయిన పూరుం డి ట్లనియె. 554

శా. 'అయ్యా! న న్నిటు వేఁడ నేల? భవదీయాజ్ఞాసముల్లంఘనం
బయ్యుండం బరిహారమున్ నొడువ నే నన్యాయినే? నీ జరన్
నెయ్యంబొప్పఁగఁ దాల్చి నాతరుణిమన్ నీ కిచ్చెదం; బంపినం;
గయ్యం బాడెడి పుత్రకుండు [2]క్రిమిసంకాశుండు గాకుండునే? 555

వ. అదియునుం గాక. 556

క. మునివృత్తి దయ్య నేటికి? జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకుం;
దనుఁ గన్న తండ్రి సెప్పిన పని సేసిన సుగతి [3]గొంగుపసిఁడియ కాదే! 557

క. వనుపక చేయుదు రధికులు పనిచిన మధ్యములు వొందుపఱుతురు: తండ్రుల్
పని చెప్పి కోరి పనిచిన ననిశము మాఱాడు పుత్రు లధములు దండ్రీ!' 558

వ. అని పలికి పూరుండు ముదిమి సేకొని తన లేఁతప్రాయంబు యయాతి కిచ్చె; నయ్యయా
తియుం దరుణుండై. 559

శా. ఏ దౌ ద్వీపము లేదు [4]వాడలుగ నర్వేలాతలం బెల్లఁ బె
న్వీడై [5]పోఁడిగ నేలుచుం బ్రజల నన్వేషించి రక్షించుచుం,
దోడన్ భార్గవి రా మనోజసుఖసంతోషంబులం దేలుచుం
గ్రీడించెన్ నియతేంద్రియుం డగుచు [6]దాక్రీడాతిరేకంబులన్. 560

క. మర్మంబుల నతిసాధ్వీ ధర్మంబుల దేవయాని దన ప్రాణేశున్
నర్మముల మనోవాక్తను కర్మంబుల నొందు లేక కడు మెప్పించెన్. 561

---

1. మఁబురయంబున నిమ్ము పుత్రకా-పాఠాంతరము, 2. క్రిమి-పురుగు, 3 కొంగు పసిఁడి - కొంగుబంగారము - సులభమైనది, 4. వాడలు-వీథులు, 5, లోనుగ-పాఠాంతరము, 6. సత్కీర్తిన్ విజృంభించుచున్ - పాఠాంతరము,

శా. ఆకాశంబున మేఘబృందము ఘనంబై, సన్నమై, దీర్ఘమై,
యేకంబై, బహురూపమై యడఁగున ట్లే దేవుగర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు, నా దేవు ను
శ్రీకాంతున్ హరిఁగూర్చి యాగములు సేసెన్ నాహుషం డిమ్ములన్. 562

వ. మఱియు. 563

మ. చెలికాండ్రం గరులన్ రథమ్ముల భటశ్రేణిం దురంగంబులం
గలలోఁ గన్న ధనావళిన్ సమములంగాఁ జూచుచున్, భార్యతోఁ
బలువే లేండ్లు మనోజభోగలహరీపర్యాప్తుఁడై తేలియున్
బలుతృష్ణం [1]గడఁ గాన కెంతయు మహాబంధంబులన్ స్రుక్కుచున్. 564

వ. ఒక్క దినంబున నాత్మజ్ఞానంబుంజేసి కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి యయాతి యతివిషాదంబు నొంది దేవయాని కిట్లనియె. 565

యయాతి దేవయానికి

-:బస్తోపాఖ్యాన మనెడి వ్యాజంబున స్వవృత్తాంతంబు దెలుపుట:-

క. 'మన చారిత్రము వంటిది; విను మితిహాసంబు గలదు; వృద్ధజనములున్
[2]మునులును మెత్తురు; నీవును మనమున నంగీకరింపు మంజులవాణీ! 566

వ. అది యెట్టి దనిన. 567

సీ. అజ యొకం డడవిలో నరుగుచుఁ దాఁ గర్మఫలమున నూతిలోపలికి జాఱి,
లోఁగెడి [3]ఛాగి నాలోకించి కామియై కొమ్మున దరిఁ గొంత గూలఁద్రోచి,
వెడలింప నచ్ఛాగి, విభునిఁగాఁ గోరిన నగుఁగాక యని తాను నదియుఁదిరుగ
[4]నెన్ని యేనిని దన్ను నెంత కామించిన నన్నిటికిని భర్తయై తనర్చి 568
తే. వానినేప్రొద్దు రతులకు వశలఁ జేసి సొరిదిఁ గ్రీడించి క్రీడించి [5]చొక్కి చొక్కి
కాముఁ డనియెడు దుస్సహ [6]గ్రహముకతనఁ జిత్త మేమఱి మత్తిల్లి చెల్లఁజిక్కి,

క. వెడవిలుతుకేళిఁ జిగురా కడిదపువ్రేటునకు లోఁగి యతిమోహితుఁడై
విడువక సతులం దగిలెడు జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్? 569

---

1. కడ-అంతము, 2. మును మన్నింతురు-పాఠాంతరము 3. ఛాగి-ఆఁడుమేఁక, 4. నజరేని నన్నిచ నంతఁ-పాఠాంతరము. 5 చొక్కి - పరవశమై, 6. గ్రహము -భూతము.

వ. అంత నచ్ఛాగంబు దనవిదపం దగిలిన ఛాగినివహంబులోపలం జూడ [1]నొప్పెడి ఛాగి యందుఁ దగిలి క్రీడింపం గని నూతిలోపలం బడి వెలువడిన ఛాగి తన పతివలని నెయ్యంబు లేకుండుటకు విన్ననై తన మనంబున, 570

క. పలికిన పలుకులు పలుకఁడు; కలయున్ నవకాంతఁ జూచి కడుసంచలుఁడై;
నిలిచినచోటన్ నిలువఁడు, నిలు వెల్లను గల్ల; కామి [2]నిజమరి గలఁడే? 571

వ. అని పలికి విడిచి చనిన నయ్యజవల్లభుండు సురతపరతంత్రుండై మిసిమిసియను శబ్దంబు సేయుచుఁ దచ్ఛాగివెంటం జని యొడంబఱుపం జాలకుండె; నంత దానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషంబున, రతిసమర్థంబు గాకుండ నల్లాడుచుండ ఛాగవృషణంబులు ద్రెంచివేసిన నచ్ఛాగంబు గ్రిందఁబడి వేడుకొనినఁ బ్రయోజనంబు వొడగని యోగ విదుండు గావున బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ నయ్యజవృషణంబులు సంధించిన. 572

క. వృషణములు మరలఁ గలిగిన [3]సుషముండై ఛాగవిభుఁడు సుందరితోడన్
విషయసుఖంబులఁ బొందుచుఁ దృష తుదిఁగనఁడయ్యెఁ బెక్కుదివసములయ్యున్.' 573

వ. అని యివ్విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతబు గథారూపంబున నెఱింగించి యి ట్లనియె. 574

మ. అబలా! నీనిబిడాతిరుర్జయసలజ్జాపాంగభల్లంబులం
బ్రబలం బైన మనంబు భగ్నముగ, నా ప్రావీణ్యముం గోలుపో
యి బలిష్ఠుండగు కాముబారిఁ బడి నే నెట్లోర్తునే? [4]బందిక
త్తెబడిం బాపవుఁదృష్ణ [5]యిప్పు డకటా! దీర్ఘాకృతిన్ రొప్పెడిన్. 575

క. [6]అదలదు; ప్రాణము లదలినఁ గదలదు; సర్వాంగకములుఁ గదలుచు నుండన్
వదలదు బిగువులు వదలినఁ; దుదిలే దీ తృష్ణ; దీనిఁ ద్రుంపఁగవలయున్. 576

క. వెయ్యేం డ్లయ్యెను నీతోఁ గ్రయ్యంబడి యున్నవాఁడ; గామసుఖములం
గ్రుయ్య దొకయించు కైన న్దయ్యదు కొన లిడియెఁ దృష్ణ నవపద్మముఖీ! 577

క. ముదిసెను దంతావళియును; ముదిసెను గేశములు; దనువు ముదిసెం దనకున్;
ముగియనివి రెండు సిక్కెను బదికెడితీపియును విషయపక్షస్పృహయున్. 578

---

1. ఒప్పెడి-అందమైన, 2. నిజమరి-యథార్థము పలుకువాఁడు, 3. సుషముఁడు-అందగాఁడు. 4. బందికత్తె-చెఱలోవేయునది 5. యక్కటకటా! దీర్ఘాకృతిన్ బొందెడిన్-పాఠాంతరము. 6. అదలదు-బెదరదు.

క. కడ లేదాశాలతకుం; గడఁ జూడఁగఁ గానరాదు; కడఁ గని రేనిన్
గడు ముదమున సంసారము గడఁ గందురు తత్త్వవిదులు గమలదళాక్షీ 579

క. [1]మండన హాటకపశువేదండాశ్వవధూదుకూలధాన్యాదులు పె
క్కుండియు నాశాపాశము ఖండింపఁగ లేవు; మఱియుఁ గదమయ చుమ్మీ! 580

క. కామోపభోగసుఖములు వేమాఱును బురుషుఁ డనుభవించుచునున్నం
గామంబు శాంతిఁ బొందదు [2]ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ బ్రబుంగుడువడునే? 581

ఆ. అక్క తల్లి చెల్లె లాత్మజ యెక్కిన పాను పెక్కఁజనదు పద్మనయన!
[3]వరమయోగికైన బలిమిని నింద్రియగ్రామ మధికపీడఁ గలుగఁజేయు, 582

క. [4] వెంగలివిత్తయి తిరుగుచుఁ [5]గంగారై చెడక ముక్తిఁ గాంక్షించునతం
డంగనలతోడ విడువని సంగదములు వదలవలయు జలజాతముఖీ! 583

వ. అది గావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి, నిర్విషయుండనయి యహంకారంబు విడిచి, మృగంబులం గలసి వనంబున సంచరించెదఁ; బర బ్రహ్మంబునందుఁ జిత్తంబు సేర్చెద; బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటంజేసి యే నందుఁ దత్పరుండనై యాహారనిద్రాదియోగంబులం బరిహరించెద; నాత్మవిదుండై సంసారనాశంబుఁ దలంచినవాఁడె విద్వాంసుండని పలికి పూరుని యౌవనం బతని కిచ్చి ముదిమి దాను గైకొని విగతలోభుండై నిజభుజశక్తి పాలితంబు భూమండలంబు విభాగించి ద్రుహ్యునకుఁ బూర్వభాగంబును, యదువునకు దక్షిణభాగంబును, దుర్వసునకుఁ బశ్చిమ దిగ్భాగంబును, ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షింపుం డని యిచ్చి వారల సమక్షంబున. 584

క. నాలుగు చెఱఁగులనేలయుఁ బాలింపుం డనుచు నగ్రభవులను బంచెన్;
భూలోక మేలు మనుచును బాలారోఁదారుఁ బూరుఁ బట్టముగట్టెన్. 585

వ ఇట్లు పూరునికి రాజ్యం బిచ్చి, పెక్కువర్షంబు లందు ననుభూతంబులయిన యింద్రియ సుఖంబులు విసర్జించి. 586

క. మిక్కిలి సుజ్ఞానంబునఁ జక్కఁగఁ [6]దెగ నడిచి వైరిషడ్వర్గంబున్,
ఱెక్కలు వచ్చిన విహగము గ్రక్కున [7]నీడంబు విడుచుకరణి నుదితుఁడై 587

---

1. మండనము-నగ, 2. ధూమధ్వజుఁడు-అగ్ని, 3. పరమయోగికైన బలిమాలు నింద్రియ, గ్రామమధిక మడఁచి కట్టరాదు - పాఠాంతరము, 4. వెంగలివిత్తు - మూఢా గ్రేసరుఁడు, 5. కంగారు-కలఁతపడినవాఁడు, 6. దిగవిడిచి - పాఠాంతరము, 7. నీడంబు-గూడు,

క. కారుణికోత్తముఁ డగు హరి కారుణ్యముకతన నతఁడు ఘనుఁడై గెలిచెం
గ్రూరముఁగు విషయంబుల నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడు గలఁడే? 588

వ. మఱియు నిర్మూలితసంగుండై సత్త్వరజస్తమోగుణంబుల దిగనాడి, నిర్మలంబయి
పశమం బయిన వాసుదేవాభిధానబ్రహ్మంబునందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధ
మయిన భాగవతిగతిం జెందె; నంత. 589

సీ. ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులు గాఁ జూడ కంతరంగమున నిలిపి,
పథికులై పోవుచుఁ [1]పానీయశాలంటఁ జల్లగా నుండెడి జనులయట్ల
సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి యాలుబిడ్డలు మగం డనుచుఁ గూడి
యుండుటగాని, సంయోగంబు నిత్యంబుగా దీశమాయాప్రకల్పితంబు
తే. దీని విడుచుట దగ వని తెగువ మెఱసి నిద్ర సాలించి మేల్కాన్న నేర్పుసాలఁ
గలిగి భార్గవి సర్వసంగముల విడిచి హరిపరాధీనయై ముక్తి కరిగె నధిప! 590

వ. అని యిట్లు యయాతిచరితంబు సెప్పి భగవంతుండును, సర్వభూతనివాసుండును,
శాంతుండును, వేదమయుండును నైన వాసుదేవునికి నమస్కరించెద నని శుకుం
డి ట్లనియె. 591

క. భారత! నీవు జనించిన పూరునివంశంబునందుఁ బుట్టినవారిం
జారుయశోఽలంకారులఁ ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్. 592

వ. పూరునకు జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచిన్వాంసుండు, నా ప్రాచిన్వాంసు
నకుఁ బ్రవిరోధనమన్యువు, నతనికిఁ జారువు, బుట్టి, రా చారువునకు సుద్యువు, సుద్యువు
నకు బహుగతుండును, బహుగతునకు శర్యాతియు, శర్యాతికి సంయాతియు, సంయాతికి
రౌద్రాశ్వుండును, రౌద్రాశ్వునకు ఘృతాచి యను [2]నచ్చరలేమయందు ఋతేవుఁ గక్షే
పువు స్థలేపువుఁ గృతేపువు జలేపువు సన్నతేపువు ధర్మేపువు సత్యేపువు వ్రతేపువు వనే
పువు ననువారు జగదాత్మ భూతుండైన ప్రాణునకు నింద్రియంబులచందంబునఁ బదుగురు
గొడుకులు జన్మించి, రందు ఋతేపువునకు నంతిసారుండును, నంతిసారునకు సుమతియు
ధ్రువుండు నప్రతిరథుండు నన మువ్వురు పుట్టి, రందు నప్రతిరథునికిఁ గణ్వుండును,
గణ్వునికి మేధాతిథియు, నతనికిఁ బ్రస్కణ్వుండు మొదలగు బ్రాహ్మణులును జన్మించి,
రా సుమతికి రైభ్యుండు పుట్టె, రైభ్యునకు దుష్యంతుండు పుట్టె. 593

1. పానీయశాలలు - చలివేంద్రలు, 2 అచ్చరలేమ - అప్సరస.

క. [1]పారావారపరీతో దారధరాభార [2]దక్షదక్షిణహస్త
శ్రీ రాజిల్లఁగ నొకనాఁ డా రాజేంద్రుండు వేఁటయం దభిరతుఁడై! 594

క. గండకకంఠీరవభేరుండశశవ్యాళకోల [3]రోహిషరురువే
దండవ్యాఘ్రమృగాదన చండశరభశల్యభల్లచమరాటవులన్. 595

క. చప్పుడు సేయుచు మృగముల రొప్పుచు నీరములయందు [4]రోయుచు వలలం
ద్రిప్పుకొని పడఁగఁ బోవుచుఁ దప్పక వ్రేయుచును వ్రేఁటతమకం బొప్పన్ 596

క. మృగయూథంబులవెంటను [5]మృగలాంఛనసన్నిభుండు [6]మృగయాతురుఁడై
మృగయులు గొందఱు గొలువఁగ మృగరాజపరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్. 597

వ. ఇట్లు వచ్చి దైవయోగంబునఁ గణ్వమహామునితపోవనంబు సేరంజని. 598

సీ. ఉరుతరక్రాంతాహియుగళంబులకుఁ బింఛముల విసరెడి కేకి ముఖ్యములను.
[7]గరుణతో మదయుక్తకలభంబులకు మేఁత లిడుచు ముద్దాడు మృగేంద్రములను,
ఘనమృగాదనములు గావుగా లేళ్లతో రతులు సాగించు సారంగములను,
ననుపుగా హోమ ధేనువులకంఠంబులు దువ్వుచు నాడు శార్దూలములను.
తే. దార కలహించు [8]నుందురుదంపతులకు మైత్రి నంకించు మార్జాలమల్లములను
మతిని జాతివైరంబులు మాని యిట్లు గలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు. 599

క. ఇత్తెఱఁగున మృగజాతుల [9]పొత్తులు మే మెఱుఁగ మనుచు భూవల్లభుఁడుం
జిత్తములోపల నా ముని సత్తము సద్వృత్తమునకు సంతసపడుచున్. 600

క. [10]హల్లకబిసరుహసరసీకల్లోలోత్ఫుల్లయూథికాగిరిమల్లీ
మల్లీ మరువక కురవక నల్లలితానిలమువలన సంతుష్టుండై. 601

వ. దుష్యంతుండు వచ్చునవసరంబున. 602

క. 'ఇం [11]దిందిరాతిసుందరి [12]యిందిందిరచికుర యున్న; దిందింద శుభం;
బిం దిందువంశ!' యనుక్రియ నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్. 603

1. పారావారము - సముద్రము, 2. దక్షము - సమర్థమైనది, 3. రోహిషము - అడవిగొఱ్ఱె, 4. రోయుచు-వెదకుచు, 5. మృగలాంఛనుఁడు -చంద్రుఁడు, 6. మృగయ-వేఁట, 7. గరిణు లొల్లని కుంభి —పాఠాంతరము. 8. ఉందురువు-ఎలుక 9. పొత్తులు-స్నేహములు. 10. హల్లకము-ఎఱ్ఱకలువ, 11. ఇందిర-లక్ష్మీదేవి 12. ఇందిందిరము-తుమ్మెద.

క. మా కందర్పునిశరములు [1]మాకందము లగుటఁజేసి మా కందంబుల్
మా కందము లనుకైవడి మాకందాగ్రములఁ బికనమాజము లులిసెన్. 604

వ. అంత. 605

క. 'ఇం దున్న కణ్వమునికిని, వందన మొనరించి తిరిగి వచ్చెద' ననుచుం
బొందుగ [2]ననుచరులను దా నందఱ నందంద నిలిపి యటఁ జని ప్రోలన్. 606

శా. ఆ కణ్వాశ్రమమందు నీరజనివాసాంతప్రదేశంబులన్
మాకందంబులనీడఁ గల్పలతికామధ్యంబులన్ [3]మంజుగం
ధాకాండాంచితశాలలోఁ గుసుమసంపన్నస్థలిం జూచె నా
భూకాంతుండు శకుంతలన్ [4]నవనటద్భూభృత్పర్యటత్కుంతలన్. 607

క. దట్టపుఁ [5]దుఱుమును మీఁదికి మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱుచూడ్కుల్
నట్టాడు నడుముఁ దేనియ లుట్టెడు మోవియును మనము నూరింపంగన్ 608

వ. అంత నారాజకుమారుం డలరుటమ్ములవిలుకాని వెడవింట ఘణఘణాయమాన లయి
మోయు ఘంటలకుం బంటించి తనమనంబున. 609

శా. 'వన్యాహారములన్ జితేంద్రియత [6]నావాసించు నా కణ్వుఁ డీ
కన్యారత్నము నేగతిం గనియెడిం ? గా; దీకురంగాక్షి [7]రా
జన్యాపత్యము గాఁగ నోపు; నభిలాషం బయ్యెఁ; గాదేని నే
యన్యాయక్రియలందుఁ బౌరవుల కెం దాశించునే చిత్తముల్ ? 610

క. అడిగిన నృపసుతఁ గా నని నొడివెడినో యిది మనంబు నొవ్వ' నని విభుం
డుడు రాజవదన నడుగక [8] [9] తడుమన నొకకొంత ప్రొద్దు దడఁబడఁ జొచ్చెన్. 611

వ. మఱియు నెట్టకేలకుఁ దన చిత్తసంచారంబు సత్యంబు గాఁ దలంచి యిట్లనియె. 612

క. 'భూపాలకకన్యక వని నీపయిఁ జిత్రంబు నాఁటె; నీవా రెవరి ?
నీపే రెవ్వరు ? నిర్జన భూపర్యటనంబు దగవె ? పూర్ణేందుముఖీ!' 613

---

1. మాకందములు—తీయమామిళ్లు 2. నన్నల మాన్యుల - పాఠాంతరము. 3. మంజు—మనోహరమైన- 4. నవనవ బ్రూపర్యటత్కుంతలన్-పాఠాంతరము, 5. తుఱుము—కొప్పు 6 ఆవాసించు నివసించునట్టి, 7. రాజన్యాపత్యము - రాచబిడ్డ, 8. దడుమున్నఁబడి—పాఠాంతరము, 9. తడుమున-సంశయము.

వ. అని పలుకుచున్న రాజకుమారుని వదనచంద్రి కారసంబు నేత్రచకోరంబుల వలనం ద్రావుచు నయ్యువిద విభ్రాంత యయి యున్నసమయంబున. 614

క. [1]కంతే కాలునిచేతం గుంతితుఁ డగు టెట్లు మరుఁడు ? కుసుమాస్త్రంబుల్
లుంఠించి గుణనినాదము ఠంఠ మ్మన బాల నేసె ఠవఠవ గదురన్. 615

వ. ఇట్లు వలరాచవాని క్రొవ్విరికోలలవేఁడిమిఁ దాలిమిపోఁడిమి నెడి యా వాలుఁ గంటి యి ట్లనియె. 616

మ. 'అనివార్యప్రభ మున్ను మేనకయు విశ్వామిత్రభూభర్త్రయుం
గని; రామేనక డించి పోయె నడవిం; గణ్వుండు న న్నింత గా
మనిచెన్; సర్వము నా మునీంద్రుఁ డెఱుఁగున్; మ [2]ద్భాగధేయంబునన్
నినుఁ గంటిం బిదపం గృతార్థ నగుచున్ నేఁ డీ వనాంతంబునన్. 617

క. నీవారము ప్రజ లేమును నీవారము పూజగొనుము నిలువుము నీవున్
నీవారును మాయింటను [3]నీవారాన్నంబు [4]గొనుము నేఁడు నరేంద్రా! 618

వ. అని పలికిన దుష్యంతుండు మెచ్చి ముచ్చెకంటియిచ్చ యెఱింగి యి ట్లనియె. 619

ఆ. 'రాజతనయ వగుదు రాజీవదళనేత్ర! మాట నిజము; లోని మాట లేదు
తనకు నదృశుఁ డయిన తరుణునిఁ గైకొంట రాజసుతకుఁ దగువు రాజవదన!' 620

వ. అని మఱియుఁ దియ్యనినెయ్యంపుఁబలుకులవలన నయ్యువిద నియ్యకొలిపి. 621

క. బంధురయశుఁడు జగన్నుత సంధుఁడు దుష్యంతుఁ [5]డుచితసమయజ్ఞుండై
గంధగజగమన నప్పుడు గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్, 622

—: భ ర తు ని చ రి త్ర ము :—

వ. ఇవ్విధంబున నమోఘవీర్యుండగు నా రాచపట్టి దపసిరాచూలికిఁ జూలు నిలిపి మఱునాఁడు తన వీటికిం జనియె; నయ్యింతియుం గొంతకాలంబునకుఁ గొడుకుం గనినఁ గణ్వమునీంద్రుం డా రాచపట్టికి జాతకర్మాదిమంగళాచారంబు లొనర్చె, నా డింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుంబోలె నెదుగుచు. 623

1. కంతే కాలుఁడు-శివుఁడు, 2 భాగధేయంబు-అదృష్టము, 3 నీవారాన్నంబు-నివ్వరియన్నము, 4. గుడువు—పాఠాంతరము, 5. ఉచితసమ యజ్ఞుండు - యుక్తకాలము తెలిసినవాఁడు.

క. కుఱితుఁడు గాక వాఁడు త్కంఠం దనవిన్న నాఁడె కణ్వవనచర
త్కంఠీరవముఖ్యంబుల [1]కంఠములం బట్టీయడుచుఁ; గట్టున్; విడుచున్. 624

క. అంత నా కణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కిట్లనియె. 625

ఉ. 'పట్టపురాజు నీమగఁడు; పాపఁడు నన్నిట నెక్కు డంతకుం;
బట్టపుదేవివై [2]గఱువ [3]బాగున నుండక [4]పాఱువారితో
[5]గట్టువనంబులో నవయఁ గాఁ బని లే దిటఁ దర్లి పోఁగదే!
పుట్టినయిండ్ల మానినులు [6]పోరచిగా నసిశంబు నుందురేః' 626

వ. అనిన నియ్యకొని. 627

క. ఆ విన్నవాని, నతుల వ్యాపారు నుదారు, వైష్ణవాంశోద్భవునిం
జూపెద నంచు శకుంతల భూపాలునికడకు వచ్చెఁ బుత్రునిఁ గొనుచున్. 628

వ. వచ్చి దుష్యంతుం డున్న సభామండపంబునకుం జని నిలిచి యున్నయెడ. 629

మ. వలకేలన్ గురుచక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారఁగ నందు వచ్చిన రమాకాంతుండునాఁ గాంతి న
గ్గలమై యున్నకుమారు మారసదృశాకారున్ విలోకించి తాఁ
దలుకం దయ్యె విభుం డెఱింగి సతి విభ్రాంతాత్మయై [7]వందురన్. 630

వ. ఆ సమయంబున. 631

మ. 'ఆదె నీవల్లభ; వాఁడు నీ సుతుఁడు; భార్యాపుత్రులం బాత్రులన్
వదలం గా; దలనాటి కణ్వవనికా వైవాహికారంభముల్
మది నూహింపు; శకుంతలావచనముల్ మాన్యంబుగా భూవరేం
ద్ర; దయం జేకొను' మంచు మ్రోసెను [8]వియద్వాణీవధూవాక్యముల్. 632

వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుఁ దేటపడ భరింపు మని పలికిన నా కుమారుండు భర
తుం డయ్యె, నంత నా రాజు రాజవదన నంగీకరించి తనూభవుంజేకొని కొంత కాలంబు
రాజ్యంబు సేసి పరలోకంబునకుం జనియెఁ; దదనంతరంబ 633

---

1. వెంతారించు గలంచుం విడుచుం గట్టున్-పాఠాంతరము, 2. గఱువ - మర్యాదగలయువతి, 3. భావన - పాఠాంతరము, 4 పాఱువారు-బ్రాహ్మణులు, 5. టట్టువనంబులందు సమయం బని - పాఠాంతరము, 6. పోరచిగా-వ్యర్థముగా, 7. వందురన్-దుఃఖంపఁగా, 8. వియద్వాణి - ఆకాశవాణి.

క. రెండవ హరిక్రియ ధరణీమండలభారంబు నిజనమంచితబాహా
దండమున నిలిపి తనకునఁ [1]ఖండనమున నెదురు లేక భరతుం డొప్పెన్, 634

వ. మఱియు నా దౌష్యంతి యమునాతటంబున దీర్ఘ తపుండు పురోహితుండుగా డెబ్బది యెనిమిదియును, గంగాతీరంబున నేఁబదియయిదును, నిట్లు నూటముప్పదిమూఁ డశ్వమేధ యాగంబులు సదక్షిణంబులుగా నొనర్చి, దేవేంద్ర విభవంబున నతిశయించి, పదు మూఁడువేలు నెనుబదినాలుగు [2]కదుపుధేనువులు గలయది ద్వంద్వం బనం బరఁగు నట్టి వేయిద్వంద్వంబుల పాఁడి మొదవులఁ [3]గ్రేపులతోడ నలంకారసహితలం జేసి వేవురు బ్రాహ్మణుల కిచ్చి, మష్కారతీర్థకూలంబున విప్రముఖ్యులకుఁ గనకభూషణశోభితంబు లయి ధవళ దంతంబులు గల నల్లని యేనుంగులం బదునాలుగు లక్షల నొసంగె; దిగ్వి జయకాలంబున శకశబరబర్బరకషకిరాతకహూణమ్లేచ్ఛదేశంబుల రాజులఁ బీచఁ బడంచి. రసాతలంబున రాక్షసకారాగృహంబులందున్న వేల్పులగరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి వారల వల్లభులం గూర్చెఁ; ద్రిపురదానవుల జయించి నిర్జరుల నిజమందిరంబుల నునిచె; నతని రాజ్యంబున గగన ధరణీతలంబులు ప్రజలు గోరిన కోరిక లిచ్చుచుండె; నివ్విధంబున 635

ఆ. సత్యచరితమందుఁ జలమందు బలమందు భాగ్యమందు [4]లోకపతులకంటె
నెక్కుడైన పేర్మి నిరువదియేడువే లేండ్లు ధరణి భరతుఁడేలె నధిప! 636

క. [5]అర్థపతికంటెఁ గలిమిఁ గృ తార్థుండై యతులశౌర్య మలపడియు, నతం
డర్థములను బ్రాణములను వ్యర్థము లని తలఁచి శాంతుఁ డయ్యె నరేంద్రా! 637

క. భరతునిభార్యలు ముగ్గురు వరునం బుత్రకులఁ గాంచి వల్లభుతోడన్
నరి గా రని [6]తోడ్తోడను శిరములు దునుమాడి రాత్మశిశువుల నధిపా! 638

వ. ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులం జంపిన భరతుం డపుత్రకుండై మరుత్స్తోమం బను యాగంబు పుత్రార్థియై చేసి దేవతల మెప్పించె; నయ్యవసరంబున. 639

సీ. అన్న యిల్లాలిఁ [7]జూలాలిని మమతాఖ్యఁ జూచి బృహస్పతి సురతమునకుఁ
దారఁగొనిపైపడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుఁడు భయం బొదవి 'వలదు;
తగ' దని మొఱసేయఁ దమకంబుతో వాని నంధుండ వగు మన్న నలిగి వాఁడు
యోనిలోపలివీర్య మూఁదఁ దన్నిన నేలఁ బడి బిడ్డఁడై యున్నఁ బాయలేక

1. ఖండనము-యుద్ధము, 2. కదుపుధేనువులు-మంచావులు, 3. క్రేపులు-దూడలు, 4, లోకపతులు - దిక్పాలకులు, 5. అర్థపతి - కుబేరుఁడు, 6. తోడ్తోడను - వెనువెంటనే, 7. చూలాలు - గర్భవతి.

ఆ. 'నితని పెంపు; కొడుకు లిరువురు జన్మించి'రనుచు 'వెలయఁజేయు' మనిన మమతఁ
'బెంపఁ జాల; నీవ పెంపు; భరింపు మీ [1]'ద్వాజు' ననుచుఁ జనియె దాని విడిచి. 640

వ ఇట్లు చథ్యునిభార్య యగు మమతయు బృహస్పతియు శిశువుం గని 'ద్వాజుండైన వీని నీవ నీవ భరింపు' మని వదినెపుఱందులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుం డయ్యె; గర్భస్థుం డైనవాఁడు బృహస్పతిశాపంబున దీర్ఘతముం డయ్యె; నంత నా బృహస్పతియు, మమతయు, నుదయించినవాని విడిచి నిజేచ్ఛం జనిన మరుత్తులు వానిం బోషించి పుత్రార్థి యయిన భరతున కిచ్చిరి; భరతుండు వానిం జేకొనియె; వితథంబైన భరతవంశంబునకు నా భరద్వాజుండు వంశకర్త యగుటం జేసి వితథుం డనంబరఁగె; నా వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్రి జయ మహావీర్య నర గర్గు లనువా రేవురు సంభవించి; రందు నరునికి సంకృతి సంకృతికి గురుండు రంతిదేవుం డన నిరువురు జన్మించి; రందు, 641

## —: రం తి దే వు ని చ రి త్ర ము :—

సీ. రాజవంశోత్తము రంతిదేవునికీర్తి [2]యేల చెప్పఁగ? విను మిందు నందు
నా రాజు దన [3]సంచితార్థంబు లన్నియు నెడవక దీనుల కిచ్చి యిచ్చి
సకుటుంబుఁడై, ధైర్యసంయుతుండై పేదయై కూడు నీరు లే కథమవృత్తి
నెందేని నలువదియెనిమిదిదినముల్ చరియింప నొకదినసంబు [4]రేపు
ఆ. నెయ్యి, పాయసంబు, నీరును, గలిగిన బహుకుటుంబభారభయముతోడ
నలసి నీరుపట్టు; నాఁకలియును మిక్కి లొదవఁ జూచి కుడువ నుత్సహించె. 642

వ. అయ్యవసరంబున. 643

సీ. అతిథి భూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ [5]గడవక ప్రియముతో గారవించి,
హరిసమర్పణ మంచు నన్నంబులో నగ మిచ్చిన భుజియించి యేఁగె నాతఁ:
డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి పొడసూప లే దనఁబోకతనకు
నున్నయన్నములోన నొకభాగ మిచ్చిన సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుక
ఆ. [5]కుక్కగమియుఁ దాను నొక్కఁ డేతేర నా యన్నశేష మిచ్చి సన్నయంబు
లాడి మ్రొక్కి పంప నోడక చండాలుఁ డొక్కఁ డరుగుదెంచి చక్కనిలిచి. 644

---

1. ద్వాజుఁడు-అన్యక్షేత్రమున నితరునివలనబుట్టినవాఁడు 2. యెంమిఁజెప్పఁగఁబడు నిందునందు - పాఠాంతరము, 3. సంచితార్థంబులు - కూడఁబెట్టిన ధనములు, 4. రేపు - ఉదయము, 5. కడవ - లేదనక, 6. కుక్కగమి - కుక్కలగుంపు.

క. 'హీనుఁడఁ; జండాలుండను మానవకులనాథ! దప్పి మానదు; నవలం
బో నేర; నీకుఁ జిక్కిన పానీయము నాకుఁ బోసి బ్రకింపఁగదే!' 645

వ. అనిన వానిదీనాలాపంబులకుఁ గరుణించి రాజి ట్లనియె. 646

ఉ. 'అన్నము లేదు కొన్ని [1]మధురాంబువు లున్నవి; త్రావుమన్న! [2]రా
వన్న! శరీరధారులకు నాపద వచ్చిన వారియాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడచుమ్ము [3]పుల్కసా! 647

వ. అని పలికి. 648

మ. '[4]బలవంతంబగు [5]నీరువట్టున నిజప్రాణాంతమై యున్నచో,
నలయం దేమియు; వీనిహృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను' ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలముం బోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్ 649

వ. తదనంతరంబ బ్రహ్మాదిదేవతలు సంతోషించి రంతిదేవునికి మేలు సేయం దలంచి నిజాకారంబులతో ముందట నిలుచంబడి యా రాజ ధైర్యపరీక్షార్థంబు దమచేసిన [6]వృషలాది రూపంబులగు విష్ణుమాయ నెఱింగించిన నా నరేంద్రుం డందఱకు నమస్కరించి. 650

క. వారల నేమియు నడుగక నారాయణభక్తి దనమనంబున వెలుఁగన్
ధీరుం డాతఁడు మాయా [7]పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్. 651

క. ఆ రాజర్షిని గొలిచిన వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ
నారాయణచింతనులై చేరిరి యోగీశు లరుగుచు సిద్ధపదంబున్ 652

వ. ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణియగు భక్తివలనఁ బరమపదంబునకుం జనియె; నంత గర్గునకు శిని జన్మించె; శినికి గార్గ్యుండు గలిగె; నాతనినుండి బ్రాహ్మణ కులం బయ్యెఁ మహావీర్యునికి నురుక్షయుండును, నురుక్షయునకుఁ ద్రయ్యారుణియుఁ గవియు, బుష్కరారుణియు నను మువ్వురు సంభవించిరి వారుమ బ్రాహ్మణు లయి చనిరి; బ్రహ్మక్షత్త్రునికి సుహోత్రుండు, సహోత్రునకు హస్తియు జన్మించి; రాహస్తి దనపేర హస్తినాపురంబు నిర్మించె నా హస్తికి నజమీఢుండును ద్విమీఢుండును బురుమీఢుండును

1 మధురాంబువులు - తీయనినీళ్ళు 2. రమ్మన్న - పాఠాంతరము, 3 పుల్కసుఁడు - చండాలుఁడు, 4 బలవంతంబు - అధికమైనది, 5. నీరుపట్టు - దప్పి, 6. వృషలుఁడు-శూద్రుఁడు 7. పారజ్ఞుఁడు-అంతమునెఱిఁగినవాఁడు.

నన ముప్వురు జనియించి రం దజమీఢునివంశం బునం బ్రియమేధాదులు గొందఱు పుట్టి బ్రాహ్మణు లయి చని; రయ్యజమీఢు నికి బృహదిషుండు నతనిపుత్రుండు బృహద్ధనువు నతనికి బృహత్కాయుండు నతనికి జయద్రథుండు నతనికి విశ్వజిత్తు విశ్వజిత్తునకు సేనజిత్తు సేనజిత్తునకు రుచిరాశ్వుండు దృఢహనుండుఁ గాశ్యుండు వత్సుండు నన నలు గురు జనించి రందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండును నతనికిఁ బృథుసేనుండును బృథు సేనునికిఁ బారుండును వానికి నీపుండును నీపునికి నూర్వురు గొడుకులును బుట్టిరి మఱియును 653

ఆ. శుకుని కూఁతు రైన సుందరి సత్కృతిఁ బొంది వేడ్క నీపభూవిభుండు
విమలయోగవిత్తు విజ్ఞానదీపితోదారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె 654

వ. ఆ బ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబున యోగతంత్రంబునంజేసి [1]గోదేవియను భార్య వలన విష్వక్సేనుం డను కుమారునిం గనియె విష్వక్సేనునకు నుదక్సేనుండు, నుదక్సే నునకు భల్లాదుండు గల్గి వీరలు బార్హదిషవులను రాజులైరి ద్విమీఢునకు యమీనరుండు యమీనరునికిఁ గృతిమంతుండు గృతిమంతునికి సత్యధృతి సత్యధృతికి దృఢనేమి దృఢనేమికి సుపార్శ్వకృత్తు సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు సుపార్శ్వునకు సుమతి సుమతికి సన్నతి మంతుండు సన్నతిమంతు కొడుకు కృతి యనువాఁడు హిరణ్యనాభు ని వలన యోగమార్గం బెఱింగి శోకమోహంబులు విడిచి తూర్పుదేశంబున సామ సంహిత పఠియించె నతనికి నుగ్రాయుధుండు నుగ్రాయుధునకు క్షేమ్యుండు క్షేమ్యునకు సువీ రుండు సువీరునకుఁ బురంజయుండు బురంజయునకు బహురథుండును జన్మించిరి హస్తి కొడుకు పురుమీఢునికి సంతతిలేదయ్యె నయ్యజమీఢునికి నళిని యను భార్యయందు నీలుండు, నీలునికి శాంతియు శాంతికి సుశాంతియు సశాంతికిఁ బురుజుండుఁ బురుజునికి నర్కుండు నర్కునికి భర్మ్యాశ్వుండు భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాం పిల్య సృంజయు లనువా రేవురుం బుట్టిరి. 655

క. మించిన భర్మ్యాశ్వుఁడు సుతపంచకమును జూచి విషయపంచకమును వ
ర్థించితిఁ దల మని పల్కినఁ బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్ 656

వ. అంత ముద్గలునినుండి బ్రాహ్మణకులంబై ముద్గలగోత్రంబునా [2]నెగడె భర్మ్యాశ్వపుత్రుం డైన యా ముద్గలునికి దివోదానుండు నహల్య యను కన్యకయు నుం బుట్టి, రా యహ ల్యయందు గౌతమునికి శతానందుండు పుట్టె శతానం దునికి ధనుర్వేదవిశారదుం డయిన సత్యధృతి పుట్టె; నతం డొకనాఁడు వనం బున నూర్వశిం గనిన నతనికి రేతఃపాతంబై తద్వీర్యంబు [2]శరస్తంబంబునం బడి [3]మిథునం బయ్యె; నా సమయంబున 657

1. సరస్వతివలన పాఠాంతరము, 2. నెగడ-ప్రకాశించెను 3 శరస్తంబము-రెల్లు దుబ్బు, 4. మిథునము-ద్వయము-ఇద్దరుబిడ్డలు.

క. చపలరతి శంతనుం డను నృపవరుఁ డడవికిని వేఁటనెపమునఁ జనుచుం
గృపతో శిశుయుగముం గని కృపియుఁ గృపుండనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్ 658

వ. ఆ కృపి ద్రోణునకు భార్యయయ్యె దివోదాసునకు మిత్రాయువు మిత్రాయువు నకుఁ జ్యవనుండుఁ జ్యవనునకు సుదాసుండు సుదాసునకు సహదేవుండు సహదేవునకు సోమకుండు సోమకునకు సుజన్మకృత్తును, జన్మకృత్తునకు నూర్వురు గొడుకులుం గలిగిరి వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుఁడు; కడచూలు పృషతుండు పృషతునకు ద్రుపదుండు ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయిన కొడుకులును ద్రౌపది యనుకూఁతురుం గలిగిరి; ధృష్టద్యుమ్ననకు ధృష్టకేతువు పుట్టె; వీరలు పాంచాలరాజు లని యెఱుఁగుము; మఱియు నయ్యజమీఢునికొడుకు ఋక్షుండు ఋక్షునకు సంవరణుం డా సంవరణుండు తపతియని యెడి సూర్యకన్యయందుఁ గురువుం గనియె; నా కురువుపేరం గురుక్షేత్రం బయ్యె; నా కురువునకుఁ బరీక్షిత్తు సుధనువు జహ్నువు నిషధుండు నసువారు నలువురు పుట్టి; రందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె; సుధనువునకు సుహోత్రుం డతనికిఁ జ్యవనుండు చ్యవనునకుఁ గృతి గృతికి వసువు వసువునకు బృహద్రథ కుసుంభ మత్స్య ప్రత్యగ్ర చేదిపాదులు పుట్టి; రందు బృహద్రథునకుఁ గుశాగ్రుండు గుశాగ్రునికి ఋషభుండు ఋషభునికి సత్యహితుండు సత్యహితునికిఁ బుష్పవంతుండు పుష్పవంతునకు జహ్నువనువాఁడు మఱియును. 659

సీ. ఆ బృహద్రథునకు నన్యభార్యాగర్భమున రెండు [1]తనుఖండములు జనించెఁ;
దునుకలఁ గని తల్లి తొలఁగంగ వైచిన సంధించె నొకటిగా జర యనంగ
నొక దైత్యకాంత; వాఁడొప్పె జరానంధుఁ డన; గిరివ్రజపుర మాతఁ డేలె;
నతనికి సహదేవుఁ డతనికి సోమాపి తనయుఁ; డాతనికి శ్రుతశ్రవుండు;
తే జహ్నుపుత్రుండు సురథుండు జనప రేణ్య! యతనికొడుకు విదూరథుఁ; డతని [2]పట్టి
సార్వభౌముండు; వానికి [3]సంభవుండు విను జయత్సేనుఁ డనువాఁడు విమలకీర్తి. 660

వ. జయత్సేనునికి రథికుండు రథికునకు నయుతాయువు నయుతాయువునకుఁ గ్రోధనుండుఁ గ్రోధనునకు దేవాతిథియు దేవాతిథికి ఋక్షుండు ఋక్షునికి భీమసేనుండు వానికిఁ బ్రతీపుండుఁ బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లికులన ముువ్వురు గొడుకులు పుట్టి; రందు. 661

సీ. దేవాపి రాజ్యంబు [4]దీర్ప వొల్లక వనంబున కేఁగెఁ; దమ్ముండు పూర్వజన్మ
మందు మహాభిషుఁ డనియెడువాఁడు శంతనుఁ డయ్యె; వాఁడె యీ ధాత్రినెల్ల

1. తనుఖండములు - దేహఖండములు 2. పట్టి - కుమారుఁడు, 3. సంభవుండు- పుత్రుఁడు, 4. తీర్ప - పాలించుటను.

నేలుచుఁ గరముల నే వృద్ధు ముట్టిన వాఁ డెల్ల నిండుజవ్వనము నొందు;
నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్న దానఁ బంద్రెండేండ్లు [1]వజ్రి వర్షింపకున్న

ఆ. సృష్టిలేనిచొప్పు విప్రుల నడిగిన 'నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర
దారసంగ్రహంబు దాల్చినఁ బరివేత్త యండ్రు; గాన నీవ యతఁడ వైతి 662

వ. అది కారణంబుగా నన్న యుండఁ దమ్ముండు రాజ్యార్హుండు గాఁడు; నీవు పరివేత్తవు; మీయన్నకు రాజ్యం బిచ్చిన ననావృష్టి దోషంబు సెడు' నని బ్రాహ్మణులు పల్కిన శంతనుండు వనంబునకుం జని దేవాపికిఁ బ్రియంబు సెప్పి రాజ్యంబు సేకొమ్మనిపల్కె; నంతకుమున్న [2]వానితండ్రి దేవాపిని రాజ్యంబున కర్హుం జేయం దలంచి విప్రులం బిలిచిన నా విప్రులు పాషండమతవాక్యంబులు దేవాపికి నుప దేశించిన దేవాపి వేదంబుల నిందించిన పాషండుండును దేవ దూషకుండును నయ్యెం; గావున దేవాపికి రాజ్యంబు లేదని బ్రాహ్మణులు సెప్పిన శంతనుండు మగిడి వచ్చి రాజ్యంబుఁ జేకొనియె; నంత వర్షంబును గురిసె; నివ్విధంబున. 663

క. దేవాపి కలాపపురం బావాసము గాఁగ యోగియై యున్నాఁడు
ర్వీవర! కలి నష్టం బగు [3]జైవాతృకకులముమీఁద సంస్థాపించున్. 664

వ. బాహ్లికుం డనువానికి సోమదత్తుండు పుట్టె; సోమదత్తునకు భూరియు, భూరిశ్రవసుఁడును శలుండు ననువారు ముువ్వురు పుట్టిరి. 665

క. భాతిగ శంతనునకు గంగాతటినికి [4]వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా
రాతినయననీలోత్పల భీతికర గ్రీష్మఁడైన భీష్మఁడు పుట్టెన్. 666

ఆ. పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప నన్యు నొకనిఁ గాన మతనిఁ దక్క;
వీరయూథపతి వివేక ధర్మజ్ఞుండు దివిజనదిసుతుండు దేవసముఁడు. 667

వ. ఆ శంతనునకు దాశకన్యక యైన సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టి; రందుఁ జిత్రాంగదుండు గంధర్వులచే నిహతుం డయ్యె; మఱియును 668

ఉ. సత్యవతీవధూటి మును శంతను పెండ్లము గానినాఁడు సాం
గత్యమునం బరాశరుఁడు గర్భము సేసిన బాదరాయణుం
డత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై [5]ప్రభవించె నిత్యముల్
సత్యము లైన వేదముల [6]సాంగములన్ విభజింపఁ దక్షుఁడై. 669

---

1. వజ్రి-ఇంద్రుఁడు 2. వానిమంత్రి దేవాపిని బాషండునిం జేసి—పాఠాంతరము, 3 జైవాతృకకులము - చంద్రవంశము 4. వైష్ణవాగ్రగణ్యుఁడు - గొప్పవిష్ణుభక్తుఁడు. 5 జనించెఁ జోరహా దైత్యక్రూరావకృష్ట, 6. సాంగములు - అంగములతోఁగూడినవి. మిశితస్థితివేదవిభాగదక్షుఁడై —పాఠాంతరము.

ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండుఁ పరమ [1]గుహ్యమైన భాగవతము
నందనుండ నయిన నాకుఁ జెప్పెను శిష్య జనుల మొఱఁగి యేను జదువుకొంటి. 670

వ. ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజకూఁతుల నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబునఁ దెచ్చి వివాహంబు సేసిన, విచిత్రవీర్యుండు వారలం దగిలి మనోజ రాగమత్తుండై చిర కాలంబు నానావిధక్రీడల విహరించుచు [2]రాజయక్ష్మ పీడితుండై మృతుం డయ్యె నంత. 671

క. 'అతనినతులవలన సుతుల, సుత! కను' మని తల్లి పనుప సౌరిదిం గనియెన్
ధృతరాష్ట్రపాండువిదురుల నుత చరితుఁడు బాదరాయణుండు నరేంద్రా! 672

వ. అందు ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదులగు కొడుకులు నూర్వురును దుశ్శల యను కన్యకయును జన్మించిరి; మృగశాపభయంబునం జేసి భార్యం బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్రుల ప్రసాదంబున యుధిష్ఠిరభీమార్జును లను మువ్వురును, మాద్రిదేవివలన [3]నాసత్యప్రసాదంబున నకులసహదేవు లనువా రిద్దఱునుగా నేవురు వుట్టి, రయ్యేవురకును ద్రుపదరాజపుత్త్రియైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండును నన నేవురు వుట్టిరి; మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును, గాళియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, నర్జునునకు నులూపి యను నాగకన్యకయందు నిలావంతుండును, మణలూరుపతిపుత్త్రి యయిన చిత్రాంగదయందు బభ్రువాహనుండు, సుభద్రయందు శౌర్యధైర్యతేజోవిభవంబుల నఖిలరాజ [4]నికరంబునం బ్రఖ్యాతుండైన యభిమన్యుండును జన్మించి, రందు బభ్రువాహనుం డర్జునునియోగంబున మాతామహునిగోత్రంబునకు వంశ కర్త యయ్యె. 673

ఉ. అన్యనుపూజ్య ! నీ జనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్రమూ
ర్ధన్యుఁడు ధన్యమార్గణకదంబవిదారితవైరివీరరా
జన్యుఁడు జన్యభీతగురుసైన్యుఁడు సైన్యసమూహనాథధృ
ష్టాన్యుఁడు మాన్యకీర్తిమహిమం దనరెం గురువంశకర్తయై. 674

వ. ఆ యభిమన్యునకు నుత్తరయందు నీవు జన్మించితివి. 675

---

1. గుహ్యము-రహస్యము, 2. రాజయక్ష్మ-క్షయరోగము, 3. నాసత్యులు-అశ్వినీ దేవతలు, 4. నికరంబు-సమూహము.

క. ద్రోణసుతుతూపువేఁడిమిఁ బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శన [1]సం
త్రాణంబున బ్రదికితె కా క్షోణీశ్వర! మున్ను నీశిశుత్వమువేళన్. 676

వ. నీ కుమారులు జనమేజయశ్రుతసేనభీమసేనోగ్రసేను లను నల్వురు; వీరలయందు,

ఆ. నీవు తక్షకాహినిహతుండ వని విని సకలసర్పలోకసంహృతముగ
సర్పయాగ మింక జనమేజయుఁడు సేయఁ గలఁడు పూర్వరోషకలితుఁ డగుచు. 678

వ. మఱియు నతండు సర్వధరణీమండలంబును జయించి, కావషేయుండు పురోహితుండుగా నశ్వమేధంబు సేయం గలవాఁడు; వానికి శతానీకుండు జనియించి, యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు పఠించి, కృపాచార్యునివలన విలువిద్య నేర్చి, శౌనకునివలన నాత్మజ్ఞానంబుఁ [2]బడయంగలవాఁ; డా శతానీకునికి సహస్రానీకుండు, వానికి నశ్వమేధజుం, డశ్వమేధజునికి నాసీమకృష్ణుం డాసీమకృష్ణునకు నిచక్షుం, డా నిచక్షుండు [3]గజాహ్వయంబు నదిచే హృతంబుగాఁ గౌశాంబియందు వసియించు; నాతనికి నుప్తుం, డుప్తునికిఁ జిత్రరథుఁడు, చిత్రరథునకు శుచిరథుఁడు, శుచిరథునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సునీతుండు, సునీతునికి నృచక్షువు, నృచక్షువునకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు, సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుండు, బృహద్రథునకు సుదాసుండు, సుదాసునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్త్రుండు; [4]వాఁడు [5]నిర్వంశుండై దేవర్షి సత్కృతుండై కలియుగంబునందుఁ జనం గలవాఁడు. 679

క. జగతి నిటమీఁదఁ బుట్టెడు, మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరులన్,
[6]నిగమాంతవిదులఁ జెప్పెద, సుగుణాలంకార! ధీర! సుభగవిచారా! 680

వ. జరాసంధపుత్త్రుఁడైన సహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవుండు, శ్రుతశ్రవునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిరమిత్రునకు సునక్షత్రుండు, సునక్షత్రునికి బృహత్సేనుండు, బృహత్సేనునికిఁ గర్మజిత్తు, గర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి

1. వానివలన వంశంబు సాఁగదయ్యె మఱియు—పాఠాంతరము, 2. సంత్రాణంబు-రక్షణము, 3. పడయుట-పొందుట, 4. గజాహ్వయంబు-హస్తినాపురము, 5. నిర్వంశుఁడు-వంశములేనివాఁడు, 6. నిగమాంతవిదులు-వేదాంతము నెఱిఁగినవారు.

నువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు విశ్వజిత్తునకుఁ బురంజయుండును జన్మించెద; రని చెప్పి మఱియు ని ట్లనియె. 681

ఆ. వినుము మగధదేశవిభులు జరాసంధ [1]ప్రముఖధరణిపతులు ప్రబలయశులు;
వీరు కలియుగమున వేయేండ్లలోపలఁ బుట్టి గిట్టఁగలరు భూవరేంద్ర! 682

వ. యయాతికొడుకు కనువునకు సభావరుండుఁ జక్షువుఁ బరోక్షుండు ననువారు ముగ్గురు వుట్టి; రందు సభానరునికిఁ గాలనాథుండు, గాలనాథునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుండు, మహామనసునకు నుశీనరుండు తితిక్షు వన నిరువురు జన్మించి; రందు సుశీనరునకు శిబివన క్రిమి దర్పు లన నలువురు జన్మించి; రందు శిబికి వృషదర్ప సువీర మద్రకేకయులు నలువురు వుట్టిరి; తితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు, సుతపునకు బలియుఁ బుట్టి; రా బలి వలన నంగవంగకళింగసింహపుండ్రాంధ్రు లను పేళ్ళు గలవా రార్వురు కుమారులు పుట్టిరి; వారలు దూర్పు దేశంబునకు రాజులయి, దేశంబులకుఁ దమతమ నామధేయంబు లిడి యేలిరి; సువీరునకు సత్యరథుండు, సత్యరథునికి దివిరథుండు, దివిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండుఁ బుట్టి, రా చిత్రరథుండు రోమపాదుండునాఁ బరఁగె. 683

క. సంతతి లేనికతంబునఁ జింతించుచు నుండ నతనిచెలికాఁ డగు ధీ
మంతుఁడు దశరథుఁ డతనికి [2]సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్. 684

వ. అంత రోమపాదుండు దనకూఁతురు శాంత యని గైకొని మెలంగుచుండు; నా రాజు రాజ్యంబునఁ గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి విభాండక సుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియు నని పెద్దలవలన నెఱింగి, 685

క. ఆ రాజు ఋశ్యశృంగుని ఘోరతపోనియముఁ దెచ్చుకొఱకై పనిచెన్
వారసతుల నేర్పరుల నుదార స్తనభారభీరుతరమధ్యగలన్. 686

వ. వారలుఁ జని. 687

---

1. ధరణిపతులు బాహుదర్పయుతులు-పాఠాంతరము, 2 సంతతి-కుమార్తె.

ఆ. 'కాంతలార! మెకము గన్నదిమొదలుగా నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన
గోఁచి బిగియఁగట్టుకొనిన యా [1]వడుగని [2]మత్తికాని రతికి మరపవలయు.' 688

వ. అని పలుకుచు, 689

క. ఆడుచుఁ, జెఫ్లలకు నింపుగఁ బాడుచు [3]నాలోకనిశితబాణౌఘములన్
వీడుచు, డగ్గఱ [4]నోడుచుఁ జేడియ లా తపసికడకుఁ జేరిరి కలఁపన్ 690

వ. అయ్యవసరంబున వారలం జూచి. 691

సీ. మిళితాళినీల [5]ధమ్మిల్లభారంబులు చారుజటావిశేషంబు లనియు,
భర్మాంచలోజ్జ్వల ప్రభదుకూలంబులు తతచర్మవస్త్రభేదంబు లనియు,
బహురత్నకీలితభాసురహారంబు లధికరుద్రాక్షమాలాదు లనియు,
[6]మలయజమృగనాభిమహిత లేపంబులు బహువిధభూతిలేపంబు లనియు,
తే. మధురగానంబు శ్రుతియుక్తమంత్రజాతులనియు, వీణెలు దండబులనియు సతుల
మూర్తులెన్నఁడు నెఱుఁగని [7]ముగుదతపసి వారిఁదాపసులని డాయవచ్చి మ్రొక్కె. 692

వ. ఇట్లు మ్రొక్కిన ఋశ్యశృంగుసుం జూచి నగుచు డగ్గఱి. 693

సీ. 'సేమమే' యని నతుల్ సేతులఁగుచ్చి [8]కర్కశకుచంబులు మోపఁ గౌఁగిలించి,
'చిరతపోనియతి దస్సితి గదా!' యని మోముగంతంబు నాభియుఁ గలయఁ బుడికి,
'క్రొత్తదీపన లివి; గొను' మని వీనులపొంత నాలుకలఁ జప్పుళ్ళుచేసి
'మా వనంబుల పండ్లు మంచివి; తిను మసి పెక్కు భక్ష్యంబులు ప్రీతి నొసఁగి

ఆ. [9]'నూతనాజినంబు నును విదిమే' అని గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి,
మౌని మరవఁజేసి 'మా పర్ణశాలకుఁ బోద' మనుచుఁ గొంచుఁబోయి రతని 694

వ. ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్షపాశబద్ధుండై వారలవెంటం జని రోమపాదుకడకుం బోయిన, నతండు దన ప్రియనందనయైన శాంత నిచ్చి పురంబున నునిచికొనియె; నమ్మునీశ్వరుండు వచ్చిన వర్ష [10]ప్రతిబంధదోషంబు నెడి వర్షంబు గురిసె; నంత. 695

---

1. వడుగఁడు-బ్రహ్మచారి, 2. మత్తికాఁడు-కాముకుఁడు, 3. ఆలోకము-చూపు, 4 ఓడుచు-భయపడుచు, 5. ధమ్మిల్లభారంబులు-కొప్పుయొక్క భారములు, 6. మలయజము-చందనము, 7. ముగుదతపసి-ఏమియు నెఱుఁగని ముని, 8 కర్కశ-కఠినమైన, 9. తే. చర్మవస్త్రము వదలించి భర్మకాంతి, మించిచెలఁగు పీతాంబర మిచ్చి వెనను, మనము సొక్కంగ నతనిఁ జేకొనఁగవారి, మఱుఁగునకుఁ జేరు నతఁడు వేమఱఁగి వారి-పాఠాంతరము, 10. ప్రతిబంధము-ఆటంకము.

ఆ. ఆ నృపాలచంద్రుఁ డనపత్యుఁడై యుండ నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁగూర్చి
[1]యిష్టి సేసి సుతుల నిచ్చె; నాతనికృపఁ [2]బంక్తిరథుఁడు విదపఁ బడసె సుతుల, 696

వ. ఆ రోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకుఁ బృథులాక్షుండును, బృథులాక్షునికి బృహద్రథుండు, బృహత్కర్ముండు, బృహద్భానుండు ననువారు మువ్వురు వుట్టి, రందు బృహద్రథునకు బృహన్మనసుఁడు, బృహన్మనసునకు జయద్రథుండు, జయద్రథునకు విజయుండు, విజయునకు సంభూతి యనుభార్యయందు ధృతియు, నా ధృతికి ధృతవ్రతుండు, ధృతవ్రతునకు సత్యకర్ముండు, సత్యకర్మునకు సతిరథుండును జన్మించిరి. 697

ఆ. కుంతి విన్ననాడు గోరి సూర్యునిఁ బొంద బిడ్డఁ డుదితుఁడైనఁ బెట్టెఁ బెట్టి
గంగనీట విడువఁ గని యతిరథుఁ డంతఁ గర్ణుఁడనుచుఁ గొడుకు గారవించె. 698

వ. ఇట్లతిరథునకుఁ [3]గానీనుండైన కర్ణుండు కొడుకయ్యెఁ; గర్ణునకు వృషసేనుండు వుట్టె, నయ్యయాతికొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుండు, గాంధారునకు ఘర్మండు, ఘర్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ బ్రచేతసుండుఁ, బ్రచేతసునకు నూర్గురు వుట్టి మ్లేచ్ఛాధిపతులయి [4]యుదగ్దిశ నాశ్రయించిరి; తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుండు, భానుమంతునకుఁ ద్రిసానువుఁ, ద్రిసానువునకుఁ గరంధముండును, గరంధమునకు మరుత్తుండు, నతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యెఁ; వినుము. 699

## —: యదువంశచరిత్రము :—

చ. అనఘ; యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలువంశమున్
వినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు ముక్తిఁబొందు న
య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ గావునన్:
వినుము నరేంద్ర! నా పలుకు వీనులపండువుగాఁగఁ జెప్పెదన్. 700

వ. యదువునకు సహస్రజిత్తుఁ గ్రోష్టువు నలుండు రిపుండు ననువారు నలువురు నంభవించి; రందుఁ బెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె; నా శతజిత్తునకు మహాహయ వేణుహయ హేహయులనువారు మువ్వురు జనించి; రందు హేహయునకు ధర్ముండు, ధర్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, గుంతికి మహిష్మంతుండు, మహిష్మంతునికి

1. ఇష్టి-యాగము, 2. పంక్తిరథుఁడు-దశరథుఁడు, 3. కానీనుండు-కన్యకుఁ బుట్టినకొడుకు, 4. ఉదగ్దిశ-ఉత్తరదిక్కు.

భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికిఁ గృతవీర్య కృతాగ్ని కృతకర్మ కృతౌజు లను నలుగురు సంభవించి; రందుఁ గృతవీరునికి నర్జునుండు జనియించె; నతండు. 701

సీ. హరికళాసంజాతుఁడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ బొంది,
బహుయజ్ఞ దానతపంబులు గావించి సకలదిక్కులు గెల్చి జయముతోడ
సతతంబు హరినామసంకీర్తనము సేసి ధనముల నొంది యుదారవృత్తి
నెనుబదియైదు వేలేండ్లు భూచక్రంబు [1]ఘనకీర్తిఁ దనపేరు గాఁగ నేలె;
ఆ. ముదిమి లేక [2]తరుణమూర్తియై యురుకీర్తి నమరెఁ గార్తవీర్యుఁ [3]డనఁగ నిభుఁడు;
నిజము వానిభంగి నేల యేలినయట్టి రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య! 702

వ. అయ్యర్జుననకుం గల పుత్రసహస్రంబునం బరశురామునిబారికిం దప్పి జయధ్వజుండు శూరసేనుండు వృషభుండు మధువు నూర్జితుండు ననువా రేవురు బ్రదికిరి! జయధ్వజునకుఁ దాళజంఘుండును, దాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు గొడుకులును గలిగి; రందుఁ బ్రథముండు వీతిహోత్రుండు; మధువునకు వృష్ణుండు, వృష్ణునకుఁ బుత్రశతంబు పుట్టె; నందుఁ బ్రథముండు వృష్ణి; మఱియు మధు వృష్ణి యదువుల యా వంశంబులవారు మాధవులు, వృష్ణులు, యాదవులు ననం బరఁగిరి; యదుపుత్రుండైన క్రోష్టువునకు వృజినవంతుఁడు, వృజినవంతునకు స్వాహితుండు, స్వాహితునకు భేరుశేకుండు, భేరుశేకునకుఁ జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుండుఁ బుట్టిరి. 703

మ. కృశమధ్యల్ పదివేవు [4]రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స
త్కుశలుండై పదివేలలక్షలు సుపుత్రుల్ భక్తి సేయం జతు
ర్దశరత్నుండును యోగి నాఁ బరఁగి, సప్తద్వీపరాజేంద్రుఁడై
శశిబిందుం డురునీతిమంతుఁ డమరెన్ సత్కాంతిపూర్ణేందుఁడై. 704

వ. అతనికొడుకులమొత్తంబునకు ముఖ్యు లయిన యార్వురలోఁ బృథుశ్రవుండను వానికి ధర్ముండు పుట్టె; ధర్మునకు నుశనుండు వుట్టి నూ ఱశ్వమేధంబులు సేసె; నయ్యుశనునకు రుచకుండు వుట్టె; నా రుచకునకుఁ బురుజిత్తు రుక్ముండు రుక్మేషువు బృథువు జ్యామఘుండు ననువా రేవురు పుట్టి; రందు జ్యామఘుండు. 705

1. గలవెల్ల - పాఠాంతరము, 2. తరుణమూర్తి - యువకుఁడు. 3. దర్జునుండు - పాఠాంతరము, 4. రంగనలునుం గ్రీడింపమోదించు త, త్కుశలుం—పాఠాంతరము.

సీ. తొల్లిటుకొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున ననపత్యుఁ డయ్యెను నన్యభార్యఁ
గైకొన కొకకొంతకాలంబునకుఁ బోయి పగవారియింటను బలిమిఁ బట్టి
యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తెరంగ జననాథుఁ గన్యను శైబ్య సూచి
కోపించి 'మానవ [1]కుహక! యీ వడుచును దెచ్చియు నే నుండఁ దేరిమీఁదఁ

ఆ. బెట్టినాఁడ' వనుచు [2]బిఱుసులు [3]వలుకంగ, నతఁడు పలికె నంత నతివతోడ
'నాకుఁ గోడ; లింత నమ్ము మీ లలితాంగి, సవతి గాదు నీకు; సత్య' మనుచు. 706

వ. అయ్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని యెఱింగి విశ్వేదేవతలును, పితృ దేవత
లును సంతసించిరి; వారల ప్రసాదంబున. 707

క. తన[4] సవతి [5]మొఱఁగి పెనిమిటి తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గనియెం;
దనయుఁ గని జ్యాముఖుండును దన తెచ్చినకన్యఁ దెచ్చి తనయున కిచ్చెన్. 708

వ. ఆ కన్యకయందు విదర్భునకుఁ గుశుండును గ్రథుండును రోమపాదుండునుం బుట్టి; రా
రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకుఁ గృతి, గృతికి నుశికుం
డుశికునకుం జేది, చేదికిఁ జైద్యాదులు వుట్టిరి; క్రథునకుఁ గుంతి, గుంతికి ధృష్టి,
ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు, వ్యోమునకు జీమూ
తుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమరథునకు నవరథుండు, నవరథు
నకు దశరథుండు, దశరథునకు శకుని శకునికిఁ గుంతి, గుంతికి దేవరాతుండు, దేవరాతు
నకు దేవక్షత్త్రుండు, దేవక్షత్త్రునకు మధువు, మధువునకుఁ గురువశుండు, గురువశునకు
నను, ననువునకుఁ బురుహోత్రుఁ, డతనికి నంశు, వతనికి సాత్వతుండు, సాత్వతునకు
భజమానుండును భజియును దివ్యుండును వృష్ణియు దేవావృధుండును నందకుండు మహా
భోజుండును నన నేడ్గురు వుట్టి; రందు భజమానునకుఁ బ్రథమ భార్యయందు నిమ్రోచి
కంకణవృష్ణులు మువ్వురును, రెండవభార్యయందు శతజిత్తు సహస్రజిత్తు నయుతజిత్తు
నన మువ్వురును బుట్టి; రందు దేవావృధునికి బభ్రువు, వీర లిరువుర ప్రభావంబులఁ
బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియింతు; రట్టి శ్లోకార్థం బెట్టి దనిన. 709

తే. వినుము దూరంబునం దేమి వినుచు [6]నుందు; మదియ చూతుము దగ్గఱ నరుగు దేర;
నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేఁడు; [7]యోజ దేవావృధున కెన యొరుఁడు గలఁడె?

---

1. కుహకుఁడు - మోసగాఁడు 2. బిఱుసులు - కఠినములైనమాటలు, 3. వలుకుచు, గొడ్డునీఁగఁగాంతుఁ గొడుకునింక, నాకుఁగోడలయ్యె నమ్ము మీలలితాంగి, సవతి గాదు వినుము సత్యమనియె—పాఠాంతరము. 4. చలువలంతి—పాఠాంతరము. 5. మొఱఁగి - మోసపుచ్చి. 6. నుండు, నదియు చూచుచు దగ్గఱ నరుగుదెంచి—పాఠాంతరము 7. ఓజ - తేజము,

క. పదునాలుగువేవురు నఱువదియేవురు నరులు ముక్తి వడసిరి ఐ్ఠభుం
దుదితుఁడు దేవావృధుఁడును [1]బదపడి యోగంబుఁ దెలియఁ బలికినకతనన్. 711

వ. మహాభోజుం డతిధార్మికుండు; వాని వంశంబువారు భోజు లని పలుకంబడిరి; వృష్ణికి సుమిత్రుఁడు, యుధాజిత్తును జన్మించి; రందు యుధాజిత్తునకు శినియు, ననమిత్రుండును జనించి; రనమిత్రునికి నిమ్నుండు, నిమ్నునికి సత్రాజిత్తుండుఁ, బ్రసేనుండు నన నిరువురు వుట్టిరి; మఱియు ననమిత్రునికి శిని యనువాఁడు వేఱొకండు గలఁ; డతనిపుత్రుండు నత్యకుండును, నతనికి యుయుధానుం డనంబరఁగిన సాత్యకియు, నా సాత్యకికి జయుం డును, జయునకుఁ గుణియు, నా గుణికి యుగంధరుండునుం బుట్టిరి మఱియు; ననమిత్రునకుఁ బృశ్ని యను వేఱొక కొడుకు గలఁడు; వానికిఁ శ్వఫల్కచిత్రకులు గలిగి; రందు శ్వఫల్కునకు గాందినియం దక్రూరుండును, నసంగుండును, సారమేయుండును, మృదుకుండును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్ముండును, క్షత్త్రోపేక్షుండు, నరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, బ్రతిబాహువును నసువారు పన్నిద్దఱు గొడుకులును, సుచారు వను కన్యకయు జనించిరి; వారియం దక్రూరునికి దేవలుండును, ననుపదేవుండును బుట్టిరి; మఱియుఁ జిత్రునకుఁ బృథుండును, విడూరథుండును మొదలుగాఁ గలవారు పెక్కండ్రు వృష్ణివంశజాతులైరి; భజమానుండు, కుకురుడు శుచి, కంబళ, బర్హిషుండునన నలువు రంధకునకుఁ బుట్టిరి; కుకురునికి వృష్ణి, వృష్ణికి విలోమతనయుండు, విలోమతనయునికిఁ గపోతరోముండు, గపోతరోమునికిఁ దుంబురు సఖుం డైన యనువును, ననువునకు దుందుభి, దుందుభికి దవిద్యోతుండు, దవిద్యోతునకుఁ బునర్వసువు, నతనికి నాహుకుం డను కుమారుండు, నాహుకి యను కన్యయుం గలిగి; రా యాహుకునికి దేవకు, దుగ్రసేనుండు నన నిరువురు జనించి; రందు దేవకునికి దేవలుం, డనుపదేవుండు, సుదేవుండు, దేవవర్ధనుం డన నలుగురు గలిగిరి, వారలకు ధృతదేవయు, శాంతిదేవయు, నుపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహదేవయు, దేవకియు ననఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి; వినుము, 712

క. [1]అసదృశలలితాకారలఁ గిసలయకరతలల దేవకీముఖ్యల నా
[2]బిసరుహనయనల నందఱ వసుదేవుఁడు పెండ్లియాడె వసుధాధీశా! 713

వ. ఉగ్రసేనునకుఁ గంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, గహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విసృష్టుండును, దుష్టిమంతుండును నను కొడుకులును, గంసయుఁ, గంసవతియు, సురాభువును, రాష్ట్రపాలికయు నను కూఁతులుం

1. పదపడి—క్రమము, 2. అసదృశ - సాటిలేని, 3. బిసరుహనయనలు-తామరల వంటి కన్నులు కలవారు,.

బుట్టిరి; వారు వసుదేవానుజభార్యలైరి; భజమానునికి విడూరథుండును, విడూరథునికి శినియు, నతనికి భోజుండు, భోజునికి హృదికుండునుం గలిగి; రందు హృదికునికి దేవమీఢుండు. సతథనువు, కృతవర్మయు నను కొడుకులు గలిగి; రా దేవమీఢుండు శూరుండు నన౦బడు; శూరునికి మారిష యను భార్యయందు వసుదేవుండును, దేవభాగుండును, దేవశ్రవుండును. నానకుండును, సృంజయుండును, శ్యామకుండును, గంకుండును, ననీకుండును, వత్సకుండును, వృకుండును ననువారు పదుగురు గొడుకులును, బృథయు, శ్రుతదేవయు. శ్రుతకీర్తియు, శ్రుతశ్రవసయు, రాజాధిదేవియు నను కూఁతు లేవురును బుట్టి; రందు. 714

—: వసుదేవుని వంశక్రమానువర్ణనము :—

ఉ. ధీనయశాలి యైన వసుదేవుఁడు పుట్టినవెంట మింటిపై
[1]నానకదుందుభుల్ మొరసె 'నచ్యుతుఁ డీతనికిం దనూజుఁడై
మానుగఁ బుట్టు' నంచు; గరిమంబున దేవత లుబ్బ రాజపం
చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁడిలన్. 715

క. తన చెలికాఁ డగు కుంతికిఁ దనయులు లే కున్నఁ జూచి తన తనయఁ బృథం
దనయఁగ నిమ్మన శూరుఁడు దనయందలి మైత్రి నిచ్చె ధరణీనాథా! 716

వ. అయ్యింతి కుంతిభోజునింటం బెరుఁగుచుండ నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన నమ్మహాత్మునకుఁ గొన్నిదినంబులు [2]పరిచర్యలు సేసి, వేల్పులం జేరన జీరు విద్యం బడసి యా విద్య [3]లా వెఱుంగ నొకనాఁ డేకాంతంబున [4]వెలుంగుఱేని నాకర్షించిన, నా దేవుండు వచ్చినం జూచి వెఱఁగుపడి యి ట్లనియె. 717

క. 'మంత్రపరీక్షార్థం బభిమంత్రించితిఁ గాని, దేవః మదనక్రీడా
తంత్రంబుఁ గోరి చీరను మంత్రించిన తప్పు సైఁచి మరలు దినేశా!' 718

వ. అనిన నయ్యువిదకుఁ బద్మినీవల్లభుం డిట్లనియె. 719

మ. 'తెఱవా! నీ [5]పలు కట్ల యౌ; [6]నసదులే దేవోత్తమాహ్వానముల్?
మొఱఁగం బోలునె? వేల్పులం బడయుటల్ [7]మోఘంబులే? నీకు పి
తఱి గర్భం బగుఁ; బుత్రుఁడుం గలుగు; నీ [8]తారుణ్యముం బూజ్య మౌ;
వెఱవం గార్యము లేదు; సిగ్గు దగునే! వ్రీడావినమ్రాననా!' 720

1. ఆనకము - భేరి. 2. భక్తింజేసి - పాఠాంతరము, 3. లావు - ప్రభావము, 4. వెలుంగుఱేఁడు—సూర్యుఁడు, 5. ప్రతిమాగృహాటనము లే-పాఠాంతరము, 6. అసదులు - అల్పములు, 7. మోఘంబులు - వ్యర్థములు, 8. తారుణ్యము-యౌవనము,

చ. అని తగ నియ్యకొల్పి లలితాంగికి గర్భము సేసి మింటికిం
జనియె దినేశ్వరుం; డపుడు సక్కని రెండవ సూర్యుఁడో యనం
దనరెడు పుత్త్రుఁ గాంచి కృప దప్పి జగ [1]జ్జనవాదభీతయై
తనయుని [2]నీటఁ బో విడిచి తా నరిగెం [3]బృథ దండ్రియింటికిన్. 721

వ. అయ్యువిదను నీ ప్రపితామహుం డైన పాండురాజు వివాహం బయ్యెఁ; నయ్యంగనకుఁ బాండురాజువలన ధర్మజభీమార్జునులు పుట్టి; రమ్మగువచెల్లెలగు శ్రుతదేవను గారూషకుం డైన వృద్ధశర్మ పెండ్లి యాడె; నయ్యిద్దఱకు మునిశాపంబున దంతవక్త్రుఁ డను దాన వుండు జన్మించె; దానితోడంబుట్టు వగు శ్రుతకీర్తిని గేకయరాజయిన ధృష్టకేతుండు పెండ్లియాడె! నా దంపతులకుఁ బ్రతర్దనాదు లేవురుపుట్టిరి; దాని [4]భగిని యైన రాజాధి దేవిని జయత్సేనుండు పరిణయం బయ్యెఁ; నా మిథునంబునకు విందానువిందులు సంభ వించిరి; చేదిదేశాధిపతియైన దమఘోషుండు శ్రుతశ్రవసను బరిగ్రహించె; వారలకు శిశుపాలుం డుదయించె; వసుదేవునితమ్ముఁడైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు, బృహద్బలు లిరువురు జనించిరి. వాని భ్రాత యగు దేవశ్రవుండనువానికిఁ గంసవతి యందు వీరుండును, నిషుమంతుడును [5]నుప్పతిల్లిరి; వానిసోదరుం డయిన కంకునికిఁ గంక యనుదానికి బకుండు, సత్యజిత్తుఁ బురుజిత్తునను వా [6]రుద్భవిల్లిరి; వాని సహజుం డయిన సృంజయునికి రాష్ట్రపాలియందు వృషదుర్మర్షణాదు లావిర్భవించిరి; వాని యనుజాతుం డయిన శ్యామకునకు సురభూమియందు హరికేశహిరణ్యాక్షులు ప్రభ వించిరి; వాని తమ్ముండైన వత్సుండు మిశ్రకేశి యను నప్సరసయందు వృకాదిసుతులం గనియె, వాని యనుజుండైన వృకుండు దూర్వాక్షియందు దక్షపుష్కరసాళ్వాదుల నుత్పాదించె; వాని [7]జఘన్యజుం డయిన యనీకుండు సుదామని యనుదానియందు సుమిత్రానీక బాణాదు లయిన కొడుకులం బడసె; వాని యనుజుండైన యానకుండు గర్ణికయందు ఋతధామజయులం గాంచె; వసుదేవునివలన రోహిణియందు బలుండును, గదుండును, సారణుండును దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును, గృతాదు లును, బౌరవియందు సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును, భూతాదులుం గూడఁ బన్నిద్దఱును, మదిరయందు నందోపనందకృతకశ్రుతశూరాదు లును, గౌసల్యయందుఁ గేశియు, రోచనయందు హస్తహేమాంగదులును, నిళయందు యదుముఖ్యు లయిన యురువల్కలాదులును, ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును శాంతి దేవయందుఁ బ్రశ్రమప్రశ్రితాదులును, నుపదేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును, శ్రీదేవయందు వసుహంస సుధన్వాదు లార్గురును, దేవరక్షితయందు గదాదులు దొమ్మం

1. జనవాదము-నింద, 2. నేటిలో - పాఠాంతరము, 3. పృథ - కుంతీదేవి, 4. భగిని-సోదరి, 5. ఉప్పతిల్లిరి-పుట్టిరి, 6. ఉద్భవిల్లిరి-పుట్టిరి, 7. జఘన్యజుఁడు-తమ్ముఁడు.

ద్రుడును, సహదేవయందుఁ బురూఢశ్రుతముఖ్యు లెనమండ్రుడును, దేవకియందుఁ గీర్తి మంతుండును, సుషేణుండును, భద్రసేనుండును బుజువును, సమదనుండును, భద్రుం డును, సంకర్షణుండును ననువా రేడ్వురును బుట్టిరి; మఱియు. 722

క. దుష్టజన [1]నిగ్రహంబును శిష్టజనానుగ్రహంబు సేయుటకొఱకై
యష్టమగర్భమున గుణో త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్. 723

ఆ. విష్ణుఁ డుదితుఁ డైనవెనుక నా దేవకి భద్రమూర్తి యగు సుభద్రఁగనియె;
నా గుణాఢ్య మత్త [2]వగు నీకు నర్జును [3]దయిత యగుటఁజేసి ధరణినాథ! 724

క. ఎప్పుడు ధర్మక్షయ మగు నెప్పుడు పాపంబు వొడము నీ లోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి దప్పక విభుఁ డయ్యు దన్నుఁ దా సృజియించున్. 725

క. తనమాయ లేక పరునకు ఘనునకు నీశ్వరుప కాత్మకర్తకు హరికిన్
జనములకుఁ గర్మములకును మనుజేశ్వర! కారణంబు మఱియును గలదే? 726

క. తలఁపఁగ నెవ్వని మాయావిలసనములు జననవృద్ధివిలయంబులకుం
గలిమి కనుగ్రహమోక్షం బులకును జీవునికి మూలములునా నెగడున్. 727

సీ. అట్టి సర్వేశుని కరయంగ జన్మాదిపరతంత్రభావ మెప్పాటఁ గలదు?
రాజలాంఛనముల రాక్షసవల్లభు లక్షౌహిణీశులై యవనిఁ బుట్టి,
జనులను బాధింప శాసించుకొఱకునై సంకర్షణునితోడ జనన మంది,
యమరుల మనములకైన లెక్కింపంగ గాకుండునట్టి కర్మములఁజేసి,
తే. కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల దుఃఖశోకతమంబులఁ [4]దొలఁగ జడిసి,
[5]నేల్ద్రవేఁ గెల్ల వారించి నిఖిలదిశల విమలకీర్తులు వెదచల్లి వెలసె శౌరి. 728

క. మంగళహరికీర్తిమహాగంగామృత మించుకైనఁ గర్ణాంజలులన్
సంగతము సేసి ద్రావఁ దొలంగును గర్మంబు[6][7]లావిలం బగుచు నృపా? 729

క. వనజాక్షుని మందస్మిత ఘనకుండలదీప్తిగండకలితాననమున్
వనితలుఁ బురుషులుఁ జూచుచు ననిమిషభావంబు లేమి కలయుదు రధిపా! 730

1. నిగ్రహంబు-అణఁచివేయట, 2. మగు-పాఠాంతరము, 3. దయిత - భార్య, 4. తొలఁగజడిసి - నశింపఁజేసి, 5 నేల్ద్రవేఁగు - భూభారము. 6. ద్రవిమలంగుచు - పాఠాంతరము, 7. ఆవిలంబగుచు - కలకఁబాఱుచు.

సీ. జనకుని గృహమున జన్మించి మందలోఁ బెరఁగి శత్రుల నెల్లఁ [1]బీఁచమడఁచి
పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతంబులఁ గాంచి తను నాదిపురుషుఁగూర్చి
క్రతువులు పెక్కులు గావించి, పాండవ కౌరవులకు నంతఁ గలహ మయిన
నందఱ నమయించి, యర్జును గెలిపించి, యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి,
తే. మగధపాండవసృంజయమధు దశార్హ భోజవృష్ణ్యంధకాదిసంపూజ్యుఁ డగుచు
నుర్వీభరము నివారించి యుండనొల్ల కా మహామూర్తి నిజమూర్తియందుఁ బొందె. 731

చ. నగుమొగమున్, సుమధ్యమును, నల్లనిదేహము, లచ్చి కాటప
ట్టగు నురమున్, మహాభుజము, లంచితకుండలకర్ణముల్, మదే
భగతియు, నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్ముగఁ బొడనూపుఁగాతఁ, గనుమూసినయప్పుడు విచ్చునప్పుడున్. 732

వ. అని చెప్పి. 733

క. జనకసుతాహృచ్చోరా! జనకవచోలబ్ధవిపినశైలవిహారా!
జనకామితమందారా! జనకాదిమహీశ్వరాతిశయసంచారా! 734

మాలిని. జగ[2]దవనవిహారీ! శత్రులోకప్రహారీ! సుగుణవనవిహారీ! సుందరీమానహారీ!
విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ! స్వగురుహృదయతోషీ! సర్వదానత్యభాషీ! 735

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు సూర్య వంశారంభంబును, వైవస్వతమనువుజన్మంబును, హైమచంద్ర కథనంబును, సుద్యు మ్నాదిమనుసూనుల చరిత్రంబును, మరుత్తతృణబిందు శర్యాతి కకుద్మి నగర నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషునియందుఁ బ్రయోగింపంబడిన దుర్వాసుని కృత్య నిరర్థక యగుటయు, నిక్ష్వాకు వికుక్షి మాంధాతృ పురుకుత్స హరిశ్చంద్ర సగర భగీరథ ప్రముఖుల చరిత్రంబులును, భాగీరథీ ప్రవాహవర్ణనంబును, గల్మాషపాదఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్రకథనంబును, దదీయవంశపరంపరాగణనం బును, నిమికథయును, జంద్రవంశారంభంబును, బుధపురూరవుల కథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును, విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవప్రముఖుల వృత్తాంతంబును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదుల చరిత్రంబును, శ్రీకృష్ణావతారకథాసూచనంబును నను కథలు గల నవమస్కంధము.

1. పీఁచమడఁచి - చావఁగొట్టి 2. అవనము - రక్షణము.

శ్రీ రామచంద్రాయ నమః

# శ్రీమహాభాగవతము

## దశమస్కంధము - పూర్వభాగము

శ్రీకంఠచాప[1]ఖండన! [2]పాకారిప్రముఖవినుతభండన! విలస
త్కాకుత్స్థవంశమండన! రాకేందుయశోవిశాల! రామనృపాలా! 1

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యావైఖరీసమేతుండయిన
సూతుం డి ట్లనియె; నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

### —: శ్రీకృష్ణకథాప్రారంభము :—

క. తెలిపితివి [3]సోమసూర్యుల కులవిస్తారంబు; వారికులము ధరిత్రీ
శుల నడవళ్లను వింటిమి; కలరూపము లెల్ల మాకుఁ గడు వెలుఁగులుగన్. 3

క. శీలము గల యదుకులమున నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు విష్ణుం?
డే లీల మెలఁగె? నే యే వేళల నేమేమి సేసె? వివరింపు తగన్. 4

క. [4]భవములకు మందు; చిత్త శ్రవణానందము; ముముక్షుజనపదము; హరి
స్తవము పశుఘ్నుఁడు దక్కను జెవులకుఁ దని వయ్యె ననెడి చెనఁటియు గలఁడే! 5

క. మా పెద్దలు మను వేల్పులు నోపని భీష్మాదికురుకులోత్తమసేనా
కూపారము [5]నే [6]కోలము ప్రాపున లంఘించి రొక్కబాలపదముగాన్. 6

---

1. శ్రీకంఠచాపము - శివునివిల్లు, 2 పాకారి - ఇంద్రుఁడు, 3. సోముఁడు - చంద్రుఁడు, 4. భవము - సంసారము, జన్మము, 5. మేకలము పెన్ - పాఠాంతరము. 6. కోలము - తెప్ప,

క. మా యమ్మకుక్షి గురుసుతసాయకపీడితుఁడనైన జడు నన్నును గౌం
తేయకురుకులము [1]నిలుపఁగ [2]నా యుత్తముఁ డాత్తచక్రుఁడై రక్షించెన్. 7

ఆ. కలసి పురుషమూర్తి కాలరూపములను లోకజనులవెలిని లోననుండి
జన్మమృత్యువులను సంసారముక్తుల నిచ్చు నతనిచరిత మెల్లఁ జెపుమ. 8

సీ. ఊహించి రాముఁడు రోహిణికొడు కంచు నప్పుడు యోగీంద్ర చెప్పి తీవు;
దేవకికడుపున నే వెరవున నాతఁ డుండెను దేహంబు నొందు లేక ?
తనతండ్రి యిలు వాసి వనజాక్షుఁ డే రీతి [3]మందకుఁ బోయె ? నే మందిరమున
నుండి యెయ్యది సేయుచుండెను ? దనమేనమామ కంసుని నేల నామమడఁచె ?
ఆ. నెన్ని యేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై ? యెందఱౌరి భార్య ? లెట్లు మెలఁగె ?
మఱియు నేమి సేసె ? మాధవుచారిత్ర మెంత గలదు ? నాకు నేర్పరింపు. 9

వ. అని మరియు ని ట్లనియె. 10

ఆ. నీ ముఖాంబుజాతనిర్ముక్తహరికథామృతముఁ ద్రావఁ ద్రావ మేను వొదలె;
[4]వంత మానె; నీరువట్టు నాఁకలియును దూర మయ్యె; మనము దొంగిలించె. 11

వ. అని వలుకుచున్న రాజుమాటలు విని [5]వైయాసి యి ట్లనియె. 12

క. 'విష్ణు కథా [6]రతుఁడగు నరు విష్ణుకథల్ సెప్పు నరుని వినుచుండు నరున్
విష్ణుకథాసంప్రశ్నము [7]విష్ణుపదీజలముభంగి విమలులఁ జేయున్. 13

సీ. రాజేంద్ర ! విను తొల్లి రాజలాంఛనముల వేలసంఖ్యల దైత్యవిభులు దన్ను
నాక్రమించిన భార మాఁగఁజాలక, భూమి గోరూపయై బ్రహ్మఁ జేరఁ బోయి,
కన్నీరు మున్నీరుగా రోదనము సేయఁ, గరుణతో భావించి కమలభవుఁడు
ధరణి నూఱడఁ బల్కి, ధాత్రియు వేల్పులుఁ గదలి రా విష్ణునిఁ గాన నేఁగి
తే. పురుషసూక్తంబుఁ జదివి, యద్భుతసమాధి నుండి, యొకమాట విని వారిజోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే విన్నయట్టి పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ.

1. మొదలుగ - పాఠాంతరము, 2. నేయుత్తముఁ డాచక్రితుఁ డెడ రక్షించెన్ - పాఠాంతరము, 3. మంద -గొల్లపల్లె, 4. వంత - విచారము, 5. వైయాసి - శుకుఁడు, 6. రతిగలిగిన, విష్ణుకథల్ చెప్పుచున్న విన్న నడిగినన్, విష్ణుకథాసంప్రశ్నము - పాఠాంతరము, 7. విష్ణుపదీజలము - గంగాజలము

క. యాదవకులమున నమరులు మేదినిపైఁ బుట్టజనుఁడు; మీ యంశములన్
శ్రీదయితుఁడు వసుదేవున కాదరమునఁ బుట్టి భార మంతయుఁ బాపున్. 15

క. హరిపూజార్థము పుట్టుఁడు సురకన్యలు భూమియందు సుందరతనులై
హరి కగ్రజుఁడై శేషుఁడు హరికళతోఁ బుట్టు దత్ప్రియారంభుండై. 16

ఆ. ఈ ప్రపంచ మెల్ల నేమాయచే మోహితాత్మ మగుచు నుండు, నట్టి మాయ
కమలనాభు నాజ్ఞఁ గార్యార్థమై నిజాంశంబుతోడఁ బుట్టు జగతియందు.' 17

వ. అని యిట్లు వేల్పుల నియ్యకొలిపి పుశమిముద్దియ నొడంబఱిచి [1]తమ్మిచూలి దన మొదలి నెలవునకుం జనియె; నంత యదువిభుండయిన శూరసేనుం డనువాఁడు మథురాపురంబు దనకు రాజధానిగా మాథురంబులు, శూరసేనంబు లనియెడు దేశంబు లేలెం; బూర్వ కాలంబున. 18

క ఏ మథురయందు నిత్యము శ్రీమన్నారాయణుండు సెలఁగుఁ బ్రియముమై
నా మథుర సకలయాదవభూమీశుల కెల్ల మొదలిపురి యయ్యె నృపా! 19

సీ. ఆ శూరసేనున కాత్మజుండగు వసుదేవుఁ డా పురి నొక్కదినమునందు
దేవకిఁ బెండ్లియై దేవకియును దానుఁ గడువేడ్క రథ మెక్కి కదలువేళ
నుగ్రసేనునిపుత్త్రుఁ డుల్లాసి కంసుండు చెల్లెలు మఱఁదియు నుల్లసిల్ల
హరులవగ్గముఁ జేనంది [2]రొప్పఁదొడంగె ముందట భేరులు [3]మురజములును
ఆ. శంఖపటహములును జడిగొని మ్రోయంగఁ గూఁతుతోడివేడ్క కొనలుసాఁగ
దేవకుండు సుతకు దేవకీదేవికి, [4]నరణ మీఁ దలంచి యాదరించి. 20

వ. సార్థంబులయిన రథంబుల వేయునెనమన్నూటిని, గనకదామసముత్తుంగంబు లయిన మాతంగంబుల నన్నూటిని, బదివేలతురంగంబులను, విలాసవతులయిన దాసీజనంబుల నిన్నూటిని నిచ్చి, యనిచినం గదలి [5]వరవధూయుగళంబు దెరువునం జను నమయంబున. 21

క. వగ్గములు వదలి వేగిర మగ్గలముగ రథముఁ గడపు నా కంసుఁడు లో
[6]బెగ్గిలి యెగ్గని తలఁపఁగ దిగ్గన నశరీరవాణి దివి నిట్లనియెన్. 22

1. తమ్మిచూలి - బ్రహ్మ, 2, రొప్పుట- త్రోలుట, 3 మురజములు—మృదంగములు, 4. అరణము-కట్నము, 5 వరవధూయుగళంబు-దంపతులిద్దరు, 6. బెగ్గిల నెగ్గల తలఁపక - పాఠాంతరము.

క. 'దుష్ట యగు భగిని మెచ్చఁగ నిష్టుఁడవై రథము గడపె; దెఱుఁగవు మీఁదన్;
శిష్ట యగు నీతలోదరి యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ!' 23

వ. అని యిట్లాకాశవాణి పలికిన సులికిపడి భోజకుల[1]పాంసనుండైన కంసుండు నంచల దంసుండై యడిదంబు బెడిదంబుగాఁ బెఱికి జళిపించి దెప్పరంబుగ ననుజకొప్పుఁ బట్టి [2]కప్పరపాటున నొప్పులం దిగిచి యొడిసిపట్టి, తోఁబుట్టువని తలంపక తెంపుసేసి తెగ వ్రేయ గమకింఁచు సమయంబున వసుదేవుండు డగ్గఱి. 24

క. ఆ పాపచిత్తు మత్తుం గోపాగ్నిశిఖానువృత్తు గొనకొని తన స
ల్లాపామృతధారావిశేషంబునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్. 25

ఉ. 'అన్నవు నీవు చెల్లెలికి; నక్కడ! మాడలు నీర లిచ్చుటో!
మన్నన సేయుటో? మధురమంజులభాషల నాదరించుటో?
'[3]మిన్నులమ్రోఁతలే నిజము, మే' అని చంపకుమన్న! మాని రా
వన్న! సహింపుమన్న! తగదన్న! వధింపకుమన్న! వేఁడెదన్, 26

వ. అదియునుంగాక. 27

మ. చెలియల్; గన్నియ; ముద్దరా; లబల; నీసేమంబ చింతించు; ని
ర్మల; దీనిన్ బయ లాడుమాటలకునై మర్యాదఁ బోఁదట్టి, స
త్కులజాతుండవు పుణ్యమూర్తి వకటా! గోపంబు పాపంబు; నె
చ్చెలి, నోహో? తెగవ్రేయఁ బాడి యగునే! చింతింపు భోజేశ్వరా! 28

సీ. మేనితోడన పుట్టు మృత్యువు జనులకు; నెల్లి నేడైనఁ నూరేండ్లకైనఁ;
[4]దెల్లంబు మృత్యువు; దేహంబు [5]పంచత నందఁ గర్మానుగుఁడై శరీరి
మాఱు దేహము నూఁది, మఱి తొంటి దేహంబుఁ బాయును దన పూర్వభాగమెత్తి;
వేఱొంటిపైఁ బెట్టి వెనుకభాగం బెత్తి [6]గమనించు [7]తృణజలూకయును బోలె;

ఆ వెంటవచ్చు కర్మవిసరంబు; మును మేలు గన్నవేళ నరుఁడు గన్నవిన్న
తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ బాడితోడఁ గానఁబడినయట్లు. 29

క. తనతొంటికర్మరాశికి ననుచరమై బహువికారమై మనసు వడిం
జను; నింద్రియములతెరువులఁ దనువులు పెక్కైనఁ జెడవు తనకర్మంబుల్. 30

---

1. పాంసనుఁడు-దూషకుఁడు, 2. కప్పరపాటు-తొట్రుపాటు, 3. మిన్నుల మ్రోఁతలు- ఆకాశముపైనుండి వినవచ్చు ధ్వనులు, 4. తెల్లంబు-స్పష్టము, 5. పంచత-మరణము, 6. గమనించు-నడచు, 7. తృణజలూక-గడ్డిజలగ.

ఆ. జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు గానఁబడుచు గాలిఁ గదలు భంగి
నాత్మకర్మనిర్మితాంగంబులను బ్రాణి గదలుచుండు రాగకలితుఁ డగుచు. 31

క. కర్మములు మేలు నిచ్చును; గర్మంబులు గీడు నిచ్చు; గర్తలు దనకుం
గర్మములు బ్రహ్మకైనను; గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్? 32

క. కావునఁ బరులకు హింసలు గావింపఁగవలదు; తనకుఁ గల్యాణముగా
భావించి పరుల [1]నొంచినఁ బోవునె? తత్ఫలము విడపఁ బొందక యున్నే? 33

మత్త. వావిఁ జెల్లెలు గాని [2]పుత్రికవంటి; దుత్తమురాలు; సం
భావనీయచరిత్ర; భీరువు; బాల; నూత్నవివాహ, సు
శ్రీవిలాసిని; దీన కంపితచిత్త నీ కిదె మ్రొక్కెడిం;
గావవే! కరుణామయాత్మక! కంస! మానవవల్లభా! 34

వ. అని మఱియు సామరూపంబులగు పలుకులు పలికిన వినియు వాఁడు వేఁడి చూపుల
రాలు నిప్పులు గుప్పలుగొన [3]ననుకంప లేక, తెంపుసేసి చంపకగంధిం జంపఁ జూచుట
యెఱింగి మొఱంగెడితెఱంగు విచారించి తనలో ని ట్లనియె. 35

క. 'ఎందును గాలము నిజ మని పందతనంబునను బుద్ధిఁ బాయక ఘనులై
యొందాఁక బుద్ధి నెగడెడి నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్.' 36

వ అని నిశ్చయించి. 37

సీ. ఆపన్నురాలైన యంగన రక్షించి సుతుల నిచ్చెద నంట శుభము నేఁడు;
మీఁ దెవ్వఁ డెఱుఁగును? మెలఁత ప్రాణంబుతో నిలిచిన మఱునాఁడు నేరరాదె?
సుతులు పుట్టిరయేని సుతులకు మృత్యువు [4]వాలాయమై వెంట వచ్చెనేని
బ్రహ్మచేతను వీఁడుపా టేమియును లేకయుండునే? సదుపాయ మొకటి లేదె?
తే. [5]పొంతమ్రాఁకులఁ గాల్పక పోయి వహ్ని యెగని దవ్వులవాని దహించుభంగిఁ
గర్మవశమున భవమృతి కారణములు దూరగతిఁ బొందు; నిఁక నేల్తొట్రుపడఁగ? 38

క కొడుకుల నిచ్చెద నని నతి విడిపించుట నీతి; వీఁడు విడిచినమీఁదం
గొడుకులు పుట్టినఁ గార్యము [6]దడఁబడదే? నాఁటి కొక్క దైవము లేదే? 39

---

1. నొంచిన-బాధింపఁగా, 2. కూఁతురు-పాఠాంతరము, 3. అనుకంప-దయ,
4 వాలాయము-తప్పకవచ్చునది. 5. పొంతమ్రాఁకులు-దగ్గఱిచెట్లు, 6. తడఁబడదే?-
తాఱుమాఱులు కాదా?

క. ఎనిమిదవ చూలు నీనిం దునుమాడెడి నంచు మింటఁ దోరపు బలుకుల్
వినఁబడియె; నేల తప్పును? వనితను విడిపించు టొప్పు [1]వైళం బనుచున్; 40

క. తిన్ననిపలుకులు వలుకుచుఁ గ్రన్నన తగఁ బూజ చేసి కంసు [2]నృశంసున్
మన్నించి, చిత్త [3]మెరియఁ బ్రసన్నాననుఁడగుచుఁ బలికె [4]శౌరి నయమునన్. 41

క. 'లలనకుఁ బుట్టిన కొమరుని వలనం దెగె దనుచు గగనవాణి వలికె నం
చలిగెదవేని, మృగాక్షికిఁ గల కొడుకులఁ జంప నిత్తుఁ గ్రమమున నీకున్' 42

వ. అని యిట్లు పలికిన విని కంసుండు కంపితావతంసుండై సంతసించి గుణగ్రహిత్వంబు గైకొని కొందఱమందు చెలియలి ముందల విడిచి చనియె; వసుదేవుండును బ్రదుకుమందలఁ గంటి ననుచు సుందరియుం దానును మందిరంబునకుంబోయి డెందంబున నానందంబు నొంది యుండె; నంతఁ గొంతకాలంబు సనిన సమయంబున. 43

క. విడువక కంసుని [5]యెగ్గులఁ బడి దేవకి నిఖిల దేవభావము దనకే
ర్పడ నేఁట నొకనిలెక్కను గొడుకుల నెనమండ్ర నొక్కకూఁతుం గనియెన్. 44

వ. అందు. 45

ఆ. సుదతి మున్ను గన్నసుతుఁ గీర్తిమంతునిఁ బుట్టతడవ కంసభూవరునకుఁ
దెచ్చి యిచ్చెఁ జాల ధృతి గల్గి వసుదేవుఁ డాసపడక సత్యమందు నిలిచి. 46

క. పలికిన పలుకులు దిరుగక సొలయక వంచనము లేక సుతుల రిపునకుం
గలఁగక యిచ్చిన ధీరుం డిల వసుదేవుండు దక్క నితరుఁడు గలఁడే? 47

ఆ. మానవేంద్ర! సత్యమతికి దుష్కర మెయ్య? దెఱుక గలుగువాని కిష్ట మెయ్య?
దీశభక్తిరతుని కీరాని దెయ్యది? యెఱుక లేనివాని కేది కీడు? 48

వ. ఇట్లు సత్యంబు దప్పక కొడుకు నొప్పించిన వసుదేవుని పలుకు నిలకడకు మెచ్చి కంసుం డి ట్లనియె. 49

ఆ. కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము వసుదేవ! వెఱపు లేదు నాకు వీనివలన;
నల్గ వీనికి; భవదష్టమపుత్రుండు, మృత్యు వఁట! వధింతు మీఁద నతని. 50

---

1. వైళంబు-వేగము, 2 నృశంసుఁడు-క్రూరుఁడు, 3. ఎరియ-మండఁగా, 4. శౌరి-వసుదేవుఁడు, 7 ఎగ్గులు-బాధలు.

వ. అనిన [1]నానకదుందుభి నందనుం గొని చనియు నానందంబు నొందక, దుష్టస్వభావుం డగు బావవలుకులు వినియు నులుకుచుండె; నంత. 51

సీ. ఒకనాఁడు నారదుం డొయ్యన కంసుని యింటికిఁ జనుదెంచి యేకతమున
'మందలోపల నున్న నందాదులును, వారి భార్యలుఁ బుత్రులు బాంధవులును,
దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁ డాదిగాఁ గల సర్వయాదవులును,
సురలు గాని, నిజంబు నరులుగా' రని చెప్పి 'కంసుండ ! నీవు రక్కసుఁడ' వనియు

ఆ. 'దేవమయుఁడు చక్రి దేవకీదేవికిఁ బుత్రుఁడై జనించి భూతలంబు
సెఱుపఁ బుట్టినట్టి [2]చెనఁటిదైత్యుల నెల్లఁ జంపు' ననుచుఁ జెప్పి చనియె దివికి. 52

క. నారదుమాటలు విని పెల్లారాటముఁ బొంది యదువు [3]లనిమిషు లనియున్,
నారాయణకరఖడ్గవిదారితుఁడగు కాలనేమి దా ననియు మదిన్. 53

మ. కలఁగంబాఱి, మహాంధ్ఁ జెల్లెలి నుదగ్రక్రోధుఁడై పట్టి బ
ద్ధులఁ గావించి, హరిం దలంచి వెసఁ దోడ్తో వారు గన్నట్టి పు
త్రులఁ జంపెన్; గురు నుగ్రసేను [4]యదుఁ దదోర్భోజాంధకాధీశు ని
ర్మలుఁ బట్టెం గడు [5]వాలి, యేలెఁ [6]జల మారన్ శూరసేనంబులన్, 54

ఆ. తల్లిఁ, దండ్రినైనఁ, దమ్ముల నన్నల, నఖులనైన, బంధుజనులనైన,
రాజ్యకాంక్షఁజేసి రాజులు నంపుదు రవనిఁ దఱచు జీవితార్థులగుచు. 55

వ. మఱియు బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టి కారిష్ట ద్వివిద పూతనాదిసహాయసమేతుండై కంసుండు గదనంబున మదంబు లడంచిన, [7]వదనంబులు వంచికొని, సదనంబులు విడిచి యదనలై, యదువులు పదవులు వదలి నిషధకురుకోసలవిదేహవిదర్భకేకయపాంచాలసాల్వ [8]దేశంబులు సొచ్చి, మచ్చరంబులు విడిచి కొందఱు కంసునిం కొలిచి నిలిచి; రంత. 56

క. [9]తొడి తొడిఁ గంసుఁడు దేవకి కొడుకుల నార్వుర వధింప గురు శేషాఖ్యం
డొడ వగు హరిరుచి యాసతి కడుపున నేడవది యైన గర్భం బయ్యెన్. 57

---

1. ఆనకదుందుభి - వసుదేవుఁడు, 2. చెనఁటిదైత్యులు - క్రూరరాక్షసులు, 3. అనిమిషులు - దేవతలు, 4. నచలదోర్భోజా - పాఠాంతరము, 5. వాలి - అతిశయించి, 6. చలము - పట్టుదల 7. వదనంబులు - ముఖములు, 8. రాజులు గొలిచిరి-పాఠాంతరము, 9. తొడితొడి - త్వరత్వరఁగా.

వ. అయ్యవసరంబున విశ్వరూపుండగు హరి దన్ను నమ్మిన యదువులకుఁ గంసుని వలన
భయంబు గలుగు నని యెఱింగి యోగమాయాదేవి కి ట్లనియె. 58

సీ. 'గోపికాజనములు, గోపాలకులు నున్న వసులమందకుఁ బొమ్ము భద్ర ! నీవు
వసుదేవుభార్యలు వరుసఁ గంసునిచేత [1]నాఁకలఁ బడి యుండ నందుఁ జారక
తలఁగి రోహిణి యను తరళాక్షి నందగోకులమందు నున్నది గుణగణాఢ్య;
దేవకికడుపున దీపించు శేషాఖ్య మైన నాతేజ మీ వమరఁ బుచ్చి
ఆ. నేర్పు మెఱసి రోహిణీదేవికడుపునఁ [2]జొనుపు; దేవకికిని సుతుఁడ నగుదు;
నంశభాగయుతుఁడనై యశోదకు నందు; పొలఁతి కంత మీఁదఁ బుట్టె దీవు. 59

క. నానావిధసంపదలకుఁ [3]దానకమై, సర్వకామదాయినివగు నిన్
మానవులు భక్తిఁ గొలుతురు; కానికలను బలులు నిచ్చి కల్యాణ[4]మయీ ! 60

వ. మఱియు నిన్ను మానవులు దుర్గ భద్ర కాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ
మాధవి కన్యక మాయ నారాయణి యీశాన శారద యంబిక యను పదునాలుగు నామం
బులం గొనియాడుదు రయ్యె స్థానంబులయం' దని యెఱింగించి సర్వేశ్వరుండగు హరి
పొ మ్మని యాన తిచ్చిన మహాప్రసాదం బని యయ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి
చయ్యన నియ్యెల కయ్యెడ వాసి వచ్చి. 61

తే. దేవకీదేవికడుపులోఁ దేజరిల్లు దీప్తగర్భంబు మెల్లన తిగిచి, యోగ
నిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ గడుపు దిగె నంచుఁబౌరులు గలఁగఁబడఁగ. 62

వ. అంత. 63

ఆ. బలము మిగులఁ గలుగ 'బలభద్రుఁ' డన లోక రమణుఁడగుటఁజేసి 'రాముఁ'డనఁగ
నతికిఁ బుట్టె గర్భ [5]సంకర్షణమున సంకర్షణుం డనంగ ఘనుఁడు సుతుఁడు. 64

వ. తదనంతరంబ. 65

క. ఆనకదుందుభి మనమున శ్రీనాథుం డంశభాగశిష్టతఁ జొరఁగన్
భానురుచి నతఁడు వెలిఁగిన గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా ! 66

---

1. ఆఁకలు - చెఱలు, 2. చొనుపు - ప్రవేశపెట్టుము, 3. తానకము - చోటు,
4. ముగన్ - పాఠాంతరము, 5. సంకర్షణము - లాగుట.

ఉ. ఆ వసుదేవుఁ డంతఁ దనయం దఖిలాత్మక మాత్మభూతముం
బానన రేఖమున్ భువనభద్రమునై వెలుఁగొందుచున్న ల
క్ష్మీవిభుతేజ మచ్చుపడఁ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో
దేవకి యొప్పెఁ [1]బూర్వ యగు దిక్సతి చంద్రునిఁ దాల్చుకైవడిన్.' 67

వ. అనిన విని తరువాతివృత్తాంతం బెట్లయ్యె నని రా జడిగిన శుకుం డి ట్లనియె: 68

క. గురుతరముగఁ దన కడుపున సరసిజగర్భాండభాండచయములు గల యా
హరి దేవకికడుపున భూ భరణార్థము వృద్ధిఁ బొందె బాలార్కుక్రియన్, 69

వ. అంత. 70

సీ. [2]విమతుల మోములు వెలవెలఁ బాఱంగ విమలాస్యమోము వెల్వెలుకఁ బాఱె;
మలయు వైరులకీర్తి మాసి నల్లన గాఁగ నాతిచూచుకములు నల్ల నయ్యెఁ;
దుష్టాలయంబుల ధూమరేఖలు వుట్ట లేఁమయారున రోమ[3]లేఖ మెఱసె;
నరిమాననముల కాహారవాంఛలు దప్ప వనజాక్షి కాహారవాంఛ దప్పె;
తే. శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర; జడత వాటిల్లె శత్రులు [4]జడనుపడఁగ;
మన్ను రుచి యయ్యెఁ బగతురు మన్నుసొరఁగ; వెలఁదియుదరంబులో హరివృద్ధిఁ బొంద.

వ. మఱియును. 72

సీ. నలిన మా యెలనాఁగ జఠరార్భకునిఁగానఁ జనినకైవడి [5]ఘర్మసలిల మొప్పె;
నాగిఁ దేజ మా యింతి యుదరడింభకుఁగొల్వఁ గదిసినక్రియ దేహకాంతి మెఱసెఁ:
బవనుఁ డా కొమ్మ గర్భస్థుని [6]సేవింప నొలసెనా మిక్కిలియూర్పు లమరెఁ;
గుంభిని యా లేమ కుక్షిగు నర్చింపఁ జొచ్చుభంగిని మంటిచొరవ దనరె;
ఆ. గగన మిందువదన కడుపులో బాలు సేవలకు రూపు మెఱసి వచ్చినట్లు
బయలువంటినడుము బహుళమయ్యెను బంచభూతమయుఁడు లోనఁ బొదల నతికి. 73

వ తదనంతరంబ. 74

సీ. అతివ [7] కాంచీగుణం బల్లన బిగియంగ వైరివధూగుణవ్రజము వదలె;
మెల్లన తన్వంగి మెయిదీవ మెఱుఁగెక్క దుష్టాంగనాతనుద్యుతు లడంగె;

1. పూర్వ-తూర్పు, 2. విమతులు-విరోధులు, 3. రేఖ-పాఠాంతరము, 4. జడను పడు-మాంద్యముఁబొందు, 5. ఘర్మసలిలము-చెమటనీరు, 6. సేవించునోఁజతో-పాఠాంతరము, 7. కాంచీగుణము - మొలత్రాడు.

నాతి కల్లన భూషణములు పల్పలనగాఁ బరనతీభూషణపంక్తు లెడలె ;
గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డుగాఁ బరిపంథిదారగర్భములు వగిలెఁ;
తే. బొలఁతి కల్లన [1]నీళ్ళాడుప్రొద్దు లెదుగ నహితపల్లభ లైదువలై తనర్చు
ప్రొద్దులన్నియుఁ గ్రమమునఁ బోవఁదొడగె నువిదకడుపున నసురారి యుండఁజేసి. 75

వ. ఇవ్విధంబున. 76

ఆ. జ్ఞానఖలునిలోని శారదయునుబోలె ఘటములోని దీపకళికవోలె,
భ్రాతయింట నాఁకఁ బడి యుండె దేవకీ కాంత విశ్వగర్భగర్భయగుచు. 77

వ అంత నక్కాంతాతిలకంబునెమ్మొగంబు [2]తెలివియును, మేనిమెఱుంగును, మెలంగెడి సొబగునుం జూచి వెఱఁగుపడి తలఁపు వెఱచుచుఁ గంసుండు దనలోని ట్లనియె 78

క. కన్నులకుఁ జూడ బరువై యున్నది యెలనాఁగగర్భ మల్లము గలఁగన్:
మున్నెన్నఁడు ని ట్లుండదు; వెన్నుఁడు సొరఁ బోలు గర్భవివరములోనన్. 79

ఉ. ఏమి దలంచువాఁడ? నిఁక నెయ్యది కార్యము? నాఁటినాఁటికిం
గామినిచూలు పెం పెసఁగె? గర్భిణిఁ జెల్లెలి నాఁడుపేద నే
నే మని చంపువాఁడఁ? దగ వే లని చంపితినేని శ్రీయు ను
ద్దామయశంబు నాయువును ధర్మమునుం జెడిపోవకుండునే? 80

క. [3]వావి యెఱుంగని క్రూరుని జీవన్మృతుఁ డనుచు నింద సేయుదు; రతఁడుం
బోవును నరకమునకు; దు ర్భావముతో బ్రదుకు టొక్క బ్రదుకే తలఁపన్?' 81

వ అని నిశ్చయించి క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించికొనుచు, దిగ్గనం జెలియలిం జంపు నగ్గలిక యె గ్గని యుగ్గడించి మాని, మౌనియుంబోలె నూరకుండియు. 82

ఆ. [4]'పాపరాని దొడ్డపగ పుట్టె; నిఁక నెట్టు లిందుముఖికిఁ జక్రి యెపుడుపుట్టుఁ?
బుట్టునపుడె పట్టి పురిటింటిలోఁ దెగఁ జూతు' ననుచు 'నెదురుసూచుచుండె 83

వ. మఱియు వైరానుబంధంబున [5]నన్యానుసంధానంబు మఱచి యతండు. 84

క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రాగుచు నరుగుచుఁ గూర్చుండి లేచు చవరతంబున్
హరిఁ దలఁచి తలఁచి జగ మా హరిమయ మని చూచెఁ గంసుఁ డాఅని యబుకన్. 85

1. నీళ్ళాడుప్రొద్దులు- ప్రసవించు దినములు. 2. తెలివి - తేజస్సు, 3 వావి- బంధుత్వము 4. పాపరాని-పోఁగొట్టరాని, 5. అన్యాను సంధానంబు-వేఱొకయాలోచన.

వ. వెండియు. 86

సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు నది హరిరవ మని యాలకించు;
నక్షిమార్గమున నెయ్యది సూడఁబడు నది హరిమూర్తిగా నోపు నంచుఁ జూచుఁ;
దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన హరి [1]కరాఘాతమో యనుచు నులుకు;
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన హరిమాలికాగంధ మనుచు నదరుఁ;
ఆ. బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు వలుకఁబడియె ననుచు భ్రమసి పలుకుఁ;
దలఁవు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు హరితలంపు లనుచు నలుగఁదలఁచు. 87

వ. అయ్యవసరంబున ననుచరసమేతులైన దేవతలును, నారదాదిమునులునుం గూడి నడవ నలువయును, ముక్కంటియు నక్కడకు వచ్చి దేవకీదేవిగర్భంబున నర్భకుండై యున్న పురుషోత్తము నిట్లని స్తుతియించిరి. 88

—: బ్రహ్మాదిదేవతలు దేవకీగర్భస్థుండగు శ్రీకృష్ణుని స్తుతించుట :—

సీ. సత్యవ్రతుని నిత్యసంప్రాప్తిసాధనుఁ గాలత్రయమునందుఁ గలుగువాని,
[2]భూతంబు లైదును బుట్టుచోటగువాని నైదు భూతంబులం దమరువాని,
నైదు భూతంబులు నడఁగినవిమ్మటఁ బరఁగువానిని, సత్యభాషణంబు
సమదర్శనంబును జరపెడువానిని నిన్నాశ్రయింతుము; నీయధీన
ఆ. మాయచేత నెఱుక మాలినవారలు పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు;
రెఱుఁగనేర్చు విబుధు లేకచిత్తంబున నఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు. 89

వ. అదియునుం గాక. 90

సీ. ప్రకృతియొక్కటి పాదు; ఫలములు సుఖదుఃఖములు రెండు; [3]గుణములు మూఁడు వేళ్లు;
తగు రసంబులు నాల్గు[4]ధర్మార్థముఖరంబు; లెఱిఁగెడి విధములై దింద్రియంబు;
లాఱు స్వభావంబు లా [5]శోకమోహాదు [6]లూర్ములు; [7]ధాతువు లొక్కయేడు
పైపొర; లెనిమిది ప్రంగలు భూతంబు లైదు బుద్ధియు మనోఽహంకృతులును;

1. కరాఘాతము-చేతిదెబ్బ. 2 భూతంబులైదును-పృథివ్యప్తేజోవాయ్వాకాశములు, 3. గుణములు-సత్త్వరజస్తమములు, 4. ధర్మార్థకామమోక్షములు, 5. శోకమోహాదులు-కామ క్రోధ, శోక, మోహ, మద, మాత్సర్యములు, 6. ఊర్ములు-ఆఁకలి, దప్పిక, శోకము, మోహము, జర, మరణము, 7. ధాతువులు-వస, అసృక్కు, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము.

తే. రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు; [1]ప్రాణ పత్త్రిదళకంబు; జీవేశపక్షియుగముఁ
గలుగు సంసారవృక్షంబు గలుగఁజేయఁ గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ. 91

క. నీదెసఁ దను చిత్తము లిడి యే దెసలకుఁ బోక కడతు రెఱుక గలుగువా;
రాదూడయగుక్రియ నీ పాదంబను నావకతన భవసాగరమున్. 92

ఆ. మంచివారి కెల్ల మంగళప్రద లయ్యుఁ గల్లరులకు మేలు గానియట్టి
దనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు సేమ మెల్లప్రొద్దుఁ జేయు దేవ. 93

క. ఎఱిఁగినవారల మనుచును గొఱమాలిన యెఱుక లెఱిఁగి కొందఱు నీపై
రెఱిఁగియుఁ దలఁపఁగనొల్లరు పఱతు రధోగతులఁ జాడఁ బద్మదళాక్షా; 94

క. నీవారై నీదెసఁ దమ భావంబులు నిలిపి; ఘనులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక, [2]నీపఱలెడిమేటిచోట నెగడుదు రీశా! 95

క. నిను నాలుగాశ్రమంబుల జనములు సేవింప నఖిలజగముల సత్త్వం
బును శుద్ధంబును శ్రేయం బును నను గాత్రంబు నీవు పొందుదువు హరీ! 96

సీ. నలినాక్ష! సత్త్వగుణంబు నీగాత్రంబు; గా దేని విజ్ఞానకలిత మగుచు,
నజ్ఞానభేదకంబగు టెట్లు? గుణములయందును వెలుఁగ నీ వనుమతింపఁ
బడుదువు; సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షి వగుచు
వాఙ్మనసముల కవ్వలిదైన మార్గంబు గలుగు నీగుణజన్మకర్మరహిత
తే. మైన రూపును బేరు సత్యనఘబుద్ధు లెఱుఁగుదురు [3]నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు
వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు వెలయువాఁడు భవము నొందఁడు; నీపాదభక్తుఁ డగును.

క. ధరణీభారము వాసెను బురుషోత్తమ! యీశ! నీదుపుట్టువున భవ
చ్చరణాంబుజములప్రాపున ధరణియు నాకసముఁ గాంచెదము నీకరుణన్. 98

ఉ. పుట్టువు లేని నీ కభవ! పుట్టుట క్రీడయ కాక, పుట్టుటే ?
యెట్టనుడున్ [4]భవాదిదశ లెల్లను జీవులయం దవిద్య దాఁ

---

1 ప్రాణపత్త్రిదళకంబు-ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము. నాగము, కూర్మము కృకరము, దేవదత్తము ధనంజయము-అను వాయువులను ఆకులు,
2. నీవరయఁగమేటి - పాఠాంతరము, 3 గొల్చి వాని నూహించు—పాఠాంతరము,
4. భవాదిదశలు-పుట్టుకమున్నగు అవస్థలు.

జుట్టుచునుండుఁ; గాని నినుఁ జుట్టినడం బలెఁ దొంత నుండియుం
జుట్టఁగ [1]లేమిఁ దత్క్రియలఁ జొక్కనియెక్కటి వౌదు వీశ్వరా! 99

మ. గురపాఠీనమవై, జలగ్రహమవై, [2]కోలంబవై, శ్రీనృకే
సరివై, భిక్షుఁడవై హయాననుఁడవై, క్ష్మాదేవతాభర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణగణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద; మిలాభారంబు వారింపవే! 100

క. [3][4]ముచ్చిరి యన్నది లోకము నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయు లేచన్;
మచ్చిగఁ గావఁగ వలయును; విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా! 101

వ అని మఱియు దేవకీదేవిం గనుంగొని 102

మత్త తల్లి! నీయుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ;
[5]డెల్లి పుట్టెడిఁ; గంసుచే భయ మింత లేదు; నిజంబు; మా
కెల్లవారికి భద్ర మయ్యెడు; నింక నీ కడు పెప్పుడుం
జల్లగా వలె యాదవావళి సంతసంబునఁ బొంగఁగన్. 103

వ. అని యివ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవత లీశానబ్రహ్మాల మున్నిడుకొని చని; రంత; 104

—: శ్రీ కృ ష్ణా వ తా ర ఘ ట్ట ము :—

క. పంకజముఖి నీ కొడను సంకటపడ ఖలుల మానసంబుల నెల్లన్
[6]సంకటము దోఁచె; మెల్లన సంకటములులేమి దోఁచె సత్పురుషులకున్. 105

సీ స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును; గలఘోషణముల మేఘంబు లుఱిమె;
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె; దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ
గమ్మని చల్లనిగాలి మెల్లన వీచె; హోమానలంబు చె న్నొంది వెలిఁగెఁ;
గొలఁకులు కమలాళికులములై సిరి నొప్పెఁ; బ్రవిమలతోయలై పాఱె నదులు;
తే. వరపురగ్రామఘోషయై వసుధ యొప్పె; విహగరవపుష్పఫలముల వెలసె వనము;
లలరుసోనలు గురిసి రయ్యమరవరులు దేవదేవుని దేవకీదేవి గనఁగ. 106

1. లేదు; లేని పాఠాంతరములు, 2. క్రోడంబవై-పాఠాంతరము, 3. మ్రుచ్చిరి-పాఠాంతరము, 4. ముచ్చిరి-దుఃఖించి, 5. ఎల్లి - రేపు, 6. సంకటము - కష్టము.

క. పాడిరి గంధర్వోత్తము; లాడిరి రంభాదికాంత; లానందమునం
గూడిరి సిద్ధులు; భయముల వీడిరి చారణులు; [1]మొరసె మేల్పులభేరుల్. 107

వ. అయ్యవసరంబున. 108

క. సుతుఁ గనె దేవకి నడురే యతిశుభగతిఁ [2]తారలును గ్రహంబులు నుండన్;
దితిసుతనిరాకరిష్ణున్ శ్రితపదనాలంకరిష్ణు జిష్ణున్ [3]విష్ణున్. 109

క. వెన్నుని నతివిపన్నునిఁ గ్రన్ననగని మెఱుఁగుఁబోఁడి గడు నొప్పారెం
బున్నమనాఁడు కళానిధిఁ గన్న [4]మహేంద్రాశచెలువు గలిగి నరేంద్రా! 110

వ. అప్పుడు. 111

సీ. జలధరదేహు, నాజానుచతుర్బాహు, నరసీరుహాక్షు, విశాలవక్షుఁ,
జారుగదాశంఖచక్రవద్మవిలాసుఁ, గంఠకౌస్తుభమణికాంతిభాసుఁ,
గమనీయకటిసూత్రకంకణ కేయూరు, శ్రీవత్సలాంఛనాంచితవిహారు,
నురుకుండల ప్రభాయుతకుంతలలలాటు, వైదూర్యమణిగణవరకిరీటు,
తే. బాలుఁ, బూర్ణేందురుచిజాలు, భక్తలోక పాలు, సుగుణాలవాలుఁ, గృపావిశాలుఁ
జూచి తిలకించి పులకించి చోద్యమంది యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె. 112

క. స్నానము సేయఁగ రామిని, నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్
ధేనువులం బదివేలను, మానసమున దారవోసె మఱి యిచ్చుటకున్. 113

వ. మఱియు వసుదేవుండు, 114

క. ఈ పురిటియింటి కుడ్యద్దీపంబునుబోలెఁ జాల దీపించె; నిజం;
భీపాపఁడు నలు మొగములఁ యా పాపనిఁ గనిన మేటి యగు నని భక్తిన్. 115

ఆ. [5] చాఁగి మ్రొక్కి లేచి, నరగున నొసలిపైఁ, గేలుఁదమ్మిదోయిఁ గీలుకొలిపి,
పాపఁ దనక వెఱక పాపని మొదలిఁటి పోక లెల్లఁ దలఁచి పొగడఁదొడఁగె. 116

క. ఏ నిన్ను నఖిలదర్శను జ్ఞానానందస్వరూపు [6]సంతతు నపరా
ధీనుని మాయాదూరుని సూనునిఁ గాఁ గంటి; నిట్టి చోద్యము గలదే? 117

---

1. మొరసె-మ్రోఁగెను, 2. తారలు-నక్షత్రములు, 3. కృష్ణున్-పాఠాంతరము, 4. మహేంద్రాశ-తూర్పుదిక్కు, 5. చాఁగి-సాఁగిలఁబడి, 6. సంతతుఁడు-శాశ్వతుఁడు

క. అచ్చుగ నీ మాయను మును చెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగమున్
జొచ్చినక్రియఁజొరకుందువు; చొచ్చుటయును లేదు; లేదు చొరకుండుటయున్ 118

సీ. అదియు నెట్లన మహదాదులఁ బోలెడిదై వేఱువేఱయై, యన్ని విధము
లగు సూక్ష్మభూతంబు లమర షోడశవికారములతోఁ గూడి విరాట్టనంగఁ
బరమాత్మునకు నీకుఁ [1]బఱపైన మేను సంపాదించి, యందులోఁ బడియుఁ బడక
యుండు సృష్టికి మున్న యున్న కారణమున వానికి లోనిభవంబు గలుగ;
ఆ. దట్లు బుద్ధి నెఱుఁగ నసువైనలాగునఁ గలుగు నింద్రియముల [2]కడల నుండి;
వాని [3]పట్టు లేక వరుస జగంబులఁ గలసి యుండి యైనఁ గలయవెపుడు. 119

క. సర్వము నీలోనిది గా సర్వాత్ముఁడ; వాత్మవస్తుసంపన్నుఁడవై
సర్వమయుఁడవగు నీకును సర్వేశ్వర! లేవు లోను [4]సందులు వెలియున్. 120

ఆ. ఆత్మవలనఁ గలిగి యమరు దేహాదుల నాత్మకంటె వేఱు లవి యటంచుఁ
దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ! విశ్వమెల్ల నీవ; వేఱు లేదు. 121

వ. అదియునుం గాక. 122

సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు నెటి జనించుఁ;
[5]బ్రబ్బుఁ; [6]లేదగు; నంచుఁ బలుకుటదప్పుగా; దీశుండవై బ్రహ్మమీవ యైన
నినుఁగొల్చు గుణములు నీ యానతులు సేయ, భటులశౌర్యంబులు పతికివచ్చు
పగిది నీ గుణములభాగులు నీ వని తోఁచును నీమాయతోడఁ గూడి;
ఆ. నీవు రక్తధవళనీలవర్ణంబుల జగము సేయఁ, గావ, నమయఁజూడఁ
దనరు; దట్లు నేఁడు దైత్యుల దండింపఁ బృథివిఁ గావ నవతరించి తీశ! 123

శా. మింటన్ మ్రోసినమ్రోఁత [7]దాలిమిని లో [8]మేంత్రింప మన్. నీవు నా
యింటం బుట్టెద వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ యన్నలం;
గంటం గూరుకుఁ దేఁడు; నీయుదయ మాకారాజనుల్ సెప్పఁగా
[9]బంటింపం; డెదురేఁగు దెంచ వడి నీపై నేఁడు నన్నద్ధుఁడై. 124

1. పఱపు విస్తారము, 2. కడలు-తుదలు, 3. పట్టు-ఆధారము, 4. సందులు-పాతాంతరము, 5. ప్రబ్బు-వృద్ధిపొందును, 6. లేదగు-నశించును, 7 దాను విని మున్ మీటించి పాతాఁతరము, 8. మేంత్రిప-భేదింపఁగా, 9 పంటింపండు-తడఁబడఁడు.

—: దేవకీదేవి స్వామిని స్తుతించుట :—

వ. అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును నైన కుమారునిం గని, కంసునివలనివెఱపున శుచిస్మితయై యిట్లనియె. 125

సీ. అట్టిట్టి దనరానిదై, మొదలై, నిండుకొన్నదై. వెలుఁగుచు, గుణము లేని
దై, యొక్క చందంబుదై, కలదై, నిర్విశేషమై, క్రియ లేక చెప్పరాని
దేరూప మని, [1]శ్రుతు లెప్పుడు నొడివెడి, నా రూప మగుచు నధ్యాత్మ దీప
మై, బ్రహ్మ రెండవయర్ధంబుతుది జగంబులు నశింపఁగఁ బెద్ద భూతగణము
ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ, నా భూతంబు ప్రకృతిలోనఁ జొరఁగఁ, బ్రకృతి వోయి
వ్యక్తమందుఁ జొరఁగ, వ్యక్త మడంగను శేషసంజ్ఞ నీవు సెలఁగ మగుదు. 126

ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు, నవిద్యకుఁ బుట్టమునైన నీకుఁ దా
శాశ్వతమైన కాల మిది సర్వము వేడబ; మందు; రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప నిను నెవ్వఁడు గోరి భజించు, వాఁడ పో
శాశ్వతలక్ష్మిమృత్యుజయసౌఖ్యయుతుం డభయుండు మాధవా! 127

మత్త. ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
'కంటి' మందురు కాని, నిక్కము కాన; రీ భవదాకృతిం
గంటి; భద్రముఁ గంటి; మాంసపుఁగన్నులం గనఁబోల; దీ
తొంటిరూపుఁ దొలంగఁబెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్. 128

ఆ. [2]విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద కడుపులోన దాఁచు కడిమిమేటి
నటుఁడ వీవు; నేఁడు నా గర్భజుఁడ వౌట పరమపురుష! [3]వేడబంబు గాదె! 129

తరల. నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ
ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము [4]కారయింట నడంచె; దు
ర్మలినచిత్తుని నాజ్ఞ సేయుము; మమ్ముఁ గావుము భీతులన్;
[5]నులుసు లేక ఫలించె నోఁచిననోము లెల్లను నీవయై. 130

—: దేవకీవసుదేవుల పూర్వజన్మముల వృత్తాంతము :—

వ. అని యిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుం డిట్లనియె; 'నవ్వా! నీవు దొల్లి స్వాయంభువమన్వంతరంబునఁ బృశ్ని యను పరమపతివ్రతవు; వసుదేవుండును సుతపుం డను

1. శ్రుతులు-వేదములు, 2 విలయకాలము-ప్రళయసమయము, 3. వేడబంబు-మాయ, 4. కారయిల్లు-చెఱసాల, 5. నులుసు-లోటు.

ప్రజాపతి; మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మ పంపునం బెంపున నింద్రియంబుల జయించి తెంపున వాన గాలి యెండ మంచులకు నైరించి, [1]యేకలములయి, యాకల ములు దిని యే కలంకంబును లేక [2]వేంద్రంబుగఁ బంద్రెండువేల దివ్యవర్షంబులు దపం బులు సేసిన నెవంబున మీ రూపంబులు మెఱయ నోజ నా జపంబులు సేసి, దాని, పేర్చి, యర్చింప మీకు నాకుం గలరూపుఁ జూపి యేను 'దిరంబు లగు వరంబులు వేఁడుం' డనిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలు లేని దొడ్డయడ్డంబున దుర్దమం బగు నపవర్గంబు గోరక నా యొద్దు కొడుకు నడిగిన, మెచ్చి యట్ల వరం బిచ్చి మీ కేను 'బృశ్నిగర్భుం' డన నర్భకుండ నయితి; మఱియును. 131

క. అదితియుఁ గశ్యపుఁడును నన నదితులరగు మీకుఁ [3]గుఱుచవేషంబున నే నుదయించితి వామనుఁ డనఁ [4]త్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్. 132

క. ఇప్పుడు మూఁడవ [5]బాముని దప్పక మీ కిరువురకును దనయుఁడ నైతిం; జెప్పితిఁ బూర్వము మీయం దెప్పటికిని లేదు జన్మమిటపై నాకున్. 133

క. నందనుఁ డనియుం బరమా నందంబగు బ్రహ్మమనియు ననుఁ దలఁచుచు నా [6]పెందెరువు నొందెదరు; నా యందలి ప్రేమమున భవము నందరు మీరల్. 134

వ. అని యిట్లు పలికి యీశ్వరుం డా రూపంబు విడిచి. 135

క. తెప్ప లిడక తలిదండ్రులు దప్పక తనుఁ జూడ మాయఁ దనరి లలితుఁడై యప్పు డటు గన్న పాపని యొప్పున వేడుకలు సేసె నొకకొన్ని నృపా! 136

వ. అంత వసుదేవుండు దనకుం జేయవలసిన పను లీశ్వరుం డైన హరి వలన నెఱింగిన వాఁడు గావున. 137

క. ఆ పురిటియిల్లు వెలువడి పాపనిఁ దరలించుకొనుచుఁ బఱచెద ననుచున్ [7]రూపింప, నందుభార్యకుఁ బాప యగుచు యోగమాయ ప్రభవించె నృపా! 138

వ. అయ్యవసరంబున. 139

క. బిడ్డనిఁ గరముల నొమ్మన, నడ్డంబుగఁ బట్టి, పదము లల్లన యిడుచున్ జడ్డన గావలివారల, యొద్దు గడచి పురిటిసాల యొయ్యన వెడలెన్. 140

1. ఏకలములు-అసహాయులు, 2. వేంద్రంబున-తీవ్రముగ, 3. కుఱుచవేషంబు-పొట్టిరూపు, 4. త్రిదశేంద్రానుజుఁడు-ఉపేంద్రుఁడు, 5. బాము-జన్మము. 6. పెందె రువు-పరమపదము, 7. రూపింప-గ్రహింపఁగా.

వ. అంత నట. 141

క. నందునిసతికి యశోదకుఁ బొందుగ హరియోగమాయ పుట్టినఁ మాయా
స్పందమున నొక్క [1]యెఱుఁగమి క్రందుకొనియె నూరివారిఁ గావలివారిన్. 142

వ. అప్పుడు సప్పుడు గాకుండఁ దప్పటడుగు లిడుచు, నినుపగొలుసుల మెలుసుల వీడినఁ, దాలంబులు [2]మహోత్తాలుండయిన బిడ్డనికి నడ్డ బు గాక, కీలూడి పీడిపడ, [3]సరళంబులు విరళంబులయిన సరళంబులగు మొగసాలలం గడచి, పాప ఁదేఁడు వాకిండ్లు మరం మూయుచుఁ బడగ లెడ గలుగ విప్పి కప్పి యేచి కాచికొని వెంట నంటి రాఁగఁ దూఁగి నడచునెడ. 143

క. ఆశౌరికిఁ దెరు వొసఁగెఁ బ్రకాశోద్ధతతుంగభంగకలితధరాళా
కాశ యగు యమున మును [4]సీతేశునకుఁ బయోధి త్రోవ యిచ్చినభంగిన్. 144

వ. ఇట్లు యమున దాఁటి, దూఁటి, చని, నందునిమందం జేరి, యం దమంద నిద్రం బొంది యొడ లెఱుంగని గొల్లలం దెలువనొల్లక సత్యప్రసాద యగు యశోద శయ్య నొయ్యన చిన్ని నల్లనయ్య నునిచి, చయ్యన నయ్యవ్వ కూఁతు నెత్తుకొని మరల నింటికిఁ బంటింపక వచ్చి యచ్చిఱుతపాపను దేవకి ప్రక్కం జక్క నిడి. 145

క. పదముల సంకెల లిడుకొని మదిఁ దలఁకుచు శూరసుతుఁడు మందుఁడుఁబోలెన్
బెదరు గల రీతి దేహము గదలించుచు నొదిఁగి యుండె గఱువతనమునన్. 146

క. వనజాక్షునిఁ దెచ్చుటయును దన సుతఁ గొనిపోవుటయును దా నెఱుఁగక [5]మూఁ
గిన నిద్రఁ జొక్కి యుండెను వనజాక్షి యశోద రేయి వసుధాధీశా! 147

సీ. అంత బాలిక యావు రని యేడ్చు చిఱుచప్పు డాలించి [6]వే క న నాఁకయింటి
కావలివారు మేల్కని చూచి, తలుపుల తాళముల్ తొంటి విధమున నుండఁ
దెలిసి చక్కన వచ్చి 'దేవకి నీళ్ళాడె; ర' మ్మని యా భోజరాజుతోడఁ
జెప్పిన, నాతఁడు సిడిముడిపాటుతోఁ దల్పంబుపై లేచి తత్తఱమున
తే. వెండ్రుకలు వీడఁ, బైచీర వ్రేలి యాడఁ, దాల్మి కీ లూడ, రోషాగ్ని దర్పమాడ,
భూరివైరంబుతోఁ గూడఁ బురిటియింటి జాడఁ జనుదెంచి యా పాపఁ జంపఁ గదియ. 148

వ. అంత దేవకీదేవి యడ్డంబు వచ్చి యి ట్లనియె. 149

1. ఎఱుఁగమి-మైకము. 2 మహోత్తాలుఁడు-అత్యున్నతుఁడు, 3. అరళంబులు-తలుపులు, 4. సీతేశుఁడు - శ్రీరాముఁడు, 5. మూఁగిన-ఆక్రమించిన, 6. వేగమ; వేగన-పాఠాంతరములు.

ఉ. 'అన్న! [1]శమింపుమన్న! తగ; దల్లుఁడు గాఁ; డిది మేనగోడ లౌ;
మన్నన సేయుమన్న! విను; మానినిఁ జంపుట రాచపాడిగా
దన్న! సుకీర్తివై మనఁగదన్న! మహాత్ములు వోవు త్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న! నినున్ శరణంబు వేఁడెదన్. 150

క. కట్టా! యార్గురు గొడుకులఁ బట్టి వధించితివి యాఁడుఁబడు చిది; గోడల్
నెట్టన చంపఁగ వలెనే? [2]కట్టిఁడివి గదన్న! యన్న! కరుణింపఁగదే! 151

క. పుత్రుఁడు నీ బ్రతుకునకును శత్రుండని వింటి గాన, [3]నమయింపఁదగుఁ;
బుత్రులకు నోఁచ నైతిని బుత్రీదానంబు సేసి పుణ్యముఁ గనవే!' 152

వ. అని పయ్యెదఁ జక్క నవరించుకొనుచుఁ బ[illegible]పరించుచు, భ్రాంతిపడి కూఁతున్ గ్రక్కున నక్కునం జక్క హత్తించుకొని చెక్కు చెక్కున మోపి చయ్యన నుత్తరీయాంచలంబున నంచలతం గప్పి చప్పుడుగాఁ గుయ్యిడ నయ్యెడం [4]గ్రయ్యంబడి వాఁడు బోఁడిమి నెడఁ దోఁబుట్టువుం దిట్టి, చిట్టిపట్టి [5]నావురని వాపోవఁ గావరఁబున నడుగు లొడిసి తిగిచి వడిం బెడిసిపడం బడమిపయిం బడవైచిన, నబ్బాఁయు నేలం బడక యవలీల నెగడి నవ్యదివ్యమాలికాగంధబంధురమణిహారాంబరాద్యలంకారమనోహారిణియు,గదాశంఖచక్రపద్మశరచాపాసిశూలధారిణియునై యెనిమిది కరంబులం గరం బొప్పుచు, సిద్ధచారణకిన్నరగరుడగంధర్వాది వైమానికనికాయంబు గానిక నిల్చి పొగడ, నెగడుచు నచ్చరల యాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి [6]కంటువడఁ గంసున కిట్లనియె. 153

ఉ. 'తెంపరివై పొరిం బొరిని దేవకిబిడ్డలఁ జిన్ని కుఱ్ఱలం
జంపితి; వంత నైన నుపశాంతి వహింపక ఱాలమీఁద నొ
ప్పింపఁగ నిస్సిరో! యిదియు బీరమె? నా నరసన్ జనించి నిన్
జంపెడి వీరుఁ డొక్క డెస సత్కృతి నొందెడువాఁడు దుర్మతీ! 154

వ. అని పలికి. 155

క. మహనీయగుణాస్పదయై మహిలో నా దేవి జనము మన్నింపంగా
[7]బహునామనివాసంబుల, బహునామములం జరించె [8]భద్రాత్మికయై. 156

వ. అంత నా బోటి పలికిన కలికిపలుకులు ములుకులై చెవులఁ జిలికిన, నులికిపడి జుకు

---

1. శమింపుము-శాంతింపుము, 2. కట్టిఁడి-దయలేనివాఁడు, 3 సమయింపఁదగున్-చంపవచ్చును, 4. గ్రయ్యంబడి - బలాత్కరించి, 5. హావురని నావురింప - పాఠాంతరము, 6. కంటువడ - విరోధింపఁగా, 7. బహునామ నివాసంబులు - వేర్వేఱుపేర్లు గలస్థలములు, 8. భద్రాత్మిక-శుభస్వరూపముగలది

గదిరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది కంది, కుందెడు దేవకీవసుదేవుల రావించి యాదరంబు నంభావించి చేరి వారితో నిట్లనియె. 157

ఉ. 'పాపుఁడ; బాలఘాతకుఁడ; బంధువివర్జితుఁడ; దుష్టచిత్తుఁడం;
గోపనుఁడం; జరన్మృతుఁడ; క్రూరుఁడ; బ్రాహ్మణహంతభంగి మీ
పాపలఁ జంపితిం; బయలిపల్కుల నమ్మితి; సాధులార ! నా
పాపము లగ్గడింపక కృపాపరులై కనరే ! శమింపరే ! 158

ఉ. ఒక్కెడఁ బ్రాణు లందఱు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పఁగా,
నొక్కొక[1]మేనితోఁ బొదమి, యొక్కొకత్రోవను రాకపోకలం
జిక్కులఁ బొందుచుండుదురు· చెల్మిని [2]సంసృతితోడఁ బాయ; రే
నెక్కడిహంత ? మీ శిశుపు లెక్కడి హన్యులు ? దూఱ నేటికిన్ ? 159

క. [3]పగతురఁ జెఱచితి ననియును బగతురచేఁ జెడితి ననియు బాలుఁడు దలఁచుఁ;
బగ చెలుములు లే వాత్మకుఁ; బగచెలుములకీలు కర్మబంధము సుండీ !' 160

వ. అని పలికి కన్నీరు నించి వగచి వెఱచుచు దేవకీవసుదేవులపాదంబులఁ బట్టుకొని సంకెలలు విప్పించి, మిక్కిలి [4]యక్కఱ గల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన వారును బరితప్తుండైన కంసునిం జూచి రోషంబును బాసి; రంత నా వసుదేవుండు బావ కిట్లనియె. 161

శా. 'బావా ! నీవచనంబు నిక్కము సుమీ ! ప్రాణుల్ గతజ్ఞానులై
'నీ వే' నంచును లోభమోహమదభీనిర్మిత్రతామోదశో
కావేశంబుల నొండొరుం బొడుతు; రేకాకారుఁడై సర్వరూ
పావిష్టుండగు నీశ్వరుం దెలియ లే రన్యోన్యవిభ్రాంతులై.' 162

వ. అని యిట్లు ప్రసన్నులైన దేవకీవసుదేవులయనుజ్ఞ వడసి కంసుం డిటికిం జని యారేయి గడపి, మఱునాఁడు ప్రొద్దున గద్దనం దనకుఁ బరతంత్రు లగు మంత్రుల రావించి యోగనిద్రవలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన నపుడు వార లతని కి ట్లనిరి. 163

క. 'ఇ ట్టయినఁ దడయ నేటికిఁ ? బట్టణముల [5]మందలందుఁ బల్లెల నెల్లం
బుట్టెడి పెరిగెడి శిశువులఁ బట్టి వధించెదము; మమ్ముఁ బంపు మధీశా ! 164

---

1. మేనులఁ; యోనులం - పాఠాంతరములు, 2. సంసృతి - సంసారము, 3 పగతురు - విరోధులు, 4. అక్కఱ - అపేక్ష, 5. మందలు - గొల్లపల్లెలు.

మ. భవదీయోజ్జ్వలబాహుచాపవిలసద్బాణావళీభగ్నులై
దివిజాధీశ్వరు లేక్రియం జనిరో? యేదేశంబులన్ డాఁగిరో?
శివునిం జొచ్చిరో? బ్రహ్మఁ జెందిరో? హరిన్ సేవించిరో! మౌనివృ
త్తి వనాంతంబుల నిల్చిరో? మనకు శోధింపం దగున్ వల్లభా! 165

క. నొచ్చిరి శాత్రవు లనుచును విచ్చలవిడిఁ దిరుగవలదు; వివిధాకృతులన్
[1]మ్రుచ్చిలి వత్తురు వారలు; సచ్చినయందాఁక మఱవఁ జన దధిపునకున్. 166

క. ఒత్తి కొనుచు రానీఁ జన; దెత్తిన రోగముల రివుల నింద్రియముల ను
త్పత్తిసమయములఁ జెఱుపక మెత్తన గారాదు; రాదు మీఁద జయింపన్. 167

మ. అమరశ్రేణికి నెల్లఁ జక్రి [2]ముఖరుం; డా చక్రియే ధర్మమం
దమరున్; గోవులు భూమిదేవులు [3]తితిక్షామ్నాయ కారుణ్యస
త్యములున్ యాగతపోదమంబులును శ్రద్ధాశాంతులున్ విష్ణుదే
హము; లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్, 168

వ. కావున. 169

ఉ. చంపుదుమే నిలింపులను? జంకెల నంకెలఁ దాపసావలిం
బంపుదుమే [4]కృతాంతకునిపాలికిఁ? గ్రేపులతోడ గోవులం
ద్రుంపుదుమే? ధరామరులఁ దోలుదుమే? నిగమంబులన్ విదా
రింపుదుమే? వసుంధర హరింపుదుమే? జననాథ! పంపుమా. 170

వ. అని పలుకు మంత్రులమంత్రంబుల నిమంత్రితుండై బ్రాహ్మణరోధంబు నిషిద్ధం బని తలంపక, కాలపాశబద్ధుండై, విప్రాదిసాధుమానవులఁ జంప దానవులం బంపి యంతిపురంబునకుం జనియె; ననంతరంబ యా రక్కసులు [5]వెక్కసంబులగు [6]మొక్కలంబుల సజ్జనులపజ్జలం బడి తర్జనగర్జనభర్జనాది దౌర్జన్యంబులం జేసి నిర్జించి పాపంబు లార్జించిరి.

ఆ. వెదకి వెదకి దైత్యవీరులు సాధుల నడఁప వారిబలము లడఁగి పోయె;
యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు నార్యహింస సేయ నడఁగుఁ గాదె!

వ. అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి మహానందంబున [7]నెఱవాదులగు వేదవిదులం బిలిపించి జాతకంబు లాడి, శుచియై శృంగారించుకొని, స్వస్తిపుణ్యాహ

1. మ్రుచ్చిలి-మోసగించి, 2. ముఖరుండు-ముఖ్యుఁడు, 3. తితిక్ష-శాంతగుణము. 4. కృతాంతకుఁడు-యముడు, 5. వెక్కసంబులు-అధికములు, 6 మొక్కలంబులు-ఉత్సాహములు, 7. నెఱవాదులు-సమర్థులు.

వాచనంబులు నడిపించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతల నర్చించి, క్రేపుల తోడంగూడఁ గైసేసిన పాఁడిమొదవుల రెండు లక్షలను గనక కలశమణివసనవిశాలంబు లైన తిలశైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన. 173

క. 'ఈ [1]యాభీరకుమారుఁడు శ్రీయుతుఁడై వీరవైరిజేతయునై దీ
ర్ఘాయుష్మంతుం డగు' నని పాయక దీవించి రపుడు బ్రాహ్మణజనముల్. 174

క. దుందుభులు మొరసె; గాయక సందోహము పాడె; సూతసముదాయముతో
వందిజనులు గీర్తించిరి; క్రందుగ వీతెంచ భద్రకాహళరవముల్. 175

క. పల్లవతోరణసురుచిర వల్లీధ్వజరాజధూపవాసనములతో
సల్లలితములై యొప్పెను [2]వల్లవవల్లభులయిండ్ల వాకిం డ్లెల్లన్. 176

క. పసువులు నూనెలు నలఁదినఁ బసఁ దనరి సువర్ణబర్హిబర్హప్రభతోఁ
బసిమి గలిగి వెలుఁగొందుచుఁ బసు లన్నియు మందలందుఁ బ్రసరించె నృపా! 177

క. క్రేళ్ళుటికి మసలెఁ లేఁగలు [3]మల్లడిగొని అంకె లిడియె మదవృషభంబుల్
పెల్లుగ మొదవుల పొదుఁగుల జల్లించెం బాలు బాలు [4]సంభవవేళన్. 178

క. అరఁగఁ జదివెడి పొగడెడి వారికి విద్యలను బ్రదుకువారికి, లేమిం
జేరినవారికి నెల్లను గోరక మును నందుఁ డిచ్చె గోధనచయముల్. 179

వ. అ నమయంబున. 180

క. కంచుకములఁ [5]దలచుట్లను గాంచనభూషాంబరములఁ గడు మెఱయఁగ నే
తెంచిరి గోపకులందఱు మంచిపదార్థములు గొనుచు మాధవుఁ జూడన్. 181

క. ఏతెంచి చూచి చెలఁగుచు నేతులఁ బెరుఁగులను బాల నీళ్ళను వెన్నం
బ్రీతి వసంతము లాడిరి [6]యేతరులై సరసభాష లెసఁగన్ గొల్లల్. 182

వ. తదనంతరంబ. 183

ఆ. 'ఏమి నోముఫలమొ యింతప్రౌ ద్దాకవార్త వింటి మబలలార! వీనులలర;
మన యశోద చిన్న మగవానిఁ గనెనఁట! చూచి వత్తమమ్మ సుదతులార;' 184

1. ఆభీరకుమారుఁడు-గొల్లపిల్లవాఁడు, 2. వల్లవులు-గొల్లలు, 3. మల్లడిగొని-పెనఁగొని, 4. సంభవవేళ, పుట్టినసమయము, 5. తలచుట్లు-తలపాఁగలు, 6 ఏతరులు-ఉత్సాహముకలవారు

వ. అని యొండొరుల లేపికొని గోపిక లోపికలులేని చిత్తంబుల నెత్తిన తత్తరంబు లొత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి. 185

క. జడగతులును బలువిఱుఁదులుఁ బిడికెడు నడుములును వలుఁద బిగిచనుఁగవలున్
వెడఁదనయనములు సిరి దడఁబడు మోములు భ్రమర చికురభరములు నమరన్. 186

ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరిహారరేఖ ల
ల్లాడఁ గపోలపాలికల హాటకపత్త్రిరుచుల్ వినోదనం
బాడఁ, బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోదయింటికిం
జేడియ లేఁగి చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్ని కృష్ణునిన్. 187

వ. చూచి నంతసించి తెచ్చిన కానిక లిచ్చి, 188

తే. పావనికి నూనెఁ దల యంటి, పసుపుఁ బూని [1]బోరు కాడించి 'హరిరక్ష హొ' మ్మటంచు
జలము లొకకొన్ని చుట్టి రాఁజల్లి తొట్ల నునిచి దీవించి పాడి ర య్యువిద లెల్ల 189

క. 'జో జో కమలదళేక్షణ! జో జో మృగరాజమధ్య! జో జో కృష్ణా!
జో జో పల్లవకరపద! జో జో పూర్ణేందువదన! జో జో' యనుచున్, 190

వ. ఇవ్విధంబున. 191

క. పలు [2]తోయంబుల జగముల బలు [3]తోయములందు ముంచి భాసిల్లెడి యా
పలుతోయగాఁడు వల్లవ లలనాకరతోయములఁ జెలంగుచుఁ దడియున్, 192

క. లోకములు నిదుర వోవఁగ జోకొట్టుచు నిదుర వోని సుభగుఁడు రమణుల్
జోకొట్టి పాడ నిదురం గైకొనుక్రియ నూరకుండెఁ గను దెఱవకయున్. 193

సీ. ఏబాము లెఱుఁగక యేపారు [4]మేటికిఁ బసులకాపరియింట బాము గలిగె;
నే కర్మములు లేక యెనయు [5]నెక్కటికిని జాతకర్మంబులు సంభవించె,
నే తల్లి చనుఁబాలు నెఱుఁగనిప్రోడ యశోదచన్నులపాలఁ జొరవ నెఱిఁగె;
నే హానివృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు పొదిఁగిటిలో వృద్ధిఁ బొందఁ జొచ్చె;
ఆ. నే తపములనైన నెలమిఁ బండనిపంట వల్లవీజనములవాడఁ బండె;
నే చదువుల నైన నిట్టిట్టి దనరాని యర్థ మవయవముల నంద మొందె. 194

---

1. బోరుకాడించి-స్నానముచేయించి, 2 తోయంబులు-విధములు 3. తోయములు -నీళ్లు, 4. గట్టికి - పాఠాంతరము, 5. చక్కటికిని - పాఠాంతరము,

మ. [1]చెయువుల్ సేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు సంతోషదృ
ష్టియుతుండై; నగుచున్ జనార్దనునిమాడ్కిం బొల్చు; రోషించియు
న్నయెడన్ రుద్రునిభంగి నొప్పును; సుఖానందంబునం బొంది [2]త
న్మయుఁడై బ్రహ్మముభాతి బాలుఁ డమరు న్బాహుళ్య బాల్యంబునన్. 195

వ. అయ్యవసరంబున, 196

ఆ. కొడుకుఁ గన్న వేడ్క గానసాగ రోహిణిఁ [3]చీరఁ బంచి చిత్రచేలములను
[4]మండనముల నిచ్చి మన్నించె నందుఁ డా యంబుజాక్షి ప్రీతయై చరింప. 197

వ. అదిమొదలు మొదవులకదుపులు బొదువులు గలిగి యుండె; నంత నందుండు గోపకుల
ననేకుల గోకులరక్షకు దక్షు లైనవారిని నియమించి మథురకుం జని కంసునికి నేఁటేఁటం
బెట్టెడి [5]యరిం బెట్టి వీడ్కొని వసుదేవునికడకుం జని యథోచితంబుగ దర్శించిన. 198

క నందునిఁ గనుఁగొని ప్రాణము పొందిన బొందియును బోలెఁ బొలుపారుచు నా
నందాశ్రులు గడకన్నులఁ గ్రందుకొనం గేలు సాఁచి కౌఁగిటఁ జేర్చెన్. 199

వ. మఱియుఁ గౌఁగిలించుకొని సుఖాసీనునిం జేసి, వసుదేవుండు దన కొడుకువలని మోహంబు
దీపింప నందున కిట్లనియె. 200

క. 'సంతతి లే దని మును ఘన చింతనముల మునిఁగి ముదిసి చిక్కిన నీకున్
సంతతి గలిగెను; భాగ్యము! సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే? 201

క. పొడగంటి నిన్ను; బ్రదికితిఁ; గడచితి నాపదల; నింకఁ గార్యంబుల నే
[6]యెడమడుగు లేని నెచ్చెలిఁ బొడగాంచుట చచ్చి మరలఁబుట్టుటగాదే? 202

క. పలుపాటులఁ బడు జనులకు నిల నొకచో నుండఁ గలదె? యేఱుల వెంటం
గలిగి చను మ్రాఁకు లన్నియుఁ [7]బలువెంటలఁ బోవుఁ గాక పాయక యున్నే? 203

మ పలురోగంబుల నొందకున్నవె పసుల్? పాలిచ్చునే ధేనువుల్?
గొలఁకుల్ వాఁగులు వారిపూరితములే? [8]గోష్ఠప్రదేశంబులం
బులులున్ [9]దుప్పులు సంచరింపవు గదా! పొల్పారునే [10]ఘోషముల్?
కలవే వచ్చని పూరిజొంపములు తత్కాంతారభాగంబులన్. 204

---

1 చెయువుల్-పనులు, 2. తన్మయుఁడు-పరవశతపొందినవాఁడు, 3. చీరన్-పిలుచుటకు 4. మండనములు-నగలు, 5. అరి-పన్ను, 6. ఎడమడుగు-భేదము, 7. పలువెంటలు-అనేకమార్గములు, 8. గోష్ఠములు-గోశాలలు, 9 దుప్పులు - పాఠాంతరము, 10. ఘోషముల్-గొల్లపల్లెలు.

క. తన పుత్రమిత్రముఖరులఁ దనుపక చూడకయు వారు దఱిఁగి నశింపన్
మనుచు గృహమేధియాశ్రమమున నుండెడివాని కొక్క మోదముఁ గలదే? 205

క. నీకాంతయొద్ద నీవును నీకాంతయు గారవింప నినుఁ దండ్రిఁగ నా
లోకించుచు నీమందను నాకొడు కున్నాఁడె [1]నంద నందాన్వితుఁడై ? 206

వ. అనిన నందుం డిట్లనియె. 207

శా. నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ గోద్త్రోడ ము
న్నీ కంసుండు వధించె ; మీ సుతఁ దుది న్హింసింపఁ జేఁ దప్పి తా
నాకాశంబున కేఁగె బాల; యది దైవాధీన మాపద్దశన్
శోకం బందునె తజ్జ్ఞుఁ డూరడుము నా [2]సూనుండు [3]నీ సూనుఁడే । 208

వ. అనిన వసుదేవుండు నందునికి మఱియు నిట్లనియె 209

క. 'జనపతి కరి యిడితివి ; మముఁ గనుఁగొంటివి ; మేము నిన్నుఁ గంటిమి ; మేల
య్యెను ; బొమ్మింకను గోకులమున [4]నుత్పాతములు దోఁచె ; మునుకొనవలయున్. 210

—: కంసునిపంపునఁ బూతన యను రాక్షసి వ్రేపల్లెకుఁ జనుదెంచుట :—

వ. అని పలికి వసుదేవుంకు నందాదులయిన వల్లవుల వీడ్కొలిపిన, వారలు గొబ్బున వడి
గల [5]గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమతమ పల్లెల త్రోవలు వట్టి
చని ; రా నందుండు [6]ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందటఁ బొడగని శౌరి
దనతోఁ బలికిన పలుకులు దప్పవనుచుఁ దలంచుచుం జనియె ; నంత 211

సీ. కంసుపంపున [7]బాలఘాతిని పూతన పల్లెల మందలఁ, బట్టణముల
నిల నెల్లచో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వనిపేరు శ్రవణవీథిఁ
బడినయంతన సర్వభయనివారణ మగు నట్టి దైత్యాంతకుం డవతరించి
యున్న నందునిపల్లె కొకనాఁడు ఖేచరియై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ
తే. [8]గామరూపిణియై చొచ్చి కానకుండ నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసికొనుచు
నందగృహమున బాలుసి నాదమొకటి విని ప్రమోదించి సుందరీవేష యగుచు. 212

---

1. వాఁడు నందాన్వితుఁడై - పాఠాంతరము, 2. సూనుండె నీసూనుఁడున్ - పాఠాంతరము, 3. నీసూనుఁడే - నీపుత్రుడే, నీ కొడుకు వంటివాఁడే । 4. ఉత్పాతములు - ఉపద్రవములు, 5. గిబ్బలు - కోడెదూడలు, 6. ప్రతీతంబులు - నమ్మదగినవి, 7. బాలఘాతిని - పిల్లలను చంపునది, 8. కామరూపిణి - కోరినవేషము ధరించునది.

మత్తకోకిలము. క్రాలు కన్నులు, గుబ్బచన్నులుఁ, [1]గందు వొందని చందురుం
బోలు మోమును, గల్గు లే దన బుద్ధిఁ దూఱని [2]కౌను, నే
రాళమైన పిఱుందుఁ, బల్లవరాగ పాదకరంబులుం,
జాల దొడ్డగు కొప్పు నొప్పఁగ సర్వమోహనమూర్తితోన్. 213

మానిని. కాంచనకుండల కాంతులు గండయుగంబునఁ గ్రేళ్లుఱకన్, జడపై
మించిన మల్లెల మేలిమితావులు మెచ్చి మదాళులు మింటను రా
సంచితకంకణహారరుచుల్ సెలువారఁగఁ బైవలు వంచల నిం
చించుక జాఱఁగ నిందునిభానన యేఁగెఁ గుమారుని యింటికినై. 214

వ ఆ సమయంబున. 215

మ. 'సిరి మమ్మున్ బ్రదుకంగఁ జూచుకొఱకై శృంగారవేషంబుతో
నరుదే నోపు' నటంచు గోపికలు జిహ్వల్ రాక మోహించి త
త్పరలై చూడ లతాంగి వోయి కనియెం బర్యంకమధ్యంబునం
బరు [3]భస్మానలతేజు దుర్జనవధ ప్రారంభకున్ డింభకున్. 216

వ. కని కదియ వచ్చు సమయంబున. 217

శా. ఆ లోకేశ్వరుఁ డా చరాచరవిభుం డా బాలగోపాలుఁ డా
బాలధ్వంసిని [4]గొంటు గం టిడి వెసన్ బాలెంతచందంబునం
బాలిండ్లన్ విస మూని వచ్చుట మదిన్ భావించి, లో నవ్వుచున్
కాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుర్వెట్టఁగన్. 218

క. ఆ పాపజాతి సుందరి యా పాపనిపాన్పుఁ జేర నరిగి కరములన్
లేపి చనుంగవ శిశువున్ మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్. 219

క. 'చను నీకుఁ గుడుపఁ జాలెడి చనువారలు లేరు ; నీవు చన వలె' ననుచుం
జను గుడిపి మీఁద నిలుకడఁ జనుదాన ననంగ వేడ్కఁ జనుఁ జనుగుడుపన్. 220

క. 'నా చనుఁబా లొకగ్రుక్కెం డో చిన్నికుమార త్రావు మొయ్యన పిదపన్
నీ [5]చెలువ మెఱుఁగ వచ్చును నా చెలువము సఫల మగును నలినదళాక్షా!' 221

వ. అని బాలు నుద్దేశించి ముద్దాడెడిభంగి పాట లాడెడి చేడియం జూచి. 222

1. కందు-మచ్చ, 2. కౌను - నడుము, 3. భస్మానలతేజుఁడు - నిరుపుగప్పిన నిప్పు యొక్క తేజస్సుకలవాడు, 4. గొంటు - క్రూరురాలు, 5. చెలువము - అందము.

మ. 'వనితా ? ముట్టకు మమ్మ ; చన్నుగుడపన్ వల్దమ్మ ; నీచన్ను మా
తనయుం డొల్లఁడు; వాసి పొ' మ్మని యశోదారోహిణుల్ సీరఁ, [1]గై
కొన కీక్షించుచు మాయఁ బన్ని పెలుచం గోశంబులో [2] [3]వాలుమె
ల్పున రాజిల్లుచు మాట మెత్తఁదనమున్ లోవాఁడియు న్నేర్పడన్. 223

వ. కదిసి కలికిపలుకులు పలుకుచు, నులుకు సెడి, జళుకు సొరక, యెదుర నిదుర గదిరిన ఫణిని ఫణి యని యెఱుంగక గుణమతిం దిగుచు జడమతిబెడంగునఁ [4]గఱటి జఱభితెఱవ వెరవునం జనుదెంచి పఱపునడుమ నొఱపు గలిగి మెఱయుచుఁ గన్ను దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కొమరుమిగులు చిఱుత కొమరునిం దిగిచి తొడలనడుమ నిడుకొని యొడలు నివురుచు నెడనెడ [5]మమతం గడలుకొలుపుచు 'నాఁకొన్న చిన్ని యన్న! చన్ను గుడువు, మని చన్నిచ్చు సమయంబున. 224

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లన కను విచ్చి క్రేఁగంటఁ జూచుచుఁ [6] [7]గిదికి [8]నీల్గి
యావులించుచుఁ జేతు లాదరంబునఁ జాఁచి యొఁదిగిలి యాఁకొన్న యోజ నూఁది
బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి గ్రుక్క గ్రుక్కకు గుటుగుటుకుమనుచు
నొకరెండు గ్రుక్కల నువిదప్రాణంబులు సైతము మేనిలో సత్వ మెల్లఁ
తే. ద్రావె; నదియును గుండెలు దల్లడిల్లఁ [9]జిమ్మఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల
'నితర బాలుర క్రియవాఁడ వీవు గావు చన్ను విడువుము విడువుము; చాలు! ననుచు. 225

క. నిబ్బరపు దప్పి మంటలు ప్రబ్బిన ధృతి లేక నేత్రపదహస్తంబుల్
గొబ్బున వివృతములుగ [10]నా [11]గుబ్బగుచున్నట్టి కూఁతఁ గూలెన్ నేలన్ 226

మ, అదరెం గొండలతోడ భూమి; గ్రహతారానీకముల్ మింటిపై
జెదరెన్; దిక్కుల మాఱుమ్రోఁత లెసఁగెన్, భీతిల్లి లోకంబులుం
గదలం బాఱెను వజ్రభిన్నగిరిరేఖం బూర్వదేహంబుతోఁ
ద్రిదశధ్వంసిని గూలి కుయ్యిడిన తద్దీర్ఘోరుఘోషంబునన్. 227

క. అప్పుడు [12]దెప్పర మగు నా చప్పుడు హృదయములఁ జొచ్చి సంచదిడివెట్టన్,
ముప్పిరిగొని పడి రెఱుకలు దప్పి ధరన్ గొల్ల లెల్లఁ దల్లడపడుచున్. 228

---

1 కైకొనగ - లెక్కసేయక, 2. బాలు చిల్లున రాఁజిమ్ముచు - పాఠాంతరము. 3. వాలు - కత్తి, 4. కఱటిజఱభితెఱవ - క్రూరురాలు, దుష్టురాలు అగు స్త్రీ, 5. మమత - ప్రేమ, 6. గిదిసి - పాఠాంతరము, 7. కిదికి - మారాముపట్టి 8. నీల్గి - సాగి, 9 చిమ్మఁ దిరుగుచు - గిరగిరతిరుగుచు, 10. ఆగుబ్బగుచున్న - అధికమగుచున్న, 11. గుబ్బాగుబ్బ యినపూఁత, గుబ్బాగుబ్బయినకూఁత - పాఠాంతరములు. 12. దెప్పరము - అధికము,

క. ఆ జరభిండ రక్కసి నైజశరీరంబు నేల నలియంబడినన్
యోజనమున్నర మేర [1]ధరాజంబులు నుగ్గు లయ్యె రాజవరేణ్యా! 229

సీ. దారుణ [2]లాంగలదండదంతంబులు, నగగహ్వరముఁ బోలు నాసికయును
గండశైలాకృతి గల కుచయుగమును, విరిసి తూలెడి [3]పల్లవెండ్రుకలును
జీఁకటినూతులఁ జెనయు నేత్రంబులుఁ బెనుదిబ్బఁ బోలెడి పెద్దపిఱుఁదుఁ
జాఁగు [4]కట్టలఁ బోలు చరణోరుహస్తంబు, లింకిన మడువుతో నెనయు కడుపుఁ
తే. గలిగి షట్క్రోశదీర్ఘమై కదిసి చూడ భయదమగు దాని ఘనకళేబరముఁ జూచి
గోపగోపీజనంబులు గుంపుగూడి బెగడుచుండిరి మనముల బెదరు గదిరి. 230

వ. ఇవ్విధంబున. 231

క. [5]ఆ తఱిఁ గుడుఁవగ నడచెన్ నూతనపుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు
ద్యోతనఁ గృతమునిసముదయ[6]యాతనఁ బూతనఁ నెఱింగి యాతనలీలన్. 232

క. విషధరరిపుగమనునికిని విషగళసఖునికిని విమలవిషయనునికిన్
విషభవభవజనకునికిని విషకుచ చనువిషముఁ గొనుట విషమే తలఁపన్ ? 233

వ. అంత నా గోపగోపీజనంబులు తెలిసి రోహిణీయశోదలం గూడుకొని బెగ్గడిలక దగ్గఱి 234

శా. నేలం గూలినదాని పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడింప నో
బాలా! రమ్మని మూఁపు జేర్చుకొని సంస్పర్శించి యూరార్చుచున్
గో[7]లాంగూలముఁ ద్రిప్పి, గోపురజమున్ గోమూత్రముం జల్లి, త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పండ్రెండునామంబులన్. 235

వ. మఱియు నంతటం దనియక, గోపిక లాచమనంబు సేసి దక్ష లయి మునుపుగాఁ దమకు రక్షాకరం బగు బీజన్యాసంబు సేసికొని, 'చిన్నియన్న! నీయడుగు లజుండును, జానువు లనిలుండును, దొడలు యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును హృదయంబు గేశవుండును, నుర మీశుండును, భుజంబులు చతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు; ముందు చక్రియు, వెనుక గదాధరుం డైన హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు, నసిధరుండగు నజనుండును, గోణంబుల శంకచక్రగదాధరుండైన యురుకాయుండును, మీఁదు పేంద్రుండును, గ్రింద

1. ధరాజంబుల్ - చెట్లు, 2. లాంగలదండము - నాఁగలికఱ్ఱ, 3. పల్ల - ఎఱ్ఱని
4. వెన్నెల - పాఠాంతరము, 5. ఆతురఁ - పాఠాంతరము, 6. యాతన - వేదన,
7. లాంగూలము - తోఁక.

తార్క్ష్యుండును, నంతటను హలధరుండగు పురుషుండును [1]కాతురు; నీయింద్రియంబుల హృషీకేశుండును, ప్రాణంబుల నారాయణుండును, జిత్తంబును శ్వేతద్వీపపతియును, మనంబును యోగీశ్వరుండైన కపిలుండును, బుద్ధిని పృశ్నిగర్భుండును, నహంకారంబును భగవంతుండైన పరుండును బాలనంబు సేయుదురు; నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించుతఱి మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్నసమయంబున శ్రీపతియును, గుడుచుకాలంబున సర్వభక్షకుండైన [2]యజ్ఞభుజుండును నేమఱకుండుదురు; నిన్నుఁ బేర్కొనిన దుస్స్వప్నవృద్ధబాలగ్రహంబులును, గూశ్మాండడాకినీయాతుధానులును, భూతప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరారేవతులును, జ్యేష్ఠాపూతనలును, మాతృకాదిగణంబులును నశియింతురు; నీయందుఁ బ్రాణేంద్రియ శరీరనిరోధంబు లయిన యున్మాదంబులును, [3]నపస్మారంబులును, మహోత్పాతంబులును బొందకుండును గావుత మని రక్ష సేసి దీవించి; రంత. 236

క. ఆ పెద్దవేదబంబుల పాపనికిని జన్ను గుడిపి పానుపుపై సం
స్థాపించి కప్పి 'కూరుకు, మో పాపఁడ !' యని యశోద యొయ్యన పాడెన్. 237

వ అంత నందుండు మొదలయిన గోపకులు మధురనుండి వచ్చి రక్కసిమేను గని వెఱఁగుపడి 'మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె; నతండు మహాయోగి' యని పొగడి కఠోరంబగు పూతనయొడలు [4]కుఠారంబుల నఱికి తమ కుటీరంబులకుం దవ్వటు ప్రదేశంబునఁ [5]బటీరంబుల దహనంబు సంగ్రహించి దహించి రంత 238

ఆ. [6]పొగిలి [7]పొగిలి కాలు మగువదేహంబున నగురుపరిమళముల పొగలు వెడలె
దేహకల్మషములు శ్రీహరిముఖమునఁ ద్రావఁబడుటఁజేసి భూవరేణ్య ! 239

క. హరి దనమీఁదం బదములుఁ గరములు నిడి చన్ను గుడిచి కదిసినమాత్రన్
హరిజననిపగిదిఁ జరగతి కరిగెను దురితములఁ బాసి యసురాంగనయున్ ! 240

క. వెన్నుని కొకమఱి విషమగు చన్నిచ్చిన బాలహంత్రి చనెనఁట దివికిన్ !
వెన్నునిఁ గని పెంచుచుఁ దన చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే ? 241

క. హరిఁగని చన్నులు గుడిపెడి తరుణులు ప్రాప్తించు పదము దలఁపఁగ వశమే ?
హరి యారగించుటకుఁ బాల్గురిసిన ధేనువులు ముక్తికొనలఁ జరించున్. 242

1. కాతురు-రక్షింతురు, 2. యజ్ఞభుజుండు - అగ్ని, 3. అపస్మారంబులు-మూర్ఛలు, 4. కుఠారంబులు - గొడ్డళ్లు, 5. పటీరంబులు - చందనపుకట్టెలు, 6. పొగిలి - కుమిలి, 7. కాలుచున్న - పాఠాంతరము.

క. ఆ పూతనమెయిగంధము గోపాలు రెఱింగి 'యిట్టి కువనితయొడలం
దీపాటి [1]స్వాదుగంధము బ్రాపించునె' యనుచుఁ జనిరి పల్లెల కధిపా ! 243

వ. అంత నందుండు పరమానందంబున నింటికిం జని బ్రేతలచేత రక్కసిచేఁత లన్నియు నెఱింగి వెఱఁగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని ముద్దాడి ముదంబున నుండె నని చెప్పిన విని పరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 244

క. ఏ యే యవతారంబుల నే యే కర్మములు సేసె నీశుఁడు హరి భ
ద్రాయతనము లన్నియు వినఁ బాయదు చిత్తంబు సెవులపండువు లయ్యెన్. 245

క. ఉరుసంసారపయోనిధి [2]తరణంబులుఁ బాపపుంజతరణంబులు శ్రీ
కరణంబులు ముక్తిసమా చరణంబులు బాలకృష్ణు సంస్మరణంబుల్. 246

వ. అని తరువాత బాలకృష్ణుం డేమి సేసె నాయందుఁ గృప గల దేనిం జెప్పవే యని యడిగిన రాజునకు శుకుం డి ట్లనియె. 247

—: బాలకృష్ణుండు శకటముం దనపాదమునఁ గూలఁ దన్నుట :—

సీ. బాలకుం [3]దొదిఁగిలఁ బడ నేర్చె నని జన్మనక్షత్రమం దొకనాఁడు నందు
పొలఁతి వేడుక బోర్కుఁ బోయ బ్రేతలఁ జీరి [4]వాదిత్రగీతారవంబు సెలఁగ
విప్రులతోఁ గూడ వేదమంత్రంబుల నభిషేచనాదిక మాచరించి
వారిదీవన లొంది వారికి మొదవుల నన్నంబుఁ జీరల నడిగినట్టు
ఆ. లిచ్చి బాలుఁ [5]దియ్య మెసంగఁ బానుపు సేర్చి నిదురపుచ్చి గోపనివహమునకు
గోపికలకుఁ బూజఁ గొమరారఁ జేయుచు జనని కొడుకు మఱచె సంభ్రమమున. 248

వ. ఆ సమయంబున. 249

క. నిదురించిన శిశు వాఁకొని కిదుకుచుఁ జను గోరి కెరలి కిసలయవిలస
న్మృదుచక్రచాపరేఖా స్పదపదమునఁ దన్నె నొక్క బండిన్ దండిన్. 250

క. శకటము హరి దన్నిన దివిఁ బ్రకటంబై యెగసి యిరుసు భరమున గండ్లున్
వికటంబుగ నేలంబడె నకటా ! యని గోపబృంద మాశ్చర్యపడన్. 251

1. స్వాదుగంధము - సువాసన, 2 తరణంబులు - దాఁటించునవి, 3 దొదికిలి - పాఠాంతరము, 4. వాదిత్రము - వాద్యము, 5. తియ్యము - ప్రియము, 6. ఆస్పదము - స్థానము.

వ. అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలం గూలుటం జూచి యశోదానంద ముఖ్యులైన గోపగోపికాజనంబులు పనులు మఱచి పబ్బంబులు మాని యుబ్బు సెడి వెఱపులు ఘనంబులుగ మనంబులందు. 252

క. మిన్నున కూరక యెగయదు ! తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ
చిన్నికుమారుఁడు [1]దేరే [2]విన్ననువున నెగసె దీనివిధ మెట్టిదియో ? 253

వ. అని వితర్కించు సమయంబున. 254

క. బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ గా లెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే
మూలమున నెగయ దని యబ్బాలునికడ నాడుచుండి పలికిరి శిశువుల్. 255

వ. ఇట్లు శిశువులు వలికిన పలుకులు విని. 256

శా. బాలుం డెక్కడ ? బండి యెక్కడ ? నభోభాగంబుపైఁ జేడ్పడం
గాలం దన్నుట యెక్క [3]డాట పడుచుల్ గల్లాడి; రీ జడ్డుఁబ
ల్కే లోకంబున నైనఁ జెప్పఁబడునే ? యేచందమోకాక' యం
చాలాపించుచు [4]గ్రేలు [5]గ్రేతలుఁ బ్రభూతాశ్చర్యులై రందఱున్. 257

వ. అప్పు డా బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి. 258

ఆ. 'అలసితివి గదన్న ! యాఁకొంటివిగదన్న ! మంచి యన్న ! యేడ్పు మానుమన్న !
చన్ను గుడువుమన్న ! సంతసపడుమన్న' యనుచుఁ జన్ను గుడిపె నర్భకునకు. 259

వ. అంత నబ్బాలునిమేన బాలగ్రహంబు సోఁకునుగదా యని శంకించి గోపకు లనేకు లనేక బలివిధానంబులు సేసిరి; బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి; ఋగ్యజుస్సామమంత్రంబుల నభిషేచనంబులు సేయించి, స్వస్తిపుణ్యాహవాచనంబులు సదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించె నని చెప్పి శుకుం డి ట్లనియె.

క. కొడుకు నొకనాఁడు దొడపై నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నిపురుచోఁ
గడుదొడ్డకొండశిఖరము వడువున [6]గ్రేఁ గయ్యె నతఁడు వసుధాధీశా ! 261

## —:తృణావర్తుఁ డను రాక్షసుఁడు సుడిగాలి యై కృష్ణు నెత్తికొని పోవుట:—

క. బరువైన కొడుకు మోవను [7]వెరవిఁడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా
'ధరఁ గావఁ బుట్టిన మహా పురుషుఁడు గాఁబోలు' ననుచు బుద్ధిఁ దలంచెన్. 262

1. తేరు - రథము, 2. విన్ననువు - నేర్పు, 3. డాల - పాఠాంతరము, 4. గ్రేలు - గొల్లలు, 5. గ్రేతలు - గొల్లపడుచులు, 6. గ్రేఁగు-బరువు, 7. వెరవిడి-ఉపాయము తెలియనిది

వ. అప్పుడు. 263

క. [1]ఖరుఁడగు కంసునిపంపున నరిగి తృణావర్తుఁ డవని [2]కవచాటముగా
[3]సురకరువలియై బిసబిస నరు దరు దన మురిసి విసరి హరిఁ గొనిపోయెన్. 264

క. సుడి యెఱుఁగని హరి సుడివడ సుడిగాలి తెఱంగురక్కసుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి గన్నుల సుడిసిన గోపకులు వెగడి సుడివడి రధిపా ! 265

వ. మఱియు నవ్వాలయపవనదనుజుండు విలయపవనుని తెఱంగునం గసిమసంగి ముసరి మసరు గవిసి విసరెడిసురకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెఱసి [4]తరణికిరణములకు మఱుఁగువడిన నిబిడమగు బెడిదంపుఁ దిమిరమున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులత నొంద, నొండొరుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనంబగు భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణశబ్దంబున దిగంతంబులు సెపుడుపడి పరిభ్రాంతంబులుగ నొక్కముహూర్తమాత్రంబున భువన భయంకరత్వంబు దోఁచె; నా సమయంబున. 266

ఉ. పాపనిఁ జూడఁగానక విపద్దశ నొంది కలంగి తల్లి 'యో
పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేఁడు గాలికిం
జేపడి పోయితే?' యనుచుఁ జీరుచుఁ దైవముఁ జాల దూఱుచుం
దాపము నొంది నెవ్వగల దయ్యుచుఁ గ్రుయ్యుచు బిట్టు గూయుచున్. 267

క. సుడిగాలి వచ్చి నిన్నున్ సుడిగొని కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్
బెడఁ గడరెడి నా ముద్దుల కొడుకా! యే మంటి' వనుచు ఘోరం బనుచున్. 268

ఉ. 'ఇక్కడఁ బెట్టితిం; దనయుఁ డిక్కడ నాడుచునుండె గాలి దా
నెక్కడ నుండి వచ్చె? శిశు వెక్కడి మార్గము వట్టి పోయె? నే
నెక్కడఁ జొత్తు?' నంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొలంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలు గోవు క్రియ భూస్థలి వ్రాలె దురంత చింతయై. 269

క పాపనికై యిటు [5]వొగిలెడి యా పాపనితల్లిఁ జూచి యారటపడుచున్
గోపాలసతులు బాష్పజలాపూరితనయన లైరి యార్తిం బడుచున్. 270

శా. ఆలోఁ జక్రసమీరదైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్
బాలుం దాఁ గొనిపోయి పోయి తుదిఁ దద్భారంబు మోవన్ బల

1. ఖరుఁడు - క్రూరుఁడు, 2. అవచాటముగా - అకస్మాత్తుగా, 3. సురకరువలి-సుడిగాలి, 4. తరణి - సూర్యుఁడు, 5. వొగిలెడి-దుఃఖించునట్టి.

శ్రీ లేమిం బరిశాంతవేగుఁ డగుచుం జేష్టింపఁగా లేక ము
న్నీలా గర్భకుఁ జూడ నంచు నిటమీఁ దెట్లంచుఁ జింతించుచున్. 271

వ. అట్లు దనుజుండు చింతించుచున్న సమయంబున. 272

క. [1]బాలద్విరదకరంబులఁ బోలెడి కరములను దనుజుఁ బొందుగ బిగియం
గీలింప వ్రేలఁ బడియెను బాలకుఁ డొకకొండభంగి బరువై యధిపా. 273

క. మెడ బిగియఁబట్టుకొని డిగఁ బడియెడి బాలకునిచేతఁ బర్వతనిభుచే
విడివడఁజాలక వాఁ డురిఁ బడిబెగడెడు ఖగముభంగి భయముం బొందెన్. 274

క. హరికరతల పీడనమునఁ బరవశుఁడై బాలమీఁద భగ్నాంగుఁడై
సురవైరిభటుఁడు గూలెను [2]బురభంజనుకోలఁ గూలు పురముంబోలెన్. 275

వ. అంత గోపకాంత లంతయు గని రోదనంబులు మాని సమ్మోదంబున వికవిరిసి రక్క
సుని యురంబున మురువు గలిగి బరువు లేక వ్రేలు బాలుం గొనివచ్చి [3]ముచ్చిరుచున్న
తల్లికిచ్చి; రప్పుడు గోపగోపికాజనంబు లందఱుఁ దమలో నిట్లనిరి. 276

క. 'రక్షణము లేక [4]సాధుఁడు రక్షితుఁడగు సమతఁ జేసి రాయిడులందున్
రక్షణములు వెయి గలిగిన శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్. 277

మ. గతజన్మంబుల [5]నేమి నోఁచితిమొ? యాగశ్రేణు లే మేమి సే
సితిమో? యెవ్వరి కేమి వెట్టితిమొ? యే [6]చింతాగతిం బ్రొద్దు పు
చ్చితిమో? సత్యము లేమి వల్కితిమొ? యే సిద్ధప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో? యిప్పుడు సూడఁ గంటి మిచటం గృష్ణార్భకున్ నిర్భయున్. 278

వ. అని పలికి; రంత నందుండు మున్ను దనకు వసుదేవుండు సెప్పిన మాటలకు వెఱంగు
పడుచుండె; మఱియును. 279

సీ. జననాథ! యొకనాఁడు చన్ను సేఁపినఁ దల్లి చిన్నిముద్దులకృష్ణుఁ జేరఁ దిగిచి
యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి చన్నిచ్చి నెమ్మోము సక్క నివిరి
యల్లనినగవుతో నావులించిన బాలు వదనగహ్వరమున వారినిధులు
దిశలు, భూమియు, వనద్వీపశైలంబులు, నేఱులు, గాలియు, నినుఁడు, శశియు.

1. బాలద్విరదము-గున్న యేనుఁగు, 2. పురభంజనుఁడు-శివుఁడు, 2. ముచ్చిరుచున్న-దుఃఖించుచున్న. 4. సాధుఁడు-ఉత్తముఁడు, 5. నెందుఁ బుట్టితిమొ — పాఠాంతరము, 6. చింతారతి-ఆలోచన యందలి యాసక్తి.

ఆ. దహనుఁ డాకసంబుఁ దారలు గ్రహములు నఖిలలోకములుఁ జరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుటఁ జూచి కన్ను మోడ్చి చోద్యపడియె. 280

వ. అంత నొక్కనాఁడు వసుదేవుపంపున యాదవపురోహితుండైన గర్గుండు నందకుం జను
దెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి నిలిచి కృతాంజలియై. 281

క. కోరి భజించెను నందుడు సారగుణాచారమార్గు, సత్సంసర్గు
న్నారాధితభర్గున్ యతి దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్. 282

వ. మఱియుఁ దగిన సత్కారంబులు సేసి యిట్లనియె. 283

క. ఊరక రారు మహాత్ములు వా రధములయిండ్లకడకు వచ్చుట లెల్లం
గారణము మంగళములకు నీరాక శుభంబు మాకు నిజము మహాత్మా. 284

శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల [1]మేటరివి తేజోమూర్తి వాశాంతవి
ఖ్యాతస్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నా పల్కు; ని
ర్ణీతుం డైన గురుండు మానవులకు న్విప్రోత్తముం డండ్రు; నీ
చాతుర్యంబున నీకుమారులకు సంస్కారంబు గావింపవే. 285

వ. అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత వ్రేటువడి దివి కెగసిపోయిన
[2]తెఱవ సెప్పిన తెఱంగు దేటపఱచి దేవకీదేవికొడు కని కృష్ణునిఁ గంసుండు
దలంచుం గావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యంబని నందానుమతంబున
రోహిణీసుకుమారు నుద్దేశించి. 286

క. జనులు రమియింపఁ దిరిగెడి [3]యనుపుకలిమి 'రాముఁ' డనియు యదుసంకర్షం
బున 'సంకర్షణుఁ' డనియును ఘనబలమున 'బలుఁడు' ననియు గణుతించె నృపా. 287

వ. మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి యీ శిశువు ధవళారుణపీతవర్ణుండై యిప్పుడు నల్లనైన
కతంబునఁ గృష్ణుం డయ్యె; వసుదేవునకు నెక్కడ జన్మించిన కారణంబున వాసుదేవుం
డయ్యె; నీ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటం జేసి నామంబు లనేకం
బులు గలవు; నీ [4]శాబకుని వలన మీరు దుఃఖంబులఁ దరియింతు; రీ యర్భకునిచేత
దుర్జనశిక్షణంబును, సజ్జనరక్షణంబును నగు; నీ కుమారుండు నారాయణసమానుం డని
చెప్పి తన గృహమ్మునకు మున్నీశ్వరుండు సనియె; నందుండును బరమానందమున నుండె
నంత. 288

1. మేటరి-శ్రేష్ఠుఁడు, 2. తెఱవ-బాలిక, 3. అనువుకలిమి-గొప్పయుపాయము,
4 శాబకుడు-బాలుఁడు.

## —: శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడాభివర్ణనము :—

సీ. [1]జానుభాగముల హస్తమ్ములు వీడ్వడ నిడుచు డిగ్గనఁ బోదు రింత నంత
నవ్వులపయ్యెద [2]లంది జ వ్వాడుదు రాలక్రేపులతోఁ కలలమి పట్టి
విడువనేరక వాని వెనువెంట జరగుదు రప్పంకముల దుడు [3]కదరఁ జొత్తు
రెత్తి చ న్ని చ్చుచో నిరుదెసఁ బాలిండ్లు చేతులఁ బుడుకుచుఁ జీఁపు గలుగ
తే. దూఁటుదురు గ్రుక్కగ్రుక్కకుఁ దోర మగుచు నాడుదురు ముద్దుపలుకు లవ్యక్తములుగఁ
గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు రామకృష్ణులు శైశవరతులఁ దగిలి 289

క. [4]తడ వాడిరి బలకృష్ణులు దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్
[5]దడవాడి రరులు భయమునఁ దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్. 290

సీ. తల లెత్తి మెల్లన తడవి యాడెడువేళఁ బన్నగాధీశులపగిదిఁ దాల్తు
రంగసమ్మృష్ట [6]పంకాంగరాగంబుల నేనుఁగుగున్నలయెత్తు వత్తు
రసమంబు లైన జవాతి రేకమ్ముల సింగపుఁగొదమలసిరి వహింతు
రాననంబులఁ గాంతు లంతకంతకు నెక్క బాలార్క చంద్రులపగిదిఁ దోఁతు
తే. రెలమిఁ దల్లులచన్నుఁబా లెల్లఁ ద్రావి పరమయోగోద్భవామృతపానలీల
[7]సోలి యెఱుఁగని యోగులసొంపు గందు రా కుమారులు జనమనోహరు లగుచు. 291

క. చూడనివారల నెప్పుడుఁ జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం
జూడఁగనేర్చిన బాలక చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్. 292

క. నగవుల నవిద్యపోఁడిమి నగుటుబాగఁ జేయనేర్చు నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన, నగుమొగముల సతులఁ జూచి నగనేర్చె నృపా. 293

క. అవ్వల నెఱుఁగక [8]ముప్వురి కవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా
యవ్వలకు సంతసంబుగ 'నవ్వాః యవ్వాః' యనంగ నల్లన నేర్చెన్. 294

క. అడుగులు వే గలిగియు రెం డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం
డడుగిడఁదొడగెను శాత్రవు లడుగులు [9] [10]సడుగులును వదలి యడుగవనిఁ బడన్. 295

1 జానువులు-మోఁకాళ్లు, 2. లంటి—పాఠాంతరము, 3. కదుపఁ—పాఠాంతరము. 4. తడవు-చాలసేపు, 5. తడవాడిరి-కలఁతపడిరి, 6. పంకాంగరాగంబులు-బురదలపూఁతలు, 7. సోలి - పరవశులై, 8. ముప్వురు - త్రిమూర్తులు, 9. పడుగులును; నుడుగులును—పాఠాంతరములు, 10. సడుగులు - వంకరమాటలు.

వ. మఱియును. 296

సీ. తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన [1]నెఱిభూతిపూఁత గాఁగ
ముదంబు వెలుఁగొందు ముక్తాలలామంబు [2]తొగలసంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు కమనీయమగు మెడకప్పు గాఁగ
ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివునిపగిది నొప్పె శివునికిఁ దనకును వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు. 297

క. ఆ పాపల విహరణములు దీపులు పుట్టింప మరఁగి [3]తేఁకువ లే కా
గోపాలసతులు మక్కువ నే పనులును మఱచి యుండి రీక్షణపరలై. 298

వ. ఆ సమయంబున బాలకులతల్లులు గోరు గోఱుగొమ్ములు గల జంతువులవలన నేమరక జలదహనకంటకాదులయెడ మోసపోక గాలసంరక్షణంబు సేయుచు నుల్లంబుల మొల్లంబు లైన ప్రేమంబు లభిరామంబులుగా విహరించుచుండి; రంత 299

క తనయాడు గోపబాలురు దనుఁ గొలువఁగ రాముఁ గూడి తనువు గలుగుచుం
దనుగమనంబులఁ గృష్ణుఁడు తనుమధ్యలు మెచ్చ నీలతనురుచి మెఱసెన్. 300

వ. మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచారసంభాషణదక్షుండై. 301

ఉ. చప్పుడు సేయకుండు మని [4]జంకె యొనర్చిన నల్గి పోవఁగా
నప్పుడు బార సాఁచి తన యర్మిలివిందులు వచ్చి రంచు న
వ్వొప్పఁగఁ జీరు తల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు
న్నెప్పటి పచ్చి చ న్గుడుచు నిం పొలయన్ మొలగంట మ్రోయఁగన్. 302

క. [5]వల్లవగృహ [6]నవనీతము లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగని భంగిం
దల్లి గదిసి [7]చిట్టాడుచు నల్లన చను 'బువ్వఁ బెట్టు మవ్వా!' యచుచున్. 303

వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు. 304

సీ. 'గోవల్లభుఁడ నేను; గోవులు మీ'రని వడి ఱంకె వైచుచు వంగి యాడు;
'రాజ నే; భటులు మీరలు; రండు రం'డని ప్రాభవంబునఁ బెక్కుపనులు [8]పనుచు;

---

1. నెఱపూఁతభూతి — పాఠాంతరము, 2. తొగలసంగడికాఁడు - చంద్రుఁడు. 3. తేఁకువ - ధైర్యము, 4. జంకె - బెదరింపు, 5. వల్లవులు - గొల్లలు, 6. నవనీతములు - వెన్నలు, 7. జట్టాడుచు - పాఠాంతరము, 8. పనుచు - ఆజ్ఞాపించును.

'నేఁ దస్కరుండ; మీ రింటి వా' రని నిద్ర పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు;
'నే సూత్రధారి; మీ రందఱు బహురూపు' లని చెలంగుచు నాట లాడఁ బెట్టు;
తే. మూలలుఱుకును; డాఁగిలిమూఁతలాడు; నుయ్యెలల నూఁగుఁ; జేబంతులొనర వైచు;
జారచోరుల జాడలఁ జాల నిగుడు; శౌరి బాలురతో నాడు సమయమందు. 305

వ. మఱియు నా కుమారశేఖరుండు గపట [1]శైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి. 306

## —: గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁజేఁతల యశోదాదేవితోఁ జెప్పుట :—

క. 'బాలురకుఁ బాలు లే వని బాలెంతలు మొఱలు వెట్టఁ బకపక నగి యీ
బాలుం [2]డాలము సేయుచు [3]నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ ! 307

క. పడఁతీ ! నీబిడ్డఁడు మా; కడవలలో నున్న మంచి కాఁగిన పా లా
పడుచులకుఁ బోసి [4]చిక్కిన కడవల బోనడిచె; నాజ్ఞ గలదో లేదో ? 308

క. మీ పాపఁడు మా గృహముల [5]నాపోవఁగఁ బాలు ద్రావ నగపడకున్నం
గోపించి పిన్నపడుచుల వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ ! 309

మత్తకోకిలము పుట్టి పుట్టఁడు; నేఁడు దొంగిలఁ బోయి మాయిలు సొచ్చి తా
నుట్టి యందక ఱోళ్లఁ బీఁటలు నొక్కద్రోవిడి యెక్కి చే
వెట్టఁజాలక కుండక్రిం దొక పెద్ద తూఁ టొనరించి మీ
పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ ! 310

క. ఆడం జని వీరల పెరుఁ గోడక నీ సుతుఁడు ద్రావి యొకయించుక తాఁ
గోడలిమూఁతిం జరిమినఁ గోడలు ముచ్చనుచు నత్త గొట్టె లతాంగీ ! 311

క. వారిల్లు సొచ్చి కడవలఁ 'దోరం బగు నెయ్యి ద్రావి తుది నా కడవల్
వీరింట నీసుతుం డిడ వారికి వీరికిని దొడ్డవా దయ్యె సతీ ! 312

క. వేలుపులఱె ! నాకంటెను వేలుపు మఱి యెవ్వఁ ! డనుచు వికవిక నగి మా
వేలుపులగోడపై నో హేలావతి నీతనూజుఁ డెంగిలిఁ జేసెన్. 313

క. వెన్నఁ దినఁగఁ బొడగని, మా పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దివియం
జన నడిసి పట్టి [6]చీరెను జిన్ని కుమారుండె యితఁడు? శీతాంశుముఖీ! 314

---

1. శైశవంబు - పసితనము, 2. ఆలము - ఎగతాళి, 3. ఆలకు - ఆవులకు,
4. చిక్కిన - మిగిలిన, 5. ఆపోవఁగ - తృప్తితీఱఁగా, 6. చీరెను - గీఱెను,

క. ఇమ్మగువ దన్ను వాకిటఁ గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగం
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె నమ్మా! యీ ముద్దుఁగుఱ్ఱఁ డల్పుఁడె? చెపుమా. 315

క. చేఁబంతి దప్పి పడె నని, ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్
మా బిడ్డ జలక మాడఁగ నీబిడ్డఁడు [1]వలువ దెచ్చె నెలఁతుక తగునే? 316

క. ఇచ్చెలువఁ జూచి 'మ్రుచ్చిలి యచ్చుగ నుఱికించుకొనుచు నరిగెద; నాతో
వచ్చెదవా?' యని యన్నాఁ; డిచ్చిఱుతఁడు; సుదతి! చిత్ర మిట్టిది గలదే? 317

క. కొడుకులు లే రని యొక సతి గడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గైకొనినం
గొడుకులు గలిగెద రని పై వడినాఁ; డిది వినుము శిశువుపనులే తల్లీ! 318

క. '[2]తలఁగినదానం; దల' మనఁ దలఁగక యాచెలికి [3]నాన తల యెత్తఁగ 'నీ
తలఁగినచో చెయ్యది?' యని తల యూఁచెన్ నీసుతుండు దగవె మృగాక్షీ! 319

క. వ్రాలఁగ వచ్చిన నీ సతి 'చూలాలం; దలఁగు' మనుడు 'జూ లగుటకు నే
మూలంబు సెప్పు' మనె నీ బాలుఁడు; సెప్పుదురె సతులు పర్వేందుముఖీ! 320

క. మగువా! నీకొమరుఁడు మా మగవా రటు వోవఁ జూచి [4]మంతనమునకుం
దగఁ జీరి పొంద నడిగెను; జగముల ము న్నిట్టిశిశువు సదువంబడెనే? 321

ఆ. నమ్మి నిదురవోన నా పట్టి[5]చుంచు మా లేఁగతోఁకతోడ లీలఁ గట్టి
వీథులందుఁ దోలె వెలఁది నీకొమరుండు; రాచబిడ్డఁడైన ఱవ్వ మేలె? 322

క. నా పట్టిపొట్ట నిండఁగఁ బైపడి నీపట్టి వెన్న బానెం డిడినాఁ;
డూపిరి వెడలదు; వానిం జూపెద నే మైన నీవ చుమ్ము లతాంగీ! 323

క. తెఱవ యొకతె నిద్రింపఁగ [6]నెఱిఁ గట్టినవలువ వీడ్చి నే టగుతేలుం
గఱపించి నీ కుమారుఁడు వెఱచుచు నది [7]పఱవ నగియె [8]విహితమె సాధ్వీ! 324

క. నా కొడుకును నా కోడలు నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం
గోక లెఱుంగక పాఱినఁ గూఁక లిడెన్ నీ సుతుండు; గుణమె గుణాఢ్యా! 325

ఆ. తరుణి యొకతె పెరుఁగు ద్రచ్చుచోఁ దుది వంగి వెన్న దీయ నొదిఁగి వెనుకఁ గదిసి
మగువ! నీసుతుండు మగపోఁడుములు సేయ సాగినాఁడు తగదె? చక్కఁ జేయ. 326

---

1. వలువ-చీర, 2. తలఁగినదానన్ - బహిష్ఠయైనదానను, 3. నాన-సిగ్గు, 4. మంతనము - రహస్యము, 5. చుంచు - పిల్లజుట్టు, 6. నెఱికట్టిన—పాఠాంతరము. 7. యఱవ - పాఠాంతరము, 8. విహితమె - ధర్మమా?

సీ. కలకంఠి! మా[1]వాడగరితల మెల్ల నీ పట్టి రాఁ గలఁ డని పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దనత్రోవఁ జూచుచో నెప్పుడు సొచ్చినాఁడొ?
తలుపులముద్రలుఁ దాళంబులును బెట్టి యున్న చందంబున నున్న వరయ;
నొకయింటిలో నాడు; నొకయింటిలోఁ బాడు; నొకయింటిలో నవ్వు; నొకట దిట్టు;
ఆ. నొకట వెక్కిరించు; నొక్కొకచో మృగ పక్షిఘోషణములు పరఁగఁజేయు;
నిట్లు సేసి వెనుక నెక్కడఁ బోవునో? కానరాఁడు [2]రిత్తకడవ లుండు. 327

క. కడు లచ్చి గలిగెనేనిం గుడుతురు; గట్టుదురు గాక; కొడుకుల నగుచున్
[3]బడుగుల వాడలపైఁ బడ విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ! 328

క. ఓ యమ్మ నీకుమారుఁడు మాయిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁ డమ్మా
పోయెద మెక్కడి కైనను మాయన్నల సురభులాన మంజులవాణీ! 329

వ. అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు సేయు వినోదంబులు దమయందుఁజేయు మహాప్రసాదంబు లని యెఱుంగక [4]దూఱుచున్న గోపికలకు యశోద యిట్లనియె. 330

క. 'చన్ను విడిచి చనఁ డిట్టటు; నెన్నఁడుఁ బొరుగిండ్లత్రోవ లెఱుఁగఁడు; నేఁడుం
గన్నులు దెఱవని మా యీ చిన్నికుమారకుని [5]అవ్వ సేయందగునే? 331

తే అన్య మెఱుఁగఁడు; తనయంత నాడుచుండు; మంచివాఁ డీతఁ; డెగ్గలు మానరమ్మ!
రామలార! త్రిలోకాభిరామలార! తల్లులార! గుణవతీమతల్లులార!' 332

వ. అని యశోద వారల నొడంబఱిచి పంపి కొడుకుం గోపింపంజాలక యుండె; నిట్లు. 333

## —: మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాద్యభివర్ణనము :—

ఉ. కాంతలు దల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁడై
శాంతునిసొంపునం బరమసాధునిపెంపున [6]గోలమాడ్కి వి
భ్రాంతునికై వడిన్ జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక తల్లికుచవేదికపైఁ దల మోపి యాడుచున్. 334

వ అంత నొకనాఁడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలునికేలు పట్టికొని యి ట్లనియె. 335

క. 'మ న్నేటికి భక్షించెదు ? [7]మన్నియమము లేల నీవు మన్నింపవు ? మీ
యన్నయు సఖులును జెప్పెద రన్నా మ న్నే ల ? మఱి పదార్థము లేదే ? 336

---

1. వాడగరితలము - వీథియాడువారము, 2. రిత్త - ఉత్తవైన, 3. బడుగులు - అశక్తులు, 4. దూఱుచున్న - నిందించుచున్న. 5. అవ్వ - నింద, 6. గోల - అమాయకుఁడు, 7. మన్నియమములు - నాయాజ్ఞలు.

వ. అని పలికిన ముగుదతల్లికి [1]నెఱదంట యైన కొడు కిట్లనియె. 337

శా. 'అమ్మా ! మన్ను దినంగ నే శిశువనో ? యాఁకొంటినో ? వెఱ్ఱినో ?
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్; న న్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు; కాదేనిన్ మదీ [2]యాస్యగం
ధ మ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే !' 338

వ. అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజబాలకుండైన యీశ్వరుండు
తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన. 339

క. ఆ లలితాంగి గనుఁగొనె బాలునిముఖమందు జలధిపర్వతవనభూ
గోళశిఖితరణిశశిది క్పాలాది [3]కరండ మైన బ్రహ్మాండంబున్. 340

వ. కనుంగొని. 341

మ. కలయో, వైష్ణవమాయయో! యితరసంకల్పార్థమో, సత్యమో
తలఁపన్ నేరక యున్నదాననొ యశోదాదేవిఁ గానో పర
స్థలమో? బాలకుఁ డెంత? యీతనిముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ? మహాశ్చర్యంబు చింతింపఁగన్. 342

ఆ. బాలమాత్రుఁ [4]డగు సలీలుని ముఖమందు విశ్వ మెల్ల నెట్లు వెలసి యుండు
బాలుభంగి నితఁడు భాసిల్లుఁ గాని సర్వాత్ముఁ డాదివిష్ణుఁ డగుట నిజము. 343

వ. అని నిశ్చయించి 344

ఆ. ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు గానఁబడిన బుద్ధికంప మయ్యె
నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు [5]నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు. 345

క. నా మగఁడు, నేను, గోవులు [6]నీమందయు గోపజనులు నిబ్బాలునినె
మ్మోమున నున్న విధముఁ గని యేమఱితిమి గాని యీశుఁ డీతఁడు మాకున్ 346

వ. అని తన్నుఁ బరమేశ్వరుండని తలంచుచున్న యశోదయందు నా కృష్ణుండు వైష్ణవ
మాయం బొందించిన. 347

1. నెఱవాదిఅట - పాఠాంతరము, 2. ఆస్యగంధమ్ము-నోటివాసన, 3. కరండము-బరణి, 4. డైన బాలుని—పాఠాంతరము. 5. ఆర్తులు-దుఃఖములు, 6. నీమందల సఖులుఁ బతులు — పాఠాంతరము.

క. జడనుపడి యెఱుక సెడి యా పడఁతుక సర్వాత్ముఁ దనుచుఁ బలుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని కడు వేడుకతోడ మమత గావించె నృపా! 348

వ. అనిన విని రా జి ట్లనియె. 349

ఆ. 'జగదధీశ్వరునకుఁ [1]జన్నిచ్చుతల్లిగా నేమి నోము నోఁచె నీయశోద?
పుత్రుఁడనుచు నవనిఁ బోషించు తండ్రిగా నందుఁడేమి సేసె? నందితాత్మ. 350

క. [2]ప్రబ్బిన భక్తిని హరిపైఁ [3]గబ్బంబులు సెప్పి కవులు కైవల్యశ్రీ
కబ్బుదురఁట! హరిపోషణ మబ్బిన తలిదండ్రు లెచటి కబ్బుదురో తుదిన్? 351

వ. అనిన విని రాజయోగికి శుకయోగి యి ట్లనియె. 352

## --: యశోదానందుల పూర్వజన్మవృత్తాంతము :--

సీ. అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువుల యందు ముఖ్యుఁడు; ధర యతనిభార్య
వారి నిద్దఱ బ్రహ్మ 'వసుధపై జన్మింపుఁ' డంచుఁ బంచిన వార లతనిఁ జూచి
'విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి మా కిచ్చితేనిని మహి జనింతు'
మనవుడు 'నట్లకా' కనియె వేల్పుల పెద్ద యా ద్రోణుఁ డీ నందుఁడై జనించె
ఆ ధర యశోద యయ్యె దనుజేంద్రవైరియుఁ గమలగర్భుమాట గారవించి
తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె; నధికభక్తితోడ నలరి నట్లు. 353

వ. అంత నొక్కనాఁడు దన యింటికడ పాప లందఱు నయ్యైపనులవెంటఁ బంపువడి పోయిన నందసుందరి సంరంభంబునం దరికంబంబుకడఁ గుదురున నొక్క దధికుంభంబు వెట్టి మిసిమిగల మీఁగడపెరుఁగు గూడం బోసి వీఁక [4]నాఁక త్రాడు కవ్వంబున నలవరించి. 354

## —:యశోద దధిభాండవికలనాదులు సేసిన కృష్ణునిఁ బట్టుకొనుట:—

సీ. కరకమలారుణకాంతిఁ గవ్వపుఁద్రాడు పవడంపు నునుఁదీపపగిది మెఱయఁ,
గ్రమముతో [5]రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ,
గుచకుంభములమీఁదికొంగు జాఱఁగఁ జిక్కువడుచు హారావళు ల్పయలుపడఁగఁ,
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము మంచుఁ పైపడిన పద్మంబుఁ దెగడ,
తే. గొను నులియంగఁ గంగణక్వణన మెసఁగఁ దుఱుము బిగి వీడఁ [6]గర్ణి కాద్యుతులు మెఱయ
బాలు నంకించి పాడెడి పాటవలనఁ దరువు లిగురొత్తఁ బెరుఁ గింతి దరువఁజొచ్చె. 355

---

1. జనియించు-పాఠాంతరము, 2. ప్రబ్బిన - అధికమైన, 3. కబ్బంబు-కావ్యములు, 4. ఆఁకత్రాడు - కవ్వము కట్టుత్రాడు, 5. రజ్జువు - త్రాడు, 6. కర్ణికాద్యుతులు - చెవి కమ్మలకాంతులు.

వ. ఆ సమయంబున. 356

క. [1]సుడియుచు, ద్రావలుచుఁ గిదుకుచు సడి గొట్టుచు నమ్మ రమ్మ చ న్నిమ్మనుచున్
వెడవెడ గంతులు వైచుచుఁ గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్. 357

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు నవ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడుకొని [2]కూఁకటి దువ్వుచుఁ జన్నిచ్చె; నతఁడు దూఁటుచుఁ గుడిచెన్. 358

మ. కడుపారం జనుఁబాలు ద్రావని సుతుం గంజాక్షి పీఠంబుపై
నిడి, పొంగారెడి పాలు డించుటకు [3] నై యేగంగఁ, దద్బాలుఁ డె
క్కుడు కోపంబున వాఁడిజాత దధిమత్కుంభంబు వోఁగొట్టి, తెం
పడరం గుంభములోనివెన్నఁ దినె మిథ్యాసంకులద్బాష్పుఁడై. 359

వ. అంత నా లోలలోచన పాలు డించి, వచ్చి వికలంబు లయిన దధికుంభశకలంబులఁ
బొడగని తుంటకొడుకు వెన్నదింట యెఱింగి నగుచు నా [4] [5]గలజ కానిం గానక చనిచని.

ఆ. వికచకమలనయన వే ఱొక యింటిలో వెలయ ఱోలు దిరుగవేసి యెక్కి
యుట్టిమీఁదివెన్న నులుచుకు నొకకోతి పాలు సేయుచున్న బాలుఁ గనియె. 361

మ. కని చేతన్ [6]సెలగోల వట్టికొనుచుం 'గానిమ్ము గానిమ్ము, రా
తనయా! యెవ్వరియందుఁ జిక్కువడ, నే దండంబునుం గాన నే
వినివారంబును బొంద: వే వెఱపు నే విశ్రాంతియుం జెంద! ము
న్నినియో నీ విటు నన్నుఁ గైకొనమి నేఁ డా రీతి సిద్ధించునే? 362

వ. అని [7]యదలించుచుఁ గొడుకునడవడిం దలంచి తనుమధ్య దనమనంబున. 363

సీ. బాలుఁ డీతం డని భావింతు నందునా యే పెద్దలును నేర రీక్రమంబు
[8]వెఱ పెఱుంగుటకునై వెఱపింతు నందునా కలిగి లే కొక్కఁడు గానిలేఁడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా తనుఁ దానయై [9]బుద్ధిఁ దప్పకుండు
నొం డెఱుంగక యింట నుండెడి నందునా చొచ్చి చూడని దొకచోటు లేదు
ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడి యోజ లేదు; భీతి యొకటి యెఱుఁగ;
డెలమి నూరకుండఁ; డెక్కసక్కెములాడుఁ; బట్టి శాస్తి సేయుభంగి యెట్లు? 364

---

1. సుడియుచు - తిరుగుచు. 2. కూఁకటి - పిల్లజుట్టు, 3. బోయెంజూచి - పాఠాంతరము, 4. కలభగామిని యతనిం; కలభి; కలభకాని - పాఠాంతరములు, 5. గలబకాఁడు- దుండగీఁడు, 6. సెలగోల - గొల్లవానికఱ్ఱ, 7. మందలించుచు; మూదలించుచు - పాఠాంతరములు, 8. వెఱపు - భయము, 9. బుద్ధి - పాఠాంతరము.

వ. అని వితర్కించి. 365

క. '[1]లాలనమున బహుదోషము లోలిం బ్రాపించుఁ; దాడనోపాయములం
జాల గుణంబులు గలుగును బాలురకును దాడనంబ [2]పథ్యంబరయన్.' 366

వ. అని నిశ్చయించి కేల నున్న కోల ఝళిపించి 'బాలా! నిలు నిలు' మని బగ్గు బగ్గున నదల్చుచుఁ దల్లి డగ్గఱిన బెగ్గడిలినచందంబున నగ్గలిక సెడి తోలు డిగ్గ నుఱికి. 367

క. గజ్జెలు గల్లని మ్రోయఁగ [3]నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియుఁ బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా! 368

వ. అప్పుడు. 369

మ. స్తనభారంబున డస్సి క్రుస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో [4]స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ గూడఁబాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్ర మనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్. 370

వ. ఇట్లు గూడంజని. 371

సీ. స్తంభాదికంబులు దనకు నడ్డంబైన నిట్టట్టు సని పట్టనీనివాని
'నీ తప్పు సైరింపు మింక దొంగిలఁబోవ నే' నని మునుముట్ట నేడ్చువానిఁ
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలుకన్నీటితో వెగచువాని
నే దెసవచ్చునో యిది యని పలుమాఱు [5]సురుఁగుచుఁ గ్రేగంటఁ జూచువానిఁ
ఆ. గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ 'జిన్ని వెన్నదొంగ సిక్కె' ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోఁడి కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి. 372

వ. ఇట్లనియె. 373

క. 'మీ రెవ్వరు? శ్రీకృష్ణులు; గారా? యెన్నడును వెన్నఁ గానరఁట కదా
చోరత్వం బించుకయును నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే! 374

క. [6]పట్టినఁ బట్టువడని నినుఁ బట్టెద నని చలముగొనినఁ బట్టుట బెట్టే?
పట్టువడ వండ్రు పట్టీ పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే? 375

---

1. లాలనము - ముద్దుసేయుట, 2. పథ్యంబు- హితము, 3. అజ్జలు ద్రొక్కుటలు- చిందులు త్రొక్కుటలు, 4. స్రస్త - జాఱిన, 5. సోలయుచక్కటి; సురుగుచక్కటిఁజాఱు- పాఠాంతరములు, 6. పట్టూసపడక నిన్నుం—పాఠాంతరము.

క. ఎక్కడ నైనను దిరిగెద వొక్కయెడన్ గుణము కలిగి యుండవు; నియమం
బెక్కడిది నీకుఁ? మఱచినఁ జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా! 376

సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు తలఁచెదు గట్టైనఁ దరల నెత్త
మంటితో నాటలు మానవు; కోరాడె దున్నత స్తంభంబు లూఁపఁబోయె
దన్యుల నల్పంబు లడుగంగ బాఱెదు రాచవేఁటలఁ జాల నవ్వ దెచ్చె
దలయవు నీళ్ళకు నడ్డంబు గట్టెదు ముసలిపై హరివృత్తి మొనయఁ జూచె
ఆ. [1]దంబరంబు మొలకు నడుగవు తిరిగెద వింకఁ [2]గల్కిసేఁత లేల పుత్ర
నిన్ను వంప వ్రాల్ప నే నేర ననియొ నీ విట్టు క్రిందు మీఁదు నెఱుఁగ కునికి 377

—: [3]ఉలూఖలబంధన [4]యమళార్జున భంజనాద్యభివర్ణనము :—

వ అని మర్మంబు లెత్తి పలికి. 378

క. ఆ లలన గట్టె ఱోలన్ లీలన్ నవనీతచౌర్యలీలుం బ్రియవా
గ్జాలుం బరివిస్మితగోపాలున్ ముక్తాలలామఫాలున్ బాలున్. 379

క. ఱోలను గట్టువడియు న బ్బాలుఁడు విలసిల్లె భక్తపరతంత్రుండై
[5]యాలానసన్నిబద్ధ విశాలమదేభేంద్రకలభసమరుచి నధిపా! 380

క. వెలిలోను మొదలు దుది నడుములులేక జగంబుతుదియు మొదలున్ నడుమున్
వెలియును లో నగు నీశ్వరు నలవడునే కట్టఁ బ్రణతురాల్ గాకున్నన్? 381

ఆ. పట్టి [6]యెల్లబోఁటి పట్టి యీతం డని గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక
పట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు వట్టు బెట్టిఁగెనేనిఁ దల్లి యేల కట్టు? 3 2

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ జిక్కఁడు సనకాదియోగి చిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావలిఁ జిక్కె నతఁడు లీలఁ దల్లిచేతన్ ఱోలన్. 383

వ. ఇట్లు శ్రద్ధన నా ముద్దియ ముద్దులపట్టియుదరంబు గట్ట నదరుచుఁ, జతురంబుగఁ జక్క నొక్కత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు గడమపడియె; మఱియు నొక్క బంధనంబు సంధించి [7]వలగొనిన, నంతియ కొఱంత యయ్యెఁ; వెండియు నొక్క పాశంబుగూర్చి పరివేష్టించిన వెల్తి సూపె; నిట్లు, 384

1. అంబరంబు - వస్త్రము, 2. కల్కిసేఁతలు - దుడుకుపనులు, (దశావతారవర్ణన మిందుఁగలదు), 3. ఉలూఖలబంధనము - ఱోటికిఁగట్టుట, 4. యమళార్జునభంజనము - మద్దిచెట్లజంటను విఱుచుట, 5. ఆలానము - కట్టుగంబము, 6. ఎల్లబోఁటి - అందఱివంటి, 7. వలగొనిన - చుట్టిన.

క. తజ్జనని లోఁగిటం గల దజ్జుపరంపరలఁ గ్రమ్మఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రా దయ్యె జగజ్జాలము లున్న బొజ్జ గట్టన్ వశమే ? 385

వ. అప్పు డా యవ్వయు గోపికలును వెఱంగుపడిరి తదనంతరంబ. 386

ఆ. ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జాఱ వీడి యున్న [1]తుఱుమువిరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ గట్టుకొనినతల్లి గరుణఁ జూచి. 387

క. బంధవిమోచనుఁ డీశుఁడు బంధింపఁ బెనంగు జనని పా టోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ బంధంబునఁ బట్టువడియెఁ బాటించి నృపా ; 388

క. [2]సంగడిఁ దిరిగెడు శంభుఁడు నంగాశ్రయ యైన సిరియు నాత్మజుఁడై యు
ప్పొంగెడి పద్మజుఁడును గోపాంగనక్రియఁ గరుణ వడయ రఖిలేశ్వరుచేన్. 389

క. జ్ఞానులచే మౌనులచే దానులచే యోగసంవిధానులచేతం
బూని నిబద్ధుం డగునే శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్ ? 390

వ. అంత నయ్యశోద యింటికడం బనులవెంటం దిరుగఁ గృష్ణుఁడు దొల్లి నారదు శాపంబున [3]నిరుమద్దులైయున్న నలకూబరమణిగ్రీవు లను గుహ్యకుల నిద్దఱం గని రో లీడ్చుకొని చనియె నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డిట్లనియె. 391

క. 'నారదుఁ డేల శపించెను ? వా రా వృక్షత్వమునకు వచ్చిన పనికిం
గారణ మెయ్యది? యోగికులారాధ్య ! యెఱుంగఁ జెప్పుమయ్య వినియెదన్.' 392

వ. అనిన శుకుం డి ట్లనియె. 'మున్ను కుబేరునికొడుకు లిరువురు శంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరులతోఁటలం బాడెడి చేడియలం గూడికొని కరేణుసంగతంబులైన యేనుంగులభంగి [4]సురంగంబులైన మందాకినీతరంగంబులం గ్రీడింప, నారదుండు వచ్చిన నచ్చెలువలు సెచ్చెర వలువలు ధరియించిరి; మదిరాపానపరవశులు గావున వార లిరువురు వివస్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు సూచి శపించువాఁడై [5]ప్రతీతంబగు గీతంబు పాడె; వినుము 393

శా. 'సంపన్నుం డొరుఁ గాన లేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తుపడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సమముగాఁ జింతించు నట్టౌటఁ ద
త్సంపన్నాంధున [6]కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్. 394

1. తుఱుము - కొప్పు, 2. సంగడిఁదిరిగెడు - కలసిమెలసి తిరుగుచున్న, 3. ఇరు-రెండు, 4. సురంగంబులు - అందమైనవి, 5. ప్రతీతంబు-ప్రసిద్ధము-మేలైనది, 6. అంజనంబు-రసాంజనము.

వ. అని గీతంబు వాడి తన మనంబున, 395

క. 'కలవానిసుతుల మనుచును గలకంఠులతోడఁ గూడి కానరు పరులం
గలలో నైనను వీరికిఁ గల [1]క్రొవ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్.' 396

వ. అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూబరమణిగ్రీవులంజూచి 'మీరలు శ్రీమదాంధులరు గావున భూలోకంబున [2]నర్జునతరువులై నూఱు దివ్య వర్షంబు లుండుం డఁటమీఁద గోవిందచరణారవింద [3]పరిస్పందంబున. 397

క. ముక్తులరై నారాయణ భక్తులరై పరమసాధుభావశ్రీసం
సక్తులరై సురలోక వ్యక్తుల రయ్యెదరు నాదువాక్యముకతనన్.' 398

వ. అని యిట్లు పలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె వా రిరువురును సంగడి మద్దు లైరి; పరమభాగవతుండైన నారదుమాటలు [4]వీటింబుచ్చక పాటించి. 399

క. ముద్దులతక్కరిబిడ్డఁడు మద్దులఁ గూల్పంగఁ దలఁచి మసలక తా నా
మద్దికవ యున్న చోటికి గ్రద్దన తోలీడ్చుకొనుచుఁ గడఁకం జనియెన్. 400

వ. చని యా [5]యూర్జితమహాబలుండు నిజోదరదామసమాకృష్యమాణతిర్యగ్భవదులూఖలుండై యా రెండు మ్రాఁకులనడుమం జొచ్చి ముందటికి నిగుడుచు. 401

క. బాలుఁడు తో లడ్డము దిన మూలంబులు వెకలి విటపములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను శాపాలస్యవివర్జనములు యమళార్జునముల్. 402

వ. ఇట్లు నిర్మూలంబులయి పడిన సాలంబులలోనుండి [6]కీలికీలలు వెల్వడుపోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధులైన సిద్ధు లిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోక పాలకుండైన బాలకునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిచి యి ట్లనిరి. 403

క. బాలుఁడవె నీవు? పరుఁడ వ నాలంబుఁడ వధికయోగి వాద్యుఁడవు తను
స్థూలాకృతి యగు విశ్వము నీ లీలారూప మండ్రు నిపుణులు కృష్ణా! 404

సీ. ఎల్లభూతంబుల కింద్రియాహంకృతిప్రాణంబులకు నధిపతివి నీవ;
ప్రకృతియుఁ బ్రకృతిసంభవమహత్తును నీవ; వీని కన్నిటికిని విభుఁడ వీవ;
ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వసిద్ధుండవగు నిన్నుఁ జింత సేయ
గుణవృతుం డోపునే? గుణహీన! నీయంద కల గుణంబుల నీవ కప్పఁబడుదు;

1. క్రొవ్వు-గర్వము, 2. అర్జునతరువులు-మద్దిచెట్లు, 3. పరిస్పందంబు-స్పర్శము, 4. వీటింబుచ్చక-పొల్లుసేయక, 5. విజిత-పాఠాంతరము, 6. కీలికీలలు - అగ్నిజ్వాలలు.

తే. మొదల నెవ్వని యవతారములు శరీరులందు సరిదొడ్డు లేని వీర్యములఁ దనువు
లదర జన్మించి వారలయందుఁ జిక్కపట్టి పరమేశ ! మ్రొక్కెదమయ్య నీకు. 405

క. భువనములు సేయఁ గావఁగ నవతీర్ణుండ వైతి కాదె యఖిలేశ్వర ! యో
గివరేణ్య ! విశ్వమంగళ ! కవిసన్నుత ! వాసుదేవ ! కల్యాణనిధీ ! 406

ఉపేంద్రవజ్రము : తపస్వివాక్యంబులు దప్ప వయ్యెన్; నెపంబునం గంటిమి నిన్నుఁ జూడం
దపంబు లొప్పెన్; మముఁ దావకీయ [1]ప్రపన్నులం జేయుము భక్తమిత్రా ! 407

శా. నీ పద్యావళు లాలకించుచెవులున్ ని న్నాడువాక్యంబులున్
నీపేరం బనిసేయు హస్తయుగముల్ నీమూర్తిపైఁ జూపులున్
నీపాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీసేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్త్రేక్షణా !' 408

వ. అని యిట్లు కీర్తించిన గుహ్యకులం జూచి నగుచు నులూఖలబద్ధుండైన హరి యిట్లనియె.

క. 'తమతమ ధర్మము దప్పక సములై నను నమ్మి తిరుగు సభ్యులకును బం
ధము నన్నుఁ జూడ [2]విరియును గమలాప్తుఁడు వొడమ విరియు ఘనతమముక్రియన్ 410

క. కారుణ్యమానసుం డగు నారదు వచనమునఁ జేసి నను బొడగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి చేరెన్ నామీఁదితలఁపు సిద్ధము మీకున్.' 411

వ. అని యీశ్వరుండు 'మీరు మీనెలవులకుం బొం' డని యానతిచ్చిన మహాప్రసాదం బని వలగొని పెక్కు మ్రొక్కులిడి వీడుకొని నలకూబరమణిగ్రీవు లుత్తర భాగంబున కరిగి; రంత నందాదు లయిన గోపాలకులు నిర్మూలంబులయి పడిన సాలంబుల చప్పుడు పిడుగు చప్పు డని శంకించి వచ్చి చూచి. 412

క. 'ఈ పాదపములు గూలఁగ నీ పాపఁ డులూఖలమున నిటు బద్ధుండై
యే పగిది బ్రదికెఁ ? గంటిరె ! [3]వాపోవఁడు; వెఱవఁ; డెట్టివాఁడో యితఁడున్. 413

ఆ. పిడుగు వడదు గాక పెనుగాలి విసరదు ఖండితంబు లగుట గానరాదు;
బాలుఁ డితఁడు పట్టి పడఁద్రోయఁ జాలఁడు; తరువు లేల కూలె ధరణిమీఁద ?' 414

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి. 415

1. ప్రపన్నులు - భక్తులు. 2 విరియును-విడిపోవును, 3. వాపోవఁడు - ఏడ్వఁడు.

క. 'నందునికొమరుఁడు వినుఁ డీ సందున మును దూటి తోలు సరి యద్దముగా
ముందటి కీడ్చిన మద్దులు గ్రందుకొనం గూలె; జనులఁ గంటి మిరుపురన్' 416

వ. అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని కొందఱు [1]మిథ్యారూపంబు లనిరి; కొందఱు నానావిధంబుల సందేహించి; రంత నందుండు వికసితవదనారవిందుం డగుచుఁ బట్టికట్టు విడిచె; నట్టియెడఁ దన తెఱం గెవ్వరు నెఱుంగకుండ వలె నని కపటకుమారుండు. 417

శా. 'పాడున్ మందువిభంగి గోపవనితల్ పాణిధ్వనుల్ సేయఁగా ;
నాడున్ జంత్రముకై వడిం బరవశుండై హస్తముల్ ద్రిప్పుచుః ;
జూడ న్నేరనివానిభంగి [2]జనులం జూచున్; నగున్; బాలురం
గూగుం; బెద్దలపంపు సేయఁ జను; డాఁగున్ [3]మట్టిఁ జిట్టాడుచున్. 418

క '[4]చుంచెడుగుఁ; బాలు [5]ద్రావుముదంచితముగ' ననుడు బాలుద్రావి జననితోఁ
జుం చెదుగ దనుచు లీలా [6]చుంచుండై యతఁడు చుంచుఁ జూపు న రేంద్రా ! 419

క. సెలగోల పట్టుకొని జల కలశములో నీడఁ జూచి కలశయుతుండై
సెలగోలఁ బాపఁ దొకఁ డిదె తలఁచెన్ ననుగొట్ట ననుచుఁ దల్లికిఁ జెప్పెన్. 420

క. 'భిక్షులు వచ్చెద రేడ్చిన భిక్షాపాత్రమున వైచి[7] [8]బెగడించి నినున్
శిక్షించెద' రని చెప్పిన భిక్షులఁ గని తల్లిఁ గనియు భీతిల్లు నృపా!' 421

—: నందాదులు బృందావనంబునకు నరుగుదెంచుట :—

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదులైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వాసివలన బాలుం [9]డుత్తరించుటయుఁ జూచి యేకాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుం డను వృద్ధగోపకుండు దన యెఱుక మెఱసి యి ట్లనియె 422

ఉ. 'ఇక్కడ నుందురే మనుజు? లీ మన కృష్ణున కెగ్గ సేయఁగా
[10]రక్కసురాలు చన్నొసఁగె; [11]జాలపయిన్ సుడిగాలి వీచెఁ; బైఁ

---

1. మిథ్యారూపంబులు - అసత్యములు, 2. నడచుం - పాఠాంతరము, 3. దూఁగుఁ జిట్టాడుచున్ - పాఠాంతరము, 4. చుంచు-పిల్లజుట్టు, 5. గుడిసెఁడు; పుడిసెఁడు - పాఠాంతరములు, 6. చుంచుండు - నేర్పరి, 7. బిగియించి - పాఠాంతరము, 8. బెగడించి-భయపెట్టి, 9. ఉత్తరించుట - తప్పించుకొనుట, 10 రక్కెసరాలు - పాఠాంతరము, 11. జాలపయిన్- రాళ్లతోఁగూడ.

గ్రిక్కిఁటియం దరుల్ వడియెఁ; గేశవుసత్కృపఁ దప్పెఁ; జాలు; నేఁ
డెక్కడ కైనఁ బోవలయు నిం కిట గోపకులార! వింటిరే! 423

క. కసవు గల దిరవు పసులకు లసదద్రినదీమహీజలతికావలి పెం
పెసఁగును; గాఁపురమునకును బొసఁగును బృందావనంబు వోదఁ దచ్చటికిన్' 424

వ. అని పలుకు నుపనందునిపలుకుల కార్యులైన గోపకు 'లిదియ కార్యంబు [1]మందల' యని కొందల మందక యాలమందల నమందగమనంబున ముందర నడవం బనిచి పిఱుందం గ్రందుకొనకుండ, బాలవృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తారు [2]తనుత్రాణతూణీర బాణధరులై విండ్లఁ బట్టుకొని నడవ, బండ్లవెనుకం గొమ్ములిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్యరవంబులు సెలంగ నార్యపురోహిత సమేతులై వేడుకలు కొదలు నిగుడ మొనలేర్పఱచుకొని పావనం బగు బృందావనంబునకుం జని రప్పుడు. 425

తరలము. [3]పసుపు లాడి యురోజకుంకుమపంకశోభితలై లస
ద్వసనలై కచభారచంపకదామలై సుబలామలై
పసిఁడిమాడలకాంతు లబ్బులఁ బర్వఁ దేరులమీఁదఁ బెం
పెసఁగఁ బాడిరి వ్రేత లాహరిహేల లింపగునేలలన్. 426

వ అప్పుడు రోహిణీయశోద లేకరథంబునఁ బరిపూర్ణమనోరథలై రామకృష్ణుల ముందట నిడుకొని వారల వినోదంబులకు బ్రమోదంబు నొందుచుం జని; రిట్లు గోపకులు బృందావనంబు సొచ్చి యం దర్ధచంద్రాకారంబుగ శకట సందోహంబు నిలిపి మందల విడియించి వసియించిరి. 427

క. చెందిరి బలమాధవు లభినందించుచుఁ బరమపావనము నంచితకా
ళిందీసంజీవనమున్ బృందావనమున్ మునీంద్రబృం[4]దావనమున్. 428

వ. ఇట్లు బృందావనంబుఁ జెంది యందుఁ గొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులైన గోపబాలకులం గూడికొని వేడుక [5]లూఁడుకొన దూడలఁ గాచుచు. 429

సీ. వేణువు లూఁదుచు వివిధరూపములతో గంతులు వైతురు కౌతుకమున;
గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని పరవృషభము లని ప్రతిఘటింతు;
[6]రల్లులు దట్టించి యంఘ్రులగజ్జెలు మొరయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ;
బన్నిదంబులు వైచి ఫలమంజరులుగూర్చి వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప;

1. మందల - విధము, 2. తనుత్రాణము - కవచము, 3. పసుపులాడి - పసుపు రాచికొని, స్నానముచేసి, 4. అవనము - రక్షణము, 5. ఊఁడుకొన - నాఁటుకొనఁగా, 6. అల్లులు - ఒకరీతి యాఁటలు.

తే. వన్యజంతుచయంబుల వానివాని [1]పదురు పదురుచు వంచించి పట్టఁబోదు;
రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు; రాకుమారులు బాల్యవిహారు లగుచు. 430

క. పోరుదురు గికురు వొడుచుచుఁ; దూఱుదురు భయంబు లేక [2]తోరపుటిరువుల్;
జాఱుదురు ఘనశిలాతటి; మీఱుదు రెన్నంగరాని మెలఁకువల నృపా! 431

వ. అంత నొక్కనాఁడు యమునాతీరంబున నా కుమారులు గోపకుమారులుం దారును గ్రేపుల
మేప నొక్క రక్కసుండు గ్రేపురూపున వచ్చి వారల హింసింపం దలచి. 432

—: వత్సాసుర బకాసురుల వధ :—

క. గ్రేపుల [3]యట్టులు నాకుచుఁ గ్రేపులలో నిడియె మంచిగ్రే పనఁగఁ గడుం
జూపట్టి భక్తసంగతిఁ గ్రేపై చనువానిమ్రోలఁ గ్రేపై తిరిగెన్. 433

వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి. 434

చ. 'ఇది యొక మంచిలేఁగ; వినుఁ డెంతయు నొప్పెడి' నంచు డాసి త
త్పదములుఁ దోఁకయున్ బిగియఁబట్టి చెలంగి వెలంగ మ్రానితోఁ
జదియఁగ నొక్కపెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం;
గుదులుకొనంగ బాలకులు గో యని యార్వ నఖర్వలీలతోన్. 435

వ. ఇట్లు రక్కసుండు వ్రేటుపడి విశాలంబగు సాలంబుతో నేలం గూలె; నప్పుడు. 436

క. [4]గొంగడు లెగురఁగ వైచుచుఁ జంగున దాఁటుచును జెలఁగి నప్పట లిడుచుం
బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ [5]దుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్లిరి కొమరుల్. 437

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి; రివ్విధంబున. 438

క. వత్సములపగిది జగముల వత్సలతన్ మనుపఁ జాచువాఁడై యుంటన్
వత్సముల మేపుచుండియు వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా 439

వ మఱియు నొక్కనాఁడు [6]రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం జని
యెండం బడి మెండుకొనిన దప్పిని బెండువడిన తమతమ లేఁగకదుపుల నేర్పరించి
నిలువరించుకొని కలంకంబు లేని యొక్కకొలంకున నీరు ద్రావించి, తారును జలపానంబు
సేసి వచ్చు నెడ నందు. 440

---

1 పదురు - అలుపు, 2 తోరపుటిరువుల్ - దట్టమైనపొదలు, 3. అట్టు - మెడ,
4. గొంగడులు - కంబళ్లు, 5. త్రుంగిన - చచ్చిన, 6. రేపకడ-ఉదయమున.

క. అకలంకులు బాలురు గని రకుటిలదంభోళిహతసితాద్రి శిఖరరూ
పకమున్ హరిహింసారంభకమున్ బకమున్ విశాల [1] భయదాంబకమున్. 441

వ. కని దాని యొదలిపొడువునకు వెఱఁగుపడి చూచుచుండ, 442

ఆ. ఎల్లపనులు మాని యేకాగ్రచిత్తుఁడై మౌనివృత్తి నితరమమత విడిచి
వనములోన నిలిచి వనజాక్షుపై దృష్టిఁ జేర్చి బకుఁడు దపసిచెలువుఁ దాల్చె. 443

వ. ఇవ్విధంబున నొదుఁగు వెట్టుకొనియుండి. 444

ఉ. [2]చంచువు దీటి, పక్షములు జల్లున విచ్చి, పదంబు లెత్తి, కు
ప్పించి, నభంబుపై కెగసి, భీషణఘోషణవక్త్రుఁడై విజృం
భించి, [3]గరుత్సమీరమున భిన్నములై తరు లొలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిన్నికృష్ణునిన్. 445

క. సంగడి లోకములన్నియు మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను
ప్పొంగెడి వేడుకకాఁ డటు మ్రింగుడువడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా! 446

క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ గనలేక బలాది బాలకప్రముఖు [4]లచే
తనులై వెరఁ గందిరి చయ్యనఁ బ్రాణము లేని యింద్రియంబులభంగిన్. 447

వ. ఇట్లు మ్రింగుడువడి లోనికిం జనక. 448

శా. కంఠోపాంతము దొడలున్ మెఱముచుం గాలాగ్ని చందంబునం
[5]గుంఠీభూతుఁడు గాక వేంద్ర మగు నా గోపాలబాలున్ జయో
త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జక్కన్ మ్రింగరాదంచు [6] [7]ను
ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలెన్ లోకం బశోకంబునన్. 449

క. క్రక్కి మహాఘోషముతో జక్కఁగఁ దనుఁ బొడువరాఁగఁ జంచులు రెండున్
జుక్కఁగబట్టి తృణముఁ జియ గ్రక్కున హరి సీరె బకునిఁ గలహోత్సుకునిన్. 450

వ. అప్పు డా నందనందనునిమీఁద వేలుపులు [8]చాలుపులుగా నందనమల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి; దేవవాద్యంబులు మొరసె; రామాది గోపకుమారులు ప్రాణంబులతోఁ

---

1. భయదాంబకము-భయము కల్గించు కన్నులుకలది, 2. చంచువు-ముక్కు, 3. గరుత్సమీరము - ఱెక్కలగాలి, 4. అచేతనులు - తెలివి తప్పినవారు, 5. కుంఠీభూతుండు - వ్యర్థప్రయత్నము కలవాఁడు, 6. సోల్లుంఠం - పాఠాంతరము, 7. ఉల్లుంఠంబు - వ్యాజస్తుతి, 8. చాలుపులు - గుంపులు

గూడిన యింద్రియంబులుం బోలెఁ గ్రమ్మఱఁ గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించుకొని కృష్ణసహితు లయి లేఁగ [1]దాఁటుల మరల దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి; వారలచేత నా వృత్తాంతం బంతయు విని వెఱంగుపడి గోపగోపికాజనంబులు. 451

క. ఆపదలమీఁద నాపద లేపాపనిఁ జెంది తొలఁగె; నీ యర్భకుపై
నే పడిన ఖలులు దహనుని వైపున [2]శలభములపగిదిఁ బడిరి ధరిత్రిన్ 452

వ. అని పలికిరి; మఱియు నా రామకృష్ణులు క్రేపులం గాచుతఱి. 453

సీ. కపులమై జలరాశిఁ గట్టుదమా యని కట్టుదు రడ్డంబు గాలువలకు;
మునులమై తపములు మొనయుదమా యని మౌనులై యుందురు మాట లేక;
గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ బాడుదమా యని పాడఁ జొత్తు;
రప్సరోజనులమై యాడుదమా యని యాఁడురూపులఁ దాల్చి యాడఁ జనుదు;
ఆ. రసురదైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా యని సరోవరములయందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమయీడుకొమరు లనుచరింపఁ గొమరుమిగుల. 454

—: శ్రీకృష్ణుడు గోపకులతో బంతిచల్దులు గుడువ వనమున కేఁగుట :—

వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులు గాంతాగంబున [3]బంతిచలుదులు గుడువ నుద్యోగించి, ప్రొద్దున లేచి, గ్రద్దనం దమయింటి లేఁగకదుపులఁ గదలించి, సురంగంబులగు [4]శృంగంబులు పూరించిన విని, మేలుకని, సంరంభంబున గోపడింభకులు చలిదికావడులు మూపుల వహించి, సజ్జంబులగు [5]కజ్జంబులు గట్టికొని, [6]పదత్రాణవేత్రదండధరులై, లెక్కలకు వెక్కసం బైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచుఁ, గాననంబు సొచ్చి, కాంచనమణి పుంజగుంజాది భూషణభూషితులయ్యును, ఫలకుసుమకోరకపల్లవ వల్లరులు దొడవులుగా నిడుకొని, కొమ్ము లిమ్ముగఁ బూరించుచు వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచు, పికంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలుసేయుచుఁ, బులుఁగుల నీడలం బాఱుచుఁ [7]సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబులచెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, [8]సారసంబులం జోపి యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీవయుయ్యెలల నూఁగుచుఁ, బల్లంబులన్ డాఁగుచు, దూరంబుల కేఁగుచు, గపులసంగడిఁ దరువులెక్కుచు, ఫలంబుల మెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి నిక్కుచు, నీడలు సూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం

1. దాఁటులు - గుంపులు, 2. శలభములు - మిడుతలు, 3. బంతిచలుదులు - మొత్తముగాకూడి తిను చలుదులు, 4. శృంగంబులు - ఊఁదుకొమ్ములు, 5 కజ్జంబులు - భక్ష్యములు, 6. పదత్రాణములు - చెప్పులు, 7. సరాళంబులు - సరళమైనవి, 8. కాసారంబులం జొచ్చి కలంచుచు—పాఠాంతరము.

గాలు ద్రువ్వుచుఁ, జెలంగుచు, మెలఁగుచు, వ్రాలుచు సోలుచు బహుప్రకారంబుల శరీర వికారంబులు సేయుచు మఱియును 455

క. ఒకనొకని చల్దికావడి నొకఁ డొకఁ డడకించి దాఁచు; నొకఁ డొకఁ డది వే
ఱొకఁ డొకని మొఱఁగికొని చన నొకఁ డొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా! 456

క. ఒక్కఁడు ము న్నేమఱి చన నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడన్; వే
ఱొక్కఁడు మిట్టి తటాలున నొక్కనికను దోయి మూయు నొక్కఁడు నగఁగన్. 457

క. తీపుగల కజ్జ మన్యుఁడు గోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం
బైపడి యది గొని యొక్కఁడు క్రేపులలో నిట్టు నట్టుఁ గికురించు నృపా; 458

క వనజాక్షుఁడు ము న్నరిగిన [1]'మునుపడఁగా నతని నేనె ముట్టెద' ననుచుం
జని మును ముట్టనివానిన్ మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా! 459

వ ఆవ్విధంబున. 460

ఉ. ఎన్నఁ(?)డునైన యోగివిభు లెవ్వనిపాదపరాగ మింతయుం
గన్నులఁ గాన, రట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచుం,
దన్నుచుఁ గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైపడి కూడి యాడుచున్
మన్నన సేయు వల్లవకుమారులభాగ్యము లింత యొప్పునే? 461

క. [2]విందులకును బ్రహ్మసుఖా నందంబై భక్తగణమునకు దైవతమై
మందులకు బాలుఁడగు హరి పొందుఁ గనిరి గొల్లః లిట్టి పుణ్యులు గలరే? 462

వ. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు ని ట్లనియె. 463

క. అమరు లమృతపానంబున సమరినవా రయ్యు నే [3]నిశాటునిపంచ
త్వమునకు నెదురు సూతురు తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై 464

క. బకునికిఁ దమ్ముఁడు గావున బకమరణము దెలిసి కంసుపంపున గోపా
లకబాలురతోఁ గూడను బకవైరిని ద్రుంతు ననుచుఁ బటురోషమునన్. 465

క. 'బాలుర ప్రాణంబులు గోపాలురకు [4]మదగ్రజాతు ప్రాణము మా టీ
బాలురఁ జంపిన నంతియ చాలును గోపాలురెల్ల సమసినవారల్.' 466

---

1. మునుపడఁగ - ముందుగా, 2. విందులు -చుట్టములు, 3. నిశాటుని పంచత్వము-రాక్షసుని మృతి, 4. మదగ్రజాతుఁడు - నాయన్న.

వ. అని నిశ్చయించి యోజనంబునిడుపును మహాపర్వతాకారంబు పొడువును గొండ తుదల మీఱిన కోఱలును మిన్ను దన్ని పన్నిన నల్లమొగిళ్ళ పెల్లుగల పెదవులును బిలంబులకు నగ్గలంబైన యిరుకుసందులును నంధకారబంధురంబైన [1]వదనాంతరాళంబును దావానలజ్వాలా భీలంబైన దృష్టిజాలంబును వేఁడిమికి నివాసంబులైన యుచ్ఛ్వాసనిశ్వాసంబులుమ మెఱయ నేల నాలుకలు దఱచుకొని ఘోరంబగు [2]నజగరాకారంబున 467

క. [3]జాపిరము లేక యిప్పుడు క్రేపుల గోపాలసుతులఁ గృష్ణుని [4]తోడన్
గ్రీ పెట్టఁగ మ్రింగెద నని పాపపురక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా! 468

వ. ఆ సమయంబున. 469

మ. 'ఒక వన్యాజగరేంద్ర మల్లదె [5]గిరీంద్రోత్సేధమై బావపా
వకకీలాపరుషప్రచండతరనిశ్వాసంబుతో ఘోరవ
హ్నికరాళాతతజిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్
వికటంబై పడి సాఁగి యున్నది పురోవీథిం గనుఁగొంటిరే?' 470

వ. అని యొండొరులకుం జూపుచు. 471

మ. 'బకునిం జంపిన కృష్ణుఁ డుండ మనకుం బా మంచుఁ [6]జింతింప నే
టికి? రా పోదము దాఁటి; కాక యది కౌటిల్యంబుతో మ్రింగుడున్
బకువెంటం జనుఁ గృష్ణుచేత' ననుచుం బద్మాక్షు నీక్షించి యు
త్సుకులై చేతులు వేసికొంచు నగుచున్ దుర్వారులై పోవఁగన్. 472

వ. వారలం జూచి దనమనంబున. 473

ఉ. 'అర్భకు లెల్ల బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ; రక్కటా
నిర్భయులై యెదుర్కొనిరి నే గల నంచు విమూఢు లంచు నా
విర్భవదాగ్రహత్వమున వెస్తగులం దమలేఁగపిండుతో
దుర్భరఘోరసర్పఘన [7]తుండబిలాంతముఁ జొచ్చి రందఱున్. 474

వ. అయ్యవసరంబున. 475

శా. వేల్పుల్ సూచి భయంబు నొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల
త్కల్పాంతోజ్జ్వలమానజిహ్వదహనాకారంబుతో మ్రింగెన

1. వదనాంతరాళంబు-నోటిలోపలిభాగము, 2. అజగరము-కొండచిలువ, 3. జాపిరము - ఆలస్యము, 4 తొడరం—పాఠాంతరము, 5. గిరీంద్రోత్సేధము-కొండవంటి దేహము కలది, 6. శంకింప—పాఠాంతరము, 7. తుండబిలాంతరము - నోటిబిలము చివరిభాగము.

స్వల్పాహీంద్రము మాధవార్పితమనోవ్యాపార సంచారులన్
స్వల్పాకారుల [1]శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్. 476

వ. ఇట్లు పెనుఁబాముచేత మ్రింగుడుపడు [2]సంగడికాఱగమిం జూచి కృష్ణుండు 477

చ. 'పడుచులు లేఁగలుం గలసి పైకొని వత్తురు తొల్లి కృష్ణ! మా
కొడుకు ల దేల రా? రనుచు గోపిక లెల్లను బల్కఁ,నే క్రియన్
నొడివెద? నేఁడు పన్నగమునోరికి వీరికి నొక్కఁలంకె గా
నొదఁబడ నేల చేసె? విధి యోడక సేయుఁగదయ్య క్రౌర్యముల్ !' 478

వ. అని తలపోసి యఖిలలోచనుండును నిజాశ్రితనిగ్రహమోచనుండును నైన తమ్మికంటి [3]మింటితెరువరులు మొఱలిడ రక్కసు లుక్కుమిగుల వెక్కసంబగు నజగరంబయి యున్న యన్నరభోజను కుత్తుకకుఁ [4]బొత్తుగాని మొత్తంబు వెంట నంటం జని తమ్ము నందఱఁ జిందఱవందఱ సేసి మ్రింగ నగ్గలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దన శరీరంబు పెంచి గద్దన మిద్దె సఱచిన ట్లుండ. 479

క. ఊపిరి వెడలక కడుపున వా పొదవినఁ బాము ప్రాణవాతంబులు సం
తాపించి శిరము ప్రక్కలు వాపికొనుచు వెడలి చనియెఁ బటుఘోషముతోన్. 480

శా. క్రూరవ్యాళవిశాలకుక్షిగతులన్ గోవత్ససంఘంబుతోఁ
గారుణ్యామృతవృష్టిచేత బ్రదుకం గాఁ జూచి వత్సంబులున్
వారుం దాను దదాస్యవీథి మగుడన్ వచ్చెన్ [5]ఘనోన్ముక్తుఁడై
తారాసీకముతోడ నొ ప్పెసఁగు నా తారేశుచందంబునన్. 481

ఆ. అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల బలిఁ దిరస్కరించి బలియు వడుగు
గోపసుతులకొఱకుఁ బాపపుఁబెనుఁబాము గళము [6]దూఁటుగట్ట బలియకున్నె ! 482

ఉ. ఆ పెనుఁబాముమేన నొక యద్భుతమైన వెలుంగు దిక్తటో
ద్దీపకమై వడిన్ వెడలి [7]దేవపథంబునఁ దేజరిల్లుచుం
గ్రేవులు బాలురున్ బెదరఁ గృష్ణుని దేహము వచ్చి చొచ్చె నా
పాపఁడు సొచ్చి ప్రాణములఁ బాపినయంతన షద్ధసత్త్వమై.

---

1. శిక్యభారులు - చిక్కములు మోసికొనియున్నవారు, 2. సంగడికాఱగమి - మిత్రుల గుంపు, 3. మింటితెరువరులు-దేవతలు, 4. బొత్తుగాని—పాఠాంతరము, 5 ఘనోన్ముక్తుఁడు-మేఘముల నుండి విడివడినవాఁడు, 6. దూఁటుగట్ట - నిండిపోఁగా, 7. దేవపథంబు - ఆకాశము.

క తనరూ పొకమా త్రైనను మనమున నిడికొనినఁ బాపమయునైనను లోఁ
గొని చను హరి దను మ్రింగిన దనుజునిఁ గొనిపోవకున్నె తనలోపలికిన్ ? 484

వ. తదవసరంబున సురలు గుసుమవర్షంబులు గురియించిరి; రంభాదు లాడిరి; గంధర్వాదులు పాడిరి; మేఘంబులు మృదంగంబులభంగి ఘోషించెను; సిద్ధగణంబులు జయజయభాషణంబులు భాషించె; నంత. 485

శా. ఆ వాద్యంబులు, నా మహాజయరవం, బా పాట, లా యాటలుం,
[1]దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమి కేతెంచి 'నేఁ
డీవత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం
డేవెంటన్ బ్రదికించె ? మే' లనుచు నూహించెం గడున్ నివ్వెఱన్. 486

వ. అంత నయ్యజగరచర్మంబు గొన్ని దివసంబుల కెండి పెద్ద కాలంబు గోపాల బాలురకుం గేళిబిలంబై యుండె; నిట్లు కౌమారవిహారంబున నైదవయేటఁ గృష్ణుం డఘాసురునిం దెగఁజూచుటయుఁ, దమ్ముం గాంచుటయు, నాఱవ యేటిదైన పౌగండవృత్తాంతం బని చిత్తంబుల గోపకుమారులు దలంచుచుండు రని చెప్పిన నప్పుడమిఱేఁ డప్పరమయోగీంద్రున కిట్లనియె. 487

సీ. 'అయిదేండ్లు కౌమార; మటమీఁద నైదేండ్లు పౌగండ మనియెడు ప్రాయ మందు ;
నయిదేండ్ల వాఁడైన యబ్జాక్షుచరితంబు పౌగండ మని గోపబాలు రెల్లఁ
దలఁతు రంటివె ? యెట్లు దలంతురు వారలు ? నిరుడు సేసినపని నేఁటి దనఁగ
వచ్చునే ? యిది నాకు వరుసతో నెఱిఁగింపు [2]మనవుడు యతిచంద్రుఁడైన శుకుఁడు
ఆ. యోగదృష్టిఁ జూచి యొక్కింత భావించి 'వినుము రాజవర్య ! వినయధుర్య !
పరమగుహ్య మనుచుఁ బలుకుదు రార్యులు శిష్యజనుల కీపు సేయుతలఁపు. 488

క. ప్రియురాలివలని వార్తలు ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియమగుభంగిం
బ్రియుఁడగు హరిచరితంబులు ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే !' 489

వ అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె న ట్లఘాసురు మొగంబు వలనం [3]గడచనిన లేఁగల గోపకుమారులన్ బ్రదికించి వారును దానునుం జని చని. 490

మ కనియెం గృష్ణుండు సాధునీరము మహాగంభీరముం బద్మ [4]కో
కనదాస్వాదవినోదమోదమదభృంగద్వంద్వఝుంకారమున్,
ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ [5]గాసారమున్. 491

1. దేవజ్యేష్ఠుఁడు - బ్రహ్మ, 2. మనుడు నతీంద్రియుఁడైన - పాఠాంతరము, 3. కడచనిన - దాఁటిన, 4. కోకనదము - ఎఱ్ఱకలువ, 5. కాసారము - కొలను.

## —: గోపాలబాలురు కృష్ణునితోఁగూడ చల్దు లారగించుట :—

వ. కని తమ్మికంటి తమ్ములయింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడు కరళ్లతుంపురులజల్లు పెల్లున నొడళ్ల గగురుపొడువఁ గొలంకుఁ గెలంకులఁ గాయవం డుల గొలల వ్రేఁగున వీఁగి పట్టు గల చెట్టుఁ దుటుము నీడల నొప్పుచున్న యిసుక తిప్పల విప్పు సూచి వేడుక పిచ్చలింప నెచ్చెలుల కిట్లనియె. 492

శా. 'ఎండన్ [1]వ్రగ్గితి రాఁకటం బడితి రిం కేలా విలంబింపఁగా ?
రం డో బాలకులార , చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్క డీ
దండన్ లేఁగలు నీరు ద్రావి యిర వందం బచ్చికల్ మేయుచుం
[2]దండంబై విహరించుచుండఁగ నమందప్రీతి [3]భక్షింతమే !' 493

వ. అనిన 'నగుఁగాక' యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబులగు జలంబులు ద్రావించి, పచ్చికల [4]మొల్లంబులు గల పల్లంబుల నిలిపి చొక్కంబులగు చల్దుల చిక్కంబులు సక్క డించి. 494

మ. [5]జలజాంతస్స్థితకర్ణికం దిరిగి రా సంఘంబులై యున్న తే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగి రాఁ గూర్చుండి వీక్షించుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వు లా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా ! 495

సీ. మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి 'చూడలే' దని నోరు సూపు నొక్కఁ
డేగు రార్గురచల్దు లెలమిఁ [6]బన్నిదమాడి కూర్పొని కూర్పొని కుడుచు నొక్కఁ
డిన్ని [7]యుండఁగఁ బంచి యిడుట నెచ్చెలితన మనుచు [8]బంతెనగుండు లాడు నొకఁడు
ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ [9]గికురించి పరుమ్రోల మేలిభక్ష్యరాశి [10]మెసఁగు నొకఁడు;
నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు; ముచ్చటాడు నొకఁడు; మురియు నొకఁడు.

వ. అయ్యవసరంబున. 497

---

1. వ్రగ్గితిరి - తపించితిరి, 2. తండంబై - గుమిగూడి. 3. భుంజింత మే!— పాఠాంతరము. 4. మొల్లంబులు - మొత్తములు, 5. జలజాంతస్థితకర్ణిక - తామర పువ్వులోనున్న దుద్దు. 6. పన్నిదమాడి - పందెము వేసుకొని, 7. యు బొమ్మంచు లిడుట — పాఠాంతరము, 8. బంతినగుండ్లు; బంతెనగూళ్ళు — పాఠాంతరము, 9, కికు రించి - ఏమఱించి, 10. మెసఁగును - తినును,

సీ. కడుపున [1]దిండుగాఁ గట్టిన వలువలో లాలిత [2]వంశనాళంబుఁ జొనిపి,
విమల శృంగంబును వేత్రదండంబును జాఱి రానీక డాచంక నిఱికి,
మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్దిముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్లసందులయందు వెలయ నిఱికి
ఆ. [3]సంగడీలనడుమఁ జక్కఁగఁ గూర్చుండి నర్మభాషణముల నగవు నెఱపి,
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద శైశవంబు మెఱసి చల్ది గుడిచె. 498

వ. ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచునెడఁ గ్రేపులు మేపులకుం జొచ్చి పచ్చనిగఱికి జొంపంబుల గుంపుల కుఱికి, [4]లంపులు మేయుచు, ఘోరంబగు నరణ్యంబునడుమఁ దోరంబగు దూరంబు సనిన, వానిం గానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డిట్లనియె. 499

మ. వినుఁ డో బాలకులార! క్రేపు లటవీవీథిన్ మహాదూరముం
జనియెం గోమల[5]ఘాసఖాదనరతోత్సాహంబుతో; నెందుఁ బో
యెనొ, యేమయ్యెనొ, క్రూర జంతువులచే నే యాపదం బొందెనో?
కని తెత్తుం; గుడువుండు చల్దిఁ గొఱఁతల్ గాకుండ మీ రందఱున్? 500

వ. అనిచెప్పి. 501

—: బ్రహ్మ గోవత్సములను గోపబాలకులను నంతర్ధానంబు సేయుట :—

శా. కర్ణాలంబిత [6]కాకపక్షములతో, గ్రైవేయహారాళితో,
స్వర్ణాభాసిత వేత్రదండకముతో, సత్పింఛదామంబుతోఁ,
బూర్ణోత్సాహముతో, ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ
[7]దూర్ణత్వంబున నేఁగె లేఁగలకునై దూరాటవీవీథికిన్. 502

వ. ఇట్లేఁగుచు. 503

క. 'ఇచ్చోఁ బచ్చిక మేసిన విచ్చోఁ ద్రావినవి తోయ మేఁగిన విచ్చో
నిచ్చోట మందగొన్నవి యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె' యనుచున్. 504

క. కంజదళాక్షుఁడు వెదకెను [8]గొంజక లేఁగల నపారగురుతృణవనికా
పుంజంబుల భీకరమృగ కుంజంబులఁ దరుల గిరులఁ గొలఁకుల నదులన్. 505

వ. అంత. 506

---

1, దిండు - దట్టి, 2. వంశనాళంబు - వేణువు, 3. సంగడీలు - మిత్రులు, 4. లంపులు - దొంగమేఁతలు. 5. ఘాసఖాదనము - గడ్డిమేఁత, 6. కాకపక్షములు - పిల్లజుట్లు, 7. తూర్ణత్వంబు - శీఘ్రము. 8, కొంజక - సంకోచింపక.

శా. బాలుం డయ్యు నితం డఘాసురుఁడు ద్రుంపన్ బాలురం గ్రేపులన్
ఏ లీలన్ బ్రదికించె నొక్కొ? భువి నూహింపం గడుం జోద్య మం
చాలో [1]నంబుజసంభవుండు సని మాయాబాలు శుంభద్బలం
బాలోకింపఁ దలంచి డాఁచె నొక చో నా లేఁగలన్ బాలురన్. 507

వ. ఆ సమయంబున దూడలు వోయిన జాడ యెఱుంగక, తప్పి యప్పద్మలోచనుం డెప్పటి కొలంకుకడకు వచ్చి, యచ్చోట నెచ్చెలులం గానక వారిం జేరి, లేకుండుట నిశ్చయించి గోవిందుండు విశ్వవిదుండు గావున నిది విరించి [2]మొఱఁగని యెఱింగి తిరిగిపోవుచు 508

శా. వంచింపం బనిలేదు బ్రహ్మ కిచటన్ వత్సంబులన్ బాలురన్
వంచించెం [3]గనుఁ బ్రామి; తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే?
వంచింపన్ [4]మన కేల ! తెచ్చుటకునై వర్ధంచు బ్రహ్మాండము
ల్వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁడై 509

క. గోపాలసుతులు లేరని గోపికలకుఁ జెప్ప నేల? గోపాలకులున్
గోపికలు నలర బాలుర గ్రేపుల రూపముల నేఁ జరించెద ననుచున్. 510

మ. కరముల్ పాదములున్ శిరంబు [5]లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం
తరముల్ ముక్కులుఁ గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండకాం
బర స్రగ్వేణువిషాణభూషణవయోభాషా గుణాఖ్యానత
త్పరతల్ పేద్వడకుండఁ దాల్చె విభుఁ డా వత్సార్భకాకారముల్. 511

క. రూపంబు లెల్ల నెగు బహు రూపకుఁ డిటు బాలవత్స రూపంబులతో
నేపారు టేమి చోద్యము? రూపింపఁగ నతని కితరరూపము గలదే? 512

క. మరలుపు మనియెడు కర్తయు, మరలించు కుమారకులును, మరలెడి క్రేపుల్
పరికింప దాన యై హరి మరలం జనె లీలతోడ [6]మందకు నధిపా ! 513

వ. ఇట్లు బాలవత్సరూపంబులతో విహరించుచు మందకు వచ్చి వారివారి దొడ్ల నయ్యె వత్సంబుల ముందఱికందువల నిలిపి, తత్తద్బాలరూపంబుల నందఱి గృహంబులం బ్రవేశించి వేణునాదంబులు సేసిన. 514

చ. కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబులై
ముడివడ, లేచి యెత్తికొని మూర్ధాని తల్లులు గౌఁగిలించుచుం,

---

1. అంబుజసంభవుఁడు - బ్రహ్మ, 2. మొఱఁగు - మోసము, 3. కనుఁ బ్రామి - మోసగించి, 4. జనదింకఁ దెచ్చుట యగున్ — పాఠాంతరము. 5. అవలగ్నంబుల్ నడుములు, 6 మంద - వ్రేపల్లె.

జడిగొనఁ జేఁపు వచ్చి తను చన్నులయందు సుధాసమంబులై
వెడలెడి పాలు నిండుకొను వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్. 515

వ. మఱియుఁ దల్లు[1]లుల్లంబులఁ బెల్లుగ వెల్లిగొను వేడుకలం దమ నందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి. గంధంబు లలంది తొడవులు దొడిగి, నిటలతటంబుల రక్షాతిలకంబులు వెట్టి, సకలపదార్థ సంపన్నంబు లయిన యన్నంబు లొసంగి [2]సన్నములు గాని మన్ననలు సేసిరి. 516

క. ఏ తల్లుల కే బాలకు లే తెఱఁగునఁ దిరిగి ప్రీతి నెసఁగింతురు ము
న్నా తల్లుల కా బాలకు లా తెరఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా! 517

వ. ఆ సమయంబున. 518

ఉ. పాయని వేడ్కతో నునికిపట్టులకుం జని, గోవు లెల్ల నం
బే యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూర్కొని పంచితిల్లి, పె
ల్లై యతిరేకమై పొదుగులం దెడలేక స్రవించుచున్న పా
లాయెడ నాకుచున్ సుముఖులై యొసఁగెన్ నిజవత్సకోటికిన్. 519

క. వ్రేతలకును గోపులకును మాతృత్వము సాలఁ గలిగె మఱి మాధవుపై;
మాత లని హరియు నిర్మల కౌతూహల మొప్పఁ దిరిగెఁ గడుబాల్యమునన్. 520

ఆ. ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క, పూఁటపూఁట కెలమిఁ [3]బొటకరించె;
నిచ్చ క్రొత్తయగుచు నీరజాక్షునిమీఁద వేడ్కఁ దమకుఁ దొల్లి వెలసినట్లు. 521

వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు, మందను వనంబున [4]నమంద మహిమంబున నొక్కయేఁడు క్రీడించె; నా యేటికి నైదాఱుదినంబులు కడమపడి యుండ నం దొక్కనాడు బలభద్రుండును, దానును వనంబునకుం జని మంద చేరువ లేఁగల మేప నతిదూరంబునం గోవర్ధనశైలశిఖరంబున [5]ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు లా లేఁగలం గని. 522

చ. ముదమున హుంకరించుచును; మూఁపులపై మెడ లెత్తి [6]చాఁచుచుం,
బదములు నాల్గు రెం డయిన బాసుగఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్,
వదనములన్ విశాలతరవాలములన్ వడి నెత్తి పాఱి యా
మొదవులు సన్నులం గుడిపె మూతుల గ్రిమింగెడి భంగి నాకుచున్. 523

1. ఉల్లంబులు - మనస్సులు, 2. సన్నంబులు - తక్కువలు, 3. పొటకరించె - హెచ్చెను, 4. అమంద - తక్కువకాని, 5. ఘాసంబు - గడ్డి, 6. వైచుచు; వచ్చుచుం- పాఠాంతరములు.

వ. అంత గోపకులు గోవుల వారింప నలవి గాక, దిగ్గన నలుకతోడిసిగ్గు లగ్గలంబుగ దుర్గమ మార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని, 524

ఉ. అయ్యలఁ గంటి మంచుఁ బులకాంకురముల్ వెలయంగ [1]గుబ్బలం
జయ్యన డాసి యెత్తుకొని సంతస మందుచుఁ గౌఁగిలించి తా
రయ్యెడ నౌదలల్ మనము లారఁగ మూర్కొని ముద్దు సేయుచున్
[2]దయ్య మెఱుంగు; గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్. 525

వ. ఇట్లు బాలకాలింగనముల నానందబాష్పపూరిత నయనులై గోపకులు గోవుల మరలించుకొని తలంగి చన వారలం జూచి బలభద్రుండు దనలో నిట్లని తలంచె. 526

సీ. చన్ను మానినయట్టి శాబకశ్రేణిపై గోగణంబులకును గోపకులకు
నిబ్బంగి వాత్సల్య మెబ్భంగి నుదయించెఁ? హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు
మన్నించుచున్నారు; మమతఁ జేయుచుఁ బ్రీతి నంబుజాక్షునిఁ గన్నయట్టు నాకు
బ్రేమమయ్యెడి; [3]డింభబృందంబుఁ గనుఁగొన్న నిది మహాద్భుత మెందు నెఱుఁగరాదు
తే. మనుజదైవతదానవమాయయొక్కొ? కాక నా భర్త యగుచున్న కమలనయను
మాయయో కాక యితరులమాయ నన్నుఁ గలప నోపదు విభుమాయ గాఁగనోపు. 527

క. అని మున్ను [4]ముగ్ధుఁ డయ్యును దనయందుల దివ్యదృష్టి దప్పక బుద్ధిం
దన చెలికాండ్రను గ్రేపుల వనజాక్షుం డనుచుఁ జూచె వసుధాధీశా! 528

వ. ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు [5]గొందలంపడుచుఁ గృష్ణుం జూచి 'మహాత్మా! తొల్లి యెల్ల గ్రేపులును ఋషులయంశం బనియును; గోపాలకులు వేల్పులయంశం బనియును దోఁచుచుండు; నివుడు వత్సబాలక సందోహంబు సందేహంబు లేక నీవ యని తోఁచుచున్న; దిది యేమి?' యని యడిగిన నన్నకు నున్నరూపు వెన్నుండు మన్ననసేసి క్రన్నన యెఱింగించె; నతండు నెఱింగె; నివ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు [6]విరించికిఁ దన మానంబున నొక్క త్రుటి మాత్రం బయిన, విరించి చనుదెంచి వత్సబాలకాకారుండైన కృష్ణబాలకుం జూచి వెఱుంగు పడి యిట్లని వితర్కించె. 529

శా. 'మందం గల్గిన వత్సబాలకులు నా మాయాగుహాసుప్తులై
యెందుం బోవరు; లేవ రిప్పుడును; వేఱే చేయ నా కన్యు లొం
డెందున్ లేరు; విధాతలుం బరులు; వీ రెవ్వార లెట్లైరొకో:
యెం దేతెంచిరొ కృష్ణుతో మెలగువా? రేఁ డయ్యెడిన్ నేఁటికిన్. 530

1. కుబ్బలు - బాలురు, 2. దయ్యము - దైవము, 3. డింభబృందము - పిల్లల గుంపు, 4. ముగ్ధుఁడు - తెలియనివాఁడు. 5. కొందలంపడుచు - కలఁతపడుచు. 6. విరించి - బ్రహ్మ

మత్తకోకిలము. బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్;
బ్రహ్మ నొక్కఁడఁగాని వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా;
బ్రహ్మ నేను సృజింప నొండొక బాలవత్సకదంబ మే
బ్రహ్మమందు జనించె? [1]నొక్కట బ్రహ్మమౌనది చూడఁగాన్.' 531

వ. అని యిట్లు సకలంబును [2]సుకరంబున నెఱింగెడి నెఱవాదిముదుక యెఱుకగల ప్రోడ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు దద్దయుం దలపోసి [3]కర్జంబు మందల యెఱుంగక కొందలంపడుచు నాందోళనంబున. 532

క. మోహము లేక జగంబుల మోహింపఁగఁజేయ నేర్చి మొనసిన విష్ణున్
మోహింపఁచెద ననియెడు [4]మోహమున విధాత దాన మోహితుఁడయ్యెన్. 533

తే. పగలు [5]ఖద్యోతరుచి చెడుపగిది, రాత్రి మంచు చీఁకటి లీనమై మాయుమాడ్కి,
విష్ణుపై నన్యమాయలు విశదమగునె? చెడి నిజేశుల గరిమంబుఁ జెఱుచుఁగాక. 534

వ. మఱియును. 535

క. పుట్టితి; బుద్ధి యెఱింగితిఁ; బుట్టించితి జగము; సగము వోయెను బ్రాయం
బిట్టివి నూతనసృష్టులు పుట్టుట లే; దౌర! యిట్టి [6]బూమెలు భూమిన్. 536

వ. అని యిట్లు దలవాకిట వాణి గల పోఁడిమిచే వాఁడిమి కెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు వెనుదంట పలువెంటలం దనమనంబున వితర్కించి విచారించు నెడ, నతండు గనుగొనుచుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హారకుండల కిరీటవనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములును, నాపాదమస్తక తులసీదళ దాములును, విలసదంగుళీయకస్తోములును, శంఖ చక్రగదాకమలహస్తులును, జతుర్భుజ ప్రశస్తులను, బీతకౌశేయవాసులును, జంద్రికాధవళహాసులును, గరుణాకటాక్ష వీక్షణవిలాసులును, రవికోటిభాసులును, ననంతసచ్చిదానంద రూపమహితులును నణిమాదిగుణోపేతులును, విజాతీయభేదరహితులును, శ్రీమన్నారాయణ ప్రతిమాన విగ్రహస్వరూపులును నయి తమకుఁ బరతంత్రులగుచు నృత్తగీతాదిసేవా విశేషంబులకుం జొచ్చి మెలంగుచు [7]మూర్తిమంతంబులయిన బ్రహ్మాది చరాచరంబులు, నణిమాదిసిద్ధులును, మాయా ప్రముఖంబులైన శక్తులును మహదాది చతుర్వింశతితత్త్వంబులును గుణక్షోభకాలపరిణామ హేతుసంస్కార కామకర్మగుణంబులు సేవింప వేదాంతవిదులకైన నెఱుంగరాని తెఱంగున మెఱయుచుఁ గానంబడిన వారలం గనుంగొని. 537

---

1. నొకఁడు బ్రహ్మమైనది — పాఠాంతరము, 2. సుకరంబున - సులభముగా, 3. కర్జంబు - చేయవలసినది, 4. మోహము - అజ్ఞానము, 5. ఖద్యోతరుచి - మిణుఁగురులకాంతి, 6. బూమెలు - మాయలు, 7. మూర్తిమంతంబులు - స్వరూపములు దాల్చినవి,

ఉ. బాలురఁ గంటి నా [1]చెయిదిఁ బాసినవారిని, మున్ను వారి నేఁ
బోలఁగఁ జూచునంతటన భూరినిరర్గళదుర్గమప్రభా
జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు నున్నవార; లే
మూలమొ? మార్గ మెయ్యదియొ? మోసము వచ్చెఁ గదే! విధాతకున్. 538

వ. అని సకలేంద్రియంబులకు వెక్కసంబయిన [2]స్రుక్కి. 539

ఉ. ఏ పరమేశుతేజమున నీ సచరాచరమైన లోక ము
ద్దీపిత మయ్యె నట్టి విభుతేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మై మఱచె నప్పుడు చిత్రపు రూపు కైవడిన్. 540

వ. ఇట్లు మాయాతీతుండును, వేదాంతవిజ్ఞానదుర్లభుండును, స్వప్రకాశానందుండును నైన తన బాహుళ్యంబుఁ జూచి నివ్వెఱపడిన బ్రహ్మం గని యీశ్వరుండు. 541

శా. 'బాలుండై చతురాననుండు తన యీ [3]బ్రహ్మాభిమానంబునన్
లోలుండై మతి దప్పి నామహిమ యాలోకింప నేతెంచెఁ; దా
నాలోకింపఁగ నెంతవాఁ?' డనుచు మాయాజాలమున్ విప్పి త
ల్లీలారూపము లెల్ల దాఁచె నటఁ గేళీచాతురీధుర్యుఁడై. 542

వ. అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిది కన్నులు గల వేలుపు గమికాఁడు తేఱి తెప్పిరి కాలుఁ గేలుఁ గదలించి, చెచ్చెరం గన్నులు విచ్చిచూడ సమర్థుడై ముందటఁ గని వెనుకఁ జూచి, దివి విలోకించి దిక్కులను వీక్షించి యెల్లయెడలం గలయ దర్శించి తన పురోభాగంబున హరి సంచరించటంజేసి జాతి వైరంబులు లేని నరపక్షి మృగాదులకు నాటపట్టయి సిరి గలిగి కామక్రోధాదిరహితులకు జీవనంబైన బృందావనంబుం బొడగాంచి యందె. 543

సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మూలవిభుఁ డయ్యుఁ గ్రేపుల వెదకువాని
నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యు [4]నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ బెక్కండ్ర జీరువాని
బహిరంత రాద్యంతభావశూన్యుండయ్యు నంతంత నడుగుచొ ప్పరయువాని
గురుగభీరుండయ్యు గురువులు వాఱుచు నట్టిట్టుఁ బాతరలాడువాని
ఆ. జాతిరహితుఁ డయ్యు జతురగోపార్భక భావ మెల్ల నచ్చువడిన మేని
చెలువువాని హస్త [5]శీతాన్నకబళంబు వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు. 544

---

1. చెయిది - కృత్యము, 2. స్రుక్కి - పరవశుఁడై. 3. బ్రహ్మాభిమానంబు- తాను బ్రహ్మనను అహంకారము, 4. అజ్ఞాకృతి - తెలియనివాని విధము, 5. శీతాన్నము - చలిదియన్నము,

వ. కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గ నుఱికి కనకదండసుకుమారంబైన శరీరంబుతోడ నేలం జాఁగిలంబడి మణిగణసుప్రకాశంబులైన తన కిరీటశిఖర ప్రదేశంబు లా కుమారుని పాదపద్మంబులు మోవ మ్రొక్కి [1]తోరంబులగు నానందబాష్పజల పూరంబుల నతని యడుగులు గడిగి మఱియును. 545

క. అడుగులపైఁ బడు; లేచుం బడుఁ; గ్రమ్మఱ లేచు; నిట్లు భక్తిన్ మును తాఁ
బొడగనిన పెంపుఁదలఁచుచు [2]దుడుకని మహిమాబ్ధి నజుఁడు [3]దుడుకడిచె నృపా! 546

వ. అంత నల్లనల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి, చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై డిగ్గన డగ్గుత్తిక యిడుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె. 547

సీ. [4]శంపాలతికతోడి జలదంబు కైవడి మెఱుఁగుటొల్లియతోడి మేనివానిఁ
గమనీయమృదులాన్నకబళవేత్ర విషాణవేణుచిహ్నంబులు వెలయువానిఁ
గుంజావినిర్మితకుండలంబులవాని శిఖిపింఛవేష్టితశిరమువాని
వనపుష్పమాలికా వ్రాతకంఠమువాని నలినకోమల చరణములవానిఁ
ఆ. గరుణ గడలుకొనిన కడగంటివాని గోపాలబాలుభంగిఁ బరఁగువాని
నగుమొగంబువాని ననుఁ గన్న తండ్రిని నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష! 548

మ. నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ
[5]తనురూపం బిదె నామనంబున కచింత్యం బయ్యె; నీయుల్లస
ద్ఘనవిశ్వాకృతి నెవ్వఁ డోపు? నెఱుఁగం గైవల్యమై యొప్పు నా
త్మ నివేద్యం బగు నీదువైభవముచందం బెట్టిదో యీశ్వరా! 549

క. విజ్ఞానవిధము లెఱుఁగక తజ్ఞులు నీవార్తఁ జెప్పఁ [6]దనువాఙ్మనముల్
యజ్ఞేశ! నీకు నచ్చిన యజ్ఞులు నినుఁ బట్టి గెలుతు రజితుఁడ వైనన్. 550

క. శ్రేయములు గురియు భక్తిని జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముం
జేయుట విఫలము; [7]పొల్లున [8]నాయము సేకుఱునె తలఁప నధికంబైనన్. 551

క. నిజముగ నిన్నెఱుఁగఁగ మును నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీకథ వినుచున్
నిజకర్మలబ్ధభక్తిన్ సుజనులు నీ మొదలి [9]టెంకిఁ జొచ్చి రధీశా! 552

1. తోరంబులు - అధికమైనవి, 2. దుడుకఁడు - బాలుఁడు, 3. దుడుకడిచె - మునిఁగెను, 4. శంపాలతిక - మెఱుపుఁదీఁగ. 5. తనురూపంబు - సూక్ష్మమైనరూపు, 6. తనువాఙ్మనముల్ - త్రికరణములు, 7. బొల్లు—పాఠాంతరము, 8. ఆయము - రాఁబడి, 9. టెంకి - నివాసము.

సీ. వి[క్రియాశూన్యమై విషయిత్వమును లేనిదగుచు నాత్మాకారమై తనర్చు
నంతఃకరణ మొక్క[1]యధికసాక్షాత్కార విజ్ఞానమునఁబట్టి వే ఱొరులకు
నెఱుఁగంగరానిదై యేపారి యుండుటఁజేసి నీ నిర్గుణ శ్రీవిభూతి
బహిరంగవీథులఁ బాఱక దిరములై [2]యమలంబులగు నిం[ద్రియములచేత
ఆ. నెట్టకేలకైన నెఱుఁగంగ నగుఁగాని గుణవిలాసి వగుచుఁ గౌమరుమిగులు
నీ గుణ[వజంబు నేరరా దెఱుఁగంగ నొక్క[3]మితము లేక యుంట నీశ? 553

క. తారాతుషారశీకర భూరజములకైన లెక్క బుధు లిడుదురు; భూ
భారావతీర్ణకరుఁడగు నీ రమ్యగుణాలి నెన్ననేర రగణ్యా! 554

శా. 'ఏ వేళం గృపఁ జూచు నెన్నఁడు హరిన్ వీక్షింతు' నం చాఢ్యుఁడై
నీవెంటంబడి తొంటికర్మచయమున్ నిర్మూలముం జేయుచున్
నీవాఁడై తనువాఙ్మనోగతుల నిన్ స్సేవించు విన్నాణివో
కైవల్యాధిపలక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్న వాఁ డీశ్వరా! 555

ఉ. మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి[పోడ! నిన్ను నా
మాయఁ గలంచి నీ మహిమమానముఁ జూచెద నంచు [4]నేరమిం
జేయఁగఁ బూనితిం; గరుణ సేయుము; కావుము; యోగిరాజవా
గ్గేయ! దవాగ్ని, [5]దజ్జనితకీలము గెల్చి వెలుంగ నేర్చునే? 556

సీ. సర్వేశ! నే రజోజనితుండ; మూఢుండఁ; [బభుఁడ నేనని వెఱ్ఱి[పల్లదమున
గర్వించినాఁడను; గర్వాంధకారాంధనయనుండఁ; గృపఁజూడు నను; [బధాన
మహదహంకృతి నభోమరుదగ్ని జలభూమిపరివేష్టితాండకుంభంబులోన
నేడు జేనలమేన నెనయునే నెక్కడ నీ దృగ్విధాండంబు లేరి కైన?
తే. సంఖ్య సేయంగ రానివి; సంతతంబు నోలిఁ బరమాణువులభంగి నొడలి రోమ
వివరములయందె వర్తించు విపులభాతి; నెనయుచున్న నీ వెక్కఁడ? నెంత కెంత? 557

తరలము. కడుపులోపల నున్న పాపఁడు గాలఁ దన్నినఁ గిన్కతో
[6]నడువఁ బోలునె [క్రాఁగి తల్లికి? నాథ! సన్నము దొడ్డునై
యడఁగి కారణకార్యరూపము నైన యీ సకలంబు నీ
కడుపులోనిది గాదె? పాపఁడఁగాక నే మఱి యెవ్వఁడన్? 558

క. భూరి [7]లయజలధిని[దిత నారాయణనాభికమలనాళమున నజుం
డారయఁ బుట్టె ననుట నిజ మో రాజీవాక్ష! పుట్టె నోటు తలంపన్. 559

---

1. మొక్కఁడధిక—పాఠాంతరము, 2. అమలంబులు-పరిశుద్ధములు, 3. మితము పరిమితి, 4. నేరమి - తప్పు, 5. తజ్జనితకీలము - దానినుండి పుట్టినజ్వాల, 6. నడువఁ బోలునె - కొట్టుటసాధ్యమా, 7. లయము - [ప్రళయ కాలము.

సీ. నళినాక్ష! నీ వాదినారాయణుండవు; జలము నారము జీవచయము నార
మందు నీ వుంట నీయందవి యుంటను నారాయణుం డను నామ మయ్యె
సకలభూతములకు సాక్షి; వధీశుండ; వబ్ధి నిద్రించు నారాయణుండ
నీ మూర్తి యది సీకు నిజమూర్తి యనరాదు; నలిననాళముత్రోవ నడచి మున్ను
తే. కడఁగి నూఱేండ్లు వెదకి నేఁ గాన నయితి నేక దేశస్థుఁడవు గా; వనేకరుచివి
జగములో నుందు; నీలోన జగములుండు నరుదు; నీ మాయ నెల్లైన నగుచునుందు 560

మ. విను మో యీశ్వర ! వెల్పలన్ వెలుఁగు నీ విశ్వంబు నీ మాయ గా
క నిజంబైన యశోద యెట్లు గనియెం? గన్నార నీ కుక్షిలోఁ
గనెఁ బో క్రమ్మఱఁ గాంచెనే? భవదపాంగశ్రీఁ బ్రపంచంబు చ
క్కన లో నౌ; వెలియౌ [1]ను; లోను వెలియుం గాదేఁ దదన్యం బగున్? 561

మ. ఒకఁడై యుంటివి; బాలవత్సములలో; నొప్పారి తీ వంతటన్
సకలోపాసితులౌ చతుర్భుజులునై సంప్రీతి నేఁ గొల్వఁగాఁ
బ్రకటశ్రీగలవాఁడ వైతి; వటపై బ్రహ్మాండముల్ సూపి యొ
ల్లక యిట్లొక్కఁడ వైతి నీ వివిధలీలత్వంబుఁ గంటిం గదే ! 562

క. ఎఱిఁగిన వారికిఁ దోతువు, [2]నెఱిఁ బ్రకృతిం జేరి జగము నిర్మింపఁగ, నా
తెఱఁగున రక్షింపఁగ, నీ తెఱఁగున బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా ? 563

క. జలచరమృగభూసురనర కులముల జన్మించి తీవు కుజనులఁ జెఱుపం,
జెలిమిని సుజనుల మనుపను దలపోయఁగరాదు నీ విధంబు లనంతా . 564

ఆ. [3] [4]ద్రిమ్మరుగొలిపి యోగమాయ [5] నిద్రించిన యో పరాత్మభూమ యోగిరాజ
యే తెఱంగు లెన్ని యెప్పు డెచ్చోట నీ హేల లెవ్వఁ డెఱుఁగు; నీశ్వరేశ ! 565

సీ. అది గాన నిజరూప మనరాదు; కలవంటిదై, బహువిధదుఃఖమై, విహీన
సంజ్ఞానమై యున్న జగము సత్సుఖబోధతనుఁడవై తుది లేక తనరు నీదు
మాయచేఁ బుట్టుచు మనుచు లేకుండుచు నున్న చందంబున నుండుచుండు;
నొకఁడ; వాత్మఁడ; వితరోపాధిశూన్యుండ; వాద్యుండ; వమృతుండ; వక్షరుండ,
ఆ. వద్వయుండవును; స్వయంజ్యోతి; వాపూర్ణుఁడవు; పురాణ పురుషుఁడవు; నితాంత
సౌఖ్యనిధివి; నిత్యసత్యమూర్తివి; నిరంజనుఁడ వీవు; దలఁపఁ జనునె నిన్ను? 566

---

1. గదా తలఁప నిక్కంబే తదన్యంబగున్ — పాఠాంతరము. 2. నెఱి - చక్కగా, 3. మంపు—పాఠాంతరము, 4. ద్రిమ్మరుగొలిపి - మైకము కల్గించి, 5. క్రీడింపవ యో పరా— పాఠాంతరము,

వ. దేవా! యిట్టి నీవు జీవాత్మ స్వరూపుండవును, సకలాత్మలకు నాత్మయైన పరమాత్మ స్వరూపకుండవు నని యెవ్వ రెఱుంగుదురు, వారు గదా గురు వనియెడు [1]దినకరుని వలనఁ బ్రాప్తం బైన యుపనిషదర్థజ్ఞానం బను సునేత్రంబునం జేవి సంసారమిథ్యా సాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు; [2]రజ్జువందు రజ్జువని యెఱింగెడి యెఱుక లేకుండ, నయ్యెఱుంగమి నది సర్పరూపంబయి తోఁచినపిదప నెఱింగిన వారివలన రజ్జువు రజ్జు వని యెఱుంగుచుండ, సర్పరూపంబు లేకుండుకై వడి నాత్మ యప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగరు, వారి కయ్యెఱుంగమివలన సకలప్రపంచంబుఁ గలిగి తోఁచు; నాత్మ యప్పరమాత్మ యని యెవ్వరెఱుంగుదురు వారి కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు; నజ్ఞాన [3]సంభావితనామకంబులై సంసారబంధమోక్షంబులు జ్ఞానవిజ్ఞానంబుల లోనివి గావు; కావునఁ గమలమిత్రుని కహోరాత్రంబులు లేని తెఱంగునఁ బరిపూర్ణజ్ఞానమూర్తి యగు నాత్మయందు నజ్ఞానంబు లేమిని మోక్షంబును లే; వాత్మవై న నిన్ను దేహాదికం బని తలంచియు, దేహాదికంబు నిన్నుఁగాఁ దలంచియు, నాత్మ వెలి నుండు నంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు; మూఢత్వంబుఁ జెప్పనేల? బుద్ధిమంతులై పరతత్వంబు గాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమ శరీరంబులయంద నిన్నరయుచుందు రది గావున. 567

శా. దేవా! నీ చరణప్రసాదకణలబ్ధిం గాక లేకున్న నొం
దేవెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?
నీ వారై చనువారిలో నొకఁడనై నిన్ గొల్చు భాగ్యంబు నా
కీవే. యిప్పటి జన్మమం దయిన నొం డెందైన నో యీశ్వరా! 568

తరలము. క్రతుశతంబులఁ బూర్ణకుక్షివి; కాని నీ విటు క్రేపులున్
సుతులునై చనఁ బాలు ద్రావుచుఁ జొక్కి యాడుచుఁ గౌతుక
స్థితిఁ జరింపఁగఁ దల్లులై విలసిల్లు గోవుల గోపికా
సతుల ధన్యత లెట్లు సెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ! 569

క. పరిపూర్ణంబుఁ [4]బురాణముఁ బరమానందంబు నైన బ్రహ్మమె చెలికాఁ
డరు దరుదు నందఘోషస్థిరజనముల భాగ్యరేఖ చింతింపంగన్. 570

సీ. ఏకాదశేంద్రియాధీశులు చంద్రాదు, లేను, పాలాక్షుండు, నిట్లు సూడఁ
బదుమువ్వరము నెడపడక నింద్రియపాత్రముల నీపదాంభోజముల మరంద
మమృతంబుగాఁ ద్రావి యమర నేకైకేంద్రియాభిమానులమయ్యు నతికృతార్థ
భావుల మైతిమి; పరఁగ సర్వేంద్రియవ్యాప్తులు నీ మీఁద వ్రాలి తిరుగు
తే. గోపగోపికాజనముల గురువిశిష్ట భాగ్యసంపదఁ దలపోసి ప్రస్తుతింప
నలవిగా దెవ్వరికి నైన నంబుజాక్ష! భక్తవత్సల! సర్వేశ! పరమపురుష! 571

1. దినకరుఁడు - సూర్యుఁడు, 2. రజ్జువు - త్రాడు, 3. సంభావిత - కలిగిన, 4. పురాణము - అతిప్రాచీనమైనది.

శా. 'ఏలా బ్రహ్మపదంబు ? వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీ లోకంబున నీ వనాంతరమునం డీ మందలోఁ గృష్ణ ! యం
బాలాపాదిసమస్త భావములు నీ యందే సమర్పించు నీ
[1]వ్రేలం దొక్కని పాదరేణువులు పై [2]వేష్టించినం జాలదే? 572

మ. నిను హింసించిన పూతనాదులకు మున్ నీ మేటిసంకేత మి
చ్చిన నీకుం, బురదారపుత్రగృహగోశ్రీ ప్రాణదేహాదు లె
ల్లను వంచింపక యిచ్చుగోపకులకున్ లక్షింప నే మిచ్చెదో !
యని సందేహము దోఁచుచున్నది ప్రపన్నానీకరక్షామణీ ! 573

క. దేహము [3]కారాగేహము మోహము [4]నిగళంబు; రాగ [5]ముఖరములు రిపు
వ్యూహములు భక్తితోని న్నూహింపని యంతతడవు నో కమలాక్షా ! 574

ఆ. ఆశ్రయించు జనుల కానందసందోహ మీఁదలంచి వివిధ [6]హేలతోడ
నప్రపంచకుండ వయ్యుఁ బ్రపంచంబు వెలయఁజేయు దీవు విశ్వమూర్తి ! 575

క. ఎఱిఁగినవారి యెఱుంగమి యెఱుఁగమే? బహుభాష లేల? యీశ్వర ! నీపెం
పెఱుఁగ మనోవాక్కులకున్ గురి సేయం గొలఁది గాదు గుణరత్ననిధీ ! 576

క. సర్వము నీవ యెఱుంగుదు సర్వవిలోకనుఁడ వీవ; జగదధిపతివిన్;
సర్వాపరాధు నను నో సర్వేశ ! యనుగ్రహింపు; చనియెద నింకన్ 577

క. విష్ణు నిశాటవిపాటన ! వృష్ణికులాంభోజసూర్య విప్రామరగో
వైష్ణవసాగరహిమకర ! కృష్ణా ! పాషండధర్మగృహదావాగ్నీ ! 578

వ. దేవా ! నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెదనని యివ్విధంబున సంస్తుతించి ముమ్మాఱు వలగొని పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ దన నెలవునకుం జనియె; నతని మన్నించి భగవంతుండైన హరి తొల్లి చెడి తిరిగి వచ్చిన వత్సబాలకులం గ్రమ్మఱం గైకొని పులినంబుకడఁ జేర్చె; నిట్టు. 579

క. [7]క్రించుతనంబున విధి దము వంచించిన యేఁడు గోపవరనందను లొ
క్కించుక కాలంబుగ నీక్షించిరి రాజేంద్ర! బాలకృష్ణుని మాయన్. 580

ఆ. ఏ మహాత్మమాయ నీ విశ్వమంతయు మోహితాత్మక మయి మునిఁగి యుండు
నట్టి విష్ణుమాయ నర్భకు లొక్కయేఁ డెఱుఁగకుండి రనుట యేమి వెఱఁగు? 581

---

1. వ్రేలు - గొల్లలు, 2. వేష్టించినన్ — చుట్టుకొనినను, 3. కారాగేహము- చెఱసాల, 4. నిగళంబు - సంకెల, 5. ముఖరములు - మున్నగునవి, 6. హేల - విలాసము, 7. క్రించుతనంబు - దుష్టత్వము.

వ. అప్పుడు. 582

మ. 'చెలికాఁడా! యరుదెంచితే యిచటికిన్? సేమంబునం గ్రేపులున్
నెలవుల్ సేరె నరణ్యభూమివలనన్ నీవచ్చునందాఁక జ
ల్లులు వీ రించుక యెవ్వరుం గుడువ; రాలోకింపు; ర'మ్మంచు నా
జలజాక్షుండు నగన్ భుజించి రచటన్ సంభాషలన్ డింభకుల్. 583

వ. ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి వారలకు నజగరచర్మంబు సూపుచు వనంబుననుండి
తిరిగి. 584

పంచచామరము. ప్రసూనపింఛమాలికా ప్రభావిచిత్రితాంగుఁడుం
బ్రసిద్ధశృంగ వేణునాదపాశబద్ధ [1]లోకుఁడుం
బ్రసన్నగోపబాలగీత బాహువీర్యుఁ డయ్యు ను
ల్లసించి యేఁగె [2]గోపకుల్ సెలంగి చూడ మందకున్. 585

వ. ఆ సమయంబున. 586

క. పెనుఁబాము దమ్ము మ్రింగిన 'మన నందసుతుండు పాము మర్దించి మమున్
మనిచె నరణ్యములోపల', నని [3]ఘోషించిరి కుమారు లా ఘోషములోన్. 587

వ. అనిన విని నరేంద్రుం డి ట్లనియె. 588

క. 'కని మనిచి యెత్తి పెంచిన [4]తనుజన్ములకంటె నందతనయుం డా ఘో
షనివాసులకు మనోరం జనుఁ డెట్లయ్యెను? బుధేంద్ర! చను నెఱిఁగింపన్.' 589

వ. అనిన శుకుం డిట్లనియె. 590

'సీ. అఖిల జంతువులకు నాత్మ [5]వల్లభుఁ డైన భంగి బిడ్డలు విండ్లుఁ బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియి [6]వల్లభంబులు గావు సకలాత్మకుండైన జలజనేత్రుఁ
డఖిలజంతువులకు నాత్మ గావున ఘోషవాసుల కెల్లను వల్లభత్వ
మునను మిక్కిలి యొప్పె; మూఁడులోకములకు హితముసేయఁగ జలజేక్షణుండు
ఆ. మాయతోడ మూర్తిమంతుఁడై యొప్పారుఁ; గలఁ డతండు నిఖిలగణములందు
[7]భవతిధాతు వెట్లు భావార్థమై సర్వ ధాతుగణమునందుఁ దనరు నట్లు. 591

క. శ్రీ పతిపద మను నావను బ్రాపించి భవాబ్ధి వత్సపదముగ దీరుల్
రూపించి దాఁటి చేరుదు రాపత్పదరహితు లగుచు నమృతపదంబున్. 592

---

1. లోలుడుం—పాఠాంతరము, 2. గోపికల్-పాఠాంతరము, 3. ఘోషించిరి - చాటిచెప్పిరి, 4. తనుజన్ములు - పుత్రులు, 5. వల్లభమైన—పాఠాంతరము, 6. వల్లభంబులు - ఇష్టమైనవి, 7. భవతిధాతువు - సత్తార్థమున నుండు 'భూ' ధాతువు.

ఆ. అమునిఁ జంపి కృష్ణుఁ డాప్తులుఁ దానును జల్దిఁ గుడిచి జలజసంభవునకుఁ
జిద్విలాసమైన చెలువు సూపిన కథఁ జదువ వినినఁ గోర్కి సంభవించు. 593

వ. అని చెప్పి మఱియు వ్యాసనందనుం డిట్లనియె. 594

క. 'రాగంబున బలకృష్ణులు పౌగండవయస్కు లగుచుఁ బశుపాలకతా
యోగంబున బృందావన భాగంబునఁ గాంచి రంతఁ బశువుల నధిపా! 595

వ. అయ్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి, వేణువు పూరించి బలభద్ర సహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు [1]కైవారంబులు సేయ మ్రోల నాలకదుపుల నిడికొని నిరంతర ఫలకిసలయకుసుమంబులును, గుసుమ మకరంద నిష్యందపానానందదిందిరకదంబంబును, గదంబాదినానాతరులతాగుల్మసంకులంబును, గులవిరోధరహిత మృగపక్షి భరితంబును, భరితసరస్సరోరుహపరిమిళితవనంబును నయిన వనంబుఁ గని యందు వేడుకం గ్రీడింప నిశ్చయించి వెన్నుం డన్న కిట్లనియె, 596

శా. "శాఖాపుష్పఫల ప్రభార నతలై చర్చించి 'యోదేవ! మా
[2]శాఖిత్వంబు హరింపు' మంచు శుకభాషన్ నీ కెఱింగించుచున్
శాఖాహస్తములం బ్రసూన ఫలముల్ సక్కన్ సమర్పించుచున్
శాఖిశ్రేణులు నీ పదాబ్జముల కోజన్ మ్రొక్కెడిం జూచితే! 597

సీ. నిఖిలపావనమైన నీ కీర్తిఁ బాడుచు నీ తుమ్మెదలు వెంట నేఁగుదెంచె
నడవిలో గూఢుండవైన యీశుఁడ వని [3]ముసరికొల్వఁగ వచ్చె మునిగణంబు
నీలాంబరముతోడి నీవు జీమూతమ వని [4]నీలకంఠంబు లాడఁ దొడఁగెఁ
బ్రియముతోఁ జూచు గోపికలచందంబున నినుఁ జూచె నదె హరిణీచయంబు

ఆ. నీవు విందవనుచు నిర్మలసూక్తులు వలుకుచున్న విచటఁ [5]బరభృతములు
నేఁడు విపినచరులు నీవు విచ్చేసిన ధన్యులైరిగాదె తలఁచి చూడ. 598

సీ. నీ పాదములు సోఁకి నేఁడు [6]వీరుత్తృణపుంజంబుతో భూమి పుణ్య యయ్యె
నీ నఖంబులు దాఁకి నేఁడు నానాలతాతరుసంఘములు గృతార్థులు లయ్యె
నీ కృపాదృష్టిచే నేఁడు నదీశైలఖగమృగంబులు దివ్యకాంతిఁ జెందె
నీ పెన్నురము మోవ నేఁడు గోపాంగనాజనముల పుట్టువు సఫల మయ్యె."

ఆ. నని యరణ్యభూమి నంకించి పసులను మిత్రజనులు దాను మేపుచుండి
నలినలోచనుండు నదులందు గిరులందు సంతసంబు మెఱయ సంచరించె. 599

వ. మఱియు నయ్యీశ్వరుండు. 600

1. కైవారంబులు - సేవలు, 2. శాఖిత్వంబు - వృక్షభావము. 3. ముసరి - గుమిగూడి, 4. నీలకంఠంబులు - నెమిళ్ళు, 5. పరభృతములు కోకిలలు, 6. వీరుత్తు - పొద,

సీ. ఒకచోట మత్తాళియూథంబు ఝుమ్మని మ్రోయంగ ఝుమ్మని మ్రోయుచుండు
నొకచోటఁ గలహంసయూథంబు గూడి కేంకృతులు నేయంగఁ గేంకృతులుసేయు
నొకచోట మద [1]కేకియూథంబు లాడఁగ హస్తాబ్జములు ద్రిప్పి యాడఁ దొడఁగు
నొకచోట వనగజయూథంబు నడవంగ నయముతో మెల్లన నడువఁజొచ్చుఁ.
ఆ. గ్రౌంచచక్రముఖరఖగము లొక్కొక చోటఁ బలుక వానియట్ల పలుకుఁ గదిసి
పులుల సింహములను బొడగని యొక చోటఁ బఱచు మృగములందుఁ దఱచు గూడి.

వ. మఱియును. 602

సీ. 'రా పూర్ణచంద్రిక! రా గౌతమీ గంగ! రమ్మ భగీరథ రాజతనయ!
రా సుధాజలరాశి! రా మేఘబాలిక! రమ్మ చింతామణి! రమ్మ సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ! రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! రమ్మ మందాకిని! రా శుభాంగి!'
ఆ. యనుచు మఱియుఁ గలుగు [2]నాఖ్యలు గల గోవు లడవిలోన దూరమందు మేయ
ఘనగభీరభాషఁ గడు నొప్పఁ జీరు నాభీరజనులు వొగడఁ బెంపు నెగడ. 603

క. కాంతారవిహారమ్ముల శ్రాంతుండై గోపకాంక [3]శయుఁడగు నన్నన్
సంతుష్టిఁ బొందఁజేయు నిరంతరకరచరణమర్శనాదుల నధిపా! 604

క. పాడుచు నాడుచు మందట లాడుచు నొండొరులఁ దాఁకు నాప్తులఁ గని [4]బి
ట్టాడుచుఁ జేతుల వ్రేయుచుఁ గ్రీడింతురు నగుచు బలుఁడు గృష్ణుఁడు నొకచోన్. 605

వ. ఇవ్విధంబున. 606

సీ. వేదాంతవీథుల విహరించు విన్నాణి విహరించుఁ గాంతారవీథులందు
ఫణిరాజశయ్యపైఁ బవళించు సుఖభోగి పల్లవశయ్యలఁ బవ్వళించు
గురుయోగిమానసగుహలఁ గ్రుమ్మరు మేటి గ్రుమ్మరు నద్రీంద్ర గుహలలోనఁ
[5]గమలతోడఁ బెనఁగి కడు దయ్యు చతురుఁ డాభీరజనులతోడఁ బెనఁగి దయ్యు
ఆ. నఖిలలోకములకు నాశ్రయుండగు ధీరుఁ డలసి తరులనీడ నాశ్రయించు
యాగభాగచయము లాహరించు మహాత్ముఁ డడవిలోనిఫలము లాహరించు. 607

వ. ఆ సమయంబున. 608

సీ. అలసినచోఁ గొంద అతిమోదమున వీఁపు లెక్కించుకొని పోదు [6]రేపు మెఱసి
సొలసి నిద్రించినచో నూరుతల్పంబు లిడుదురు కొందఱు హితవు గలిగి

---

1. కేకియూథంబు - నెమిళ్ళగుంపు, 2. ఆఖ్యలు - పేళ్ళు, 3. శయనుండగుచున్ —పాఠాంతరము, 4. చిట్టాడుచు — పాఠాంతరము, 5. కమల - లక్ష్మీదేవి, 6. ఏపు - బలము,

చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద ఱొయ్యన విసరుదు రుత్సహించి
ద వ్వేఁగి నిలుచుచోఁ దడయక కొందఱు పదము లొత్తుదు రతిబాంధవమున;

ఆ. గోపవరులు మఱియుఁ గొందఱు ప్రియమున మాధవునకుఁబెక్కు [1]మార్గములను
బనులు సేసి రెల్లభవములఁ జేసిన పాపసంచయములు భస్మములుగ. 609

వ. అయ్యవసరంబున శ్రీదామనామధేయుండైన గోపాలకుండు రామకేశవులం జూచి
యి ట్లనియె. 610

—: గార్దభాకారుండైన ధేనుకాసురుని బలభద్రుఁడు వధించుట :—

క. 'దూరంబునఁ [2]దాలతరు స్ఫారం బగు వనము గలదు; పతితానుపత
ద్భూరిఫలసహిత మది; యే ధీరులు సొర వెఱతు రందు ధేనుకుఁ డుంటన్. 611

వ. ఆ ధేనుకాసురుఁడు మహాశూరుండును, ఖరాకారుండునునై సమానసత్త్వ సమేతులైన
జ్ఞాతులుం దానును మనుష్యులం బట్టి భక్షించుచుండు; నయ్యెడఁ బరిమళోపేతంబులైన
నూతనఫలవ్రాతంబు లసంఖ్యాతంబులు గలవు; వినుఁడు. 612

క. ఫలగంధము నాసాపుట ములఁ జొచ్చి కలంచి చిత్తములఁ గొనిపోయెన్
ఫలముల నమలింపుఁడు మము; బలియురకును మీకు దైత్యభటు లడ్డంబే?' 613

వ. అని పలికిన చెలికానిపలుకు లాదరించి విని నగి వారునుం దారును నుత్తాలంబగు తాల
వనంబునకుం జని యందు. 614

క. త త్తరమున బలభద్రుఁడు తత్తా [3]లానోకహములఁ దన భుజబలసం
పత్తిఁ గదల్చుచు గ్రక్కున మత్తేభముభంగిఁ బండ్లు మహిపై రాల్చెన్. 615

వ. అప్పుడు పండ్లు రాల్చినచప్పుడు సెవులకు దెప్పరంబయిన నదిరిపడి రిపుమర్దన కుతు
కంబున గార్దభాసురుండు. 616

మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు గంపింపఁగా
[4]రదముల్ దీటుచుఁ, గ త్తిరించిన చెవుల్ రాజిల్ల, వాలంబు భీ
తిదమై [5]తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్
బెదరన్ రామునిఁ జొమ్ముదన్నె వెనుకై బీరంబు దోరంబుగన్. 617

క. మఱియును దనుజుఁడు రామునిఁ గఱవఁగ గమకించి తెఱపి గానక యతనిం
జుఱుచుఱఁ జూచుచు [6]శౌర్యము [7]పఱివోవఁగ నింత నంతఁ బదములఁ దన్నెన్. 618

1. మార్గనులు-విధములు, 2. తాలతరుస్ఫారంబు - తాటిచెట్లచే నిస్తారమైనది, 3. అనోకహములు — చెట్లు, 4. రదముల్ - దంతములు, 5. తూలఖరారవంబున — పాఠాంతరము, 6 కార్యము—పాఠాంతరము, 6. పఱివోవఁగ = నశింపఁగా,

వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురు పదంబులు నాలుగు నొక్కకేల నంటం బట్టి బెట్టు [1]దట్టించి త్రిప్పి విగతజీవునిం జేసి. 619

మ. ఒక తాలాగ్రముఁ దాఁకి వైవ నది కంపోద్రిక్తమై త్రుళ్ళి వే
ఱొకతాలాగ్రముపైఁబడ, న్నదియు నయ్యుగ్రాహతిన్ నిల్వకొం
డొకతాలాగ్రముపైఁ బడన్ విఱిగి యి ట్లొండొంటిపైఁ దాలవృ
క్షకముల్ గూలెఁ బ్రచండమారుతము దాఁకం గూలు చందంబునన్. 620

ఉ. [2]తంతువులందుఁ [3]జేలమువిధంబున నే పరమేశుమూర్తియం
దింతయుఁ బుట్టు నట్టి జగదీశుఁ డనంతుఁడు దైత్యమాత్రు ని
ట్లంతయు సేయు టెంతపని? యద్భుతమే! విను; మంతలోన వాఁ
డంతముఁ బొందు టెల్లఁ గని యాతనిబంధులు గార్దభంబులై. 621

క. బలకృష్ణులపైఁ గవిసిన బలియుర ఖరదైత్యభటులఁ [4]బశ్చిమపాదం
బులు వట్టి తాలశిఖరం బుల కెగురఁగ వైచి వారు పొరిగొని రధిపా! 622

వ. అప్పుడు. 623

క. [5]ఆలమున నోలిఁ గూలిన తాలద్రుమఖండదైత్యతనుఖండములన్
గీలితయై ధర జలధర మాలావృతమైన మింటిమాడ్కిన్ వెలిఁగెన్. 624

క. ధేనుకవనమున నమలిరి మానవు లా వేళఁ దాటిమ్రాఁకుల ఫలముల్
ధేనువులు మెసఁగెఁ గసవులు; ధేనుకహరభక్తకామధేనువు గలుగన్. 625

వ. ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి దుందుభులు మొరయించి; రంతఁ గమలలోచనుండు గోపజనజేగీయమానవర్తనుండై యన్నయుం దానును గోగణంబులం దోలుకొని మందకుం జనియె; నయ్యెడ. 626

ఉ. గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు, ను
ద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖు, నవ్యపుష్పమా
లాపరిపూర్ణు, గోపజనలాలితవేణురవాభిరాము, నా
గోపకుమారునిం గనిరి గోపసుతుల్ నయనోత్సవంబుగన్. 627

ఆ. కమలనయను వదనకమలమరందంబుఁ దవిలి నయనషట్పదములవలనఁ
ద్రావి దినవియోగతాపంబు మానిరి గోపకాంతలెల్ల గోర్కు లలర. 628

---

1. దట్టించి - ప్రయత్నించి, 2. తంతువులు - దారములు, 3. చేలము - వస్త్రము, 4. పశ్చిమపాదంబులు - వెనుకకాళ్ళు, 5. ఆలము - యుద్ధము.

వ. ఇట్లు గోపికలు సాదరంబుగం జూడ వ్రీడాహాసవినయంబులం జూచుచు గ్రీడాగరిష్ఠుం డయిన ప్రోడ [1]గోష్ఠంబు ప్రవేశించె; నంత రోహిణీయశోదలు గట్టులవలని మచ్చికలు పిచ్చలింప నిచ్చకు వచ్చిన ట్లయ్యై వేళల దీవించిరి; వారును మజ్జనోన్మర్దనాదు లంగీకరించి సురభికుసుమగంధంబులు గైకొని, రుచిరచేలంబులు గట్టికొని, రసోపపన్నంబులయిన యన్నంబులు గుడిచి, తృప్తులై మంజులశయ్యల సుప్తులయి యుండి; రందు. 629

## —: శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించుట :—

సీ. 'ఒకనాఁడు బలభద్రుఁ డొక్కఁడు రాకుండ గోపాలకులు దానుఁ గూడి కృష్ణు
డడవికిఁ జని యెండ నా గోవులును గోపకులు [2]నీరువట్టునఁ గుంగి డస్సి
[3]కాళిందిలో విషకలితతోయముఁ ద్రావి ప్రాణానిలంబులు వాసి పడిన
యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు గృష్ణుఁ డీక్షణామృతధార లెలమిఁ గురిసి
ఆ. పసుల గోపకులను బ్రదికించె మరలంగ; వారు దమకుఁ గృష్ణువలన మరల
బ్రదుకుగలిగె నంచు భావించి సంతుష్ట మానసములఁ జనిరి మానవేంద్ర! 630

క. కాళియఫణిదూషిత యగు గాళిందిఁ బవిత్రఁ జేయ గా నుత్సుకుఁడై
కాళిందీజలవర్ణుఁడు కాళియు వెడలంగ నడిచెఁ గౌరవముఖ్యా! 631

వ, అనిన 'నయ్యగాధజలంబువలన మాధవుం డెట్టి నేర్పున సర్పంబుదర్పంబు మాపి వెడలించె? నందుఁ బెద్దకాలం బా వ్యాళం బేల యుండె? నెఱింగింపుము. 632

క. [4]తొట్టులఁ గాచిన నందుని కుట్టని చరితామృతంబు గొనకొని చెవులన్
జుట్టుంగఁ దనివి గల్గునె; వెట్టుల కయినను దలంప? విప్రవ రేణ్యా' 633

వ. అనిన శుకుం డి ట్లనియె. 634

సీ. మానవేశ్వర! యొక్కమడుఁగు కాళిందిలోఁగల; దది యెప్పుడుఁ గాళియాహి
విషవహ్ని శిఖలచే [5]వేఁచుచుండును; మీఁదఁ బఱతెంచినంతన పక్షులైనఁ
బడి [6]మ్రగ్గు; నందుఁ దద్భంగశీకరయుక్త పవనంబు సోఁకినఁ బ్రాణు లెవ్వి
యైన నప్పుడ చచ్చు? నట్టి యా మడుఁగులో నుదకంబు వొంగుచు నుడుకుచుండఁ
తే. జూచి వెఱఁగంది కుజనుల స్రుక్కఁజేయ నవతరించిన [7]బలువీరుఁ డాగ్రహించి
'భుజగవిషవహ్నిదోషంబు వాలియఁజేసి సుజలఁ గావించి యీ నదిఁ జూతు' ననుచు.

వ. కృతనిశ్చయుండై పూర్వజన్మ భాగ్యంబులం దన చరణసంస్పర్శంబునకు యోగ్యంబై తత్సమీపంబున విశాలవిటపశాఖాకదంబంబుతో నున్న కదంబ భూజంబు నెక్కి 635

1. గోష్ఠంబు - గొల్లపల్లె, 2 నీరువట్టు - దప్పి, 3. కాళింది - యమునానది, 4. తొట్టులు - ఆవులు, 5. వేఁచుచు - తపింపఁజేయుచు, 6. మ్రగ్గు - మరణించును, 7. బలువీరుఁడు -గొప్పవీరుఁడు - శ్రీకృష్ణుఁడు.

మ. కటి [1]చేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు [2]బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి, త
[3]త్కుటశాఖాగ్రముమీఁదనుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభధ్వానం బనూనంబుగన్. 637

ఉ. భూరి మహాప్రతాపపరిపూర్ణభయంకరగోపబాలకం
ఠీరవపాత వేగవికటీకృతదుర్విషభీషణోర్మిసం
పూరితమై వడిం గలఁగి పొంగి ధనుశ్శతమాత్రభాగవి
స్తారము వొంగె నిమ్మడుఁగు తప్తపయఃకణబుద్బుదోగ్రమై. 638

శా. [4]పాఠీనాకృతిఁ దోయరాశినడుమన్ భాసిల్లి మున్నాధ్యుఁడై
కాఠిన్యక్రియ నీఁదునేర్పు దనకుం గల్మిన్ భుజంగేంద్రహృ
త్పీఠాగ్రంబున రోషవహ్ని లెగయన్ భీమంబుగా నీఁదె ను
ల్లోలోత్తుంగతరంగమై మడుఁగు [5]దుర్లోక్యంబుగా బాహులన్. 639

వ. ఆ సమయంబున.

శా. 'బాలుం డొక్కఁడు వీఁడు నా మడుఁగు విభ్రాంతోచ్చలత్కీర్ణక
ల్లోలంబై కలఁగం జరించె; నిట నే లో నుంటఁ జూడండు; మ
త్కీలాభీలవిశాలదుస్సహవిషాగ్నిజ్వాలలన్ భస్మమై
కూలంజేసెద నేఁడు లోకులకు నా కోపంబు దీపింపఁగన్.' 641

వ. అని తలంచి విజృంభించి. 642

ఉ. ఘోరవిషానలప్రభలు గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్యవి
స్ఫారుఁడు గాళియోరగుఁడు వాఱిఁ వడిం గఱచెం బయోధరా
కారుఁ బయోవిహారు భయకంపవిదూరు మహాగభీరు [6]నా
భీరకుమారు వీరు నవపీతశుభాంబరధారు ధీరునిన్. 643

క. కఱచి [7]పిఱుతివక మఱియును వెఱవక నిజవదనజనితవిషదహనశిఖల్
మెఱయఁ దన నిడుదయొడలిని నెఱి హరిఁ బెనఁగొనియె భుజగనివహపతి వడిన్. 644

వ. ఇట్లు భోగి [8]భోగపరివేష్టితుండై చేష్టలులేని వాని తెఱంగున గానంబడుచున్న ప్రాణ
సఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక, తత్సమర్పితధనదారమనోరథమానసులు
గావున. 645

---

1. సూత్రంబు-పాఠాంతరము, 2. సంధించి-పాఠాంతరము, 3. కుటము-చెట్టు, 4. పాఠీనాకృతి - చేఁపరూపు, 5. దుర్లోక్యంబుగా - చూడశక్యముకానట్లు, 6. ఆభీర కుమారుఁడు - గొల్లపిల్లవాఁడు, 7. పిఱుతివక-వెనుకకు తగ్గక, 8. భోగము-శరీరము.

చ. అదె మన కృష్ణునిం గఱచె; నంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టికొని మానక యున్నది; యింక నేమి సే
యుద? మెటఁ జొత్తు? మే పురుషు లోపుదు రీ యహి నడ్డపెట్ట నె
య్యది సదుపాయ?' మంచు బడి రార్తరవంబులఁ దూలి గోపకుల్. 646

క. గోపకుమారకశేఖరు నేపున సర్పంబు గఱచు టీక్షించి వగన్
మేపులకుఁ దొలఁగి గోవులు వాపోవుచునుండె వృషభవత్సంబులతోన్. 647

క. భూతలము వడఁకె [1]నుల్కా పాతంబులు మింటఁ గానఁబడె ఘోషములో
వ్రేతలకును గోపకసంఘాతముల కదరె [2]వలకడకన్ను లిలేశా! 648

వ. అంత నా దుర్నిమిత్తంబులు వొడగని బెగడు గదిరిన చిత్తంబుల నుత్తలపడుచు మంద నున్న నందయశోదాదులైన గోపగోపికాజనంబులు హరి [3]దళసరి యెఱుంగక గోపాల గోగణపరివృతుండైన కృష్ణుం డెక్కడినైనం జిక్కనోవునని పొక్కుచుం బెక్కువలయిన మక్కువలు చెక్కులొత్త నొక్కపెట్ట బాలవృద్ధసమేతులై మహాఘోషంబున నాఘోషంబు వెలువడి. 649

క. వారిబ్భంగి నెఱుంగని వారై హరిఁ జూడఁబోవ వడిగొని నగుచున్
వారింపఁడయ్యె రాముఁడు వారిని హరిలా వెఱుంగువాఁ డయ్యు నృపా! 650

వ. అంతలోన వారునుం దానును గాంతారమార్గంబువట్టి పోవుచు నెడనెడ గోపగోష్పదంబుల సందుల నింత నంత నక్కడక్కడ యవాంకుశ హల కమల కులిశ చక్ర చాప కేతనాది రేఖాలంకృతంబులై మార్గాభరణంబులైన హరిచరణంబులజాడఁ గని చొప్పు దప్పక చని దుర్ఘటంబయిన యమునాతటంబు సేరి, వారిమధ్యంబున నితరుల కసాధ్యంబైన సర్పంబు చేతఁ గాటువడి దర్పంబు సూపక భోగిభోగపరివృతుండైన కృష్ణునిఁ గృష్ణకృష్ణేతి విలాపంబులఁ దాపంబులం దొందుచుఁ [4]దత్కాలంబునం [5]బ్రతికూలంబయ్యె ననుచు దైవంబుఁ దిట్టు గోపకులను, గోపకులం గలసి మేఁత లుడిగి ఱెప్ప లిడక కృష్ణునిం దప్పక చూచుచు నొరలుచున్న గోవులం గని; రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యిట్లనిరి. 651

సీ. 'ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు; వెదురువచ్చిన నేఁ డదేల రావు?
చూచినఁ గృపతోడఁ జూచుచుందువు నీవు; సూచినఁ గనువిచ్చి చూడ వేల?
[6]డాసిన నఱలేక డాయంగ వత్తువు; డాసిన నేటికి డాయ విచటఁ?
జీరిన 'నో' యని చెలరేఁగి పలుకుదు; విది యేమి సీరిన నెఱుఁగ కుంట?

1. ఉల్కాపాతంబులు - అరిష్టసూచకమగు కాంతిపుంజము పడుటలు, 2. వలకడకన్ను - కుడికన్ను, 3. దళసరి - శక్తి, 4. దత్కాలంబునః—పాఠాంతరము, 5. ప్రతికూలంబు - విపరీతము, 6. డాసిన-సమీపింపఁగా,

ఆ. తలఁపు సేయునంతఁ దలపోయుచుందువు తలఁపు సేయ నేఁడు దలఁప వకట
యనుచు భక్తివివశ లాడెడికైవడి [1]వ్రేత లెల్ల నాడి వివశ లైరి. 652

వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి యధికంబైన శోకంబున నిట్లనిరి. 653

క. 'విషకుచయుగ యగు రక్కసి విషకుచ [2]దుగ్ధంబు ద్రావి విషవిజయుఁడవై
[3]విషరుహలోచన! యద్భుత విషయుం డగు నీకు సర్వవిష మెక్కెఁగదా! 654

క. కట్టా! క్రూరభుజంగము [4]గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ గంపించితివో?
తిట్టితివో పాపవు విధిఁ? బట్టి మముం దలఁచి కాఁకఁ బలవించితివో? 655

క. పన్నగము మమ్ముఁ గఱవక ని న్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ! నెమ్మి గలిగి నీ
వున్నను మము రక్షింతువు; నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ! 656

ఉ. చూడ వదేమి గారవపుఁజూపుల మమ్ము! సఖాలితోడ మా
టాడ వదేమి? నర్మముగ నందెలు పాదములందు మ్రోయ నేఁ
డాడ వదేమి నర్తనము? లవ్వలమ్రోలను గోపికావళిం
గూడ వదేమి నవ్వులకు? గోపకుమారవరేణ్య! చెప్పుమా! 657

సీ. శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ నెలమి భాషించువా రెవ్వ రింకఁ?
గరచరణాదులకలిమి ధన్యత నొంద నెగిరి పైఁ బ్రాఁకువా రెవ్వ రింక?
నయనయుగ్మంబు లున్నతి గృతార్థములుగా నవ్వులు సూపువా రెవ్వ రింక?
జిహ్వలు గౌరవశ్రీఁ జేరఁ బాటలయెడఁ [5]బలికించువా రెవ్వ రింకఁ?
ఆ. దండ్రి! నీవు సర్పదష్టుండవై యున్న నిచట మాకుఁ బ్రభువు లెవ్వ రింక?
మరగి పాయలేము; మాకు నీతోడిద లోక మీవు లేని లోక మేల? 658

వ. అని యొండొరులం బట్టుకొని విలపించుచుం గృష్ణునితోడన మడుఁగుఁ జొత్తము; చత్త
మనుచుఁ గృష్ణవిరహవేదనానలభారతప్తులై మడుఁగుఁ జొరఁబాఱుచున్న వారలఁ గనుం
గొని భగవంతుండైన బలభద్రుండు 'మీరు [6]మీఁదెఱుంగరు; ధైర్యంబువిడుచుట కార్యంబు
గాదు సహించి చూడుం' డనుచు వారిని వారించె. 659

క. తనుఁగూర్చి యివ్విధంబున వనితలు బిడ్డలును దారు [7]వాపోయెడి ఘో
షనివాసులఁ గని కృష్ణుఁడు మనుజునిక్రియ నొకముహూర్తమాత్రము జరపెన్. 660

---

1. వ్రేతలు - గోపికలు, 2. దుగ్ధంబు - పాలు, 3. విషరుహము - పద్మము,
4. కట్టలుక - ఎక్కువకోపము, 5. బరికించువా—పాఠాంతరము, 6. మీఁదు,- జరుగఁ
బోవునది, 7. వాపోయెడి-దుఃఖించుచున్న.

శా. అంతం గృష్ణుఁడు మేను వెంప భుజగుం [1]డావృత్తులం బాసి తా
సంతప్తాయతభోగుఁడై కలఁచుటల్ సాలించి నిట్టూర్పుతో
శ్రాంతుండై తల లెత్తి దుర్విషము నాసావీథులం గ్రమ్మ దు
శ్చింతన్ దిక్కులు సూచుచుం దలఁగి నిల్చెన్ [2]ధూమకాష్ఠాకృతిన్, 661

చ. [3]వెఱ [4]మఱలేనియట్టి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి ఖగేంద్రుచందమునఁ జక్కన దౌడలు వట్టి కన్నులం
జొఱచొఱ దుర్విషానలము [5]జొబ్బిలుచుండఁగ నెత్తి లీలతో
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ బరిశేషితదర్పముఁ గ్రూరసర్పమున్. 662

వ. ఇట్లు వేగంబుగ నాగంబు వీచి వైచి [6]జగజెట్టి యైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమం
బున. 663

సీ. ఘనయమునానదీ కల్లోలఘోషంబు సరసమృదంగఘోషంబు గాఁగ
సాధుబృందావన చరచంచరీకగానంబు గాయకసుగానంబు గాఁగ
గలహంససారసకమనీయమంజుశబ్దంబులు దాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజగంధర్వాదిజనులు సభాసీనజనులు గాఁగ
తే. బద్మరాగాదిరత్నప్రభాసమాన మహితకాళియ ఫణిఫణామండపమున
నళినలోచనవిఖ్యాతనర్తకుండు నిత్యనైపుణ్యమునఁ [7]బేర్చి నృత్య మాడె. 664

శా. కుక్షిన్ లోకము లున్న గౌరవముతో గోపాకృతి న్నున్న యా
రక్షోహంత వడిన్ మహాఫణిఫణారంగ ప్రదేశంబుపై
నక్షీణోద్ధతి నాఁడు; బాడుఁ; జెలఁగున్; హాసంబుతోడం బద
ప్రక్షేపంబులు సేయుఁ గేళిగతులం [8]బ్రాణైకశేషంబుగన్. 665

క. ఘనతర [9]సుషిరానంద స్వనములతో సిద్ధసాధ్యచారణగంధ
ర్వనిలింపమునిసతులు చయ్యనఁ గురిసిరి విరులవాన లాడెడు హరిపై. 666

వ. ఇట్లు దుష్టజనదండధరావతారుండై హరి వడి గలిగిన పడగలమీఁదఁ దాండవంబు సలుప,
బెండువడి యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచు గన్నుల విషంబు
గ్రక్కుచు నుక్కుసెడి చిక్కి దిక్కులు సూచుచుం గంఠగతప్రాణుం డై ఫణీంద్రుండు
తన మనంబున. 667

---

1. డావృత్తతం—పాఠాంతరము, 2. ధూమకాష్ఠము - పొగతోఁగూడినకట్టె, 3. వెఱ-భయము, 4. మెర—పాఠాంతరము, 5. : స్రుక్కగ నుబ్బి-వధింపక-స్రవింపఁగ —పాఠాంతరములు, 6. జగజెట్టి - మహావీరుడు, 7. పేర్చి-విజృంభించి, 8. ప్రాణైకశేషంబుగన్ - కొనయూపిరి మిగులునట్లు! 9. సుషిరము - మద్యము.

ఉ. 'వేలుపులైన [1]లావు సెడి వేదన బొందుచు నా విషానల
జ్వాలలు సోఁకినంతటన చత్తురు నే డిది యేమిచోద్య ; మా
భీలవిషాగ్ని [2]హేతిచయపీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ
బాలుఁడు మత్ఫణాశతము భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడిన్. 668

క. ఈతఁడు సర్వచరాచర భూతేశుండైన పరమపురుషుఁడు సేవా
ప్రీతుఁడు శ్రీహరి యగు' నని భీతిన్ శరణంబు నొందె బిట్టలసి నృపా ! 669

—: కాళీయుని భార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని నుతించుట :—

వ. ఇట్లు క్రూరంబులైన హరిచరణ [3]ప్రహారంబులం బడగ లెడసి నొచ్చి చచ్చిన క్రియం బడియున్న పతింజూచి నాగకాంతలు [4]దురంతంబైన చింతాభరంబున నివ్వటిల్లెడు నెవ్వ గల నొల్లంబోయి పల్లటిల్లిన యుల్లంబుల. 670

మ. కచబంధంబులు వీడ, భూషణము లాకంపింప, గౌఁదీవియల్
కుచయుగ్మంబుల వ్రేఁగునం జడియఁ బైకొంగుల్ వడిన్ జాఱఁగాఁ
బ్రచుర భ్రాంతిఁ గలంగి ముందట రుదద్బాలావలిం గొంచు స్రు
క్కుచు, భక్తిం జని కాంచి రా గుణమణికిన్ గోపాలచూడామణిన్. 671

వ. కని దండప్రణామంబు లాచరించి నిటలతటఘటితకరకమలలై యిట్లనిరి. 672

క. క్రూరాత్ముల దండింపఁగ ధారుణిపై నవతరించి తనరెడి నీ కీ
క్రూరాత్ముని దండించుట క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా ! 673

క. పగవారి సుతులయందును బగ యించుక లేక సమతఁ బరఁగెడి నీకుం
బగ గలదె? ఖలుల నడఁచుట [5]జగదవనము కొఱకుఁ గాక జగదాధారా ! 674

క. [6]నిగ్రహమె మము విషాస్యుల నుగ్రుల శిక్షించు టెల్ల? నూహింప మహా
నుగ్రహము గాక మా కీ నిగ్రహము విషాస్యభావనిర్గతిఁ జేసెన్. 675

ఉ. ఎట్టితపంబు సేసెనొకొ? యెట్టి సుకర్మము లాచరించెనో
యెట్టి నిజంబు పల్కెనొకొ? యీ ఫణి పూర్వభవంబునందు! ము
న్నెట్టి మహానుభావులకు నెన్నఁడుఁ జేరువగాని నీవు నేఁ
డిట్టి వినోదలీలఁ దల లెక్కి నటించెద వీ ఫణీంద్రుపై. 676

---

1. లావు — బలము, 2. హేతిచయపీడ — జ్వాలాసమూహమువలన బాధ, 3. ప్రహారంబులు - దెబ్బలు, 4. దురంతంబు - అంతములేనిది, 5. జగదవనము - లోకరక్షణము, 6. నిగ్రహము - దండించుట.

మ. బహుకాలంబు దపంబు సేసి వ్రతముల్ వాటించి కామించి నీ
మహనీయోజ్జ్వల పాదరేణుకణసంస్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము దొల్లి కాంచె నిదె [1]నేమం బేమియున్ లేక యీ
యహి నీ పాదయుగాహతిం బడసె నేఁ డత్యద్భుతం బీశ్వరా ! 677

ఉ. ఒల్లరు [2]నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము
న్నొల్లరు యోగసిద్ధి మఱి యొండు భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రిరేణువులసంగతి నొందిన ధన్యు లెప్పుడున్. 678

క. ఘనసంసారాహతులగు జను లాకాంక్షింపఁ గడు నశక్యం బగు శో
భనము సమక్షంబున నహి గనియెం దామసుఁడు రోషకలితుం డయ్యున్, 679

వ. దేవా! సకలపురుషాంతర్యామి రూపత్వంబువలనఁ బరమపురుషుండవయ్యును, నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండవయ్యును, నాకాశాదిభూత సమాశ్రయత్వంబువలన భూతవాసుండవయ్యును భూతమయత్వంబువలన భూతశబ్ద వాచ్యుండవయ్యును, గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండవయ్యును, జ్ఞాన విజ్ఞానపరిపూర్ణత్వంబు గలిగి నిర్గుణత్వనిర్వికారత్వంబువలన బ్రహ్మంబవయ్యును, బ్రకృతిప్రవర్తకత్వంబువలన ననంతశక్తివై యప్రాకృతుండ వయ్యును, గాలచక్రప్రవర్తకత్వంబువలనఁ గాలుండవయ్యును, గాలశక్తి సమాశ్రయంబువలనఁ గాలనాథుండవయ్యును, సృష్టిజీవనసంహారాదిదర్శిత్వంబువలనం గాలావయవసాక్షివయ్యును నొప్పు నీకు నమస్కరించెదము మఱియును 680

సీ. విశ్వంబు నీవయై విశ్వంబుఁ జూచుచు విశ్వంబు సేయుచు విశ్వమునకు
హేతువవై పంచభూతమాత్రేంద్రియములకు మనః ప్రాణబుద్ధి చిత్త
ములకెల్ల నాత్మవై మొనసి గుణంబుల నావృత మగుచు నిజాంశభూత
మగు నాత్మచయమున కనుభూతి సేయుచు మూఁడహంకృతులచే [3]ముసుఁగువడక
తే. నెఱి ననంతుఁడవై దర్శనీయరుచివి గాక సూక్ష్ముఁడవై నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁ డన సమస్తంబు నెఱుఁగు, నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ !

వ. మఱియుఁ గలండు' లేఁడు; సర్వంబు నెఱుంగు; నించుక యెఱుంగు; బద్ధుండు; విముక్తుం డొకం; డనేకుండు నను నివి మొదలుగాఁ గల వాదంబులు మాయవలన ననురోధింపుదురు; గావున నానావాదానురోధకుండవయ్యును, నభిధానాభిధేయశక్తిభేదంబువలన బహుప్రభావప్రతీతుండవయ్యును, జక్షురాదిరూపంబులవలన బ్రమాణరూపకుండవయ్యును,

1. నేమంబు - నియమము, 2. నిర్జరేంద్రపదము-ఇంద్రపదవి. 3. ముసుఁగఁబడక —పాఠాంతరము.

నిరపేక్షజ్ఞానంబు కలిమిం గవివయ్యును వేదమయనిశ్వాసత్వంబువలన శాస్త్రయోని వయ్యును సంకర్షణ వాసుదేవప్రద్యుమ్నానిరుద్ధరూపంబులవలనఁ జతుర్మూర్తివయ్యును. భక్తజనపాలకుండవయ్యును. నంతఃకరణప్రకాశకత్వంబు గలిగి సేవకజన ఫలప్రభావంబుకొఱకు గుణాచ్ఛాదకుండవయ్యును, జిత్తాదివర్తనంబులఁ గానందగిన గుణంబులకు సాక్షివై యొరుల కెఱుంగరామి నగోచరుండవయ్యును, దర్కింపరాని పెంపువలనఁ [1]నవ్యాహతవిహారుండవయ్యును, సకల కార్యహేతువయ్యు, నంతఃకరణప్రవర్తకత్వంబు వలన హృషీకేశుండవయ్యును, సాధనవశంబుగాని యాత్మారామత్వంబువలన మునివయ్యును, స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు, నెందుం జెందక, నీవు విశ్వంబుగాకయు విశ్వంబు నీవ యయ్యును, విశ్వభావాభావసందర్శనంబు సేయుచు, విద్యావిద్యలకు హేతువయిన నీకుం బ్రణామంబు లాచరించెద మవధరింపుము. 682

క. లోకజనిస్థితిలయములు గైకొని చేయుదువు త్రిగుణకలితుఁడవై కా
లాకారమున నమోఘ శ్రీకలితుఁడ వగుచు [2]నిచ్ఛ సెందక యీశా! 683

క. నీశాంతలు గాని తనువు లీశా ఈ మూఢజాతి లీసజ్జాతుప్
నీశాంతతనువులందుఁ బ్రకాశింతువు ధర్మహితముగా సుజనులలోన 684

ఉ. నేరము లన్న నెక్కుడివి? నేము దలంచు తలంపులోపలన్
నేరుపు లున్నవే? సుతుల [4]నేరమిఁ దండ్రులు త్రోచిపుచ్చరే?
నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే?
నేరము గల్గు మద్విభుని నేఁడిటఁ గావఁగదే, కృపానిధీ! 685

శా. బాలుం డీతఁడు మంచివాఁ డనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దు
శ్శీలుండే నవు నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్యదు
ష్టాలంకారముఁ బొంద నోడెద [5]మనాథాలాప మాలింపవే!
చాలున్ నీపదతాండనంబు పతిభిక్షం బెట్టి రక్షింపవే? 686

ఉ ఆకులమయ్యె భోగ మిదె [6]యౌఁదల లన్నియు వ్రస్సె, బ్రాణముల్
రాకల బోకలం బొలసె రాయిడి వెట్టక మా నిజేశుపై
నీ కరుణాకటాక్షములు నిల్పఁగదే తగ నో సమస్తలో
కైకశరణ్య! యో యభయకారణ! యో కమలామనోహరా! 687

ఆ. మమ్ముఁ బెండ్లిసేయు మా ప్రాణవల్లభు ప్రాణ మిచ్చి కావు భక్తవరద!
నీవు సేయుపెండ్లి నిత్యంబు భద్రంబుఁ బిన్ననాఁటిపెండ్లి పెండ్లి గాదు. 688

1. అవ్యాహతవిహారుండు - అడ్డులేని విహారము కలవాఁడు, 2. ఇచ్ఛ -అపేక్ష, 3. నేము - మేము, 4. నేరమి - తప్పు, 5. అనాథాలాపము - దిక్కులేనివారి మొఱ, 6, ఔఁదలలు - శిరస్సులు.

ఇంద్ర. నీ యాన; యెవ్వారిని నిగ్రహింపం డా యుగ్రపాపాకృతి నందఁ డింకన్;
నీ యాజ్ఞలో నుండెదు నేఁటఁగోలెన్ మా [1]యీశు ప్రాణంబులు మాకు నీవే ! 689

వ. అని యిట్లు తమ పెనిమిటి బ్రతుకుఁ గోరెడి భుజగసతులయందు శరణాగత రక్షకుండైన పుండరీకాక్షుండు గరుణించి, చరణఘట్టనంబు సాలించి, తలంగిన నెట్టకేలకు ప్రాణేంద్రియంబుల మరలం బడసి, చిదిసి నలఁగిన తలలు సవరించుకొని [2]వగర్చుచు భుజగపతి జలజనయనునికి నంజలి సేసి మెల్లన నిట్లనియె. 690

చ. [3]మలఁకలు మా ప్రచారములు; మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్;
ఖలులము; రోషజాతులము; గర్వుల; మే మొక మంచివారమే ?
నళినదళాక్ష ! ప్రాణులకు నైజగుణంబులు మాననేర్చునే ?
వెలయవె ? మా వికారములు వింతలె ; మేలొనరించి తీశ్వరా ! 691

సీ. వివిధ భావాకార వీర్యబీజాశయజవయోనియుతముగా జగము లెల్ల
నీవ చేసితి మున్ను; నే మా జగంబులో సహజకోపనులము సర్పములము;
దుర్వారమైన నీ తోరంపుమాయ నే మెఱిఁగి దాఁటెడు పని కెంతవార ?
మంతకుఁ గారణ మఖిలేశ్వరుండవు సర్వజ్ఞుఁడవు నీవు జలజనయన !
తే. [4]మనిచెదేనిని మన్నించి మనుపు నన్ను నిగ్రహించెదవేనిని నిగ్రహింపు;
మింక సర్వేశ మాయిమ్ము లెందుఁగలవు ? చిత్తమందున్నక్రమమునఁ జేయఁదగును. 692

క. నా పుణ్య మేమి సెప్పుదు ?, నీపాదరజంబుఁ గంటి నే; సనకాదుల్
నీపాదరజము గోరుదు రే పదమం దున్ననైన నిఁక మేలు హరీ ! 693

వ. అని విన్నవించినఁ గాళియుపలుకులు విన నవధరించి కార్యమానసుండయిన సర్వేశ్వరుం డతని కిట్లనియె. 694

క. 'గోవర్గముతో మనుజులు ద్రావుదు రీ మడుఁగునీరు; రగ దిం దుండన్;
నీవును నీ బాంధవులును నీ వనితలు సుతులుఁ జనుఁడు నేఁ డంబుధికిన్. 695

క. నిను నే [5]శాసించిన కథ మనమునఁ జింతించి రేపు మాపును గీర్తిం
చిన మనుజులు నీ భయమును విను మెన్నఁడుఁ బొంద రెందు విషవిజయముతోన్. 696

చ. ఇది మొద లెవ్వరైన నరు లీ యమునాతటినీహ్రదంబులో
పదలక [6]తోఁగి నన్ను నుపవాసముతోడఁ దలంచి కొల్చుదుం

---

1. ఈశుఁడు - భర్త, 2. వగరుపుచ్చుచు - పాఠాంతరము, 3. మలఁకలు - వంకరలు, 4. మనిచెదేనిని - బ్రతికించెదవేని. 5. శాసించిన - దండించిన, 6. తోఁగి - మునిఁగి,

గదలక దేవతాదులకుఁగా జలతర్పణ మాచరించినన్
[1]సదమలచిత్తులై దురితసంఘముఁ బాయుదు రా క్షణంబునన్. 697

ఆ. గరుడభీతి రమణకద్వీప మెల్ల కీ మడువుఁ జొచ్చి తీవు; మత్పదాబ్జ
లాంఛనములు నీ తలను నుంటఁజూచి యా పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక,' 698

వ అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకుమారుం డానతిచ్చిన, నియ్యకొని, చయ్యన నయ్యహీంద్రుండు [2]దొయ్యలులుం దానును నెయ్యంబున నయ్యీశ్వరునకు నవ్యది దివ్యాంబరాభరణరత్నమాలికానులేపనంబులు సమర్పించి, తేఁటితండంబులకు దండ యగు నీలోత్పలంబుల దండ యిచ్చి పుత్రమిత్రకళత్రసమేతుండై బహువారంబులు గైవారంబు సేసి, వలగొని మ్రొక్కి లేచి వీడ్కొని [3]రత్నాకరద్వీపంబునకుం జనియె; నిట్లు. 699

క. వారిజలోచనుఁ డెవ్వరు వారింపఁగ లేని ఫణినివాసత్వంబున్
వారించిన యమున సుధా వారిం బోలుపారె నెల్లవారికిఁ బ్రియమై. 700

## —: కాళీయుని పూర్వకథ :—

వ. అనిన విని 'మునీంద్రా ! యేమి కారణంబునఁ గాళియుండు భుజగనివాసంబయిన రమణక ద్వీపంబు విడిచె; నతం డొక్కరుండును గరుడున కేమి తప్పుదలంచె?' నని నరువరుం డడిగిన మునివరుం డిట్లనియె. 701

సీ. 'సర్పభీరువులైన జను లెల్ల నెలనెల సరసభక్ష్యములు వృక్షముల మొదల
సర్పంబులకుఁ బెట్ట, సర్పంబులును మును సర్పాంతకుఁడు దమ్ముఁ జంపకుండఁ
బ్రతిమాసమును దమ భాగభక్ష్యంబు లా పక్షిరాజున కిచ్చి బ్రదుకుచుండ,
విషవీర్యదుర్మదావిష్టుఁడై కాళియుఁ డహికులాంతకుని[4]పా లపహరించి
తే. యాక తనపాలిబలిభాగ మెల్లఁ దినిన విని ఖగేంద్రుఁడు కోపించి 'వీనితలలు
సీరి చెండాడి భోగంబు చించివైచి ప్రాణములఁబాపి వచ్చెదఁ బట్టి' యనుచు. 702

క. అక్షీణకనకసన్నిభ పక్షయుగోద్భూతఘోరపవమానమహా
విక్షేపకంపితానేకక్షోణీధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్. 703

ఉ. వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహాఫణావళుల్
విచ్చి దృగంచలంబుల నవీనవిషాగ్నికణంబు లొల్కఁగా
నుచ్చలదుగ్రజిహ్వలు మహోద్ధతిఁ ద్రిప్పుచు నూర్పులందుఁ గా
ర్చి చ్చెగయంగఁ బాటి కఱచెన్ విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్. 704

1. సదమల చిత్తులు - పరిశుద్ధ మనస్కులు, 2. దొయ్యలులు-స్త్రీలు (భార్యలు)
3. రత్నాకరము - సముద్రము, 4. పాలనపహసించి - పాఠాంతరము.

క. కఱచిన భుజగము రదములు విఱుగఁగ వదనములు విషము వెడలఁగ, శిరముల్
[1]పఱియలుగ, నడిచె గరుడుఁడు తఱిమి కనకరుచులు గలుగు తన [2]డాఱెక్కన్. 705

వ. ఇట్లహికులారాతిచేత వ్రేటువడి వెఱచి పఱతెంచి కాళియుం డీ గభీరంబయిన మడుఁగుఁ
జొచ్చె; మరియు నొక్కవిశేషంబు గలదు. 706

సీ. మున్ను సౌభరి యను ముని యీ హ్రదంబునఁ దపము సేయుచుండ ధరణిలోన
నాఁకలిగొని [3]పన్నగాంతకుఁ డొకనాఁడు సనుదెంచి యిందుల జలచరేంద్రు
నొడిసి భక్షించిన, నున్నమీనము లెల్ల ఖిన్నంబు లై వగఁ గ్రిస్సి యున్నఁ
జూచి యా మునిరాజు శోకించి కోపించి 'గరుడుఁడు నేఁడాదిగాఁగ నిందుఁ
తే. జొచ్చి మీనంబులను మ్రింగఁ జూచెనేని జచ్చుఁ గావుత'మని యుగ్రశాప మిచ్చెఁ;
గాళియుం డొక్కఁడా శాపకథ యెఱుంగు; నితరభుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప! 707

వ. అది కారణంబుగాఁ గాళియుం డీ మడుఁగుఁ జొచ్చియున్న, గోమనుజరక్షణార్థంబు
కృష్ణుం డతని వెడలించె; నిట్టు దివ్యగంధాంబరసువర్ణమణిగణమాలికాలంకృతుండై
మడుఁగు వెడలి వచ్చిన మాధవుంగని ప్రాణలాభంబులంబొందిన యింద్రియంబులంబోలె
యశోదారోహిణీసమేతలయిన గోపికలును నందసునందాదులైన గోపకులును మూర్ఛలం
బాసి తేఱి తెప్పిఱి లేచి పరమానందంబునం బొందిరి; బలభద్రుండు తమ్ముని నాలింగ
నంబు సేసె; నప్పుడు. 708

క. ఱంకెలు వైచె వృషభము లహంకారముతోడ; లేఁగ లట్టిట్టుఱికెం;
బొంకముల నొప్పె ధేనువు లంకురితము లయ్యెఁ దరువు లా హరిరాకన్. 709

క. 'నీ సుతుఁ డహిచే విడివడె; నీ సురుచిరభాగ్యమహిమ నిశ్చల' మనుచున్
[4]భూసురులు సతులు దారును భాసురవచనముల నందుఁ బలికి రిలేశా! 710

శా. 'ని న్నా యుగ్రభుజంగమంబు గఱవన్, నీ వాపదం బొందుచున్
న న్నేమంటి తనూజ! యోడవు గదా, నా కూన! నా తండ్రి! రా
వన్నా!' యంచు శిరంబు మూర్కొని నిజాంకాగ్రంబుపై నిల్పుచుం
గన్నీ రొల్కఁగఁ గౌఁగిలించెఁ దనయున్ [5]గారాముతోఁ దల్లి దాన్. 711

వ. ఇట్లు పరమసంతోషులై ఘోషజను లా రేయి కాళిందీతటంబున నాఁకలి నీరువట్టుల డస్సి
క్రుస్సి, గోవులుం దారు నుండ, సగణ్యంబగునయ్యరణ్యంబున నొక్క దవానలంబు
పుట్టి చుట్టు ముట్టికొని నడురేయి నిద్రితంబైన వ్రజంబుమీదఁ గదిసిన నదిరిపడి,

1. పఱియలుగ - చీలికలుకాఁగా, 2. డాఱెక్క - ఎడమఱెక్క, 3. పన్నగాంతకుఁడు - గరుడుఁడు, 4. భూసురులును ఖేచరులును—పాఠాంతరము, 5. గారాము - ప్రేమము.

[1]దందహ్యమానదేహులయి సకలజనులును మాయామనుజబాలకుండైన హరికి శరణాగతులై యిట్లనిరి. 712

—: గోగోపగోపికాసంఘముఁ గార్చిచ్చు చుట్టుకొనుట :—

మ. 'అదె వచ్చెన్ [2]దవవహ్ని ధూమకణకీలాభీలదుర్వారమై,
యిదె కప్పెన్ మము నెల్లవారి; నిట మీఁ దేలాగు రక్షింపు; నీ
పదపద్మంబుల కాని యొం డెఱుఁగ; మో పద్మాక్ష! యో కృష్ణ! మ్రొ
క్కెద, యో రామ! మహాపరాక్రమ! దవాగ్నిన్ వేగ వారింపవే! 713

క. నీపాదంబులు నమ్మిన నాపద లెక్కడివి? జనుల కత్యుగ్రమహా
దీపితదావజ్వలనము, పైపడ కుండెడి విధంబు భావింపఁగదే!' 714

వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి జగదీశ్వరుండగు ననంతుం డనంత శక్తియుతుండై గహనంబు నిండిన దావదహనంబు పానంబు సేసిన, విజయ గానంబు దశదిశల నిగిడె; నంతం గృష్ణుండు గోగణజ్ఞాతిసహితుండై మందయానంబున మందకుం జనియె; నిట్లు రామకేశవులు గోపాలబాలవేషంబులం గ్రీడించు సమయంబున. 715

—: గ్రీష్మర్తు వర్ణనము :—

సీ. [3] దినము లంతంతకు దీర్ఘంబులై యుండ, దిననాథుఁ డుత్తరదిశఁ జరించె;
నాఁటినాఁటికి నెండ నవ్యమై [4] ఖర మయ్యె; వెచ్చనిగాడ్పులు విసరఁ జొచ్చె;
మేదినీరేణువుల్ మింట సంకుల మయ్యె; నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ;
బానీయశాలలఁ బథిక సంఘము నిల్చెఁ; [5] జప్పరంబుల భోగిచయము డాఁగెఁ;
ఆ. దరులఁ గుసుమచయము దళములతో వాడె; మిథునకోటికి రతి మెండు దోఁచె;
నఖిలజంతుభీష్మ మైన గ్రీష్మమురాకఁ [6]గీలి యడవులందుఁ గేలి సలిపె. 716

ఆ. వాఁడి [7]రుచులు గలుగు వాలివేఁడిమి గ్రీష్మ కాలమందు జగము గలయఁబడియె
బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ. 717

వ. ఇ [8]ట్లాభీలం బయిన [9]నిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామగోవింద మందిరంబైన కతంబున నిదాఘకాలలక్షణంబులం బాసి, నిరంతరగిరినిపతిత నిర్ఝరశీకర పరంపరాభాసిత పల్లవిత కుసుమితతరులతంబయ్యును, దరులతా కుసుమపరిమళమిళితమృదులపవనంబ

1. దందహ్యమానదేహులు-మిక్కిలికాలుచున్న దేహముకలవారు, 2. దవవహ్ని-కాఱుచిచ్చు. 3. దినములు - పగటిభాగములు, 4. ఖరము-తీక్ష్ణము, 5 చప్పరంబులు-పందిళ్లు, 6. కీలి - అగ్ని, 7. రుచులు - కిరణములు, 8 . ఆభీలంబు - భయంకరము, 9. నిదాఘకాలంబు - వేసవికాలము,

య్యెను, బవనచలితకమలకహ్లార సరోవర మహాగభీరనదీహ్రదంబయ్యెను, నదీహ్రద కల్లోలకంకణప్రభూతపంకం బయ్యెను, బంకసంజనితహరితాయమానతృణనికుంజంబ య్యెను, జనమనోరంజనంబై వసంతకాలలక్షణంబులు గలిగి లలితమృగపక్షిశోభితం బయి యొప్పుచుండె; మఱియు నందు. 718

క. పికములకోలాహలమును శుకసంఘము కలకంబు, శుభగమయూర
ప్రకరము కేకారవ మళినికరమురొదయును జెలంగె నెఱి నయ్యడవిన్. 719

క. [1]ఆతతయమునాసరసీ జాతతరంగాభిషిక్తజలరుహగంధో
పేతానిల [2]మడఁచె నిదాఘాతతదావాగ్ని పీడ నవ్వనమందున్. 720

వ. ఇ [3]ట్లామనికందువ తెఱంగు గల్గి సుందరంబైన బృందావనంబులకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని గోపకులుం దారును నొండొరులతో నగుచుఁ, దెగడుచుఁ, జెలంగుచుఁ, దలంగుచు, జిఱజిఱం దిరుగుచుఁ, దరులసందుల కరుగుచు, దాఁగిలిమూత లాడుచు, గీతం బులు వాడుచు, వేణునాదంబులు ఘటియించుచు, నటియించుచు, గతులు దప్పిన క్రియ నొఱఁగుచుఁ, గుప్పల కుఱుకుచుఁ, జప్పటలు గొట్టుచుఁ, [4]గందుకంబులం దట్టుచు, నుప్ప రం బెగసి [5]దర్దురంబులచందంబున దాఁటుచు, నామలకబిల్వాది ఫలంబుల మీటుచుఁ, గుట విటపంబులః గదల్చుచు, మృగంబుల నదల్చుచుఁ, బెరల రేఁపుచు, [6]మధుమక్షికలఁ జోపు చుఁ, దేనియలు ద్రావుచు, సొమ్మలు వోవుచు, గురుశిష్యకల్పనంబులం బనులు సేయుచుఁ, గాకపక్షధరులై ముష్టియుద్ధంబులకు డాయుచుఁ, బన్నిదంబులు సఱచుచుఁ, బులుఁగుల భంగి సఱచుచు, బహు రూపంబులు వన్నుచు, నెగిరి తన్నుచు, సేవ్యసేవకమిత్రామిత్ర భావంబులు వహించుచు, నుత్సహించుచు, మఱియు ననేకవిధంబులఁ గ్రీడించి; రందు.

క. మాపాలికి బలకృష్ణులు భూపాలకు లంచు నెరిగి బొబ్బలిడుచు న
గ్గోపాలురు మోతురు ప్రమదాపాదకు లగుచు [7]వల్లికాందోళికలన్. 722

క. గోపకు లందఱు నాడుచు దీపింపఁగ రామవాసుదేవులవెనుకం
బైపడి పాఠక గాయక రూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై. 723

క. ప్రీతిన్ గోపకు లందఱు గీతంబులు వాడఁ దరులక్రిందను నగుచుం
జేతులు ద్రిప్పుచు వెడవెడ [8]పాతర లాడును యశోదపాపం డడవిన్. 724

మ. జలజాక్షుండును రాముఁడుం నటనముల్ సల్పంగ, గోపాలమూ
ర్తులతో వారలఁ గొల్చు నిర్జరులు సంతోషించి, వేణుస్వనం

1. ఆతత - విస్తారమైన, 2. మడఁగంగ ని, రాతపదావాగ్నియయ్యె. నవ్వన మెల్లన్—పాఠాంతరము. 3. ఆమని-వసంతర్తువు, 4. కందుకంబులు-బంతులు, 5. దర్దు రంబులు-గప్పలు, 6. మధుమక్షికలు-తేనెటీఁగలు, 7. వల్లికాందోళికలు-తీగలపల్లకీలు, 8. పాతరలాడు - నాట్యముచేయు,

బులు గావించుచు, దుమ్ము లూఁదుచు, శిరంబుల్ ద్రిప్పుచుం, బాడుచున్,
వల నొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ వర్ణించుచందంబునన్. 725

## —: బలభద్రుఁడు ప్రలంబాసురుని వధించుట :—

వ. ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ, గొలంకులసమీపంబుల, గిరులచఱుల, సెలయేఱుల పొంతల, మడుఁగులచెంతలఁ, బొదలత్రేవలఁ, బసిమి గల కసవు జొంపంబులఁ బసుల మేపుచుండఁ, బ్రలంబుండను రక్కసుం డుక్కు మిగిలి గోపాలరూపంబున వచ్చి వారల హింస సేయం దలచుచుండ సయ్యఖిల దర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుంగని తెఱంగున. 726

క. ఆ రాముని సహజన్ముఁడు రా రమ్మని వానిఁ జీరి రాకం బోకన్
గారాము సేసి మెల్లన [1]పోరామి యొనర్చిఁ బిదపఁ [2]బొరిగొనుకొఱకున్. 727

వ. ఇట్లు ప్రలంబునితోఁ జెలిమి సేయుచుఁ గృష్ణుండు గోపాలకులకు నిట్లనియె. 728

ఆ. 'మనకుఁ బ్రొద్దువోదు మనమిందఱము రెండుగములవారమగుచుఁ గందుకముల
శిలలు గుఱులు సేసి చేరి క్రీడింతము రండు వలయు జయపరాజయములు. 729

వ. అని యిట్లు వలికి తానును బలభద్రుండును [3]బెన్నుద్దులై యితరవల్లవులెల్ల నుద్దించుకొని [4]చిఱుద్దులై వచ్చిన సమయంబున విభజించుకొని, రెండు [5]గములవారై మార్గంబులందుఁ దృణదారుశిలాకల్పితంబులగు గుఱు లొడ్డి, కందుకశిలాదిప్రక్షేపణంబుల లక్ష్యంబుల దాఁక వైచి జయపరాజయ నిర్ణయంబులు గైకొని వాహ్యవాహకలక్షణంబుల నిర్జితులు జేతల వహించ క్రీడించుచు బలరామునికి, వానిచందంబు రహస్యంబున నెఱింగించి పసుల [6]వెల్చుచు భాండీరకంబను వటంబు సేరి; రాసమయంబునఁ గ్రీడయందు శ్రీదామ నామధేయుండైన గోపకుండు శ్రీకృష్ణుని వహించె! భద్రసేనుండు వృషభు నెక్కించు కొనియె; బలభద్రుండు ప్రలంబు నారోహించె; నప్పుడు. 730

మ. 'వనజాక్షున్ బలిమిన్ బలాఢ్యుఁడు దృణావర్తుండు మున్ మింటికిం
గొని పోఁజాలక చిక్కెనాఁ డితని నాకున్ మోవ రా' దంచు నా
దనుజారిన్ గొనిపోఁ దలంపక వడిన్ దైత్యేశుఁ డయ్యాటలోఁ
గొని పోయెన్ గిరి దాఁటి రాము నఖిలక్రూరక్షయోద్ధామునిన్ 731

వ. ఇట్లు క్రీడాకల్పిత వాహనుండైన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు. 732

---

1. పోరామి - స్నేహము, 2. పొరిగొను - చంపు, 3. పెన్నుద్దులు - మేలి జంటలు, 4. చిఱుద్దులు - చిన్నజతలు, 5. గములు - పక్షములు, 6, వెల్చుచు - త్రోలుచు.

మ. గురుశైలేంద్రసమానభారుఁడగు నా గోపాలకున్ మోవ లే
క రయోద్రేకము మాని దైత్యుఁడు నరాకారంబు సాలించి, భీ
కరదైత్యాకృతి నేఁగె [1]హేమకటకాకల్పంబుతో, రాముతో
మురు వొప్పంగఁ దటిల్ల తేందుయుతజీమూతంబు చందంబునన్. 733

ఉ. మోసము లేక వాని పెనుమూఁపున నుండుచు నా హలాయుధుం
డా సమయంబునం గనియె హాటకరత్నకిరీటకుండలో
ద్భాసితమస్తకున్ భ్రుకుటిభాసురదారుణనేత్రు, నుగ్రదం
ష్ట్రాసహితుం, బ్రలంబు నురుశౌర్యవిలంబు, మదావలంబునిన్. 734

వ. కని [2]నక్తంచరుం డని యించుక శంకించి వెఱవక. 735

క. కదువడిఁ దను [2]దివికిం గొని వడఁ జనియెడు దనుజుశిరము వ్రయ్య హలధరుం 736
దదరి పటుచటులతర మగు పిడికిట వెస విసిరి పొడిచె బిఱుసున నలకన్.

క. హలధరుబలు పిడికిటిహతిఁ దల వగిలిన రుధిరజలము దనువివరములం
దొలఁక మొఱఁ యిడుచు దనుజుఁడు బలరిపు [4]పవినిహతనగముపగిదిం బడియెన్. 737

మత్తకోకిలము. 'మేలు మేలుగదయ్య ! రాముఁడు మేటిరక్కసు నొక్కఁడున్
నేలఁ గూలిచె నొక్కపోటున నేఁడు విస్మయ' మంచు గో
పాలకుల్ గని చచ్చి వచ్చిన భ్రాతఁ గన్నవిధంబునం
జాల దీవన లిచ్చి రాముని సత్కరించిరి వేడుకన్. 738

క. బలవంతుఁ డగు ప్రలంబుఁడు పలుముష్టిన్ నిహతుఁడైన బ్రదికితి మనుచున్
బలసూదనాదిదివిజులు బలుపైఁ గుసుమములవానఁ బరఁగించి రొగిన్. 739

## —: శ్రీకృష్ణుడు దావాగ్నిని మ్రింగి గోగోపకసంఘమును గాపాడుట :—

వ. ఇట్లు గోపకులు క్రీడింప గోవు లంతంతఁ గాంతారంబున వింతకసవులు మెసవుచు, మేఁతవడి నొం డడవికి దూరంబు సని యందు దవదహనపవన సంస్పర్శంబు సైరింపక కంపించి దప్పి నొప్పు సెడి [5]ఘోషించిన. 740

శా. ఆ గోపాలకు లందఱుం బసులకుయ్యాలించి కౌమారకే
ళీగాఢత్వము మాని [6]గోఖుర [7]రదాళిచ్ఛిన్న ఘాసంబుతో

1. హేమకటకాకల్పంబు - బంగారుకడియముల నగలు, 3. నక్తంచరుండు-రాక్షసుఁడు, 3, దివిగొనిచని, యెడి...వగులనెఱిఁగిహల-పాఠాంతరము, 4. పవి-వజ్రాయుధము, 5. ఘోషించిన - అఱవఁగా, 6. గోఖురరదాళిచ్ఛిన్న ఘాసంబు- ఆవులగిట్టల చేతను, దంతములచేతను తెగఁగొట్టఁబడిన గడ్డిపఱకలు, 7, పుటాళిచ్ఛిన్న-పాఠాంతరము,

బాగై యున్న పథంబునం జని [1]దవాపన్నంబు గాకుండ వే
వేగన్ గోగణమున్ మరల్చి రటవీవీథిన్ జనం బొప్పఁగన్. 741

క. జలధరగభీరరవమున నలినదళాక్షుండు దమ్ము నామాంకములం
బిలిచిన విని ప్రతిఘోషణములు సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా! 742

వ. అంత నవ్వనంబున దైవయోగంబునం బుట్టిన కార్చిచ్చు బిట్టు వినరెడి [2]కరువలివలన మిన్నుముట్ట మిట్టిపడి, గట్టు చెట్టనక దరికొని, యట్టె క్రాలుచుఁ జుట్టుకొని, పఱవం గని పల్లటిల్లిన యుల్లంబులతో వల్లవు లెల్లఁ దల్లడిల్లి సబలుండైన హరికి మృత్యుభీతుల రీతిం జక్క మ్రొక్కి యి ట్లనిరి. 743

క. ‘[3]అభ్రంకషధూమాయిత విభ్రాంతమహాస్ఫులింగవిసరోగ్రశిఖా
విభ్రష్టదగ్ధలోకా దభ్రంబై వచ్చెఁ జూడు [4]దవశిఖ కృష్ణా! 744

శా. నీ చుట్టాలకు నాపదల్ గలుగునే? నే మెల్ల నీవార; మ
న్యాచారంబు లెఱుంగ; మీశుఁడవు; మా కాభీలదావాగ్ని నేఁ
డే చందంబున నింక దాఁటుదుము? మ మ్మీక్షించి రక్షింప వ
న్నా! చంద్రాభ! విపన్నులన్ [5]శిఖవితానచ్ఛన్నులన్ ఖిన్నులన్. 745

వ. అని విన్నవించి రంత. 746

ఉ. బంధుజనంబు చేత నిటు ప్రార్థితుఁడై హరి విశ్వరూపుఁ డో
బంధువులార! మీ నయనపంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధి నడంతు నే ననినఁ జక్కన వారలు నట్ల చేయుడున్
బంధురదానపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్. 747

వ. ఇట్లు నిజయోగవైభవంబున దావదహనంబు పానంబు సేసి నిమిషమాత్రంబున గోపకుల నందఱ భాండీరకవటసమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసితనయనకమలులయి కృష్ణుని యోగమయాప్రభావంబున [6]నెరగలి చిచ్చు మ్రగ్గెనని యగ్గించుచుఁ దమ మనంబు లందు. 748

క. ‘కార్చి చ్చార్చు పటుత్వము నేర్చునె నరుఁ డొకఁడు? శౌరి నేఁ డిదె కార్చి
చ్చార్చి మరల రక్షింపఁగ నేర్చె! నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో.’ 749

1. దవాపన్నంబు - కార్చిచ్చుచే ఆపదపొందినది, 2. కరువలి - గాలి, 3. అభ్రంకషము - ఆకాశమునంటునది, 4. దవశిఖ - దావాగ్ని, 5. శిఖవితానచ్ఛన్నులు - అగ్నిసమూహముచేఁ గప్పఁబడినవారు, 6. ఎరగలిచిచ్చు - దావాగ్ని.

వ. అని వితర్కించి రంతఁ గృష్ణుండు సాయాహ్న సమయంబున రామసహితుండై [1]వంశ
నాళంబు పూరించుచు గోపగణజేగీయమానుండై గోష్ఠంబు ప్రవేశించె నప్పుడు 750

క. కమలాక్షుఁ డొద్ద నుండని నిమిషము యుగశతముగాఁగ నెగడిన గోప
ప్రమదలు సంభ్రమమున నా కమలాక్షునిఁ జూచి ముదము గనిరి మహీశా! 751

వ. ఆ సమయంబున గోపకులింద్లకడనున్న వృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల చిత్ర చరి
త్రంబులు సెప్పిన, విని వారు వారిని గార్యార్థులై వచ్చిన [2]వియచ్చరవరులని తలంచి
రంత. 752

## —: వర్షర్తువర్ణనము :—

సీ. పూర్వవాయువులు ప్రభూతంబులై వీచెఁ బడమట నింద్రచాపంబు దోఁచెఁ
[3]బరివేషయుక్తమై భానుమండల మొప్పె మెరపు లుత్తరదిశ మెరవఁ దొడఁగె
దక్షిణగాములై తనరె మేఘంబులు జలచరానీకంబు సంతసించెఁ
జాతకంబుల పిపాసలు కడపలఁ జేరెఁ గాంతారవహ్నుల గర్వ మడఁగె
ఆ. నిజకరాళివలన [4]నీరజబంధుండు దొల్లి పుచ్చుకొన్న తోయ మెల్ల
మరల నిచ్చుచుండె మహి కర్షకానంద కందమైన [5]వానకందువ నాగి. 753

క వర్షాకాలభుజంగుఁడు హర్షముతోఁ నిడిన నవనఖాంకము లని యు
త్కర్షింప భూమిసతిపైఁ గర్షక హలరేఖ లమరె గహనాంతమునన్. 754

క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు పొలసినఁ బులకించు భూమి పులకములనఁగా
మొలచి తల లెత్తి నిక్కుచు సలలితగతి జాలువాఱె సస్యము లధిపా! 755

వ. మఱియుఁ జటులపవనచలితంబులై [6]మిన్ను దన్ని. లెక్కకు మిక్కిలియై ఱెక్కలు గల నీలగిరులసిరుల మీఱి, కాలుకొని తెలిపిపడక, నిబిడంబులై శిశిరకిరణతరణిమండలంబుల చొప్పు దప్పించి. విప్పు గలిగి చదలు గప్పుకొనిన, లీలంగ్రాలు నీలమేఘంబులును, మేఘవిముక్తంబు లయి జలదసమయవిటుండు సరసగతి ధరణిసతియురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖండంబుల వడువునఁ బుడమి బడు [7]కరకలును, గరకాను గతంబులై యసితభోగిభోగంబులబాగున నీలమణిమాలికావిశేషంబులవిధంబున నెడపడక పడు సలిలధారలును, ధారాధరవిగళితవిమలసలిలంబులం దోఁగుచు, మదజలాభిషిక్త మత్త మాతంగంబుల సొబగున నుండు కొండలును, గొండలతుదలనుండి గండశైలంబులపైఁ బడి వికీర్యమాణంబులగు గిరినిర్ఝరంబుః శీకరంబులును, శీకరపరంపరలఁ జొదు

1. వంశనాళంబు - పిల్లనగ్రోవి, 2. వియచ్చరులు - దేవతలు, 3, పరివేషము-సూర్యచంద్రులచుట్టును ఏర్పడు గుడి, 4. నీరజబంధుండు - సూర్యుఁడు, 5. వానకందువ - వర్షాకాలము, 6. మిన్నుదన్ని - ఆకాశమునంటుకొని, 7. కరకలు - వడగళ్ళు.

గులు మదుగులఁగొనినఁ బిదపిద నగుచుఁ జిదుకుజిదుకు మను రొంపులును, రొంపులు గ్రొచ్చి క్రచ్చర నుచ్చలితంబు లయి పఱచు వఱదలును, వఱదవలన మెదలి కదలి పాఱెడి యేఱులును, నేఱులవెంట [1]గఱులు త్రిప్పుచు గములుగొని క్రొన్నీటి కెదురు నడచు మీనంబులును, మీననయనల మెఱుంగుసొంపు పెంపు సైరింపక కంపించి తిరిగి సురిఁగి చనియెడికరణి మేఘమధ్యంబులం బొలసి మలసి నిలువక మరలి చను క్రొమ్మెఱుంగులును, మెఱుంగుల తెఱంగున మగువలు పురుషులం దగిలి నిలువ రని జనుల కెఱుంగ నలువ మొఱయిడిన తెఱంగున [2]మొరయు నుఱుములును, నుఱుముల కులికి పడక కికురుపొడుమచుఁ బించెంబులు గొంచెంబులు సేయక విప్పి దెప్పరంబుగ రొప్పుచు నర్తనంబులు సేయు మయూరంబులును, మయూరఘోషంబులు భీషణములై చెవులు సోక ననూనంబులైన మానంబుల నాసలు సెడి యొండొరులకుఁ గ్రిందుపడి క్రందుకొను విరహిజనులును, జనులకు రేపు మా పని నిరూపింపరాక మాలతీకుసుమవిసరవికసనవిదితావసానంబులగు [3]దుర్దినంబులును, [4]దినావసానసమయంబున మినుకుమినుకు మని మెఱయుచుం దిరుగు ఖద్యోతంబులును. ఖద్యోతసందర్శనంబు గోరుచు నుడుగక విడువక కురియు జడిఁబడి వలగొని వడఁకుచు [5]నశనయత్నంబులు వర్జించి ఖర్జూర జంబూఫల భక్షణంబుల దేహసంరక్షణంబు లాచరించు వనచరులును, వనచరానందకారిణులయి వారరమణులరుచి నవవరతభుజగసమేతలగు కేతకులును, గేతకికదంబయూధికాకుటజ కుసుమ పరిమళమిళితంబులగు విపిన మార్గంబులును, మార్గనిరోధంబు లగుచుం బెరఁగి రసికంబులై పసరుదొలంకుచు [6]హరిన్మణికిరణపుంజంబులభంగి రంజిల్లి తొంగలించుచు జొంపంబులు గొనిన [7]కసవులును, గసవులు మెసవి మిసమిసం దనువులు మెఱవ వలుఁద పొదుఁగుల బరువునం గదలక నిలిచి నెమ రమర నిడు ధేనువులును గలిగి ధేనువ్రజంబు కైవడిఁ బయఃకఃమనోహరంబై, హరకరంబుభంగిఁ బరిపూర్ణ సారంగభాసురంబై, సురగిరిచెలువున హరిశరాసనవిభీషణంబై, విభీషణ హృదయంబుపోలికం బ్రకటిత హరిశబ్దమై భవంబై, భవపూజనంబుచందంబున నింద్రగోపాదివిభవజనకంబై జనకయాగంబు భాతిసీతాప్రకరణాలంకృతంబై, కృతయుగంబుసొంపున బహువర్షంబునై వర్షాగమంబు [8]చెలువొందె నప్పుడు. 756

క. వాడక వ్రాలక తెవులులఁ గూడక తన నల్ల [9]గెఱలుకొని నవకములై
చూడఁగ భద్రము లగుచును వీడెన్ సస్యంబు [10]లిడుమ వీడెం బ్రజకున్. 757

క. [11]జీవనము సాలఁ గలిగియుఁ గారవమున మిట్టిపడని ఘనుని క్రియ నదీ
[12]జీవనములు సొర జలనిధి ప్రావృట్కాలమున డిందుపడి యుండె నృపా! 758

---

1. గఱులు - తెక్కలు, 2. మొరయు - ధ్వనిచేయు, 3. దుర్దినంబులు - మేఘావృతమగుదినములు, 4. దినావసానసమయంబు - సాయంకాలము, 5. అశనము - తిండి, 6. పద్మరాగమణి—పాఠాంతరము, 7. కసవు - పచ్చగడ్డి, 8. వచ్చెనప్పుడు—పాఠాంతరము, 9. నిరులు; యిరులు—పాఠాంతరములు, 10. ఇడుమ - కష్టము, 11. జీవనము-జీవనోపాధి, 12. జీవనము - నీరు.

శా. ఆ వర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ
బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ భక్షించుచున్ మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం గాసారతీరంబులన్. 759

వ. ఆ సమయంబున. 760

సీ. విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనము గాఁగ
మహనీయనిర్మలమందహాసద్యుతి లలితసౌదామినీలతిక గాఁగఁ
దలచుట్టు బాగుగఁ దనరు పింఛపుదండ శైలభేదనశరాసనము గాఁగ
గరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు సలిలధారాప్రవర్షంబు గాఁగఁ,
తే. జాడనేతెంచు గోపాలజనమునీంద్ర చాతకంబుల దురవస్థ సక్కఁ జేసి
కృష్ణమేఘంబు బహుతరకీర్తి నొప్పె విమలబృందావనాకాశవీథియందు 761

క. గోవుల వృషవత్సంబుల. వావిరిఁ బూజించి పిదప వర్షాకాల
శ్రీవనితను బూజించెను శ్రీవల్లభుఁడయ్యు గోపశేఖరుఁ డధిపా! 762

వ. ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు పుచ్చె నంత. 763

—: శ ర దృ తు వ ర్ణ న ము :—

క [1]జొంపములు గొనియె వనములు [2]కొంపు లిగిరె; నెమిలిగముల రొద లుడిగె; నదుల్
పెంపులకుఁ బాసె; నుబుముల శంపలసంపదలు మానె [3]శారదవేళన్. 764

వ. మఱియు జీవనంబులు విడిచి విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబుల చెన్నున
[4][5]నన్ను వదలి మిన్ను విడిచి వాయువశంబులై వెల్లివిరిసి చను మేఘంబులును, మేఘ
పటల రహితంబును గలశభవమునిసహితంబునునై విజ్ఞానదీపవిలసితంబగు యోగిహృదయం
చందంబున శుభ్రంబయిన [6]యభ్రంబును, నభ్రంబున నీలదుకూలవితాన సంయుక్త ముక్తా
ఫలంబుల వడువున నెగడు నుడుగణంబులును, నుడుగణమయూఖంబు గ్రొవ్వు లువ్వెత్తు
గొనినివ్వటిల్లుచు బ్రహ్మాండకరండ కర్పూరఖండాయమానంబులగు చంద్ర కిరణంబులును,
జంద్రకిరణసంస్పర్శనంబున సగర్భంబులై భూమికి దుర్భరంబు లగుచు నిండి పండి
హాలికకరనిశితలవిత్రధారాసంరంభంబుఁ దలంచి తల్లడిల్లి వెలువెలుకంబాఱుచుఁ దల్లి యగు
విశ్వంభరకు మునుకొని ప్రణతంబులై వడంకుచు నెఱుగ మొల యిడుచున్న పెంపున
సంపన్నంబులయిన [7]యెన్నులవ్రేగున వ్రాలి గాలిం దూలుచు మర్మరధ్వనుల సారస్యంబు

1. జొంపములు - అంకురులగుబుర్లు, 2. కొంపులు - బురదలు, 3. శారదవేళ - శరత్కాలము, 4. నన్నువ; పన్నువవలి—పాఠాంతరములు, 5. అన్ను - పరవశత, 6. అభ్రంబు-ఆకాశము, 7. ఎన్నులు-వెన్నులు.

లగు [1]కలమాదిసస్యంబులును, సస్యకమంజరీపుంజంబులఁ గొంచక చంచువులఁ ద్రుంచి కబళించి పిల్లపెంటితండంబులం గూడి కడుపులు నిండ మెక్కి విక్కవిరిసి చొక్కుచుఁ ద్రిక్కులు గొని మహోత్తుంగసమంచిత మంచ ప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నుల కావలియున్న యన్నులకెమ్మోవులు బింబఫలంబు లని కఱచి తత్కరాస్ఫాలనంబుల నులికి పడి యెగసి చను శుకనికరంబుల కలకలంబులును, గలహంసకోకసారసకోలాహల మండితంబులై నిండిన నిర్మలజలంబులుంగల జలాశయంబులును, జలాశయంబులజలంబు లనుదినంబు నిగురగృహంబుబ బ్రదుకు దినంబులు సనుట యెఱుంగని మనుజులగమనికం దిరుగు జలచరంబులును, జలచరహృదయంబుల బెదరు గదుర [2]డొంకి యింకిన నదులును, నదులందుఁ గర్పూరమండపంబుల తెఱంగున మణికుట్టిమంబుల మూడ్కొని సౌధ సోపానమార్గంబులజాడను విలోకితంబులగు నూతనసైకతంబులును, సైకతప్రదేశంబుల నుదయవేళల నిత్యకర్మానుష్ఠాననిరతులగు మునులును, మునికన్యకాకరకలశసలిలాభిషిక్త మూలంబులం బుతపోవనబాల [3]రసాలసాలంబులును, సాలవిటపి వాసంతికాకుంజపుంజంబుల తఱచున నిముడుకొని దినకరకిరణంబులకుం గరువలికింజొర వెరవుపడని వనమ్ములును, వనమ్ములందరులకొనల నాకలములు నేకలములై మెసంగి మసరుకవిసి క్రొవ్వి కొమ్ము కొనల నూటి నేటిదరులు త్రవ్వి చిమ్మికుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభ కనక కుంభరుచిరకుచభారభీరుమధ్యసమంచితలగు చెంచితలును, జెంచితలక్రూరమ్ములగు వాలమ్ములసారమ్ములు సెడి ఖేదమ్మునఁ బాదమ్ములు దొట్రుపడఁ బెనుగాతమ్ములం బడు వరాహ [4]పుండరీకంబులును, బుండరీకకుముదకురంట కాదికుసుమమకరందంబులు గ్రోలి తేలి సోలివాలి మహాహంకృతుల ఝుంకృతులుసేయు తేఁటికదుపులును, గదుపులం గల యక యెడ గలిగి మదమున నదనుపడ నెఱింగి వదనమార్గణప్రేరితంబులై పెంటితుటుములవెంటం జని యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగ వృషభరాజంబులును గలిగి, [5]రాజరాజగృహంబుపగిది విలసిత [6]కుందపద్మ సౌభాగ్యంబై, భాగ్యహీనుకర్ణంబు రేఖ గతి నశ్రుతనీలకంఠ శబ్దంబై, శబ్దశాస్త్ర వేదిహృదయంబుబాగున విశ్వప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబు కైవడి బాణాసనాలంకృతంబై, కృతాంత హృదయంబుకరణి నపంకంబై, పంకజాసనుగేహంబునొంపున రాజహంసవిరాజమానంబై, మానధనునిచరిత్రంబుసొబగున నకల్మషజీవనంబై, వననిధిపొలుపున సమ్మిళితభూభృద్వాహినీసంకులబై, కులవధూరత్నంబు చెలువున నదృష్టపయోధరంబై ధరణికిం దొడ వగుచు శరత్కాలంబు వచ్చె; నంత. 765

క. [7]వాజులనీరాజనములు రాజులజయగమనములును రాజితలక్ష్మీ
పూజలు దేవోత్సవములు రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా! 766

---

1. కలమము - వరి, 2. డొంకి - తగ్గిపోయి, 3. రసాలము - తీయమామిడి, 4. పుండరీకంబు - పెద్దపులి, తెల్లతామర, 5. రాజరాజు - కుబేరుఁడు, 6. కుంద, పద్మములు - నిధులు, మొల్లలు తామరలును, 7. వాజులు - గుఱ్ఱములు.

క. చేగ గల చెఱకువింటను బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబు సేసి మదనుఁడు వేగంబున విరహిజనుల వేఁటాడె నొగిన్. 767

వ. ఇట్లు భాసురంబులయిన శరద్వాసరంబుల గోవిందుడు గోబృందసమేతుండై బృందావనంబునఁ బసులఁ బొసఁగ మేపుచు. 768

సీ. కర్ణావతంసితకర్ణి కారప్రభగండభాగద్యుతిఁ [1]గడలుకొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప
నపసవ్యకరమృదులాంగుళిచాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప
డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్పిన పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ
తే. మౌళిపింఛముఁ గంఠదామమును బొఱయ విలసిత [2]గ్రామముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగజేసెఁ జతురనటమూర్తి గోపాలచక్రవర్తి. 769

వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువగు తద్గీతం బాలించి సిగ్గులు పాలింప [3]మక్కువలు సెక్కు లొత్త గోపిక లోపికలులేక తమతమ పొత్తుకత్తెలుం దారును దత్తఱంబునఁ బదుగురు నేగురుఁ దుటుములు గట్టి జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి తమలోన. 770

మ. శ్రవణోదంచిత [4]కర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో
నవతంసాయితకేకిపింఛకముతో నంభోజదామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచు
న్నవిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే? 771

శా. రావే సుందరి! యేమె బోటి! వినవే! రాజీవనేత్రుండు బృం
దావీథిం దగ వేణు వూఁదుచు లసత్సవ్యానతాస్యంబుతో
భ్రూవిన్యాసము లంగుళీక్రమములుం బొల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మ [5]మగు తద్గాంధర్వసంగీతమున్ 772

క. [6]తలఁకెను గొబ్బునఁ జిత్తము నలినాక్షుని మధురవేణునాదము నా వీ
నులు [7]సోఁకినంతమాత్రన; చెలియా! యిఁక [8]నేటివెఱపు చింతింపఁగదే! 773

క. నాతోడ వెఱవ వలదే? నాతోడనె కొనుచుఁ బోయి నలినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద నీతోడిజనఁబు మెచ్చ నీతోడు సుమీ! 774

1. కడలుకొలుప - వ్యాపింపఁజేయఁగా, 2. గ్రామముగ - స్వరభేదము, 3. మక్కువలు - ప్రేమలు, 4. కర్ణికారకము - కొండగోగు, 5. ముగ—పాఠాంతరము, 6. తలఁకెను - చలించెను, 7. సోఁకినంతతినవే; సోఁకినమాయన్నల—పాఠాంతరములు, 8. నెట్లువెఱపు; నెట్లు వెఱపు—పాఠాంతరములు.

వ. అని పెక్కుభంగుల నోర్తోర్తు నుద్దేశించి పలుకుచు గోపసుందరులు బృందావనంబునకు గోవిందున కెదురు చని పరమానందంబున నతనిం దమ మనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు సేసినవార లగుచు రామకృష్ణుల నుద్దేశించి. 775

మ. నవగోష్ఠానకరంగమందుఁ బరమానందంబుతోఁ జూతప
ల్లవనీలోత్పలపింఛపద్మదళమాలావస్త్రసంపన్నులై
కవయై వేణువు లూఁదుచున్ బహునటాకారంబులం గేళితాం
డవముల్ సేసెద రీ కుమారకులు; వేడ్కం గామినుల్ గంటిరే? 776

క. ఓ చెలువలార! వినుఁడీ! [1]వాచాశతకంబు లేల? వర్ణింపంగా
లోచనములకలిమికి ఫల మీ చెలువురఁ జూడఁగలుగు టింతియ సుండీ! 777

వ. అని పలికి; రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి. 778

మ. ఒనరన్ బ్రేతల కించుకేని నట లేకుండంగ గోపాలకృ
ష్ణుని కెమ్మోవిసుధారసంబు గొనుచుం జోద్యంబుగా మ్రోయుచుం
దన [2]పర్వంబులు నేత్ర [3]పర్వములుగా దర్పించె: బూర్వంబునన్
వనితా! యెట్టి తపంబు సేసెనొకో యీ [4]వంశంబు వంశంబులోన్. 779

మ. ముదితా! యే తటినీపయఃకణములన్ మున్ వేణు విం తయ్యె నా
నది సత్పుత్రునిఁ గన్నతల్లిపగిదిన్ [5]నందంబుతో నేఁడు స
మ్మద హంసధ్వనిపాటగా వికచపద్మశ్రేణిరోమాంచమై
యొదవం దుంగతరంగ హస్తనటనోద్యోగంబు గావింపదే! 780

క. నలినోదరుభక్తునిఁ గని కులజులు నందాశ్రుజలము గురియుపగిది మ్రాఁ
కులు పూఁదేనియ లొలికెడు నలినాక్షుని చేతివంశనాళము మ్రోఁతన్. 781

శా. నా మోసంబున కెద్ది మేర? వివవే నాపూర్వజన్మంబులన్
లేమా! నోములు నోఁచుచో నకట కాళిందీతటిన్ వేణువై
భూమిం బుట్టెద నంచుఁ గోరఁ దగదే? బోధిల్లి యట్లైన నీ
[6]భామం దిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే! 782

క. కాళిందీకూలంబున [7]నాళీ! యీ నందతనయు నధరామృతముం
గ్రోలెడి వేణువ నగు నో మేలాగున నోచవచ్చు నెఱిఁగింపఁగదే! 783

---

1. వాచాశతకంబులు - నూఱుమాటలు - పెక్కుమాటలు, 2. పర్వంబులు - గనుపులు, 3. పర్వములు - పండుగులు, 4. వంశంబు - వెదురు, 5. నందంబు - సంతోషము, 6. భామందు - జన్మమునందు, 7. ఆళి - చెలికత్తె.

క. వనితా కృష్ణుఁడు నల్లని ఘన మనియున్ వేణురవము గర్జన మనియున్
మనమునఁ దలంచి రొప్పుచు నవవరతము నెమిలితుటము లాడెడిఁ గంటే! 784

క. గిరిచరమిథునము లోలిం బరికింపఁగఁ గృష్ణపాదపద్మాంకితమై
సురరాజునగరికంటెను, దరుణీ! బృందావనంబు దద్దయు నొప్పెన్. 785

మ. అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢలై పోవుచుం
గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి మురళీగానంబు లందంద క
ర్ణములన్ నిల్పుచు [1]మేఖలల్ వదలఁగా నాథాంకమధ్యంబులం
బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై [2]పంచాశుగభ్రాంతలై 786

ఉ. కానల నుండుచున్ సరసగానవివేకవిహీనజాతులై
వీనుల నేఁడు కృష్ణముఖవేణురవామృతధార సోఁకినన్
మేనులు మేఁతలున్ మఱచి మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్
మానిని! చూడవమ్మ! [3]బహుమానము సేసెఁ గృతార్థచిత్తలై 787

ఉ. తల్లులచన్నుఁబాలు మును ద్రావుతఱిన్ దమ కర్ణవీథులన్
వల్లభమైన మాధవుని వంశరవామృతధార సొచ్చినం
ద్రుళ్ళక పాలు రాఁ దివక ద్రూఁటక మానక కృష్ణుమీఁద దృ
గ్వల్లులు సేర్చి నిల్చె నదె! వత్సము లంగనలార! కంటిరే! 788

మ. మమతన్ మోములు మీఁది కెత్తుకొని [4]రోమంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీగానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేఁత మాని గళితానందాశ్రులై చిత్రితో
పములై గోవులు సూచుచున్న వదిగోఁ! బద్మాక్షి వీక్షించితే? 789

మ. [5]జగతీజంబులశాఖ లెక్కి మురళీశబ్దామృతస్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి వ్రేఁగుపడి నెమ్మిం గృష్ణురూపంబు చి
త్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియ నేత్రంబుల్ దగన్ మూసి, యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే! మునిజనాకారంబులం గామినీ! 790

మ. క్రమ మొప్పన్ నదులెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో
హములన్ మన్మథసాయకక్షతవిశాలావర్తలై హంసవా
క్యములం జీరి తరంగహస్తముల నాకర్షించి పద్మోపహా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ రామా! విలోకించితే? 791

1. మేఖలల్ - మొలత్రాళ్ళు, 2. పంచాశుగుఁడు - మన్మథుఁడు, 3. బహుమానము - మర్యాద, 4. రోమంథంబు - నెమరువేయుట, 5. జగతీజంబులు - చెట్లు.

ఆ. వనిత, నేఁడు కృష్ణువంశనినాదంబు విని [1]పయోధరంబు విరులు గురిసి
తన శరీర మెల్ల ధవళాతపత్రంబుఁ జేసి మింట నీడఁ జేసెఁ గంటె. 792

క. మంచి ఫలంబులు హరిచేఁ నించి కరాలంబనముల నెగడుచు నిదె క్రీ
డించెద; రంగన! చూడుము [2]చెంచితలం [3]బింఛపత్రచేలాంచితలన్. 793

క. ఉల్లసితకుచభరంబుల నల్లాడెడి నడుముతోడ నలరులదండన్
[4]భిల్లి యొకతె హరి కిచ్చెను హల్లోహలకలిత యగుచు నంగన కంటే! 794

క. గిరు లెల్ల జగము లయ్యెం దరు లెల్లను బల్లవించె ధరణీ గగనభూ
చరు లెల్లను జొక్కిరి హరి మురళీరవామృతము సోఁక ముద్దియ! కంటే 795

మ. బలకృష్ణాంఘ్రిసరోజసంగమముచే భాసిల్లుచున్ ధన్యమై
ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి సంభావించి మి న్నందుచున్
జలఘాసంబుల గోవులం దనిపి చంచద్భూజరోమాంచమై
వెలసెం జూడఁగదమ్మ! యీ గిరి పురోవీథిన్ సరోజాననా! 796

వ. అని యిట్లు బృందావనవిహారి యైన గోవిందుని సందర్శించి పంచబాణభల్ల భగ్నహృదయ
లయి వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్రలయియుండి రంత. 797

—: హేమంతఋతువర్ణనము :—

క. [5]శామంతికాప్రసగంధిత సీమంతవతీకుచోష్ణజితశీతభయ
శ్రీమంతంబయి గొబ్బున హేమంతము దోఁచె మదనుఁ [6]డేఁచె విరహులన్. 798

క. ఉత్తరపుగాలి విసరె [7]వియత్తలమునఁ దుహినకిరణుఁ డహితుం డయ్యెన్
బొత్తు జరిగె మిథునములకుఁ నెత్తమ్ములుదటిఁగె హిమము నెలకొనియె నృపా! 799

క. [8]అహములు సన్నము లయ్యెను దహనము హితమయ్యె దీర్ఘ దశలయ్యె నిశల్
బహుశీతోపేతంబయి యుహూహూ యని వడఁకె లోక ముర్వీనాథా! 800

క. అన్నుల చన్నులదండ విపన్నులు గా కెల్లవారు ప్రదికిరిగా కీ
చన్నులు మీటిన [9]వలి నాపన్నులు గాకుండఁ దరమె బ్రహ్మాదులకున్ 801

---

1. పయోధరంబు - మేఘము, 2. చెంచేతలన్; చెంచతలన్—పాఠాంతరములు
3. పింఛపత్రచేలాంచితలు - నెమిలిపింఛములు, ఆకులు వస్త్రములుగా గలవారు,
4. భిల్లి - ఆటవిక స్త్రీ, 5. శామంతిక — చేమంతి. 6. ఏఁచె - బాధించెను, 7. వియ
త్తలము - ఆకాశము, 8. అహములు - పగళ్లు, 9. వలి - చలి.

ఆ. పొదపుఁగొండమీఁదఁ బొడుచుట మొదలుఁగా బరువువెట్టి యినుఁడు పశ్చిమాద్రి
షుఱుఁగు జొచ్చెఁ గాక మసలినఁ జలిచేత జిక్కెఁ జిక్కె ననఁగ జిక్కకున్నె. 802

క. చెంగల్వ [1]విరులగంధము మంగళముగ గ్రోలుచున్న మధుపము లొప్పె
[2]న్నంగజవహ్నులపై నుప్పొంగి విజృంభించు పొగలపోలిక నధిపా! 803

ఆ. శంభుకంట నొకటి జలరాశి నొక్కటి మఱియు నొకటి మనుజమందిరముల
నొదిగెఁ గాక మెఱసియున్న [3]మూడగ్నులు చలికి నులికి భక్తి సలుపకున్నె? 804

శా. ఈ హేమంతము రాకఁ జూచి 'రమణీహేలాపరీరంభస
త్సాహాయ్యంబునఁ గాని దీని గెలువన్ శక్యంబు గా దంచుఁ దా
రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగులై నారు గా
కోహో! వార లదేమి సంతతవధూయోగంబు రాఁ గందురే? 805

క. ఈ హేమంతము రాకకు శ్రీహరి యొక్కింత వడఁకి చింతింపంగా
నోహో! వెఱవకు మని తా మా హరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్. 806

వ. ఇట్లు నితాంతంబగు హేమంతంబున మొదలినెల తొలిదినంబునందు నందుని మందం గల గోపకుమారికలు రేపకడ లేచి చని కాళిందీజలంబులం దోఁగి; జలతీరంబున [4]నిసుమునం గాత్యాయనీరూపంబుఁ జేసి, సురభికుసుమగంధంబు లిడి, ధూపదీపంబు లిచ్చి, బహువిధోపహారంబులు సమర్పించి. 807

క. 'ఓ కాత్యాయని! భగవతి! నీకున్ మ్రొక్కెదము నేము నేఁ [5]డనుకంపన్
మా కిందఱకును వైశమ శ్రీకృష్ణుఁడు మగఁడుగాఁగ జేయుము తల్లీ! 808

క. ఓ తల్లి మాకుఁ గృష్ణుఁడు చేతోవిభుఁ డైననాఁడు చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచు జాతర సేసెదము భక్తిచాతురితోడన్. 809

వ. అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు నివ్విధంబున మాసవ్రతంబు సలిపి రం దొక్కనాఁడు. 810

## —: గోపికా వస్త్రాపహరణము :—

మ. రమణుల్ ప్రొద్దుల మేలుకాంచి సఖులన్ రం డంచు నాత్మీయనా
మములం జీరి, కుచద్వయీభరములన్ మధ్యంబు లల్లాడఁగాఁ

1. విరిమరందము—పాఠాంతరము, 2. అంగజుఁడు - మన్మథుడు, 3. మూఁడగ్నులు-ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అనుమూఁడగ్నులు, 4. ఇసుము - ఇసుక, 5. అనుకంప - దయ.

భ్రమదోద్దామగజేంద్రయాన లగుచుం బద్మాక్షునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁబోయిరి గృహీతాన్యోన్యహస్తాబ్జలై. 811

వ ఇట్లా నదీతీరంబు సేరం జని గజగమనలు విజనస్థలంబున వలువలు విడిచి యిడి మది
శంక లేక యకలంకలై క్రుంకు లిడఁ [1]జలంబుల జలంబులు సొచ్చి, 812

క. వారిజలోచనుఁ బాడుచు వారిజలోచనలు వారివారికి వేడ్కన్
వారివిహారము సలిపిరి వారి విహారములు జగతివారికిఁ గలవే? 813

వ. ఆ సమయంబున. 814

క. తోయజనయనలు యమునా తోయములం దుండు టెఱిఁగ దూరగుఁడయ్యుం
దోయజనయనుఁడు హరి తన [2]తోయము గోపకులు దానుఁ దోఁతెంచె నృపా! 815

తరలము. [3]కదలకుం డని తోడివారలఁ గన్నుసన్నల నిల్పుచుం
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు [4]మౌనియై
పొదలమాటున నల్లనల్లన పొంచి పొంచి నతాంగుఁడై
యదను గోరుచు డాసి శ్వేతలయంబరంబులు దొంగిలెన్. 816

వ. ఇట్లు దొంగిలి. 817

శా. ఉద్య [5]ద్గంధగజేంద్ర గౌరవముతో యోషాంబరంబుల్ విభుం
డాద్యుం డర్భకుభంగి నర్భకులతో హాసార్థియై కొంచుఁ ద
న్నద్యంభఃకణశీతవాతజనితానందంబుతో నెక్కెఁ దా
సద్యోముక్త దురంతపాదపజనుస్సంతాపమున్ [6]నీపమున్ 818

వ అప్పు డయ్యింతు లి ట్లనిరి. 819

క. మామా వలువలు ముట్టకు మామా! కొనిపోకు పోకు మన్నింపు తగన్
మామాన మేల కొనియెదు? మా మానసహరణ మేల? మానుము కృష్ణా! 820

సీ. [7]బహుజీవనముతోడ బాసిల్లి యుండుటో గోత్రంబు నిల్పుటో కూర్మితోడ?
మహి నుద్ధరించుటో? మనుజసింహంబవై ప్రజలఁ గాచుటొ? కాక బలుఁ దెరల్చి
పిన్నవై యుండియుఁ బెంపు వహించుటో? రాజుల గెల్చుటో రణములందు!
గురునాజ్ఞ సేయుటో? గుణనిధివై బలప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల?
ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో? కల్కితనము సేయ ఘనత గలదె?
వావి లేదు వారువారు నావా రను నెఱుక వలదె! వలుప లిమ్ము కృష్ణ 821

---

1. చలంబులు - పట్టువలలు, 2. తోయము - పక్షము, 3. కదలకుండఁగ— పాఠాంతరము, 4. మౌని - మాటలాడనివారు, 5, గంధగజేంద్ర - మదపుఏనుగు, 6, నీపము - కదంబము, 7, ఇందులో నవతారములు వర్ణింపబడినవి,

క. కొంటివి మా హృదయంబులు; గొంటివి మానంబు; లజ్జఁ గొంటివి; వలువల్
గొంటి; విఁక నెట్లు సేసెదొ: కొంటెవు గద! నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా! 822

సీ. రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే చెలరేఁగి వింతలు సేయుచుండ?
సత్త్వసంపద గల్గి జరగుటఁ దలఁపమే సిరి గల్గి యన్యులఁ జెనకుచుండ?
గురుతరశక్తియుక్తుఁడ నౌట యెఱుఁగమే తామసంబున [1]నెగ్గు దలఁచుచుండ?
నొకభంగితో నుండకుంటఁ జింతింపమే మాయావియై మాఱుమలయుచుండ?
ఆ. నేమిజాడవాఁడ? వేపాటి గలవాఁడ! వే గుణంబు నెఱుఁగ వెల్లయెడల
నొడిఁగి యుండనేర వోరంతప్రొద్దును బటము లీఁగదయ్య పద్మనయన. 823

క. రాజుల నెఱుఁగవు బలిమిని [2]రాజిల్లెడు చీర లీవు రమణుల మింకన్
రాజున కెఱిఁగించెద; మో రాజీవదళాక్ష! నీవు రాజవె ధరకున్?' 824

వ. అని పలికిన కన్నియపలుకు లాలించి మందహాససుందరవదనారవిందుండై గోపాల
బాలకులకరంబులం గరంబులు వ్రేసి యమ్ముద్దియల నుద్దేశించి [3]నెఱవాది చతురుం
డిట్లనియె. 825

శా. 'రామల్ [4]రాజులతోడ నీ పనికి నారంభింతురే మీ క్రియన్
మోమోటేమియు లేక దూలెదరు మీమోసంబు చింతింప, రం
భోమధ్యంబున నుండి వెల్వడి వెసం బూర్ణేందు బింబాననల్ ;
మీమీ చీరలు వచ్చి పుచ్చుకొనుఁడా? మీ కిచ్చెదం జెచ్చెరన్.' 826

వ. అనిన సమ్మానవతు లొండొరులమొగంబులు సూచి నగుచు, మర్మంబులు నాఁటు నమ్మా
టలకు మగుడం బలుక సిగ్గుపడుచు, నగ్గలంబయిన చలిని వలిగొని కంఠప్రమాణజలం
బులం దుండి డోలాయనమానమానసలై యి ట్లనిరి. 827

క. 'మావలువ [5] [6]లాగడంబున నీ వేటికిఁ బుచ్చుకొంటి? నీ వల్పుఁడవే?
నీ వెఱుఁగని దేమున్నది నీ విందఱిలోన ధర్మనిరతుఁడవు గదే? 828

శా. ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే? వచ్చిరా
యింతల్ సేయుదురే? కృపారహితులై యేలోకమందైన నీ
వింతల్ సీతలఁ బుట్టెఁగాక! మఱి యేవీ కృష్ణ! యో చెల్ల! నీ
చెంతన్ దాసులమై చరించెదము మా [7]చేలంబు లిప్పింపవే! 829

1. ఎగ్గు - హాని, 2. రాజిల్లెదుఁ జీర—పాఠాంతరము, 3, నెరవాది-సమర్థుఁడు, 4. రాములతోడ నీపనికిఁగా రాగింతురే, గారావత్తురే—పాఠాంతరములు 5. లు లాఘవమున—పాఠాంతరము, 6. ఆగడంబు దిట్టతనము, 7. చేలంబులు - వస్త్రములు.

క. వచ్చెదము నీవు పిలిచిన నిచ్చెద మేమైనఁగాని యెటఁ జొరు మనినం
జొచ్చెదము నేఁడు వస్త్రము లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా! 830

వ. అనిన దరహసితవదనుండై హరి యి ట్లనియె. 831

క. 'ఏతరుణుఁడు మగఁ డౌటకు మీ తపములు సెప్పఁ డింక మీయానలు సుం
డీ తప్పిన నీ కూరిమి మీతలలనె పుట్టెనోటు మేదిని లేదే! 832

క ఎవ్వనిఁ గని మోహించితి రెవ్వఁడు మీమానధనము లెల్ల హరించెన్?
నివ్వటిలె మీకుఁ గూరిమి యెవ్వనిపైఁ? బలుకరాదె? యే నన్యుఁడనే?' 833

వ అనిన విని సుందరు లన్యోన్యసందర్శనమ్ములు సేయుచు, హృదయారవిందంబులందుఁ [1]గందర్పుండు సందడింప నగుచు నిరుత్తరులయి యున్న లోకోత్తరుం డి ట్లనియె,

క. నాయింటికి దాసులరై నా యాజ్ఞ వహించి మీరు నడిచెదరేనిన్
మీ యంబరంబు లిచ్చెదఁ దోయంబులు వెడలి రండు తొయ్యలులారా!, 835

వ అనిన విని హరిమధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువనోపక 836

క. కొందఱు వెడలుద మందురు కొవదఱు వెడలుటయు సిగ్గు గొను గోవిందుం
డందురు; కొందఱు దమలోఁ గొందల మందుదురు వడఁకుగొని మనుజేంద్రా! 837

వ. మఱియు [2]నెట్టకేలకు జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయ మధ్యంబు వెలువడి. 838

క. చంచత్పల్లవకోమలకాంచననవరత్నఘటిత కంకణరుచిరో
దంచితకరసంఛాదితపంచాయుధగేహ లగుచుఁ బడఁతులు వరుసన్. 839

వ. చని ప్రౌఢలైన సుందరుల ముందట నిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెమర నిలిచిన నరవిందనయనుఁ డి ట్లనియె. 840

సీ. 'శృంగారవతులార! సిగ్గేల? మిము గూడి పిన్ననాఁటను గోలెఁ బెరిఁగినాఁడ
నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాఁడ; నేను జూడనిమర్మ మెద్దిగలదు?
వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక నీరు సొత్తురె మీరు నియతి దప్పి
కాత్యాయనీదేవిఁ [3]గల్లసేయుట గాక యీ రీతి నోఁచువా రెందుఁ గలరు?
ఆ. వ్రతఫలంబు మీరు వలచినఁ [4]జక్కఁగ నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు చీరలు సిగ్గు వో నాడ నేల? ఎగ్గులాడ నేల?' 841

1. కందర్పుండు - మన్మథుఁడు, 2. ఎట్టకేలకు - తుదకు, 3 కల్లసేయుట - మోసగించుట, 4. జయ్యన; దయ్యెడు—పాఠాంతరములు,

వ. అనిన విని మానవతులు దమలోన. 842

మ. వ్రతముల్ సేయుచు నొక్క మా టయిన నెవ్వానిన్ విచారించినన్
వ్రతభంగంబులు మాను నట్టి వరదున్ [1]వామాక్షు లీక్షించియున్
[2]గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగం బంచు శంకించి ఫా
లతటన్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి ర ట్లందఱున్. 843

క. బాలలకు హస్తకీలితఫాలలకు నితాంతశీతపవనాగమనా
లోలలకు నంబరములు గృపాలుఁడు హరి యిచ్చె భక్తపాలకుఁ డగుటన్. 844

ఆ. 'చీర లపహరించి సిగ్గులు విడిపించి పరిహసించి యైనఁ బరఁగ మనకు
ఘనుఁడు నోముకొఱఁత గాకుండ మ్రొక్కించె' ననుచు హరి నుతించి రబలలెల్ల. 845

క. ఉల్లములు నొవ్వ నాడినఁ గల్లలు సేసినను నగినఁ గలఁచిన నైనన్
వల్లభులు సేయు కృత్యము వల్లభలకు నెగ్గు గాదు; వల్లభ మధిపా! 846

వ. ఇట్లు హరి వలువ లిచ్చినం గట్టుకొని సతు లతనియందు బద్ధానురాగులయ్యుఁ జలింపక తెప్పలిడక తప్పక చూడ నాప్రోడ యెఱింగి చేరి వారి కి ట్లనియె. 847

సీ. 'లక్షణవతులార, లజ్జించి చెప్పరు గాని మీ మర్మముల్ గానఁబడియె
నను గొల్వ, జింతించినారు నా చేతను సత్యంబు మీనోము సఫలమగును
గామితార్థంబులకలిమి జెప్పఁగ నేల? ననుఁ గొల్వ ముక్తికి నడవ వచ్చుఁ
గడమ కూడఁగ నంబికాదేవి నోఁచంగ నటమీఁద రాత్రులయందు మీకు
ఆ. నన్నుఁ బొందఁ గల్గు నమ్మి పొందని హరివల్క నింతు లెల్ల భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ దత్పదాంభోజముల్ [3]మానసించుకొనుచు మందకడకు. 848

—: మునిభార్య లన్నముఁ దీసుకొనివచ్చి శ్రీకృష్ణుని నారగిఁపఁ జేయుట :—

వ. ఇట్లు గోపకన్యకలందుఁ బ్రసన్నుండై గోవిందుండు బృందావనము దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ, జండకిరణునియెండం బడి దండిచెడి తరులదండ నండగొనుచు నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబుల నీక్షించి కృష్ణ బల శ్రీదామ దేవ ప్రస్థవిశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకు లి ట్లనిరి. 849

మ. 'అపకారంబులు సేయ వెవ్వరికిఁ నేకాంతంబులం దుండు నా
తపశీతానిలవర్ష వారణములై త్వగ్గంధ [4]నిర్యాస భ

1. వామాక్షులు - స్త్రీలు, 2. గతచేలాప్లవనంబు - వస్త్రములు లేక స్నానము చేయుట, 3 మానసించుకొనుచు - మనస్సులో ధ్యానించుకొనుచు, 4. నిర్యాసము - బంక - జిగురు,

స్మ పలాశాగ్రమరందమూలకుసుమచ్ఛాయాఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీ యుర్వీజముల్ గంటిరే? 850

వ. అని చిగురాకు పువ్వు గాయ పండు [1]తండంబులవ్రేఁగున వీఁగినతరువులనడిమి తెరువునం బసుల [2]దాఁటుల దాటించి, యమునకుం జని, వెడఁదమడుఁగుల మెల్లన చల్లనినీరు ద్రావించి, తత్సమీపంబున మేపుచు, వల్లవు లెల్ల మూఁకలుగొని, యాఁకలిగొంటి మని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుండై వారలం జూచి రామసహితుండైన హరి యిట్లనియె 851

సీ. వల్లవులార! యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు
నరుగుట కాంగిరసాహ్వయసత్త్రంబు సలుపుచునున్నారు సనుఁడు మీరు
మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబు వెట్టెద' రనుచుఁ బలుక
వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు

తే. లలసి పుత్తెంచి రిట మమ్ము నన్న మడుగ ధర్మవిదులార! యర్థిప్రదాతలార
పెట్టుఁ డన్నంబు; [3]శ్రాంతులఁ బిలిచి తెచ్చి పెట్టుదురు గాదె మిముబోఁటి పెద్దలెల్ల. 852

క. ఘనదీక్షితునకు నైనం జనుఁ గుడువఁగ; బశువధంబు సౌత్రామణియుం
జనిన వెనుక దోషములే దనఘాత్మకులార! పెట్టుఁ డన్నము మాకున్.' 853

వ. అని గోపకులు పలికిన. 854

మ. 'క్రతువున్ మంత్రముఁ దంత్రమున్ ధనములుం గాలంబు దేశంబు దే
వతయున్ ధర్మము నన్యముల్ దలఁప నెవ్వాఁ డట్టి సర్వేశ్వరున్'
మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్థితిం జూచి దు
ర్మతులై యన్నము లేదు లే దనిరి సమ్మానక్రియాహీనులై. 855

వ. అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారి యగుచు 'మీ రయ్యార్యుల నడుగక, వారి భార్యలకు మా రాకఁ జెప్పుం; డన్నంబు పెట్టెద' రని పంచిన వారలు సని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితులయి యిట్లనిరి. 856

క. 'గోవుల మేపుచు నాఁకొని గోవిందుం డన్న మడిగి కొని రం డని మ
మ్మీవేళం బుత్తెంచెను ధీవిలసితలార! రండు; తెం డన్నంబుల్.' 857

వ. అనిన విని గోవిందదర్శనకుతూహలలై ధరణీసురసుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప, [4]భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయభేదంబులు గలిగి, సంస్కార

---

1. తండంబులు - గుంపులు, 2. దాఁటులు - గుంపులు, 3. శ్రాంతులు - శ్రమపడి యున్నవారు, 4. భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య పానీయములు - (క్రమముగా) కొఱుకఁదగినవి, మ్రింగఁదగినవి, నాకఁదగినవి, నమలఁదగినవి, త్రాగఁదగినవి,

సంపన్నంబు లైన యన్నంబులు కుంభంబుల నిడికొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున. 858

క. బిడ్డలు మగలును భ్రాతలు నడ్డము చని వల దనంగ నటు [1]దలఁ డని మా
ఱొడ్డుచు జగదీశ్వరునకు జడ్డన నన్నంబు గొనుచుఁ జని రా సుదతుల్. 859

వ. చని యమునాసమీపంబున నవపల్లవాతిరేకంబును విగతవనచరశోకంబును నైన యశో కంబుక్రింద నిర్మలస్థలంబున. 860

సీ. ఒక చెలికానిపై నొకచేయి సాఁచి వే ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు సెక్కుల నృత్యంబు సేయువానిఁ
గుఱుచచుంగులు వుచ్చి కొమరారఁ గట్టిన పసిఁడివన్నియ గల [2]పటమువాని
నొఁదలఁ దిరిగి రా నలవడఁ జుట్టిన దట్టంపుఁ బించెపుదండవానిఁ
తే. రాజితోత్పలకర్ణపూరములవాని మహితపల్లవపుష్పదామములవాని
భువనమోహననటవేష [3]భూతివానిఁ గనిరి కాంతలు కన్నులకఱవు దీఱ. 861

క. కని లోచనరంధ్రంబుల [4]మునుమిడి హరిలలితరూపమును లోఁగొని నె
మ్మనములఁ బరిరంభించిరి తనుమధ్యలు హృదయజనితతాపము వాయన్. 862

వ. ఇవ్విధంబున. 863

క. వారితసర్వస్పృహలై వా రందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట మదిలో
వారిజనయనుఁడు వొడగని వారికి ని ట్లనియె నగి యవారితదృష్టిన్. 864

శా. 'కాంతారత్నములార! మీ గృహములం గల్యాణమే? యేమి గా
వింతున్ మీ? కిటు రండు; మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచినా
రెంతే వేడుకతో; నెఱుంగుదురు నిర్వైతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీక్రియఁ జేరి కందురు గదా మత్సేవలన్ సర్వమున్. 865

వ. కావున గృహస్థులైన మీపతులు మిమ్ముం గూడి క్రతువు నిర్విఘ్నంబుగా సమాప్తి సేసెదరు; మీరు యాగవాటంబునకుం జనుం' డనిన విప్రభార్య లిట్లనిరి, 866

మ. 'తగునే మాధవ! యిట్టి వాఁడిపలుకుల్? ధర్మంబులే మాయెడన్?
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగ నీయంఘ్రులు సేరినార; మటఁ బోఁ జేకొందురే వార? లా
పగి దే మొల్లము; కింకరీజనులఁగా భావించి రక్షింపవే!' 867

---

1. తలఁడు - తొలఁగుఁడు. 2. పటము - వస్త్రము, 3. భూతి-సంపద, 4. మునుమిడి - వరుసపెట్టబడిని.

వ. అనిన జగదీశ్వరుండు. 868

సీ. 'నాసమీపమున నున్నారంచు నలుగరు బంధులు భ్రాతలు పతులు సుతులు
మిమ్ము దేవత లైన మెత్తు రంగనలార! నా దేహసంగంబు నరుల కెల్ల
సౌఖ్యానురాగసంజనకంబు గాదు; ముక్తిప్రదాయకము; నా కీర్తనమున
దర్శనాకర్ణనధ్యానంబులను గర్మబంధదేహంబునఁ బాసి మీరు
తే. మానసంబులు నాయందు మరగఁజేసి నన్నుఁ జేరెద రటమీఁద; నమ్ముఁ' డనుచుఁ
బలికి వారలు దెచ్చిన భక్షణాదు లాప్తవర్గంబుతో హరి యారగించె. 869

క. పరమేశ్వరార్పణంబుగఁ బరజనులకు భిక్ష యిడినఁ బరమపదమునం
బరఁగెద రఁట! తుది సాక్షాత్పరమేశుఁడు భిక్ష గొన్న ఫల మెట్టిదియో? 870

వ. ఇట్లు సర్వేశ్వరుండయిన హరికి భిక్ష యిడి తమ భార్య లతనివలనం గృతార్థలగుట
యెఱింగి భూసురవరులు తమలో నిట్లనిరి. 871

చ. 'కటకట! మోసపోయితిమి; కాంతలపాటియు బుద్ధి లేదు; నేఁ
డిట హరిఁ గానఁబో నెఱుఁగ; మేము దురాత్ములు! మేము కల్మషో
ద్భటులము; విష్ణుదూరగుల ప్రాజ్ఞత లేల? తపంబు లేల? ప
ర్యటనము లేల? శీలములు యాగములున్ మఱి యేల కాల్పనే? 872

క. జపహోమాధ్యయనంబులఁ దపములు వ్రతములును లేని తరుణులు హరిస
త్కృపఁ బడసి; రన్నిగలిగియుఁ జపలతఁ బొందితిమి భక్తిసలుపమి నకటా! 873

క సురగురులగు యోగీంద్రుల నరుదుగ మోహితులఁజేయు హరిమాయ మమున్
నరగురుల మూఢవిప్రుల నురవడి మోహితులఁ జేయ నోపకయున్నే? 874

మ. క్రతువుల్ ధర్మము మంత్రతంత్రధనముల్ గాలంబు దేశంబు దే
వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వాఁ డట్టి సర్వేశుఁ డీ
క్షితి రక్షింప జనించినాఁ; డెఱుఁగ; మా శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథసంహర్తకున్.' 875

—: నందాదు లింద్రయాగము సేయ శ్రీకృష్ణునితో నాలోచించుట :—

వ. అని మఱియు ననేకవిధంబులఁ [1]పశ్చాత్తాపంబులం జెంది హరిం దలంచి శమింపు మని
మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతు లయి బలకృష్ణసందర్శనంబు సేయంజనరై; రంత
నక్కడ నఖిలదర్శనుండైన హరి యింద్రయాగంబు సేయం దలంచి తన కడకు వచ్చిన
నందాదిగోపవృద్ధులం గని నందున కిట్లనియె. 876

1. పశ్చాత్తాపంబులు-తప్పుచేసి, వెనుకవిచారించుటలు,

సీ. యాగంబు సేయంగ నర్థించి వచ్చితి; రీ యాగమున ఫల మేమి గలుగు?
నెవ్వాఁడు దీనికి నీశ్వరుం? డధికారి యెవ్వఁడు? [1]సాధన మెంత వలయు?
శాస్త్రీయమో, జనాచారమో కార్యంబు? వైరుల కెఱిఁగింపవలదు గాని
యెఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁదగుఁ; జేరి యెఱిఁగి చేసినఁ గోర్కు లెల్లఁగలుగుఁ
ఆ. బగయుఁ జెలిమి లేక పరఁగిన మిముబోఁటి మంచివారి కేల [2]మంతనంబు?
తలఁపు లెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే [3]తాత! వాక్సుధాప్రదాత వగుచు. 877

వ. అని పలికిన ప్రౌఢకుమారునికిఁ దండ్రి యి ట్లనియె. 878

సీ. పర్జన్యుఁ డధికుండు [4]భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ బ్రియమూర్తు లగుచునున్న
మేఘబృందంబులు మేదినీతలముపై నతనిపంపున భూతహర్షణముగ
జలములు గురియుఁ; దజ్జలపూరములఁ బోఁగి పండు సస్యంబు! లా పంట దమకు
ధర్మార్థకామప్రదాయకంబుగ లోకు లెల్లను బ్రదుకుదు; రింత యెఱిఁగి.
తే. మేఘవిభుఁడైన యింద్రుండు మెచ్చుకొఱకు నింద్రయాగము సేయుదు రెల్లనృపులు
కామలోభభయద్వేషకలితు లగుచుఁ జేయకుండిన నశుభంబు సెందుఁ బుత్ర! 879

వ. అదియునుంగాక. 880

ఆ. [5]మఖము సేయ వ్రజ మది సంతసించును; వ్రజి సంతసింప వాన గురియు
వాన గురియఁ గసవు [6]వసుమతిఁ జెరుఁగును; గసవు మేసి ధేనుగణము బ్రదుకు 881

క. ధేనువులు బ్రదికెనేనిన్ మానదు; ఘనమైన పాఁడి మందలఁ గలుగున్
మానుగను బాఁడి గలిగిన మానవులును సురలుఁ [7]దనిసి మనుదురు పుత్రా!' 882

వ. అని యిట్లు నొడివిన నందుని వచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజ
దమనుండు తండ్రి కిట్లనియె. 883

క. 'కర్మమునఁ బుట్టు జంతువు; కర్మమునన వృద్ధిఁ బొందుఁ; గర్మమునఁ జెడుం;
గర్మమె జనులకు దేవత! కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా! 884

క. కర్మములకుఁ దగు ఫలములు కర్ములకు నిడంగ రాజు గాని [8]సదా ని
ష్కర్ముఁడగు నీశ్వరుండును గర్మవిహీనునికి రాజు గాఁడు మహాత్మా! 885

---

1. సాధనము - వస్తుసామగ్రి, 2. మంతనంబు - రహస్యము, 3. తాత - తండ్రి,
4. భగవంతుఁడు - పూజ్యుఁడు, 5. మఖము - యాగము, 6. వసుమతి - భూమి,
7. తనిసి - తృప్తిపొంది, 8. సదా - ఎల్లప్పుడు.

వ. కావునఁ గర్మానుయాతంబులయిన [1]భూతంబులకుఁ [2]బురుహూతునివలని భీతి యేఁటికి? పురాతనజన్మసంస్కారములు గుప్పలు గొని కప్పినఁ గర్మంబులఁ దప్పించి పెంపువడయ నప్పరమేశ్వరుండును నేరఁ డితరులం జెప్పనేల? సురాసురనరానీకంబులతోడిలోకంబు నిజసంస్కారవశంబై యంద డిందియున్నది; సందేహంబు లేదు; దేహి కర్మవశంబున గురు తను దేహంబులం జొచ్చి వెడలు; [3]నొజ్జ, వేలుపు, నెచ్చెలి, [4]పగలు చుట్టంబులు. కర్మంబు జీవుండు కర్మంబుతోడన వర్తించు; నతనికిఁ గర్మంబు దైవతంబు కర్మం బునం బ్రకుకుచు నితరసేవ సేయుట సతి పతి విడచి జారుంజేరిన చందం బగు; విప్రుండు వైదికకర్మంబున మెలంగు; నృపతి ధరణీపాలనంబున సంచరించు; వైశ్యుండు వాణిజ్య [5]కృషి [6]కుసీదగోరక్షణాదుల వర్తించు; శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రదుకు; సత్త్వరజస్తమోగుణంబు లుత్పత్తిస్థితిలయకారణంబు; లందు రజంబున జగంబు జన్మించు; రజోగుణప్రేరితంబులయి మేఘంబులు వర్షించు; వర్షంబునం బ్రజా వృద్ధి యగు; నింద్రుం డేమి సేయగలవాఁ డదియునుం గాక. 886

శా. కోపింపం బని లేదు శక్రునికిఁ దాఁ గోపించుఁ గా కేమి [7]సం
క్షేపం బయ్యెడి దేమి? పట్టణములుం గేహంబులుం దేశముల్
వ్యాపారంబులు మీకుఁ బోయెడినె? శైలారణ్యభాగంబులున్
గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేఁటికిన్? 887

సీ. పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు మఖము గావించుట మంచిబుద్ధి
యింద్రయాగంబున కేమేమి దెప్పింతు రవి యెల్లఁ దెప్పింపుఁ దరసి మీరు
పాయసంబులు నపూపములు [8]సైఁదపుఁ బిండి వంటలుఁ బప్పును వలయునట్టి
ఫలశాకములు వండఁబంపుండు హోమంబు సేయుఁడు; ధేనుదక్షిణల నిచ్చి
తే. బహురసాన్నంబు పెట్టుండు బ్రాహ్మణులకు నచలులై పూజ లొనరింపుఁ డచలమునకు
నధమచండాలశునకసంహతికిఁ దగిన భక్ష్యముల నిండు కసవులు పసుల కిండు. 888

శా. గంధాలంకరణాంబరావళులచేఁ గైసేసి యిష్టాన్నముల్
బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా భాషారతిన్ వేడుకల్
సంధిల్లన్, గిరిగోద్విజానలనమస్కారంబు గావింపుఁ డో
జం ధర్మం బని తోఁచెనేని జనకా! జన్మంబు ధన్యం బగున్ 889

వ. అని మఱియు [9]నిలింపపతిసొంపు దింపుతలంపున నిమ్మఖంబు దనకు సమ్మతం బని గోవిందుండు పలికిన, నందాదులు మేలు మే లని తద్వచన ప్రకారంబునం బుణ్యాహవాచ నంబులు సదివించి ధరణీసురులకు భోజనంబులిడి పసులకుం గసవు లొసంగి, రప్పుడు.

1. భూతంబులు,- ప్రాణులు, 2. పురుహూతుడు - ఇంద్రుఁడు, 3. ఒజ్జ - గురువు, 4. దగలు-విరోధులు, 5. కృషి-వ్యవసాయము, 6. కుసీదము-వడ్డీవ్యాపారము, 7, సంక్షేపంబు-కొఱత, 8. సైంధము-గ ధుమ, 9. నిలింపపతి - ఇంద్రుఁడు,

మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన [1]నైజంబైన రూపంబుతో
నకలంకస్థితినుండి శైల మిదె మీ రర్చింప రం' డంచుఁ దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో [2]నొండొండ పూజించి గో
పకదత్తాన్నము లాహరించె విభుఁ డా ప్రత్యక్షశైలాకృతిన్. 891

మ. 'వినుఁడీ, శైలము కామరూపి; ఖలులన్ వేధించు; నాజ్యాన్నముల్
మన మొప్పించిన నాహరించె; మనలన్ మన్నించెఁ; జిత్తంబులో
ననుకంపాతిశయంబు సేసెఁ మనపైఁ నంచున్ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ [3]వందారుమందారుఁడై. 892

వ. ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాదవచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు సేసి, రా సమయంబున. 893

క. గుబ్బములపరువు మెచ్చని [4] [5]నట్టులఁ గట్టిన రథంబు నందప్రముఖుల్
గుబ్బలియార్పులు సెల'గఁగఁ దొబ్బులగమి వెంట నంటఁ దోలి, రిలేశా! 894

క. పాటించి గానవిద్యా పాటవమునఁ దేరు లెక్కి బహు [6]తానములం
బాటలగంధులు కృష్ణునిఁ బాటలఁ బాడిరి విరోధిపాటనుఁ దనుచున్. 895

క కుందని[7]భాపీనంబులు మండితవర్ణములు వివిధమహితాకృతులున్
నిండిన కడుపులుఁ గన్నుల పండువులుగ బాఁడి కుఱ్ఱిపదువులు నడచెన్. 896

క. పొగ రెక్కిన మూఁపురములు; దెగ గల వాలములు, శైలదేహంబులు, భూ
గగనములు నిండు ఱంకెలు మిగుల మెలయు వృషభగణము మెల్లన నడచెన్. 897

వ. ఇట్లు పర్వతప్రదక్షిణంబు సేసి గోపకులు మాధవసమేతులై మందకుం జని రంత మంహేంద్రుం డంతయు నెఱింగి మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబులగు సంవర్తక మేఘంబులం జీరి యి ట్లనియె 898

మ. 'పెరుఁగుల్ నేతులు ద్రావి క్రొవ్వి, భువి నాభీరుల్ [8]మదాభీరులై
గిరిసంఘాతకఠోరపత్త్రదళనక్రీడాసమారంభదు
ర్భరదంభోళిధరుం బురందరు ననుం బాటించి పూజింప క
గ్గిరికిం బూజలు సేసి పోయి రదె పో కృష్ణుండు ప్రేరేపఁగన్. 899

---

1. నైజంబు - స్వభావసిద్ధము, 2. ఒండొండ - ప్రత్యేకముగా, 3. వందారు మందారుఁడు-నమస్కరించువారికిఁ గల్పవృక్షమైనవాఁడు, 4. నట్టులఁ—పాఠాంతరము, 5, నట్టులు - ఎడు, 6. తానములు - గానాంగవిశేషములు, 7. ఆపీనము - పొదుగు, 8. మదాభీరులు - గర్వమున భయములేనివారు,

క. గురుదేవహీను బాలుని గిరిబుజ ప్రముఖవాసుఁ గృష్ణు ననీశుం
[1]బరిణామశీలుఁ గులగుణ విరహితుఁ జేపట్టి యింద్రుఁ విడిచిరి గొల్లల్, 900

ఆ. విమలఘనతరాత్మ విజ్ఞానవిద్యచే నిగుడలేక [2]యుడుపనిభము లగుచుఁ
గర్మమయములైన క్రతువుల భవమహార్ణవము గడవఁ గోరినారు వీరు. 901

వా. ఉద్యత్సంపద నమ్మి నందతనయోద్యోగంబునన్ వెఱ్ఱులై
మద్యాగంబు [3]విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
[4]సద్యోమృత్యువుఁ బొంద ఱాల్ గురియుఁడీ! శౌర్యం బవార్యంబుగన్. 902

క. మీ వెంట వత్తునే నై రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా
దేవగణంబులతోడను గోవిందుని మంద లెల్లఁ గొందల పెట్టన్. 903

వ. అని యిట్లు పలికి జంభవైరి సంరంభంబున [5]దంభోళి జళిపించి, బింకంబున శంకింపక, కింకతోడ సంకిలియ లూడ్చిన, మహానిలప్రేరితంబులయి చని, నందునిమందమీఁద నమోఘంబులైన మేఘంబులు [6]మహౌఘంబులై పన్ని, ప్రచండగతిం జండమరీచిమండలంబుఁ గప్పి, దివి నిండి, దిశ లోవరించి, రోదోంతరాళంబు నిరంతరనీరంధ్ర నిబిడాంధకారబంధురంబుగ నిరోధించి, బలిభంజనద్వితీయ పాదపల్లవ భగ్నంబైన బ్రహ్మాండ భాండంబు చిల్లుల జల్లించి, తొరఁగు బహిస్సముద్రసలిలనిర్ఝరంబులవడువున నెడతెగక తోరంబులైన నీరధారలం గురియుచు, శిలల వర్షించుచుఁ, బిడుగుల ఉవ్వుచునుండ, మిట్టు పల్లంబులు సమతలంబులయి, యేకార్ణవంబు రూపుసూపిన, నందు [7]దుడుకడుచుదు నీఁదుచు, విలయశిఖిశిఖాసంరంభ విజృంభమాణవిద్యుల్లతావిలోకంబున రిమ్మలుగొని, సొమ్మలు వోవుచున్న లేఁగలును, లేఁగలమూతు లడ్డంబు లిడి ప్రళయభైరవభేరీభాంకారభీషణంబులగు గర్జనఘోషణంబులఁ జెవుడువడి చిందఱవందఱలైన డెందంబులం గంది కుంది ఱ్రాలు ధేనువులును, ధేనువుల వెనుక నిడుకొని దురంతకల్పాంత [8]కాలకేళి కారాళకాలకంఠకరవిశాలగదాఘాతప్రభూతంబులైన [9]నిర్ఘాతపాతంబులకు భీతంబులై హరికి మ్రొక్కి, రక్షరక్షేతిశబ్దంబులు సేయుకైవడి విడువని జడిం బడి, సైరింపక శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబున నంభారవంబులు సేయు వృషభంబులును, వృషభాదిగోరక్షణంబు సేయుచు దుర్వారఘోరశిలాసారంబుల సారంబులు సెడి శరీరంబులు భారంబులైన మానువపు గోపకులును, గోపకులం బట్టుకొని దట్టంబయిన వానకొట్టునం

1. పరిణామశీలుఁడు-క్షేమస్వభావుఁడు, 2 ఉడుపము-తెప్ప, 3. విసర్జనీయము-విడువఁదగినది, 4. సద్యోమృతువు - వెంటనేకల్గు మరణము, 5. దంభోళి - వజ్రము, 6. మహౌఘంబులు - పెద్దగుంపులు. 7. దుడుకడుచుచు - మునుగుచు, 8. కేళీవిలాస; కేళీవిక్షేప: కాలకంఠ—పాఠాంతరములు, 9.నిర్ఘాతము-పిడుగు,

బెట్టుపడి బడుగునడుములు [1]నుసులువడ వడవడ వడంకుచు గోవిందుని జీరు గోపికలును గోపికాజనకఠినకుచకలశయుగళంబుల మఱుంగునం దలలు వెట్టుకొని పరవశులైన శిశువులునుం గలిగి, మహాఘోషంబుతోడ నష్టంబైన ఘోషంబుఁ జూచి ప్రబుద్ధులైన గోపవృద్ధులు గొందఱు దుర్జనశిక్షకుండును సజ్జనరక్షకుండును నైన పుండరీకాక్షునకు మ్రొక్కి యి ట్లనిరి. 904

ఉ. అక్కట! వానఁ [2]దోఁగి వ్రజ మాకుల మయ్యె గదయ్య! కృష్ణ! నీ
వెక్కడ నుంటి? వింతదడ వేల సహించితి? నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు దీనత నొంద భయాపహారివై
గ్రక్కున గాన కి ట్లునికి కారుణికోత్తమ! నీకుఁ [3]బాడియే? 905

క. ఈ యుఱుములు, నీ మెఱుములు, నీ యశనులఘోషములును, నీ జలధారల్
నీ యాన దొల్లి యెఱుఁగము [4]కూ యాలింపంగదయ్య గుణరత్ననిధీ? 906

క. వారి [5]బరు వయ్యె మందల, వారికి; నిదె పరులు లేరు వారింపంగా;
వారిదపటలభయంబును, వారిరుహదళాక్ష! నేఁడు వారింపఁగదే! 907

వ. అనిన విని సర్వజ్ఞుండైన కృష్ణుం డంతయు నెఱింగి. 908

ఉ. 'త న్నొకయింత గైకొనరు; తప్పిరి; యాగము సేసి' రంచుఁ దా
మిన్నుననుండి గోపకులమీఁద శిలల్ గురియించుచున్న వాఁ
డున్నతనిర్జరేంద్రవిభవోత్థితగర్వనగాధిరూఢుఁడై
కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు గర్వపరుం; డొరుఁ గాన నేర్చునే? 909

క. దేవత లందఱు నన్నును, సేవింతురు; రాజ్యమదముఁ జెందరు; చెఱుపం
గా వలదు; మానభంగము, గావింపఁగ వలయు శాంతి గలిగెడుకొఱకై. 910

వ. అని చింతించి శిలావర్షహతులై శరణాగతులైన ఘోషజనుల రక్షించుట తగ వని సకల లోకరక్షకుండయిన విచక్షణుండు. 911

చ. కలఁగకుఁడీ వధూజనులు! కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్!
తలఁగకుఁడీ కుమారకులు! తక్కినవారలు టాలవానచే
నలఁగకుఁడీ! పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ!
[6]మెలఁపున మీకు నీశ్వరుఁడు మే లొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై. 912

1. నుసులువడక—పాఠాంతరములు, 2. తోఁగి-మునిగి, 3. పాడి-న్యాయము, 4. కూయి - మొఱ, 5 బరవయ్యె-పాఠాంతరము, 6. మెలపు - జాగరూకత,

వ. అని పలికి. 913

## —: శ్రీకృష్ణుఁడు గోవర్ధన పర్వతము నెత్తుట :—

క. [1]కిరియై ధర యెత్తిన హరి కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువన [2]శం
కరకరుఁడై గోవర్ధన గిరి యెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్. 914

క. దండిని బ్రహ్మాండంబులు చెండులక్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడు హరికిన్
గొండఁ బెకలించి యెత్తుట కొండొకపని గాక యొక్క [3]కొండా తలఁపన్ ? 915

వ. ఇట్లు గిరి యెత్తి. 916

శా. బాలుం డాడుచు [4]నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలం దాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోపంక్తికిన్. 917

వ. ఇట్లు [5]గోత్రంబు ఛత్రంబుగాఁ బట్టి గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె. 918

క. రా తల్లి ! రమ్మ తండ్రీ ! వ్రేతలు గోపకులు రండు ! వినుఁడీ ! [6]గర్త
క్ష్మాతలమున నుండుఁచు గోవ్రాతముతో మీరు మీకు వలసినయెడలన్. 919

శా. బాలుం డీఁతఁడు; కొండ దొడ్డది; మహాభారంబు సైరింపఁగాఁ
జాలండో ? యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁబోల; దీ
శైలాంభోనిధి జంతుసంయుతధరాచక్రంబు పైపడ్డ నా
[7]కేలల్లాడదు; బంధులార ! నిలుఁ డీక్రిందం బ్రమోదంబునన్.' 920

వ. అని పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండయడుగునం దమ తమ
[8]యిమ్ములం బుత్రమిత్రకళత్రాదిసమేతులై గోవులుం దారును గోపజనులు జనార్దనకరుణా
విలోకనామృతవర్షంబున నాఁకలినీరువట్టులచొప్పెఱుంగక కృష్ణ కథావినోదంబుల నుండి;
రివ్విధంబున. 921

మ. హరిదోర్దండము గామ; గుబ్బ శిఖరం; [9]బాలంబిముక్తావళుల్
పరగన్ జాఱెడు తోయబిందువులు; గోపాలాంగనాపాంగహా

---

1. కిరి - వరాహము, 2 శంకరకరుఁడు - శుభములొనర్చు కరములుకలవాఁడు,
3. కొండా - ఘనకార్యమా?, 4. ఆతపత్రము - గొడుగు, 5. గోత్రంబు - పర్వతము,
6. గర్తము - గొయ్యి, 7. కేలు - చేయి, 8. ఇమ్ములు - స్థానములు, 9. ఆలంబ -
వ్రేలాడుచున్న.

సరుచుల్ రత్నచయంబు గాఁగ, [1]నచలచ్ఛ్రదంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్నప్రజారంజియై. 922

క. రాజీవాక్షునిచే నొక్క రాజీవముభంగి శైలరాజము మెఱసెన్;
రాజేంద్ర! మీఁద మధుకర రాజిక్రియన్ మేఘరాజి రాజిల్లెఁ గడున్. 923

క. వడిగొని బలరిపుపనుపున నుడుగక జడి గురిసె నేడహోరాత్రము; లి
య్యెడ గోపజనులు బ్రదికిరి జడిఁ దడియక కొండగొడుగుచాటున నధిపా! 924

వ. ఇట్లు హరి యేడహోరాత్రంబులు గిరి ధరించిన గిరిభేది విసిగి వేసరి కృష్ణ చరితంబులు విని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘంబుల మరలించుకొని చనియె; నంత నభోమండలంబు విద్యోతమాన [2]ఖద్యోతమండలం బగుట విని గోవర్ధనధరుండు గోపాలకుల కిట్లనియె. 925

క. 'ఉడిగెను వానయు గాలియు వడిసెడి నదు లెల్లఁ [3]బొలిచె; వఱద లిగిరెఁ; గొం
డడుగున నుండక వెడలుఁడు కొడుకులఁ గోడండ్రు సతులఁ గోవులు మీరున్.' 926

వ ఆనిన విని సకల గోపజనులు శకటాద్యుపకగణసమేతులయి గోవులుం దారును గొండ యడుగు విడిచి వచ్చి; రచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటియట్ల నిజస్థానంబున గిరి నిలిపె; నంత వల్లవులెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని సముచిత ప్రకారంబుల సంభావించి దీవించిరి; గోపికలు సేసలిడి, దధ్యన్నకబళంబు లొసంగుచు నాశీర్వదించిరి; నందబలభద్రరోహిణీ యశోద లాలింగనంబు సేసి భద్రవాక్యంబులు పలికిరి; సిద్ధసాధ్యగంధర్వవరులు విరుల గురియించిరి; సురలు శంఖదుందుభులు మ్రోయించిరి; తుంబురుప్రముఖులయిన గంధర్వులు పాడి; రప్పుడు. 927

క. వల్లవకాంతలు దనకథ లెల్లను బాడంగ నీరజేక్షణుఁ డంతన్
వల్లవబలసంయుతుఁడై యుల్లన గోష్ఠంబు సేరె నుర్వీనాథా! 928

వ. ఆయ్యవసరంబునఁ గృష్ణు చరిత్రంబులు దలంచి వెఱఁగువడి గోపజనులు నందున కిట్లనిరి. 929

సీ. 'కన్నులు దెఱవని కడుఁజిన్ని పాపఁడై [4]దానవిచనుఁబాలు ద్రాగి చంపె
మూఁడవనెలనాఁడు ముద్దుల బాలుఁడై కోపించి శకటంబుఁ గూలఁ దన్నె
నేఁడాదికుఱ్ఱఁడై యెగసి తృణావర్తు మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁజేసెఁ
దల్లి వెన్నలకునై తను ఱోలఁ గట్టినఁ గొమరుఁడై మద్దుల గూల నీడ్చెఁ;

1. అచలము - కొండ, 2. ఖద్యోతుఁడు - సూర్యుఁడు. 3. బొలుప; బొలప—పాఠాంతరము, 4. దానవి - రాక్షసి-పూతన.

తే. బలులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె వెలఁగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె
సబలుఁడై ఖరదైత్యుని సంహరించె నితఁడు కేవలమనుజుఁడే యెంచిచూడ 930

క. [1]తెంపరియై రామునిచేఁ జంపించెఁ బ్రలంబు; మ్రింగెఁ జటులదవాగ్నిన్
సొంపు సెడఁ ద్రొక్కి కాళియుఁ దుంపక కాళింది వెడలఁ దోలెన్ లీలన్. 931

క. ఏడేండ్లబాలుఁ డెక్కడ? క్రీడం గరి తమ్మియెత్తు క్రియ నందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ? వేడుక నొకచేత నేఁడు వెఱఁగౌఁ గాదే! 932

క. ఓ నంద! గోపవల్లభ! నీ నందనుఁ డాచరించు నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె; మానవమాత్రుండె నీకుమారుఁడు దండ్రీ!' 933

వ. అనిన విని నందుండు వారల జూచి మున్ను తనకు గర్గమహాముని చెప్పిన [2]సంకేతంబు దెలిసి 'శంక లేదు; కృష్ణుండు లోక రక్షకుం డయిన పుండరీకాక్షుని నిజాంశ యనుచు నంతరంగంబుం జింతింతు' నని పలికిన వెఱఁగుపడి గోపకులు గృష్ణుం దనంతుండని పూజించి; రంత. 934

మ. హరి గేలన్ గిరి యెత్తి వర్షజలఖిన్నాభీరగోరాజికిన్
శరణంబైనఁ ద్రిలోక రాజ్యమదముం జాలించి నిర్గర్వుఁడై
[3]సురభిం గూడి [4]బలారి వచ్చి కనియెన్ సొం పేది దుష్ట ప్రజే
శ్వరదుర్మాననిరాకరిష్ణుఁ గదుణాపర్ధిష్ణు శ్రీకృష్ణునిన్. 935

క. కని యింద్రుఁడు పూజించెను దినకరనిభనిజకిరీటదీధితిచేతన్
మునిహృదలంకరణంబులు సునతోద్ధరణములు నందసుతుచరణంబుల్. 936

వ. ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి [5]హరిహయుం డిట్లనియె. 937

సీ. 'పరమ! నీధామంబు భాసురసత్త్వంబు; శాంతంబు; హతరజస్తమము; నిత్య;
మధికతపోమయ! మట్లు గావున మాయ నెగడెడి గుణములు నీకు లేవు
గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి లోభాదికములు నీలోనఁ జేర
వైన దుర్జననిగ్రహము శిష్టరక్షయుఁ దగిలి చేయఁగ దండధారి వగుచు.
తే. జగముభర్తవు; గురుఁడవు; జనకుఁడవును జగదధీశుల మను మూఢజనులు దలఁక
నిచ్చపుట్టిన రూపంబు లీవు దాల్చి హితము సేయుదు గాదె? లోకేశ్వరేశ! 938

క. నావంటి [6]వెట్టివారిని శ్రీవల్లభ! నీవు [7]శాస్తి సేసితివేనిం
[8]గావరము మాని పెద్దల త్రోవన్ జరుగుదురు బుద్ధితోడుత నీశా! 939

---

1. తెంపరి-సాహసముకలవాఁడు, 2. సంకేతంబు-రహస్యము, 3. సురభి-కామధేనువు, 4. బలారి-ఇంద్రుఁడు, 5. హరిహయుండు-ఇంద్రుఁడు, 6. వెట్టివారు-మూర్ఖులు, 7. శాస్తిచేయుట - శిక్షించుట, 8. కావరము - గర్వము.

క. ఒక్కొకలోకముఁ గాంచుచు నెక్కుడుగర్వమున '[1]నేమె యీశుల' మనుచుం
జొక్కి ననుబోఁటి వెఱ్ఱులు నిక్కము నీమహిమఁ దెలియనేర రనంతా! 940

ఆ. వాసుదేవ! కృష్ణ! వరద! స్వతంత్ర! విజ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష ! నిఖిలబీజభూతాత్మక! బ్రహ్మ! నీకు వందనంబు నిష్కలంక! 941

శా. నీసామర్థ్య మెఱుంగ మేఘములచే నీ ఘోషమున్ భీషణో
[2]గ్రాసారంబున ముంచితిన్ మఖము నాకై వల్లవుల్ సేయ రం
చోసర్వేశ! భవన్మహత్త్వమున నాయుద్యోగ మిట్లయ్యె! నీ
దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దర్శింపవే మాధవా! 942

మ. నినుఁ బ్రహ్మాదు లెఱుంగలేరు: జగతానిష్ఠుండ లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుఁడన్ విపులదుర్వైదుష్యభూయిష్ఠుఁడన్
వినయత్యాగవరిష్ఠుఁడం; గుజనగర్విశ్రేష్ఠుఁడన్ దేవ; నీ
ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడన్? సర్వగా!' 943

వ. అనిన విని నగుచు జలధరగంభీరరవంబుల శక్రునకుం జక్రి యిట్లనియె. 944

మ. 'అమరాధీశ్వర! [3]లక్ష్మితోఁ దగిలి యిట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకము ద్రుంచివైచుటకు నీ జన్నంబు దప్పించితిం
[4]బ్రమదశ్రీకులు [5]దండధారి నగు నన్ భావింప; రెవ్వాని ని
క్కము రక్షింపఁ దలంతు వాని నధనుం గావింతు జంభాంతకా! 945

క. నాయాజ్ఞ సేయుచుండుము నీ యధికారంబునందు నిలువు; సురేంద్ర
శ్రీయుతుఁడవై మదింపకు శ్రేయంబులు గల్గుఁ; బొమ్ము '[6]సితకరిగమనా!' 946

వ. అని యిట్లు [7]జిష్ణునికిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేత యయిన కామ
ధేనువు భక్తజనకామధేను వయిన యీశ్వరున కిట్లనియె. 947

క. 'విశ్వేశ! విశ్వభావన! విశ్వాకృతి! యోగివంద్య! విను నీచేతన్
శాశ్వతుల మైతి మిప్పుడు; శాశ్వతముగఁ గంటి మధికసౌఖ్యంబు హరీ! 948

వ. దేవా మాకుం బరమదైవతంబ; వింద్రుండవు; భూసురగోసుర సాధుసౌఖ్యంబులకొఱకు
నిన్నింద్రునిం జేసి పట్టంబు గట్టు మని విరించి నియమించి పుత్తెంచె; నీవు భూతలభూరి
భారనివారణంబు సేయ నవతరించిన హరి' వని పలికి యంత. 949

1. ఏమె - మేమే, 2. ఆసారంబు - జలధారాపాతము, 3. లక్ష్మి - సంపద,
4. ప్రమద శ్రీకులు - సంపదవలన మిక్కిలి గర్వించువారు, 5. దండధారి - శిక్షకుఁడు,
6. సితకరి - తెల్లయేనుఁగు-ఐరావతము, 7. జిష్ణుఁడు - ఇంద్రుఁడు.

మ. సురభిక్షీరములన్ సురద్విపమహా [1]శుండాలతానీతని
ర్జరగంగాంబువులున్ నిలింపజననీ సన్మౌనిసంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం
చు రణాక్రాంతవిపక్షు దోయజదళాక్షున్ సాధుసంరక్షణున్. 950

సీ. తుంబురునారదాదులు సిద్ధచారణగంధర్వులును హరికథలు వాడి
రమరకాంతలు మింట నాడిరి వేల్పులు గురియించి రంచితకుసుమవృష్టి
జగములు మూఁడును సంతోషమును బొందెఁ గుఱ్ఱులచన్నులఁ గురిసెఁ బాలు
నవజలంబులతోడ నదు లెల్లఁ బ్రవహించె నిఖిలవృక్షములుఁ దేనియలు వడిసె
తే. సర్వలతికల ఫలపుష్పచయము లమరెఁ బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ
బ్రాణులకు నెల్లఁ దమలోని [2]పగలు మానె వాసుదేవుని యభిషేకవాసరమున. 951

వ. ఇట్లు గోపగోగణపతిత్వంబునకు గోవిందు నభిషిక్తుంజేసి వీడ్కొని [3]పురందరుండు దేవ
గణంబులతో దివంబున కరిగెనంత. 952

—: శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి కొని తెచ్చుట :—

సీ. నందుఁ డేకాదశినాఁ డుపవాసంబు సేసి శ్రీ హరిపూజ సేసి [4]దనుజ
వేళ యెఱుంగక వేగకముందర ద్వాదశీస్నానంబు దగ నొనర్ప
యమునాజలము సొర [5]నప్డు వరుణుదూత నందుని వరుణుని నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన గోపకు లందఱు నందగోపకునిఁ గానక కలంగి
తే. రామకృష్ణులఁ బేర్కొని [6]రవము సేయఁ గృష్ణుఁ డీశుండు తమతండ్రిఁ [7]గికురువెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు టెఱిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప!

వ. అప్పుడు. 954

క. వచ్చిన మాధవుఁ గనుఁగొని చెచ్చెర వరుణుండు పూజ సేసి వినతుఁడై
యచ్చుగ నిట్లని పలికెను విచ్చేసితి దేవ! నా నివేశంబునకున్. 955

ఉ. ఏ విభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం
ద్రోవఁ జరింతు రట్టి బుధతోషక? నీ వరుదెంచుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము గృతార్థక నొందె మనోరథంబు నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా? 956

1. శుండాలతల - లతవంటితొండము, 2. పగలు - విరోధములు, 3. పురందరుండు - ఇంద్రుఁడు, 4. దనుజవేళ - రాక్షసులు చరించు సమయము, 5. నందొక్క దైత్యుడు - పాఠాంతరము, 6. రవముసేయ - గోలపెట్టఁగా, 7. కికురువెట్టి - మోసగించి.

ఉ. ఏ పరమేశ్వరున్ జగము లిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు. మహాత్మక! యట్టి నీకు ను
ద్దీపితభద్రమూర్తికి, సుధీజనరక్షణవర్తికిం, దనూ
తాపము వాయ మ్రొక్కెదఁ నుదారతపోధనచక్రవర్తికిన్. 957

చ. ఎఱుఁగఁడు వీఁడు నా భటుఁ డొకించుకయైన మనంబులోపలం
[1]దెఱుకువ లేక నీ జనకుఁ దెచ్చె; దయం గొని పొమ్ము! ద్రోహమున్
మఱవుమ! నన్ను నీభటుని మన్నన సేయుము [2]నీదు సైరణన్
వఱలుదుఁ గాదె యో జనకవత్సల! నిర్మల! భక్తవత్సలా!, 958

వ. అని యిట్లు వలుకుచున్న వరుణునిం గరుణించి, తండ్రిం దోడ్కొని హరి దిరిగివచ్చె; నంత నందుఁడు దన్ను వెన్నుండు వరుణనగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువుల కెఱింగించిన, వారలు కృష్ణుం డీశ్వరుం డని తలంచి రఖిలదర్శనుండయిన యీశ్వరుండును వారల తలం పెఱింగి వారి కోరిక సఫలము సేయుదు నని వారి నంతఱ బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తి. 959

ఆ. 'ప్రకృతి కామకర్మ పరవశమై యుచ్చనీచగతులఁ బొంది నెఱయ భ్రమసి
తిరుగుచున్న జనము తెలియనేరదు నిజగతివిశేష మీ జగంబునందు. 960

మ. అని చింతించి దయాళుఁడై న హరి మాయాదూరమై జ్యోతియై
[3]యనిరూపంబులు సత్యమై, [4]యెరుకయై, యానందమై బ్రహ్మమై
యనఘాత్మల్ గుణనాశమందుఁ గను నిత్యాత్మీయలోకంబు గ్ర
క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగుచున్ గోపాలకశ్రేణికిన్. 961

వ. ఇట్లు హరి మున్నక్రూరుండు వొందిన లోకమంతయు జూపి బ్రహ్మలోకంబు సూపినం జూచి, నందాదులు పరమానందంబునం బొంది వెఱఁగుపడి హంస స్వరూపకుండై న, కృష్ణునిం బొడగని పొగడి పూజించి రంత. 962

చ. కలువలమేలికందువలు, కాముని [5]కయ్యపుఁ [6]బాళెముల్, వియో
[7]గులఁ దలఁకించువేళలు, చకోరకపంక్తులభోగకాలముల్
[8]సెలువలు సైరణల్ విడిచి చిక్కుతఱుల్, ఘనచంద్రచంద్రికా
జ్వలితదిశల్ [9]శరన్నిశలు జారకదుర్దశ లయ్యె నయ్యెడన్. 963

---

1. తెఱకువ - వివేకము, 2.నీవు సై రణన్—పాఠాంతరము, 3. అనిరూప్యం-వివరింపరానిది, 4. యతులమై-పాఠాంతరము, 5. కయ్యపు శాణముల్; కామశరాసన ముక్తబాణల్-పాఠాంతరములు. 6. పాళెముల్-స్థలములు, 7. కులుకురథాంగసంహృతి చకోరకపంక్తుల భోగకాలముల్—పాఠాంతరము, 8. చెలువలు-యువతులు, 9. శరన్నిశలు-శరత్కాలరాత్రులు.

ఆ. కామతంత్రటీక, కలువలజోక కందర్పుడాక, విటులతాల్మి పోక
చకితచక్రవాక, సంప్రీతజనలోక [1]రాకవచ్చె మేలురాక యగుచు. 964

క. పతి దనకరములఁ గుంకుమ సతిమొగమున నలదుభంగి సముదయవేళా
చితకరరాగమున నిశాపతి రంజించెన్ నరేంద్ర! [2]ప్రాక్సతిమొగమున్. 965

సీ. [3]విటసేనపై దండు వెడలెడు వలఱేని [4]గొల్లెనపై హేమకుంభ మనఁగఁ
గాముకధృతివల్లికలు ద్రెంప నెత్తిన శంబరాంతకుచేతి చక్రమనఁగ
మారుండు పాంథుల మానాటపులు గాల్పఁ గూర్చిన నిప్పులకుప్ప యనఁగ
విరహిమృగమ్ముల వేఁటాడి మదనుండు దెచ్చిన మోహనదీప మనఁగ
ఆ. వింతనునుపు గల్గి వృత్తమై యరుణమై కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
బొడుపుఁగొండచక్కిఁ బొడిచె రాకాచంద్రమండలంబు గగనమండలమున. 966

—: శరద్రాత్రిం గాన మొనర్చు కృష్ణుసన్నిధికి గోపికలు వచ్చుట :—

వ. ఇట్లు వొడిచి నవకుంకుమాంకితరమాముఖ [5]మండలంబును బోలె నఖండంబైన చంద్రమండలంబుఁ మెడగని, పుండరీకనయనుండు యమునాతటవనంబున జగన్మోహనంబుగా నొక్క గీతంబుఁ బాడిన విని, తదాయత్తచిత్తలై తత్తఱంబున వ్రేత లే పనులకుం జేతు లాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచియు, [6]నీడకయు, నీడి యీడియు, నీడినపాలు కాఁపకయు, గాఁచి గాఁచియుఁ, గాఁగినపాలు డింపకయు డించి డించియు. డించిన పాలు బాలురకుం బోయకయుఁ బోసి పోసియుఁ, బతుకులకుఁ బరిచర్యలు సేయకయుఁ, జేసి చేసియు, [7]నశనంబులు గుడువకయుఁ. గుడిచి కుడిచియుఁ, గుసుమంబులు ముడువకయు, ముడిచి ముడిచియుఁ, [8]దొడవులు దొడుగకయుఁ దొడిగి తొడిగియు, గోష్ఠంబులపట్టుల నుండకయుఁ, బాయసంబు నెఱయ వండకయు, నయ్యెయెడల నిలువంబడకయుఁ, గాటుకలు సూటి నిడకయుఁ గురులు సక్కనొత్తకయుఁ, గుచంబుల గంధంబులు గలయ మెత్తకయుఁ బయ్యెదలు విప్పి కప్పక, సఖులకుం జెప్పకయు, సహోదరులు మగలు మామలు మఱందులుఁ బిడ్డలు నడ్డంబు చని నివారింపం [9]దలారింపకయు, సంచలించి పంచభల్లునిభల్లంబుల మొల్లలపుజల్లుల పెల్లునం దల్లడిల్లి డిల్లపడి, మొగిళ్ళగమి వెలువడి, యుల్లసిల్లు తటిల్లతలపొందున మందగమనలమందగమనంబుల మంద వెలువడి గోవిందసందర్శనంబునకుం జని రప్పుడు, 967

1. రాక-పూర్ణిమ, 2. ప్రాక్సతి-తూర్పుదిక్కనెడి యువతి, 3. విరహులపై — పాఠాంతరము, 4. గొల్లెన-గుడారము, 5. మండలమండితంబై యఖండం—పాఠాంతరము. 6. ఈడక - పిదుకక, 7. అశనంబులు - ఆహారములు, 8. తొడవులు- నగలు, 9. తలారింపక-మరలక.

మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నడ్డండించి రా గాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి, [1]జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహమున్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై ! 968

వ. అనిన నరేంద్రుం డి ట్లనియె. 969

క. 'జారుఁ డని కాని కృష్ణుఁడు భూరిపరబ్రహ్మమనియు బుద్ధిఁ దలంపన్
నేరరు; గుణమయదేహము లే రీతిన్ విడిచి రింతు? లెఱిఁగింపు శుకా;' 970

వ. అనిన శుకుం డి ట్లనియె. 971

మ. 'మును నేఁ జెప్పితిఁ జక్రికిం [2]బగతుఁడై మూఢుండు చైద్యుండు పెం
పునఁ గైవల్యపదంబు నొందె; బ్రియలై పొందంగ రాకున్నదే?
యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుం డైనట్టి గోవిందమూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయిని సుమీ! తెల్లంబు భూవల్లభా! 972

ఆ. బాంధవముననైనఁ బగనైనఁ వగనైనఁ బ్రీతినైనఁ బ్రాణభీతినయిన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు జనులు మోక్షమునకుఁ జనుదు రధిప! 973

వ. అటు గావున బరమపురుషుండును, నజుండును, యోగీశ్వరుండును నైన హరిని సోఁకిన
స్థావరంబయిన [3]ముక్తంబగు; వెఱఁగుపడ వలవ, దివ్విధంబున. 974

క. ఘనమధురగీతనినదము విని వచ్చిన గోపికలను వీక్షించి నయం
బున మేటి [4]సుగుణి నేర్పరి తన వాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్. 975

శా. మేలా [5]మీకు భయంబు పుట్టదుగదా మీమందకున్? సింహశా
ర్దూలా[6]నేకపముఖ్యముల్ దిరిగెడిన్ దూరంబు లేతెంతురే?
యేలా వచ్చితి రీ నిశాసమయమం? దిచ్చోట వర్తింతురే?
చాలుం జాలు లతాంగులార! చనుఁడీ? సంప్రీతితో మందకున్ 976

శా. మీ రేతెంచినజాడఁ గానక [7]వగన్ మీతల్లులుం దండ్రులున్
మీ రాముల్ మఱదుల్ తనూజులు గురుల్ మీసోదరుల్ బంధువుల్
'మేరల్ మీఱిరి లేరు పోయి' రనుచున్ మీ ఘోషభూభాగమం
దే రీతిం బరికించిరోఁ, తగవులే యీ సాహసోద్యోగముల్? 977

---

1. జారుఁడు - విటుఁడు, 2. పగతుఁడు నిరోధి, 3. ముక్తంబు-మోక్షముపొందినది, 4. సుగుడి—పాఠాంతరము, 5. మీ కశుభంబు ... పాఠాంతరము, 6. అనేకపము-ఏనుఁగు, 7. వగ-విచారము.

చ. [1]ఇలువడి సున్న సేసి, హృదయేశుల [2]సుగ్గులు వుచ్చి యత్తమా
మల నెరియించి సోదరులమానము [3]సూఱలువుచ్చి, తల్లిదం
డ్రుల రుచి మాన్చి, బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలన్
వలనటి సత్కులాంగనలు వత్తురె? లోకులు సూచి మెత్తురే? 978

సీ. ప్రాణేశుఁ డెఱిఁగిన బ్రాణంబునకుఁ దెగు దండించు నెఱిఁగిన ధరణివిభుఁడు
మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోమఁ దలవరి యెఱిఁగిన [4]దగులు సేయుఁ
దలిదండ్రు లెఱిఁగిన దల లెత్తకుండుదు [5]రేరా లెఱింగిన నెత్తిపొడుచు
నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి బంధువు లెఱిఁగిన [6]బహి యొనర్తు,
ఆ. రితరు లెఱిఁగిరేని నెంతయుఁ జుల్కఁగా జూతు; రిందు నందు సుఖము లేదు
యశము లేదు, నిర్భయానందమును లేదు జారుఁ జేరఁ జనదు చారుముఖికి. 979

క. నడవడి గొఱ గాకున్నను బడుగైనఁ గురూపియైనఁ బామరుఁడైనన్
జడుఁడైన రోగియైనను విడుచుట మరియాద గాదు విభు నంగనకున్. 980

చ. ఇది యమునానదీజలసమేధితపాదపపల్లవప్రసూ
నదళవిరాజితంబగు వనంబు; మనంబుల మేర దప్పెనో?
[7]పొదఁడటు నేడ్చుబిడ్డలకుఁ బోయుఁడు పాలు; విడుండు లేఁగలన్
మొదవులకున్; నిజేశ్వరుల ముద్దియలార! భజింపుఁ డొప్పుగన్. 981

చ. వనితలు నన్నుఁ గోరి యిట వచ్చితి; రింతఁ గొఱంత లేదు; మే
లొనరె; సమస్తజంతువులు నోలిఁ బ్రియంబులు గావె? నాకునై
నను నిలువంగఁ బోలదు! సనాతనధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు [8]పెద్దలు సెప్పుచు నుందు రెల్లెడన్. 982

క. ధ్యానాకర్ణనదర్శన గానంబుల నా తలంపు గలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము మానవతుల్! చనుఁడు మరలి మందిరములకున్. 983

వ. అని పలికిన విని 98

సీ. 'విరహాగ్నిశిఖలతో వెడలునిట్టూర్పుల ముమ్మరంబులఁ దాఁకి మోము లెండఁ
గన్నుల వెడలెడి [9]కజ్జలధారలు [10]కుచకుంకుమంబుల గ్రొచ్చి పాఱఁ
జెక్కులఁ జేర్చిన చేతులవేఁడిమి మోముఁదమ్ముల మేలిమురువు డిందఁ
బొరిఁబొరిఁ [11]బుంఖానుపుంఖంబులై తాఁకు మదనుకోలల ధైర్యమహిమ సెదర

1, ఇలువడి-కులీనత్వము, 2, సిగ్గులఁజంపి—పాఠాంతమురు, 3, చూఱలువుచ్చి -చెడఁగొట్టి, 4. తగులు-అడ్డము 5. ఏరాలు-తోడికోడలు, 6. బహి-వెలి. 7. మెదిఁగిట —పాఠాంతరము, 8. పెద్దఁగ-పాఠాంతరము, 9. కజ్జలము-కాటుక, 10. కుచకుట్మలం బులగ్రుచ్చిపాఱ-పాఠాంతరము, 11. పుంఖానుపుంఖంబులు - ఎడతెగకవచ్చి పడునవి.

తే. దుఃఖభరమున మాటలు దొట్రుపడఁగఁ బ్రియము లాడని ప్రియుఁజూచి బెగ్గడిల్లి
చరణముల నేల వ్రాయుచు సంభ్రమమునఁ గాంతలెల్లను వగల నాక్రాంత లగుచు. 985

వ. ఇట్లనిరి 986

మ. 'అకటా! నమ్మితి మేము; క్రూరుఁ డన ని న్నర్థింపఁబె? మా యిండ్లలో
సకల [1]వ్యాపృతు లుడించి నీ పదసరోజాతంబు లర్చింపఁ [2]జొ
క్కక యేతెంచితి; మీశ్వరుఁ డాద్యుఁడవు; మోక్షాసక్తులం గాచు పో
లికఁ గావందగుఁ గావవే? విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్? 987

మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మప
ద్ధతి యౌ నంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా;
పతిపుత్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతిపుత్రాదికవాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే? 988

మత్తకోకిలము. నీపయిన్ రతి సేయుచుందురు నేర్పరుల్; సతతప్రియో
ద్దీపకుండవు; గాన నెవ్వగఁ దెచ్చు నాథసుతాదులం
జూప నేటికి? మన్మహాశలు సుట్టి నీకడ నుండఁగాఁ
బాప నేల? మదీయతాపముఁ [3]బాపఁ బోలుఁ గృపానిధీ! 989

సీ. నీ పాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని తరలి పోవంగఁ బాదములు రావు
నీ కరాబ్జంబులు నెఱి నంటి తివఁ గాని తక్కిన పనికి హస్తములు సొరవు
నీ వాగమృతధార నిండఁ గ్రోలఁగఁగాని చెవు లన్యభాషలు సేరి వినవు
నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కికవలు

ఆ. నిన్నుఁ గాని పలుకనేరవు మాజిహ్వ లొల్ల ననుచుఁ బలుకనోడ వీవు
మా మనంబు లెల్ల మరపించి దొంగగి తేమి సేయువార మింకఁ? గృష్ణ! 990

చ. సిరికి నుదారచిహ్నములు సేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర! మా తపముసంపదఁ జేరితి మెట్టకేలకున్
మరలఁగ లేము మా మగలమాటల నొల్లము; పద్మగంధముల్
మరగినతేఁటు లన్యకుసు[4]మంబులచెంతను జేరనేర్చునే? 991

ఆ. [5]సవతు లేక నీ విశాలవక్షస్థ్సలిఁ దులసితోడఁ గూడఁ దోయజాక్ష!
మనుపు మనుచు నెపుడు [6]మాకాంత నీపాద కమలరజముఁ గోరుఁగాదె కృష్ణ! 992

1. వ్యాపృతులు-పనులు, 2. చొక్కక-లొంగక, 3. బాప వేల; బాపి యేలు—పాఠాంతరములు, 4. మంబులకుం జననిచ్ఛయించునే-పాఠాంతరము, 5. సవతు-సాటి, 6. మాకాంత-లక్ష్మీదేవి.



''అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరగించువాడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు''

ఉ. నీవు యశోదబిడ్డఁడవె? నీరజనేత్ర! సమస్తజంతుచే
తోవిదితాత్మ! వీఁడవు తొల్లి విరించి దలంచి లోకర
క్షావిధమాచరింపు మని సన్నుతి సేయఁగ [1]సత్కులంబునన్
భూవలయంబుఁ [2]గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్. 1040

ఆ. చరణసేవకులకు సంసారభయమును బాపి శ్రీకరంబు పట్టు గలిగి
[3]కామదాయియైన కరసరోజంబు మా మస్తకములనునిచి మనుపు మీశ! 1041

ఉ గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవఁగఁజాలి శ్రీఁ దనరి దుష్టభుజంగఫణాలతాగ్రసం
భావితమైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త
ద్భావజపుష్పభల్లభవబాధ హరింపు వరింపు మాధవా! 1042

క. బుధరంజనియును సూక్తయు మధురయు నగు నీదువాణి మరగించెను నీ
యధరామృతసంసేవన విధి నంగజతాప మెల్ల విడిపింపఁగదే! 1043

క. మగువలయెడ నీక్రౌర్యము దగునే? నిజభక్తభీతిదమనుఁడ వకటా!
తగదు భవద్దాసులకును నగుమొగముం జూపి కావు నళినదళాక్షా? 1044

మ. ఘనలక్ష్మీయుతమై వినన్ శుభదమై కామాదివిధ్వంసియై
సనకాది స్తుతమై నిరంతరతపస్సంతప్తపున్నాగజీ
వనమై యెప్పుడు నీకథామృతము ద్రావం గల్గునే భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు [4]మానారీమనోహారకా! 1045

క. నీ నగవులు నీ చూడ్కులు నీ నానావిహరణములు నీ ధ్యానంబుల్
నీ నర్మాలాపంబులు మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా! 1046

ఆ. ఘోషభూమి వెడలి గోవుల మేపంగ నీరజాభమైన నీ పదములు
గసవు శిలనుఁ దాఁకి కడునొచ్చునో యని కలఁగుమా మనములు కమలనయన! 1047

ఉ. [5]మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోష్పద
ప్రాపితధూళిధూసరితభాసితకుంతలమై సరోరుహో
ద్దీపితమైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ జూపుదు గాదె క్రమక్రమంబునన్. 1048

---

1. మత్కులంబునన్—పాఠాంతరము, 2. నం గరుణఁ బుట్టితి—పాఠాంతరము, 3. కామదాయి - కోరికలనొసఁగునది, 4. మానారి - లక్ష్మీదేవి, 5. మాపటివేళ - రాత్రి సమయము.

ఆ. భక్తకామదంబు బ్రహ్మసేవిత మిలా మండనంబు దుఃఖమర్దనంబు
భద్రకరమునైన భవదంఘ్రియుగము మా యురములందు రమణ యునుపఁదగదె? 1049

ఆ. సురతవర్ధనంబు శోకాపహరణంబు స్వరితవంశనాళసంగతంబు
నన్యరాగజయమునైన నీమధురాధ రామృతమునఁ దాప మార్పుమీశ! 1050

ఉ. నీ వటవిం బగల్ దిరుగ నీకుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల? విధాత క్రూరుఁడై. 1051

ఉ. అక్కట! బంధులున్ మగలు నన్నలుఁ దమ్ములుఁ బుత్రకాదులున్
నెక్కొని రాత్రిఁ బోకుఁ డన నీ మృదుగీతరవంబు వీనులన్
[1]వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది [2]నాథ! నీ
వెక్కడఁ బోయితో? యెఱుఁగ మీ క్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే? 1052

తే. మదనుఁ డార్వంగ నీ వాడుమంతనములు నవరసాలోకనంబగు నగుమొగంబు
కమల కిరవైన మహితవక్షస్స్థలంబు మామనంబుల లోఁగాని మరపెఁ గృష్ణ! 1053

మ. అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మాచన్నుంగవల్ మోవఁగా
[3]నెరియం బోలు నటంచుఁ బొక్కుదుము నీ యీ కర్కశారణ్యభూ
పరిసంచారము కృష్ణ! నీ ప్రియలకుం బ్రాణవ్యథం జేయదే? 1054

క. కట్టా! మన్మథుకోలలు నెట్టన నో నాఁట బెగడి నీ పాదంబుల్
పట్టికొనఁగ వచ్చిన మము నట్టడవిని డించి పోవ నాయమె? కృష్ణా! 1055

క. హృదయేశ్వర! మా హృదయము మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి కడ నీ
హృదయము కఠినము [4]చేసెను మదీయసౌభాగ్య మిట్టి మందము గలదే? 1056

ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁదాఁకి వీఁక [5]వా
లమ్ముల [6]తెట్టెముల్ వఱప నడ్డము వచ్చి జయింతు వంద్రుడు ని
న్నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేఁడు రెండుమూఁ
డమ్ములయేటుకాఁ డెగవ నడ్డము రాఁ దగదే కృపానిధీ! 1057

---

1. వెక్కసము - అధికము, 2. నారమీ, వెక్కడ—పాఠాంతరము, 3. విరియం, దిరియం—పాఠాంతరములు, 4. చేసిన—పాఠాంతరము, 5. వాలమ్ములతెట్టెముల్ - వాఁడిబాణముల గుంపులు, 6. తెట్టువల్; దట్టముల్—పాఠాంతరము.

క. 'మీరలు గోపకులే నసురారిని దావాగ్ని వచ్చె నటు సూడకుఁడీ
వారించెద' నని యొక్కతె సేరి [1]బయల్ కబళనంబు సేయు నరేంద్రా ! 1025

వ. ఇట్లు తన్మయత్వమున గోపసుందరులు బృందావనంబునం గల తరులతాదుల హరి నడుగుచు, దుర్గమంబులయిన విపినమార్గంబుల సరోజాతకేతనహలకులిశకలశాంకుశాది శుభలక్షణలక్షితంబులయి మనోహరంబులయిన హరి చరణంబుల చొప్పుఁ గని తప్పక చెప్పికొనుచుఁ దమలో నిట్లనిరి. 1026

సీ. 'కొమ్మకుఁ బువ్వులు గోసినాఁ డిక్కడ మొనసి పాదాగ్రంబు మోపినాఁడు
సతి నెత్తుకొని వేడ్కఁ జరిగినాఁ డిక్కడఁ దృణములోఁ దోఁపదు తెఱవజాడ
ప్రియకు [2]ధమ్మిల్లంబు వెట్టినా; డిక్కడఁ గూర్చున్న చోటిదె కొమరుమిగులు
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ వెలఁది నిక్కినగతి విశదమయ్యె
ఆ. సుదతితోడ నీరు సొచ్చినాఁ డిక్కడఁ జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ నవఁగి పెనఁగియున్న యందమొప్పె 1027

వ. మఱియును, 1028

సీ. ఒకయెలనాఁగ చేయూఁదినాఁ డిక్కడ సరస నున్నవి నాల్గుచరణములును
నొకనీలవేణితో [3]నాదిఁగినాఁ డిక్కడ మగజాడలో నిదె మగువజాడ
యొకలేమ మ్రొక్కిన నురివినాఁ డిక్కడ రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
నొకయింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రులొప్పె
ఆ. నొకతె వెంటఁ దగుల నుండక యేఁగినాఁ డడుగుమీఁదఁ దరుణియడుగు లమరె
నబల లిరుగెలంకులందు రాఁ దిరిఁగినాఁ డాఱుపదము లున్నవమ్మ యిచట. 1029

సీ. ఈ చరణంబులే యిందునిభానన ! సనకాదిమునియోగసరణి నొప్పు
నీ పాదతలములే యెలనాఁగ ! శ్రుతివధూసీమంతవీథులఁ జెన్నుమిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన ! [4]పాలేటిరామాలిపట్టుఁ గొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ ! ముక్తికాంతామనోమోహనంబు
ఆ. లీ యడుగులరజమె యింతి బ్రహ్మేశాది దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షు డేఁగిన క్రమముఁ గనియు నతనిఁ గానరైరి. 1030

వ. అప్పుడు. 1031

---

1. బయల్-ఆకాశము, 2. ధమ్మిల్లంబు-కొప్పు, 3. నొడిపినాఁడిక్కడ; నుడిపి నాఁడిక్కడ—పాఠాంతరములు, 4. పాలేటిరామాలు-క్షీరసముద్రపుత్రిక - లక్ష్మీదేవి.

సీ. పతుల [1]దైన్యంబును భామల క్రౌర్యంబుఁ జూపుచు విభుఁ డొక్క సుదతితోడ
విహరింప నది యెల్ల వెలఁదుల వర్జించి 'నా యొద్ద నున్నాఁడు నాథుఁ' డనుచు
గర్వించి రాఁ జాలఁ గమలాక్ష ; మూపున నిడుకొనుమనుఁడు నయ్యీశ్వరుండు
[2]మొఱఁగిపోయిన దాపమును బొంది 'యో కృష్ణ, యెక్కడఁ జనితి? ప్రాణేశ! రమణ
తే. నీకు [3]వరపుడ నయ్యెద నిలువు' మనుచు వగవఁ గొందఱు కాంత లా వనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్ర చిక్కె నేఁ డని వెఱఁగును జెంది రపుడు. 1032

వ. మఱియును. 1033

సీ. 'ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు నాతోడ మన్మథనటన మాడె
ని [4]య్యోల మగుచోట నిందాఁకఁ జెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె
నీ మహీజమునీడ నిందాఁగ సుభగుండు [5]చిట్టంటుచేఁతల సిగ్గుగొనియె
నీ పుష్పలతపొంత నిందాఁక దయితుండు నను డాసి యధరపానంబు సేసె
ఆ. నీ ప్రసూనవేది నిందాఁక రమణుండు గుసుమదామములను గొప్పుఁ దీర్చె!'
ననుచుఁ గొంద ఱతివ లంభోజనయనుని పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప!' 1034

మ. అని యబ్బంగి లతాంగు లందఱును బృందారణ్యమం దీశ్వరున్
వనజాక్షుం బరికించి కానక విభున్ వర్ణించుచుం బాడుచున్
మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు నమ్మానాథుపైఁ జేర్చి వే
చని ర [6]య్యామునసైకతాగ్రమునకున్ సంత్యక్తగేహేచ్ఛలై. 1035

వ. చని గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి. 1036

—: గో పి కా గీ త లు :—

క. 'నీవు జనించిన కతమున నో వల్లభ! లక్ష్మి మంద నొప్పె నధికమై
నీవెంటనె ప్రాణము లిడి నీవా రరసెదరు చూపు నీరూపంబున్. 1037

క. శారదకమలోదరరుచి చోరకమగు చూపువలన సుందర! మిమ్ముం
గోరి వెల యీని దాసుల ధీరత నొప్పించు టిది వధించుట గాదే? 1038

ఆ. విషజలంబువలన విషధరదానవు వలన వాలవానవలన వహ్ని
వలన నున్న వానివలనను రక్షించి కుసుమశరునిబారిఁ గూల్పఁదగునె? 1039

1. ధైర్యంబును—పాఠాంతరము, 2. మొఱఁగి-మోసపుచ్చి, 3. వరపుడు-దాసి. 4. ఓలము - మఱుఁగుగానున్నది, 5. చిట్టంటుచేఁతలు - నఖక్షతాదులు, 6. యామున సైకతము - యమునానదిలోని యిసుకతిన్నె.

క. భూతములలోనఁ వెలిఁ బ్రఖ్యాతుం డగునట్టివాని; గాంతలు కాళిం
దీతీరవనాంతరముల [1]బ్రాఁతిన్ వెదకంగజనిరి పాడుచు నధిపా 1008

సీ. [2]పున్నాగ ! కానవే పున్నాగవందితుఁ దిలకంబ కానవే తిలకనిటలు
[3]ఘనసార ! కానవే ఘనసారశోభితు; [4]బంధూక కానవే బంధుమిత్రు
[5]మన్మథ ! కానవే మన్మథాకారుని [6]వంశంబ ! కానవే వంశధరునిఁ
జందన ! కానవే చందనశీతలుఁ గుందంబ! కానవే కుందరదను
తే. నింద్రభూజమ ! కానవే యింద్రవిభవుఁ గువలవృక్షమ ! కానవే కువలయేశుఁ
బ్రియకపాదప! కానవే ప్రియవిహారు ననుచు గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు. 1009

వ. మఱియును. 1010

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడివాఁడు మౌళి [7]పరిసర్పితపింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గ దమ్మ చెప్పరే! 1011

ఉ. అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ
మ్మంగజుపువ్వుఁదూపులకు నగ్గము సేసి లవంగలుంగనా
రంగములార! మీకడకు రాఁడు గదా! కృప [8]నున్న జూపరే! 1012

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే సలలితోదారవత్సకములార !
సలలితోదారవత్సకవైరిఁ గానరే సుందరోన్నతలతార్జునములార !
సుందరోన్నతలతార్జునభంజుఁ గానరే ఘనతరలసదశోకంబులార !
ఘనతరలసదశోకస్ఫూర్తిఁ గానరే నవ్యరుచిర [9]కాంచనంబులార !
ఆ. నవ్యరుచిరకాంచనకిరీటుఁ గానరే గహనపదవి [10]కురవకంబులార !
గహనపదవికురవకనివాసిఁ గానరే [11]గణికలార! చారుగణికలార! 1013

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ [12]బాటలీతరులార పట్టరమ్మ !
హేలావతులఁ గృష్ణ ! యేల పాసితి వని [13]శైలేయలతలార యడుగరమ్మ !

---

1. ప్రాఁతి - ప్రేమ, 2. పున్నాగము - పొన్న, 3. ఘనసారము-కర్పూరము, 4. బంధూకము-మంకెన, 5. మన్మథము-వెలఁగ, 6. వంశంబు-వెదురు. 7. పరిసర్పిత-వ్యాపించిన, 8. ఉండుసూడరే—పాఠాంతరము, 9. కాంచనంబు-సంపంగి, 10 కురవకంబు-ఎఱ్ఱగోరింట; 11. గణిక- అడవిమొల్ల, 12. పాటలి-కలిగొట్టు. 13. శైలేయము-తోఁకమిరియము.

వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా! చూతమంజరులార చూడరమ్మ!
మానినీమదనుతో మారాక యెఱిఁగించి మాధవీలతలార మనుపరమ్మ!
ఆ. జాతిసతులఁబాయ [1]నీతియే హరి! కని జాతులార దిశలఁ జాటరమ్మ!
కదళులార పోయి కదలించి శిఖిపింఛ [2]జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ! 1014

క. హరిచరణములకుఁ బ్రియవై హరి నిను మన్నింప భద్ర మందెదు తులసీ
హరి నీదెస రాఁడు గదా హరిచొప్పెఱిఁగించి శుభము లందింపఁగదే? 1015

తే. పొగడఁ దగువానిఁ గానరె పొగడలార! యీ డెఱుంగని విభుఁ జూపుఁ డీడలార!
మొల్లమగు కీర్తివాఁడేడి మొల్లలార! శుకనిగదితునిఁ జెపుడు [3]కింశుకములార! 1016

క. తరుణీకుచకుంకుమయుత హరికంధరదామగంధ మడరెడుఁ జూడ్కుల్
హరిఁ గనినపగిదిఁ దనరెడి హరిణీ! హరిజాడఁ బుణ్య మయ్యెడిఁ జెపుమా! 1017

క. కిటియై కౌఁగిటఁ జేర్చెను వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై
యిటఁ బద చిహ్నము లిడెఁ గ్రిందటిబామున నేమి నోఁచి తమ్మ ధరిత్రీ! 1018

వ. అనుచుఁ [4]మదనోన్మాదచిత్తలై తదాత్మకత్వంబునఁ గృష్ణలీలల ననుకరించుచు 1019

సీ. పూతనయై యొక్క పొలఁతి చరింపంగ శౌరియై యొక కాంత చన్నుగుడుచు
బాలుఁడై యొకభామ పాలకు నేడ్చుచో బండినే ననులేమ బాఱఁ దన్ను
సుడిగాలి నని యొక్క సుందరి గొనిపోవ హరి నని వర్తించు నబ్జముఖియు
బకుఁడ నే నని యొక్క పడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁ డనుకొమ్మ పరిభవించు
ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దరు గాఁగ గోపవత్సగణము గొంద ఱగుదు
రసురవైరి ననుచు సబల యొక్కతె చీరుఁ బసుల మనెడి సతుల భరతముఖ్య! 1020

ఆ. లోక మెల్లఁ గుక్షిలోపల నున్నది మాధవుండ నేను, మాత వీవు
చూడు మనుచు నొక్కసుందరి యొకతెకు ముఖముఁ దెఱచి చూపు ముఖ్యచరిత! 1021

క, వెన్నలు దొంగిలి తినియెడి [5]వెన్నుఁడ నని యొకతె నుడువ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును గ్రన్నన కుసుమములదండఁ గట్టు నిలేశా! 1022

క. 'కాళియఫణి యిది వీరలు కాళియఫణిసతులు మ్రొక్క గడఁగిరి నే గో
పాలకుమారుఁడ' ననుచును లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా! 1023

క. తరుణులు గోపకు లందఱు '[6]హరిహయుఁ డిదె వాన గురిసె హరి నే' నని బా
[7]సుర చేలాంచల మొక్కతె గిరి నెత్తెద ననుచు నెత్తు గెంగేల నృపా! 1024

1. జాతియే-పాఠాంతరము, 2 చూడు-పాఠాంతరము, 3. కింశుకము-మోదుగు
4. నున్మత్తచిత్తలై-పాఠాంతరము, 5. వెన్నుఁడు-విష్ణువు, 6. హరిహయుఁడు-ఇంద్రుఁడు
7. చేలాంచలము-చీరకొంగు,

ఉ. అత్తలు మామలున్ వగవ [1]నాఱడి కోడక నాథు [2]లన్ శుగా
యత్తులఁ జేసి యిల్వరుస లాఱడి వోవఁగ నీదునవ్వులన్
మెత్తనిమాటలన్ మరుఁడు మేకొని యేఁచిన వచ్చినార మే
పొత్తుల నొల్ల మో పురుషభూషణ! దాస్యము లిచ్చి కావవే? 993

మ. మగువల్ సిక్కరె తొల్లి వల్లభులకున్? మన్నించి తద్వల్లభుల్
మగపంతఁబు దలంపరే? తగులముల్ మా పాలనే పుట్టెనే?
మగవా రాడెడు మాటలే తగవు నీమాటల్ మనోజాగ్నిచేఁ
బొగులంజాలము; కౌఁగిలింపుము మముం; బుణ్యంబు పుణ్యాత్మకా! 994

ఉ. కుండలదీప్తగండమును గుంచితకుంతలఫాలమున్ సుధా
మండితపల్లవాధరము మంజులహాసవిలోకనంబునై
యుండెడు నీ ముఖంబుఁ గని యుండఁగ వచ్చునె? మన్మథేషుకో
దండవిముక్తబాణముల దాసుల మయ్యెద; మాదరింపవే! 995

సీ. నీ యధరామృతనిర్ఝరంబుల నేఁడు సేరి వాతెఱలపైఁ జిలుకకున్న
నీ విశాలాంచిత నిర్మలవక్షంబుఁ గుచకుట్మలంబులఁ గూర్పకున్న
నీ రమ్యతరహస్తనీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న
నీ కృపాలోకననివహంబు మెల్లన నెమ్మొగంబుల మీఁద నెఱపకున్న
ఆ. నీ నవీనమాననీయసల్లాపంబు కర్ణరంధ్రదిశల గప్పకున్న
నెట్లు బ్రదుకువార? మెందుఁ జేరెడివార? మధిప? వినఁగఁదగదె యాదుకుయులు. 996

మ. భవదాలోకనహాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్లవామృతముచేఁ బాపం దగుం, బాపవే
ని, వియోగానల [3]హేతిసంపహతులచే [4]నీఱై, భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీపాదంబులానం బ్రియా! 997

క. తరుమృగఖగగోగణములు కర మొప్పెడు నిన్నుఁ గన్నఁ గానము విన్నం
గరఁగి బులకించు నబలలు గరఁగరె నినుఁ గన్న నీదుగానము విన్నన్? 998

సీ. ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము నీ మంజువాగ్వృష్టి నెగడదేని?
నీ మన్మథాంభోధి నేత్రోవఁ గడతుము నీ దృష్టి నావ యై నిలువదేని?
నీ చిత్తజధ్వాంత మేజాడఁ జెఱుతుము నీ హాసచంద్రిక నిగుడదేని?
నీ దర్పకజ్వర మేభంగి నడఁతుము నీ నవాధరసుధ నింపవేని?

---

1. ఆఱడి - నింద, 2. లన్సకా; లన్నరా; లంద్రపా — పాఠాంతరములు,
3. హేతి - జ్వాల, 4. నీఱు - భస్మము.

ఆ. నెట్లు నిర్వహింతుః మే[1] లాగు మాలాగు; కరుణ సేయవేనిఁ, గదియవేని
మరుఁడు నిర్దయుండు మన నిచ్చునే ? యశోదాకుమార !' యువతి ధైర్యహార ! 999

క. అమరులఁ గాచిన హరిక్రియఁ గమలేక్షణ! నీవు నేఁడు కరుణ నభయహ
స్తము మా యురముల శిరములఁ బ్రమదంబున నిడుము మూర్ఛపాల్పడకుండన్ 1000

క. కట్టా! [2]తలమునుకలునై దట్టపువిరహాబ్ధితెరలు తరుణుల నేఁచన్
నెట్టన్ దరిఁజేర్ప వయో [3]కట్టిఁడివి గదా కుమార! కరుణోదారా! 1001

వ. అని యిట్లు కుసుమశరునిశరపరంపరాపరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనా
లాపంబులు విని నవ్వి యోగేశ్వరేశ్వరుండయిన కృష్ణుం డాత్మారాముండై వారలతో
రమించె నప్పుడు. 1002

మ. కరుణాలోకమునం బటాంచలకచాకర్షంబులన్ మేఖలా
కరబాహుస్తనమర్శనంబుల నఖాంకవ్యాప్తులన్. నర్మవా
క్పరిరంభంబుల మంజులాధరసుధాపానంబునం గాంతలం
గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు గృపం గందర్పుఁ బాలార్చుచున్ 1003

క. మక్కువ వికసితవదనలు సక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్
మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు చుక్కలగమినడిమి పూర్ణ [4]సోముని [5]భంగిన్. 1004

ఆ. సతులు దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు నలుత నున్న వైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుం డయ్యె యువతిజనశతంబు లోలిఁ గొలువ. 1005

ఉ. చిక్కక యూథుఁడై యెదిరి జిక్కులఁబెట్టెడి మాయలానికిం
జిక్కి కృతార్థలై మరునిచిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా
మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకుం
జక్కన నా విభుండు గుణశాలి [6]దిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 1006

వ. ఇట్లు హరి గనుమొఱంగి చనినతఱిం గానక కరిం బాసి తిరుగు కరేణుల పెల్లున నుల్లంబు
దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమనహాసలీలావిలాసవీక్షణ విహార వచనరచనానురాగం
బులం జిత్తంబులు గోల్పడి,వివిధచేష్టలకుం బాల్పడి,తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ
నని కృష్ణగుణావేశంబులం జరియించుచు. 1007

---

1. లాగు - విధము-పద్ధతి, 2. తలమునుగుడులై, దట్టపువిరహాగ్ని శిఖలు తరు
ణులనేఁపన్; నెట్టఁబలుకవు చూడవు - పాఠాంతరము, 3. కట్టిఁడివి - కఠినుఁడవు,
4. సోముఁడు - చంద్రుఁడు, 5. భాతిన్ - పాఠాంతరము, 6. తిరోహితుఁడు - మాయ
మైనవాడు.

క. ఆడుచుఁ బాడుచు నం దొక చేడియ మంజీరమంజుశింజిత మమరం
గూడి హరికరము సనుఁగవ పైఁడాయఁగ దిగిచె జఘనభారాలసయై. 1093

క. చందనలిప్తంబై యరవిందామోదమున నొప్పు విపులభుజము గో
విందుఁ డొక తరుణిమూఁపునఁ బొందించిన నది దెమల్చి పులకించె నృపా! 1094

సీ. చెలువయొక్కతె చెక్కుఁజెక్కుతో మోపిన విభుఁడు దాంబూల చర్వితము పెట్టె
నాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ దున్నతదోఃస్తంభ మూఁతసేసెఁ
జెమరించి యొకబాల సేరినఁ గొనగోరఁ జతురుఁడు కుచఘర్మజలము వాపె
నలకంబు లొకయింతి కశిక [1]చిత్రకరేఖ నంటినఁ బ్రియుఁడు వాయంగ దువ్వెఁ
ఆ. బడఁతి యొకతె పాట వాడి డస్సిన నధరామృతమున నాథుఁ డాదరించె
హార మొక్కసతికి నంసావృతంబైనఁ గొంతుఁ డురముఁ జేర్చి కౌఁగిలించె 1095

క. హాసంబులఁ గరతలవిన్యాసంబులు దర్శనముల నాలాపములన్
రాసక్రాంతల నా హరి సేసెన్ మన్ననలు కరుణసేసి నరేంద్రా! 1096

క. హరి తనుసంగసుఖంబునఁ బరవశలై క్రేవ లెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె? సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్. 1097

వ. ఇట్లు భగవంతుండైన కృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు లెందఱందఱకు
నందఱై నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు బాలుపోలిక రాసకేళి సలిపిన 1098

క. 'తగఁ గూడియాడి మనముల నగెఁ జూచెం బలికె నందనందనుఁ' డనుచున్
మగువలు పెద్దఱికముతోఁ బొగడిరి తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్. 1099

—:జలక్రీడాభివర్ణనము:—

వ. ఇట్లు హరి రాసకేళి సాలించి, [2]కరకాంచిత లగు తటిల్లతల చెలువున [3]ఘర్మ సలిలకణా
క్రాంత లగు కాంతలం గూడి జలక్రీడాకుతూహలుండై యమునాజలంబులుసొర, నందు
ముందర సుందరులు నొచ్చి పదప్రమాణంబు [4]జానుదఘ్నంబు [5]కటిద్వయసంబు, మధ్య
మాత్రంబు, కుచంబులబంటి యని పలుకుచుం గుచనయన నాభివివరకుంతలంబులు చక్ర
వాకజలచరావర్తశైవాలంబుల చందంబున నందంబుగ నీదువాొందినయేఱులని [6]కళింద
నందన గరంబులు సాఁచి పరిరంభంబులకు నారంభించుకైవడి నెదురు చనుదెంచి తాఁకు
తరంగంబులకు నులుకుచు, సారసంబులకుం గరంబులు సాఁచుచు, మరాళంబులం

---

1. నారుల—పాఠాంతరము, 2 కరకలు - వడగండ్లు, 3. ఘర్మసలిలము - చెమటనీరు, 4 జానుదఘ్నంబు - మోఁకాలిబంటి. 5. కటిద్వయసంబు - మొలబంటి, 6. కళిందనందన - యమున,

జోపుచుఁ, జెన్ను మిగిలిన యన్నులచన్నులయెత్తువత్తుమను నెపంబులం దపంబుల నీటఁ గావించు మాడ్కి ని సంచరించు చక్రవాకంబులం దోలుచు, నితాంతకాంతిసదనంబులగు వదనంబులకు నోడి, వ్రీడం జెంది కంది చందురుండు సలం బుడిగి జలంబునం బడి కంపించు కరణి నిజకరచలితజలప్రతిబింబితుండై కదలు చంద్రునిం గని మెచ్చి సోలుచు, [1]సలిలావగాహసమయసముచ్చలితవారిశీకరపరంపరలవలన మకరందపానమత్త మధుకర పక్షవిక్షేపణసంజాత వాతసముద్ధూతకుముదాది పరాగపటలంబులం జేరుచు, మోముఁ దమ్ముల కమ్మఁదనంబునకు మూఁగి, ఝుమ్మరనుతుమ్మెదలకు వెఱచుచుఁ, గరంబుల నీరెగయం జఱచుచు, నీలనీరదనిపతిత పయోబిందుసందోహంబులం దడియు పువ్వుఁదీవియల బాగునఁ గృష్ణకరద్వయతోయంబులం బెక్కుతోయంబులం దడియుచుఁ, గ్రందుకొని సుడియుచు నసమబాణునిపులుగడిగిన కుసుమబాణంబులపగిది మేనులు మెఱయ సలిలావగాహనపరాయత్తచిత్త లగుచు, మొత్తంబులై సరసభాషణంబులం ద్రుళ్ళుచుఁ, గరంబుల నీరు నించి హరిమీఁదం జల్లుచుఁ, జల్లునెడం దడఁబడన్ దాఁటుచు, దాఁటి చనక నిలువరిందుచు వినోదింప, హరియుం [2]గరేణుకర వికీర్ణనీరధారాభిషిక్తం బగు శుండాలంబులీల నాభీరకామినీకరసముజ్ఝితజలా సారంబులం దోఁగుచు, వ్రజవధూజన హస్తప్రయుక్త కహ్లారకైరవసరాగపటలంబువలన [3]భూతిభూషణుసిరి వహించుచు, గోపికాజనపాణికిసలయ సమున్ముక్తకమలదళంబులవలన సహస్రనయనునిరూపుఁ జూపుచు, గోపాల బాలికా కుచ కలశకుంకుమపంకంబువలనఁ బ్రభాతబాలభానునిభంగి భాసిల్లుచు, ఘోషయోషాకటాక్ష విక్షేపణంబువలన మధుపపరివృతహరిచందన సౌందర్యంబు నొందుచు, వల్లవీహాసరుచుల వలనఁ జంద్రికాప్రభాభాసితనీలశైలంబు క్రియనమరె; నంత. 1100

మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం
కృతుఁడై [4]కుంభి కరేణుయూథములతోఁ గ్రీడించుచందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయలీలాశయ్యలందున్ సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్. 1101

వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె నని చెప్పిన మునివరునకు భూవరుం డిట్లనియె. 1102

మత్తకోకిలము. ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁడు ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే
ధర్మ మంచుఁ దలంచి చేసెఁ? నుదాత్తమానస చెప్పుమా! 1103

వ. అనిన శుకుం డిట్లనియె. 1104

---

1 సలిలావగాహము - నీటమునుఁగుట, 2. కరేణువు - ఆఁడేనుఁగు, 3. భూతిభూషణుఁడు - శివుఁడు, 4. కుంభి - మగయేనుఁగు.

సేయుచు, సమపాదశకటవదనసుతల్లీశుక్తిప్రముఖంబులైన పార్థివచారి విశేషంబులును నపక్రాంతదోలాపాదసూచీ ప్రముఖంబులైన వ్యోమచారివిశేషంబులనుం జూపుచు, [1]సురేంద్రశాఖిశాఖామనోహరంబులును, నపహసితదిక్కరీంద్రకరంబులును, త్రిలోక క్షేమంకరంబులునునగు కరంబులం దిరంబులగు రత్నకటకంబులమెఱుంగులు నింగి చెఱంగులం [2]దఱచుకొన నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుకతుండలాంగూల పద్మ కోశ పతాక ప్రముఖంబులైన స్వస్వభావసూచక నానావిధకరభావంబు లాచరిం చుచుఁ గటినిబద్ధసువర్ణచేలాంచల ప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనాముఖంబులకు [3]హరిద్రాలేపనముద్రాలంకారంబు లొసంగుచు, నాస్కందితభ్రమరశకటాసనప్రముఖం బులైన జానుమండల భేదంబులును నలాత దండలాత లలిత విచిత్రప్రముఖంబులైన దైవమండలంబులు నొనర్పుచుఁ గమనీయకంబుకంఠాభిరామంబులు నుద్దామతేజస్తోమం బులునైన నీలమౌక్తికవజ్రవైడూర్యదామంబులరుచు లిందిరాసుందరీమందిరంబులయి సుందరంబులైన యురంబులం దిరుగుడువడి కలయం బడ [4]నంగాంతరవాహ్యలకు ఛత్త్రప్రముఖంబులైన భ్రమణవిశేషంబుల విలసించుచు, [5]నిద్దంబులగు చెక్కుటద్దంబుల [6]నుద్దవిడిం దద్దయుం బ్రభాసిత చంద్రమండలంబులందు కుండలంబు మెఱుంగు మొత్తం బులు నృత్యంబు లొనరింపఁ గటిభ్రాంతదండరచితలలాట తిలకమయూర లలిత చక్ర మండలనికుంచితగంగావతరణ ప్రముఖంబులైన కరణంబు లెఱింగించుచు వెలిదమ్మివిరుల సిరులఁ జెన్నుమిగులు కన్నుల వలన దీనజనదైన్యకర్కశంబులై తనరుకటాక్షదర్శన జాలంబులు జాలంబులై కామినీజననయనమీనంబుల నావరింప లలితకుంచిత వికాసముకుళ ప్రముఖంబులయిన చూడ్కులం దేజరిల్లుచు; ననేక పరిపూర్ణ చంద్రసౌభాగ్య [7]సదనంబు లగు వదనంబులఁ బ్రసన్న రాగంబులు ప్రకటించుచు, నుదంచితపింఛ మాలికామయూ ఖంబు లకాల [8]శక్రచాపంబులసొంపు సంపాదింప, నికుంచితాకుంచిత కంపితాకంపిత పరి వాహిత పరావృత్తప్రముఖంబులైన శిరోభావంబులు నెఱపుచు [9]మృగనాభితిలకంబులు గల నిటలఫలకంబులఁ జికురంబులఁ జికురంబుల నికరంబులు గప్ప, నపరాజితసూచికావిద్ధ పరిచ్ఛిన్న విష్కంబ రేచిత ప్రముఖంబులగు [10]నంగహారంబుల విలసిల్లుచుఁ జరణకటికర కంఠరేచకంబు లాచరించుచు నొప్పె; నప్పుడా రాసంబు సంజనితసకలజనమానసోల్లా సకరంబై సుధార్ణవంబునుం బోలె నుజ్జ్వలరసాభిరామంబై, రామరాజ్యంబునుంబోలె [11]రాగ పరిపూర్ణంబై, పూర్ణచంద్రమండలంబునుంబోలెఁ [12]గువలయానందంబై నందనవనంబునుం బోలె [13]భ్రమరవిరాజమానంబై, మానధనుచిత్తంబునుంబోలెఁ బ్రధాన [14]వృత్తిసమర్థంబై,

1. సురేంద్రశాఖి-కల్పవృక్షము, 2. దఱుముకొన; దరులుకొన—పాఠాంతరములు, 3. హరిద్రాలేపనము-పసుపుపూఁత, 4. గాంతారబాహ్యలకు—పాఠాంతరము, 5. నిద్దంబులు-నున్ననివి, 6. ఉద్దవిడి .. మిక్కిలి, 7. సదనంబులు - నివాసములు - గృహములు, 8. శక్రచాపంబులు - ఇంద్రధనుస్సులు, 9. మృగనాభి - కస్తూరి, 10. అంగహారంబులు- అభినయములు, 11. రాగము-ప్రీతి, అనురాగము, 12. కువలయము-భూమి, నల్లకలువ, 13. భ్రమరము - తుమ్మెద, ఒక అభినయము, 14. వృద్ధి—పాఠాంతరము,

సమర్థక వివిలసనంబునుంబోలె బహుప్రబంధభాసురంబై సురలోకంబునుంబోలె వసుదేవ నందన విశిష్టంబై, శిష్టచరితంబునుంబోలె ధరణిగగనమండలసుందరంబై, సుందరీరత్నంబు నుంబోలె నంగహారమనోహరంబై, హరవధూనిలయంబునుంబోలె ననేక చారిసుకుమా రంబై, సుకుమార వృత్తంబునుంబోలె నుద్దీపితవంశంబై యుండె; నందు 1083

చ. నడుములు వీఁడ యాడఁ జిఱునవ్వులు నివ్వటిలంగ హారముల్
సుడివడ మేఖలల్ వదలఁ జూడ్కి మెఱుంగులు వర్వ ఘర్మముల్
వొడమఁ గురుల్ చలింప శ్రుతిభూషణముల్ మెఱయన్ సకృష్ణలై
పడఁతుక లాడుచుం జెలఁగి పాడిరి మేఘతటిల్లతాప్రభన్. 1084

క. అంకరహితేందువదనలు పంకజలోచనునిఁ గూడి పరఁగ నటింపం
గింకిణుల నూపురంబుల కంకణముల మ్రోఁత లెసఁగెఁ గర్ణోత్సవమై. 1085

క. హరిణీనయనలతోడను హరి రాసక్రీడ సేయ నంబరవీథిన్
సురనాథులు భార్యలతో సొరిది విమానంబు లెక్కి చూచి రిలేశా! 1086

క. కురిసెం బువ్వులవానలు మొరసెన్ దుందుభులు మింట ముదితలు దారున్
సరసన్ గంధర్వపతుల్ వరుసన్ హరిఁ బాడి రపుడు వసుధాధీశా! 1087

క. రామలతోడను గాసము రామానుజుఁ డాడఁ జూచి రాగిల్లి [1]మనో
రాములమీఁద వియచ్చర రామలు మూర్ఛిల్లి పడిరి రాజకులేంద్రా! 1088

క. తారాధిపనిభవదనలు తారాధిపవంశ్యుఁ గూడి తారు నటింపం
దారలతోడ సుధాంశుఁడు [2]దారున వీక్షింప రేయి దడవుగ జరగెన్. 1089

మ. యమునాకంకణచారియై వనజపుష్పామోదసంచారియై
రమణీఘర్మనివారియై మదవతీరాసశ్రమోత్తారియై
ప్రమదామానసవ్యభవ్యసుఖసంపత్కారియై చేరి యా
కమలాక్షుం దఱరంగ గాలి విసరెం గల్యాణభావంబునన్. 1090

వ. అప్పుడు. 1091

చ. ప్రమద యొకర్తు మాధవుఁడు పాడ [3]విపంచి ధరించి కేల సం
భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ [4]ఠాయము సేసి యొక్క రా
గము దగ నాలపించి సుభగస్వరజాతులు వేలు వేఱ కా
నమరఁగఁ బాడెఁ దన్ రమణుఁ డౌనన [5]దారువు లంకురింపఁగన్. 1092

---

1. మనోరాములు - ప్రియులు, 2. దారున - శీఘ్రముగా, 3. విపంచి - వీణ, 4. ఠాయము—పాఠాంతరము, 5. దారువులు - మ్రోడులు.

క. 'కొలిచినఁ గొలుతురు కొందఱు గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱు పతులం
గొలిచినను గొలువకున్నను గొలువరు మఱి కొంద ఱెలమి గోపకుమారా !' 1074

వ. అని త న్నుద్దేశించి రహస్యంబుగాఁ బలికిన సుందరుల పలుకులు విని గోపాల సుందరుం
డి ట్లనియె. 1075

సీ. 'కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల [1]భజనముభంగిని ఫలముకొఱకు
నై; సఖ్యధర్మము లందుఁ, సిద్ధింపవు కొందఱు తండ్రులగుణముఁ దాల్చి
దయ గలవారలు తగిన [2]సుహృత్తులు గొలువనివారలఁ గొల్తు రెపుడు
ధర్మ కామంబులు దనరంగఁ గొందఱు కొలువనివారిని గొలుచువారిఁ,

ఆ. గొలుచుతలఁపులేమిఁ గొలువ రాత్మారాము లాప్తకాము లజ్ఞు లతికఠినులు
వారియందుఁ బిదపవానిగాఁ జింతించి యే లతాంగులార యిట్టు లనుట. 1076

క. ఏనిం దేవ్వఁడ నయినం గా నంగనలార ! పరమకారుణికుండన్
మానసబంధుఁడ నిత్య ధ్యానము మీ కొసఁగవలసి తలఁగితిఁ బండీ ! 1077

మ. నను సేవించుచునున్న వారలకు నే నా రూపముం జూపఁ జూ
చినఁ జాలించి [3]మదించి వారు మఱి నన్ సేవింపరో యంచు ని
ర్ధనికుం డాత్మధనంబు సెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుఁ దా
ల్చినభంగిన్ ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు నా రూపమున్. 1078

తరలము. [4]తగవు ధర్మముఁ జూడనొల్లక తల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసి వచ్చిన [5]మన్నిషక్తల మిమ్ము నేఁ
దగదు; పాసితిఁ దప్పు లైపుఁడు; తద్వియోగభరంబునన్
వగలఁ బొందుచు మీర లాడిన వాక్యముల్ వినుచుండితిన్. 1079

ఉ. పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతరమత్పరత్వముం
జేయుచు నున్న మీకుఁ బ్రతి సేయ యుగంబుల నైన నేర; నన్
బాయక కొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుట దప్పుగాఁ గొనక భామినులార ! కృపన్ శమింపరే!' 1080

క. చక్కఁగ హరి యిటు పలికిన చక్కనివాక్యములఁ దతనిసంగమమున లో
నిక్కిన వియోగతాపము లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా ! 1081

---

1. భజనము-సేవ, 2. సుహృత్తులు-మంచిమనస్సు కలమురు, 3. మదించి-గర్వించి,
4. తగవు-న్యాయము, 5. మన్నిషక్తలు - నాయందు లగ్నమైన మనస్సుకలవారు.

## —: రాసక్రీడాభివర్ణనము :—

ఉ. ఆ సమయంబునన్ విభుఁ డనంతుఁడు గృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం
తాసువిలాసమున్ బహువిధస్ఫురితాననహస్తపాదవి
న్యాసము [1]రాసముం గృతవియచ్చరనేత్ర మనోవికాసమున్. 1082

వ. ఇటు బహుగతులం దిరుగ నేర్పరి యగు హరి దర్పించి తన యిరుగెలంకుల నలంకృతలయి కళంకరహితచంద్రవదన లిద్దఱు ముద్దియ [2]లుద్దిగొని వీణ లందుకొని వీణలం బ్రవీణలై, సొంపుమెఱసి యింపుగ వాయించుచు నానందలహరీనిధానంబగు గానంబు సేయ సవిరళంబై తరళంబు గాని వేడుక సరళంబగు [3]మురళంబు లీలం గేల నందుకొని మధురంబగు నధరంబునం గదియించి మించి కామినీజనకబరికాసౌగంధిక గంధబంధుర కరాంగుళికిసలయంబులు యతిలయంబులఁ గూడి వివరంబుగ మురళీవివరంబుల సారించి పూరించుచు సరిలేని భంగిం [4]త్రిభంగియై కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరు లెంద ఱందఱకు నందఱయి. సుందరుల కవలి యెడలం దాను దన కవలి యెడల సుందరులును దేజరిల్ల, నృత్తవిద్యామహార్ణవ వేలావలయవలయితంబై [5]విస్మితాఖండలంబైన రాసమండలంబు గల్పించి, వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ నందుఁ బ్రసూన మంజరీసహచరంబులైన చంచరీకంబులమించు ప్రకటించుచు సువర్ణమణి మధ్యగంబు లైన మహేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ, గరిణీవిహారబంధురంబులైన [6]సింధురంబుల చెలువుఁ గైకొనుచుఁ బల్లవితకుసుమిత లతానుకూలంబులైన తమాలంబుల సొబగు నెగడించుచు, మెఱపుఁదీవల నెడ నెడం బెడం గడరు నల్లమొగిళ్ల పెల్లు సూపుచు, [7]తరంగిణీసంగతంబులయిన రోహణాచలశృంగంబులబాగు బాలించుచు, జగన్మోహనుండై యుండి రక్త కమలారుణంబులును జంద్రసకలనిర్మలనఖరసంస్ఫురణంబులును సనకసనందనాదియోగీంద్రమానసాభరణంబులును నయిన చరణంబులు గదియనిడ, సమస్థితి నంజలిపుటంబులం బుష్పంబు లుల్లసిల్లఁ జల్లి, సల్లలితకమలప్రశస్తంబులయిన హస్తంబులు వల్లపీజనులకంఠంబులపై నిడి, తాను గీతానుసారంబగు విచిత్రపాద సంచారంబులు సలుపుచు, వర్తులాకారరాసబంధంబుల వర్తనంబునం బ్రవర్తించి, వెండియు వ్రేతలుం దానును శంఖ పద్మ వజ్రకందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్తకుండలీకరణ ఖురరీబంధ ప్రముఖంబులయిన విశేష రాసబంధంబులకుం జొచ్చి. యేకపాద సమపాద వినివర్తిత గతాగతవలిత వైశాఖమండలత్రిభంగి ప్రముఖంబులైన తానకంబుల నిలుచుచుఁ గనకకింకిణీమంజులమంజీరశింజనంబులు జగజ్జనకర్ణరజనంబులై చెలంగ, ఘటితమర్దితపార్శ్వగప్రముఖంబులైన పాదకర్మభేదంబులు

---

1. రాసము-గోపకులక్రీడావిశేషము, 2. ఉద్దిగొని-జతగూడి, 3. మురళంబు - వేణువు, 4, త్రిభంగి-ముువ్వంక, 5. విస్మితాఖండలంబు-ఇంద్రునికి ఆశ్చర్యము కల్గించునది 6. సింధురంబులు-ఏనుగులు, 7. తరంగిణి-నది.

క. [1]తియ్యవిలుకాఁడు డీకొని వ్రయ్యలుగాఁ దూఱనేసె వనితల మనముల్
వియ్యాన నింక నయినం గుయ్యాలింపం గదయ్య గోవింద! హరీ! 1058

మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం
దను 'రావే' యని చేరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్యమో
హనుఁడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారియై హారియై
ఘనపీతాంబరధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్. 1059

క. వచ్చిన వల్లభుఁ గనుఁగొని విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై
యచ్చుగ ప్రాణము లొడలికి వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్. 1060

సీ. అబల యొక్కతె భక్తి నంజలి గావించి ప్రాణేశు కెంగేలు వట్టికొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరుబాహువు మూఁపున నిడికొని ముదము నొందె
వనిత యొక్కతె తనవల్లభుతాంబూలచర్విత మాత్మహస్తమునఁ దాల్చెఁ
బడఁతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్ని తప్తకుచంబులఁ దాపుకొనియె

ఆ. భామ యొకతె [2]భ్రుకుటిబంధంబు గావించి ప్రణయభంగరోషభాషణమున
దష్టదశన యగుచు దండించు కైవడి వాఁడిచూడ్కిగముల వరునిఁ జూచె. 1061

క. హరిముఖకమలముఁ జూచుచుఁ దరుణియొకతె తెప్పలిడక [3]తనియకయుండెన్
హరిపదకమలముఁ జూచుచు మరగి తనివిలేని సుజనుమాడ్కి నరేంద్రా! 1062

ఉ. ఒక్క లతాంగి మాధవుని యుజ్జ్వలరూపము సూడ్కితీవలం
జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచుం
జొక్కములైన లోచవులఁ జొక్కుచునుండెను యోగికైవడిన్. 1063

సీ. [4]ఎలయించి ప్రాణేశ! యెందుఁ బోయితి వని తోరంపుటలుకతో [5]దూఱె నొకతె
జలజాక్ష! నను బాసి చనఁగ నీపాదంబు [6]లెట్లాడెనని వగ [7]నెయిదె నొకతె;
నాథ! నీ వరిగిన నా ప్రాణ మున్నది కూర్మియే యిది యని కుందె నొకతె
యీశ్వర! నను నిన్ను నిందాఁకఁ బాపెనే పాపపువిధి యని పలికె నొకతె

---

1. తీయనిలుకాఁడుడీకొని, పాయలుగాఁదూఱనేసె వనితల మనముల్, నీయాన యింకనైనం, గూయాలింపంగదయ్య గోవిందహరీ!—పాఠాంతరము, 2. భ్రుకుటిబంధంబు - కనుబొమలు ముడివేయుట, 3. తనియక - తృప్తిపొందక. 4. ఎలయించి - లాగికొనిపోయి, 5 దూఱెను - నిందించెను, 6. లాడెనేయని వగ నడలె నొకతె—పాఠాంతరము, 7. ఎయిదెను - పొందెను.

ఆ. తలఁగి పోవునట్టి తప్పేమి సేసితి? నధిప! పలుకు ధర్మ మనియె నొకతె
యేమినోముఫలమొ హృదయేశ నీమోము మరలఁగంటి మనుచు మసలె నొకతె. 1064

క. 'పలికినఁ బ్రతిజ్ఞ దప్పెడిఁ బలికించినఁ గాని రమణుఁ బలుక' నటంచుం
గలకంఠి యొకతె చెలితోఁ బలుకుల నమృతములు గురియుపగిదిం బలికెన్. 1065

క. పట్టినఁ గాని మనోవిభుఁ బట్ట గదా? యంచు నొక్క బాలిక సఖిచే
పట్టుకొని చెప్పె ధైర్యము పట్టెల్లను మరుని [1]టెంకిపట్టుగ నధిపా! 1066

క. చెలువుఁడు సెప్పక పోయిన [2]సొలపున నొకముగ్ధ మున్ను చూడననుచు నొఁ
దల వంచి యుండఁ జాలక తల యెత్తును లోన మరుఁడు దల యెత్త నృపా! 1067

వ. ఇవ్విధంబున. 1068

క. హరిసురుచిరలలితాకృతిఁ దరుణులు గని ముక్తవిరహతాపజ్వరలై
పరమోత్సవంబు సలిపిరి పరమేశ్వరుఁ గనిన [3]ముక్తబంధులభంగిన్. 1069

వ. అంత నక్కాంతుండు గాంతాజనపరిక్రాంతుండై వనాంతరంబున శక్తినికర సంయుక్తుండైన పరమపురుషుండునుంబోలె వారలం దోడ్కొని మందారకుందకుసుమ పరిమళమిళిత పవమానమానితమధుకరనికరఝంకారసుకుమారంబును, శరత్కాల చంద్రకిరణసందోహ [4]సందళితాంధకారంబును, యమునా తరంగ సంగత కోమలవాలుకాస్ఫారంబునునై యమలినంబైన పులినంబు ప్రవేశించె. వారును జ్ఞానకాండంబున నీశ్వరుం గని విరహ వేదనలు విడిచి పరిపూర్ణమనోరథలై. 1070

క. [5]పాఠీననయన లెల్ల న కాఠిన్యపటాంచలములఁ గౌతుకములు హృ
త్పీఠముల సందడింపఁగఁ బీఠముఁ గల్పించి రంతఁ బ్రియునకు నధిపా! 1071

ఆ. పరమయోగిహృదయ [6]భద్రపీఠంబుల నుండు మేటి వ్రజవధూత్తరీయ
పీఠమున వసించి పెంపారెఁ ద్రిభువన [7]దేవి లక్ష్మి మేనఁ దేజరిల్ల. 1072

మ. మదనోద్దీపకుఁడైన నాథునికి సమ్మానంబు గావించుచున్,
ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ మోదించుచుం జేరి త
త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం బై ముట్టుచున్ దూఱుచుం
[8]జదురుల్ వల్కుచుఁ గూర్మి నిట్లనిరి యీషత్కోపదీప్తాస్యలై. 1073

1. టెంకిపట్టు-నివాసము, 2. సొలపు-వైముఖ్యము, 3. ముక్తబంధులు-సంసార బంధమునుండి విడుదలపొందినవారు - మోక్షముపొందినవారు, 4. సందళితము - బాగుగాఁ బెదరగొట్టఁబడినది, 5. పాఠీనము - చేప, 6. పద్మ—పాఠాంతరము, 7. దేశ; దేవ—పాఠాంతరము 8. చదురుల్-నేర్పుమాటలు.

ఆ. సర్వభక్షుఁ డగ్ని సర్వంబు భక్షించి దోషి గానిపగిది దోషమైనఁ
జేసి దోషపదముఁ జెందరు తేజస్వు లగుటఁ జంద్రవాసవాదు లధిప ! 1105

క. ఈశ్వరుఁడు గానివాఁడు నరేశ్వర! పరకాంతఁ దలఁచి యెట్లు బ్రదుకు? గౌ
రీశ్వరుఁడు దక్క నన్యుఁడు విశ్వభయదవిషము మ్రింగి వేలయంగలఁడే? 1106

క. సత్యము ప్రభువుల వచనము నిత్యముఁ దద్వచనవీధి నిలుతురు పెద్దల్;
సత్యాసత్యము గావున సత్య మనుచు జనరు వారిచరితమున నృపా! 1107

మ. ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసంప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధ [1]నిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు, రా దివ్యశో
భనుఁ డెట్లుండిన నుండెఁగాక! కలవే బంధంబు లుర్వీశ్వరా! 1108

ఆ. గోపజనములందు, గోపికలందును సకలజంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు? సర్వమయుఁడు లీల సలిపెఁగాక! 1109

వ. అని చెప్పి శుకుం డిట్లనియెనంత [2]బ్రాహ్మముహూర్తంబునం గృష్ణు వీడ్కొని గోపిక లిచ్చ
లేకయు నిండ్లకడ కేఁగనం గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింపనేరరై
రివ్విధంబున 1110

ఇంద్ర. గోపాలకృష్ణుండును గోపకాంతల్ ప్రాపించి క్రీడించిన [3]భంగులెల్లన్
రూపించి వర్ణించి నరుండు హృత్సంతాపంబులన్ బాయును దత్ప్రసక్తిన్. 1111

—: సర్పరూపి యగు సుదర్శనుం డను గంధర్వుని శాపవిమోచనము :—

వ. అంత నొక్కనాఁడు నందాదులైన గోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి, జాత
రకుం జని సరస్వతీనదీజలంబుల స్నానంబులు సేసి, యుమామహేశ్వరుల నర్చించి
కానిక లిచ్చి, బ్రాహ్మణులకు గోహిరణ్యవస్త్రాన్న దానంబులొసఁగి, జలప్రాశనంబు
సేసి నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు నిదుర
వోయిన నందునిం గఱచి మ్రింగ నగ్గలింప నతండు 'కృష్ణకృష్ణే'తివచనంబులం దన్ను
విడిపింపుమని మొఱ యిడిన విని. 1112

క. గోపకులందరు మేల్కొని కోపముతోఁ బెద్ద [4]గుదెలఁ గొఱవుల మొత్తం
దాపము నొందియు వదలక పాపపుఁ బెనుబాము నందుఁ బట్టు నృపాలా ! 1113

1. నిరోధంబులు - ఆటంకములు, 2. బ్రాహ్మముహూర్తంబు - తెల్లవారుజాము,
3. భంగులు-విధములు, 4. గుదెలు-కఱ్ఱలు.

వ: అయ్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసి త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్రరూపంబుఁ దాల్చి హరికి మ్రొక్కిన నతనికి హరి యిట్లనియె. 1114

ఉ. [1] మండితమూర్తితోఁ గనకమాలికతో శుభలక్షణుండవై
యుండెడు నీకుఁ గష్టపుమహోరగదేహ మి దేల వచ్చె? నె
వ్వండవు? నామ మెయ్యది? భవంబున కెద్ది మిషంబు? నాకు నొం
డొండ యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ! నీ పని చోద్య మయ్యెడిన్. 1115

వ. అనిన వాఁ డిట్లనియె "దేవా! యేను సుదర్శనుం డను విద్యాధరుండ; విమానారూఢుండనై రూపసంపద్గర్వంబుల జొక్కి దిక్కులం జరించుచు నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూపులైనవారలం గని నగిన వారును 'నీవు రూపదర్పంబున మమ్ము నగితివి; గావున మహాసర్పంబవై యుండు' మని శపించి పిదప నే వేఁడుకొనిన నిట్లనిరి.

చ 'యదుకులమందు భక్తుల భయంబు హరించుటకున్ [2]జనార్దనుం
డుదయము నొంది యీ యడవి కొక్కదినంబున రాఁగలండు త
త్పదమున నీవు పన్నఁబడి సన్నగదేహము తోడఁ బాసి నీ
మొదలిటి మేను గాంచెదవు మూఢుఁడ! పొ'మ్మని రా దయానిధుల్. 1117

మ. నినుఁ జింతించిన [3]విన్నఁ బేరుకొనినన్ నిర్మూలమై [4]క్రుస్సి పా
పనికాయంబు వినష్టమౌ నఁట! భవత్పాదంబు నామీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనిత [5]కౌటిల్యంబు దా నిల్చునే?
వనజాతేక్షణ! నేఁడు వాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్?" 1118

వ అని విన్నవించి హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి, మ్రొక్కి. సుదర్శనుండు దివంబునకుం జనియె, సర్పంబువలన నందుఁడు విముక్తుం డయ్యెఁ; దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతామహోత్సవంబు సమాప్తి నొందించి కృష్ణ కీర్తనంబు సేయుచు మరల మందకుం జని రంత. 1119

—:కుబేరభటుం డగు శంఖచూడుం డను గుహ్యకుని సంహరించుట:—

చ. మఱి యొకనాఁటిరాత్రి బలమాధవు లుజ్జ్వలవస్త్రమాలికా
ధరులును లేపనాభరణధారులునై చని మల్లికాదిపు
ష్పరసనిమగ్నమత్తమధుపంబుల గీతము వించుఁ దద్వనాం
తరమున వెన్నెలన్ వ్రజనితంబినులుండఁగఁ బాడి రింపుగన్. 1120

1. మండితము-అలంకరింపఁబడినది, 2. జనార్దనుండు-విష్ణువు, 3, విన్న—పాఠాంతరము, 4. క్రుస్సి-క్షీణించి, 5. కౌటిల్యంబు-వక్రత.

క. ఆపాట సెవులఁ జోఁకిన నే పాటియు దేహలతల నెఱుఁగక [1]దృగ్వా
చాపాటవములు సెడి పడి రా పాటలగంధు లెల్ల నటవీవీథిన్. 1121

వ. ఇట్లు సకలభూతసమ్మోహనంబగు గానంబు సేయుచు, నిచ్ఛావర్తనంబులం బ్రమత్తుల చందంబున రామకృష్ణులు క్రీడింపఁ గుబేరభటుండు శంఖచూడుం డనువాఁడు రామకృష్ణ రక్షిత లగు గోపికలం దన యోగబలంబున నుత్తరపు దిక్కునకుం గొనిపోవ నయ్యోషిజ్జ నంబులు 'రామకృష్ణే' తిభాషణంబులం జీరి పులికి నగపడిన మొదవుల క్రియ మొఱ లిడిన విని. 1122

ఉ. గ్రద్దన సాలవృక్షములు గైకొని [2]బల్లిదు లన్నదమ్ము లా
యిద్దఱుఁ గాలమృత్యువుల యేపున వే చని [3]యోడకుండుఁ డో
ముద్దియలార!' యంచుఁ దను ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
డుద్దవిడిం దగం బఱచె నుత్తర మింతుల డించి భీతుఁడై. 1123

వ. ఇట్లు గుహ్యకుని చేత విడివడిన గోపికల 'రక్షించుకొని యుండు' మని బలభద్రునిఁ బలికి. 1124

శా. 'ఓరీ గుహ్యక పోకు పోకు' మని రోషోక్తిన్ బకారాతి వాఁ
డే రూపంబున నెందుఁ జొచ్చె నటఁ బోయెం దోడఁ దా నేఁగి దు
ర్వారోదంచితముష్టి వానితలఁ ద్రెవ్వం బట్టి తద్వీరుకో
టీరభ్రాజితరత్నముం గొనియె [4]దండిన్ గోపికల్ సూడగన్. 1125

వ. ఇట్లు శంఖచూడునిం జంపి వాని శిరోరత్నముం దెచ్చి బలభద్రుని కిచ్చి మెప్పించె; మఱియు నొక్కదినంబునం గృష్ణుండు వనంబులకుం జనిన నతని లీలలు వాడుచు నిండ్లకడఁ దద్విరహవేదనానలభరంబు సహింపక గోపికలు దమలో నిట్లనిరి. 1126

శా. 'భ్రూవిక్షేపము తోడ దాపలిభుజంబుం జెక్కుఁ గీలించి కె
మ్మోవిన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా మ్రోయించుచు న్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని సప్రాణేశలై యుండియున్
నీవీబంధము లూడఁ బొక్కుదురువో నింగిన్ నిలింపాంగనల్. 1127

మ. నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీనాదామృతస్యందముల్
సెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై
యువిదా! మేపులకుం దొఱంగి మృగగోయూథంబు [5]లుత్కంఠతో
దివికిం గంఠములెత్తి లో వదలుఁబో దేహేంద్రియ [6]వ్యాప్తులన్. 1128

---

1. దృగ్వాచాపాటవములు - చూపులయొక్కయు మాటలయొక్కయు నేర్పులు, 2. బల్లిదులు-వీరులు, 3. ఓడక-భయపడక, 4. దండి-పరాక్రమము, 5. ఉత్కంఠ-ఆసక్తి, 6. వ్యాప్తులు-వ్యాపారములు.

శా. ఓ కంజేక్షణ! కృష్ణుఁ డుజ్జ్వలితహారోద్దాముఁడై గానవి
ద్యాకౌతూహలితన్ మనోజ్ఞమురళీధ్వానంబు గావింపఁగా
నాకర్ణించి [1]సశంపమై మొరయు నీలాభ్రంబుగాఁ జూచుచుం
గేకారావము లిచ్చుచున్ మురియుఁ బో [2]కేకీంద్రసంఘాతముల్. 1129

మ. లలనా యేటికిఁ దెల్లవాఱె? రవి యేలా తోఁచెఁ బూర్వాద్రిపైఁ?
గలకాలంబు [3]నహంబు గాక నిసి గాఁ గల్పింపఁ డా బ్రహ్మ దా
వలఁతేఁడుం గృప లేఁడు; కీరములు దుర్వారంబు; లెట్లోకదే!
కలదే మాపటివేళయుం గలుగునే కంజాక్షుసంభోగముల్? 1130

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు? హరి యెప్పుడు గోవుల మేపి వచ్చు? నా
కెప్పుడు తన్ముఖాంబుజసమీక్షణ మబ్బు? నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁ? మది యెప్పుడు మద్విరహాగ్ని రాశికిం
జెప్పఁగదమ్మ బోటి మరుచేఁతల నుల్లము దల్లడిల్లెడిన్. 1131

మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ నయ్యాక్షణం
బులు నా కన్నియు నూఁడ నుండఁ గడు నాపూర్ణంబులై సాఁగి లో
పలఁ దోఁచుం [4]బ్రహరంబులై, దినములై, పక్షస్వరూపంబులై,
నెలలై, [5]యబ్దములై, మహాయుగములై, నిండారుకల్పంబులై! 1132

వ. అని మఱియుఁ గృష్ణవిరహదుఃఖమున బహువిధంబులఁ బశ్చాత్తాపంబు నొందుచు గోపిక
లోపికలు లేక యెట్టకేలకు దినంబు గడిపి దినాంతసమయంబునందున. 1133

మ. 'అదె భానుం డపరాద్రిఁ జేరెఁ? నిదె సాయంకాల మేతెంచె! న
ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె! బృందారణ్యమార్గంబునం
దిదె వీతెంచె వృషేంద్రఘోషము; ప్రియుం డేతెంచె రం' డంచుఁ దా
మెదు రేతెంతురు మాపు కృష్ణునికి నయ్యింతుల్ పరిభ్రాంతలై. 1134

వ. ఇట్లు తన కెదురువచ్చిన మచ్చిక నచ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల గారవించె
నంత నొక్కనాఁడు. 1135

—: వృషభాసుర సంహారము :—

సీ. ఎవ్వనిమూఁపుర మీక్షించి మేఘంబు లద్రి [6]శృంగం బని యాశ్రయించు
నెవ్వని ఱంకె కర్ణేంద్రియంబులు సోఁక గర్భపాతం బగు గర్భిణులకు

---

1. సశంపము - మెఱుపుతోఁగూడినది, 2. కేకి - నెమిలి, 3. అహంబు - పగలు,
4. ప్రహారంబులు-జాముము 5, అబ్దములు-సంవత్సరములు, 6. శృంగంబు-శిఖరంబు.

నెవ్వని పదహతి నెగయు పరాగంబు [1]లంధకారారాతి నావరించు
లెవ్వఁడు గొమ్ముల నెదిరించి చిమ్మినఁ బృథ్వీధరంబులు వెల్లగిల్లు
తే. నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి వాలలత యెత్తి పెనుఱంకె వైచి నేలఁ
గాలు ద్రవ్వుచు [2]నిశితశృంగములు సాఁచి మందబెగడంగఁ గవిసె నమందగతిని. 1136

వ. అట్లు వృషభాకారంబున నరిష్టుఁడు హరికి నరిష్టంబు సేయందలంచి పైకుఱికిన. 1137

ఉ. క్రేపులు వాఱె గోవులకుఁ; గ్రేపులు గోవులు గోవృషంబులం
బైపడె; వత్సధేనువృషభంబులు గోపకులందుఁ జొచ్చె; నా
గోపకు లా వృషేంద్రములు గోవులు లేఁగలు [3]విచ్చి పాఱఁగా
గోపచమూవిభుండు గనె గోవృషదైత్యుఁడు వెంట నంటఁగన్. 1138

వ. ఇట్లు భయభ్రాంతులై కాంతలుం దారును 'కృష్ణ! కృష్ణ; రక్షింపు రక్షింపు మనియెడు
గోపకులకు నడ్డంబు వచ్చి దీనజనరక్షకుండైన పుండరీకాక్షుం డిట్లనియె. 1139

ఉ. 'బాలుర నింతులం బసులఁ బాఱఁగఁ దోలుట [4]బంటుపంతమే?
చాలు, వృషాసురేంద్ర! బలసంపదఁ జూపఁగ నెల్లబోఁటి గో
పాలురమంద గాదు; చనఁ బైపడితేనిఁ బ్రచండకృష్ణశా
ర్దూలము నేఁడు నీగళముఁ ద్రుంపక చంపక పోవనిచ్చునే? 1140

ఆ. అనుచు ధిక్కరించి హస్తతలంబులఁ జప్పుడించి నగుచుఁ జలము మీఱఁ
బన్నగేంద్రభయదబాహాదండము సాఁచి దండి మెఱసి దనుజు [5]దండ నిలిచె. 1141

వ. అప్పుడు. 1142

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠితవాలసమీరణంబులన్
విరవిరఁ బోయి మేఘములు వివ్వ విషాణము లొడ్డికొంచు దు
స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు కన్నుల నిప్పు లొల్కఁగా
దురదుర వచ్చి తాఁకె రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్. 1143

ఉ. యాదవకుంజరుండు వృషభాసురుకొమ్ములు రెండుఁ బట్టి [6]య
ష్టాదశపాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బుకై వడిన్
భేదిల ద్రొబ్బ నయ్యసుర [7]బిమ్మిటి నొంది చెమర్చి గ్రుమ్మగ్గి దు
ర్మాదముతోడ డీకొనెఁ బ్రమత్తవిమర్దను నా జనార్దనున్. 1144

1. అంధకారారాతి - సూర్యుఁడు, 2. నిశితశృంగములు - వాఁడికొమ్ములు, 3. విచ్చి-చెదరి, 4. బంటుపంతము-పరాక్రమము, 5. దండ-సమీపము, 6. అష్టాదశపాద మాత్రము-పదునెనిమిది అడుగులలోనే, 7. బిమ్మిటి-పరవశత్వము.

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు వట్టి ధరణి [1]ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల
కొమ్ము వీఁగ సురలకొమ్మ వర్ధిల వాని కొమ్ము వెఱికి మొత్తి కూల్చె నధిప! 1145

క. [2]ఉక్కు సెడి రోఁజి నెత్తురు ముక్కున వాతను స్రవింప [3]మూత్రశకృత్తుల్
మిక్కిలి విడుచుచుఁ బసరపు రక్కసుఁ డని సమసెఁ బ్రజకు [4]రాగం బమరన్. 1146

వ. ఇట్లు వృషభాసురుం జంపిన, నిలింపులు గుంపులుగొని విరులు వర్షింప, గోపకులు హర్షింప
గోపసతు లుత్కర్షింప, బలభద్రుండును దానును గోవిందుండు పరమానందంబున
మందకుం జనియె నంత. 1147

చ. ఘనుఁ డొకనాఁడు నారదుండు గంసునితోడ యశోద గూఁతుఁ దాఁ
గనుటయుఁ జక్రి దేవకికి గర్భజుఁ డౌటయు మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁ డౌటయును దద్విభు లిద్దఱు మంద నున్నవా
రని యెఱుఁగంగఁ జెప్పిన మహాద్భుత మంచుఁ జలించి కిన్కతోన్. 1148

చ. 'కొడుకుల మందలోన నిడి [5]గొంటుతనంబున మోసపుచ్చె నీ
బడుగును బట్టి చంపు టిది భావ్య' మటంచుఁ గృపాణపాణియై
వడి వసుదేవునిం దునుమవచ్చిన కంసునిఁ జూచి నారదుం
'డుడుగుము; చంపఁ బోల' దని యోడక మానిచి పోయె మింటికిన్. 1149

వ. మఱియు నలుక దీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశబద్ధులం జేసి కేశి యను
వానిం బిలిచి రామకేశవులం జంపు మని పంపి, మంత్రిభటగజారోహక చాణూరముష్టిక
సాల్వకోసలప్రముఖుల రావించి యిట్లనియె. 1150

శా. ఎందున్ న న్నెదిరించి పోవుటకు దేవేంద్రాదులుం జాల రీ
బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామగో
విందుల్ వర్ధిల్లుచున్న వా రఁట! రణోర్విం గంసునిం ద్రుంతు' మం
చున్ దర్పంబులు వల్కు చుండురఁట: యీ చోద్యంబులన్ వింటిరే? 1151

క. పట్టణజనములు సూతురు దట్టంబుగ మల్లరంగతలపార్శ్వములం
బెట్టింపుడు [6]తమగంబులు పెట్టింపుఁడు వీట మల్లుపో రనుమాటన్. 1152

శా. విన్నాణంబులఁ బోర నేర్తురు మహావీర్యప్రతాపాదిసం
పన్నుల్ మీరలు మేటిమల్లగములం బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా రా బలకృష్ణులం బెనకువన్ మర్దించి మత్ప్రీతికా
సన్నుల్ గండు పురీజనుల్ వొగడ నో చాణూర! యో ముష్టికా! 1153

1. ద్రొబ్బి-త్రోసి, 2. ఉక్కు-బలము, 3. మూత్రశకృత్తుల్-మలమూత్రములు
4. రాగంబు-సంతోసము, 5. గొంటుతనంబు-నేర్పు, 6. తమగంబులు-మంచెలు.

శా. రారా [1]హస్తిపకేంద్ర! గండమదధారాగంధలోభాంధగం
భీరాళివ్రజమైన మత్కువలయాపీడద్విపేంద్రంబు మ
ద్ద్వారోదంచిత దేహళీపరిసర స్తంభంబు డాయంగ నా
భీరుల్ రా నదలించి డీకొలుపు నీ [2]బీరంబు తోరంబుగన్ 1154

క. పశు [3]విశసనములు సేయుఁడు పశుపతికిం బ్రియముగాఁగ భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము విశదంబుగఁ జేయవలయు విజయముకొఱకున్. 1155

వ. అని తనవారి నందఱ నయ్యైపనులకు నియమించి యదుశ్రేష్ఠుం డగు నక్రూరునిం బిలి
పించి చెట్ట పట్టికొని యిట్లనియె. 1156

శా. అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్ల మైత్రి సలుపన్ వచ్చున్ నినుం జేరి [4]నీ
[5]వక్రోధుండను మందలోన బలకృష్ణాభీరు లస్మద్వినా
శక్రీడారతులై చరింతురఁట! [6]యోజం దెచ్చి యొప్పింపవే! 1157

ఆ. నాకు వెఱచి సురలు నారాయణుని వేఁడికొనిన నతఁడు వచ్చి గోపకులము
నందుఁ గృష్ణమూర్తి నానకదుందుభి కుదితుఁ డయ్యె నన నొకటి వింటి! 1158

వ. కావున నీవు గోపకులచేత [7]నరులుగొని ధనుర్యాగంబుఁ జూడ రం డని వారలం దోడ్కొని
రమ్ము వచ్చిన. 1159

శా. కొండల్ గూలఁగ ద్రొబ్బు గొమ్ములతుదిం గోపించి కోరాడుచో
దండిన్ దండి నధఃకరించు నొకవేదండంబు నాయింట బ్ర
హ్మాండంబైనఁ గదల్పనోపు బలకృష్ణాభీరులం బోరిలో
ఖండింపం దడ వెంత దాని? కదియుం గాదేని నక్రూరకా, 1160

శా. చాణూరుండును ముష్టికుండును సభా [8]సంఖ్యాతమల్లుల్ [9]జగ
త్ప్రాణున్ మెచ్చరు సత్వసంపదల బాహాబాహిసంగ్రామపా
రీణుల్ వారలు రామకృష్ణులబలోద్రేకంబు సైరింతురే?
క్షీణప్రాణులఁ జేసి చంపుదురుసూ సిద్ధంబు యుద్ధంబునన్. 1161

సీ. ఆ రామకేశవు లంతరించిన వసుదేవముఖ్యులఁ జంపి తెగువ మెఱసి
వృష్ణిభోజదశార్హవీరులఁ దెగటార్చి ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు

---

1. హస్తిపకుఁడు-మావటీఁడు, 2. బీరంబు-పరాక్రమము, 3. విశసనములు-వధలు, 4. నిర్వ్యాక్రోశుండవు—పాఠాంతరము, 5. అక్రోధుండు-కోపములేనివాఁడు, 6. ఓజ-ఉపాయము, 7. అరులు-కప్పములు, 8. సంఖ్యాతులు-లెక్కింపఁదగినవారు, 9. జగత్ప్రాణుండు-వాయువు.

నగు నుగ్రసేను మా యయ్యఁ గీటడఁగించి పినతండ్రి దేవకుఁ [1]బిలుకుమార్చి,
మఱియు వైరుల నెల్ల మర్దించి నే జరాసంధ నరక బాణ శంబరాది

ఆ. సఖులతోడ భూమిచక్ర మేలెదఁ, బొమ్ము తెమ్ము వేగమ వసుదేవసుతుల
మఖము పేరు సెప్పి మంత్రభేదము సేయ వలయుఁ బెంపఁ జనదు వైరిజనుల. 1162

వ. అనిన నక్రూరుం డిట్లనియె. 1163

ఉ. పంపినఁ బోనివాఁడనె నృపాలక మానవు లెన్నఁ దమ్ము నూ
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిం జరింతు రది గా దన వచ్చునె? యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగ రాదు నీ పగతుబిడ్డలఁ దెచ్చెదఁ బోయి వచ్చెదన్. 1164

## —: శ్రీకృష్ణుండు కేశివ్యోమాసురుల సంహరించుట: —

వ. అని పలికి రథం బెక్కి యక్రూరుండు సనిన సకలజనుల వీడుకొలిపి కంసుం డంతి
పురంబునకుం జనియె; నంతఁ గంసప్రేరితుండై 1165

సీ. ఖురపుటాహతిఁ దూలి [2]కుంభినీచక్రంబు ఫణిరాజఫణులకు బరువు సేయ
భీషణహేషావిభీషితులై మింట [3]నమృతాంధు లొండొరు నండ గొనఁగఁ
జటులచంచలసటాచ్ఛటలగాడ్పులమేఘములు విమానములపై మునుఁగుపడఁగ
వివృతాస్యగహ్వరవిపులదంతంబులు ప్రళయాగ్నికీలల పగిది మెఱయఁ

ఆ. గాలపాశలీలగా వాల మే పార వాహ మగుచు గంధవాహగతుల
విజితశక్రపాశి వీర్యపయోరాశి కేశి వచ్చె మంద క్లేశ మంద. 1166

క. భీషణ [4]ఘోటకదానవ హేషానిర్ఘోషభిన్నహృదయనిఖిలగో
యోషాపురుషార్భకమై ఘోషము హరి సూడ దైన్యఘోషం బయ్యెన్. 1167

వ. అయ్యవసరంబున. 1168

ఉ. పేదల ఘోషగోపకుల బి ట్టదలించుట వీరధర్మమా?
కాదు; వ్రజంబులో దనుజఘస్మరుఁ డేఁ దని తన్ను రోయు [5]క్ర
వ్యాదునిఁ జూచి గోపకుల కడ్డము వచ్చి 'నిశాట! యింకఁ బో
రా'దని శౌరి సీరె మృగరాజుక్రియ న్నెదిరించె దైత్యుఁడున్. 1169

ఆ. నిష్ఠురోగ్రసింహనినదంబుతో నింగి మ్రింగుభంగి పోరు మిగులఁ దెఱచి
కఱవ రాఁగ నతఁడు గాటు దప్పించినఁ దన్నె నెగసి తురగదానవుండు. 1170

1. పిలుకుమార్చి-చంపి, 2. కుంభిని - భూమి, 3. అమృతాంధులు - దేవతలు, 4. ఘోటకము - గుఱ్ఱము. 5. క్రవ్యాదుఁడు - రాక్షసుఁడు.

ఉ. తన్నిన తన్నునం బడక దానవహంత సమీకరంతయై
కన్నులఁ గెంపు పెంపెనయ గ్రక్కున ఘోట [1]నిశాటు పాదముల్
వన్నె సెడంగఁ బట్టి వడి వైచె ధనుశ్శతమాత్రదూరమున్
బన్నగడింభమున్ విసరి పాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్. 1171

ఉ. వైచిన మ్రొగ్గి లేచి వెస వాజినిశాటుఁడు హుంకరించి సం
కోచము లేక పైపడిన గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్రశుం
డాచటులప్రభాబల [2]విడంబక మైన భుజార్గళంబు దో
షాచరునోటిలో నిడియెఁ జండఫణిన్ గుహ నుంచుకైవడిన్. 1172

శా. దంభోళిప్రతిమానకర్కశమహోద్యద్వామదోః స్తంభమున్
శుంభల్లీల నఘారి వానిరదముల్ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁకన్ వృద్ధిఁ బొందించుచున్
[3]గుంభించెం బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా! 1173

క. వాయువు వెడలక నిలిచినఁ గాయంబు సెమర్పఁ గన్నుఁగవ వెలి కుఱుకన్
మాయసెడి తన్నుకొనుచును గూయుచు నశ్వాసురుండు గూలెన్ నేలన్. 1174

ఆ. ఘోటకాసురేంద్రుకుక్షిలోఁ గృష్ణుని బాహు వధిక మైనఁ బట్టలేమిఁ
ఒగిలి దోసపండుపగిదిఁ దద్దేహంబు వసుమతీశ! రెండు [4]వ్రయ్య లయ్యె. 1175

క. నలినాక్షుఁడు లీలాగతి [5]విలయముఁ బొందించె నిట్లు వీరావేశిన్
బలలాశిన్ జగదభినవబలరాశిన్ విజితశక్రపాశిం గేశిన్. 1176

వ. ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి; రంత హరిభక్తివిశా
రదుండైన నారదుండు వచ్చి గోవిందుని సందర్శించి రహస్యంబున నిట్లనియె, 1177

సీ. 'జగదీశ! యోగీశ! సర్వభూతాధార! సకలసంపూర్ణ! యీశ్వర! మహాత్మ!
కాష్ఠగతజ్యోతికైనడి నిఖిలభూతములందు నొకఁడవై తనరు దీవు
సద్గూఢుఁడవు; గుహాశయుఁడవు; సాక్షివి నీయంతవాఁడవై నీవు మాయఁ
గూడి కల్పింతువు గుణముల వానిచేఁ బుట్టించి రక్షించి పొలియఁజేయు
ఆ. దీ ప్రపంచమెల్ల నిట్టి నీ విప్పుడు రాజమూర్తు లయిన రాక్షసులను
సంహరించి భూమిచక్రంబు రక్షింప నవతరించినాఁడ వయ్య! కృష్ణ! 1178

వ. దేవా! నీచేత నింకఁ జాణూర ముష్టిక గజ కంస శంఖ యవన ముర నరక పౌండ్రక శిశు
పాల దంతవక్త్ర సాల్వ ప్రముఖులు మడిసెదరు; పారిజాతం బపహృతం బయ్యెడిని;

---

1. నిశాటుఁడు - రాక్షసుఁడు, 2 విడంబకము - పోలునది. 3. కుంభించెన్ - బిగఁబట్టెను, 4. వ్రయ్యలు - చీలికలు, 5. విలయము - నాశము.

నృగుండు శాపవిముక్తుం డగు; శ్యమంతకమణి సంగ్రహంబగు; మృత బ్రాహ్మణపుత్ర ప్రదానంబు సిద్ధించు; నర్జునసారథివై యనేకాక్షౌహిణీబలంబుల వధియించెదవు;మఱియును

శా. కృష్ణా! నీ వొనరించుకార్యములు లెక్కింపన్ సమర్థుండె? వ
ర్ధిష్ణుండైన విధాత మూఁడుగుణముల్ దీపించు; లోపించు రో
చిష్ణుత్వంబున నుండు నీవలన; నిస్సీమంబు నీరూపు! నిన్
విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నమితున్ విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్.' 1180

వ. అని వినుతించి వీడుకొని నారదుం దరిగె; నంత నొక్కనాఁడు కృష్ణసహితులయి గోప కుమారు లడవికిం జని పసుల మేపుచు నొక్కకొండదండ [1]నిలాయనక్రీడలసేసి; రందు.

క. కొందఱు గొఱియల మంచును గొందఱు పాలకుల మంచుఁ గుటిలత్వమునం
గొందఱు దొంగల మనుచును జెఁది కుమారకులు క్రీడ సేసిరి తమలోన్. 1182

శా. ఆలో దొంగలలో మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు గో
పాలుండై ననిమేషకల్పనలతో భాసిల్లి క్రీడించు త
ద్బాలవ్రాతము నెల్ల మెల్లన [2]చతుఃపంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికిం గొని చనెం జౌర్యం [3]బవార్యంబుగన్. 1183

వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమ క్రమంబున గోపకుమారుల నిడి, యొక్క పెనుఱాతఁ దద్ద్వా రంబు గప్పి యెప్పటియట్ల వచ్చిన. 1184

ఉ. వీరుఁడు మాధవుం డఖిలవేది నిశాచరభేది నవ్వుతో
'నౌర! నిశాట! దొంగతన మచ్చుపడెన్ నెఱదొంగ వౌదు; వా
భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి [4]చిక్కినవారిఁ బెట్టరా!
రార యటంచుఁ బట్టె మృగరాజు [5]వృకాఖ్యముఁ బట్టుకైవడిన్. 1185

ఉ. పంకజలోచనుం డొడిసి పట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబు లేమి లో
[6]శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన యా రణభీము వ్యోమునిం
గొంకక గూల్చె నవ్విభుఁడు గో యని మింట సుపర్వు లార్వఁగన్. 1186

ఆ. ఘోరదనుజు నేలఁ గూల్చి పర్వతగుహ వాత నున్నఱాయి వ్రయ్యఁ దన్ని
గుహఁ జరించుచున్న గోపాలకులఁ గొంచు బల్లిదుండు [7]గొల్లపల్లె కరిగె. 1187

---

1. ఇలాయనక్రీడ - ఒకయాట, 2. చతుః పంచావశిష్టంబుగా - నలుగురైదుగురు మిగులునట్లుగా, 3. అవార్యంబుగన్ .. అడ్డులేకుండునట్లు, 4. చిక్కినవారు - మిగిలిన వారు, 5. వృకాఖ్యము - తోఁడేలు, 6. శంకిలి - సందేహించి, 7. గోపపల్లి—పాళాంతరము.

వ. అంత నా రాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి మఱునాఁడు రేప కడ లేచి, నిత్యకృత్యంబు లాచరించి, రథం బెక్కి కదలి నందగోపకులంబునకుం బోవుచుం దెరువునఁ దనలో నిట్లనియె. 1188

—: కంసునిపంపున నక్రూరుండు బృందావనంబునకుఁ జనుదెంచుట :—

ఉ. ఎట్టి తపంబు సేయఁబడె? నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో?
యెట్టి ధనంబు లర్థులకు నీఁబడెనో తొలిబామునందు! నా
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగ లేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁ గల్గెడిన్. 1189

ఉ. [1]సూరులు దొల్లి యే విభుని శోభితపాదనఖప్రభావళిం
జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టి దేవునిన్
వైరముతోడనైనఁ గెలువన్ ననుఁ బంచి శుభంబు సేసె ని
ష్కారణమైన ప్రేమ; నిదె; కంసునిఁ బోలు సఖుండు గల్గునే? 1190

మ. 'ఇతఁడా కంసునిచేతఁ బంపువడ నన్ హింసింప నేతెంచినాఁ
డతిదుష్టుం'డని చూచునో సకలభూతాంతర్బహిర్మధ్యసం
గతుఁడౌటం దలపోసి నన్ను సుజనుంగాఁ జూచునో యెట్టి యు
న్నతి గావించునొ యేక్రియం బలుకునో? నా భాగ్య మెట్లున్నదో! 1191

వ. అని మఱియును. 1192

మ. అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్దామమై
జలజాక్షంబయి కర్ణకుండలవిరాజద్గండమై యున్న యా
జలజాతాక్షుముఖంబు సూడఁ గలుగున్ సత్యంబు వో నాకు; నా
వల దిక్కేఁగుచు నున్న పీ వనమృగ వ్రాతంబు లీత్రోవలన్. 1193

ఉ. మాపటివేళ నేను జని మాధవుపాదసమీపమందు దం
డాపతితుండనైన నతఁ డాశుగకాలభుజంగ వేగ సం
తాపితభక్తలోకభయదారణమైన కరాబ్జ మౌదలన్
మోపి హసించి నా కభయముం గృపతోడుత నీయకుండునే? 1194

వ. అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవిందసందర్శనంబుఁ గోరుచు నమంద గమనంబున సుందర [2]స్యందనారూఢుండై చని చని. 1195

---

1. సూరులు - విద్వాంసులు 2. స్యందనారూఢుండు - రథముపై నెక్కినవాఁడు.

క. ముందటఁ గనె ఘనచందన కుంద [1]కుటజ తాలసాల కురవక వట మా
కందన్ నందితబలగోవిందన్ వికచారుణారవిందన్ బృందన్. 1196

వ. కని బృందావనంబు దఱియం జొచ్చి. యందు సాయంకాలంబున నడవికి నెఱిగల మేఁతల వెంబడిం దిగంబడి రాక చిక్కిన కుఱ్ఱ గోడె పడ్డ తండంబులం గానక, పొద [2]యిఱుము, [3]మిఱ్ఱు పల్లం బనక తూఱి, పాఱి, వెదకి కానక చీరెడు గోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణించుచుఁ గోమల [4]ఘాసఖాదన కుతూహలంబులం జిక్కి మక్కువం గ్రేపులం దలంచి తలారింపక తమకంబులం దమతమయంత నంభారవంబులు సేయుచు [5]నూధంబులు స్రవింపఁ బరువులిడు దేనువులును, ధేనువులకు నోసరించుచు సద్యోజాతంబులగు [6]తర్ణకంబుల వహించి, నవసూతికలు వెనుతగులుటవలన దామహస్తులై చను పల్లవుల మెల్లన విలోకించుచు, మందయిరుగెలంకులం గలంకరహితులై పులి చివంగి వేఁగి [7]లోనగు హాలుమెకంబుల మొత్తంబులవలన నప్రమత్తులయి కుఠార కుంతశరాసనప్రముఖాయుధంబుల ధరియించి. కావలి తిరుగు వ్రేలం గడచి, నానావిధసరసతృణకబళఖాదనగరిష్ఠులై గోష్ఠంబులు ప్రవేశించి, రోమంథలీలాలసలై యున్న ధేనువులును, జన్నులు గుడిచి తల్లులప్రోలఁ బెల్లు రేఁగి క్రేళ్లుఱుకు లేఁగలును, వెదలైన మొదవులం బైకొని పరస్పరవిరుద్ధంబులై డీకొని కొమ్ముల యుద్ధంబులు సలుపు వృషభంబులును, నకుంఠిత బలంబులం గంఠరజ్జువులం ద్రెంచుకొని, పొద లుఱికి, దాఁటి తల్లులం దూఁటి, కుడుచు తఱిపి దూడల దట్టించి పట్టనోపక గ్రద్దనఁ బెద్దలం జీరు గోపకుమారులును, గొడుకుల మగల మామల మఱందుల వంచించి పంచాయుధభల్ల భగ్నహృదయలై గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణాగమతత్పరలై యున్న గోపకామినులను, గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపులవిడిచి యొడ్డుచు, మరలం గట్టుచు, నీడ్చుచుం, గ్రీడించు గోపకులును, గోఖురసముద్ధూత [8]కరీషపరాగపటలంబులవలన నుల్లారి దుల దులనైన ధేనుదోహనవేళా వికీర్ణపయోబిందుసందోహపరంపరాసంపాదిత పంకంబులును, దోహనసమయ గోపకరాకృష్టగోస్తన నిర్గతంబులయి కలశంబులందుఁ బడియెడు, క్షీరధారల చప్పుళ్లును మహోక్షకంఠసమ్మర్శనస్నిగ్ధంబులైన మందిరద్వారదారుస్తంభంబులు పొంతలనుండి, యులికిపడి నలుదిక్కులు గనుంగొని నూతనజన విలోకన కుపితంబులై [9]కరాళించు [10]సారమేయంబులులుం గలిగి, బలకృష్ణబాహుదండప్రాకార రక్షావిశేషభూషంబైన ఘోషంబుఁ బ్రవేశించి యందు. 1197

క. జలజాంకుశరేఖలు గల హరిపాదములచొప్పుఁ గని మోదముతోఁ
బులకించి రథము డిగి [11]యుత్కలికన్ సంతోషబాష్పకలితాక్షుండై. 1198

---

1. కుటజము - కొండమల్లె, 2. ఇఱుము-మఱుఁగుచోటు, 3. మిఱ్ఱు-మెరక, 4. ఘాసము-గడ్డి. 5. ఊధంబులు-పొదుగులు, 6. తర్ణకంబులు-దూడలు, 7. వాలపు మొత్తంబుల—పాఠాంతరము, 8. కరీషము-ఎండినపేడ, 9. కరాళించు - మొఱుఁగు, 10. సారమేయంబులు-కుక్కలు, 11. ఉత్కలిక-ఉత్కంఠ.

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతుల న్నలంకృతుల నుద్యద్భాసులం బీతనీ
లనవీనోజ్జ్వలవాసులం గుసుమమాలాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్। 1199

క. కని వారల పాదములకు వినయంబున మ్రొక్కె భక్తివివశుం డగుచుం
దనువుల బులకాంకురములు మొనయఁగ నానందబాష్పములు జడిగురియున్. 1200

వ. తదనంతరంబ. 1201

క. అక్రూరులైన జనుల నవక్రగతిం గాచు భక్తవత్సలుఁ డంత
న్నక్రూరుఁ గౌఁగిలించెను జక్రాంకితహస్తతలముఁ జూఁచి నరేంద్రా! 1202

వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైన నతండు గౌఁగిలించి చెట్ట పట్టుకొని
కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి మేలడిగి గద్దియ యిడి పాద ప్రక్షాళనంబు
సేసి మధుపర్కంబు సమర్పించి, గోవు నిచ్చి యాదరంబున రసవదన్నంబు పెట్టించి
తాంబూలగంధమాల్యంబు లొసంగె నయ్యవసరంబున నందుం డుపవిష్టుండైన యక్రూ
రుని సత్కరించి యిట్లనియె. 1203

క. చెలియలు మొఱ యిడ నల్లుర ఖలుఁడై [1]పొరిగొనినయట్టి కంసుఁడు బ్రదుకం
గలదే మనికి [2]దశార్హుల కిలపైఁ? మీసేమ మింక నేమని యడుగన్? 1204

వ. అని పలికె నంత నక్రూరుం డొక [3]పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యి
ట్లనియె, 1205

మ. శుభమే నీకుఁ? బ్రమోదమే సఖులకుం? జుట్టాలకున్ సేమమే?
యభయంబే ప్రజ కెల్ల? గోత్రజుల కాత్మానందమే? మామ ము
క్తభయుండే? వసుదేవ దేవకులు తత్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజనిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై? 1206

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో నీతోడి నేమైన నా
కెఱుఁగం జెప్పుమటంచుఁ జెప్పరు గదా యేమందు? రా వార్త యే
తెఱఁగున్ లేదని డస్సిరో వలచిరో దీనత్వముం జెందిరో
వెఱతో నా తలిదండ్రు లెట్లు వడిరో? విన్పింపు మక్రూరకా! 1207

1. పొరిగొనిన-చంపిన, 2. దశార్హులు; దాశార్హులు - ఒకజాతియాదవులు,
3. పర్యంకంబు-పడక.

వ. మఱియును నీ వేమ గారణంబున వచ్చి? తని హరి యడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధప్రకారంబును గంసుండు దేవకీవసుదేవుల వధియింపన్ గమకించి మానిన తెఱంగును, ధనుర్యాగంబుపేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱింగించిన రామకృష్ణులు నగి తమ్ముఁ బరివేష్టించిన నందాది గోపకులం జూచి కృష్ణం డిట్లనియె. 1208

శా. భూనాథుండు [1]మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ డవ్విభుం
గానం బోవలెఁ బాలు నెయ్యి పెరుఁగుల్ గట్నంబులుం గానికల్
మీనేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ మీమీనివానంబులన్
యానంబుల్ గొని రండు పొండు మధురాయాత్రాభిముఖ్యంబుగన్. 1209

వ. అని నియమించె నంత నక్రూరుండు మధురకు హరి గొనిపోయెడి నని యెఱింగి వ్రేతలు గలఁగి 1210

మ. హరినవ్వుల్, హరిమాటలున్, హరిమనో [2]జ్ఞాలాపముల్. లీలలున్,
హరివేడ్కల్, హరిమన్ననల్, హరికరాబ్జాలంబనాహ్వానముల్
హరిణీలోచన లందఱున్ మఱి యుపాయం బెట్లొకో యంచు లో
[3]నెరియన్ ముచ్చట లాడి రంత [4]గములై యేకాంత గేహంబులన్. 1211

వ. మఱియుఁ దమలో నిట్లనిరి. 1212

ఉ. మేటిగృహస్థు బ్రహ్మయని మిక్కిలి నమ్మితి మమ్మ చూడ నే
పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రు నె
చ్చోట వసింపనీక యొకచోటికిఁ బో విధియించి పిన్న బ
డ్డాటలు చేసె నీదుడుకు లక్కటా! భారతి కైనఁ జెప్పరే! 1213

వ. అని విధిం దూఱుచు మదనతాపాయత్తచిత్తలై. 1214

ఉ. 'రమ్మని చీరినంతన పురంబున కేఁగెడు గాని నన్ను నీ
కొమ్మలు నమ్మినారు, మరుకోలల కగ్గము సేసి పోవఁగా
[5]ముమ్మరమైన తాపముల [6]మ్రొగ్గుదురో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్రమాణము వల్దనరైరి చెల్లరే! 1215

శా. అక్రూరుం డని పేరు పెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం
జక్కన్ మాకడఁ బాపికొంచు నరుగం జర్చించి యేతెంచినాఁ

---

1. మఖంబు-యాగము, 2. జ్ఞాలోకముల్—పాఠాంతరము, 3. ఎరియన్-తపింపఁగా, 4. గములై-గుంపులుగూడి, 5. ముమ్మరము-అధికము, 6. మ్రొగ్గుదురు-వ్రాలుదురు

డక్రూరుం డఁట, క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁ డౌనేని, ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁబెట్టి తనక్రోధం బో విచారింపఁడే? 1216

ఉ. ఫుల్లసరోజలోచనలు పూర్ణసుధాంశుముఖుల్, పురాంగనల్
మెల్లనె యెల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్
సల్లఁగ వారిఁ జూచి హరి సంగతి సేయఁదలంచుఁ గాక వ్రే
పల్లె వసించు ముద్దియలపైఁబడ నేల తలంచు నక్కటా! 1217

క. పురసతుల విలోకనములు సరసాలాపములు, నర్మసంభోగములున్
మరగి హరి మనల నొల్లడు నరవరు లోయమ్మ నూతనప్రియులు గదే 1218

క. పుట్టిన్నఁడు హరి నెఱుఁగని పట్టణసుందరుల కితనిఁ బతిఁ జేసి కడున్
దట్టపు విరహాగ్నులకును [1]గట్టిఁడిదైవంబు ఘోషకాంతల వెదకెన్. 1219

మ. 'హరి నేలా కొనిపోయె' దంచు మన మాయక్రూరుఁ బ్రార్థింతమా?
'హరిఁ బోనీకుఁడు నిల్పరే' యనుచు నేఁ డర్చింతమా పేల్పులన్?
హరిపాదంబుల కడ్డముల్ పడుదమా; 'హా దైవమా!' యంచు నా
తరుణుల్ మేనులుఁ జీరలున్ మఱచి కందర్పజ్వరభ్రాంతలై. 1220

మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్నవల నీ రొండొండ వర్షింపఁగా.
వివశత్వంబులతోఁ గపోలతటసంవిన్యస్తహస్తాబ్జలై
పవనోద్ధూతలతాభలై 'మముఁ గృపం బాలింపు గోవింద! మా
ధవ? దామోదర' యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్. 1221

వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం గృష్ణుండు దనతోడఁ బయనంబునకు గమకించి నడుచు గోపికలను 'మరలివత్తు' నని దూతికాముఖంబున [2]నివర్తించి, శకటంబులందుఁ గానికలు గోరసంబు నిడికొని నందాదులయిన గోపకులు వెనుతగుల నక్రూర [3]చోదితంబయిన రథం బెక్కి మథురాభిముఖుండై చను సమయంబున. 1222

చ. 'అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తేరదె [4]వైజయంతి య
ల్లదె రథఘోటకాంఘ్రి రజ మాడెస మార్గము చూడు' డంచు బో
నాదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్
గదలక [5]నిల్పి చూచి రటు గన్నుల [6]కబ్బినయంతదూరమున్. 1223

వ. ఇట్లు బలభద్రాక్రూరసహితుండై చని. 1224

---

1. కట్టిఁడి-క్రూరమైనది, 2. నివర్తించి-మళ్ళించి. 3 చోదితంబు-త్రోలఁబడినది, 4. వైజయంతి - పతాకము, 4. నిక్కచూచి రటు కన్నులకద్భుతమైన దూరమున్-పాఠాంతరము. 6. అబ్బిన - కానవచ్చిన.

క. అవలోకించెను గృష్ణుఁడు ప్రవిమలకల్లోలపవన భాసితజన్యా
న్నవసన్నపాపసైన్యం గవిజనమాన్యం గళిందకన్యన్ ధన్యన్. 1225

వ. కని తత్కాళిందియందుఁ బరిక్షుణ్ణమణిగణసముజ్జ్వలంబులగు జలంబులు ద్రావి, తరుసమూహసమీపంబున రామసహితుండై కృష్ణుండు రథంబు ప్రవేశించె; నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కాళిందీహ్రదయంబు సొచ్చి విధిపూర్వకంబుగ వేదమంత్రంబుల
జపించుచు. 1226

—: అక్రూరుండు యమునలో రామకృష్ణుల దర్శించి నుతించుట :—

ఉ. స్నానము సేసి చేసి నదిచల్లని నీరను రామకృష్ణులన్
మానుగఁ జూచి 'వీరు రథమధ్యమునన్ వసియించి యున్నవా
రీనదినీరిలోపలికి నెప్పుడు వచ్చి?' రటంచు లేచి [1]మే
ధానిధి సూచె వారిని రథస్థుల భక్తమనోరథస్థులన్. 1227

వ. చూచి వెఱఁగుపడి. 1228

శా. 'కంటిన్ మున్ను రథంబుపై; జలములోఁ గంటిన్ దుదిం గ్రమ్మఱం
గంటిం దొంటిరథంబుమీఁద; నిదె యీ కల్యాణచారిత్రు లే
వెంటం దోఁచిరి రెండుదిక్కుల; మనోవిభ్రాంతియో? నీరిలో
నుం టాశ్చర్యము; చూతు నంచు మఱియు న్మూహించి మగ్నాంగుఁడై. 1229

ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁ డా జలమందుఁ గాంచె స
ద్భాషు సహస్రమస్తకవిభాసితభూషు [2] [3]నహీశు [4]భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీరచమూవిజిగీషు నిత్యసం
తోషు నరోషు నిర్ధళితదోషు ననేకవిశేషు శేషునిన్. 1230

వ. మఱియు నీలాంబరసంయుతుండును. సిద్ధోరగాదిసన్నుతుండునునై యొప్పు నప్పాంప
తేనిం దప్పక కనుంగొని. 1231

సీ. ఆ భోగి [5]భోగపర్యంకమధ్యంబున వలనొప్పు పచ్చని వలువవాని
మేఘంబుపైనున్న మెఱుఁగుచందంబున నురమున శ్రీదేవి యొప్పువాని
మునరు తేఁటులు విప్ప ముఖచతుష్కముగల తనయుఁడాడెడి బొడ్డుఁదమ్మివానిఁ
గదలిన బహుపద్రక్రమవిశేషంబుల రవము సూపెడి నూపురములవాని

---

1. మేధానిధి - గొప్పబుద్ధిమంతుఁడు, 2. మహీశ— పాఠాంతరము, 3. అహీశుఁడు - నాగరాజు, 4. భూమిభృద్వేషుఁడు- రాజవేషము ధరించినవాఁడు, 5. భోగము శరీరము.

ఆ. జలజగర్భరుద్రసనకసనందన [1]సద్ద్విజామర ప్రశస్యమాన
చరితుఁడైనవాని సౌందర్యఖనియైన వాని నొక్క పురుషవర్యుఁ గాంచె. 1232

వ. మఱియును జారులక్షణలక్షితనఖపాదగుల్ఫజానుజంఘోరు కటినాభిమధ్యోదరుండును, సాదరుండును, శ్రీవత్సకౌస్తుభవనమాలికావిరాజితవిశాలవక్షుండును, పుండరీకాక్షుండును, శంఖచక్రగదాపద్మహస్తుండును, సత్త్వగుణ ప్రశస్తుండును, బ్రహ్మసూత్రకటిసూత్రహార కేయూరకటకకంకణకుండల కిరీటాదివిభూషణుండును, భక్తజనపోషణుండును, సుందర కపోలభాలనాసాధరవదన కర్ణుండును, నీలనీరదవర్ణుండును, [2]గంబుకంధరుండును, గరుణా గుణబంధురుండును, బ్రహ్లాదనారదసునందనంద ప్రముఖసంభావితుండును, శ్రీపుష్టితుష్టి కీర్తికాంతీలోర్జావిద్యా విద్యాశక్తిమాయాదిసేవితుండునునై యొప్పు నప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తి సంభ్రమంబు లగ్గలంబులుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె. 1233

దండకము. శ్రీమానినీమానచోరా! శుభాకార! వీరా! జగద్దేతుహేతుప్రకారా! సమస్తంబు [3]నస్తంగతంబై మహాలోలకల్లోలమాలాకులాభీలపాథోనిధిం గూలఁగా, బాలకేళీగతిందేలి నారాయణాఖ్యం బటుఖ్యాతి శోభిల్లు నీనాభి కంజంబులో లోకపుంజంబులం బన్ను విన్నాణియై మన్న యా బమ్మ యుత్పన్నుఁ డయ్యెంగదా! పావకాకాశవాతావనీవార్యహంకార మాయా మహామానసాదుల్ [4]హృషీకాదులున్ లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీమహాదేహమం దుల్లసించున్; వసించున్; నశించున్; జడత్వంబు లేకాత్మయై యొప్పు నీయొప్పిదం బెల్ల నోచెల్ల! చెల్లన్ విచారింపఁదా రెంతవా? రెంతవారైన మాయాదులా మాయతోఁ గూడు క్రీడించు లోకానుసంధాత యాధాత నిర్ణేతయే నీకళారాశికిం గొంద అంభోజగర్భాదు లధ్యాత్మలందు న్నశేషాధిభూతంబులందు న్ననేకాధిదైవంబులందున్ [5]సదా సాక్షివైయుందువంచుం, దదంతర్గతజ్యోతి వీవుండవంచుం, [6]త్రయీపద్ధతిం గొంద ఱింద్రాదిదేవాభిధానంబులన్ నిక్కు చొక్కుండవంచున్, మఱింగొంద ఱారూఢకర్మంబులం ద్రుంచి సంసారముం ద్రెంచి, సన్న్యాసులై మించి విజ్ఞానచక్షుండ వంచున్, మఱిం బాంచరాత్రానుసారంబుగాఁ ద్వన్మయత్వంబుతోఁ గొంద ఱీ వాత్మ వంచున్, మఱిం గొంద ఱా వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వు వాటింతు వంచున్; మఱిన్; నీవు నారాయణాఖ్యుండ వంచున్, శివాఖ్యుండ వంచున్, మఱిం బెక్కుమార్గంబులన్ నిన్ను నగ్గింతు; [7]రెగ్గేమి? యేఱుల్ పయోరాశినే రాసులై కూడు క్రీడన్ విశేషంబు లెల్ల న్నశేషంబులై డింది నీయంద [8]నూనంబు లీనంబులౌ; నేకరాకేందుబింబంబు కుంభాంతరంభఃబులం బింబితంబైన వేఱున్నదే? యెన్న నేలా? ఘటాంతర్గతా కాశముల్ దగ్ధ టాంతంబులం దేకమౌ

1. వందనీయుఁడగుచు వఱలువానిఁ; జతురుఁడైన వాని; వాసవామరాది వంద్యమాన, చరణుఁడైన వాని—పాంఠాంతరములు, 2. కంబువు-శంఖము, 3. అస్తంగతంబు-నశించినది, 4. హృషీకములు - ఇంద్రియములు. 5. సదా - ఎల్లప్పుడు. 6. త్రయీ పద్ధతి - వేదమార్గము, 7. ఎగ్గు - తప్పు, 8. నూనంబు - నిశ్చయముగా.

రేఖ లోకావధిన్ వీఁక నే పోకలంబోక, యేకాకివై యుండు; దీశా! [1]కృశానుండు నెమ్మోము సోముండు భానుండుఁగన్నుల్, దిశల్ గర్ణముల్, భూమి పాదంబు, నంభోనిధుల్ గుక్షి శల్యంబు, లద్రుల్ లతాసాలముల్ రోమముల్, గాలి ప్రాణంబు, బాహుల్ సురేంద్రుల్, ఘనంబుల్ గచంబుల్, నభోవీథి నాభిప్రదేశంబు, రేలుంబగళ్లున్ నిమేషంబు, లంభో జగర్భుండు గుహ్యంబు, వర్షంబు, వీర్యంబు, నాకంబు మూర్ధంబుగా నేకమై యున్న నీమేనిదండం బయోజాతగర్భాండముల్ మండి[2]తోదుంబరానోకహానేకశాఖా [3]ఫలాపూరితా నంతజంతు ప్రకాండంబులీలం బ్రసిద్ధోదరాశిష్ఠ జంతు ప్రకారంబుగా నిండి యుండున్; మహా రూప! నీరూపముల్ వెగ్గలం [4] బుగ్గడింపన్; లయాంభోధిలో మీనుమేనన్ విరోధిన్ నిరో ధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే! త్రుంచవే కైటభ శ్రీమధుం? జక్రివై మొత్తవే? యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ, గూర్మలీలాపరిష్పందివై? పందివై మేదినిన్ మీఁదికిం ద్రోచి దోషాచరుం గొమ్ములన్ నెమ్ములన్ జిమ్ముచున్ గ్రువ్వవే త్రవ్వవే ఘోర వైరిన్ నృసింహుండవై? దండివై దండి [5]వైరోచనిం జూచి యాచింపవే? పెంపవే మేను బ్రహ్మాండమున్నిండఁ? బాలుండవై రాజకోటిన్ విపాటింపవే? రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే? నొంపవే క్రూరులన్ వాసుదేవాదిరూపంబులన్? శుద్ధబుద్ధుండవై వైరిదారాంతరంగంబుల న్నంతరంగంబులుంగా గరంగింపవే? పెంపు దీపింపవే కల్కి మూర్తిం బ్రవర్తించి? ని న్నెన్న నే నెవ్వఁడన్? నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రసన్నుండవై భిన్నతంబాపి మన్నింపవే! పన్నగాధీశతల్పా! కృపాకల్ప! వందారుకల్పా సమస్తే నమస్తే నమస్తే నమః, 1234

మ. కలలం బోలెడి పుత్రమిత్రవనితాగారాదిసంయోగముల్
[6]జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయుచందంబునం
దలఁతున్ సత్యము లంచు; మూఢుఁడ; వృథాతత్త్వజ్ఞుఁడన్; నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ! 1235

వ. అని మఱియును వినుతింప నక్రూరునికి యమునాజలంబులలోనన తనమొదలిమేను సూపి చాలించి నటునికైవడిం [7]దిరోహితుం డైన నక్రూరుండు నీరు వెడలి వెఱంగుపడుచు వచ్చి రథారోహణంబు సేసిన హరి యిట్లనియె. 1236

క. 'జలములు చేరువ నున్నవి; తలపోయఁగ నీవు పోయి తడ వయ్యె! నదీ
జలముల నభమున ధరణిం గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే? 1237

వ. అనిన నతం డి ట్లనియె. 1238

---

1, కృశానుండు - అగ్ని, 2. ఉదుంబరము - మేఁడి, 3. జరజ్జంతు సంఘాతలీల న్నసంఖ్యాతముల్ నిండియుండన్—పాఠాంతరము, 4. ఉగ్గడింపన్ కొనియాడఁగా, 5. వైరోచని - బలిచక్రవర్తి, 6. జలధారల్ సరినెండ—పాఠాంతరము, 7. తిరో హితుండు - మాయమైనవాఁడు,

క. 'నీలోన లేని చోద్యము లే లోకములందుఁ జెప్పు; రీశ్వర! నీటన్
నేలన్ నింగిని నున్నవె? నీలోఁ జోద్యంబు లెల్ల నెగడె మహాత్మా!' 1239

వ. అని పలికి సాయంకాలంబునకు నక్రూరుండు మధురానగరంబు సేర రథంబు గడపె; నంత నటమున్న చని నందాదులు పురోపవనంబున విడిసి యుండ వారలంగూడికొని కృష్ణుం డక్రూరునిం జూచి 'నీవు రథంబు గొనుచు నగరంబునకుం జనుము; మేము వెనుక వచ్చెద' మనిన నతం డిట్లనియె. 1240

క. 'నాయింటికి విచ్చేయుము; నీయంఘ్రిసరోజరేణునికరము సోఁకన్
నా యిల్లు పవిత్రం బగు శ్రీయుత! నీభటునిఁ బెద్ద సేయం దగదే?' 1241

వ. అని మఱియుఁ బ్రార్థించిన హరి యిట్లనియె. 1242

—: శ్రీకృష్ణమూర్తి మధురానగరప్రవేశము సేయుట :—

క. యదుకుల [1]విద్వేషణుఁడై మదమున వర్తించు కంసు మర్దించి భవ
త్సదనంబుఁ జూడ వచ్చెదఁ [2]బొద యీ స్యందనము గొనుచుఁ బురమున కనఘా! 1243

వ. అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని 'రామకృష్ణులు వచ్చి'రని కంసున కెఱింగించి తన గృహంబునకుం జనియె; నంత నపరాహ్ణంబున బలభద్ర గోపాల సహితుండై కృష్ణుండు. 1244

మ. [3]పరిఖల్ గోటలుఁ గొమ్మలుం [4]బడగలుం బ్రాసాదముల్ వీథులున్
హరులుం దేరులు వీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ [5]దీర్ఘికల్
గర మాశ్చర్యరుచిం దనర్చు మధురన్ గాంచెన్ విభుం డంతటన్. 1245

వ. కని యప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున. 1246

ఉ. 'నందతపఃఫలంబు సుగుణంబులపుంజము గోపకామినీ
బృందమునోముపంట సిరివిందు దయాంబుధి యోగిబృందముల్
డెందములందుఁ గోరెడు [6]కడింది నిధానము సేరవచ్చె నో
సుందరులార! రండు చని చూతము కన్నులకోర్కి దీఱఁగన్.' 1247

వ అని మఱియు గోవిందసందర్శనకుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయమానలై [7]భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు, శయానలై లేచియు,

---

1. విద్వేషణుఁడు - విరోధి, 2. బొద - బొమ్మ, 3. పరిఖల్ - అగడ్తలు, 4. పడగలు - పతాకములు, 5. దీర్ఘికల్ - దిగుడుబావులు, 6. కడింది నిధానము - గొప్పనిధి, 7. భుంజానలు - భుజించుచున్నవారు.

[1]నభ్యజ్యమానలై జలంబు లాడకయు, గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజనబిభ్రాణలై డించియు, [2]నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణమాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి.

క. వీటఁ గల చేడె లెల్లను హాటకమణిఘటితతుంగహర్మ్యాగ్రములం
[3]గూటువలు గొనుచుఁ జూచిరి పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్. 1249

సీ. 'వీఁడటే రక్కసి [4]విగతజీవఁగఁ జన్నుఁబాలు ద్రావిన మేటిబాలకుండు!
వీఁడటే నందునివెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు!
వీఁడటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన [5]దాఁపరీఁడు!
వీఁడటే యలయించి వ్రేతలమానంబు సూఱలాడిన లోకసుందరుండు!
తే. వీఁడు లే కున్నపుర మటవీస్థలంబు వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము వీనిఁ జూడనిచూడ్కులు [6]వృథలు వృథలు! 1250

మ. చెలియా! గోపిక లీ కుమారతిలకుం జింతిందుచుం బాడుచుం
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షించుచున్ హస్తగా
మలక క్రీడకుఁ దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ
దొలిజన్మంబుల నేమి నోఁచిరొకదే దుర్గప్రదేశంబునన్ ?' 1251

క. అని మఱియుఁ బౌరకాంతలు మనుకొని హరిరూప నేత్రముల వెంటను లోఁ
గొని తల్చిరి హృదయములను జనిత ప్రమదమున విరులు సల్లుచు నధిపా! 1252

వ. మఱియును. 1253

క. నానావిధగంధములుఁ బ్రసూనఫలాదులును హరితశుభలాజములుం
గానిక లిచ్చుచు విప్రులు మానుగఁ బూజించి రా కుమారోత్తములన్. 1254

వ. ఆ సమయంబున నగరద్వారంబుననుండి వచ్చు [8]రాగకారుం డగు నొక్క రజకుంగని హరి యిట్లనియె. 1255

—: { శ్రీకృష్ణుండు రజకుని జంపి వాయకసుదాము లొసంగు పూజల నంగీకరించి మేలొసంగుట } :—

ఉ. విందులమై నరేశ్వరునివీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచి పటంబు లేవు నీ [9]ముడిన్

1. అభ్యజ్యమానలు - తలయంటి పోసికొనుచున్నవారు, 2 అలంకుర్వాణలు - అలంకరించుకొనుచున్నవారు, 3. కూటువలు-గుంపులు, 4. విగతురాలుగ—పాఠాంతరము, 5. దాఁపరీఁడు-చోరుఁడు, 6. వృథలు - వ్యర్థములు, 7. దుర్గము - అడవి, 8. రాగకారుండు - మాత్సర్యముకలవాఁడు, 9. ముడి - మూట.

సుందరధౌతచేలములు శోభిలుచున్నవి తెమ్ము నిన్ను మే
లందెదు నిమ్ము రాజుదెస నల్లుర మో రజకాన్వయాగ్రణీ! 1256

వ. అనిన రోషించి వాఁ డిట్లనియె. 1257

శా. ఎట్టెట్టా! మనుజేంద్రుచేలములు మీ కీఁ బాడియే? మీరలుం
గట్టం బోలుదురే? పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనెఁ గాక గొల్లలకు మీ కెబ్భంగి నోరాడెడిన్?
గట్టా! ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా! 1258

క. మా రాజుసొమ్ముఁ గైకొన నే రాజులు వెఱతు రింత [1]యెల్లిదమే నీ?
కీ రాజరాజగృహమున నీ [2]రాజస మేల? గొల్ల! యేఁగుము తలఁగన్. 1259

వ. అనిన విని రోషించి. 1260

క. ఘోరకరాగ్రతలంబున ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెం
బౌరుల గుండెలు వగులఁగ వీరోద్రేకిన్ మదావివేకిన్ జాకిన్. 1261

వ. ఇట్లు భగ్నుండైన రజకుని జూచి వానివారలు [3]పటంబులు డించి వెఱచి పఱచిన రామ
కృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి కొన్ని గోపకుల కొసంగి చనుచుండ. 1262

క. అంతట నొక [4]వాయకుఁ డా క్రంతన్ వసుదేవసుతులఁ గని బహువర్ణా
త్యంతమృదుపటాభరణము లెంతయు సంతసముతోడ నిచ్చెన్ మెచ్చన్. 1263

శా. కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబు గావించి శృం
గారోదంచితదిగ్గజేంద్రకలభాకారంబులం బొల్చి రా
ధీరుల్ మాధవుఁ డంత వాయకుని శుశ్రూషన్ మహాప్రీతుఁడై
సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగె నైశ్వర్యాది [5]సంధాయియై. 1264

వ. అంత నా రామకృష్ణులు సుదాముండను మాలాకారు గృహంబునకుఁ జనిన నతండు గని
లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన యర్ఘ్యపాద్యాదికంబు లాచరించి సానుచరులయిన వార
లకుఁ దాంబూలకుసుమగంధంబు లొసంగి యిట్లనియె. 1265

ఉ. 'పావన మయ్యె నా కులము పండెఁ దపంబు గృహంబు లక్ష్మికిన్
సేవిత మయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదానమూర్తులై
భూవలయంబు గావ నిటు వుట్టిన మీరలు రాకఁజేసి నే
నేవిధ మాచరింతుఁ? బను లెయ్యవి? బంట; నెఱుంగఁ జెప్పరే! 1266

1. ఎల్లిదము - చులకన, 2. రాజసము - అహంకారము, 3. పటంబులు - వస్త్రములు, 4. వాయకుఁడు - సాలె, 5. సంధాయి - కూర్చువాఁడు.

వ. అని పలికి. 1267

క. దామోదరరాముల కుద్దామయశోహసితతుహినధాములకు వధూ
కాములకుఁ దెచ్చి యిచ్చె సుదాముఁడు ఘనసురభికుసుమదామము లధిపా! 1268

క. వారును మాలికుఁ డిచ్చిన భూరికుసుమదామములను భూషితులై 'నీ
కోరినవర మిచ్చెద' మని కారుణ్యము సేయ నతఁడు గని యిట్లనియెన్. 1269

క. 'నీ పాదకమలసేవయు నీపాదార్చకులతోడి [1]నెయ్యమును నితాం
తాపార భూతదయయును దాపసమందార! నాకు దయసేయఁగదే!' 1270

వ. అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుం డమ్మాలికునకు బలాయుఃకాంతికీర్తిసంపద
లొసంగి వానిగృహంబు వెడలి రాజవీథిం జని చని. 1271

క. ఆ నలినాక్షుఁడు గాంచెను నానాలేపముల [2]భాజనము సేకొనుచుం
బూని చనుదెంచుదానిని నాననరుచినిచయవినమితాబ్జుం గుబ్జన్. 1272

వ. కని యిట్లనియె. 1273

క. 'ఎవ్వరిదానవు ? లేపము లెవ్వరికిం గోరి కొనుచు నేఁగెదు? నీపే
రెవ్వతె' మా కిమ్మన్నియు [3]నివ్వటిలెదు చక్క నగుచు నీరజనేత్రా! 1274

వ. అనిన నయ్యబల యిట్లనియె. 1275

ఉ. చక్కనివాఁడవౌదు సరసంబుల నొంపకు మెల్లవారికిన్
జక్కఁదనంబు లెక్క డివి? చారుశరీర! త్రివక్ర యండ్రు నే
నిక్కము కంసుదాసిని వినిర్మలలేపనవిద్యదాన; నన్
మిక్కిలి రాజు మెచ్చుఁ దగ మీరు విలేపనముల్ ధరింపరే?' 1276

క. అని పలికి యా కుమారుల తనువులు నగవులును [4]వీక్షితమ్ములు మాటల్
దన చిత్తముఁ గరఁగించిన ననులేపము లిచ్చె వారి కబల ప్రియముతోన్. 1277

సీ. ఇవ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు లన్నియుఁ దాను దేహమున నలఁది
కొని ప్రసన్నతనొంది కుబ్జమువ్వంకల యొదలు సక్కఁగ నొత్తి యునుపఁదలఁచి
తత్పదంబుల మీఁదఁ దన పదంబులు ద్రొక్కి హస్తాంగుళ ద్వయ మబల [5]గౌద
క్రింద విప్పుగ నిడి కృష్ణుఁడు మీఁదికి నెత్తిన వక్రత లెల్ల మాని

1. నెయ్యము - స్నేహము, 2. భాజనము - పాత్రము, 3. నివ్వటిలెదు - ప్రకాశించెదవు, 4 వీక్షితమ్ములు - చూపులు, 5. గౌద-గడ్డము.

ఆ. చక్కనైన చిత్రజన్మబాణము క్రియఁ గొమరు మిగిలి పిఱుఁదు గుచయుగంబు
సొంపు సేయఁ దరుణి సుందరమూర్తియై కమలనయనుఁ జూచి కాంక్షతోడ. 1278

క. 'వెంచేయుము నాయింటికిఁ బంచశరాకార!' యనుచుఁ బైకొం గాక
ర్షించి హరిఁ దిగిచెఁ గామిని పంచాశుగబాణజాలభగ్నహృదయయై. 1279

క. కామిని [1]తిగిచినఁ గృష్ణుఁడు రాముని వీక్షించి నగుచు 'రాజాననః మత్కా
మితముఁ దీర్చి పిదపన్ నీ మందిరమునకు వత్తు నేఁ డలుగకుమీ;' 1280

వ. అని వీడుకొలిపి కృష్ణుండు [2]విపణిమార్గంబునం జని చని తాంబూలమాలికా గంధంబు
లును బహువిధంబులయిన కానికలును పౌరు లిచ్చినఁ బరిగ్రహించుచు ధనుశ్శాల కరిగి
యందు. 1281

క: సురరాజువింటికై వడి గురుతరమై భూరివీరగుప్తంబయి దు
స్తరమైన విల్లు పొడగని నరులు వల దనంగ బట్టు నగి వికసితుఁడై. 1282

శా. బంధుల్ మే లన వామహస్తమునఁ జాపం బెత్తి, మౌర్వీలతా
సంధానం బొనరించి కొంచెపుఁదెగన్ శబ్దించుచున్ ధీరతా
సింధుం డా హరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్ చూడఁగా
గంధేభంబు [3]రసాలదండము నొగిన్ ఖండించుచందంబునన్ 1283

క. కోదండభంగనిర్గత నాదము వీనులకు భీషణంబయి యాశా
రోదోంతరములు నిండుచు భేదించెన్ భోజవిభుని [4]బింకము నధిపా! 1284

వ. అప్పుడు, 1285

ఉ. '[5]అద్దిర! రాచవిల్ విఱిచె నర్భకుఁ డెంతయు శంక లేక నేఁ
డుద్దవిడిన్ సహింపఁ దగ దుగ్రతఁ బట్టుఁడ' మంచుఁ గ్రుద్ధులై
గ్రద్దన లేచి తద్ధనువు కావలివా రరుదేర వారి న
య్యిద్దఱుఁ గూడి పట్టి మడియించిరి కార్ముకఖండహస్తులై. 1286

వ. అట్లు రామకృష్ణులు మథురాపురంబున విహరించి వెడలి విడిదలకుం జని రంత. 1287

—: సూర్యాస్తమయ చంద్రోదయముల వర్ణనము :—

మ. గగనారణ్యచరాంధకారగజముం గాలాహ్వయవ్యాధుఁ డ
చ్చుగఁ బట్టన్ గమకించి మచ్చిడుటకై చూతాంకురశ్రేణిచే

1. తిగిచిన-లాగఁగా. 2. విపణి - అంగడి, 3. రసాలదండము - చెఱకుగడ,
4. బింకము-ధైర్యము, 5. అద్దిర-ఆశ్చర్యము.

నాగిఁ గల్పించిన కందుకం బనఁగ సూర్యుం డంత వీక్షింపగాఁ
దగె మందప్రభతోడఁ బశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్. 1288

క. తరుణుఁడగు శీతకరునిన్ మరగి వియల్లక్ష్మి దన్ను మాని ముదుకఁడున్
[1]ఖరకరుఁడు ననుచు ద్రొబ్బిన కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా! 1289

ఆ. కళలు గలుగుఁగాక కమల [2]తోడగుఁగాక! శివునిమౌళిమీఁదఁ జేరుఁగాక
నన్యు నొల్లఁ దపనుఁ డైన మత్పతి యని సాధ్వి భంగిఁ గమలజాతి మొగిడె. 1290

క. సుందరసాయంసంధ్యా వందనవిప్రార్ఘ్యతోయవజ్రహతోద్య
న్మందేహాసురరక్త స్యందము క్రియఁ గెంపుసొం పొసఁగె నపరదిశన్ [3]. 1291

ఆ. భూమి నిండి మింటఁ బూర్ణమై కర్కట మకర మీనరాశి మహితమైన
హరియశస్సుధాబ్ధియందలితుంపురు లనఁగ జుక్క లొప్పె నాకసమున. 1292

క. ఎల్లదిశలు నిండిన శ్రీవల్లభుగుణమహిమ బ్రహ్మ [4]వాసించుటకై
చల్లిన మృగమద మనఁగా వెల్లివిరిసెఁ దమము గగనవీథుల నెల్లన్. 1293

క. ఆ చీఁకటి వెనుతగిలినఁ బ్రాచీదిశనుండి గంతుఁబరువున రవి [5]భ
ర్మాచలము మలఁకఁ ద్రోవను వే చనియెంగాక నిలిచి విఱుగక యున్నే? 1294

ఉ. మీకును వైరి యెప్పుడును మిక్కిలి మాకును వైరి; రాజు దో
షాకరుఁ డింక వచ్చు జలజాతములార మదీయబాలురం
జేకొనుఁ డంచు బాలకులఁ జీఁకటి దాఁచినభంగిఁ జిక్కి రా
రాక వసించెఁ దుమ్మెదలు రాత్రి సరోరుహ [6]కుట్మలంబులన్ 1295

సీ. ప్రాచీదిశాంగనాఫాలతలంబున దీపించు సిందూరతిలక మనఁగ
దర్పించి విరహులధైర్యవల్లులు ద్రెంప దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ
నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగఁ
గగనతమాలవృక్షముతూర్పుకొమ్మను లలితమై మెఱయు పల్లవ మనంగఁ
ఆ. దొగలు సంతసిల్ల, దొంగలు భీతిల్లఁ [7]గడలి మిన్నుముట్టి కడలుకొనఁగఁ
బొడిచె శీతకరుఁడు భూరిచకోరక ప్రీతికరుఁడు జారభీతికరుఁడు. 1296

---

1. ఖరకరుఁడు-వాఁడికిరణములు (కరములు)కలవాఁడు, 2. తోడు-సహాయము; సోదరి, 3. విప్రులు సంధ్యాసమయములలో విడుచు నర్ఘ్యజలబిందువులు మందేహులను రాక్షసులను వజ్రములై బాధించునని ప్రసిద్ధి, 4. వాసించుట-పరిమళించుట, 5. భర్మాచలము-మేరుపర్వతము, 6. కుట్మలంబులు-మొగ్గలు, 7. కడలి-సముద్రము.

క. దర్పితతారాధిపపరిసర్పితకిరణౌఘమిళితసకలదివంబై
యేర్పడి కమలభవాండము గర్పూరపు [1]గ్రోవిభంగిఁ గనుపట్టె నృపా! 1297

క. ఆరేయి గోపయుతులై క్షీరాన్నము గుడిచి రామకృష్ణులు మదిఁ గం
సారంభ మెఱిఁగి యిష్టవిహారంబుల న్రప్రమత్తులై యుండి రిటన్. 1298

క. తనపురికి రామకృష్ణులు సనుదెంచి నిజానుచరులఁ జంపుటయు మహా
ధనువు గదిసి విఱుచుటయును విని కంసుఁడు నిద్ర లేక [2]విహ్వలమతియై. 1299

సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలిప్రాణఘోషము వినఁబడక డిందెఁ
దోయాదికములందుఁ దొంగిచూచినయంతఁ దల గానరాదయ్యె దనువుమీఁదఁ
[3]గరశాఖ నాసికాగ్రంబుపైఁ నిడిచూడ గ్రహతారకలు రెండుగా నగపడె
వెలుఁగున నిలుచుండి వీక్షింపగా మేనినీడ సరంధ్రమై నేలఁ దోఁచె
ఆ. నడుగుజాడ [4]దృష్టమౌట లే దయ్యెను దరువులెల్ల హేమతరువు లగుచు
మెఱయుచుండెఁ గాలమృత్యువు దగ్గఱ బుద్ధి యెల్లఁ గలఁగె భోజపతికి. 1300

క. గరళముఁ దినుటయుఁ బ్రేతముఁ బరిరంభించుటయు నగ్నభావుఁడవుటయున్
శిరమునఁ దైలము వడుటయు ఖరపతి నెక్కుటయు నతఁడు కలలోఁ గనియెన్ 1301

వ. మఱియు రక్తకుసుమమాలికాధరుండై యొక్కరుండ నెక్కడనేనియుం జనుచున్నవాఁడ
నని కల గాంచి మరణహేతుకభ్రాంతిఁ జింతాక్రాంతుండై నిద్రఁజెందక వేగించుచున్న
సమయంబున. 1302

-: సూర్యోదయ వర్ణనము :-

క. అరుణహరినఖరవిదళిత గురుతిమిరేభేంద్రకుంభకూటవినిర్ము
క్తరుధిరమౌక్తికములక్రియ సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్. 1303

సీ. [5]పౌలోమి దనబాలుపాన్పుపైఁ గనుపట్టఁ బన్నిన పవడంపుబంతి యనఁగ,
నాయురర్థములవ్యయంబు లొత్తిలి చాటు కాలజాంఘికుచేతిఘంట యనఁగ,
ఘనజంతుజీవితకాలరాసుల విధి కొలువ నెత్తిన హేమకుంభ మనఁగ,
బశ్చిమదిక్కాంత పరఁగఁ గై సేయుచో ముందట నిడుకొన్న [6]ముకుర మనఁగఁ.
తే. గోకతాపోపశమ దివ్యఘటిక యనఁగఁ బద్మినీకాంతనోముఫల మనంగ
మూఁడు మూర్తులసారంపుముద్ద యనఁగ [7]మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె. 1304

---

1 క్రోవి-బరణి. 2. విహ్వలమతి- కలఁతపడినమనస్సు కలవాఁడు, 3. కరశాఖ-వ్రేలు, 4. దృష్ట ము-కనబడునది, 5. పౌలోమి - శచీదేవి, 6. ముకురము - అద్దము, 7. మిహిరుఁడు - సూర్యుఁడు.

క. వచ్చెం జల్లనిగాడ్పులు; విచ్చెం గమలములు; దమము [1]విరిసి బిలంబుల్
చొచ్చెం; బద్మమరందము మెచ్చెం దుమ్మెదలు గ్రోలి ; మిహిరుఁడు వొడమన్. 1305

క. సంకాశితోదయాచలపంకజసఖకిరణరాగపరిపూర్ణంబై
పంకేరుహగర్భాండము కుంకుమసలిలంపుఁగ్రోవి కొమరున నొప్పెన్. 1306

వ. తదనంతరంబున. 1307

సీ. పాషాణ [2]వల్మీక పంకాదిరహితంబుమృదులకాంచననిభ [3]మృణ్మయంబు,
గమనీయకస్తూరికాజలసిక్తంబు, బద్ధచందనదారుపరివృతంబు,
మహనీయకుసుమదామధ్వజతోరణమండితోన్నతమంచమధ్యమంబు,
బ్రాహ్మణక్షత్త్రాది పౌరకోలాహలం, బక్రాంతతూర్యత్రయాంచితంబు.
ఆ. నిర్మలంబు, సమము, నిష్కంటకంబునై, పుణ్యపురుషమనముఁబోలి కంస
సైన్యతుంగ మగుచు సంతుష్టలోకాంతరంగమైన మల్లరంగ మొప్పె. 1308

క. ఆ మల్లరంగ పరిసరభూమిస్థితమంచమందు భోజేంద్రుఁడు మా
న్యామాత్యసంయుతుండై భూమిశులు గొలువ నుండెఁ [4]బొక్కుచు నధిపా ! 1309

మ. సకలాంభోనిధి మేఖలావహనముం జాలించి యేతెంచు నా
గకులాగంబులభంగి నొప్పుచుఁ దగం గై సేసి చాణూరము
ష్టికకూటుల్ శలతోసలుల్ గురువులన్ సేవించుచున్ [5]రంగధా
త్రికి నేతెంచిరి తూర్యఘోషముల నుద్రేకం బనేకంబుగన్. 1310

క. నందాదులైన గోపకు లందఱుఁ జని కానుకలు సమర్పించి నృపున్
సందర్శించి తదనుమతిఁ జెంది మహామంచముల వసించిరి వరుసన్. 1311

వ. అంత రామకృష్ణులు నలంకృతులై మల్లదుందుభినినదంబు విని సందర్శనకుతూహలంబున

క. ఓడక రంగద్వారము జాడం జని వారు కనిరి సమదకువలయా
పీడంబున్ భిన్నపరాక్రీడంబుం బ్రమదకంటకిత చూడంబున్. 1313

వ. కని తత్కరిపాలశ్రేష్ఠుండైన యంబష్ఠునికి మేఘనాథగంభీరభాషణంబుల రిపు భీషణుండగు
హరి యిట్లనియె. 1314

## -: శ్రీకృష్ణుండు కువలయాపీడ మను గజంబును వధించుట :-

శా. ఓరీ ! కుంజరపాల ! మా దెసకు నీయుద్యన్మదేభేంద్రముం
బ్రేరేఁపం బనిలేదు; త్రిప్పు; మరలం బ్రేరేఁచినన్ నిన్ను గం

1. విరిసి - తొలఁగి, 2. వల్మీకము-పుట్ట, 3. మృణ్మయంబు-మట్టితోఁగూడినది,
4. పొక్కుచు - విచారించుచు, 5. రంగధాత్రి - రంగభూమి.

భీరో గ్రాశనితుల్యముష్టిహతులన్ భేదించి నేఁ [1]దంతకుం
జేరం బుత్తు మహత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్. 1315

వ. అని పలికి 1316

ఉ. మించినకొప్పుఁ జక్కనిడి, మే లనఁ బచ్చనిచీర కాసె బం
ధించి, లలాటకుంతలతతిన్ మరలించుచు, [2]సంగర క్రియా
చుంచుతఁ బేర్చి, బాలకుఁడు చూచు జనంబులు దన్ను 'బాపురే !'
యంచు నుతింప దగ్గఱియె హస్తజితాగము గంధనాగమున్. 1317

క. [3]అంజక, బాలకుఁ డనియును, [4]గొంజక దయ మాలి రాజకుంజర ! యంతం
గుంజరమును దీకొలిపెను, గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్. 1318

వ. మఱియు [6]నయ్యనేక పం [7]బనేక పపాలకప్రేరితంబయి, మహావాతసంఘాత సముద్ధూతం బగు విలయకాలకీలికేళిని బిట్టు మిట్టిపడి, మృత్యుదేవతయెత్తునం, గాలుపోలిక, శమనుని గమనిక నెదిరి, మదసలిల పరిమళలుబ్ధపరిభ్రమద్భ్రమర గాయక ఝుంకృతు లహంకృతి సంపాదింపం, గుల కుంభినీధరగుహాకుంభ కుంభనంబుగా ఘీంకరిరచి, రోషభీషణ శేష భోగిభోగ భయంకరంబగు కరంబున శౌరిం జీరి, చీరికింగొనక, పట్టిన నట్టిట్టు గెంటి, [2]విధుంతువదన గహ్వరంబువలన విడివడియుఱుకు తరణికరణి దర్పించి కుప్పించి, పాద మధ్యంబునకు నసాధ్యుండై దూఁటి, మాటుపడినం, గ్రోధబంధురంబై సింధురంబు మహార్ణవమధ్యమంథాయమాన మంథర మహీధరంబుకై వడి జిఱ జిఱం దిరిగి, కానక భయాన కంబై గాలివెరవునం గని పొంగ చెంగటం బ్రళయ [3]దండిదండప్రశస్తంబగు హస్తంబు వంచి వంచించి చుట్టిపట్టి పడ ద్రేయం గమకించినం జలింపక తెంపున హరి కరిపిఱింది కుఱికి మహారాహువాలవల్లి కాకర్షణోదీర్ణుం డగు సుపర్ణు తెఱంగున నెగిరి ఖుండాలంబు వాలంబులీలం గేల నొడిసిపట్టి జళిపించి పంచవింశతిబాణాసన ప్రమాణదూరంబు బీరంబు నం ద్రిప్పివైవ. నవ్వారణంబు దుర్నివారణంబై రణంబున [4]కోహటింపక సవ్యాపసవ్య పరిక్రమణంబుల నవక్రంబై కవిసిన, నపసవ్యక్రమంబుల దప్పించి, రొప్పి [5]కుప్పించి యెదుర్కొనినఁ గర్కశుండయి, మేచకాచలతుంగశృంగనిభం బగు కుంభికుంభంబు చక్కటి వ్రక్కలై చెక్కలెగయ దురంతకల్పాంతజీమూత ప్రభూతనిర్ఘాతనిష్ఠురం బగు ముష్టి సారించి [6]యాఁచి పొడిచినం దద్వికీర్ణరక్తసిక్తమౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగరక్త తారకాచ్ఛన్నం బగుమిన్ను చె న్నలవరింప నిలువరింపక మ్రొగ్గి మోఁకరిలి,

2. అంతకుండు - యముఁడు, 3. సంగరము - యుద్ధము, 4. అంజక - భయ దక, 5. కొంజక - సంశయింపక, 6, అనేకపంబు - ఏనుఁగు, 7. అనేకపపాలకుఁడు - మావటీఁడు, 1. కుంభినీధరము - పర్వతము, 2. విధుంతుదుఁడు - రాహువు, 3. దండి- యముఁడు, 4. ఓహటింపక - వెనుదీయక, 5. కుప్పలు× - పాఠాంతరము, 6. ఘూఁచి- పాఠాంతరము.

మ్రొగ్గక దిగ్గన నగ్గజంబు లేచి, చూచి, త్రోచి నడచి, సంహార సమయసముద్రసంఘాత
సంఘాతసముత్తుంగ భంగ సంఘటితంబగు కులాచలంబు క్రియఁ గ్రమ్మర నమ్మహాభుజుని
భుజాదండంబులవలన ఘట్టితంబై, కట్టలుకముట్టి నెట్టుకొనుముమ్మరంబునం గొమ్ములం
జిమ్మిన, నమ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తిసంగరంబునఁ గరంబొప్పి దప్పింబడక
నొప్పించిన, నకుంఠిత కాలకంఠకఠోరభల్లభగ్నంబగు పురంబు పగిది జలధిం జటుల
ఝంఝానిలవికలంబగు కలంబుకైవడి, నమ్మదకలంబు బలంబు దక్కి చిక్కి స్రుక్కిపడి
లోభికరంబునుంబోలె దానసలిలధారావిరహితంబై, విరహితలంపునుంబోలె నిరంతరచిత్ర
జాతవిగ్రహంబై, గ్రహణకాలంబునుంబోలెఁ బరాధీన ఖరకరంబై, ఖరకరోదయంబునుం
బోలె, భిన్న [1]పుష్కరంబై, పుష్కరవైరివిలసనంబునుంబోలె నభాసితపద్మకంబై యున్న
సమయంబున. 1319

శా. కాలం ద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ, గంఠీరవేంద్రాకృతిం
గేలన్ భీషణదంతముల్ వెఱికి సంక్షీణంబుగా మొత్తి గో
పాలగ్రామణి వీరమౌళిమణియై ప్రాణంబులం బాపె నా
శైలేంద్రాభముఁ బ్రాణలోభము నుందచత్సారగంధేభమున్. 1320

వ. మఱియు దంతిదంతతాడనంబుల దంతావళపాలకులం [2]గాలుప్రోలి కనిపి తత్ప్రదేశంబు
వాసి. 1321

మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్, ఘర్మాంబువుల్ మోములన్
[3] నెరయం గోపకు లంత నంత మలయన్ నిత్యాహవ [4]స్థేము లా
హరిరాముల్ సనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా
మరమర్త్యాదిజనాంతరంగము లసన్మల్లావనీరంగమున్. 1322

సీ. మహితరౌద్రంబున మల్లుర కశనియై నరుల కద్భుతముగ నాథుఁ డగుచు,
శృంగారమునఁ బురస్త్రీలకుఁ గాముఁడై, నిజమృత్యువై కంసునికి భయముగ,
మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై తండ్రికి దయరాఁగఁ దనయుఁడగుచు,
ఖలులకు విరసంబుగా దండియై గోపకులకు హాస్యంబుగాఁ గులజుఁ డగుచు,
ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై, శాంత మొనర యోగిజనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు భాసిల్లె బలునితో మాధవుండు రంగమధ్యమందు. 1323

వ. అప్పుడు. 1324

క. చచ్చిన కుంభీంద్రంబును వచ్చిన బలమాధవులను వరుసం గని తా
నొచ్చిన చిత్తముతోడుతఁ జెచ్చెరఁ గడు వెఱచె భోజసింహుం డధిపా! 1325

1. పుష్కరము - తామర, 2. కాలుప్రోలు-యమునిపట్టణము, 3. నెరయన్-వ్యాపింపఁగా, 4. స్థేములు-బలముకలవారు.

ఉ. ధీరుల, వస్త్రమాల్యమణిదీప్త విభూషణధారులన్, మహా
కారుల, సర్వలోకశుభకారుల, మానవమానినీమనో
హారుల, రంగభూతలవిహారుల, గోపకుమారులన్, మహా
వీరులఁ జూచి చూచి తనివిం దుదిముట్టక లోకు లందఱున్. 1326

ఉ. సన్నుత రామకృష్ణముఖచంద్ర మయూఖ సుధారసంబులం
గన్నులఁ ద్రావుచందమునఁ గాంచుచు జిహ్వల నంటి చూచు లీ
ల న్నుతి సేయుచుం గరములం బరిరంభము సేయుభంగి, న
త్యున్నతిఁ జూపుచుం, దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్ 1327

క. వసుదేవు నివాసంబున వసుధన్ రక్షింప వీరు వైష్ణవతేజో
లసనమునఁ బుట్టినారఁట పసిబిడ్డ లనంగఁ జనదు పరదేవతలన్. 1328

సీ. చంపి రక్కసిఁ బట్టి: చక్రవాకునిఁ గూల్చెఁ; బద ద్రొబ్బె మద్దుల: బకుని జీరె;
నఘదైత్యుఁ బొరిగొనె; నదరి వత్సకుఁ ద్రుంచె; గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందుపఱిచె;
గాళియు మర్దించె: [1]గహనానలముఁ ద్రావెఁ గేసి నంతకుపురిఁ జేర్చె కనిచె;
మయుపుత్రుఁ బరిమార్చె; మఱియును దానవ భటుల మర్దించ గోపకులఁ గాచె;
తే. గోపకాంతల మనములఁగోర్కిఁ దీర్చె; నీ సరోరుహలోచనుం, డీశుభాంగుఁ,
డీ మహామహుఁ డీ దిగ్గజేంద్రనిభుఁడు, మనుజమాత్రుండె? తలపోయ మాధవుండు. 1329

—: శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికులను వధించుట :—

వ. అని పలుకుచుఁ బౌరజనులు సూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డిట్లనియె. 1330

మ. 'వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచుం
బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప, మా
మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్; [2]మల్లాహవ క్రీడకుం
జనదే, కొంతపరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్? 1331

మ. జవసత్త్వంబులు మేలె? సాము గలదే? [3]సత్రాణమే మేను? భూ
ప్రవరుం [4]బోసన మి మ్మనంగవలెనే? [5]పాళీ లభీష్టంబులే?
పవివో! [6]కాక కృతాంతదండకమవో? ఫాలాక్షునేత్రాగ్నివో?
నవనీతంబుల ముద్ద గాదు; మెసఁగన్ నాముష్టి గోపార్భకా! 1332

క. జనములు నేర్చిన విద్యలు జననాథుని కొఱకుఁ గాదె? జననాథుఁడు నీ
జనములు మెచ్చఁగ యుద్ధంబున మనముం గొంతప్రొద్దు వుత్తమె? కృష్ణా! 1333

1. గహనానలము-కాఱుచిచ్చు, 2. మల్లాహవక్రీడ-కుస్తీపట్టుట, 3. సత్రాణము-కవచముతోఁగూడినది, 4. పోసనము-పాలు, 5. పాళీలు-జూదములు, 6. నీకు-పాతాంతరము.

వ. అనిన విని హరి యి ట్లనియె. 1334

ఉ. 'సాములు లేవు; పిన్నలము; సత్త్వము [1]గల్దనరాదు; మల్లసం
గ్రామవిశారదుల్ గులిశకర్కశ దేహులు మీరు; మీకడ
న్నేము చరించు టెట్లు? ధరణీపతి వేడ్కలు సేయువారముం
గాము; వినోదముల్ సలుపఁ గా దన వచ్చునె యొక్క మాటికిన్? 1335

క. నీతోడుత నేఁ బెనఁగెదఁ; బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁడు
గ్రాతత మల్లాహవమున భూతలనాథునికి [2]మెచ్చుఁ బుట్టించు సభన్. 1336

వ. అనిన విని చాణూరుం డి ట్లనియె. 1337

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ? విసిరో, నాపాటియే నీవు? వి
ఖ్యాతుండం; గుణజ్ఞుండ; సద్గుణుఁడ; సత్కర్మ స్వభావుండ; నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే? యీ వీటఁ బోరాడుటల్
వ్రేతల్ సూడఁగఁ గుప్పిగంతు లిడుటే? వీక్షింపు గోపార్భకా! 1338

శా. [3]స్థాణున్ మెచ్చఁడు; బ్రహ్మఁ గైకొనఁడు; విష్వక్సేను నవ్వున్; జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడు గాఁ డని; మహాబాహాబలప్రౌఢి న
క్షీణుం; డాజికి నెల్లి నేఁ డనఁడు; వైచిత్రిన్ వినోదించు న
చ్చాణూరుం డొకగోపబాలు [4]పనికిన్ శక్తుండు గాకుండునే? 1339

క. ప్రల్లద మేటికి గోపక బల్లిదుఁడను; లోకమందుఁ బ్రఖ్యాతుఁడ; నా
[5]చల్లడముక్రింద దూఱని మల్లురు లే రెందు ధరణిమండల మందున్. 1340

సీ. చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు; నిగిడి గోత్రముదండ నిలువరాదు;
[6]కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు; మనుజసింహుఁడ నని మలయ రాదు;
చేరినఁ బడపైతుఁ జెయి సాఁపగా రాదు: బెరసి నా ముందటఁ బెరుఁగ రాదు;
భూనాథహింసకుఁ బోరాదు; నను మీఱి శోధింతుఁ; గానలఁ జొరఁగరాదు;
ఆ. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగా రాదు: ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁపరాదు;
[7]కల్కితనము చూపి గర్వింపగా రాదు; తరము గాదు; కృష్ణ! తలఁగు తలఁగు. 1341

వ. అది గాక నీవు శ్రీహరినంటేని. 1342

సీ. మహిమతో నుండంగ మథురాపురముగాని, పొలుపార వైకుంఠపురము గాదు;
గర్వంబుతో నుండఁ గంసునిసభ గాని సంసారరహితుల సభయుఁ గాదు;

1. కల్దు-కలదు, 2. మెచ్చు-మెప్పు, 3. స్థాణువు-శివుఁడు, 4. పనికిన్-పాఠాంతరము. 5. చల్లడము-లాఁగు, 6. కేడించి-అలక్ష్యముచేసి, 7. కల్కితనము-నేర్పు, కల్కిగా నుండుట,

ప్రకటించి వినఁగ నా బాహునాదము గాని నారదు వీణాస్వనంబు గాదు;
చదురు లాడఁగ మల్లజనవిగ్రహము గాని, [1]రమతోడి ప్రణయ విగ్రహముగాదు
తే. వెలసి తిరుగఁగ వేదాంతవీథిగాదు; [2]మొఱఁగిపో మునిమనములమూల గాదు;
సాఁగి నడువంగ భక్తులజాడ గాదు; శౌరి! నాప్రోల నీవెందుఁ జనియె దింక? 1343

వ. అని పలికి. 1344

సీ. రోషాగ్ని ధూమప్రరోహంబుకై వడి శిరమున సన్నపుశిఖ వెలుంగ,
నాశామదేభేంద్ర హస్తసన్నిభములై బాహుదండంబులు భయదములుగ,
లయసమయాంతకోల్ల సితదంష్ట్రిలభంగిఁ జాఁగిన కోఱమీసములు మెఱయ,
నల్లని [3]తెగ గల [4]నడగొండచాడ్పున నాభీలనీల దేహంబు మెఱయఁ,
ఆ. జరణహతుల ధరణి సంచలింపఁగ, నభో మండలంబు నిండ మల్ల సఱచి
శౌరిదెసకు నడచెఁ జాణూరమల్లుండు, పౌరలోక హృదయభల్లుఁ డగుచు. 1345

వ. ఇట్లగ్గలంబగు [5]నగ్గలిక దగ్గఱిన మల్లునిం గని, మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన, వల్లవవల్లభుం డుల్లసిల్లి, బాహూనాదంబున రోదోంతరాళంబు పూరించి, మించి కవిసె; ని ట్లిద్దఱు నుద్దవిడి నున్నతవిషమంబులగు [6]ఠాణలిడి, కరికరియును, హరి హరియును, గిరి గిరియునుం, దాఁకు పోఁకం దలపడి, యితరేతర హేతిహింసితంబులగు దవానలంబుల తెఱంగునఁ, బరస్పరదీర్ఘ [7]నిర్ఘాతఘట్టితంబులగు మహాభ్రంబులవిభ్రమంబున, నన్యోన్య తుంగతరంగతాడితంబులగు కల్పాంత కాలసముద్రంబులరౌద్రంబున, నొండొరుల ముష్టి ఘట్టనంబుల ఘట్టిత శరీరులై, దద్దరిలక డగ్గఱి, గ్రద్ధన నయ్యుద్ధరుం దిరుగునెడహరి సొచ్చి పేర్చి యార్చి జెట్టింబట్టి పడం దిగిచి, పాదంబుల [8]జాడించి సముల్లాసంబున [9] [10]నెసకంబునకు వచ్చిన మెచ్చి, నొచ్చి యచ్చపలుండు మీఱి మోర సారించి తెరలక పౌరలం ద్రొబ్బిన నబ్బలానుజుం డుబ్బి, గొబ్బున మేమ వర్ధిల్ల నర్ధాంగకంబుననుండి, జానువుల నొత్తుచు, నురవడిం [11]గరవడంబున నున్న, నాదుర్నయుండును 'బాల! మేలుమే లని లీలం గాలు సౌరనిచ్చి, త్రోచినం జూచి యేచి ఖేచరులగ్గించి యుగ్గడింప నగ్గోపకుమారుండు పాటవంబునను [12]రాటనంబునకుం జని వెన్నెక్కి నిక్కిన నక్కంస భటుండు [13]మదజలరేఖాబంధురంబగు గంధసింధురంబు చందంబునఁ బదంబును బదంబునం, గరంబును గరంబునన్ గ్రహించి, సహించి వహించి, నైపుణ్యంబున లోపలం దిరిగి

1. రమణతో; రమణమౌ-పాఠాంతరము. 2. మొఱఁగి-దాఁగి, 3 తెగ-నిడుపు, 4. నడగొండ-నడచుచున్నకొండ, 5. అగ్గలిక-పూనిక, 6. ఠాణలు-మల్లురు నిలుచుచోట్లు 7. నిర్ఘాతము-ఉఱుము, 8. జడించి-పాఠాంతరము, 9. సొనకంబునకు-పాఠాంతరము, 10. ఎసకంబు-విజృంభణ, 11. గరవడంబు-ఒకమల్లబంధము, 12. రాటంబునకుం-పాఠాంతరము, 13. మదగజరేఖ బంధురంబగుపదంబు పదంబునఁ బాసిగరంబు-పాఠాంతరము

యట్టిట్టు దట్టించిన దిట్టతనంబునం దిటవుదప్పక యప్పద్మలోచనుండు [1] [2]కేడించి యేచి సమతలంబున వ్రైచి, ప్రచండంబగువాని [3]పిచండంబు వాఁగించి కాలం గాలు గీలించి [4]డొక్కరంబు గొనిన నయ్యభ్యాసి సభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి జనం గా లడగించి, రక్షించుకొనిన నా రక్షోవైరి వానికటిచేలంబు వట్టి యెత్తి యొత్తి నడుమ రాగెయిడి, సందువెట్టి, నవ్వీన నవ్విరోధి కాలు కాలిలో నిడి వేధించి నిరోధించిన నిరోధంబుఁ బాసి [5]తిరిగి వసుదేవుపట్టి పట్టిసంబు గొని దట్టించిన, [6]నుబ్బరికచేరి చాణూరుండు హరికరంబు పట్టి హుమ్మని నెమ్మొగంబునం గా లిడి మీఁదై నం గేశిబాలకుండు కాలిం గాల నివారించి మీఁదై నెగడి. [7]యుండనీక దుర్వారబలంబున విదలించిలేచి గృహీతపరిపంథిచరణుండై విపక్షునివక్షంబు వజ్రివజ్రసన్నిభంబగు పిడికిటం బొడిచిన, వాఁడు వాఁడి చెడక విజృంభించి యంభోరాశిమధ్యంబునం దిరుగు శైలంబుపోలిక నేల జిఱజిఱం దిరిగి, తన్నిన వెన్నుండు కుప్పించి [8]యుప్పరంబెగసి మీఁద నుఱికిన నతండు కృష్ణపాదసంధిపరిక్షిప్తపాదుండై యెగసి లేచి సముద్ధతుం డయ్యె, నయ్యెడ. 1346

క. బలభద్రుఁడు ముష్టికుఁడును, బలములు మెఱయంగఁ జేసి [9]బాహాబాహిం
బ్రలయాగ్నులక్రియఁ బోరిరి, వెలయంగ బహువిధములైన విన్నాణములన్. 1347

వ. ఇవ్విధంబున. 1348

క. వల్లవులు పెనఁగి రున్నత గల్లులతో, భిన్నదిగిభకరవల్లులతో,
మల్లులతో, రిపుమానస భల్లులతో, భీతగోపవల్లులతోడన్. 1349

వ. ఆ సమయంబునఁ బౌరకాంతలు మూఁకలు గట్టి వెచ్చ నూర్చుచు ముచ్చటలకుం జొచ్చి తమలో నిట్లనిరి. 1350

ఉ. 'మంచి కొమారులం గుసుమమంజు శరీరులఁ దెచ్చి, చెల్లరే!
యంచితవజ్రిసారులు మహాద్రి కఠోరులునైన మల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁగించుచుఁ జూచుచునున్నవాఁడు; మే
లించుక లేదు; మాను మనఁ; డిట్టి దురాత్ముని మున్ను వింటిమే? 1351

క. చూచెదరు గాని [10]సభికులు, నీ చిన్నకుమారకులకు నీ మల్లురకున్
ఓ చెల్ల! యీడు గా దని సూచింపరు; పతికిఁ దమకు శోకము గాదే? 1352

---

1. కిఱిఁగించి, సమతలంబున-పాఠాంతరము, 2. కేడించి-తొలఁగి, 3. పిచండంబు-కడుపు, 4. డొక్కరంబు-ఒకమల్లబంధము, 5. తిరిగిన-పాఠాంతరము, 6. ఉబ్బరికచేసి-విజృంభించి, 7. యెగ్గడినుండియుండక-పాఠాంతరము, 8. ఉప్పరంబెగసి-మీదికెగిరి, 9. బాహాబాహి-పరస్పరము బాహువులతో త్రోసికొనుచు, 10. సభికులు-సభలో నున్నవారు

సీ. వేణునాళములమై వెలసిన మాధవుం డధరామృతము లిచ్చి యాదరించుఁ;
బింఛదామములమై పెరిఁగిన వెన్నుఁడు మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ;
బీతాంబరములమై బెరసిన గోవిందుఁ డంసభాగమునఁ బాయక ధరించు;
వైజయంతికలమై వాలినఁ గమలాక్షుఁ డతికుతూహలమున నఱుతఁ దాల్చుఁ;
తే. దనరు బృందావనంబునఁ దరులమైనఁ, గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడ సల్పు?
నెట్టి నోముల నయిన మున్నిట్టి విధము లేల కామైతి మోయమ్మ! యింక నెట్లు? 1353

ఉ. పాపపుబ్రహ్మ గోపికలపల్లెలలోన సృజింపరాదె? ము
న్నీ పురిలోపలన్ మనల నేల సృజించె? నటైన నిచ్చలుం
జేపడుఁగాదె యీ [1]సుభగుఁ జెందెడిభాగ్యము సంతతంబు నీ
గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోఁచిరో? 1354

క. గోపాలకృష్ణుతోడను గోపాలనవేళలందుఁ గూడి తిరుగు నా
గోపాలు రెంత ధన్యులొ? గోపాలురకైన నిట్టి గురురుచి గలదే? 1355

క. [2]శ్రమజలకణసిక్తంబై కమలదళేక్షణునివదనకమలము మెఱసెన్
హిమజలకణసిక్తంబై కమనీయం బగుచు నున్న కమలముభంగిన్. 1356

ఆ. సభకుఁ బోవరాదు; సభవారిదోషంబు నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగి యుండి యైన నిట్టట్టు వలికినఁ బ్రాజ్ఞుఁడైనఁ బొందుఁ బాపచయము. 1357

వ. అని పెక్కండ్రు పెక్కు విధంబులం బలుకుచుండఁ దద్బాహుయుద్ధంబున. 1358

క. [3]ధృతి సెడి లోఁబడె మల్లుం డతులితభవజలధి[4]తరికి హతరిపుపురికిన్
హితకరికిన్ ధృతగిరికిం దతహరిరవభరితశిఖరిదరికిన్ హరికిన్. 1359

క. హరికిని లోఁబడి బెగడక హరియురము మహోగ్ర [5]ముష్టి సహితుఁడు పొడువన్
హరి కుసుమమాలికాహత కరిభంగిఁ బరాక్రమించెఁ [6]గలహోద్ధతుఁడై. 1360

క. శౌరి నెఱిఁ జొచ్చి కరములు క్రూరగతిన్ బట్టి త్రిప్పి కుంభిని వైచెన్
శూరుం గలహగభీరున్ వీరుం జాణూరు ఘోరు వితతాకారున్. 1361

క. [7]శోణితము నోర నాలుకఁగఁ జాణూరుం డట్లు కృష్ణసంభ్రామణసం
క్షీణుండై క్షోణిం బడి ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్. 1362

1. సుభగుఁడు-అందగాడు, 2. శ్రమజలకణసిక్తంబు-చెమటబిందువులచేఁ దడుప బడినది, 3. ధృతి-ధైర్యము, 4. తరి-నావ, 5. ముష్టి- పిడికిలి, 6. కలహోద్ధతుఁడై — పాఠాంతరము, 7. శోణితము—రక్తము.

క. భలభద్రుండును లోకులు బలభద్రుండనగ బెసఁగి బటుబాహుగతిన్
బలభేదిమెచ్చ ద్రిప్పెను బలవన్ముష్టికుని గరిమ బలములు బెగడన్. 1363

ఆ. త్రిప్పి నేల వైవ దిగ్గన రక్తంబు వదనగహ్వరమున వఱదవాఱ
ముష్టికుండు ఘోరముష్టి సత్త్వము సెడి కూలె గాలిఁ దరువు గూలినట్లు. 1364

వ. మఱియును. 1365

క పాటవమునఁ బలుపిడికిట సూటిం బడఁబొడిచె బలుఁడు శోషిత [1]ఘనబా
హాటోపనృపతికీటుం గూటున్ వాచాటు నధిక ఘోరలలాటున్. 1366

వ. అంత నద్దనుజాంతకుఁడు చరణప్రహరణంబుల భిన్నమస్తకులం జేసి వాని చెలులం
గూటతోసలశలుల నంతకాంతికంబున కనిచిన. 1367

క.'వల్లవ బాలకు లని మన మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్
[2]బల్లిదులు; తలఁడు తలఁ' డని చెల్లాచెదరైరి పాఱి చిక్కిన మల్లుల్. 1368

ఉ. మల్లురఁ జంపి గోపకసమాజములో మృగరాజు రేఖ శో
భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా
వల్లవరాజనందనుల వారక చూచి మహీసురాదు ల
ల్లిల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్. 1369

—: శ్రీకృష్ణుఁడు కంసుని వధించుట :—

వ, అంత సభాజనంబుల కలకలంబు నివారించి మంత్రులం జూచి కంసుం డిట్లనియె. 1370

ఉ.'వల్లవబాలురన్, నగరవాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁడీ.
గొల్లల [3]ముట్టికోల్ గొనుఁడు క్రూరుని నందునిఁ గట్టుఁ; డుర్వికిం
దెల్లముగాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు తండ్రి గాఁడు; వీఁ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు; కావకుఁ డుగ్రసేనునిన్. 1371

వ. అని పలుకు సమయంబున. 1372

శా. [4]జంఘాలత్వముతో నగోపరిచర [5]త్సారంగహింసేచ్ఛ ను
ల్లంఘింపన్ గమకించు సింహముక్రియన్ లక్షించి పౌర ప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థియై
లంఘించెం [6]దమగంబుమీదికి రణోల్లాసంబు భాసిల్లగఁన్. 1373

---

1. బాహా, స్ఫోటననరపతి—పాఠాంతరము, 2. బల్లిదులు—వీరులు, 3. ముట్టికోల్ గొనుడు—ఆక్రమింపుడు, 4. జంఘాలత్వము-మిక్కిలివడిగా బరుగిడుట, 5. సారంగము—జింక, 6. దమగంబు—మంచె,

క. తమగమున కెగురు యదుసత్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁడై యెదిరెం
[1]దమగమివారలు వీరోత్తమగణవిభుఁ డనఁగఁ గంసధరణీపతియున్. 1374

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టువిధ మొప్పం గేశబంధంబు లో
కక్షోభంబునఁ బట్టి మౌళిమణు లాకల్పాంతవేళాపత
న్నక్షత్రంబుల భంగి రాల రణ [2]సంరంభంబు డిందించి రం
గక్షోణిం బడద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్ నృపోత్తంసునిన్. 1375

శా. మంచాగ్రంబుననుండి రంగధరణీమధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జను లాశ్చర్యంబునుం బొందఁగాఁ
[3]బంచత్వంబును బొంది యున్న [4]విమతుం బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్
[5]బంచాస్యంబు గజంబు నీడ్చుపగిదిన్ బాహాబలోల్లాసియై. 1376

క. రోషప్రమోద నిద్రా భాషాశనపానగతులఁ బాయక చక్రిన్
దోష [6]రతిఁ జూచి యైన విశేష [7]గతిం గంసుఁ డితనిఁ జెందె నరేంద్రా! 1377

వ. ఆ సమయంబున. 1378

క. గోపాలుఁ డొక్కఁ డద్దిర భూపాలకుఁ జంపె వీనిఁ బొదువుం డేత
ద్రూపాలస్యము లేఁ డని తాపాలఘురోషు లగుచు దర్పోద్ధతులై. 1379

శా. న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీకసా
మగ్రిం గంసునిసోదరుల్ గవియుడున్ మాద్యద్గజేంద్రాభుఁడై
యుగ్రుండై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండ చెండాడి కా
లాగ్రక్షోణికిఁ బుచ్చె రాముఁడు గరీయస్థేముఁడై వారలన్. 1380

వ. అయ్యవసరంబున. 1381

క. చేతులఁ దాళము లొత్తుచుఁ జేతోమోదంబుతోడ సిగముడి వీడం
[8]బాతర లాడుచు మింటను గీతము నారదుఁడు వాడెఁ గృష్ణా! యనుచున్. 1382

క. వారిజభవరుద్రాదులు భూరికుసుమవృష్టిఁ గురిసి పొగడిరి కృష్ణున్
భేరులు మ్రోసెను నిర్జర నారులు దివి నాడి రధికనటనముల నృపా! 1383

వ. అంతటఁ గంసాదుల కాంతలు భర్తృమరణదుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు మోఁదుకొనుచు నశ్రుసలిలధారాపరిషిక్తవదనలై సదనంబులు వెలువడి వచ్చి వీరశయ్యానిద్రితులైన విభులం గౌఁగిలించుకొని సుస్వరంబుల విలపించి రందుఁ గంసభార్య లిట్లనిరి.

1. తమగమివారలు—తమపక్షమువారు, 2. సన్నాహంబు రెట్టింప—పాఠాంతరము. 3. పంచత్వంబు—మరణము, 4. విమతుఁడు—విరోధి, 5. పంచాస్యంబు—సింహము, 6, గతిఁ—పాఠాంతరము. 7. రుచి—పాఠాంతరము, 8. పాతరలాడుచు—నర్తించుచు,

సీ. గోపాలసింహంబు గోపించి వెల్వడి నిను గజేంద్రముభంగి నేఁడు గూల్చె
యాదవేంద్రానిల మాభీలజవమున నిను [1]మహీజము మాడ్కి నేల వ్రాల్చెఁ
వాసుదేవాంభోధివారి [2]యుద్వేలమై నిను దీవికైవడి నేఁడు ముంచె
దేవకీసుతవజ్రి దేవత లలరంగ నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె
తే. హా మనోనాథ! హా వీర! హా మహాత్మ! హా మహారాజ! నీ విట్లు హతుఁడవైన
[3]మనుచు నున్నార మక్కట! మమ్ముఁ బోలు కఠినహృదయలు జగతిపైఁ గలరెయెందు?

క. భూతముల కెగ్గు సేసిన భూతంబులు నీకు నెగ్గు పుట్టించె [4]వృథా
భూతమగు మనికి యెల్లను భూతద్రోహికిని శుభము పొంద దధీశా! 1386

క. గోపాలకృష్ణతోడను భూపాలక మున్ను తొడరి పొలిసినవారిన్
నీపాల బుధులు సెప్పరె? కోపాలస్యములు విడిచి కొలువం దగదే? 1387

వ. అని విలపించుచున్న రాజవల్లభల నూరార్చి జగద్వల్లభుండైన హరి కంసాదులకుం బర
లోక సంస్కారంబులు సేయం బనిచి, దేవకీవసుదేవుల బంధనంబు విడిపించి బలభద్ర
సహితుండై వారలకుం బ్రణామంబు సేసిన. 1388

మ. కని 'లోకేశులు గాని వీరు కొడుకుల్ గా' రంచుఁ జిత్తంబులన్
[5]జనయిత్రీజనకుల్ విచారపరులై శంకింపఁ గృష్ణుండు దా
జనసమ్మోహిని యైన మాయఁ దదభిజ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై యానందసంధాయియై. 1389

—: శ్రీకృష్ణుడు దేవకీవసుదేవుల చెఱమాన్పి యుగ్రసేనునికిఁ బట్టంబు గట్టుట:—

సీ. మమ్ము గంటిరిగాని మా బాల్యపౌగండకైశోరవయసులఁ గదిసి మీర
లెత్తుచు, దించుచు నెలమి మన్నించుచు నుండు సౌభాగ్యంబు నొందరైతి
[6]రాకాంక్ష గలిగియు నది దైవయోగంబు తల్లిదండ్రులయొద్దఁ దనయు లుండి
యే యవసరమున నెబ్బంగి లాలితు లగుచు వర్ధిల్లుదు రట్టి మహిమ
తే. మాకు నిన్నాళ్ళు లే దయ్యె మఱియు వినుఁడు నిఖిలపురుషార్థ హేతువై నెగడుచున్న
మేని కెవ్వార లాఢ్యులు? మీర కారె? యాఋణము దీర్ప నూఱేండ్ల కైన జనదు. 1390

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
చెల్లింపఁ డట్టి కష్టుఁడు [7]ప్రల్లదుఁ డా మీఁద [8]నాత్మపలలాశి యగున్. 1391

---

1. మహీజము—చెట్టు, 2. ఉద్వేలము—చెలియలికట్ట దాఁటినది; పొంగినది, 3. మనుచునున్నారము—బ్రతికియేయున్నాము, 4. వృథాభూతము—వ్యర్థమైనది, 5. జనయిత్రి—తల్లి, 6 ఆకాంక్ష—కోరిక, 7. ప్రల్లదుఁడు—దుష్టుఁడు, 8. ఆత్మపలలాశి—తనమాంసమునే తినువాఁడు,

క. జననీజంతుల వృద్ధులఁ దనయుల గురువిప్రసాధుదారాదుల నే
జనుఁడు ఘమఁ డయ్యుఁ బ్రోవక [1]వనరును [2]జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్. 1392

వ. అదియుం గాక. 1393

శా. కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగారాక, ని
ష్కారుణ్యాత్ములమైన క్రూరుల మహాకౌటిల్యసంచారులన్
సారాతిక్షములార మమ్ముఁ [3] గొఱఁతల్ సైరించి రక్షింపరే' 1394

వ. అని యిట్లు మాయామనుష్యుండైన హరి పలికినపలుకులకు మోహితులై వారల నంక
పీఠంబుల నిడుకొని, కౌఁగిలించుకొని వారివదనంబులు కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశ
బద్ధులై దేవకీవసుదేవు లూరకుండి; రంత వాసుదేవుండు మాతామహుండైన యుగ్రసేనుం
జూచి. 1395

చ. 'అనఘ! యయాతిశాపమున యాదవవీరులకున్ [4]నరేశ్వరా
సనమున నుండరాదు; నృపసత్తమ! రాజవు గమ్ము భూమి! కే
నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరిఁ బెట్టుదు! రన్యరాజులం
బనిగొను టెంత! రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్.' 1396

వ. అని పలికి. 1397

క. మన్నించి రాజుఁజేసెను వెన్నుఁడు సత్యావధాను విశ్రుతదానున్
సన్నుతమానున్ గదనచ్ఛిన్నాహితసేను నుగ్రసేనున్ దీనున్. 1398

వ. తదనంతరంబ తొల్లి కంసభీతులై విదేశంబులం గృశియించుచున్నయదు వృష్ణి భోజ మరు
దశార్హ కుకురాంధకప్రముఖులగు సకలజ్ఞాతిసంబంధులను రావించి, చిత్తంబు లలర,
విత్తంబు లిచ్చి, వారివారి నివాసంబుల నుండ నియోగించె; నివ్విధంబున. 1399

క. మధుసూదనసత్కరుణా మధులోకనవిముక్త మానసభయులై
మధురవచనములఁ దారును మధురానగరంబు ప్రజలు మనిరి నరేంద్రా. 1400

వ. అంత నొక్కనాఁడు [5]సంకర్షణసహితుండై నందునిం జీరి గోవిందుం డిట్లనియె. 1401

శా. 'తండ్రిం జూడము తల్లిఁ జూడము యశోదాదేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే

---

1. వనరును—దీనముగా పల్కును. 2. జీవన్మృతుఁడు—బ్రతికియున్నను చచ్చిన
వాఁడు, 3. కొఱఁతల్—లోపములు, 4. నరేశ్వరాసనము-సింహాసనము, 5. సంకర్షణుఁడు-
బలరాముఁడు.

తం[డుల్ బిడ్డల నిట్లు వెంచిరి? భవత్సౌజన్య భావంబులన్
దం[డీ! యింతటివార మైతిమిగదా! తత్తద్వయోలీలలన్. 1402

ఉ. ఇక్కడ నున్న బాంధవుల కెల్లను సౌఖ్యము సేసి వత్తు మే
మక్కడికిన్ మదీయులకు నందఅకున్ వినిపింపు మయ్య! నే
మెక్కడ నున్న మాకు మది నెన్నఁడుఁ బాయవు మీ [1] [వజంబులో
మక్కువతోడ మీరు కృప మా కొనరించు [క్రియావిశేషముల్. 1403

వ. అని పలికి వస్త్రభూషణాదు లొసంగి సాదరంబుగం గౌఁగిలించుకొని గోవిందుండనిచిన నందుండు [ప్రణయవిహ్వలుండై బాష్పజల పూరితలోచనుం డగుచు నల్లవులుం దానును [వేపల్లెకుఁ జనియె; నంత. 1404

క. గర్గాదిభూసురోత్తమ వర్గముచే నుపనయనము వసుదేవుఁడు స
న్మార్గంబునఁ జేయించెను నిర్గర్వచరిత్రులకును నిజపుత్రులకున్. 1405

క. [2]ద్విజరాజవంశవర్యులు [3]ద్విజరాజముఖాంబుజోపదిష్టవ్రతులై
ద్విజరాజత్వము నొందిరి ద్విజరాజాదికజనంబు దీవింపంగన్. 1406

వ. ఉపనయనానంతరంబున వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గోహిర ణ్యాదిదానంబు లొసంగి తొల్లి రామకృష్ణుల జన్మసమయంబులందు నిజ [4]మనోదత్తలైన గోవుల నుచ్చరించి యిచ్చి. కామితార్థంబుల నర్థులకుంబెట్టె;నిట్లు బ్రహ్మచారులై. 1407

శా. ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని, త
త్పూర్వారంభము సేయఁ బోల దనుచున్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియుం
గుర్వంగీకరణంబు సేయ; జని రా గోవిందుండున్ రాముఁడున్. 1408

వ. చని మహా వైభవరాశి యైన కాశిం జేరి తత్తీరంబున నవంతీపురనివాసియు, సకలవిద్యా విలాసియునైన సాందీపని యను బుధవర్యునిం గని యథోచితంబుగ దర్శించి, శుద్ధభావ వర్తనంబుల భక్తి సేయుచుండ, వారలవలన సంతుష్టుండై. 1409

శా. వేదశ్రేణియు [5]నంగకంబులు ధనుర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాదివ్యాహృతధర్మ శాస్త్రములు సుద్యన్న్యాయముం దర్కవి
ద్యాదక్షత్వము రాజనీతియును శుద్ధప్రక్రియం జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూత ప్రమోదంబునన్. 1410

1. [వజంబు-గొల్లపల్లె, 2. ద్విజరాజు-చంద్రుఁడు, 3. ద్విజరాజు-ఉత్తమబ్రాహ్మణుఁడు, 4. మనోదత్తలు-మనస్సులో సంకల్పించుకొన్నవి, 5. అంగకంబులు-శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము-అను వేదాంగములు.

క. అఱువది నాలుగు విద్యలు నఱువది నాలుగు దినంబు లంతన వారల్
[1]నెఱవాదు లైనకతమున నెఱి నొక్కొక [2]నాఁటి వినికి నేర్చి రిలేశా! 1411

క. గురువులకు నెల్ల గురులై [3]గురులఘుభావములు లేక కొమరొందు జగ
ద్గురులు త్రిలోకహితార్థము గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్. 1412

వ. ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి వారల మాహాత్మ్యంబునకు వెఱఁగుపడి సభార్యుం
డైన సాందీపని యిట్లనియె. 1413

శా. అంభోరాశిఁ బ్రభాసతీర్థమున మ న్నస్మత్తమాసంభవుం
[4]డంభోగాహము సేయుచున్ మునిఁగ లేఁ డయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీ గురునికిం జోద్యంబుగా శిష్యతన్
గాంభీర్యంబునఁ బుత్రదక్షిణ యిదం గర్తవ్య మూహింపరే. 1414

క. శిష్యులు బలాఢ్యులైన వి శేషస్థితి నొంది గురువు జీవించును; ని
ర్దూష్యగుణబలగరిష్ఠులు శిష్యులరై గురునికోర్కి సేయం దగదే? 1415

వ. అనిన విని రామకృష్ణులు గుర్వర్థంబుగా [5]దుర్వారరథారూఢులై రయంబునం జని రౌద్రం
బున సముద్రంబుఁ జేరి యిట్లనిరి. 1416

క. 'సాగర! సుబుద్ధితోడను మా గురుపుత్రకునిఁ దెమ్ము మా జూడిన నీ
[6]వాగడ మగుదువు దుస్సహ వేగరణాభీలనిశితవిశిఖాగ్నులకున్.' 1417

వ. అనిన వారలకు జలరాశి యిట్లనియె. 1418

ఉ. 'వంచన యింత లేదు యదువల్లభులార! ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ డార్యుఁడు [7]తోయము లాడుచుండ ను
త్సంచలితోర్మియొక్కటి ప్రచండగతిం గొనిపోయెఁ బోవఁగాఁ
బంచజనుండు మ్రింగె నతిభాసురశీలుని విప్రబాలునిన్.' 1419

వ. అని వాని వసింయిచుచో బెటింగించిన. 1420

శా. శంఖారావముతోఁ బంచజనుఁడున్ శంకించి చిత్తంబులో
సంభిన్నుండుగ వార్ధిఁ జొచ్చి దహనజ్వాలాభహేమోజ్జ్వల

---

1. నెఱవాదులు-మిక్కిలి నేర్పరులు, 2. మాటు—పాఠాంతరము, 3. గురులఘు భావములు-ఎక్కువతక్కువ భేదములు, 4. అంభోగాహము-నీటిలో స్నానము చేయుట, 5. దుర్వారము-అడ్డులేనిది, 6. ఆగడము-లక్ష్యము, 7. తోయములాడుట-స్నానము చేయుట.

త్పంఖాస్త్రంబునఁ గూల్చి వానిజఠరంబున్ [1]వ్రచ్చి గోవిందుఁ డ
ర్థేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురుప్రేమోదితోద్యోగుఁడై. 1421

క. దానవుని దేహజం బగు మానితశంఖంబు గొనుచు మసలక బలుఁడుం
దో నే తేరఁగ రథియై దానవరిపుఁ డరిగె [2]దండధరుపురికి నృపా! 1422

వ. చని సంయమనీనామ నగరంబుఁ జేరి తద్ద్వారంబునఁ బ్రళయకాలమేఘ గంభీరనినదభీష
ణంబగు శంఖంబు పూరించిన విని వెఱఁగుపడి. 1423

శా. అస్మద్బాహుబలంబుఁ గైకొనక శంఖారావమున్ మానపా
పస్మారంబున నెవ్వఁ డొక్కొ నగర ప్రాంతంబునం జేసెఁ? మ
[3]ద్విస్మేరావహరోషపావకునిచే విధ్వస్తుఁడై వాఁడు దా
భస్మంబై చెడు నంచు నంతకుఁడు కోపప్రజ్వలన్మూర్తియై. 1424

వ. వచ్చి రామకృష్ణులం గని వారు లీలామనుష్యులయిన విష్ణుమూర్తు లని యెఱింగి; భక్తి
తోడం బూజచేసి, సర్వభూతమయుండగు కృష్ణునకు సమస్కరించి 'యేమిసేయుదు?
నాన తి'మ్మనిన నమ్మహాత్ముం డిట్లనియె. 1425

క. 'చెప్పెద మా గురునందనుఁ దప్పు గలుగఁ జూచి నీవు దండనమునకున్
దెప్పించినాఁడ; వాతని [4]నొప్పింపుము మాకు వలయు నుత్తమచరితా!' 1426

క. అనిన విని 'వీఁడె వీనిం గొనిపొం' డని భక్తితోడ గురునందను ని
చ్చినఁ గృష్ణుఁడు వీడ్కొనియెను ఘనదుర్జనదమను మహిషగమనున్ [5]శమనున్ 1427

వ. ఇట్లు జము నడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికిం బుత్రుని సమర్పించి 'యింక నేమి
సేయ వలయు! నానతిం' డనిన నతం డిట్లనియె. 1428

క. 'గురునకుఁ గోరిన దక్షిణఁ గరుణన్ మున్నెవ్వఁ డిచ్చెఁ? ఘనులార! భవ
ద్గురునకుఁ గోరిన దక్షిణఁ దిరముగ నిచ్చితిరి మీరు దీపితయశులై. 1429

క. కాలుని వీటికిఁ జని మృత బాలకుఁ దే నొరులవశమె? భవదీయకృపన్
మేలు దొరకొనియె మాకు వి,శాల మగుంగాత మీ యశము లోకములన్. 1430

వ. మహాత్ములారా! యేను గృతార్థుండ నైతి' నని దీవించిన సాందీపని వీడ్కొని కృత
కృత్యులై రామకృష్ణులు రథారోహణంబుచేసి మధురకుం జనుదెంచి పాంచజన్యంబు పూరిం
చినఁ గని నష్టధనంబులు గనినవారిభంగిం బ్రజలు ప్రమోదించి: రంత నొక్కనాఁ డేకాం
తంబున. 1431

1. వ్రచ్చి-చీల్చి, 2. దండధరుఁడు-యముఁడు, 3. విస్మేరము - ఆశ్చర్యము,
4. ఒప్పింపుము-అప్పగింపుము, 5. శమనుఁడు-యముఁడు.

## —: శ్రీకృష్ణుఁడు గోపకాంతలచెంతకు నుద్ధవునిఁ బంపుట:—

శా. నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్, నా రాకఁ గాంక్షించుచున్
నాపే రాత్మల నావహించుకు వగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంత [1]జాలిఁ బడిరో? కోపించిరో. దూఱిరో?
వ్రేపల్లెన్ నిజ [2]ధర్మ గేహములలో విభ్రాంతచైతన్యలై. 1432

వ. అని చింతించి. 1433

క. సిద్ధవిచారు గభీరున్ వృద్ధవచోవర్ణనీయు వృష్ణిప్రవరున్
బుద్ధినిధి [3]నమరగురుసము నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యన పలికెన్. 1434

శా. "రమ్మా యుద్ధవ! గోపకామినులు నారాకల్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియున్ మఱచి యేచందంబునం గుందిరో
తమ్ముల్ నమ్మినవారి డిగ్గ విడువన్ ధర్మంబు గా దంద్రు: వే
పొమ్మా! ప్రాణము లే క్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్. 1435

క. లౌకిక మొల్లక న న్నాలోకించు [4]ప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును నా క్కాశ్రితరక్షణములు [5]నైసర్గికముల్. 1436

క. 'సందేహము మానుం డరవిందాననలార మిమ్ము విడువను వత్తున్
బృందావనమున' కని హరి సందేశము పంపె నసుము సంకేతములన్." 1437

వ. అని మందహాససుందరవదనారవిందుండై కరంబు కరంబున నవలంబించి, సరసవచనంబు లాడుచు వీడుకొలిపిన నుద్ధవుండును, రథారూఢుండై సూర్యాస్తమయ సమయంబునకు నందవ్రజంబు సేరి వనంబులనుండి వచ్చు గోవులచరణ రేణువులం బ్రచ్ఛన్నరథుండై మెచ్చి నందుమందిరంబు ప్రవేశించిన. 1438

శా. ఆ పుణ్యాత్మునిఁ గౌఁగిలించుకొని నందాభీరుఁ [6]డానందియై
'మాపాలింటికిఁ గృష్ణుఁ డీతఁ' డినుచున్ మన్నించి పూజించి, వాం
ఛాపూర్ణంబుగ మంజులాన్నమిడి మార్గాయాసముం బాపి స
ల్లాపోత్సాహముతోడ నిట్లనియె సంలక్షించి మోదంబునన్. 1439

క. 'నామిత్రుఁడు వసుదేవుఁడు సేమంబున నున్నవాఁడె? చెలువుగఁ బుత్రుల్
సేమంబున సేవింప మహామత్తుండైన కంసుఁ డడఁగినపిదపన్. 1440

---

1. జాలిఁబడిరో-దుఃఖించిరో, 2. నర్మ—పాఠాంతరము, 3 అమరగురుఁడు-బృహస్పతి, 4 ప్రపన్నులు-శరణాగతులు, 5. నైసర్గికములు-స్వభావసిద్ధములు, 6. ఆనంది-సంతోషించినవాఁడు.

శా. అన్నా! భద్రమె? తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే?
తన్నుం బాసిన గోపగోపికల మిత్ర [1]వ్రాతమున్ గోగణం
బు న్నిత్యంబుఁ దలంచునే? వననదీభూముల్ ప్రసంగించునే
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య యిటు మావ్రేపల్లెకు న్నుద్ధవా! 1441

క. [2]అంకిలి కలుఁగక మా కకలంకేందునిభగిది గాంతిలసితంబగు త
త్పంకజనయనునివెమ్మొగ మింక విలోకింపఁగలనె యీ జన్మమునన్? 1442

క. కని హరి ము న్నొనరించిన పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకులలో
చనుఁడై [3]డగ్గుత్తికతో వినయంబున నుండె గోపవీరుఁ డంతన్ 1443

క. పెనిమిటి బిడ్డనిగుణములు వినుతింప యశోద ప్రేమవిహ్వలమతియై
చనుమొనలఁబాలుగురియఁగఁ గనుఁగొనలను జలము లొలుకగాఁ బెగ్గిలియెన్ 1444

వ. ఇట్లు గోవిందసందర్శనాభావవిహ్వలలైన యశోదానందులకు నుద్ధవుం డిట్లనియె. 1445

క. 'జననీజనకుల మిమ్ముం గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును మనమున వగవకుఁడు ధైర్యమందనులారా! 1446

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే? వసుమతీభారంబు వారింప వా
రలరూపంబులఁ బుట్టినాఁడు హరి [4]నిర్వాణప్రభుం డెవ్వఁ; డు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశు జింతించు వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై యర్కాభుఁడై, నిత్యుఁడై 1447

సీ. అట్టి నారాయణుం డఖిలాత్మభూతుండు కారణమానవాకారుఁడైనఁ
జిత్తంబు లతనిపై జేర్చి సేవించితి; రతికృతార్థులరైతి రనవరతము
శోభిల్లు [5]నింధనజ్యోతిచందంబున నఖిలభూతములందు నతఁ డతనికి
జననీజనకదారసఖిపుత్ర బాంధవశత్రుప్రియాయప్రియజనులు లేరు
ఆ. జన్మకర్మములును జన్మంబులును లేవు. శిష్టరక్షణంబు సేయుకొఱకు
గుణవిరహితుఁడయ్యు గుణి యయి సర్వరణవినాశకేళి సలుపుచుండు 1448

వ. అని మఱియుఁ బెక్కువిధంబుల హరి ప్రభావము లుపన్యసించుచు, నా రేయి గడిపి
మఱునాఁడు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి కృతానుష్ఠానుండై యుద్ధవుం డొక్క
రహస్యప్రదేశంబున నున్న సమయంబున. 1449

1. వ్రాతము-గుంపు, 2. అంకిలి—ఆటంకము, 3. డగ్గుత్తిక—గద్గదస్వరము, 4. నిర్వాణప్రభుండు-మోక్షాధిపతి, 5. ఇంధనము—కట్టెలు,

శా. 'రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం
డాజానుస్థితబాహుఁ [1]డంబురుహమాలాలంకృతుం డుల్లస
ద్రాజత్కుండలుఁ డొక్క వీరుఁ డిచటన్ రాజిల్లు చున్నాఁడు మా
రాజీవాక్షునిభంగి' నంచు గని రా రాజాన్వయున్ గోపికల్ 1450

వ. అని లజ్జాసహితహాసవిలోకనంబులు ముఖంబులకుం జెలు వొసంగ నిట్లనిరి. 1451

—: భ్రమరగీతము :—

చ. "ఎఱుగుదు మేము నిన్ను వనజేక్షణమిత్త్రుఁడ వీవు: కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదదండ్రులకు మే లెఱిగింపఁ బ్రియుండు వంపఁగా
వఱలెదు రక్తి వచ్చితివి వారలనైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి మేలు! [2]మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్? 1452

క. మునివరు లైనను బంధుల ఘనసఖ్యము విడువ లేరు గాక విడువరే
ననిమిత్తసఖ్య మాఁకటి పని దీఱిన నళులు విరులఁ [3]బాయునొ లేదో" 1453

చ. అని యిటు గోపికల్ వలుక నం దొకగోపిక కృష్ణపాదచిం
తనమునఁ [4]జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్సునిశితసద్వివేకముఁ బ్రసూనమరందమదాతిరేకమున్
ఘనమృదునాదసంచలితకాముకలోకముఁ [5]జంచరీకమున్. 1454

వ. కని హరి తన్నుం బ్రార్థింపఁ బుత్తెంచిన దూత యని గల్పించుకొని, యుద్ధవునికిఁ [6]నన్యా
పదేశంబై యెఱుకపడ నయ్యళికిం దొయ్యలి యిట్లనియె. 1455

మ. భ్రమరా! దుర్జనమిత్త్ర! ముట్టకుము మా పాదాబ్జముల్ నాగర
ప్రమదాళీకుచకుంకుమాంకితలసత్ప్రాణేశదామప్రసూ
నమరందారుణితాననుండ వగుటన్ నాథుండు మన్నించుఁ గా
క మము [7]న్నేఁపుచుఁ బౌరకాంతల [8]శుభాగారంబులన్ నిత్యమున్. 1456

మ. ఒక పువ్వందలితేనె ద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెదుభంగి మ మ్మధర [9]పీయూషంబునం దేల్చి, మా

---

1. అంబురుహమాల పుష్కరమాల, 2. మఱి-వారుకాక, 3. బాయకయున్నే—పాఠాంతరము, 4. చొక్కి-పరవశులై, 5. చంచరీకము తుమ్మెద, 6. అన్యాపదేశంబు-ఇతరులపై మిషపెట్టిచెప్పుట, 7. ఏఁపుచు-బాధించుచు, 8. సభాగారంబులన్—పాఠాంతరము, 9.పీయూషంబు-అమృతము.

యకలంకోజ్జ్వలయౌవనంబుఁగొని యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా! యాతని కెట్లు దక్కె సిరి? మిథ్యాకీర్తి నమ్మెం జుమీ! 1457

శా. భృంగా? కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించె డీ
సంగీతంబున; నేము సొక్కుదుమె? తచ్చారిత్రముల్ వింతలే?
యంగీకారము గావు మాకుఁ బురకాంతాగ్రప్రదేశంబులన్
సంగీతం బొనరింపు వారిడుదు [1]రోజ న్నీకు నిష్ఠారముల్. 1458

మ. సమదాశీశ్వర చూడు మజ్జ్వలితహాసభ్రూవిజృంభణంబులన్
రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులం?
బ్రమదారత్నము లక్ష్మి యాతని పదాబ్జాతంబు సేవింప ని
క్కము నే మెవ్వర మా కృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్? 1459

శా. [2]రోలంబేశ్వర నీకు దౌత్యము మహారూఢంబు నీనేరుపుల్
చాలున్ మచ్చరణాబ్జముల్ విడువు మస్మన్నాథపుత్రాదులన్
లీలం బాసి [3]పరంబు డించి తనకున్ లీలత్వముంబొందు మ
మ్మేలా పాసె విభుండు? ధార్మికులు మున్నీ చందముల్ మెత్తురే? 1460

శా. వాలిం జంపెను వేఁటకానిపగిదిన్ వంచించి [4]దైత్యానుజన్
లోలం బట్టి విరూపఁ జేసెను బలిన్ లోభంబుతోఁ గట్టియా
త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్ ధర్మజ్ఞుఁడే మాధవుం?
డేలా షట్పద! [5]యెగ్గు మా వలన నీ కెగ్గింపఁగా నేటికిన్? 1461

ఉ. పన్నగ మింటిపై కెగసి పాఱు [6]విహంగముకైన పీనులం
ద న్నొకమాటు విన్న గృహదారసుతాదులఁ బాపి విత్తసం
పన్నతడించి, సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు నిత్యకాం
క్ష న్నెఱి నున్న మా బ్రదుకు సైఁచునె యేల మధువ్రతోత్తమా! 1462

మ. కమనీయంబగు వేఁటకానిపలు కాకర్ణించి నిక్కంబుగాఁ
దమ చిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణనిర్భిన్నలై
యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమాయాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్రజనితోగ్రశ్రాంతి [7]నిందిందిరా? 1463

1. ఓజ—ప్రియము, 2, రోలంబము—తుమ్మెద, 3. పరంబు—ఉత్తమలోకము, 4. దైత్యానుజ—శూర్పణఖ, 5. ఎగ్గు-తప్పు, 6. విహంగములు-పక్షులు, 7. ఇందిందిరము-తుమ్మెద.

ఉ. బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁజేసి డించి [1]శరణందిన మమ్ము వియోగదుర్దశా
[2]సింధువులోనఁ ద్రోచి యిటు సేరక పోవుట పాడి గాదు; పు
ష్పంధయ! మీ యధీశునకు బాదములం బడి యొత్తి చెప్పవే. 1464

సీ. కాంచనరత్నసంఘటిత సౌధంబులే మా కుటీరంబులు మాధవునకు?
వివిధ నరేంద్రసేవిత రాజధానియే మా పల్లె యదువంశమండనునకు?
సురభిపాదపలతాశోభితారామమే మా యరణ్యము సింహమధ్యమునకు?
గమనీయలక్షణగజతురంగంబులే మా ధేనువులు కంసమర్దనునకు?
తే. రూపవిభ్రమనైపుణరూఢలైన మగువలమె మేము మన్మథమన్మథునకు?
నేల చింతించు మముఁ గృష్ణుఁ? డేల తలచుఁ? బృథివి నధిపులు నూతన ప్రియులు గారె!'

వ. అని మఱియు నిట్లనేకవిధంబులఁ గృష్ణసందర్శనలాలసలయి పలుకుచున్న గోపికల వచ
నంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు నిట్లనియె. 1466

మ. జపదాన వ్రతహోమసంయమతపస్స్వాధ్యాయముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నే విభున్ మనముల న్నిల్పంగలే రట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ [3]కజ
స్రపటుధ్యానము లిట్లు నిల్చునె? భవచ్చారిత్రముల్ చిత్రముల్. 1467

క. నను మీ కడకుం గృష్ణుఁడు పని పంపెడువేళఁ బిలిచి పలికిన పలుకుల్
వినుఁ; డన్నియు వివరించెద వనజేక్షణలార! మీరు వగవకుఁ డింకన్. 1468

వ. అని హరివచనంబులు గా నిట్లనియె. 1469

సీ. 'ఎల్లకార్యములకు నేను బ్రధానకారణము గావున మీకు రమణులార!
కలుగదు మద్వియోగము చరాచరరూపములలో [4]మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుఁడనై నేమనఃప్రాణబుద్ధిగుణేంద్రియాశ్రయుండ
నాత్మయం దాత్మచే నాత్మఁ బుట్టింతు రక్షింతును ద్రుంతు [5]హృషీకభూత
తే. గుణగణాకార మాత్మకుఁ గొమరుమిగులు నిబిడమాయానుభవమున నిత్యశుద్ధ
మాత్మ విజ్ఞానమయమునై యమరు గుణముఁ బ్రకృతికార్యమనోవృత్తిఁ బట్టి పొందు. 1470

చ. కలఁ గని లేచి మున్ను గలఁ గన్న సమస్తవిధంబుఁ గల్గగాఁ
దలఁచినభంగి మానసపదార్థముచే నిఖిలేంద్రియార్థముల్

1. తనునందిన—పాఠాంతరము, 2. సింధువు-సముద్రము, 3. అజస్రము-ఎల్లప్పుడు, 4. మహాభూతములు-పృథివ్యప్తేజోవాయ్వాకాశములు, 5. హృషీకములు-ఇంద్రియములు.

బలమునఁ గట్టి తజ్జ్ఞుఁడు ప్రపంచము లేదనుఁ దన్మనంబుఁ దా
రలయక కట్టుడున్ బుధుల కవ్వల నొండొక భేద మున్నదే? 1471

ఆ. సాంఖ్యయోగనిగమసత్యతపోదమములు మనోనిరోధమును గడపల
గాఁగ నుండు జలధికడపలగాఁ గల నదులభంగి నళినసయనలార! 1472

మ. చెలువల్ దవ్వుల నున్నవల్లభులపైఁ జిత్తంబులం గూర్తు [1]రు
త్కలికం జేరువవారికంటె నడియుఁగా కెప్పుడు న్నన్ను మీ
రలు చింతించుచు నుండఁగోరి యిటు దూరస్థత్వముం బొందితిం
దలఁకంబోలదు నన్నుఁ గూడెదరు నిత్యధ్యానపారీణలై.' 1473

వ. అని మీకుం జెప్పుమని కృష్ణుండు సెప్పె ననపుడు నుద్ధవునికిం గోపికలు సంతసించి యిట్లనిరి. 1474

ఉ. [2]ఇమ్మలనున్నవాఁడె హరి? యిక్కడి కెన్నఁడు వచ్చు? వచ్చి మా
[3]యుమ్మలికంబు వాపునె? ప్రియుం డిట వచ్చెదనన్న సైఁతురే
యమ్మధురాపురీరమణు? లడ్డను వత్తురు గాక చెల్లరే!
మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదనపాలు సేసెనే? 1475

చ. మఱచునొకో మదిం దలఁచి మాధవుఁ డాయమునాతటంబునం
దఱచుగ దివ్యసౌరభలతాగృహసీమల నేము [4]డాఁగఁగా
[5]మఱవులనుండి నీడలకు మమ్మెలయించి కలంచి దేహముల్
మఱచినఁ దేర్చి నూల్కొలిపి మన్మథలీలలఁ దేల్చుచందముల్! 1476

శా. నీతో [6]నర్మగృహంబులం బలుకునే నే మెల్ల వంశోల్లస
ద్గీతభ్రాంతలమై కళిందతనయాతీరంబునం జేరినం
జేతోజాతసుఖంబులం దనిపి మాచిత్తస్థితుల్ చూడ లీ
లాతంత్రజ్ఞత దాఁగి మెల్లన మదాలాపంబు లాలించుటల్? 1477

క. ముచ్చటవేళలఁ జెప్పునె యచ్చుగ మును నేము నోమునప్పుడు జలముల్
సొచ్చిన నా చేలంబులు ముచ్చిలి యిచ్చినవిధంబు మూలం బెల్లన్. 1478

శా. ఏకాంతంబున నీదుపై నొరగి తా నే మేని భాషించుచో
మాకాంతుండు వంచించునే [7]రవిసుతామధ్యప్రదేశంబునన్

1. ఉత్కలిక-ఎక్కువతమకము, 2. ఇమ్మ-ప్రీతి, 3. ఉమ్మలికంబు-దుఃఖము, 4. డాఁగనా. మఱుఁగుల—పాఠాంతరము, 5 మఱవులు-చాటులు, 6. నర్మగృహంబులు—రహస్యాగారములు, 7. రవిసుత—యమునానది,

రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు [1]విన్నాణముల్. 1479

సీ. తనుఁ బాసి యొక్కింతతడవైన నిటమీఁద నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యటమున్న ధైర్యంబు లొక్కటఁ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగినపిమ్మటఁ జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడ జిక్కక వచ్చినఁ బ్రాణంబు లుండక పాయు ననుము
తే. ప్రాణములువోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు ప్రాణిరక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్లఁ
జేరి దూఱఁగ మఱి యేమి సేయువాఁడు? వేగ విన్నప మొనరింపవే మహాత్మ! 1480

క. తగులరె మగలను మగువలు? దగులదె తను మున్ను కమల? దగవు విడిచియుం
దగిలిన మగువల విడుచుట దగుఁ దగ దని తగవు వలుకఁ దగుదువు హరికిన్. 1481

సీ. విభుఁడు మాత్రేపల్లెవీథుల నేతేరఁ జూతుమే యొకనాఁడు చూడ్కు లలర?
ప్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప విందుమే యొకనాఁడు వీను లలర?
దనువులు పులకింప దయితుండు డాసినఁ గలఁగునే యొకనాఁడు కౌఁగిలింపఁ?
'ప్రాణేశ! మమ్మేల పాసితి' వని దూఱ దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ?
తే. వచ్చునే హరి మే మున్నవనముఁజూడఁ? దలఁచునే భర్త మాతోడితగులు తెఱఁగుఁ?
దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక? యెఱుఁగఁబలుకు మహాత్మ? నీకెఱుఁగవచ్చు. 1482

వ. అని 'దుఃఖార్ణవమగ్నంబైన గోకులంబు నుద్ధరింపుము రమానాథ!' యని గోపికలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవ [2]నిగదితంబయిన కృష్ణసందేశంబువలన విరహవేదనలు విడిచి, యుద్ధవునిం బూజించి; రిట్లు కృష్ణలీలా వర్ణనలుసేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్ని నెలలుండి నందాదుల వీడ్కొని మరలి రథారూఢుండై చనిచని. 1483

క. సారమతిఁ బ్రణుతి సేయుచు నారయ నుద్ధవుఁడు గాంచె నఘసంహారిన్
హారిన్ మధురానగరవిహారిన్ రిపుజనమదాపహారిన్ శౌరిన్. 1484

వ. కని యథోచితంబుగా సంభాషించుచుఁ దనచేత నందాదులు [3]పుత్తెంచిన [4]కానికలు బల కృష్ణులకు, నుగ్రసేనునికి వేఱువేఱ నిచ్చెనని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1485

## —: కృష్ణుం డుద్ధవునితోఁ జేర కొని కుబ్జాగృహంబునకు నరుగుట :—

మ. తను మున్నంగజకేళిఁ గోరిన లతాతన్విన్ రతిక్రీడలం
[5]దనుపంగోరి జనార్దనుం డరిగె రత్నస్వర్ణమాల్యానులే

---

1. విన్నాణముల్—నేర్పులు, 2. నిగదితంబు—చెప్పఁబడినది, 3. పుత్తెంచిన-పంపిన, 4. కానికలు-బహుమానములు, 5. తనుపన్-తృప్తిపొందింపఁగా,

పనభూషాంబరధూపదీపపరిదీప్తంబై మనోజ్ఞప్రదీ
పనమై యున్న తదీయ గేహమునకుం [1]బంచేషుపంచేషుఁడై. 1486

వ. ఇట్లరిగి తద్గేహమధ్యంబున. 1487

ఆ. కాముశరమువోలెఁ గమలారికళవోలెఁ మెఱుఁగు యాడ నేర్పు మెఱపుఁబోలె
నిఖిలభువనమోహినీ దేవతయుఁబోలెఁ జెలువు మెఱసియున్న చెలువఁగనియె. 1488

మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో నాళీసమూహంబుచే
సిరియొప్పన్ విహితోపచారములు తాఁ జేయించి సౌవర్ణసుం
దరతల్పస్థితుఁ జేసి యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి భా
సురపీఠంబున నుండు మంచు మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్. 1489

క. [2]ఆళీనివహనివేదిత మాలామృగనాభిపంక మణిమయభూషా
చేలాలంకృత యగుచును హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్, 1490

క. లీలావతీకృతోల్లసదేలాకర్పూరమిళితహితమధురమహా
[3]హాలారసపానమద శ్రీలాలిత యగుచు నబల చేరెం గృష్ణున్. 1491

మ. సరసాలోకనవృష్టి పైఁ గురియుచున్ సమ్యగ్వచోవైఖరిం
గరఁగం జేసి సువర్ణకంకణసమగ్రం బైన సైరంధ్రికేల్
కరపద్మంబునఁ బట్టి తల్పమున కాకర్షించి గంభీరతం
బరిరంభాదుల [4]నానపుచ్చి మరు సంభావించుచున్ వేడుకన్. 1492

ఉ. జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావచేష్టలున్
ధాతువుఁ బ్రాయముం గుణముఁ దద్దశయున్ హృదయంబు జూడ్కియుం
బ్రీతివిశేషముం దెలిసి పెక్కువిధంబులఁ దొయ్యలిన్ మనో
జాతసుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారియై. 1493

క. కరపద్మంబుల మాధవుఁ గరమొప్పం గౌఁగిలించి కామానలముం
[5]గరభోరువు వర్ణించెను గర మరు దని తోడి శీతకరముఖు లలరన్. 1494

మ. సనకాదుల్ తలపోసి కానని విభున్ సర్వప్రభున్ దుర్లభున్
మును దా నిచ్చిన యంగరాగసుకృతామోదంబునం గూడియున్
ఘననిర్వాణవిభూతి యిమ్మనక యా కంజాక్షి 'యేఁ బాయఁజా
ల ననుం గొన్నిదినంబు లంగభవలీలం దేల్పవే?' నావుడున్' 1495

---

1. పంచేషుఁడు-మన్మథుఁడు, 2. ఆళీనివహము-చెలికత్తెలగుంపు, 3. హాలారసపానము-మద్యపానము. 4. నాన-సిగ్గు, 5. కరభోరువు-మణికట్టు మొదలు చిటినవ్రేలి మొదటివఱకు నుగల భాగమువంటి తొడలుకలది,

ఆ. వనిత గోరుకొనిన వర మిచ్చి శౌరి యా యుద్ధవుండుఁ దాను నువిదయిల్లు
వెడలెనపుడు తియ్యవిలుకాఁడు [1]సురభితోఁ దీగయిల్లు వెడలు తెఱఁగు మెఱయ 1496

క. ఏ వేదంబులఁ గానని దేవోత్తముఁ గాంచి ముక్తితెరు వడుగక రా
జీవేక్షణ రతి యడిగెను భావింపఁ దదీయకర్మఫల మెట్టిదియో? 1497

క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు తారుణ్యము మెఱసి మదనతంత్రంబుల లీ
లారణ్య వీథిఁ దేల్చెను, [2]సైరంధ్రిన్ విభవవిజితశక్రపురంధ్రిన్. 1498

వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవరామసహితుండై హస్తినాపురమునకు నక్రూరునిం బనుపం దలంచి తద్గృహంబునకు జనిన, నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగిలించుకొని వారి నందఱ యథావిధిం బూజించి హరిపాదంబులు దన తొడలమీఁద నిడుకొని యిట్లనియె. 1499

క. 'అనుచరులుఁ దానుఁ గంసుఁడు సనియెన్ నీచేత జమునిసదనంబునకున్
ఘనులార! మీబలంబున నొనరఁగ యాదవులవంశ ముద్ధృత మయ్యెన్. 1500

వ. మహాత్ములారా? మీరు [3]విశ్వాదిపురుషులరు, విశ్వకారణులరు, విశ్వమయులరగు మీకుం గార్యకారణంబులు లే; వవధరింపుము. పరమేశ్వరా; నీవు రజోగుణంబున నఖిలంబు సృజియించి, గారణరూపంబునఁ దదనుప్రవిష్టుండవై, శ్రుతదృష్ట కార్యరూప ప్రపంచాకారంబున దీపించుచుందువు. కార్యరూప చరాచర దేహంబులునై ప్రకాశించుచందంబున నొక్కండవు కారణరహితుండవు నాత్మతంత్రుండవునై యుండియు విశ్వకారణంబున బెక్కగుదువు. సృష్టిస్థితిలయంబులం జేయుచుండియు విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుండైన జీవునిభంగి గుణకర్మబద్ధుండవు కావు, కావున సిద్ధంబు తన్నిమిత్తంబు బంధహేతువును సిద్ధింపదు. 1501

సీ. పరఁగ జీవునినైన బంధమోక్షము లంట వంటునే పరతత్త్వ మైన నిన్ను
నంటునే యీశ! దేహాద్యుపాధులు ననిర్వచనీయములు గన వరుస నీకు
జన్మంబు జన్మసంశ్రయభేదములు లేవు కావున బంధమోక్షములు లేవు
గణుతింప ని న్నులూఖలబద్ధుఁ డనుటయు నహిముక్తుఁ డనుటయు నస్మదీయ
ఆ. బాలబుద్ధి గాదె? పాషండముఖరమార్గములచేత నీ జగద్ధితార్థ
మైన వేదమార్గ మడఁగి పో వచ్చిన నవతరించి నిలుపు దంబుజాక్ష! 1502

క. ఆ నీవు ధరణిభారము మానిచి రక్కసుల నెల్ల మర్దించుటకై
యానకదుందుభియింటను మానుగ జన్మించితివి సమంచితకీర్తిన్. 1503

---

1, సురభి-వసంతర్తువు, 2. సైరంధ్రి-పరగృహమున గౌరవముగా జీవించు విదుషి, 3. విశ్వాదిపురుషులు—లోకములకు మూలపురుషులు.

మ. త్రిజగత్పావనపాదతోయములచే దీపించి వేదామర
ద్విజముఖ్యాకృతివైన నీవు కరుణన్ విచ్చేయుటం జేసి మా
నిజ [1]గేహంబులు ధన్యతం దనరెఁ బో! ని న్నార్యు లర్చింపఁగా
నజితత్వంబులు వారి కిత్తు వనుకంపాయత్తచిత్తుండవై. 1504

శా. ఏ పుణ్యాతిశయప్రభావముననో యీ జన్మమం దిక్కడన్
నీపాదంబులు గంటి ని న్నెఱిఁగితిన్ నీవుం గృపాళుండవై
నాపై [2]నర్మిలిఁ జేసి మన్పఁగదవే నానాధనాగారకాం
తాపుత్రాదులతోడిబంధనము భక్త[3]వ్రాతచింతామణీ!' 1505

వ. అని పలికిన నగుచు నక్రూరునికి మాటలవలన సంసారబంధం బగు మోహంబును [4]గీలుకొలుపుచు హరి యిట్లనియె. 1506

—: కృష్ణుఁ డక్రూరుని హస్తినాపురమునకుఁ బంపుట :—

క. బంధుండవు సద్యోహిత సంధుండవు వావిఁ జూడ జనకుఁడవు కృపా
[5]సింధుండ వెల్లగుణముల నంధుండవు గావు ప్రోవ నర్హుఁడ వెందున్. 1507

చ. కొలుతురు మర్త్యు లిష్టములు గోరి శిలామయదేవసంఘమున్
జలమయతీర్థసంఘమును సంతతము న్నటు వారు గొల్వఁగా
వల దన రాదు గాక భగవత్పదభక్తులరైన మీక్రియన్
సొలయక దేవతీర్థములు చూచినయంతనె కోర్కు లిచ్చునే? 1508

వ. మహాత్మా; పరమభాగవతుండవైన నీవు మా కభీష్టంబు లొనరింప నర్హుండవు: వినుము; పాండురాజు పరలోకగతుం డైనఁ గుంతీసహితులైన పాండవులు ధృతరాష్ట్ర శాసనంబున గరిపురంబున నున్నవా రఁట. నిజపుత్రమోహితుండగు నయ్యంధనృపతి వారియందు సమత్వంబునం జరింపం డటుగావున. 1509

క. వారలు బంధులు గావున వారలకును మే లొనర్చి వా రలరంగా
వారింప వలయు దుస్థితి [6]వారిజరిపువంశ పొమ్ము వారిం జూడన్. 1510

వ. అని పలికి సంకర్షణోద్ధవసహితుండై హరి నిజగృహంబునకుం జనుటయు నక్రూరుండు కౌరవరాజధాని యగు కరిపురి కరిగి యందు ధృతరాష్ట్రభీష్మవిదురబాహ్లికభారద్వాజ గౌతమదుర్యోధన కర్ణాశ్వత్థామాదులం గుంతీసహితులైన పాండవులం దక్కిన బంధువు

1. గేహంబులు—గృహములు, 2. అర్మిలి—వాత్సల్యము, 3. వ్రాతము—గుంపు, 4. కేలుకొలుపుచు—కలిగించుచు, 5. సింధుండవు—సముద్రుఁడవు, 6. వారిజరిపువు—చంద్రుఁడు.

లనుం గని, యథోచితసత్కారంబుల నంది తద్వర్తనంబు లెఱింగికొనుచుఁ గొన్నిదినము లుండ నొక్కనాఁడు విదురుండు విన నేకతంబున నక్రూరునికిం గుంతి యిట్లనియె. 1511

శా. 'అన్నా తల్లులుఁ దండ్రులున్ భగినులు న్నల్లుండ్రు మద్భ్రాతలున్
నిన్నుం బొమ్మనువేళ నే మనిరి? మా [1]నెవ్వల్ విచారింతురే?
యున్నారా సుఖయుక్తులై? మృగి వృకవ్యూహంబులో నున్న రే
ఖ న్నే నిక్కడ నున్నదానఁ గుమనఃకౌరవ్యమధ్యంబునన్. 1512

మ. కలపించెన్ ఫణికోటిచే లతికలం గట్టించి గంగానదిన్
నెఱిఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ నిద్రారతిం జెంది యే
మఱి యుండం బొడిపించె నాయుధములన్ మత్పుత్రులం దేమియుం
[2]గొఱగాఁ డీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు గార్యంబులన్. 1513

మ. బలుఁడుం గృష్ణుఁడు నెన్నడైనఁ దమలో భాషించి మేనత్తబి
డ్డలకున్ మేలు దలంతురే? వగపులన్ డయ్యంగఁ జాలై రయో
జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ [3]డిలాచక్రంబు భాగించి యి
మ్మల నిప్పించునె నాకుమారకులకున్ ముఖ్యప్రకారంబునన్?' 1514

వ. అని పలికి కృష్ణునిఁ జిత్తంబునఁ నిల్పి నమస్కరించి [4]సంకీర్తనంబు చేసి, 'సర్వాత్మక సర్వపాలక! పుండరీకాక్ష! శరణాగతనైన నన్ను రక్షింపు' మని వగచుచున్న కుంతికి నక్రూరుండు విదురసమేతుండై ప్రియవచనంబుల దుఃఖోపశమనంబు సేసి వీడ్కొని బంధుమిత్రమధ్యంబున సుఖోపవిష్టుఁడై యున్న ధృతరాష్ట్రున కిట్లనియె. 1515

ఉ. నీయనుజుండు పాండుధరణీవిభుఁ డీల్గిన నీవు భూమి ధ
ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్రజావళిఁ గాచుచు గౌరవంబుతోఁ
బాయక లోకులందు సమభావన చేసితివేనిఁ గీర్తియున్
శ్రేయము గల్గు వే ఱొకటి సేసిన దుర్గతి గల్గు భూవరా! 1516

సీ. అవనీశ పాండవులందు నీనందనులందు సమానుండ వగుట [5]బుద్ధి
యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య మంగనాగారపుత్రాదికముల
వలన నయ్యెడి దేమి? వసుమతి నొక జంతు వుదయింప నొకజంతు [6]వుక్కడంగు
నొకఁడు పుణ్యముఁ జెంద నొకఁడు పాపమునొందు మీనజీవనభూతమిశితజలము
ఆ. తత్తనూజ లెట్లు ద్రావుదు రట్లు మూఢాత్ముని [7]విత్త మెల్ల నపహరింతు
రహితులైన కొడుకు లటమీఁద మనియైనఁ జచ్చియైనఁ దండ్రిఁజూడఁ జనరు. 1517

1. నెవ్వల్—శ్రమలు, 2. కొఱ—ప్రయోజనకారి, 3. ఇలాచక్రంబు—భూమండలము, 4. సంకీర్తనంబు — స్తుతి, 5. బుద్ధి—మేలు, 6. ఉక్కడంగు — నశించును, 7. విత్తము—ధనము,

క. కావున మూఢాత్ముఁడవై నీ వార్జించిన ధనంబు నీ పుత్రులు [1]దు
ర్భావులు పుచ్చుకొనంగా భూవర నిందితుఁడ వగుదు భూనాకములన్. 1518

శా. నిందం బొందకుమయ్య? యీ తనువు దా నిద్రాకళాదృష్టమా
సందోహంబు విధంబు నిల్వదు సుమీ జాత్యంధతన్ బొందియున్
మందప్రజ్ఞత లేల చేసెదవు? సమ్యగ్జ్ఞానచక్షుండవై
సందేహింపక యిమ్ము పాండవులకున్ [2]సర్వంసహాభాగమున్. 1519

వ. అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె. 1520

సీ. 'నీమాట మంచిది; నిశ్చయమగు నైన నస్థిరంబైన నా యంతరంగ
మందు నిల్వదు సుదామాచలస్ఫటికశిలాతలోద్యతతటిల్లతిక భంగి
నస్మృతంబు నొందియు నానందితుఁడు గాని నరుమాడ్కి నేను నానంద మొంద
నీశ్వరాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింపనోపు? విజ్ఞానియై యుండి యైన
ఆ. విశ్వ మెల్లఁ జేసి విభజించి గుణముల నెవ్వఁ డనుసరించె నెవ్వఁ డవని
భార మెల్లఁ బాయఁ బ్రభవించె దేవకి కెవ్వఁ డాత్మతంతుఁ డీశ్వరుండు. 1521

వ. అట్టి కృష్ణునకు నమస్కరించెద; నా నందనందనునిదివ్యచిత్తంబునం గల తెఱంగున బ్రదు
కంగలవార' మని వీడ్కొలిపిన నక్రూరుం డతనితలం పెఱింగి యిట్లనియె 'నీ తలంపుఁ
గనుంగొంటి! నీ కిష్టం బగునట్లు వర్తింపు'మని పలికి మగలి మధురకుం జనుదెంచి తదీయ
వృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె; నంతఁ గంసభార్యలగు నస్తియుఁ బ్రాప్తియు
విధవలై దుఃఖించుచుం దమ తండ్రియైన జరాసంధుకడకుం జని. 1522

శా. 'వాండ్రున్ వీండ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితో యాదవుల్
[3]వేండ్రం బైన బలంబుతో మథురకున్ వే వచ్చి నిష్కారణం
బాండ్రున్ బిడ్డలు బంధులున్ వగవఁ గంసాదిక్ష్మానాథులం
దండ్రీ! చంపిరి కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెం జుమీ!' 1523

వ. అనిన విని ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి శోకరోషంబులు [4]బంధురంబులుగా
జరాసంధుం డిట్లనియె. 1524

శా. 'ఏమీ? కృష్ణుఁడు కంసునిన్ రణములో హింసించె నోచెల్లి! నా
సామర్థ్యంబు దలంపఁ డించుకయు మచ్చండప్రతాపానలో
ద్దా[5]మార్చుల్ వడి నేఁడు గాల్చు యదుసంతానాటవీవాటికన్
భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాఁకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్. 1525

---

1. దుర్భావులు-దుష్టస్వభావముకలవారు. 2. సర్వంసహ-భూమి. 3. వేండ్రంబు-తీవ్రము. 4. బంధురంబులు- అధికములు, 5. అర్చుల్-జ్వాలలు,

క. యాదవవిరహిత యగుఁ బో మేదిని నాచేత నేఁడు మీఁదుమిగిలి సం
పాదితబలులై హరిరుద్రాదులు నిండ్రాదు లెవ్వ రడ్డం బైనన్.' 1526

—:జరాసంధుఁడు మథురమీఁద దండెత్తి వచ్చి కృష్ణునితో యుద్ధము సేయుట:—

వ. అని పలికి సమరసన్నాహసంకులంబగు చిత్తంబునఁ గోపంబు దీపింప సంగరభేరి వ్రేయించి కదలి. 1527

క. [1]దక్షుండై యిరువదిమూఁ [2]డక్షౌహిణులైన బలము లనుగతములుగా
నా క్షణమ జరాసంధుఁడు ప్రక్షోభముతోడ మథురపైఁ జనియె నృపా! 1528

క. గంధేభతురగరథభట బంధుర చరణోత్థితోగ్ర [3]పాంసుపటలయో
గాంధీభూతములై దివి మంథరగతి నడచె నపుడు [4]మార్తాండహరుల్. 1529

వ. ఇట్లు చని నిరంతరకిసలయపత్రకోరకకుసుమఫలభారవినమిత వృక్షవిలసిత మహోద్యానంబును, నుద్యానవనభాగ వలమాన జలోన్నయన దారుయంత్ర లతానిబద్ధకలశ విముక్త సలిలధారాశీకర పరంపరా సంపాదిత వర్షాకాలంబును, [5]గాలకింకర సదృశ వీరభట రథ తురగసామజానీక సంకులంబును, గులాచారధర్మప్రవీరపౌరజన భాసురంబును,సురాభేద్యమాన మహోన్న [6]తాట్టాలకయంత్ర భయంకర ప్రాకారచక్రంబును,జక్రసారస హంసాది కలకలారావ కలిత సరోవరంబును, సరోవరసంపుల్లహల్లకకమలపరిమళమిళిత పవనవిరాజితంబును, జితానేకమండలేశ్వరభూషణమణిగణరజోనివారిత మద గజేంద్రదానజల ప్రభూతపంకంబును, బంకరహితయాదవేంద్రదత్తసువర్ణాచల కల్పతరు కామధేను సమ్మర్దిత విద్వజ్జననికేతనంబును, కేతనసన్నిబద్ధ [7]చామరమయూరచాపశింజినీనినదపరిపూరితాభ్రంబును, నభ్రంలిహ మహాప్రాసాద సౌధ గవాక్షరంధ్ర నిర్గత ఘనసారధూమపటల విలోకనసంజనిత జలధర భ్రాంతివిభ్రాంతశిఖండితాండవరుచిరంబును, జిరతరానేక దేవాలయ జోఘుష్యమాణతూర్యనినద పరిభావిత పారావారకల్లోలఘోషంబును, కామినీప్రాణ వల్లభబాహుదండపరిరక్షితంబునై, [8]పరులకు నలక్షితంబైన మథురానగరంబు సేరి వేలాలంఘనంబుసేసి వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగునం బట్టణంబునకు [9]ముట్టణంబు చేసి, చుట్టును విడిసిన జరాసంధుని బలంబుఁ గనుంగొని బలానుజుండగు హరి దన మనంబున. 1530

---

1. దక్షుండు-సమర్థుఁడు, 2. అక్షౌహిణి-21870 రథములు, అన్నియే ఏనుగులు,రథసంఖ్యకు మూఁడురెట్లు గుఱ్ఱములు, 109350 కాల్బలము కలసేన, 3. పాంసుపటలము-ధూళిసమూహము, 4. మార్తాండహరుల్-సూర్యునిగుఱ్ఱములు, 5. కాలకింకరులు-యమభటులు, 6. అట్టాలకము-కోటబురుజు, 7. చాపమయూర శింజినీ—పాశాంతరము, 8. పరులు-శత్రువులు. 9. ముట్టణంబు-ముట్టడి.

శా. ఐదున్నాలుగునాఱు రెండు నిరుమూఁడక్షౌహిణుల్ సుట్టి సం
ఛాదించెం బుర మెల్ల మాగధునెడన్ సామంబు దానంబు సం
భేదంబుం బని లేదు దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ
భూదేవీవరభార మెల్ల నుడుపం బోలున్ జయోద్భాసినై. 1531

క. ఏ నవతరించు టెల్లను మానుగఁ జతురంతధరణిమండలభరమున్
మానుపు కొఱకుం గాదే? పూనెద నిది మొదలు దగిలి భూభరముడుపన్. 1532

ఆ. మగధనాథుఁ బోర [1]మడియింపఁ బోలదు మడియకున్న వీఁడు మరలి మరలి
బలముఁ గూర్చుకొనుచుఁ బఱతెంచుఁ బఱతేరఁ ద్రుంప వచ్చు నేల [2]దొసఁగు దొఱఁగ. 1533

వ. అని యిట్లు తలపోయుచున్న సమయంబున నభోభాగంబున నుండి మహా ప్రభాసమేతంబు
లును, సపరిచ్ఛద సూతంబులును ననేకబాణబాణాసన చక్రాదివివిధాయుధోపేతంబులు
నైన రథంబులు రెండు మనోరథంబులు పల్లవింప, దైవయోగంబునఁ జేర వచ్చినం జూచి
హరి సంకర్షణున కిట్లనియె. 1534

శా. 'కంటే రామ! రథంబు లాయుధములున్ గాఢప్రకాశంబులై
మింటన్ వచ్చెను వీనిఁ గైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులన్
[3]బంటింప బని లేదు చంపుము ధరాభారంబు వారింపు మీ
వెంటన్ నీ యవతారమున్ సఫల మౌ వేవేగ లె మ్మాజికిన్.' 1535

వ. అని పలికి. 1536

క. [4]ఖరులై దృఢకవచధను శ్శరులై యధిగతరథానుచరులై మదవ
త్కరులై ఘనహరులై బల హరు లయ్యెడ నాజి కేఁగి రతిభీకరులై. 1537

వ. ఇట్లు సమరసన్నాహంబునం బురంబు వెడలి. 1538

ఉ. అర్యులు దల్లడిల్ల దనుజాంతకుఁ [5]డొత్తె గభీరఘోషకా
ఠిన్యమహాప్రభావవికటీకృతపద్మభవాండజంతుచై
తన్యము ధన్యమున్ దివిజతాపసమాన్యముఁ బ్రీతభక్తరా
జన్యము భీతదుశ్చరితశాత్రవసైన్యము బాంచజన్యమున్. 1539

క. [6]సింధుర భంజనపూరిత బంధురతరశంఖనినదభారమున జరా
సంధునికిం గల సైన్యము లంధములై సంచలించె నాహవభూమిన్. 1540

వ. అయ్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె. 1541

---

1. మడియించుట-చంపుట, 2. దొసఁగు-హాని, 3. పంటింపన్-జాలముచేయఁగా,
4. ఖరులు- కఠినులు, 5. ఒత్తెన్-పూరించెను, 6. సింధురము-ఏనుఁగు.

సీ. 'అదలించి రొప్పంగ నాలమందలు గావు గంధగజేంద్రసంఘములు గాని
పరికించి వినఁగ నంభారవంబులు గావు వాజీంద్ర హేషారవములు గాని
పదహతిఁ గూల్పంగఁ [1]బ్రాత్రబండ్లివి గావు, నగసమానస్యందనములు గాని
ప్రియము లాడంగ నాభీరలోకము గాదు కాలాభవైరివర్గంబు గాని
తే. యార్ప వనవహ్ని గాదు బాణాగ్ని గాని మఱియ బృందావనము గాదు [2]మొనలు గాని
యమున గాదు నటింప ఘోరాజి గాని పోరు నీ కేల గోపాల! పొమ్ము పొమ్ము. 1542

మ. తరుణిం జంపుటయో బకుం గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో
ఖరముం ద్రుంచుటయో ఫణిం బఱపుటో గాలిన్ నిబంధించుటో
గిరి హస్తంబునఁ దాల్చుటో? లయమహాగ్నిస్ఫారదుర్వారదు
ర్భరబాణాహతి నెట్లు నిల్చెదవు సప్రాణుండవై గోపకా! 1543

వ. అదియునుం గాక. 1544

సీ. గోపికా [3]వల్లకీమోషణంబులు గావు శింజినీరవములు చెవుడుపఱుచు
పల్లవీకరముక్తవారిధారలు గావు శరవృష్టి ధారలు [4]చక్కు సేయు
ఘోషాంగనాపాంగకుటిలాహతులు గావు నిశితాసినిహతులు నిగ్రహించు
నాభీరకామినీహస్తాబ్జములు గావు ముష్టిఘాతంబులు మురువు డించు;
తే. నల్ల వ్రేపల్లె గాదు ఘోరావనీశ మకరసంఘాతసంపూర్ణమగధరాజ
వాహినీ సాగరం బిది వనజనేత్ర! నెఱసి నిను దీవికైవడి నేఁడు ముంచు. 1545

వ. అనిన శ్రీహరి యిట్లనియె. 1546

ఉ. పంతము లేల? తొల్లి జనపాలురఁ బోరుల గెల్చినాఁడ వం
ద్రంతియ చాలదే? బిరుదు లాడుట [5]బంటుతనంబుత్రోవయే?
యింతటఁ దీఱెనే? మగధ! యేటికిఁ బ్రేలెదు? నీవ యేలక
ల్పాంతమహోగ్ర పావకునినైన హరింతు వరింతు సంపదన్. 1547

క. గోపాలుఁడ వని పలికితి భూపాలక! దీన నేమి? పోరాడంగా
గోపాలమహీపాల వ్యాపారాంతరము దెలియవచ్చుం బిదపన్. 1548

వ. అనిన రోషబంధురుండై జరాసంధుం డిట్లనియె. 1549

ఉ. 'బాలుఁడ వీవు కృష్ణ! బలభద్రునిఁ బంపు రణంబు సేయ; గో
పాలకబాలుతోడ జనపాలశిఖామణి యైన మాగధుం

---

1. బాటబండ్లును—పాఠాంతరము, 2. మొనలు - సేనలు, 3. వల్లకి — వీణ,
4. చక్కసేయు - ఖండించును, 5. బంటుతనంబుత్రోవ — పరాక్రమపద్ధతి.

[1]డాలము సేసె నంచు జను లాడెడిమాటకు సిగ్గు పుట్టెడిం
జాలుఁ దొలంగు దివ్యశరజాలుర మమ్ము జయింపవచ్చునే? 1550

వ. అనిన నగధరుం డిట్లనియె. 1551

క. పొగడుకొనుదురే శూరులు? మగఁటిమిఁ జూపుదురు గాక? మాగధ! నీకున్
మగతనము గలిగెనేనిం దగు మెఱయ [2]వికత్థనములు దగ వీ పోరన్.' 1552

వ. అనిన రోషించి. 1553

చ. పవనుఁడు మేఘరేణువుల భాను [3]కృశానులఁ గప్పుకై వడిన్
వివిధబలౌఘముం బనిచి వేగమ మాగధుఁ డావరించె భూ
మ్యవన చరిష్ణులం [4]గువిమతావనినాథనిరాకరిష్ణులన్
దివిషదలంకరిష్ణుల నతిస్థిరజిష్ణుల రామకృష్ణులన్. 1554

మ. హయహేషల్, గజబృంహితంబులు. రథాంగారావముల్, శింజినీ
చయటంకారములున్, [5]వివర్ధితగదాచక్రాస్త్రనాదంబులున్,
జయశబ్దంబులు, భేరిభాంకృతులు, నిస్సాణాది ఘోషంబులున్
భయదప్రక్రియ నొక్కపెట్టఁ జెలఁగెన్ బ్రహ్మాండభేదంబుగన్. 1555

వ. మఱియు నయ్యెడ మాగధమాధవ [7]వాహినులు రెండు దొండొంటి దాఁకి, రౌద్రంబున సంవర్తసమయసముద్రంబులభంగి నింగికిం బొంగి, చెలంగి, చలంబునం దలపడి పోరు నెడ మసరు కవిసి మహారణ్యంబులు వెలువడి మార్కొను మదగజంబులమాడ్కిని, మహోత్కటంబులగు కంఠీరవంబుల తెఱంగునఁ దుర్లభంబులగు శరభంబులచాడ్పునం, బ్రచండంబులగు గండభేరుండంబులగమనికం దమతమమొనలకుం [8]దలకడచి వీరరసంబు వివిధ రూపంబులైన విధంబునం బుగురు, నూర్వురు, వేవురు, గములై కులకుధర గుహాంత రాళంబులు నిండ సింహనాదంబు లొనర్చుచు, నార్చుచు, నట్టహాసంబులు సేయుచు, నరివీరుల రోయుచుఁ, బటహకాహళభేరీశంఖశబ్దంబులకు నుబ్బుచు. గర్వంబునం బ్రబ్బుచు, గదలవ్రేయుచుఁ, గాండంబుల నేయుచు ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచు, గుంతంబుల గ్రుచ్చి యెత్తుచుఁ, గరవాలంబులు ద్రెంచుచుఁ జక్రంబుల ద్రుంచుచు, శస్త్రంబులం దఱుఁగుచుఁ, జిత్రంబుగఁ దిరుగుచుఁ బరిఘంబులఁ ద్రిప్పికొట్టుచుఁ. బ్రాసంబులం బెట్టుచు, శూలంబులఁ జిమ్ముచు, సురియలఁ గ్రుమ్ముచు, బహుభంగులఁ బరాక్రమించు వీరభటులను. నిబిడనీరంధ్ర నేమి నిర్ఘోషంబుల నాకాశంబు నిరవకాశంబుగ ననర్గళచక్ర

1. ఆలము-యుద్ధము, 2. వికత్థనములు-ఆత్మస్తుతులు, 3. కృశానుఁడు-అగ్ని, 4. విమతమానవనాథ—పాఠాంతరము, 5. విసర్జిత—పాఠాంతరము, 6. నిస్సాణము-ఒకవాద్యము, 7. వాహినులు-సేనలు, 8. తలకడచి-దాఁటి.

మార్గంబులం బడు పదాతులు చదియ, నరదంబులు దోలి వివిధాయుధప్రయోగంబుల వైరుల వ్రచ్చి, చిందఱవందఱ లాడు రథికులును, రథికశరపరంపరలఁ గంపింపక మహామోఘమేఘధారలకుఁ జలింపని ధరణీధరంబులచాడ్పున రథంబులకుం గవిసి కల్పాంత కాలదండిదండ ప్రచండంబులగు [1]శుండాదండంబులు సాఁచి పూఁచి కదనాగ లొడిసి తిగిచి కుదిచి విఱిచి, కూబరములు నుఱుములుగ జిఱజిఱఁ ద్రిప్పివైచియు, భటులఁ జటులగతిఁ బంతులక్రియ నెగురవైచి, దంతంబుల గ్రుచ్చియు, [2]ఘోటకంబుల వ్రచ్చియు విచ్చలవిడిం దిరుగుకరులును వజ్రివజ్రధారలకుం దప్పి [3]కకుప్పలకు నెగయుఱెక్కలు గల గిరులసిరులం [4]బక్కెరలతోడ హేషారవభీషణంబులై మనోజవంబులగు తురంగంబులం బఱపి తురంగపదపాంసుపటల ప్రఘాతబహుళాంధకారంబులు గరకలిత కఠోర ఖడ్గమరీచిజాలంబు నివారించుచు, నానాప్రకారంబులఁ బ్రతివ్యూహంబులం జించి చెండాడు [5]రాహుత్తులు గలిగి సంగ్రామంబు భీమంబయ్యె నందు. 1556

క. చెడు రథములఁ దెగు హరులను బడు కరులను మడియు భటులఁ బఱచు రుధిరమున్
మడియు తలఁ లొఱగు తనువులఁ బొడియగు తొడవులును మధురిపునిదెసఁ గలిగెన్. 1557

క. భీతంబై, హతసుభట వ్రాతంబై భగ్నతురగవారణరథసం
ఘాతంబై విజయ శ్రీ వీతంబై యదుబలంబు [6]విఱిగె నరేంద్రా. 1558

శా. 'యోధాగ్రేసరుఁ డీ హలాయుధుఁడు లోకోత్కృష్టబాహాబల
శ్రీధౌరేయుఁడు కృష్ణుఁ; డిట్టి ఘనులం జిత్రంబు: నేఁ డిట్లు సం
రోధించెన్; బలముం దెరల్చె; మగధేంద్రుం' డంచు నీక్షించుచున్
సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతప్తలై రెంతయున్. 1559

వ ఇట్లు దన మొనలు విఱిగి పాఱినం గనుంగొని, సమరసంరంభంబున హరి విశ్వంభరా భరణవేదండశుండాభంబులగు బాహుదండంబులు వెంచి, విజృంభించి, బ్రహ్మాండకుహర కుంభపరిస్ఫోటనంబగు పాంచజన్యనినదంబు నిబిడనిర్ఘాతశబ్దంబుగా నుదంచితపింఛదామంబు సంక్రందనచాపంబుగాఁ, బ్రశస్తహస్తలాఘవంబున శరాకర్షణసంధానమోక్షణంబు లేర్పడక, నిర్వక్రచక్రాకారంబుతోడ మార్తాండమండలప్రభాప్రచండంబగు శార్ఙ్గకోదండంబులు క్రొమ్మెఱుంగుగా, దిగ్గజేంద్రకర్ణభీషణంబులగు గుణఘోషణంబులు ఘుమ ఘుమారావదుస్సహంబులయిన గర్జనంబులుగా, రథతురంగమరింఖాసముద్ధూతపరాగపటల పరంపరాసంపాదితపుంజీభూతంబగు పెంజీకటి యిరులుగా, నసమసమర సన్నాహచాతురీ విశేషంబులకుం జొక్కి, నిక్కి కరంబు లెత్తిన నర్తనంబులం బ్రవర్తించునారదహస్తవిన్యాసంబులు లీలాతాండవమండిత మహోత్కంఠంబులగు నీలకంఠంబులుగా, సుందరస్యందన

1. శుండాదండంబులు-దండములవంటి తొండములు 2. ఘోటకంబులు-గుఱ్ఱములు
3. నుప్పరంబుల కెగయు;యుప్పర కెగయు — పాఠాంతరములు, 4. బక్కెరలు-జీనులు,
5. రాహుత్తులు-గుఱ్ఱపు రౌతులు, 6. విఱిగె-వెనకకుఁబోయెను.

[1]నేమినిర్ఘోషభీతులయి కుంభికుంభంబులపై వ్రాలు వీరులు మత్తమయూరకేకారవ చకితులై యువతికుచకుంభములమీఁద వ్రాలెడు కాముకులుగా, నానానరేంద్రరక్తపిపాసా పరవశంబులై వాచఁజచుచున్న భూతవ్రాతంబులు వర్షవర్షేతినిస్వనంబులొసంగు చాతకంబులుగా, నభంగసంగరప్రేరకుండగు [2]హలాయుధుండు వృష్టికారణంబగు మందసమీరణంబులుగా, ననల్పకల్పాంతకాలనీలవలాహకంబుభాతిం జరఁగు మేనిచాయతోడం దోయజనాభుం డరాతిచతురంగదేహక్షేత్రంబులం బుంఖాను పుంఖంబులుగ నసంఖ్యాతబహువిధ దివ్యబాణవర్షంబులు గురియునెడ శస్త్రాస్త్ర పరంపరాసంఘట్టనజనితంబు లగు మిడుఁగుఱులు వర్షాకాలవిహితవిద్యోతమాన ఖద్యోతంబులును, విశిఖవికీర్ణవీరకోటీరఘటిత పద్మరాగశకలంబు [3]లింద్రగోపంబులును, మహితమార్గణవిదళితమత్తమాతంగకుంభమౌక్తికంబులు వడగండ్లును, జటులార్ధచంద్రశరచ్ఛిన్నచరణంబు లయి 'కృష్ణ! కృష్ణ! నిలు నిలు' మని పలుకుచుం గూలెడు మేనులు కృషీవలకరపరశుధారావిదళితమూలవిశాలసాలంబులును, భాసురభల్లభగ్నంబులయిన వదనగహ్వరంబులవలన డుల్లెడు దంతపుంజంబులు మాలతీకుసుమ మంజరులును, నవ్యనారాచభిన్న దేహంబులయి దిగ్గనఁ [4]గ్రొగ్గండ్లవలన వెడలు రక్తస్యందసందోహంబులతో సంచరింపక ప్రాణంబులు విడుచు శుండాలంబులు సెలయేటులతోడి కొండలును, గఠోర [5]కాండఖండితంబు లయిన భుజాదండంబులతోడఁ గలసి పడినవజ్రమయకంఠికాభరణంబులు భోగిభోగ సమేత కేతకీసుమంబులును, ప్రళయార్ణవకల్లోలశబ్దసన్నిభంబులయిన భేరీరవంబులు భీకర [6]భేకనికరారవంబులును, దారుణేషువిలూనవాహవారణ మనుజమస్తిష్కంబు రొంపియునై సొంపుమెఱయ, నాభీల [7]కీలాలప్రవాహంబులు ప్రవహించె; నందు భుజంబులు భుజంగంబులుగఁ, గపాలంబులు కమఠంబులుగ, శిరోజంబులు శైవాలంబులుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ, గజంబులు దీవులుగ, ధవళచ్ఛత్రంబులు నురువులుగఁ, జామరంబులు గలహంసంబులుగ, భూషణరత్న రేణురాసులు [8]పులినంబులుగ నొప్పె; నప్పుడు. 1560

లయవిభాతి. హసితహరినీలనిభ [9]వసనము విశాలకటి
నసమనయనాద్రిపరిలసిత మేఘో
ల్లసనము వహింపఁ, గరకిసలయము హేమమణి
విసరవలయద్యుతులు దెసలతుదలందుం
బసలు గురియంగ, సరభసమున బలుండు దర
హసితము ముఖాబ్జమున నెసఁగ, ఘనకాలా
యసమయమహోగ్రతరముసలము వడిన్ విసరి
[10]కసిమసఁగి శత్రువుల నసువులకుఁ బాపెన్. 1561

1. నేమి—రథచక్రము యొక్క అంచు, 2. హలాయుధుండు—బలరాముఁడు, 3. ఇంద్ర గోపంబులు—ఆరుద్రపురుగులు, 4. క్రొగ్గండ్లు-క్రొత్తగాయములు, 5. కాండములు—బాణములు. 6. భేకము-కప్ప, 7. కీలాలము-రక్తము, 8. పులినంబులు-ఇసుకతిన్నెలు, 9. వసనము-వస్త్రము, 10. కసిమసఁగి-విజృంభించి,

లయ విభాతి, ప్రలయసమయాంతకుని చెలువునఁ గటాక్షముల
నలఘుచటులాగ్ని కణములు సెదరఁ, గోలా
హలముగ సువర్ణ మణివలయనిచయోజ్జ్వలలలిత
హలము వడిఁ జాచి శిరములు నురములు న్ని
ర్దలితములుగఁ శకలములుగ నొనరింపఁ గని,
[1]బెలుకుఱి, జరాసుతునిబలము రణవీథిం
జలితదనుజావలికి బలికి భయభీతసుర
ఫలికిఁ ద్రిజగచ్చలికి హలికిఁ దలఁడించెన్. 1562

శా. రోషోద్రేకకళాభయంకరమహారూపంబుతో నొక్కచే
[2]సీషాదండము సాఁచి లాంగలము భూమీశోత్తమగ్రీవలన్
భూషల్ రాలఁ దగిల్చి రాఁ దిగిచి సంపూర్ణోద్ధతిన్ రోఁకటన్
వేషంబుల్ సెడ మొత్తె రాముఁడు రణోర్విన్ నెత్తురుల్ జొత్తిలన్. 1563

క. హలిహలహృత కరికుంభ స్థలముక్తాఫలము [3]లోలిఁ దనరెఁ గృషికలాం
గలమార్గకీర్ణబీజావలిక్రైవడి నద్భుతాహవక్షేత్రమునన్. 1564

క. తఱిమి హలి హలము విసరుచు నెఱిఁ గదిసిన బెగడి విమతనికరము లెడక్రై
వెఱఁగుపడు నొదుఁగు నడఁగును మఱుపడుఁ జెడు మడియుఁ బొరలు మరలుం దెరలున్

క. [4]హరి [5]తిగ్మగోశతంబుల హరిదంతర మెల్లఁ గప్పునాకృతిఁ గడిమిన్
హరి [6]తిగ్మగోశతంబుల హరిదంతర మెల్లఁ గప్పె నతిభీకరుఁడై. 1566

సీ. పదుగు రేగురు తీర్థ బాణముల్ గాఁడిన గుదులు గ్రుచ్చినభంగిఁ గూలువారుఁ
దలలు ద్రెవ్విన మిన్ను దారు వీక్షించిన వారల నొప్పించి వ్రాలువారుఁ
బదములు దెగి పడ్డ బాహులఁ బోరి నిర్మూలితబాహులై మ్రొగ్గువారు
క్షతముల రుధిరంబు జల్లింప [7]నిర్ఝర యుతశైలములభంగి నుండువారు;
ఆ. భ్రాతృపుత్రమిత్రబంధువుల్ వీఁగిన నడ్డ మరుగుదెంచి యడఁగువారు
వాహనములు దెగిన వడి నన్యవాహనాధిష్ఠు లగుచు నెదిరి త్రెళ్ళువారు. 1567

వ. మఱియును. 1568

శా. 'ఈ కాయంబులఁ డాసినంతటనె మా కెగ్గేమి? జేతృత్వమున్
నీకుం జెల్లదు కృష్ణ; నిర్జరులమై ని న్నోర్తు మామీఁదటన్

1. పెలుకుఱి–విలవిలపోయి, 2. ఈషాదండము—నాఁగలి. 3. ఓలి-క్రమము, 4 హరి-సూర్యుడు, 5. తిగ్మగోశతంబులు-వందలకొలఁదిగ మున్న వాఁడికిరణములు, 6. తిగ్మగోశతంబులు-వందలకొలఁది వాఁడిబాణములు, 7. నిర్ఝరము-సెలయేరు.

వైకుంఠంబున నంచఁ బల్కుక్రియ దుర్వారాస్త్రభిన్నాంగులై
యాకంపింపక కొంద ఱాడుదురు గర్వాలాపముల్ కృష్ణునిన్. 1569

వ. ఇవ్విధంబున. 1570

క. జగతీశ! యేమి సెప్పుదు? నగణితలయవార్ధిభయద మై మూఁగిన య
మ్మగధేశుబలము నెల్లను దెగఁ జూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడన్. 1571

క. భువనభవస్థితివిలయము లవలీలం జేయు హరికి నరినాశన మెం
త విషయ మైన మనుజుఁడై భవ మొందుటఁజేసి పొగడఁబడియెం గృతులన్. 1572

వ. ఆ సమయంబున. 1573

శా. [1]అంహఃకర్ములు తల్లడిల్ల భయదాహంకారుఁడై [2]సీరి దో
రంహం బొప్ప హలాహతిన్ రథధనూరథ్యంబులం గూల్చి త
త్సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా
సింహంబుం బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నే ర్పేర్పడన్. 1574

వ. ఇట్లు పట్టుకొని, 1575

ఉ. కుంఠితులై పరుల్ బెగడ ఘోరబలుండు బలుండు వాని [3]సో
ల్లుంఠము లాడుచున్ విగిచి లోకభయంకరమైన ముష్టిచేఁ
గంఠగతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ భూభరక్షయో
త్కంఠుఁడు చక్రి [4]మీఁ దెఱిఁగి కార్యము గల్దని మాన్పి యిట్లనున్. 1576

శా. 'దుఃఖింపం బనిలేదు పొమ్ము బలసందోహంబులం దెమ్ము చే
తఃఖేదం బెడలంగ రమ్ము రిపులం దండిపు కాదేని భూ
స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ నృప! నీశౌర్యోన్నతుల్ సూపి [5]మే
ధఃఖండంబులు భూతముల్ దినఁ దనుత్యాగంబు సేయందగున్? 1577

వ. అని నగుచు విడిపించిన, చిడిముడికి నగ్గలంబయిన సిగ్గున గ్రుగ్గి నెమ్మొగంబు సూపక కోపకపటభావంబులు మనంబునం జెనంగొనఁ దపంబు చేసియైన వీరలం జయించెద నని, పలాయితులైన రాజులం గూడికొనుచు జరాసంధుండు దిరిగి చనియె; సురలు గుసుమ వర్షంబులు గురియ, హలియు హరియును మధురానగరజనవందిమాగధజేగీయమానులై వీణావేణుమృదంగశంఖ దుందుభినినదంబు లాకర్ణించుచు, మృగమదజలసిక్తవిమలవీథికా శతంబును, వివిధచిత్ర కేతనాద్యలంకృతంబును, సువర్ణమణిమయజయ స్తంభనిబద్ధతోరణ

1. అంహఃకర్ములు-పాపాత్ములు, 2. సీరి-బలరాముఁడు, 3. సోల్లుంఠములు-ఎత్తిపొడుపుమాటలు, 4. మీఁదు-భవిష్యత్తు, 5. మేధస్సు-మెదడు.

సంయుతంబును, వేదనాదనినాదితంబును, సంతుష్టజనసంకుల గోపురంబు నైన పురంబుఁ బ్రవేశించి రందు. 1578

ఉ. వెల్లువలైన వైరినృపవీరుల నెల్ల జయించి వీటికిన్
[1]బల్లిదు లైన కృష్ణబలభద్రులు వచ్చుచు నున్నవారు రం
డుల్లము లారఁ జూత మని యున్నతసౌధము లెక్కి వారిపైఁ
బల్లవపుష్పలాజములు పౌరపురంధ్రులు సల్లి రెల్లెడన్. 1579

వ. ఇట్లు పురంబు ప్రవేశించి యుద్ధప్రకారం బెల్ల నుగ్రసేనున కెఱింగించి కృష్ణుం డిచ్ఛా విహారంబుల నుండె: మఱియు నెక్కువ మత్సరంబున నమ్మాగధుండు మహీమండలంబునం గల దుష్టమహీపతుల నెల్లం గూడికొని, [2]సప్తదశవారంబులు సప్తదశాక్షౌహిణీబలసమేతుండై మథురానగరంబుపై విడిసి, మాధవభుజాప్రాకారరక్షితు లగు యాదవులతోడ [3]నాలంబు సేసి, నిర్మూలిత బలుండై పోయి క్రమ్మఱ నష్టాదశయుద్ధంబునకు వచ్చునెడం గలహవిద్యా విశారదుండగు నారదుండు కాలయవనుకడకుం జని యిట్లనియె 1580

మ. 'యవనా! నీవు సమస్తభూపతుల బాహాఖర్వగర్వోన్నతిం
బవనుం డభ్రములన్ హరించుపగిదిన్ భంజించియు న్నేల యా
దవులన్ గెల్వవు? వారలన్ మఱచియో, దర్పంబు లేకుండియో,
యవివేకస్థితి నొందియో, వెఱచియో, హైన్యంబునుం జెందియో? 1581

క. యాదవులలోన నొక్కఁడు మేదినిపై సత్త్వరేఖ మెఱసి జరాసం
ధాదులఁ దూలం జోలెను దాదృశుఁ డిల లేడు వినవెతత్కర్మంబుల్. 1592

వ అనిన విని కాలయవనుం డిట్లనియె. 1583

శా. 'ఏమీ నారద; నీవు చెప్పిన నరుం డే రూపువాఁ? డెంతవాఁ?
డేమేరన్ విహరించు? నెప్పుఁడు సఖుం? డెం దుండు? నేపాటి దో
స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు నస్మద్బాహుశౌర్యంబు సం
గ్రామ క్షోణి భరించి నిల్వఁ గలఁడే? గర్వాఢ్యుఁడే? చెప్పుమా!' 1584

వ, అనిన విని దేవముని యిట్లనియె. 1585

సీ. నీలజీమూతసన్నిభశరీరమువాఁడు తామరసాభనేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడిమోమువాఁ డున్నత [3]దీర్ఘబాహువులవాఁడు

---

1. బల్లిదులు-వీరులు. 2. సప్తదశవారంబులు-పదునేడువారములు, 3. ఆలంబు-యుద్ధము, 4, ఘనభుజయుగమువాఁడు — పాఠాంతరము.

శ్రీవత్సలాంఛనాంచితమహోరమువాఁడు కౌస్తుభమణిపదకంబువాఁడు
శ్రీకర [1]పీతకౌశేయచేలమువాఁడు మకరకుండలదీప్తి మలయువాఁడు
తే. రాజ! యింతంతవాఁ డన రానివాఁడు మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు
దలిసి యేవేళనం దైనఁ దిరుగువాఁడు పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు. 1586

వ. అని మఱియు నతని లక్షణంబులు చెప్పిన విని సరకుసేయక. 1587

ఉ. యాదవుఁ డెంతవాఁడు? ప్రళయాంతకుఁడైన నెదిర్చె నేనియుం
గా దనఁ బోర మత్కలహకర్కశబాహుధనుర్విముక్తనా
నాదృఢహేమపుంఖకఠినజ్వలదస్త్రపరంపరాసము
త్పాదితవహ్నికీలముల భస్మము సేసెదఁ దాపసోత్తమా'! 1588

వ అని పలికి కాలాయనుండు మూఁడుకోట్ల మ్లేచ్ఛవీరులం గూడుకొని శీఘ్ర గమనంబున
దాడివెడలి మథురాపురంబుమీఁద విడిసినం జూచి బలభద్రసహితుండై కృష్ణం డిట్లని
వితర్కించె. 1589

సీ. యవనుఁడు పుర మెల్ల నాపరించెను నేఁటి యెల్లింటిలోపల నీనడుమను
మాగంధుడును వచ్చి మనమీఁద విడియును యవనమాగధులు మహాప్రబలులు
పురి రెండు [2]వంకల బోరుదు రట్టిచో నోపినభంగి నొక్కొక్కచోట
మనము యుద్ధము సేయ మఱి యొక్కఁ డెడ సెచ్చి బంధుల నందఱఁ బట్టి చంపు
తే. నొండెఁ గొనిపోయి చెఱఁబెట్టు నుగ్రకర్ముడైన మాగధు; డది గాన నరివరులకు
విడియఁ బోరాడఁగా రాని విషమభూమి నొక్కదుర్గంబు సేసి యందునుపవలయు. 1590

వ. అని వితర్కించి సముద్రు నడిగి సముద్రమధ్యంబున బండ్రెండు యోజనంబుల నిడుపు
నంతియ వెడల్పుం గల దుర్గప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృష్ణుండు
సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంచిన 1591

ఆ. వరుణపురముకంటె [3]వాసవపురికంటె [4]ధనదుపీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మనగరంబుకంటెఁ బ్రస్ఫుటము గాఁగ నొక్క పురముఁజేసె. 1592

వ. అందు. 1593

క. ఆకసము [5]తోడిచూ లనఁ బ్రాకారము పొడవు గలదు పాతాళమహా
లోకముకంటెను లోఁతెంతో కలదా పరిఖ యెఱుఁగ దొరక దొకరికిన్. 1594

1. పీతకౌశేయచేలము-పచ్చనిపట్టువస్త్రములు, 2. వంకలు-వైపులు, 3. వాసవపురి-ఇంద్రునిపట్టణము-అమరావతి, 4. ధనదుపీడు-అలకాపట్టణము, 5. తోడిచూలు-తోడఁబుట్టినది.

క. కోటయు మిన్నును దమలోఁ [1]బాటికి జగడింవ నడ్డపడి నిల్చిన [2]వా
చాటులరుచిఁ దారకములు కూటువలై కోటతుదలఁ గొమరారుఁబురిన్. 1595

శా. సాధుద్వారకవాటకుడ్యవలభిస్తంభార్గళా [4]గేహళీ
వీథీవేదిగవాక్షచత్వరసభావేశ్మ [5]ప్రఘాణప్రపా
సౌధాట్టాలకసాలహర్మ్యవిశిఖాసోపానసంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణిస్నిగ్ధంబులై యప్పురిన్. 1596

క. కూడి గ్రహంబులు దిరుగఁగ మేడలతుదినిలువులందు మెలఁగెడి బాలల్
క్రీడింపరు పురుషులతోఁ బ్రీడం దద్వేళలందు విను మా వీటన్. 1597

ఉ. ఆయతవజ్రనీలమణిహాటకనిర్మితహర్మ్యసౌధ [6]వా
తాయనరంధ్రనిర్గతసితాభ్రమహాగరుధూపధూమముల్
తోయదపంక్తులో యనుచుఁ దుంగమహీరుహరమ్యశాఖలం
జేయుచునుండుఁ దాండవవిశేషము లప్పురిఁ గేకిసంఘముల్. 1598

ఆ. [7]సరస నడచుచుండి సౌధాగ్ర హేమకుంభములలోన నినుఁడు ప్రతిఫలింప
నేర్పరింప లేక నినులు పెక్కండ్రంచుఁ బ్రజలు సూచి చోద్యపడుదు రందు. 1599

ఉ. శ్రీరమణీయగంధములఁ జెన్ను వహించుఁ బురీవనంబులం
గోరకజాలక స్తబకకుట్మలపుష్పమరందపూరవి
స్ఫారలతాప్రకాండవిటపచ్ఛదపల్లవవల్లరీశిఫా
సారపరాగమూలఫలసంభృతవృక్షలతావిశేషముల్. 1600

క. శ్రీకరములు జనహృదయవశీకరములు మందపవనశీర్ణమహాంభ
శ్శీకరములు హంసవిహంగాకరములు నగరికువలయాబ్జాకరముల్. 1601

క. నవకుసుమామోదభరా జవనము రతిఖిన్న దేహజస్వేదాంభో
లవనము సమధిగతవనము పవనము విహరించుఁ బౌరభవనములందున్. 1602

క. బ్రహ్మత్వము లఘువగు నని బ్రహ్మయు [8]బిరుదులకు వచ్చి పట్టఁడుగా కా
బ్రహ్మాదికళలఁ దత్పురి బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కు పఱుపరె చర్చన్? 1603

క. నగరీభూసురకృతలసదగణితమఖధూమపిహితమై కాక మహా
గగనము నీలం బగునే? మిగులఁగ బెంచఁ గగనె గ్రహసమృద్ధం బయ్యున్. 1604

---

1. పాటి- సామ్యము, 2. వాచాటులు-వదరుఁబోతులు, 3. అర్గళా-అడ్డుగడియ, 4. గేహళి-ఇంటిగడప, 5. ప్రఘాణము-వీథివైపునన్న చిన్నగది, 6. వాతాయనము-గవాక్షము, 7. సరస-సమీపము, 8. బిరుదు-ప్రతిజ్ఞ.

క. తిరుగరు పలు కర్థులకును [1]సురుఁగరు ధన మిత్తు రితరసుదతీమణులన్
మరుగరు రణమునఁ బిఱుదికి నరుగరు రాజన్యతనయులా నగరమునన్. 1605

క. రత్నాకరమై జలనిధి రత్నము లీ నేర దేటి రత్నాకరమో?
రత్నములఁ గొనుదు రిత్తురు రత్నాకరజయులు వైశ్యరత్నములు పురిన్. 1606

క. తుంగంబులు కరహతగిరి శృంగంబులు దానజలవశీకృతభంగీ
భృంగంబులు పటుశైలస మాంగంబులు నగరిమత్తమాతంగంబుల్. 1607

క. ప్రియములు జితపవనమనో రయములు కృతజయము లధికరమణీయగుణా
న్వయములు సవినయములు నిర్భయములు హతరిపుచయములు పట్టణహయముల్. 1608

క. పులులపగిదిఁ గంఠీరవములక్రియ శరభములమాడ్కి ముదితమదేభల
బులతెఱఁగున నానావిధ కలహమహోద్భటులు భటులు గల రా వీటన్. 1609

క. ఆ వీట నుండువారికి భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త
ద్గోవిందకృపావశమున దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్. 1610

సీ. ఆసక్తి కృష్ణముఖావలోకనమంద హరిపాదసేవనమంద [2]చింత
వెఱపు నారాయణవిముఖకార్యములంద పారవశ్యము పెద్దభక్తియంద
బాష్పనిర్గతి చక్రిపద్యసంస్తుతులంద [3]పక్షపాతము శార్ఙ్గిభక్తులంద
లేమి గోవిందాన్యలీలాచరణమంద శ్రమము గోవిందపూజనములంద
తే. బంధ మచ్యుతేతరదుష్టపదములంద జ్వరము మాధవవిరహితక్షణములంద
మచ్చరము లీశకైంకర్యమతములంద నరవరోత్తమ! వినుము త[4]న్నాగరకులకు 1611

వ. మఱియు నప్పురవరంబున హరికిం బారిజాతమహీజంబును సుధర్మ యనియెడి దేవసభ యును దేవేంద్రుం డిచ్చె. కర్ణైకదేశంబుల నలుపు గలిగి మనోజవంబులును. శుక్లవర్ణం బులు నైన తురంగంబుల వరుణుం డొసంగె మత్స్యకూర్మపద్మమహాపద్మ శంఖమునకుం కచ్ఛపనీలంబు లను నెనిమిది నిధులఁ గుబేరుండు సమర్పించె. నిజాధికారసిద్ధికొఱకుఁ దక్కిన లోకపాలకులను దొల్లి తమకు భగవత్కరుణాకటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదల మరల నతిభక్తితో సమర్పించి రివ్విధంబున. 1612

క [5]దర్పించి చేసి పురము సమర్పించెను విశ్వకర్మ మంగళగుణసం
తర్పితగహ్వరికిని గురు దర్పిత దుఃఖప్రవాహతరికిన్ హరికిన్. 1613

---

1. సురుఁగరు—చలింపరు, 2. చింత-ఆలోచన, 3. పక్షపాతము - అభిమానము,
4. నాగరులు-పౌరులు, 5. దర్పించి-గర్వించి.

వ. ఇట్లు విశ్వకర్మనిర్మితంబైన ద్వారకానగరంబునకు నిజయోగప్రభావంబున మథురాపుర జనుల నందఱఁ జేర్చి, బలభద్రున కెఱిగించి తదనుమతంబున నందనవనము నిర్గమించు [1]పూర్వదిగ్గజంబు పెంపున, మేరుగిరిగహ్వరంబు వెలువడు కంఠీరవము తెఱంగున, హరి హయదిగంతరాళంబున నుదయించు [2]నంధకారపరిపంథికైవడి మథురానగరంబు వెలు వెడి నిరాయుధుండై యెదురువచ్చుచున్న హరిం గని. 1614

—:శ్రీకృష్ణుఁడు నిరాయుధుండై కాలయవనుఁడు వెంటనంటఁ బరుగెత్తుట:—

మ. 'కరిసంఘంబులు లేవు; రావు తురగౌఘంబుల్; రథవ్రాతముల్
పరిసర్పింపవు రారు శూరులు ధనుర్బాణాసిముఖ్యాయుధో
త్కరముల్ బట్టడు; శక్రచాపయుతమేఘస్ఫూర్తితో మాలికా
ధరుఁ డొక్కం డదె నిర్గమించె నగరద్వారంబునం గంటిరే! 1615

శా. ఎన్నే నయ్యె దినంబు లే నగరిపై నేతెంచి పోరాటకున్;
మున్నెవ్వండును రాఁడు; వీఁ డొకఁడు [3]నిర్ముక్తాయుధుం డేగుదెం
చె న్నన్నోర్వఁగనో, ప్రియోక్తులకునో, శ్రీఁ గోరియో చూడుఁ' డం
చు న్నాత్మీయజనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్. 1616

క. విభులగు బ్రహ్మప్రముఖుల కభిముఖుఁడై నడపకుండునట్టి గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ నభిముఖుఁడై నడచెఁ గాలయవనున కధిపా! 1617

వ. ఆ సమయంబున నయ్యాదవేంద్రు నేర్పడం జూచి. 1618

మ. 'వనజాతాక్షుఁడు, సింహమధ్యుఁడు, రమావక్షుండు, శ్రీవత్సలాం
ఛనుఁ డంభోధరదేహుఁ, డిందుముఖుఁ, డంచద్దీర్ఘబాహుండు స
ద్వనమాలాంగదహారకంకణసమిద్యత్కుండలుం డీతఁ డా
ముని సూచించిన వీరుఁ డౌ' ననుచు నమ్మూఢుండు గాఢోద్ధతిన్. 1619

సీ. చటులవాలాభీల [4]సైంహికేయునిభంగిఁ లాలితేతరజటాలతిక దూలఁ
బ్రళయావసర [5]బృహద్భానుహేతిద్యుతిఁ బరుషారుణశ్మశ్రుపటలి వ్రేలఁ
[6]గాదంబినీచ్ఛన్న కాంచనగిరిభాతిఁ గవచసంవృతదీర్ఘకాయ మమర
[7]వల్మీకసుప్తదుర్వారాహికైవడిఁ గోశంబులో వాలు కొమరు మిగుల
ఆ. వార్చి పేర్చి మించి యశ్వంబు గదలించి కమలసంభవాదిమునుల కైనఁ
బట్టరాని ప్రోడఁ బట్టెద నని జగదవనుఁ బట్టఁ గదిసె యవను డధిప! 1620

1. పూర్వదిగ్గజంబు-ఐరావతము, 2, అంధకారపరిపంథి-సూర్యుఁడు, 3. నిర్ముక్తాయుధుండు-ఆయుధములు విడిచినవాఁడు, 4. సైంహికేయుడు-రాహువు. 5. బృహద్భానుఁడు-అగ్ని, 6. కాదంబిని-మేఘమాలిక, 7. వల్మీకము-పుట్ట.

క ఇటు దన్నుఁ బట్ట వచ్చినఁ బటుతరజవరేఖ మెఱసి పట్టువడక ది
క్కటము లదర హరి వాఱెం జటులగతిన్ వాఁడు దోడఁ జనుదేరంగన్. 1621

వ. అప్పుడు కాలయవనుం డిట్లనియె. 1622

మ. 'యదువంశోత్తమ! పోకు, పోకు రణ మీ నర్హంబు గంసాదులన్
[1]గదనక్షోణి జయించి తీ వని [2]సమిత్కామంబునన్ వచ్చితిన్
విదితఖ్యాతులు [3]పీటి,బోవ నరికిన్ వె న్నిచ్చి యిబ్భంగి నేఁ
గుదురే రాజులు? రాజ మాత్రుఁడవె? వైగుణ్యంబు వచ్చుం జుమీ! 1623

మ. బలిమిన్ మాధవ! నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్
జలముల్ సొచ్చిన, భూమిక్రిందఁ జనినన్, శైలంబుపైఁ నెక్కినన్
బలిదండన్ విలసించినన్, వికృతరూపంబుం బ్రవేశించినన్
జలధిన్ దాఁటిన, నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ దాల్చినన్. 1624

వ. అదియునుం గాక. 1625

మ. శరముల్ దూఱవు; మద్ధనుర్గుణలతాశబ్దంబు లేతేర! వా
హరిరింఖోద్ధతధూళి గప్పు; దకటా! హాస్యుండవై పాఱె; దు
ర్వరపై నేక్రియఁ బోరితో కదిసి మున్ [4]వాతాశితోఁ, గేశితోఁ,
గరితోఁ, మల్లురతో, జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్?' 1626

వ. అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర సరకుసేయక మందహాసంబు ముఖా
రవిందంబునకుఁ సౌందర్యంబు నొసఁగ 'వేగిరపడకు; రమ్ము ర' మ్మనుచు హరియును.

సీ. అదె యిదె లోఁబడె' నని పట్టవచ్చినఁ గప్పించి లంఘించుఁ గొంతతడవు
'పట్టఁ రా; దీతని పరు వగ్గలం' బని భావింపఁగా సమీపమున నిలుచు
నదరి పార్శ్వంబుల కడ్డంబు వచ్చినఁ [5]గేడించి యిట్టట్టు [6]గికురువెట్టు
వల్మీకతరుసరోవరము లడ్డం బైన సవ్యాపసవ్యసంచరతఁ జూపుఁ
తే. బల్లముల డాఁగు దిబ్బల బయలుపడును నీడలకుఁ బోవు [7]నిఱుముల నిగిడి తారు
నన్నుఁ బట్టిన నీవు మానవుడ' వనుచు యవనుఁ [8]డెగవంగ బహుజగదవనుఁ డపుడు.

వ. మఱియును 1629

1. కదనక్షోణి-యుద్ధరంగము, 2. సమిత్కామంబు-యుద్ధమందలికోరిక, 3. పీటిఁ బోవ-నశింపగా, 4. వాతాశి-పాము, 5. కేడించి-తప్పుకొని, 6 కికురువెట్టు-మోసగించును, 7. ఇఱుములు-మాఱుమూలలు, 8. ఎగవంగ-తఱుమఁగా.

సీ. సకలభూతవ్రాతసంవాసుఁ డయ్యును వనములు నగములు వరుస దాఁటు
లోకోన్నతుండును లోకచక్షుఁడు నయ్యు మాటిమాటికి నిక్కి మగిడి చూచుఁ
బక్షవిపక్షసంబంధశూన్యుం డయ్యుఁ దను విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు
విజయాపజయభావవిరహితుం డయ్యుఁ దా నపజయంబును జెందినట్లు తోఁచు
ఆ. నభయభయవిహీనుఁ డయ్యు భీతునిమాడ్కి గానఁబడును సర్వకాలరూపుఁ
డయ్యుఁ గాలచకితుఁ డైన కైవడి వనమాలి పఱచు నెఱపుమాలి యధిప! 1630

ఆ. ఇవ్విధంబున 1631

క. [1]దారితశాత్రవభవను నపారమహావేగవిజితపవనున్ యవనున్
దూరము గొని చని కృష్ణుఁడు ఘోరంబగు నొక్కశైలగుహ వడి జొచ్చెన్. 1632

క. 'అదె లోఁబడె నిదె లోఁబడె నదె యిదె పట్టెద' నటంచు నాశావశుఁడై
యదుసింహుని పదపద్ధతి వదలక గిరిగహ్వరంబు వాఁడుం జొచ్చెన్. 1633

వ. ఇట్లు సొచ్చి మూఢహృదయంబునుం బోలెఁ దమఃపూర్ణంబయిన గుహాంతరాళంబున
దీర్ఘతల్పనిద్రితుండై గుఱుపెట్టుచున్న ఒక మహాపురుషునిం గని శ్రీహరిగాఁ దలంచిఁ

ఉ.'ఆలము సేయలేక పురుషాధమ దుర్లభకంటకద్రుమా
ఖీలమహాశిలాసహితభీకరకుంజరఖడ్గసింహశా
ర్దూల [2]తరక్షుసంకలితదుర్గపథంబున బాఱితెంచి యీ
శైలగుహన్ సనిద్రుక్రియఁ జాఁగి నటించిన, బోవనిత్తునే? 1635

క, ఎక్కడ నెవ్వారలకును జిక్క వనుచు నారదుండు సెప్పెను నాకుం
జిక్కతి వెక్కడ బోయెదు? నిక్కముగా నిద్రపుత్తు నిన్నీ కొండన్. 1636

ఆ. అనుచు యవనుఁ [3]డట్టహాసంబు గావించి చటులకఠినకులిశసదృశమైన
పాద మెత్తి తన్నెఁ బాటి తద్దేహంబు నగగుహం బ్రతిస్వనంబు నిగుడ. 1637

ఉ. తన్నిన లేచి నీల్గి కనుఁదమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపుఁగిన్క వర్ధిల దిశల్ గన దృష్టిసమిద్ధవిగ్రహో
త్పన్నమహాగ్నికీలముల భస్మము సేసె నతండు సాయక
చ్ఛిన్నవిరోధికంఠవను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్. 1638

వ ఇట్లేకక్షణమాత్రంబున యవనుండు 'నీఱయ్యె' ననిన విని రా జిట్లనియె. 1639

---

1. దారితము-చీల్చ(నశింపజేయు) బడినది, 2, తరక్షుఁవు సివంగి, 3. అట్టహాసము పెద్దనవ్వు, 4. నీఱు-భస్మము.

## —:ముచుకుందుని పూర్వకథాభివర్ణనము:—

ఆ.'ఎవ్వఁ డాతఁ? డితని కెవ్వండు దండ్రి ఘోరాద్రిగుహకు నేటి కతఁడు వచ్చి
నిద్రవోయెఁ? యవను నిట్లు గాల్ప నెట్లోపె? దెలియఁ బలుకు నాకు ధీవరేణ్య!' 1640

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డిట్లనియె; 'నిక్ష్వాకుకులసంభవుఁడు మాంధాతకొడుకు ముచుకుందుండను రాజు రాక్షసభీతులైన [1]వేల్పులం బెద్దకాలంబు సంరక్షించిన మెచ్చి వా రమర లోకరక్షకుండైన యా రాజకుమారునికడఁ జేరి యిట్లనిరి.
1641

మ. జగతి న్నిర్గతకంటకం బయిన రాజ్యంబున్ విసర్జించి శూ
రగణాగ్రేసర! పెద్దకాలము మమున్ రక్షించి తీ లోన నీ
మగువల్ మిత్రులు బంధులున్ సుతులు సంబంధుల్ భువిన్ లేరు; కా
లగతిం జెందిరి కాల మెవ్వరికి [2]దుర్లంఘ్యంబె దా నారయన్. 1642

క. కాలము ప్రబలులకును బలి కాలాత్మం డీశ్వరుం డగణ్యుఁడు జనులం
గాలవశులగాఁ జేయును గాలము గడవంగ లేరు ఘను లెవ్వారున్. 1643

క. వర మిచ్చెద మర్థింపుము ధరణీశ్వర! మోక్షపదవి దక్కను మే మె
వ్వరమును [3]విభులముగా మీ శ్వరుఁడగు హరిదక్క మోక్షసంగతిఁ జేయన్. 1644

వ. అని పలికిన దేవతలకు నమస్కరించి ముచుకుందుండు నిద్రం గోరి, దేవదత్త నిద్రవశుండై పర్వత గు[4]హాంతరాళంబున శయనించి యుండె; యవనుండు నీఱైనపిమ్మట హరి ముచుకుందుని ముందఱ నిల్చిన.
1645

సీ. వనరుహలోచను వైజయంతీదామశోభితు రాకేందుసుందరాస్యు
మకరకుండల కాంతిమహితగండస్థలుఁ గౌస్తుభాలంకృతు ఘనశరీరు
శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజమధ్యుఁ జతుర్బాహు మందహాసుఁ
గాంచనసన్నిభకౌశేయవాసు గాంభీర్యసౌందర్య శోభితుఁ బ్రసన్ను
ఆ. నమ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది తన్మనోజ్ఞదీప్తి దనకుఁ జూడ
[5]నలవి గాక చకితుఁడై యెట్టకేలకుఁ బలికెఁ బ్రీతి నవనిపాలకుండు. 1646

మ.'శశివో? యింద్రుఁడవో? [6]విభావసుఁడవో? [7]చండప్రభారాశివో?
శశిచూడామణివో? పితామహుఁడవో? చక్రాంకహస్తుండవో

1. వేల్పులు-దేవతలు, 2. దుర్లంఘ్యంబు-దాఁటశక్యముకానిది. 3. విభులము—అధికారులము, 4. అంతరాళంబు-మధ్యప్రదేశము 5. అలవి—సాధ్యము, 6. విభావసుఁడు-అగ్ని, 7. చండప్రభారాశి—సూర్యుఁడు,

దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబుఁ జూడంగ దు
ర్వశమై యెవ్వఁడ? వేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై? 1647

క. ఈ యడవి విషమకంటక [1]భూయిష్ఠము ఘోరసత్త్వ [2]పుంజాలభ్యం
బో యయ్య? యెట్లు వచ్చితి? నీ యడుగులు కమలపత్త్రనిభములు సూడన్. 1648

వ. మహాత్మా! యేను నీ శుశ్రూషణంబు సేయం గోరెద; నీ జన్మగోత్రంబు లే నెఱుంగ నర్హుండనేని నెఱింగింపుము; నేనిక్ష్వాకువంశసంభవుండ; మాంధాతృ నందనుండ; ముచుకుందుం డనువాఁడ; దేవహితార్థంబు చిరకాలజాగర శ్రాంతుండనయి నిద్ర నొంది యింద్రియసంచారంబులు మఱచి. 1649

శా. ఏ నిద్రించుచు మండ నొక్కమనుజుం డేతెంచి దుష్కర్ముఁడై
తా నీత్రై చెడెనాత్మ [3]కిల్బిషమునన్ దర్పోగ్రుడై; యంతటన్
శ్రీనాథాకృతి వైన నిన్నుఁ గని వీక్షింప న్నశక్తుండనై
దీనత్వంబును జెందితిన్ ననుఁ గృపాదృష్టిన్ విలోకింపవే!' 1650

వ. అనిన విని మేఘగంభీరభాషణంబుల హరి యిట్లనియె. 1651

సీ. 'భూరజంబులనైన భూనాథ! యెన్నంగఁ జనుఁ గాని; నా గుణజన్మకర్మ
నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాల రది యేల? నాకును నలవి గాదు
నేలకు [4]వ్రేఁగైన నిఖిలరాక్షసులను నిర్జించి ధర్మంబు నిలువఁబెట్ట
బ్రహ్మచే మున్ను నేఁ బ్రార్థింపఁబడి వసుదేవునింటను వాసుదేవుఁ డనఁగఁ
ఆ. గరుణ నవతరించి కంసాఖ్యతో నున్న కాలనేమిఁ జంపి ఖలుల మఱియుఁ
ద్రుంచుచున్నవాఁడఁ బొడరి నీచూడ్కి నీత్రైనవాఁడు కాలయవనుఁ డనఘ! 1652

వ. వినుము; తొల్లియు నీవు నన్ను సేవించిన కతంబున నిన్ననుగ్రహింప నీ శైల గుహకు నేతెంచితి; నభీష్టంబులయిన వరంబు లడుగు; మిచ్చెద. మద్భక్తు లగుజనులు గ్రమ్మఱ శోకంబున కర్హులుగా' రనిన హరికి ముచుకుందుండు నమస్కరించి, నారాయణదేవుం డగుట యెఱింగి, యిరువదియెనిమిదవ మహాయుగంబునందు నారాయణుం డవతరించు నని మున్ను గర్గుండు చెప్పుటఁ దలంచి. 1653

## —: ముచుకుందుఁడు శ్రీకృష్ణుని స్తోత్రము చేయుట :—

క. 'నీమాయఁ జిక్కి పురుష స్త్రీమూర్తికజనము నిన్ను సేవింపదు; వి
[5]త్తామయగృహగతమై సుఖ తామసమై కామవంచితం బయి యీశా. 1654

1. భూయిష్ఠము-నిండినది, 2. పుంజము-గుంపు, 3. కిల్బిషము-పాపము, 4. వ్రేగు-బరువు, 5. ఆమయము-రోగము.

ఉ. పూని యనేకజన్మములఁ బొంది తుదిం దన పుణ్యకర్మ [1]సం
తానము పేర్మిఁ నర్మ వసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై
మానవుఁడై గృహేచ్ఛఁ బడు మందుఁ [2]డజంబు తృణాభిలాషియై
కానక పోయి నూతఁ బడు కైవడి నీపదభక్తి హీనుఁడై. 1655

క. తరుణీపుత్రధనాదుల మరగి మహారాజ్యవిభవమదమత్తుఁడనై
నరతనులుబ్ధుఁడనగు నా కరయఁగ బహుకాల మీశ! [3]యాఁబడివోయెన్ 1656

క. [4]ఘటకుడ్యసన్నిభం బగు చటులకళేబరముఁ జొచ్చి జనపతి నంచుం
బటుచతురంగంబులతో నిటు నటుఁ దిరుగుదును నిన్ను నెఱుఁగక యీశా! 1657

ఆ. వివిధకామభోగవిషయలాలసు మత్తు నప్రమత్తవృత్తి నంతకుండ
వైన నీవు వేళ యరసి త్రుంతువు సర్ప మొదిఁగి మూషికంబు నొడయునట్లు. 1658

క. నరవరసంజ్ఞితమై రథ కరిసేవితమైన యొడలు కాలగతిన్ భీ
కరమృగభక్షితమై [5]దుస్తరవిట్క్రిమిభస్మసంజ్ఞితం బగు నీశా! 1659

ఆ. సకలదిశలు గెలిచి సములు వర్ణింపంగఁ జారుపీఠ మెక్కి సార్వభౌముఁ
డైన సతులగృహములందుఁ గ్రీడాభోగ వృత్తి నుండు నిన్ను వెదకలేఁడు 1660

ఆ. మానసంబుఁ గట్టి మహితభోగంబులు మాని యింద్రియముల మదము లడఁచి
తపము సేసి [6]యింద్రతయ కోరుఁగాని నీ యమృతపదము గోరఁ డజ్ఞుఁ డీశ! 1661

సీ. సంసారియై యున్న జనునకు నీశ్వర? నీకృప యెప్పుడు నెఱయఁ గల్గు
నప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు బంధమోక్షం బైనఁ బ్రాప్తమగును
సత్సంగమంబు సత్సంగమంబున నీదుభక్తి సిద్ధించు నీభక్తివలన
సన్ముక్తియగు నాకు సత్సంగమముకంటె మును రాజ్యబంధనిర్మూలనంబు
తే. గలిగినది దేవ; నీయనుగ్రహము గాదె? కృష్ణ! నీసేవ గాని దక్కినవి వలదు
ముక్తి సంధాయివగు నిన్నుఁ ముట్టఁ గొలిచి యాత్మబంధంబు గోరునే యార్యుఁ డెందు?

వ. కావున రజస్తమస్సత్త్వగుణంబుల యనుబంధంబు లగు నైశ్వర్యశత్రుమరణ ధర్మాదివిశేషంబులు విడిచి, యీశ్వరుండును విజ్ఞానఘనుండును నిరంజనుండును నిర్గుణుండును నద్వయుండును నైన పరమపురుషుని నిన్నాశ్రయించెదఁ: జిరకారంబు గర్మఫలంబులచేత

1. సంతానము-సమూహము, 2. అజంబు - మేఁక, 3. ఆఁబడివోయెన్ - వ్యర్థమయ్యెను, 4. ఘటకుడ్యము-కుండ నీటిలో ప్రతిఫలించు గోడ, 5. దుస్తరవిట్క్రిమిభస్మసంజ్ఞితంబు - దాఁటరాని మలము, పురుగులు, బూడిద యనునామములు కలది, 6. ఇంద్రత-ఇంద్రత్వము-ఇంద్రభోగములనుట.

నార్తుండనై క్రమ్మఱం దద్వాసనల సంతప్తుండనై తృష్ణంబాయక శత్రువు లైన యింద్రి యింబు లాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది? విపన్నుండ నైన నన్ను నిర్భ యుం జేసి, రక్షింపు' మనిన ముచుకుందునికి హరి యిట్లనియె. 1663

ఉ. 'మంచిది నీదుబుద్ధి నృపమండన. నీవు పరార్థ మెట్లు వ
ర్తించిన నైనఁ గోరికల దిక్కునఁ జిక్కవు మేలు నిర్మలో
దంచితవృత్తి నన్ గొలుచు ధన్యు [1]లబద్ధులు నెట్లు నీకు ని
శ్చంచలభక్తి గల్గెడిని సర్వము నేలుము మాననేటికిన్? 1664

వ. నరేంద్రా! నీవు తొల్లి క్షత్రధర్మంబున నిలిచి, మృగయావినోదంబుల జంతువుల వధ యించినాఁడవు; తపంబునఁ దత్కర్మవిముక్తుండవై తర్వాతిజన్మంబున సర్వభూత సఖ త్వంబు గలిగి బ్రాహ్మణశ్రేష్ఠుండవై నన్నుం జేరెద' వని వీడ్కొలిపిన హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించి గుహ వెడలి సూక్ష్మప్రమాణదేహంబులతో నున్న మనుష్యపశువృక్ష లతాదులం గని కలియుగంబు ప్రాప్తంబగు నని తలచి, యుత్తరాభిముఖుండై తపోనిష్ఠం దగుచు, సంశయంబులు విడిచి సంగంబులు పరిహరించి విష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి గంధమాదనంబు ప్రవేశించి, మఱియు నరనారాయణనివాసంబైన బదరికాశ్రమంబు చేరి, శాంతుండై హరి నారాధించుచుండె నిట్లు ముచుకుందుని వీడ్కొని. 1665

శా. అచ్ఛిద్రప్రకటప్రతాపరవిచే [2]నాశాంతరాళంబులం
[3]బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మధురకుం బద్మాక్షుఁ డేతెంచి వీ
డాచ్ఛాదించి మహానిరోధముగఁ జక్రాకారమై యున్న యా
మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిం బెంపు సొంపారఁగన్. 1666

—: జరాసంధుండు ప్రవర్షణగిరిని దహించుట :—

వ ఇట్లు మ్లేచ్ఛులం [4]బొరిగొని, మఱియు నమ్మధురానగరంబునం గల ధనంబు ద్వారకా నగరంబునకుం బంచిన మనుష్యులు గొనిపోవునెడ, 1667

సీ. ఘోటకసంఘాతఖురసముద్ధతధూళి జీమూతసందోహముగను
మహనీయ మదకల మాతంగకటదానధారలు [5]కీలాలధారలుగను
నిరుపమస్యందననేమినిర్ఘోషంబు దారుణగర్జిత ధ్వానముగను
నిశితశస్త్రాస్త్రమానితదీర్ఘరోచులు లలిత [6]సౌదామినీలతికలుగను.

1. అబద్ధులు-బంధింపఁబడనివారు, 2. ఆశాంతరాళంబులు-దిఙ్మధ్యములు, 3. ప్రచ్ఛాదించుచు-కప్పుచు, 4. పొరిగొని-చంపి, 5. కీలాలధారలు-జలధారలు, 6. సౌదామిని-మెఱుపు.

తే. శత్రురాజ ప్రతాపాగ్ని శాంతముగను వృష్టి కాలము వచ్చు నవ్విధము దోఁప
నేఁగుదెంచె జరాసంధుఁ డిరువదియును మూఁడునక్షౌహిణులు దన్ను మొనసి కొలువ.

చ. ఇటు చనుదెంచి యున్న మగధేశ్వర [1]వాహినిఁ జూచి యుద్ధసం
ఘటనము మాని మానవులకై వడి భీరులభంగి నోడి ముం
దటిధన మొల్ల డించి మృదుతామరసాభపదద్వయుల్ క్రియా
పటువులు రామకేశవులు పాఱిరి ఘోరవనాంతరంబులన్. 1669

వ. ఇట్లు పఱచుచున్న కృష్ణబలభద్రులం జూచి వారల ప్రభావంబులెఱుంగక పరిహసించి.

ఉ. 'ఓ యదువీరులార! రథసోద్ధతిఁ బాఱకుఁ; డిట్లు పాఱినం
బోయెడువాఁడఁ గాను; మిము భూమి నడంగిన మిన్ను ప్రాఁకినం
దోయధిఁ జొచ్చినం దగిలి ద్రుంచెద' నంచు సమస్త సేనతోఁ
బాయక వచ్చె వెంటఁ బడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్. 1671

వ. మఱియుం బలాయమానులై బహుయోజనంబుల దూరంబు సని విశ్రాంతులై తమకు డాఁగ
నెల వగు నని యింద్రుండు మిక్కిలి వర్షింపఁ బ్రవర్షణాఖ్యంబై పదనొకండు యోజ
నంబుల పొడవును నంతియ వెడలుపును గల గిరియెక్కి రంత. 1672

శా. ఆ శైలేంద్రముఁ జుట్టి శా విడిసి రోషావిష్టుఁడై మాగధో
ర్వీశుం డా వసుదేవనందనులఁ దా వీక్షింపఁగా లేక త
న్నాశేచ్ఛన్ బిలసానుశృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్
రాసుల్ గా నిడి చిచ్చు వెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్. 1673

వ. ఇట్లు జరాసంధపరిజన [2]ప్రదీపితంబైన మహానలంబు దరికొనియెనందు. 1674

క. పొగలెగసెఁ బొగలతుదలను మిగులుచు [3]మిడుఁగుఱులు నిగిడె మిడుఁగుఱుగమి ము
న్నుగ బ్రహ్మాండము నిండెను భగ భగమని మంటలొదవె భయదము లగుచున్. 1675

వ. మఱియు నమ్మహానలంబు బిలసానుశృంగవృక్షలతాకుంజపుంజంబుల దరికొని శిఖలు కిసల
యంబులుగ విస్ఫులింగంబులు విరులుగ సముద్ధూతధూమపటలంబులు బంధురస్కంధశాఖా
విసరంబులుగ [4]ననోకహంబుకై వడి నత్యంకషంబై [5]ప్రబ్బి కఠోరసమీరణసమున్నత
మహోల్కాజాలతిరోహితవియచ్చరవిమానంబును, వివిధవిధూమవిస్ఫులింగవిలోకనప్రభూత
నూతన తారకా భ్రాంతివిభ్రాంతగగనచరంబును సంతప్యమాన సరోవరసలిలంబును,
విశాల జ్వాలాజాలజాజ్వల్యమాన తక్కోలచందనాగరుకర్పూరధూమవాసనావాసిత గగన

1. వాహిని-సేన, 2. ప్రదీపితంబు-మండింపఁబడినది, 3. మిడుఁగుఱులు-నిప్పు
కణములు, 4. అనోకహంబు-వృక్షము, 5. ప్రబ్బి-విజృంభించి.

కుహరలబును, గరాళకీలాజాలదందహ్యమాన [1]కీచకనికుంజపుంజసంజనితచిటచిటారావ పరిపూరిత దిగంతరాళంబును, భయంకరబహుళతరశిఖాభిద్యమాన పాషాణఘోషణపరి మూర్ఛిత ప్రాణిలోకంబును, సంతప్యమానశాఖిశాఖాంతరనిబిడ నీడనిహితశాబకవియోగ దుఃఖడోలాయమానవిహంగకులంబును, మహాహేతిసందీప్యమాన కటిసూత్ర సంఘటిత మయూరపింఛకుచకలశయుగళభారాలస శబరకామినీసమాశ్రిత నిర్ఝరంబును. దగ్ధానేక మృగ మిథునంబునై యేర్చునెడ. 1676

క. ఇల నేకాదశయోజనములపొడవగు శైలశిఖరమున నుండి వడిన్
బలకృష్ణులు రిపుబలముల వెలి కుఱికిరి కానఁబడక విలసితలీలన్ 1677

వ. ఇట్లు శత్రువుల వంచించి యాదవేంద్రులు సముద్ర [2]పరిఖంబైన ద్వారకా నగరంబునకుం జనిరి. జరాసంధుండు వారలు దగ్ధులైరని తలంచుచు బలంబులం దానును మగధదేశంబు నకు మరలి చనియె; నంత 1678

—:రుక్మిణీకల్యాణ కథాప్రారంభము:—

క. ఆ వనజగర్భుపంపున రైవతుఁడను రాజు దెచ్చి రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను భూవర! మును వింటికాదె బుద్ధిం దెలియన్. 1769

వ. తదనంతరంబ. 1680

మ. 'ఖగనాథుం డమరేంద్రుగెల్చి [3]సుధ మున్ గైకొన్న చందంబునన్.
జగతీనాథుల, జైద్యపక్షచరులన్ సాళ్వాదులం గెల్చి, భ
ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా
భగవత్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్. 1681

వ. అనిన రా జిట్లనియె. "మున్ను [4]రాక్షసవివాహంబున స్వయంవరమునకు వచ్చిన హరి రుక్మిణిం గొనిపోయెనని బలికితివి. కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదులజయించి తన పురంబునకుం జనియె, నదియుం గాక. 1982

శా. కల్యాణాత్మకయైన విష్ణుకథ లాకర్ణించుచున్ ము[5]క్తవై
కల్యుం డెవ్వఁడు తృప్తుఁడౌ; నవి వినంగాఁ గ్రొత్తలౌచుండు [6]సా
కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే? రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలో గౌతూహలం బయ్యెడిన్. 1683

1. కీచకనికుంజము - వెదురుపొద. 2. పరిఖ - అగడ్త, 3. సుధ-అమృతము, 4. రాక్షసవివాహంబు-తన్ను ప్రేమించిన కన్యను బలాత్కారముగాఁ దెచ్చి వివాహ మాడుట, 5. వైకల్యము—కలఁతపాటు, 6. సాకల్యంబు—సంపూర్ణము.

క. భూషణములు సెవులకు బుధ తోషణము లనేకజన్మదురితౌఘవిని
శ్శోషణములు మంగళతర ఘోషణములు గరుడగమను గుణభాషణముల్," 1684

వ. అని రా జడిగిన శుకుం డిట్లనియె. 1685

చ. వినుము విదర్భదేశమున వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డను నొక దొడ్డరాజు గలఁ; డాతని కేవురు పుత్రు లగ్రజుం
డనఘుఁడు రుక్మినాఁ బరఁగు నందఱకున్ గడగొట్టుచెల్లెలై
మనుజవరేణ్య పుట్టె నొక మానిని రుక్మిణినాఁ బ్రసిద్ధయై. 1686

క. బాలేందురేఖ దోఁచిన లాలిత యగు [1]నపరదిక్కులాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను బాలిక జన్మించి యెదుగ భాసుర మగుచున్. 1687

వ. మఱియు దినదినప్రవర్ధమానయై. 1688

సీ. పేర్వేర బొమ్మలపెండ్లిండ్లు సేయుచు సఖులతోడ [2]వియ్యంబు లందు
గుజ్జనగూళ్లను గొమరొప్ప వండించి చెలులకు బెట్టించు జెలువు మెఱసి
రమణీయమందిరారామదేశంబులఁ బువ్వుఁదీగెలకును [3]ప్రోది వెట్టు
సదమలమణిమయసౌధభాగంబుల లీలతో [4]భర్మదోలికల నూఁగు
తే. బాలికలతోడఁ జెలరేఁగి బంతు లాడు శారికాకీరపంక్తికిఁ జదువు సెప్పు
బర్హిసంఘములకు మురిపములు గఱపు మదమరాళంబులకుఁ జూపు మందగతులు. 1589

వ. అంత. 1690

సీ, దేవకీసుతుకోర్కి తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁ దొడఁగెఁ
గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ గాంతి నింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని పొడచూపఁ బొలతికిఁ జనుదోయి పొడవుసూఁపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ జలజాక్షిమధ్యంబు సన్నమయ్యె
ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార నెలఁతయౌవనంబు నిండి యుండె. 1691

వ. ఇట్లు రుక్మి రుక్మరథ రుక్మబాహు రుక్మకేశ రుక్మనేత్రు లను నేవురకుం జెలియలైన
రుక్మిణీదేవి దన [5]యెలప్రాయంబున. 1692

క. తనతండ్రి గేహమునకుం జనుదెంచుచున్న యతిథి జనులవలనఁ గృ
ష్ణునిరూపబలగుణాదులు విని కృష్ణుఁడు దనకు దగిన విభుఁ డని తలఁచెన్. 1693

1. అపరదిక్కు-పడమటిదిక్కు, 2. వియ్యంబులు-బంధుత్వంబులు, 3. ప్రోది-ఆధార
దండము, 4. భర్మదోలికలు-బంగారపుటుయ్యెలలు, 5. ఎలప్రాయంబు—యౌవనము.

క. ఆ లలనరూపు బుద్ధియు శీలము లక్షణము గుణముఁ జింతించి దగన్
బాలారత్నముఁ దన కిల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలఁచెన్. 1694

వ. అంత. 1695

ఉ. బంధువు లెల్లఁగృష్ణునకు బాలిక నిచ్చెద మంచు [1]శేముషీ
సింధువులై విచారములు సేయఁగ వారల నడ్డుపెట్టి దు
స్సంధుడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముఁ జేసి మత్తపు
ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచు దలఁచె [2]నంధుఁడై. 1696

ఉ. అన్నతలంపు దా నెఱిఁగి యున్నవనీరజగంధి లోన నా
పన్నత నొంది, యాప్తుఁ డగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వసం
ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁ జైద్యున కిచ్చెద నంచు నున్నవాఁ
డెన్నివిధంబులం జని బుధేశ్వర చక్రికి విన్నవింపవే? 1697

క. అయ్యా కొడుకువిచారము లయ్యయు వారింపఁ జాలఁ డటు గాకుండన్
నెయ్యమెఱిఁగించి [3]చీరుము చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్? 1698

వ. అని కొన్ని రహస్యవచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకానగరంబునకు జని ప్రతీహారులవలనఁ దనరాక యెఱిగించి యన్నగధరుం డున్న నగరుప్రవేశించి యందుఁ గనకాసనాసీనుండై యున్న పురుషోత్తముం గాంచి 'పెండ్లికొడుకవు గ'మ్మని దీవించిన ముసిముసినగవులు నగుచు బ్రహ్మణ్యదేవుండైన హరి దనగద్దియ డిగ్గన డిగ్గి, బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి, తనకు దేవతలుసేయు చందంబునం బూజలుసేసి, సరసపదార్థ సంపన్నంబైన యన్నంబుఁ బెట్టించి, రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుండైన భూసురుం జేరి లోకరక్షణప్రశస్తంబయిన హస్తంబున నతని యడుగులు పుడుకుచు మెల్లన యిట్లనియె. 1699

సీ. జగతీసురేశ్వర సంతోషచిత్తుండవై యున్న నీధర్మ మతిసులభము
వృద్ధసమ్మత మిది విత్త మెయ్యది యైనఁ [4]బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు
దనధర్మమున నుండు దరలఁ డా ధర్మంబు గోరిక లతనికిఁ గురియుచుండు
సంతోషి గాఁ డేని శక్రుఁ డైన నశించు నిర్ధనుండైనను [5]నిద్రవోవు
ఆ. సంతసించెనేని సర్వభూతసుహృత్తములకు బ్రాప్తలాభ [6]ముదితమాన
సులకు, శాంతులకును సుజనులకును గర్వహీనులకును వినతు లే నొనర్తు. 1770

---

1. శేముషీసింధువులు-ప్రజ్ఞయందు సముద్రమువంటివారు, 2. అంధుఁడు-జ్ఞానహీనుఁడు, 3. చీరుము-పిలువుము. 4. ప్రాపింప—లభింపఁగా 5. ఇది సరిగా నున్నట్లు తోచదు. 'నింద్రుఁబోలు' అని యుండుటయే యుచితము పెక్కు ప్రతులలో నీపాఠమే కానవచ్చుచున్నది, 6. ముదిత మానసులు-సంతోషించిన మనస్సుకలవారు.

ఉ. ఎవ్వనిదేశముం దునికి, యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ,
కెవ్వనిరాజ్యమందుఁ బ్రజ లెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం;
[1]డివ్వనరాశిదుర్గమున కెట్లరుదెంచితి వయ్య నీవు? లే
నవ్వులు గావు; నీతలఁపునం గల మే లొనరింతు ధీమణీ?' 1701

వ. అని యిట్లు లీలాగృహీతశరీరుండైన యప్పరమేశుం డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగ నిట్లనియె. "దేవా! విదర్భదేశాధీశ్వరుండైన భీష్మకుం డను రాజు గలం; డా రాజుకూతురు రుక్మిణి యను కన్యకామణి గల, దయ్యిందు వదన నీకుం గైంకర్యంబు సేయం గోరి వివాహమంగళప్రశస్తం బయిన యొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవధరింపుము. 1072

సీ. ఏ నీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు
నే నీశుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీచరణసేవ లేప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
నే నీలసన్నామ మేప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు
తే. నట్టి నీయందు నాచిత్త మనవరతము నచ్చి యున్నది నీయాన [2]నాన లేదు
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి! శ్రీయుతాకార! మానినీచిత్తచోర! 1708

శా. ధన్యున్ లోకమనోభిరాము, గులవిద్యారూపతారుణ్యసౌ
జన్యశ్రీబలదానశౌర్యకరుణాసంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు కోరదే మును రమాకాంతాలలామంబురా?
జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్? 1704

ఉ. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహముపాలిసొమ్ము [3]గో
మాయువు గోరు చందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయినినైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ
డా యధమాధముం డెఱుంగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్. 1705

మ. వ్రతముల్ దేవగురుద్విజన్మ బుధసేవల్ దానధర్మాదులున్
గత జన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి చే
సితినేనిన్ వసుదేవనందనుఁడు నా చిత్తేశుఁ డౌఁ గాక ని
ర్జితులై పోదురు గాక సంగరములోఁ జేదీశముఖ్యాధముల్. 1706

ఉ.[4] అంకిలి సెప్ప లేదు; చతురంగబలంబులతోడ [5]నెల్లి యో
పంకజనాభ! నీవు శిశుపాలజరాసుతులన్ జయించి నా

1. వనరాశిదుర్గము-సముద్రమునందలికోట, 2. నాన-లజ్జ, 3 గోమాయువు-నక్క, 4. అంకిలి-అడ్డు, 5. ఎల్లి-రేఁపు.

వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే
[1]యుంకువసేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్. 1707

సీ. లోపలిసౌధంబులోన వర్తింపంగ, దేవచ్చునే నిన్నుఁ దెత్తు నేని,
గావలివారలఁ గల బంధువులఁ జంపి కాని తే రా' దని కమలనయన!
భావించితేని నుపాయంబు సెప్పెద నాలింపు కులదేవయాత్రఁ జేసి
నగరంబు వెలువడి [2]నగజాతకును మ్రొక్కఁ బెండ్లికి మునుపడఁ బెండ్లికూతు
తె. నెలమి మావారుఁ బంపుదు రేను నట్లు పురము వెలువడి యేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా సమయమందు వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత! 1708

మ. ఘను లాత్మీయ [3]తమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె
వ్వనిపాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు రే నట్టి నీ
[4]యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱు జన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా! 1709

సీ. ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల
పురుషరత్నమ! నీవు భోగింపఁగాలేని తనులతవలని సౌందర్య మేల?
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగాలేని చక్షురింద్రియముల [5]సత్త్వమేల
దయిత! నీ యధరామృతం బానఁగాలేని జిహ్వకు ఫలరససిద్ధి యేల?
ఆ. నీరజాతనయన! నీ వనమాలికా గంధ మబ్బలేని ఘ్రాణ మేల
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని జన్మ మేల? యెన్ని జన్మములకు?' 1710

వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాదివిశేషంబులును, బ్రాహ్మణుండు హరికి విన్నవించి 'కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు' మని సవర్ణనంబుగా మఱియు నిట్లనియె. 1711

సీ. పల్లవవైభవాస్పదములు పదములు గనకరంభాతిరస్కారు లూరు
లరుణప్రభామనోహరములు గరములు [6]గంబుసౌందర్యమంగళము [7]గళము
మహితభావాభావమధ్యంబు మధ్యంబు చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందుపటలంబు [8]నిటలంబు జితమత్తమధుకరశ్రేణి వేణి
ఆ. భావజాశుగముల ప్రావులు చూపులా కుసుమశరునివింటికొమలు బొమలు
చిత్తతోషణములు చెలువభాషణములు! జలజనయనముఖము చంద్రసఖము. 1712

ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయుల [9]యాన పెండ్లియగుఁ దప్పదు జాడ్యము లేల? నీవు నీ

---

1. ఉంకువ_శుల్కము, 2. నగజాత—గౌరీదేవి, 3. తమోనివృత్తి-అజ్ఞాననివారణము, 4. అనుకంప-దయ, 5. సత్త్వము-ఉనికి, 6. కంబువు-శంఖము, 7.గళము-మెడ, 8. నిటలంబు-నుదురు. 9. ఆన-ఒట్టు.

[1]తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తు గాని వి
చ్ఛేయము శత్రులన్ నుఱుము సేయుము సేయుము శోభనం బిలన్.' 1713

—: శ్రీకృష్ణుండు కుండిననగరంబునకు రథారూఢుండై చనుట :—

వ. అని యిట్లు పలికిన బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును, రూప సౌందర్యాదివిశేషంబులును, విన నవధరించి. నిజకరంబున నతని కరంబు పట్టి నగుచు నయ్యాదవేంద్రుం డిట్లనియె. 1714

ఉ. కన్నియమీఁద నాతలఁపు గాఢము [2]కూరుకు రాదు రేయి నా
కెన్నఁడు వా వివాహము సహింపక రుక్మి దలంచు కీడు; నే
మున్నె యెఱుఁగుదుం బరులమూఁక వధించి కుమారిఁ దెత్తు వి
ద్వన్నుత! మ్రాను ద్రచ్చి నవవహ్ని శిఖన్ వడిఁ దెచ్చుకైవడిన్. 1715

క. వచ్చెద విదర్భభూమికిఁ జొచ్చెద భీష్మకునిపురము సురుచిరలీలం
దెచ్చెద బాలన్ [3]వ్రేల్మిడి [4]వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁ బోరన్.' 1716

వ. అని పలికిన రుక్మిణీదేవి పెండ్లి నక్షత్రంబు దెలిసి, తన పంపున రథసారథి యైన దారుకుండు శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులను తురంగంబులం బూన్చి రథ మాయత్తంబు చేసి తెచ్చిన నమోఘమనోరథుండై హరి దాను, బ్రాహ్మణుండును రథారోహణంబుఁ జేసి యేకరాత్రంబున నానర్త్తకదేశంబులు గడచి విదర్భదేశంబునకుం జనియె; నందుఁ గుండినపురీశ్వరుండైన భీష్మకుండు కొడుకునకు వశుండై కూఁతు శిశుపాలున కిత్తునని [5]శోభనోద్యోగంబులు సేయించె; నప్పుడు. 1717

సీ. రచ్చలు [6]క్రంతలు రాజమార్గంబులు [7]విపణిదేశంబులు విశదములుగఁ
జేసిరి చందనసిక్తతోయంబులు గలయంగఁ జల్లిరి [8]కలువడములు
రమణీయవివిధతోరణములు గట్టిరి సకలగృహంబులుఁ జక్కఁ జేసి
కర్పూరకుంకుమాగరుధూపములు వెట్టి రతివలుఁ బురుషులు నన్నియెడల
ఆ. వివిధవస్త్రములను వివిధమాల్యాంబరా భరణలేపనములఁ బరఁగియుండి
రఖిలవాద్యములు మహాప్రీతి మ్రోయించి రుత్సవమున నగర మొప్పియుండె. 1718

వ. అంత నాభీష్మకుండు విహితప్రకారంబునం బితృదేవతల నర్చించి, బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి, మంగళాశీర్వచనంబులు సదివించి, రుక్మిణీదేవి నభిషిక్తం జేసి, వస్త్రయుగళభూషితం గావించి, రత్నభూషణంబు లిడం జేసె; ఋగ్యజుస్సామాథర్వణమంత్రం

1. తోయమువారు - పరిజనము, 2 కూరుకు-నిద్ర, 3. వ్రేల్మిడి-వేగముగా, 4. వ్రచ్చెదను-చీల్చెదను, 5. శోభనోద్యోగంబులు-అందమైన ప్రయత్నములు - వివాహ ప్రయత్నములు, 6. క్రంతలు-సందుత్రోవలు, 7. విపణి—అంగడి, 8. కలువడములు-కలువ పూదండలు.

ఖుల మంగళాచారంబు లొనరించి. భూసురులు రక్షాకరణంబు లాచరించిరి; పురోహితుండు గ్రహశాంతికొఱకు [1]నిగమనిగదిత న్యాయంబున హోమంబుఁ గావించె; మఱియు నా రాజు దంపతుల మేలుకొఱకుఁ దిల ధేను కలధౌత కనక చేలాదిదానంబులు ధరణిదేవతల కొసంగె నయ్యవసరంబున. 1719

మ. భటసంఘంబులతో రథావళులతో భద్రేభయూథంబుతోఁ
బటువేగాన్విత ఘోటకవ్రజముతో బంధుప్రియశ్రేణితోఁ
గటుసంరంభముతో విదర్భతనయం గైకొందు నంచున్ [2]విశం
కటవృత్తిం జనుదెంచెఁ జైద్యుఁడు గడున్ గర్వించి యవ్వీటికిన్. 1720

ఉ. బంధులఁ గూడి కృష్ణబలభద్రులు వచ్చినఁ బాఱఁ దోలి [3]ని
ర్బంధరవృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద మంచు నుల్లస
[4]త్సింధురవీరరథ్యరథసేనలతోఁ జనుదెంచి రా జరా
సంధుఁడు దంతవక్త్రుఁడును సాల్వవిదూరకపౌండ్రకాదులున్. 1721

వ. మఱియు నానాదేశంబులరాజు లనేకు లేతెంచి; రందు శిశుపాలు నెదుర్కొని పూజించి భీష్మకుం డొక్క నివేశంబున నతని విడియించె: నంత నా వృత్తాంతంబు విని. 1722

చ. 'హరి యొకఁ డేఁగినాఁడు మగధాదులు చైద్యహితానుసారులై
నరపతు లెందఱేనిఁ జనినారు కుమారికఁ దెచ్చుచోట సం
గర మగుఁ దోడు గావలయుఁ గంసవిరోధికి' నంచు వేగ దా
నరిగె హలాయుధుండు గమలాక్షునిజాడ ననేకసేనతోన్. 1723

క. ఆ లోపల నేకతమున నాలోలవిశాలనయన యగు రుక్మిణి త
న్నాలోకలోచనుఁడు హరి యాలోకము చేసి [5]కదియఁ డని శంకితయై. 1724

శా. 'లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలా రాఁడు గోవిందుఁ? డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిం దడసెఁ? నా యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో విరించికృత మెబ్బంగిన్ బ్రవర్తించునో? 1725

మ. ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో? నడుమ మార్గక్రాంతుఁడై చిక్కెనో
విని కృష్ణుం డిది దప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో? యీశ్వరుం

---

1. నిగమనిగదితన్యాయంబు-వేదములందు చెప్పఁబడిన పద్ధతి. 2. విశంకటవృత్తి-అడ్డులేనిప్రవర్తన, 3. నిర్బంధర-అడ్డులేని, 4. సింధురము-ఏనుగు, 5. కదియఁడు-సమీపింపఁడు,

డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో? [1]యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో? నాభాగ్య మెట్లున్నదో? 1726

వ. అని వితర్కించుచు. 1727

ఉ. 'పోఁ డను బ్రాహ్మణుండు యదుపుంగవువీటికి వాసుదేవుఁడున్
రాఁ డను నింకఁ బోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్
లేఁ డను రుక్మికిం దగవు లే దిటఁ జైద్యున కిత్తు నంచు ను
న్నాఁ డను గౌరి కీశ్వరికి నావలనం గృప లేదు నేఁ డనున్. 1728

ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁజిక్కు దిశల్ దరహాసచంద్రికం
గప్పదు వక్త్రతామరసగంధసమాగతభృంగసంగమున్
రొప్పదు నిద్రఁ గైకొన దురోజపరస్పరసక్తహారముల్
విప్పదు కృష్ణమార్గగతవీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్. 1729

చ. తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు కొప్పుఁ జక్కగా
ముడువదు నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన దన్న మేమియుం
గుడువదు నీరముం గొనదు కూరిమిఁగీరముఁ జేరి పద్యమున్
నొడువదు వల్లకీగుణవినోదము సేయదు డాయ దన్యులన్. 1730

సీ. మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ జలముల నాడదు జలజగంధి
[2]ముకురంబు సూడదు ముకురసన్నిభముఖి పువ్వులు [3]దుఱుమదు పువ్వుఁబోఁడి
వనకేళిఁ గోరదు వనజాతలోచన హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికాలలితదేహ [4]తొడవులు దొడవదు తొడవుతొడవు;
ఆ. తిలక మిడదు నుదుటఁ దిలకినీతిలకంబు కమలగృహముఁ జొరదు కమలహస్త
గౌరవించి తన్నుఁ గరుణఁ గైకొన వనమాలి రాఁడు తగవు మాలి యనుచు. 1731

వ. మఱియును. 1732

మ. మలఁగున్ మెల్లనిగ లికిం జటురట న్మత్తద్విరేఫాలికిం
దలఁగుం గోయిల మ్రోఁతకై యలఁగు నుద్యత్కీరసంభాషలం
గలఁగున్ వెన్నెలవేఁడిమి న్నలఁగు మాకందాంకురచ్ఛాయకుం
దొలఁగుం గొమ్మ మనోభవానలశిఖాదోదూయమానాంగియై. 1733

---

1. ఆర్యామహాదేవి-పార్వతీదేవి, 2. ముకురంబు-అద్దము, 3 తుఱుమదు-ముడువదు, 4. తొడవు-నగ.

వ. ఇట్లు హరిరాక కెదురుచూచుచు సకల [1]ప్రయోజనంబులందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబుఁ జెప్పు విధంబున వామలోచనభుజంబు లదరునంతఁ గృష్ణునియోగంబున వేగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన. నతని, ముఖలక్షణం [2]బుపలక్షించి యా కలకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునం జిఱునగవు నిగుడ నెదురుసని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె, 1734

ఉ. 'మెచ్చె భవద్గుణోన్నతి; [3]కమేయధనావళు లిచ్చె నాకుఁ; దా
వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిననైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా!' 1735

వ. అనిన వైదర్భి యిట్లనియె. 1736

మ. 'జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశమున్ జెప్పి నన్
నిలువంబెట్టితి; నీ కృపన్ బ్రదికితిన్ నీయంత పుణ్యాత్మకుల్
గలరే? దీనికి నీకుఁ బ్రత్యుపకృతిఁ గావింప నే నేర; నం
జలిఁ గావించెద; భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ!' 1737

వ. అని నమస్కరించె; నంత రామకృష్ణులు దన కూఁతు వివాహంబునకు వచ్చుట విని తూర్యఘోషంబులతో నెదుర్కొని విధ్యుక్తప్రకారంబునం బూజించి మధుపర్కంబు లిచ్చి వివిధాంబరాభరణంబులు మొదలైన కానిక లొసంగి, భీష్మకుండు బంధుజనసేనాసమేతులైనవారలకుఁ దూర్ణంబున సకల సంపత్పరిపూర్ణంబులైన [4]నివేశంబులు కల్పించి విడియించె; నిట్లుగూడిన రాజుల కెల్లను వయోవీర్యబలవిత్తంబు లెట్లట్ల కోరినపదార్థంబు లెల్ల నిప్పించి పూజించె; నంత విదర్భపురంబుప్రజలు హరిరాక విని వచ్చి చూచి నేత్రాంజలులం దదీయపదనకమల పానంబు సేయుచు. 1738

మ. తగు నీ చక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి నింత మంచి దగునే? దాంపత్య మీయిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా దర్పాహతారాతియై
మగఁ డౌఁ గావుతఁ జక్రి యీ రమణికిన్ మాపుణ్యమూలంబునన్. 1739

వ. అని పలికి రా సమయంబున: 1740

సీ. సన్నద్ధులై బహుశస్త్రసమేతులై బలసి చుట్టును వీరభటులు గొలువ
ముందట [5]నుపహారములుఁ గానికలుఁ గొంచు వర్గంబులై వారవనిత లేఁగ

1. ప్రయోజనంబులు-కార్యములు, 2. ఉపలక్షించి—చూచి, 3. అమేయ—లెక్కలేని—అధికమైన, 4. నివేశంబులు-బసలు, 5. ఉపహారములు-తినుబండారములు,

బుష్పగంధాంబరభూషణకలితలై పాడుచు భూసుర భార్య లరుగ,
బణవమర్దలశంఖపటహకాహళవేణుభేరీధ్వనుల మిన్ను పిక్కటిలఁగ,
ఆ. దగిలి సఖులు గొలువఁ దల్లులు బాంధవ సతులుఁ దోడరాఁగ సవినయముగ
[1]నగరు వెడలి నడచె [2]నగజాతకును మ్రొక్క బాల చికురపిహితఫాల యగుచు 1741

వ. మఱియు సూతమాగధవందిగాయకపాఠకజను లంతంత నభినందించుచుం జనుదేర మంద గమనంబున, ముకుందచరణారవిందంబులు డెందంబునఁ దలంచుచు నిందుధరసుందరీ మందిరంబు సేరి, సలిలధారాధౌతకరచరణారవిందయై వార్చి, శుచియై. గౌరీసమీపంబు నకుం జనియె. నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు [3]భవసహితయైన భవా నికి మజ్జనంబు గావించి గంధాక్షతంబు లిడి, వస్త్రమాల్యభూషణాదుల నలంకరించి, ధూప దీపంబు లొసంగి, నానావిధోపహారంబులు సమర్పించి, కానికలిచ్చి, దీపమాలికల [4]నివా ళించి రుక్మిణీదేవిని మ్రొక్కించిరప్పుడు. 1742

ఉ. 'నమ్మితి నామనంబున [5]సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ [6]బురాణదంపతుల మేలు భజింతు గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ! హరిం బతిం జేయుమమ్మ! నిన్
నమ్మినవారి కెన్నడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ!' 1743

వ. అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబు లును, దాంబూలకంఠసూత్రంబులును, నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన. 1744

ఆ. వార లుత్సహించి వలనొప్ప దీవించి సేసలిడిరి యువతిశిరమునందు
సేస లెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి మౌననియతిమాని మగువ వెడలె. 1745

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు [7]క్రొక్కారు మెఱుంగు తెఱంగున మృగధర మండలంబు నిర్గమించి చరించు మృగంబుచందంబునఁ, గమలభవన రక్షకుం డెత్తిన [8]జవ నికమఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవతకైవడి దేవదానవసంఘాతకరతలసవ్యాప సవ్యసమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత పర్యాయపరిభ్రాంతమందరాచల మంథానమధ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవమధ్యంబుననుండి చనుదెంచు నిందిరాసుందరీవై భవంబున, బహువిధప్రభాభాసమానయై యిందుధరగేహినీమందిరంబు వెలువడి మానసకాసార హేమకమలకాననవిహరమాణమదమరాళంబుభంగిఁ మందగమనం బునఁగనకకలశయుగళసంకాశకర్కశపయోధర భారపరిశ్రమ్యమానమధ్యయై రత్నముద్రి కాలంకృతంబైన కెంగేల నొక్క సఖీలలామంబుకైదండగొని, రత్ననివహసమంచిత

1. నగరు-రాజభవనము, 2. నగజాత-పార్వతి, 3. భవుఁడు-శివుడు, 4 నివాళించి-హారతిచ్చి, 5. సనాతనులు-శాశ్వతులు, 6. పురాణులు-ప్రాచీనులు, 7. క్రొక్కారు-క్రొలకరి, 8 జవనిక-తెర,

కాంచనకర్ణపత్త్రమయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, నరవిందపరిమళ కుతూహలావతీర్ణ మత్తమధుకరంబులమాడ్కి నరాళంబు లైన కుంతల జాలంబులు ముఖమండలంబునం గ్రందుకొన సుందరమందహాసరోచులు దిశలందు బాలచంద్రికాసౌంద ర్యంబు నావహింప నధరబింబఫలారుణమరీచిమాలికలు రదనకుందకుట్మలంబుల కను రాగంబు సంపాదింప, మనోజాత [1]కేతనసన్నిభంబైన పయ్యెదకొంగుదూఁగ సువర్ణమేఖ లాఘటితమణికిరణపటలంబు లకాలశక్రచాపజనకంబులై మెఱయఁ జెఱకువిలుతుం డొర వెఱికి వాఁడియిడి జళిపించిన ధగద్ధగాయమానంబులగు బాణంబులపగిది సురుచిరవిలోకన నికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప [2]శింజానమంజుమంజీరనినదంబులు సేయఁ బాదసంచారంబున హరిరాక కెదురుచూచుచు వీరమోహినియై చనుదెంచు సమ యంబున. 1746

మ. అలినీలాలకఁ బూర్ణచంద్రముఖి [3]నేణాక్షిం [4]బ్రవాళాధరం
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిం
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో
త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్. 1747

వ. మఱియు నయ్యింతిదరహాసలజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱిఁ ధైర్యంబులు దిగనాడి. గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని,యెఱుక లుడిగి,యాయుధంబు దిగవైచి, గజతురగరథారోహణంబులు సేయనేరక, రాజు లెల్ల నేలకువ్రాలి రా యేణీలోచన తన వామకరనఖంబుల [5]నలకంబులు దలగఁ ద్రోయుచుఁ నుత్తరీయంబు సక్క నొత్తుచుఁ గడగంటిచూపులం గ్రమంబున నారాజలోకంబు నాలోకింపుచు. 1748

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేం [6]ద్రావల
గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశదే
హు నగారాతిగజేంద్రహస్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్. 1749

—:కృష్ణుండు శత్రురాజులు సూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట:—

వ. కని తదీయరూపవయోలావణ్యవైభవగాంభీర్యచాతుర్య తేజోవిశేషంబులకు సంతసించి, మనోభవశరాక్రాంతయై రథారోహణంబు గోరుచున్న వరారోహం జూచి పరిపంథిరాజ లోకంబు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబు లీలం జనుదెంచి [7]ఫేరవంబుల నడిమిభాగంబు గొని చను కంఠీరవంబుకైవడి నిఖిల భూపాలగణంబుల గణింపక తృణీ

1. కేతనము-పతాక, 2. శింజాన-ధ్వనిచేయుచున్న, 3. ఏణము-జింక, 4. ప్రవాళము-పగడము, 5. అలకంబులు-ముంగురులు, 6. అవలగ్నము-నడుము, 7. ఫేరవంబులు-నక్కలు.

కరించి రాజకన్యకం దెచ్చి హరి దన రథంబుమీఁద నిడికొని భూనభోంతరాళంబులు నిండ శంఖంబు పూరించుచు బలభద్రుండు తోడ నడవ యాదవవాహినీపరివృతుండై ద్వారకానగరమార్గంబు వట్టి చనియె. నంత జరాసంధ వశులయిన రాజులందఱు హరిపరాక్రమంబు విని సహింపనోపక. 1750

మ. 'ఘనసింహంబులకీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్
మనకీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచుఁ [1]నున్మాదంబుతోఁ గోపకుల్
సనుచున్నా రదెః శౌర్య మెన్నటికిః మీశస్త్రాస్త్రముల్ గాల్పనేః
తనుమధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ [2]క్రంతలన్.' 1751

వ. అని యొండొరులం దెలుపుకొని రోషంబులు హృదయంబుల నిలుపుకొని సంరంభించి. [3]తనుత్రాణంబులు వహించి ధనురాదిసాధనంబులు ధరియించి, పంతంబులాడి, తమతమ చతురంగబలంబులం గూడికొని, జరాసంధాదులు యదువీరుల వెంటనంటి, తాఁకి నిలు నిలుండని, ధిక్కరించి పలికి యుక్కు మిగిలి, మహీధరంబులమీఁద సలిలధారలు గురియు [4]ధారాధరంబులచందంబున బాణవర్షంబులు గురిసిన యాదవసేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి, గుణంబులు మ్రోయించి, నిలునంబడి రప్పుడు.

క. అరిబలభటసాయకముల హరిబలములు గప్పఁబడిన నడరెడు భీతిన్
హరిమధ్య సిగ్గుతోడను హరివదనముఁ జూచెఁ జకితహరిణేక్షణయై. 1453

వ. ఇట్లు చూచిన. 1754

క. 'చొచ్చెద రదె యదువీరులు వ్రచ్చెద రరిసేన నెల్ల వైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును జచ్చెదరును నేఁడు చూడు జలజాతాక్షీ!' 1755

వ. అని రుక్మిణీదేవిని హరి యూఱడించె; నంత బలభద్రప్రముఖులైన యదువీరులు ప్రళయవేళల మిన్నునం బన్ని బలుపిడుగు లడరించు [5]పెనుమొగిళుల వడువున జరాసంధాది పరిపంథిరాజచక్రంబుమీఁద నవ్రకపరాక్రమంబున శిఖిశిఖాసంకాశనిశితశిలీముఖనారాచభల్ల ప్రముఖంబులైన బహువిధ బాణపరంపరలుగురియ, నదియును విదళితమత్తమాతంగబును, విచ్ఛిన్న తురంగంబును. విభిన్నరథ [6]వరూథంబును, వినిహతపదాతియూథంబును, విఖండిత వాహవారణరథారోహణమస్తకంబును, [7]విశకలితవక్షోమధ్యకర్ణకంఠకపోల హస్తంబును, విస్ఫోటితకపాలంబును, వికీర్ణ కేశజాలంబును, విపాటితచరణ జానుసంఘంబును, విదళితదంతసంఘంబును, విదళితదంతసంఘంబును. విఘటితవీరమంజీర కేయూరంబును, విభ్రష్టకుండలకిరీటహారంబును, విస్మృత వీరాలాపంబును, విదార్యమాణ గదా కుంత తో

1. ఉన్మాదంబు–మదము, 2. క్రంతలు–రాజభలు, 3. తనుత్రాణంబులు–కవచములు, 4. ధారాధరంబులు–మేఘములు, 5. పెను మొగిళులు–పెద్ద మేఘములు, 6. వరూథంబు–రథముపైకప్పు, 7. విశకలితము–ఎక్కువగా ముక్కలు చేయఁబడినది.

మరపరశుపట్టిసప్రాసకరవాలశూలచక్రచాపంబును, వినిపాతితకేతనచ్ఛత్త్రచామరంబును, విలూనతనుత్రాణంబును, విలీయమానఘోటకసంప [1]రింఖాసముద్ధూత ధరణీపరాగంబును, వినష్టరథవేగంబును, వినివారితసూత మాగధవందివాదంబును, వికుంఠితహయహేషాపటహ ఢాంకార కరటిఘటాఘీంకార రథనేమిపటపటాత్కార తురగనాభిఘంటా ఘనఘణా త్కార వీరహుంకార భూషణఝుణఝుణాత్కార నిస్సాణధణధణాత్కార మణినూపుర క్రేంకారకింకిణీకిణకిణాత్కారశింజనీటంకార భటపరస్పరధిక్కారనాదంబును, వినిర్భిద్య మానరాజసమూహంబును, విద్యమానరక్తప్రవాహంబును, విశ్రూయమాణభూతవేతాళకల కలంబును, విజృంభమాణ ఫేరవకాక గృధ్రకంకాది సంకులంబును, ప్రచలితకబంధంబును, ప్రభూత [2]పలలగంధంబును, ప్రదీపిత మేదోమాంసరుధిరఖాదంబును, ప్రవర్తితడాకినీ ప్రమోదంబునునై యుండె; నప్పుడు 1756

చ. మగిడి చలించి పాఱుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో
[3]వగచుచు [4]నాలిఁ గోల్పడినవాని క్రియం గడు వెచ్చనూర్చుచున్
మొగమున [5]దప్పి దేరఁ దమముందటఁ బొక్కుచు నున్న చైద్యుతోఁ
"బగతుర చేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే" 1757

వ. అని మఱియును. 1758

ఆ. 'బ్రదుకవచ్చు నొడలఁ బ్రాణంబు లుండిన బ్రదుకు గలిగె నేని భార్య గలదు
బ్రదికి తీవు భార్యపట్టు [6]దయ్య మెఱుంగు వగవ వలదు చైద్య! వలదు వలదు. 1759

వ. వినుము; దేహధారి స్వతంత్రుండు గాఁడు! జంత్రగానిచేతి జంత్రపుబొమ్మకై వడి నీశ్వర తంత్రపరాధీనుండై సుఖదుఃఖంబులందు నర్తనంబులు సలుపు; తొల్లి నేను మథురాపురంబు మీఁద బదియేడు మాఱులు పరాక్రమంబున విడిసి చక్రిచేతం బరాజితబలచక్రుండనై [7]కామపాలుచేతం బట్టువడి, కృష్ణుండు కరుణసేసి విడిపించిన వచ్చి క్రమ్మఱ నిరువదిమూఁ డక్షౌహిణులం గూడికొని పదునెనిమిదవమాఱు దాడిచేసి శత్రులందోలి విజయంబు చేకొంటి నిట్టి జయాపజయంబులందు హర్షశోకంబుల నెన్నండునుం జెంద; దైవయుక్తం బయిన కాలంబునంజేసి లోకంబులు పరిభ్రమించుచుండు; నదియునుంగాక. 1760

మ. తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్యవిఖ్యాతవి
క్రములన్ గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్ నేఁడు కా
లము మేలై చనుదెంచెనేని మనమున్ లక్షించి విద్వేషులన్
సమరక్షోణి జయింత మింతపనికై శంకింప నీ కేటికిన్?' 1761

---

1. రింఖ-గిట్ట, 2. పలము-మాంసము, 3. వగచుచు-విచారించుచు, 4. ఆలి-భార్య. 5. దప్పి-బడలిక, 6. దయ్యము-దేవుఁడు, 7. కామపాలుఁడు-బలరాముఁడు,

వ. అని యిట్లు జరాసంధుండు నతనియొద్దిరాజులును శిశుపాలుని పరితాపంబు నివారించి, తమ తమ భూములకుఁ జనిరి; శిశుపాలుండు ననుచరసేనాసంమేతుండై తన నగరంబునకుం జనియె; నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక నేకాక్షౌహిణీ బలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదవిలి పోవుచుఁ దన సారథితో నిట్లనియె. 1762

ఉ. 'బల్లిదు నన్ను భీష్మజనపాలకుమారకుఁ [1]బిన్నఁజేసి నా
చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కని నిక్కపుబంటపోలె నీ
గొల్లఁడు వోయెడిన్;రథముఁ గూడఁగఁ దోలుము తేజితోల్లస
ద్భల్ల పరంపరన్ మదముఁ బాపెద జూపెద నా ప్రతాపమున్.' 1763

వ. అని యిట్లు రుక్మి యనునాడు హరి [2]కొలంది యెఱుంగక సారథి నదలించి రథంబుగూడం దోలించి 'గోపాలక! వెన్నముచ్చ! నిమిషమాత్రంబు నిలు నిలు' మని తిరస్కరించి బలువింట నారి యెక్కించి మూఁడు వాఁడితూపుల హరి నొప్పించి యిట్లనియె. 1764

సీ.'మా సరివాఁడవా? మా పాపఁ గొనిపోవ నేపాటి గలవాఁడ? వేది వంశ?
మెందు జన్మించితి? వెక్కడఁ బెరిగితి? వెయ్యది నడవడి? యెవ్వ డెఱుఁగు?
మానహీనుఁడ వీవు మర్యాదలును లేవు, మాయ గైకొని కాని మలయ రావు
నిజరూపమున శత్రు [3]నివహంబుపైఁ బోవు వసుధేశుఁడవు గావు వావి లేదు
ఆ. కొమ్మ నిమ్ము నీవు గుణరహితుండవు విడువు విడువ వేని విలయకాల
శిఖిశిఖాసమానశితశిలీముఖములఁ గర్వ మెల్లఁ గొందుఁ గలహమందు.' 1765

వ. అని పలికిన నగధరుండు నగి యొక్క బాణంబున వానికోదండంబు ఖండించి. యాఱు శరంబుల శరీరంబు దూఱ నేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెండమ్ముల సారథిం జంపి, మూఁడు వాఁడితూపులఁ గేతనంబుఁ ద్రుంచి, మఱియు నొక్కవిల్లందినం, దునిమి, వెండియు నొక్కధనువు పట్టిన విదళించి, క్రమంబునం బరిఘపట్టిసశూలచర్మాసి శక్తితో మరంబులు ధరియించినఁ దునుకలు చేసి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె, నంతటం దనివిసనక వాఁడురథంబు డిగ్గి ఖడ్గహస్తుండై దవానలంబు పయిం బడు మిడుతచందంబునం గదిసిన ఖడ్గకవచంబులు చూర్ణంబులు చేసి మెఱుంగులు చెదర నడిదంబు వెఱికి జళిపించి వాని శిరంబు తెగ వ్రేయ గమకించి నడుచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరిచరణారవిందంబులు పట్టుకొని యిట్లనియె.

మత్తకోకిలము. 'నిన్ను నీశ్వర! దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో
సన్నుతామరకీర్తిశోభిత! సర్వలోకశరణ్య! మా
యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీయెడన్
నన్ను మన్ననసేసి కావు మనాథనాథ! దయానిధీ! 1767

1. పిన్నఁజేసి-చులకనచేసి, 2. కొలంది-శక్తి, 3. నివహంబు-గుంపు.

మత్తకోకిలము. [1]కల్ల లేదని విన్నవించుట గాదు; వల్లభ! యీతనిన్
బ్రల్లదుం దెగఁ జూచితేనియు భాగ్యవంతుల మైత్రి; మే
మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ డంచు మోదితులైన మా
తల్లిదండ్రులు పుత్రశోకముఁ దాల్చి చిక్కఁడు రీశ్వరా' 1768

మ. అని దగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో
వినతక్రాంతముఖంబుతో ప్రతిచలద్వేణీకలాపంబుతోఁ
గనుదోయిం జడిగొన్న బాష్పములతోఁ గన్యాలలామంబు మ్రొ
క్కిన రుక్మిం దెగ వ్రేయఁ బోక మగిడెం గృష్ణుండు [2]రోచిష్ణుఁడై. 1769

వ. ఇట్లు చంపక 'బావా! ర' మ్మని చిఱునగవు నగుచు వానిం బట్టి బంధించి గడ్డంబును, మీసంబున దలయును రేవులు వాఱ గొఱిగి విరూపింజేసె నంత యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి తత్సమీపంబునకు వచ్చి; రప్పుడు హతప్రాణుండై కట్టువడి యున్న రుక్మిం జూచి కరుణసేసి బలభద్రుండు బంధంబులు [3]విడిచి హరి దగ్గఱ యిట్లనియె.

క. [4]తల మనక భీష్మనందను తలయును మూతియును గొఱుఁగ దగవే? బంధుం
దలయును మూతియు గొఱుగుట తలఁ దఱుగుటకంటెఁ దుచ్ఛతరము మహాత్మా! 1771

క. కొందఱు రిపు లని కీడును గొందఱు హితు లనుచు మేలుఁ గూర్పవు నిజ మీ
వందఱియందును సముఁడవు పొందఁగ నే లయ్య విషమబుద్ధి? ననంతా? 1772

-:సహోదరుని భంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవిని బలభద్రుం డూరార్చుట:-

వ. అని [5]తర్జించి పలికి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె. 1773

శా. తోడంబుట్టినవాని [6]భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకుమమ్మ పూర్వభవకర్మాధీనమై ప్రాణులం
గీడున్ మేలును జెంద లేఁ దొకఁడు శిక్షింపంగ రక్షింప; నీ
తోడంబుట్టువు కర్మశేషపరిభూతుం డయ్యె నేఁ డియ్యెడన్. 1774

క. చంపెడి దోషము గలిగినఁ జంప జనదు బంధుజనులఁ జను విడువంగాఁ
జంపిన దోషము సిద్ధము చంపను మఱియేల మున్న చచ్చినవానిన్? 1775

ఆ. బ్రహ్మచేత భూమిపతుల కీ ధర్మంబు కల్పితంబు రాజ్యకాంక్షఁజేసి
తోడిచూలు నయినఁ దోడబుట్టినవాఁడు చంపుచుండుఁ గ్రూరచరితుఁ డగుచు. 1776

---

1. కల్ల-తప్పు, 2. రోచిష్ణుఁడు - ప్రకాశించుచున్నవాడు, 3. విడిచి - విప్పి, 4. తలము-తొలఁగిపొమ్మన్న, 5. తర్జించి-బెదరించి, 6. భంగము-అవమానము.

క. భూమికి ధనధాన్యములకు భామలకును మానములకును( బ్రాభవములకుం
గామించి మీ(దు గానక శ్రీమదమున మానధనులు [1]చెనకుదు రొరులన్. 1777

వ. వినుము దేవమాయం జేసి దేహాభిమానులైన మానవులకు( బగవా(డు బంధుం డుదాసీను డను మోహంబు సిద్ధం బయి యుండు; జలాదులయందు( జంద్రసూర్యాదులు గగనం బును బెక్కయి కానంబడుభంగి దేహధారుల కంనటికి నాత్మ యొక్కం డయ్యును బెక్కండై తో(చు; నాద్యంతంబులు గల యీ దేహంబు ద్రవ్యప్రాణగుణాత్మకంబయి, యాత్మయందు నవిద్యచేత( గల్పితంబై, దేహిని సంసారంబునం ద్రిప్పు. సూర్యుండు [2]తటస్థుండై యుండ(; బ్రకాశమానంబు లయిన దృష్టిరూపంబులుబోలె, నాత్మ తటస్థు(డై యుండు; దేహేంద్రియంబులు ప్రకాశమానంబులగు నాత్మకు వేఱొక్కటితోడ సంయోగ వియోగంబులు లేవు; వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గాని, చంద్రునికి లేనికైవడి జన్మనాశంబులు దేహంబులకుం గాని యాత్మకు గలుగనేరవు, నిద్రవోయినవా( డాత్మను విషయఫలానుభోగంబు సేయించు తెఱంగున నెఱుకలేనివా(డు నిజము గాని యర్థంబు నందును భవంబు నొందుచుండు; గావున. 1778

క. అజ్ఞానజ మగు శోకము( విజ్ఞానవిలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే యజ్ఞానులభంగి వగవ నంభోజముఖీ:' 1779

వ. ఇట్లు బలభద్రుచేత( దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబు మాని యుండె; నట రుక్మి యను వా(డును బ్రాణావశిష్టుండై విడువంబడి తన [3]విరూపభావంబునకు [4]నెఱియుచు 'హరిం గెలిచి కాని కుండినపురంబు సొర' నని ప్రతిజ్ఞ సేసి తత్పురసమీపంబున నుండె; నివ్విధంబున. 1780

## :—శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని బెండ్లియాడుట:—

క. రాజీవలోచను(డు హరి రాజసమూహముల గెలిచి రాజస మొప్పన్
రాజిత యగు తనపురికిని రాజానన( దెచ్చె బంధురాజి నుతింపన్. 1781

వ. అంత నయ్యాదవేంద్రునినగరంబున సమారబ్ధవివాహకృత్యంబును, బ్రవర్తమానగీతవాద్య నృత్యంబును బ్రతిగృహాలంకృత విలసితాశేషనరనారీవర్గంబును, బరిణయమహోత్సవ సమాహూయమాన మహీపాలగజఘటాగండమండల దానసలిలధారాసిక్తమార్గంబును, బ్రతిద్వారమంగళాచారసంఘటిత [5]క్రముకకదళికాకర్పూరకుంకుమాగరుధూపపరిపూర్ణ కుంభంబును, విభూషిత సకలగృహవేదికాకవాట [6]గేహళీస్తంభంబును, విచిత్రకుసుమాంబర రత్నతోరణవిరాజితంబును సముద్ధూతకేతనవిభ్రాజితంబునునై యుండె; నయ్యవసరంబున.

1. చెనకుదురు-ఎదిరింతురు, 2. తటస్థుండు-దేనితోను సంబంధములేనివా(డు, 3. విరూపభావంబు-వికారరూపము, 4. ఎరియుచు-తపించుచు, 5. క్రముకము-పోక, 6. గేహళీస్తంభము-గడపయందలి స్తంభము.

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతో హారిణిన్ మానవై
భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధుభాం
ధవసత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్. 1783

క. సతులుం దారును బౌరులు హితమతిఁ గానికలు దెచ్చి యిచ్చిరి కరుణో
న్నతవర్ధిష్ణులకును మానితరోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్. 1784

క. హరిపెండ్లికిఁ గై కేయక కురుసృంజయయదువిదర్భకుంతినరేంద్రుల్
పరమానందముఁ బొందిరి ధరణీశులలోన గాఢతాత్పర్యములన్. 1785

క. హరి యీ తెఱఁగున రుక్మిణి నరుదుగఁ గొనివచ్చి పెండ్లియాడుట విని దు
ష్కరకృత్య మనుచు వెఱ గందిరి రాజులు రాజసతులు దిక్కుల నెల్లన్. 1786

ఆ. అనఘ! యాదిలక్ష్మి యైన రుక్మిణితోడఁ గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి
పట్టణంబులోనిప్రజ లుల్లసిల్లిరి ప్రీతు లగుచు ముక్తభీతు లగుచు, 1787

వ. అని చెప్పి. 1788

క. [1]కువలయరక్షాతత్పర ! కువలయదళనీలవర్ణ కోమలదేహా !
కువలయనాథశిరోమణి ! కువలయజనవినుతవిమలగుణసంఘాతా ! 1789

మాలిని. సరససిజనిభస్తా! సర్వలోకప్రశస్తా! నిరుపమశుభమూర్తీ! నిర్మలారూఢకీర్తీ!
పరహృదయవిదారీ భక్తలోకోపకారీ! గురుబుధజనతోషీ! ఘోరదైతేయశోషీ! 1790

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను పురాణంబునందు దేవకీదేవివివాహంబును, గగనవాణీశ్రవణంబును, గంసోద్రేకంబును. వసుదేవప్రార్థనంబును, యోగమాయాప్రభావంబును, బలభద్రుజన్మంబును, బ్రహ్మాదిసురస్తోత్రంబును, కృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును, యోగనిద్రాచరితంబును, నందపుత్రోత్సవంబును, బూతనాసంహారంబును, శకటభంజనంబును, తృణావర్తమరణంబును. గర్గాగమనంబును, నారాయణాది నామనిర్దేశంబును. బాలక్రీడయును, మృద్భక్షణంబును. వాసుదేవవదన గహ్వరవిలోక్యమాచరాచరసమస్తలోకవిలోకనంబును, నవనీతచౌర్యంబును, యశోదారోషంబును, నులూఖలబంధనంబును, నర్జునతరుయుగళనిపాతనంబును, నలకూబరమణిగ్రీవుల శాప మోక్షణంబును, బృందావనగమనంబును, వత్సపాలనంబును, వత్సాసురవధయును, బకదనుజవిదారణంబును, నఘాసురమరణంబును, వత్సాపహరణంబును, నూతనవత్స బాలకల్పనంబును, బ్రహ్మవినుతియు. గోపాలనంబును, గార్దభాసురహింసనంబును, గాళియ

1. కువలయము-భూమి, నల్ల కలువ.

పణిమర్దనంబును, గరుడకాళియనాగవిరోధకథనంబును ప్రలంబాసురహింసనంబును, దవానలపానంబును, వర్షర్తువర్ణనంబును, శరత్కాలలక్షణంబును, వేణువిలాసంబును, హేమంతసమయసమాగంబును, గోపకన్యాచరితహవిష్యవ్రతంబును, గాత్యాయనీసేవనంబును, వల్లవీవస్త్రాపహరణంబును, విప్రవనితాదత్తాన్నభోజనంబు, నింద్రయాగనివారణంబును, నందముకుందసంవాదనంబును, బర్వతభంజనంబును, బాషాణసలిలవర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణ కింకరుండు నందునిం గొనిపోయిన హరి దెచ్చుటయును, వేణుపూరణంబును, గోపికాజనఘోషనిర్గమనంబును, యమునాతీరవనవిహారంబును, గృష్ణాంతర్ధానంబును, ఘోషకామినీగణపరిదేవనంబును, గోపికాన్వేషణంబును, గోపికాగీతలును, హరిప్రసన్నతయును, రాసక్రీడనంబును, జలకేళియును సర్పరూపకుండయిన సుదర్శనవిద్యాధరుండు హరిచరణతాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుం డను గుహ్యకుని వధించుటయు, వృషభాసురవిదళనంబును. నారదవచనంబున హరిజన్మకథ యెఱింగి కంసుండు దేవకీవసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుండయిన కేశి యను దనుజునివధియించుటయును, నారదస్తుతియును, వ్యోమదానవమరణంబును, నక్రూరగమనంబును, నక్రూరరామకృష్ణులసల్లాపంబును. ఘోషనిర్గమనంబును, యమునాజలాంతరాళంబున నక్రూరుండు హరివిశ్వరూపంబు గాంచుటయు, నక్రూరస్తవంబును, మధురానగరప్రవేశంబును. రజకవధయును, వాయకమాలాకారసమ్మానంబును, గుబ్జాప్రసాదకరణంబును, ధనుర్భంగంబును. గంసుదుస్స్వప్నంబును, గువలయాపీడపీడనంబును, రంగస్థలప్రవేశంబును, జాణూరముష్టికులవధయును, గంసవధయును, వసుదేవదేవకీ బంధమోక్షణంబును, నుగ్రసేనరాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపనివలన విద్య లభ్యసించుటయును, సంయమనీనగరగమనంబును, గురుపుత్రదానంబును. నుద్ధవుని ఘోషయాత్రయును, భ్రమరగీతలును, గుబ్జావాసగమనంబును; గరినగరంబునకు నక్రూరుండు సని కుంతీదేవి నూరార్చుటయు, కంసభార్యలగు నస్తిప్రాస్తులు జరాసంధునకు గంసుమరణం బెఱింగించుటయు, జరాసంధుని దండయాత్రయును. మధురానగరనిరోధబును, యుద్ధంబున జరాసంధుడు సప్తదశవారంబులు పలాయితుం డగుటయును, నారదప్రేరితుండై కాలయవనుండు మథురపై దాడివెడలుటయును, ద్వారకానగరనిర్మాణంబును, మధురాపురనివాసులం దన యోగబలంబున హరి ద్వారకానగరంబునకు దెచ్చుటయును కాలయవనుండు హరివెంటం జని గిరిగుహయందు నిద్రితుం డైన ముచుకుందుని కోపదృష్టివలన నీఱగుటయును, ముచుకుందుండు హరిని సంస్తుతిచేసి, తపంబునకుం జనుటయును, జరాసంధుండు క్రమ్మఱ రామకృష్ణులపై నేతెంచుటయు. ప్రవర్షణపర్వతారోహణంబును, గిరిదహనంబును, గిరి డిగ్గనుఱికి రామకృష్ణులు ద్వారకానగరంబునకు జనుటయును, రుక్మిణీజననంబును. వాసుదేవాదిగమనంబును. రుక్మిణీగ్రహణంబును, రాజలోకపలాయనంబును, రుక్మి యను వాని భంగంబును. రుక్మిణీకల్యాణంబును నను కథలు గల దశమస్కంధంబు నందలి పూర్వభాగము.

—:ం:—

శ్రీరామచంద్రాయనమః

# శ్రీమహాభాగవతము

## దశమస్కంధము – ఉత్తరభాగము

—✻—

శ్రీకర! [1]పరిశోషితరత్నాకర! కమనీయగుణగణాకర! కారు
ణ్యాకర! భీకరశరధారాకంపితదానవేంద్ర! రామనరేంద్రా! 1

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె! నట్లు ప్రాయోపవిష్టుండైన పరిక్షిన్నరేంద్రుండు రుక్మిణీపరిణయానంతరంబున నైన కథావృత్తాంతం బంతయు వినిపింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

—: ప్రద్యుమ్నకుమారచరిత్రప్రారంభము :—

ఉ. తామరసాక్షునంశమున [2]దర్పకుఁ డీశ్వరుకంటిమంటలం
దా మును దగ్ధుఁడై పిదపఁ దత్పరమేశుని దేహలబ్ధికై
వేమఱు నిష్ఠఁ జేసి హరివీర్యముసం ప్రభవించె రుక్మిణీ
కామినిగర్భమం దసురఖండను [3]మాఱటమూర్తియో యనన్. 3

వ. అంత నా డింభకుండు ప్రద్యుమ్నుం డనుపేర విఖ్యాతుం డయ్యె; నా శిశువు [4]సూతికాగృహంబున దల్లిపొదిఁగట నుండం, దనకు శత్రుండని యెఱింగి శంబరుండను రాక్షసుండు దన మాయాబలంబునం గామరూపియై వచ్చి కొనిపోయి సముద్రంబులో వైచి తన గృహంబునకుం జనియె; నంత నా [5]శాబకుండు జలధి జలంబునం దిగఁబడ నొడిసి యొక మహామీనంబు మ్రింగె; నందు. 4

క. జాలిఁ బడి పాఱు జలచర జాలంబులఁ బోవనీక చని రోషాగ్ని
జ్వాలలు నిగుడఁగ నూరక జాలంబులు వైచిపట్టు జాలరు లంతన్. 5

వ. సముద్రంబులోన నామీనంబును దత్సహచరంబులైన మీనంబులనుం బట్టి కొని తెచ్చి శంబరునకుం గానికఁగా నిచ్చిన నంతడు వండి తెం డని [6]మహానస గృహంబునకుం బంచిన. 6

---

1. పరిశోషిత - ఇంకించిన, 2. దర్పకుఁడు - మన్మథుఁడు, 3. మాఱటమూర్తి-రూపాంతరము, 4. సూతికాగృహంబు - పురిటిల్లు, 5. శాబకుండు - బాలుఁడు, 6. మహానసగృహంబు-వంటయిల్లు.

క. రాజునగరి [1]యడబాలలు రాజీవముకడుపు వ్రచ్చి రాజనిభాస్యున్
రాజశిశువుఁ గని చెప్పిరి రాజీవదళాక్షియైన రతికి నరేంద్రా! 7

వ. అంత నారదుండు వచ్చి బాలకునిజన్మంబును శంబరోద్యోగంబును మీనోదర ప్రవేశంబు నుం జెప్పిన విని యా రతి మాయావతి యను పేర శంబరునియింటఁ బాతివ్రత్యంబు సలుపుచు దహనదగ్ధుం డయిన తన పెనిమిటి శరీరధారణంబు సేయుట కెదురు చూచుచున్న యది గావున, నయ్యర్భకుండు దర్పకుం డని తెలిసి మెల్లన పుత్రార్థిని యైన తెఱంగున శంబరునియనుమతి వడసి సూపకారుల యొద్ద నున్న పాపనిం దెచ్చి పోషించుచులడె; నా కుమారుండును శీఘ్రకాలంబున నారూఢయౌవనుండై 8

క. సుందర మగు తనరూపము సుందరు లోకమాలు దేఱి చూచినఁ జాలున్
సౌందర్య మేమి చెప్పను? బొందెద మని డాయుబుద్ధిఁ బుట్టించు నృపా! 9

సీ. చక్కని వారలచక్కఁదనంబున [2]కుపమింప నెవ్వఁడు యోగ్యుఁ డయ్యె
మిక్కిలి [3]తపమున మెఱయు సంబికకునై శంకరు నెవ్వండు సగము సేసె
బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను వాణికై యెవ్వఁడు [4]వాఁడి సెఱిచె
[5]వేయిడాగులతోడివిబుధలోకేశుని మూర్తికి నెవ్వఁడు మూల మయ్యె.
తే. మునులతాలిమి కెవ్వఁడు ముల్లుసూపు మగల మగువల నెవ్వండు మరులుకొలపుఁ
సుధమసునువున నెవ్వండు కొనువిజయము! చిగురువాలున నెవ్వండు సిక్కుపఱుచు? 10

వ. అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి పద్మదళలోచనుండును, ప్రలంబ బాహుండును. జగన్మోహనాకారుండును నైన పంచబాణునిం గని లజ్జాహాస గర్భితంబులైన చూపులం జూచుచు మాయావతి సురతప్రాంతిఁ జేసినం జూచి ప్రద్యుమ్నుం డిట్లనియె. 11

మత్తకోకిలము. 'నా తనూభవుఁ డీతఁ డంచును నాన యించుక లేక యో
మాత నీ విది యేమి? నేఁ డిటు మాతృభావము మాని సం
ప్రీతిఁ గామినిభంగి జేసెదు పెక్కువిభ్రమముల్? మహా
ఖ్యాతవృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగాన్' 12

వ. అనిన రతి యిట్లనియె "నీవు నారాయణనందనుండ వైన కందర్పుండవు; పూర్వకాలంబున నేను నీకు భార్యనైన రతినిఁ నీవు శిశువై యుండునెడ నిర్దయుండై దొంగిలి తల్లిం దొఱంగఁజేసి శంబరుండు కొనివచ్చి నిన్ను నీరధిలోవైచిన నొక్క మీనంబు మ్రింగె; మీనోదరంబు వెడలితీవు; మీఁదటి కార్య మాకర్ణింపుము, 13

---

1. అడబాలలు-వంటవారు, 2. ఉపమింప-పోలికగాఁ దెచ్చుటకు, 3. కనుసూపి మెఱసిన సూదుకై—పాఠాంతరము, 4. వాఁడిసెఱిచె-ధర్మము నతిక్రమింపఁ జేసెను, 5. వేయిడాగులు-వేయికళంకములు-సహస్రనేత్రములు.

క. మాయావి వీఁడు దుర్మతి మాయఁడు సంగరములం దమర్త్యుల గెలుచున్
మాయికరణమున వీనిన్ మాయింపుము మోహనాదిమాయలచేతన్. 14

మత్తకోకిలము. పాపకర్ముఁడు వీఁడు నిన్నిటఁ బట్టి తెచ్చిన లేచి 'నా
పాపఁ డెక్కడఁ బోయెనో? సుతుఁ బాపితే విధి?' యంచుఁ దా
గ్రేవుఁ బాసిన గోవుభంగిని ఖిన్నయై వడి గాఢసం
తాపయై నిను నోఁచి కాంచిన తల్లి కుయ్యిడ కుండునే? 15

వ. అని పలికి మాయావతి మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వశత్రుమాయా వినాశి
యయిన మహామాయవిద్య నుపదేశించె; నివ్విధంబున. 16

మ. గురుమాయారణవేదియై. కవచియై, కోదండియై, [1]బాణియై
[2]హరిజుం 'డోరి నిశాట వైచితివి నాఁ డంభోనిధిన్ నన్ను ఘో
రరణాంభోనిధి వైతు నిన్ను నిదె వే ర' మ్మంచుఁ జీరెన్ మనో
హరదివ్యాంబరు నుల్లసద్దనుజసేనాడంబరున్ శంబరున్. 17

చ. అదలిచి యిట్లు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠురభాషణంబులం
బదహతమై వడిం గవియు పన్నగరాజముఁ బోలి శంబరుం
డదరుచు లేచి వచ్చి గద నచ్యుతనందను వ్రేసె నుజ్జ్వల
[3]ద్భిదురకఠోరఘోషసమభీషణనాదము చేసి యార్చుచున్. 18

క. దనుజేంద్రుఁడు వ్రేసిన గదఁ దన గదచేఁ బాయ నడిచి దనుజులు బెదరన్
దనుజాంతకునికుమారుఁడు దనుజేశుని మీఁద నార్చి తన గద వైచెన్. 19

వ. అంత నారక్కసుండు వెక్కసంబగు రోసంబునఁ దనకు దొల్లి మయుం డెఱింగించిన
దైతేయమాయ నాశ్రయించి మింటికి నెగసి పంచబాణునిపై బాణవర్షంబు గురిసిన నమ్మ
హారథుండు నొచ్చియు సంచలింపక మచ్చరంబున సర్వమాయావినాశనియైన సాత్త్విక
మాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి నివారించె. మఱియు వాఁడు భుజగగుహ్యక
పిశాచమాయలు పన్ని నొప్పించిన నన్నియుం దప్పించి. 20

క. దండధరమూర్తిఁగైగొని యొం డాడిక చక్రిసూనుఁ డుగ్రతరాసిన్
ఖండించె శంబరునితలఁ గుండలకోటీరమణులు గుంభిని రాలన్. 21

క. చిగురాకడిదవుధారను జగములఁ బరవశము సేయు [4]చలపాదికి దొ
ర్దగునుక్కడిదంబునఁ దన పగతుం దెగవ్రేయు టెంత పని చింతింపన్? 22

1. బాణి-బాణములుకలవాఁడు, 2. హరిజుండు-ప్రద్యుమ్నుడు, 3. భిదురము-వజ్రాయుధము, 4. చలపాది-పట్టుదలకలవాఁడు,

క. బెగడుచు నుండఁగ శంబరు దెగడుచుఁ బూవింటిజోదు ధీరగుణంబుల్
వొగమడుచు గురిసిరి ముదమున నెగడుచుఁ గుసుమముల ముసురు [1]నిర్జరు లధిపా! 23

—:రతీదేవి ప్రద్యుమ్న సహితయై గగనమార్గంబున ద్వారకకు బోవుట:—

వ. ఇట్లు శంబరుని వధియించి విలసిల్లుచున్న [2]ఇంచువిలుకానిం గొంచు నాకాశచారిణియైన యా
రతీదేవి గగనపథంబుఁ బట్టి ద్వారకానగరోపరిభాగమునకుం జనుదెంచిన. 24

ఆ. మెఱుఁగుఁదీఁగెతోడి మేఘంబుకైవడి యువిదతోడ మింటి నుండి కదలి
యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు మెలఁగుచున్న లోనిమేడకడకు. 25

మ. జలదశ్యాముఁ బ్రలంబబాహుయుగళుం జంద్రాననున్ నీలసం
కులవక్త్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మహో
త్పలపత్త్రేక్షణు మందహాసలలితుం బంచాయుధున్ నీరజా
క్షులు దా [3]రేమఱుపాటు చూచి హరి యంచుం డాఁగి రయ్యైయెడన్. 26

క. కొందఱు హరియగు నందురు కొందఱు చిహ్నములు కొన్నికొన్ని హరికి లే
వందురు మెల్లనె తెలియద మందురు మఱుఁ జూచి కొంద ఱబలలు గుములై. 27

క. హరి యని వెనుచని పిదపన్ హరిఁ బోలెడువాఁడు గాని హరి గాఁడనుచున్
హరిమధ్య లల్లనల్లన హరినందను డాయ వచ్చి రాశ్చర్యమునన్. 28

ఉ. [4]అన్నులు సేర వచ్చి మరు నందఱుఁ జూడఁగఁ దాను వచ్చి సం
పన్న గుణాభిరామ హరిపట్టపుదేవి విదర్భపుత్త్రి క్రే
గన్నుల నా కుమారకుని కైవడి నేర్పడఁ జూచి బోటితోఁ
జన్నులు సేఁప నిట్లనియె సంభ్రమదైన్యము లుల్లసిల్లఁగన్. 29

శా. 'ఈ కంజేక్షణుఁ డీ కుమారతిలకుం డీ యిందుబింబాననుం
డీ కంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెందుండి యే తెంచెనో
యీ కల్యాణునిఁ గన్నభాగ్యవతి మున్నే నోములన్ నోఁచెనో
యేకాంతామణియందు [5]వీని కనెనో యేకాంతుఁ డీకాంతునిన్ ? 30

శా. [6]ఆళీ! నా తొలుచూలిపాపనికి [7]బోర్కాడించి నే సూతికా
శాలామధ్యవిశాలతల్పగతనై చన్నిచ్చి నిద్రింప నా

1. నిర్జరులు-దేవతలు, 2. ఇంచువిలుకాఁడ-మన్మథుడు, 3. ఏమఱుపాటు-పరాకు
4. అన్నులు-యువతులు, 5. వీనిఁగనెనో యేకాంతుఁ డేకాంతకున్—పాఠాంతరము,
6. ఆళి-చెలి, 7. బోర్కాడించి-స్నానముచేయించి.

బాలున్ నాచను(బాలకుం జెఱిచి యేపాపాత్ము లేత్రోవ ము
న్నే లీలం గొనిపోయిరో? శిశువు( దా నేతల్లి రక్షించెనో! 31

క కొడుక(డు నా [1]పొదిగిటిలో( జెడిపోయిననా(టనుండి చెలియా తెలయం
బడ దేవార్తయు నత(డే వడువున నెచ్చోట నిలిచి వర్తించెడినో? 32

క. ఇందా(క వా(డు బ్రదికిన సందేహము లేదు దేహచాతుర్యవయ
స్సౌందర్యంబుల లోకులు వందింప(గ నితనియంతవా( దగు(జుమ్మీ! 33

మ అతివా! సిద్ధము నా(టిబాలకున కీయాకార మీవర్ణ మీ
గతి యీహాసవిలోకనస్వరము లీ గాంభీర్య మీ కాంతి వీ(
డత(డే కా(దగు నున్నవారలకు నాయాత్మేశుసారూప్యసం
గతి సిద్ధింపదు వీనియందు మిగులం గౌతూహలం బయ్యెడిన్. 34

క. పొదలెడి ముదమున( జిత్తము గదలెడి నాయెదమమూ(పు గన్నుల వెంటం
బొదలెడి నాన(దాశ్రులు మెదలెడి( బాలిండ్ల( బాలు మే లయ్యెడినో?' 35

వ. అని దోలాయమానసయై వితర్కించుచు. 36

క. తనయు( డని నొడువ( దల(చును దనయుండు [2]గాకున్న మిగుల( [3]దతిగొని సవతుల్
దను నగియెద రని తల(చు న తనుసంశయ మలమికొన(గ( దనుమధ్య మదిన్. 37

వ. ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలినగరికావలివారివలన విని కృష్ణుండు దేవకీవసు దేవులం దోడ్కొని చనుదెంచి సర్వజ్ఞుం డయ్యు నేమియు వివరింపక యూరకుండె; నంత నారదుండు చనుదెంచి శంబరుండు గుమారునిం గొనిపోవుట మొదలైన వార్త లెఱింగించిన! 38

క. "చచ్చినబాలు(డు గ్రమ్మఱ వచ్చినక్రియ వచ్చె( బెక్కువర్షములకు నీ
సచ్చరితు నే(డు గంటిమి చెచ్చెర ము న్నెట్టి తపము సేయంబడెనో?' 39

వ. అని యంతఃపురకాంతలును, దేవకీవసుదేవ రామకృష్ణులును, యథోచిత క్రమంబున నా దంపతుల దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి సంతోషించిరి; రుక్మిణీదేవియు నంద నుం గౌ(గిలించుకొని. 40

శా. 'అన్నా? నాచను( బాపి నిన్ను దనుజుం డంభోనిధిన్ వైచెనే
యెన్నేవర్షము లయ్యె( బాసి సుత! నీ వే రీతి జీవించి యే
సన్నాహంబున శత్రు గెల్చితివొ? యాశ్చర్యంబు సంధిల్లెడిన్
నిన్నుం గాంచితి నింతకాలమునకున్ నే ధన్యతం జెందితిన్. 41

1. పొదిగిలి-పొత్తిలి. 2. గా(డనిన మిగుల( దఱిగొనియుసవతుల్—పాఠాంతరము, 3. తతిగొని-సమయము కనిపెట్టి,

వ. అని కొడుకుం జూచి సంతోషించి కోదలిగుణంబులు [1]కైవారంబు సేసి, వినోదించుచుండె నంత ద్వారకానగరంబుప్రజలు విని హర్షించి; రందు. 42

క. సిరి పెనిమిటిపుత్రకుఁ దగు [2]మరుఁ గని హరిఁ జూచినట్ల మాతలు దిమలోఁ
గరఁగుదురఁట; పరకాంతలు మరుఁగని మోహాంధకారమగ్నులు గారే? 43

వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 44

—: శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తికొరకు స్యమంతకమణి దెచ్చుట:—

క. సత్రాజిత్తు నిశాచర శత్రునకుం గీడు సేసి సద్వినయముతోఁ
బుత్రి స్యమంతమణియును మైత్రిం గొని తెచ్చి యిచ్చె మనుజాధీశా! 45

వ. అనిన విని రా జిట్లనియె. 46

ఆ. శౌరి కేమి తప్పు సత్రాజితుఁడు సేసె? గూఁతు మణిని నేల కోరి యిచ్చె?
నతని కెట్లు గలిగె నా స్యమంతకమణి విప్రముఖ్య నాకు విస్తరింపు. 47

వ. అనిన విని శుకయోగివర్యుం డిట్లనియె. 'సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి స్సయ నతనివలన సంతసించి సూర్యుండు స్యమంతకమణి నిచ్చె; నా మణి కంఠంబున ధరియించి సత్రాజిత్తు భాస్కరునిభంగి భాసమానుండై ద్వారకానగరంబునకుం వచ్చిన దూరంబున నతనిం జూచి జనులు మణిప్రభాపటలతేజో [3]హృతదృష్టు లయి సూర్యుం డని శంకించి వచ్చి హరి కిట్లనిరి. 48

క. నారాయణ! దామోదర! నీరజదళనేత్ర? చక్రి! నిఖిలేశ; గదా
ధారణ! గోవింద! నమస్కారము యదుపుత్ర! నిత్యకల్యాణనిధీ! 49

మ. దివిజాధీశ్వరు లిచ్చగింతురు గదా దేవేశ నిన్ జూడ యా
దవవంశంబున గూఢమూర్తివి [4]జగత్త్రాణుండవై యుండఁగా
భవదీయాకృతిఁ జూడ నేఁ డిదె [5]రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడై
రవియో, నీరజగర్భుఁడో యొకఁడు సేరన్ వచ్చె మార్గంబునన్' 50

వ. అని యిట్లు పలికిన మూఢజనులఁ జూచి గోవిందుండు నగి మణిసమేతుండైన సత్రాజితుండు గాని సూర్యుండు గాఁ డని పలికె. నంత సత్రాజితుండు శ్రీయుతంబయి మంగళాచారసంచారంబైన తన గృహంబునకుం జని, మహీసురులచేత నిజదేవతామందిరంబున

1. కైవారంబు-స్తుతి, 2. మరుఁడు-మన్మథుఁడు, 3. హృతదృష్టులు-కన్నులుకానరానివారు, 4. జగత్త్రాణుండు-లోకరక్షకుఁడు 5. రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడు-కాంతిచే, గప్పఁబడిన దిక్కులుకలవాఁడు,

నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె; నదియును ప్రతిదినంబు నెనిమిది బారువుల సువ
ర్ణంబు గలిగించుచుండు. 51

క. ఏరా జేలెడు వసుమతి నా రత్నము పూజ్యమానమగు నక్కడ రో
గారిష్ట సర్వమాయిక మారీదుర్భిక్షభయము మాను నరేంద్రా! 52

క. అమ్మణి [1]యాదవవిభునకు నిమ్మని హరి యడుగ నాతఁ డీక ధనేచ్ఛం
బొమ్మని పలికెను జక్రికి నిమ్మణి యీకున్న మీఁద నేమౌ ననుచున్. 53

వ. అంత.

చ. అడరెడువేడ్కఁ గంఠమున నమ్మణిఁ దాల్చి [2]ప్రసేనుఁ డొక్కనాఁ 54
డడవికి ఘోరవన్యమృగయారతి నేఁగిన వానిఁ జంపి పైఁ
బడి మణిఁ గొంచు నొక్క [3]హరి పాఱఁగ దాని వధించి డాసి యే
ర్పడఁ గనె జాంబవంతుఁడు ప్రభాత్తదిగంతము నా స్యమంతమున్, 55

క. కని జాంబవంతుఁ డా మణిఁ గొనిపోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం
బునఁ దన కూరిమిసుతకును ఘనకేళికందుకంబుగాఁ జేసె నృపా! 56

వ. అంత సత్రాజితుండు తనసహోదరుండైన ప్రసేనునిం గానక దుఃఖించుచు. 57

మ.'మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికిన్ మర్యాద లే'దంచు దూ
షణముం జేయఁగ వానిదూషణముఁ గంసధ్వంసి యాలించి 'యే
[4]వ్రణమున్ నాయెడ లేదు నింద గలిగెన్ వారించు టే రీతియో?' 58

వ. అని వితర్కించి. 59

మ. తనవా రెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచున్ వచ్చి త
ద్వనవీథిం గనె నేలఁ గూలిన మహాశ్వంబుం బ్రసేనుం బ్రసే
నుని హింసించిన సింహమున్ మృగపతిన్ నొప్పించి ఖండించి యేఁ
గిన భల్లూకము సొచ్చి యున్నగుహయుం గృష్ణుండు రోచిష్ణుఁడై. 60

వ. కని తనవెంట నచ్చిన ప్రజల నెల్ల గుహాముఖంబున విడిచి, సాహసంబున మహానుభావుం
డైన హరి నిరంతర [5]నిబిడాంధకారబంధురంబయి, భయంకరంబై. విశాలంబయిన గుహాం
తరాళంబు సొచ్చి, చని యక్కడ నొక్క బాలికకెదురు దర్శనీయ కేళికందుకంబుగా
వ్రేలం గట్టఁబడిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని హరింప నిశ్చయించి. 61

---

1. యాదవవిభుఁడు-ఉగ్రసేనుఁడు, 2. ప్రసేనుఁడు-సత్రాజిత్తుతమ్ముఁడు 3. హరి-సింహము, 4. వ్రణము-గాయము, 5. నిబిడము-దట్టమైనది.

క. మెల్లన పదము లిడుచు యదు వల్లభుఁ డా శిశువుకడకు వచ్చిన గుండెల్
జల్లనఁగఁ జూచి కంపము మొల్లంటుగ దానిదాది మొఱవెట్టె నృపా! 62

వ. అంత నాధ్వని విని బలవంతుండైన జాంబవంతుండు వచ్చి తన స్వామి యని కృష్ణు
నెఱుంగక [1]ప్రాకృతపురుషుం డని తలంచి కృష్ణునితో రణంబుచేసె; నందు. 63

క. [2]పలలమునకుఁ బోరెడు డేగలక్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయే
చ్ఛల నిరువదియెనిమిది దినములు వోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్. 64

క. అడిదములఁ దరులు విఱిగిన బెడిదము లగు మగతనములఁ [3]బిఱుతివక వడిం
బిడుగులవడువునఁ బడియెడి పిడికిటిపోటులను గలన బెరసి రిరువురున్. 65

శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్
ముష్టాముష్టి నహర్నిశంబు జయసమ్మోహంబునం బోరుచోఁ
బుష్టిం బాసి ముకుంద [4]ముష్టిహతులం బూర్ణశ్రమోపేతుఁడై
పిష్టాంగోరుశరీరుఁడై యతఁడు దా భీతాత్ముఁడై యిట్లనున్. 66

వ. 'దేవా! నిన్నుఁ బురాణపురుష నధీశ్వరు విష్ణుం బ్రభవిష్ణు నెఱుంగుదు; సర్వభూతంబు
లకుం బ్రాణప్రతాపధైర్యబలంబులు నీవ; విశ్వంబునకు సర్గస్థితిలయంబు లెవ్వ రాచరిం
తురు, వారికి సర్గస్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ; యాత్మవు నీవ' యని
మఱియును. 67

సీ. బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి నింకించి బంధించి యేపు సూపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే దానవగర్వాంధతమస మడఁచెఁ
గంజాతములుద్రెంచు కరిభంగి నెవ్వఁడు దశకంఠుకంఠ బృందములు ద్రుంచె
[5]నాచంద్రసూర్యమై యమరు లంకారాజ్యమునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె
తే. నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ డంచితోదారకరుణారసాబ్ధి యెవ్వఁ
డాతఁడవు నీవకావె; మహాత్మ! నేఁడు మాఱుపడి యెగ్గు సేసితి మఱువవలయు.' 68

వ. అని యిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతనిశరీరనిగ్రహనివారణం
బుగా భక్తవత్సలుండైన హరి దన కరంబున నతనిమేను నిమిరి గంభీరభాషణంబుల
నిట్లనియె. 69

క. 'ఈ మణి మాచేఁబడె నని తామసు లొనరించు నింద దప్పెడు కొఱకై
నీ మందిర మగు బిలమున కేమరుదెంచితిమి భల్లుకేశ్వర! వింటే?' 70

---

1. ప్రాకృతపురుషుండు - సామాన్యమనుష్యుఁడు, 2. పలలము - మాంసము, 3. పిఱుతివక - వెనుకతీయక, 4. ముష్టిహతులు - పిడికిటిపోట్లు, 5. ఆచంద్రసూర్యము - సూర్యచంద్రు లుండునంత కాలము నుండునది,

వ. అనిన విని సంతసించి జాంబవంతుఁడు మణియునుం, దన కూఁతు జాంబవతి యను కన్య కామణియునుం దెచ్చి హరికిఁ గానికంగా సమర్పించె; నడమున్న హరివెంట వచ్చినవారలు బిలంబువాకిటం బండ్రెండు దినంబులు హరిరాక కెదురుచూచి వేసరి వగచి పురంబునకుం జని; రంత దేవకీవసుదేవులును రుక్మిణియును మిత్ర బంధుజ్ఞాతిజనులును గుహ సొచ్చి కృష్ణుండు రాక చిక్కెనని శోకించి. 71

క. దుర్గమ మగు బిలమున హరి నిర్గతుఁడై చేరవలయు నేఁ డని పౌరుల్
వర్గములై సేవించిరి దుర్గం గృతకుశలమార్గఁ దోషితభర్గన్. 72

క. [1]దోలాయితమానసులై జాలింబడి జనులు గొలువఁ జండిక పలికెన్
'బాలామణితో మణితో హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ' డనుచున్. 73

క. యత్నము సఫలం బయిన [2]సపత్నసమూహములు బెగడఁ బద్మాక్షుం డా
రత్నముతోఁ గన్యాజన రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్. 74

క. మృతుఁడైనవాఁడు [3]పునరా గతుఁడైన క్రియం దలంచి కన్యామణిసం
యుతుఁడై వచ్చిన హరిఁ గని వితతోత్సవకౌతుకముల వెలసిరి పౌరుల్. 75

వ. ఇట్లు హరి దన పరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి, రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణినిచ్చె: నతండును సిగ్గువడి మణిం బుచ్చుకొని పశ్చాత్తాపంబు నొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిఁ జని. 76

క. పాపాత్ముల పాపములం బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గల దని నొడివిన పాపాత్ముని పాపమునకుఁ [4]బారము గలదే? 77

మ. మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు సే
సితిఁ? బాపాత్ముఁడ నర్థలోభుఁడను దుశ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీదేహముఁ గాల్పనే? దురిత మే మార్గంబునం బాయు? నే
గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుచు నన్ గారుణ్యభావంబునన్? 78

ఆ. మణిని గూఁతు నిచ్చి మాధవుపదములు పట్టుకొంటినేని బ్రదుకు గలదు
సంతసించు నతఁడు సదుపాయమగు నిది సత్య మితరవృత్తిఁ జక్కఁబడదు. 79

మ. అని యిబ్భంగి బహుప్రకారముల నేకాంతస్థుఁడై యింటిలోఁ
దనబుద్ధిం బరికించి నీతిగని సత్రాజిత్తు సంప్రాప్తశో

1. దోలాయితమానసులు-ఊఁగులాడు మనస్సులుకలవారు, 2. సపత్నసమూహములు-విరోధులగుంపులు, 3. పునరాగతుఁడు-తిరిగి వచ్చినవాఁడు, 4. పారము-అంతము.

ధనుఁడై యిచ్చె విపత్పయోధితరికిన్ భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్. 80

ఉ. తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదారయశోనిధి పెడ్లియాడె నా
నామనుజేంద్రనందితగుణస్థితిలక్షణ సత్యభామ ను
ద్దామపతివ్రతాత్వనయధర్మవిచక్షణతాదయాయశః
కామను సత్యభామను ముఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్, 81

క. 'మణి యిచ్చినాఁడు [1]వాసరమణి నీకును మాకుఁ గలవు మణులు కుమారీ
మణి చాలు' నంచుఁ గృష్ణుఁడు మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్. 82

వ. అంత నక్కడఁ గుంతీసహితులయిన పాండవులు [2]లాక్షాగారంబున దగ్ధులైరని విని నిఖి
లార్థదర్శనుండయ్యును, గృష్ణుండు బలభద్రసహితుండై కరినగరంబునకుం జని కృప
విదురగాంధారీభీష్మద్రోణులం గని దుఃఖోపశమనాలాపంబు లాడుచుండె! నయ్యెడ. 83

—: శతధన్వుఁడు సత్రాజితునిఁ జంపి మణి నపహరించుట :—

సీ. జగతీశ! వినవయ్య శతధన్వుఁ బొడగని యక్రూరకృతవర్మ లాప్తవృత్తి
'మన కిత్తు' ననుచు సమ్మతిఁ జేసి తనకూఁతుఁ బద్మాక్షునకు నిచ్చి పాడి దప్పె
ఖలుఁడు సత్రాజిత్తుఁ డలయ కేక్రియనైన మణిపుచ్చుకొనుము నీమతము మెరసి'
యని తనుఁ బ్రేరేప నా శతధన్వుఁడు పశువుఁ గటికివాఁడు పట్టి చంపు
ఆ. కరణి నిదురవోవఁ గడఁగి సత్రాజిత్తుఁ బట్టి చంపి వానిభామ లెల్ల
మొఱలువెట్ట లోభమునః జేసి మణిఁ గొంచుఁ జనియె నొక్కనాఁడు జనవరేణ్య! 84

వ. ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం దైలద్రోణియందుఁ బెట్టించి
హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తుమరణంబు విన్నవించిన హరి
యును బలభద్రుండు నీశ్వరు లయ్యును మనుష్యభావంబుల విలపించి; రంత బలభద్ర
సత్యభామాసమేతుండై హరి ద్వారకానగరంబునకు మరలి వచ్చి శతధన్వుం జంపెద నని
తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మనింటికిఁ జని తనకు సహా
యుండవు గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె. 85

ఉ. 'అక్కట! రామకృష్ణులు మహాత్ములు వారల కెగ్గు సేయఁగా
నిక్కడ నెవ్వఁ డోపు? విను మేర్పడఁ గంసుఁడు బంధుయుక్తుఁడై
చిక్కఁడె? మున్న మాగధుఁడు సేనలతోఁ బదియేడు [3]తోయముల్
దిక్కులఁ బాఱఁడే! మనకు దృష్టము వారల లావు వింతయే? 86

1. వాసరమణి=సూర్యుఁడు, 2. లాక్షాగారంబు=లక్కయిల్లు, 3. తోయముల్ = పర్యాయములు,

వ. అని యుత్తరంబు సెప్పిన విని శతధన్వుం డక్రూరునియింటికిం జని హరితోడ పగకుం దోడు రమ్మని చీరిన నక్రూరుండు హరిబలపరాక్రమధైర్యస్థైర్యంబు లుగ్గడించి మఱియు నిట్లనియె. 87

సీ. 'ఎవ్వఁడు విశ్వంబు నెల్ల సలీలుఁడై పుట్టించు రక్షించుఁ బొలియఁజేయు
నెవ్వనిచేష్టల నెఱుఁగరు బ్రహ్మాదు? లెవ్వనిమాయ మోహించు భువన
మేడేండ్లపాపఁడై యేవిభుఁ డొకచేత గోరక్షణమునకై కొండ నెత్తె
నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ? డద్భుతకర్ముఁ డసంతుండుకర్మసాక్షి?
తే. యట్టి ఘనునకు శౌరికి [1]ననవరతము మ్రొక్కెదము గాక? విద్వేషమునకు నేము
వెఱతు మొల్లము నీవొండువెంటఁబొమ్ము చాలు బదివేలువచ్చె నీసఖ్యమునను.' 88

వ. అని యిట్లక్రూరుం డుత్తరంబు వలికిన నమ్మహామణి యక్రూరునియొద్ద నునిచి, వెఱచి శతధన్వుండు తురగారూఢుండై శతయోజనదూరంబు సనియె; గరుడ కేతనాలంకృతం బైన తేరెక్కి రామకృష్ణులు వెనుచని; రంత నతండును మిథిలా నగరంబుఁ జేరి తత్సమీపంబునందు. 89

చ. తురగము డిగ్గి [2]తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై
పరువిడఁ 'బోకు పోకు' మని పద్మదళాక్షుఁడు గూడఁ బాఱి భీ
కరగతి వానిమస్తకము ఖండితమై పడ వ్రేసెఁ జక్రమున్
బరిహతదైత్యచక్రముఁ బ్రభాచయ [3]మోదితదేవశక్రమున్. 90

వ. ఇట్లు హరి శతధన్వుని వధియించి వాని వస్త్రంబులందు మణి వెదకి లేకుండుటఁ దెలిసి బలభద్రునికడకు వచ్చి శతధన్వుం డూరక హతుం డయ్యె; మణిలే' దనిన బలభద్రుం డి ట్లనియె. 91

సీ. 'ఆమణి శతధన్వుఁ డపహరించుట నిక్క; మెవ్వరిచే దాఁప నిచ్చినాఁడొ?
వేగమె నీ వేఁగి వెదకుము పురిలోన? [4]వైదేహు దర్శింప వాంఛ గలదు;
పోయి వచ్చెద; నీవు పొ'మ్మని వీడ్కొని మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి
పోయిన జనకుండు పొడగని హర్షించి యెంతయుఁ బ్రియముతో నెదురు వచ్చి
తే. యర్ఘ్యపాద్యాదికృత్యంబు లాచరించి [5]యిచ్చగించిన వస్తువు లెల్ల నిచ్చి
'యుండు' మని భక్తిచేసిన నుండె [6]ముసలి; కువలయేశ్వరు? మిథిలలోఁ గొన్ని యేండ్లు. 92

వ. అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సమ్మానితుండై. 93

1. అనవరతము–ఎల్లప్పుడు, 2. తల్లడము తొందరపాటు, 3, మోదితదేవశక్రము-సంతోషించిన దేవతలు, ఇంద్రుఁడును కలది, 4. వైదేహుఁడు-విదేహరాజు-జనకుఁడు, 5. ఇచ్చగించిన-కోరిన, 6. ముసలి-బలరాముఁడు.

క. చలమున గాంధారేయుఁడు, లలితగదాయుద్ధగౌశలము నేర్చెఁ దగన్
హలిచే నాశ్రితనిర్జరఫలిచేఁ ద్రైలోక్యవీరభటగణబలిచేన్. 94

వ. అంతఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వుని మరణంబును మణి లేకుండుటయును, సత్యభామకుం జెప్పి, సత్యభామాప్రియకరుండు గావున సత్రాజిత్తునకుఁ బరలోకక్రియలు సేయించె; నక్రూరకృతవర్మలు శతధన్వుమరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహుయోజన దూరభూమికిం జని; రక్రూరుండు లేమింజేసి వానలు లేక [1]మహోత్పాతంబులును, శరీరమానసతాపంబులును ద్వారకానగరవాసులకు సంభవించిన నందుల వృద్ధజనులు బెగడి హరి కి ట్లనిరి. 95

సీ. 'కమలాక్ష వినవయ్య! కాశీశుఁ డేలెడి [2]కుంభిని వానలు గురియకున్నఁ
గోరి శ్వఫల్కునిఁ గొనిపోయి యతనికిఁ గాందిని యనియెడు కన్య నిచ్చి
కాశీవిభుండు సత్కారంబు సేసిన వానలు గురిసె నా వసుధమీద;
నాతనిపుత్రకుఁ డైన యక్రూరుండు నంతటివాఁడు, మహాతపస్వి;
ఆ. మరలి వచ్చెనేని మాను నుత్పాతంబు, లెల్ల వాన గురియు నీ స్థలమున;
దేవ! యతనిఁ దోడి తెప్పింపు; మన్నింపు; మానవలయుఁ బీడ మానవులకు. 96

వ. అని పలుకు పెద్దలపలుకు లాకర్ణించి దూతలం బంపి కృష్ణుం డక్రూరుని రావించి పూజించి ప్రియకథలు కొన్ని సెప్పి సకలలోకజ్ఞుండు గావున మృదుమధుర భాషణంబుల నతనికి ట్లనియె. 97

సీ. 'తా నేఁగుచో శతధన్వుండు మణిఁ దెచ్చి నీయింటఁ బెట్టుట నిజము దెలిసి
నాఁడ; సత్రాజిత్తునకుఁ బుత్రకులు లేమి నతనికిఁ గార్యంబు లాచరించి
విత్తంబు ఋణమును [3]విభజించుకొనియెద రతనిపుత్రిక లెల్ల; నతఁడు పరుల
చేత దుర్మరణంబుఁ జెందినాఁ; డతనికై సత్కర్మములు మీఁద జరుపవలయు;
ఆ. మణి గ్రహింపు మీవ; మా యన్న నను నమ్మఁ; డెలమి బంధుజనుల కెల్లఁ జూపు
మయ్య! నీ గృహమున హాటకవేదికా సహితమఖము లమరు [4]సంతతమును.' 98

వ. అని యిట్లు సామవచనంబులు హరి పలికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిం దెచ్చి హరి కిచ్చిన. 99

ఉ. సంతస మంది బంధుజనసన్నిధికిన్ హరి దెచ్చి చూపె న
శ్రాంతవిభాసమాన[5]ఘృణిజాలపలాయితభూనభోంతర
ధ్వాంతము హేమభారచయవర్షణవిస్మితదేవమానవ
స్వాంతముఁ గీర్తిపూరితదిశావలయాంతము నా స్యమంతమున్. 100

---

1. మహోత్పాతంబులు-పెద్ద యుపద్రవములు, 2. కుంభిని-భూమి, 3. విభజించుకొనియెదరు-పంచుకొందురు, 4. సంతతము-ఎల్లప్పుడు, 5. ఘృణిజాలము-కాంతిసమూహము.

క. చక్రాయుధుఁ డీక్రియఁ దన యక్రూరత్వంబు జనుల కందఱకును ని
ర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ నక్రూరుని కిచ్చె మణిఁ గృపాకలితుండై. 101

క. ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ డనఘుఁడు మణి దెచ్చి యిచ్చినట్టి కథనమున్
వినినఁ బఠించినఁ దలఁచిన జనులకు దుర్యశముఁ బాపసంఘముఁ దలఁగున్. 102

—: శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుట :—

వ. అంత నొక్కనాఁడు పాండవులం జూడ నిశ్చయించి సాత్యకి ప్రముఖ యాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకుం జనినం బ్రాణంబుం గనిన యింద్రియం బులభంగి వా రఖిలేశ్వరుం డైన హరిం గని కౌగిలించుకొని కృష్ణుని దివ్యదేహసంగమం బున నిర్ధూతకల్మషులై యనురాగహాసవిభాసితం బైన ముకుందముఖారవిందంబు దర్శించి యానందంబు నొందిరి; గోవిందుడును యుధిష్ఠిరభీమసేనుల చరణంబులకు నభివందనం బులు సేసి యర్జును నాలింగనంబున సత్కరించి నకులసహదేవులు మ్రొక్కిన గ్రుచ్చి యెత్తి యుత్తమపీఠంబున నాసీనుండై యుండె; నప్పుడు. 103

క. చంచద్ఘనకుచభారాకుంచితయై క్రొత్తపెండ్లికూఁతు రగుట నిం
చించుక సిగ్గు జనింపఁగ, [1] పాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్. 104

వ. అంత సాత్యకి పాండవులచేతం బూజితుండై యొక్క పీఠంబున నాసీనుండై యుండె; దక్కిన యనుచరులును వారిచేతఁ బూజితులై కొలిచి యుండిరి; హరియుం గుంతీదేవి కడకుం జని నమస్కరించి యిట్లనియె. 105

క. 'అత్తా! కొడుకులుఁ గోడలు జిత్తానందముగఁ బనులు సేయగ నాత్మా
యత్తానుగవై యాజ్ఞాసత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్?' 106

చ. అనవుఁడుఁ బ్రేమ విహ్వలత నందుచు గద్గదభాషణంబులం
గనుఁగవ నశ్రుతోయములు గ్రమ్మఁగ గుంతి సుయోధనుండు సే
సిన యపచారముం దలఁచి చెందిన దుఃఖము లెల్లఁ జెప్పి యా
దనుజవిరోధి కి ట్లనియెఁ దద్దయుఁ [2] బెద్దఱికంబు సేయుచున్. 107

సీ. 'అన్న! నీచుట్టాల నరయుదు! మఱవవు; నీవు పుత్తెంచిన నెమ్మితోడ
మాయన్న యేతెంచి మముఁ జూచి పోయెను; నిల్చి యున్నారము నీబలమున
నా [3] పిన్నవాండ్రకు నాకు దిక్కెవ్వరు నేఁ డాదిగా నింక నీవె కాక?
యఖిల జంతువుల కీ వాత్మవు గావునఁ బరులు నావా రని భ్రాంతి సేయ;
తే. వయ్య! నాభాగ్య మెట్టిదో? యనవరతముఁ జిత్తమునఁనుండి కరుణ మాచిక్కు లెల్లఁ
బాపుచుందువుగాదె! యో పరమపుణ్య! యదుకుమారవరేణ్య? బుధాగ్రగణ్య!' 108

---

1. పాంచాలతనూజ-ద్రౌపది, 2. పెద్దఱికంబు-మర్యాద, 3. పిన్నవాండ్రు - కుమారులు

వ. అనిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 109

ఉ. 'పట్టఁగ లేరు నిన్నుఁ దమభావములందు సనందనాదు లే
పట్టుననైన; నట్టి గుణభద్రచరిత్రుఁడ వీవు, నేఁడు మా
చుట్టమ వంచు వచ్చెదవు; చూచెద వల్పుల మైన మమ్ము; నే
మెట్టి తపంబు చేసితి మధీశ్వర! పూర్వశరీరవేళలన్?' 110

వ. అని ధర్మజుండు దన్నుఁ బ్రార్థించిన నింద్రప్రస్థపురంబువారలకు నయనానందంబు
సేయుచు హరి గొన్ని నెలలు వసియించి యుండె; నం దొక్కనాడు. 111

మ. తురగశ్రేష్ఠము నెక్కి [1]కంకటధనుస్తూణీశరోపేతుఁడై
హరితోడన్ వనభూమి కేఁగి విజయుం డాసక్తుడై చంపె [2]శం
బరశార్దూలతరక్షుశల్యచమరీభల్లూకగంధర్వకా
సరకంఠీరవఖడ్గకోలహరిణీసారంగముఖ్యంబులన్. 112

క. అచ్చోటఁ బవిత్రములై చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకున్
దెచ్చి యొసంగిరి మెచ్చుగఁ జెచ్చెర నరుఁ గొల్చి యున్న సేవకు లధిపా! 113

వ. అంత నర్జునుండు నీరువట్టున దప్పిన యమునకుం జని యమ్మహారథులైన నరనారాయణు
లందు వార్చి జలంబులు ద్రాని యొక [3]పులినప్రదేశంబున నుండి. 114

చ. ఉపగతులైన యట్టి [4]పురుషోత్తమపార్థులు గాంచి రాపగా
విపులవిలోలనీలతరవీచికలందు శిరోజభారరు
చ్యపహసితాళిమాలిక నుదంచితబాలశశిప్రభాలికం
దపనునిబాలికన్ మదనదర్పణతుల్యకపోలపాలికన్. 115

వ. కని యచ్యుతుండు వంచిన విప్వచ్చుండు సని యా కన్య కిట్లనియె. 116

మ. 'సుదతీ! యెవ్వరిదాన? వేమికొఱకు ఇచ్చోటం బ్రవర్తించె? దె
య్యది నీనామము? గోర్కి యెట్టిది? వివాహాకాంక్షతోఁ గూడి యీ
నదికిన్ వచ్చినజాడ గానఁబడె? ధన్యం బయ్యె నీరాక; నీ
యుదయాదిస్థితి నెల్లఁ జెప్పు మబలా! యుద్యత్కురంగేక్షణా!' 117

వ. అనిన నర్జునునకుఁ గాళింది యి ట్లనియె. 118

మ. "నవవీరోత్తమ! యేను సూర్యునిసుతన్; నా పేరు కాళింది; భా
స్కరసంకల్పితగేహమందు నదిలోఁ గంజాక్షు విష్ణుం బ్రభున్

---

1. కంటకము-కవచము, 2. శంబరము-ఎఱ్ఱజింక, 3. పులినము-ఇసుకతిప్ప,
4. పురుషోత్తమపార్థులు-కృష్ణార్జునులు.

వరుఁగాఁ గోరి తపంబు సేయుదు; నొరున్ వాంఛింపఁ; 'గృష్ణుండు [1]వ
న్యరతిన్ వచ్చి వరించు' నంచుఁ బలికెన్ నాతండ్రి నాతోడుతన్." 119

వ. అనిన విని ధనంజయుం డా నీలవేణిపలుకులు హరికిం జెప్పిన విని సర్వజ్ఞుండైన హరియు [2]హరిమధ్యను రథంబుమీఁద నిడుకొని ధర్మరాజుకడకుం జని వారలు గోరిన విశ్వకర్మను రావించి వారిపురం బతివిచిత్రంబు సేయించె' 120

క. దేవేంద్రునిఖాండవ మప్పావకునకు నీఁ దలంచి పార్థుని [3]రథికుం
గావించి సూతుఁ డయ్యెను గోవిందుండు మఱఁదితోడి కూరిమి వెలయన్ 121

వ. ఇట్లు నరనారాయణులు సహాయులుగా దహనుండు ఖాండవవనంబు దహించి సంతసించి విజయునకు నక్షయతూణీరంబులు, నభేద్యకవచంబును, గాండీవమనియెడి బాణాసనంబును దివ్యరథంబును [4]ధవళరథ్యంబులు నిచ్చె నందు. 122

ఉ. వాసవసూనుచేఁ దనకు వహ్నిశిఖాజనితోగ్రవేదనల్
వాసినఁ జేసి యొక్కసభ పార్థున కిచ్చె మయుండు ప్రీతుఁడై
యా సభలోనఁగాదె గమనాగమనంబులఁ గౌరవేంద్రుఁ డు
ల్లాసముఁ బాసి యుండుట జలస్థలనిర్ణయబుద్ధిహీనుఁడై. 123

—: { శ్రీకృష్ణుండు కాళింది మిత్రవింద / నాగ్నజితి భద్ర లక్షణ యనువారలఁ బరిణయమాడుట } :—

వ. అంతం గృష్ణుండు ధర్మరాజప్రముఖుల వేడుకొని సాత్యకిప్రముఖసహచరులు గొలువ మరలి తన పురంబునకుం జని బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు నొక్క పుణ్యదినంబున శుభలగ్నంబునం గాళిందిం బెండ్లియయ్యెఁ; మఱియు నవంతిదేశాధీశ్వరులైన విందానువిందులు దుర్యోధనునకు వశ్యులై హరికి మేనత్తయైన రాజాధిదేవికూఁతురైన తమ చెలియలి వివాహంబు సేయ నుద్యోగించి స్వయంవరంబుఁ జాటించిన. 124

క. ధూరమణులు సూడఁగ హరి వీరతఁ జేకొనియె మిత్రవిందను నిత్యా
పూరితసుజనానందం జారుచికురకాంతివిజితషట్పదబృందన్. 125

సీ. జననాథ! వినుము కోసలదేశ మేలెడి నగ్నజిత్తను నరనాథుఁ డొకఁడు
సుమతి ధార్మికుఁడు దత్సుత నాగ్నజితి యను కన్యక గుణవతి గలదు దానిఁ
బెండ్లియాడుటకునై పృథివీశు లేతెంచి వాఁడికొమ్ములు గలవాని వీర
గంధంబు సోఁకిన గాలుత్రవ్వెడివాని నతిమదమత్తంబులైనవాని

---

1. వన్యరతి-అటవులకువచ్చు నాసక్తి, 2. హరిమధ్య-సింహమునడుము-బోలిన నడుముకలది, 3. రథికుఁడు-రథమునకు అధిపతి, 4. ధవళరథ్యంబులు-తెల్లనిగుఱ్ఱములు.

తే. గోవృషంబుల నేడింటిఁ గూర్చి తిరిగి బాహుబలమున నెవ్వఁడు పట్టి కట్టు
నతఁడు కన్యకుఁ దగు వరుం డని వానిఁబట్టజాలక పోదురు ప్రజలు బెగడి. 128

వ. ఇట్లు గోవృషంబుల జయించినవాఁ డక్కన్యకు వరుం డనిన భగవంతుండైన హరి విని సేనాపరివృతుండై గోసలపురంబునకుం జనినఁ గోసలాధీశ్వరుండు హరి [1]నెదుర్కొని యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి పీఠంబు సమర్పించి ప్రతివందితుండై యున్నయెడ.

క. ఆ రాజకన్య ప్రియమున నా రాజీవాక్షు మోహనాకారుఁ ద్రిలో
కారాధితు మాధవుఁ దన [2]కారాధ్యుండైన నాథుఁ డని కోరె నృపా! 128

వ. మఱియు నక్కన్యకారత్నంబు తన మనంబున. 129

ఆ.'విష్ణుఁ డవ్యయుండు విభుఁడు గావలె నని నోఁచినట్టి తొంటినోముఫలము
సిద్ధ మయ్యెననిఁ జేకొనుఁబో నన్నుఁ జక్రధరుఁడు [3]వైరిచక్రహరుఁడు. 130

మ. సిరియుం బద్మభవేశదిక్పతులు మున్ సేవించి యెవ్వానిశ్రీ
చరణాంభోజపరాగమున్ శిరములన్ సమ్యగ్గతిం దాల్తు రీ
ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళిమూర్తుల్ దయా
పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టి హరి నెబ్భంగిం బ్రవర్తించునో? 131

వ. అని యిట్లు నాగ్నజితి విచారించునెడఁ గృష్ణుం డా రాజుం జూచి మేఘగంభీర నినదంబున నిట్లనియె. 132

క. [4]అన్యుల యాచింపరు రాజన్యులు సౌజన్యకాంక్షఁ జనుదెంచితి మీ
కన్యన్ వేఁడెద నిమ్మా! [5]కన్యాశుల్కాదుల మేము గాము నరేంద్రా! 133

వ. అనన విని రా జిట్లనియె. 134

శా.'కన్యం జేకొన నిన్నిలోకముల నీకన్నన్ ఘనుం డైన రా
జన్యుం డెవ్వఁడు? నీగుణంబులకు నాశ్చర్యంబునుం బొంది తా
[6]నన్యారంభము మాని లక్ష్మి భవదీయాంగంబునన్ నిత్యయై
ధన్యత్వంబునఁ జెంది యున్నది గదా తాత్పర్యసంయుక్తయై. 135

---

1. ఎదుర్కొని-ఎదురుగాఁబోయి, 2. ఆరాధ్యుండు-పూజనీయుఁడు, 3. వైరిచక్రము-శత్రుసమూహము. 4. క. ఏనీపుత్రికఁగోరి మహీనాయక వచ్చినాడ నిమ్ము కరుణ నా, మానవతీ నాకు ననవుఁడు దానవసంహరునితో నతం డిట్లనియెన్ — పాఠాంతరము. 5. కన్యాశుల్కాదులు-కన్యకొఱకై శుల్కము నిచ్చువారు. 6. అన్యారంభము-వేఱుప్రయత్నము.

శా. చంచద్గోవృషసప్తకంబుఁ [1]గడిమిన్ సైరించి యెవ్వాఁడు భం
జించున్ వానికిఁ గూతు నిత్తు నని యేఁ జీరించినన్ వైభవో
దంచద్గర్వులు వచ్చి రాజతనయుల్ తత్పాదశృంగాహతిం
గించిత్కాలము నోర్వ కేఁగుదు రసిం [2]గేడించి భిన్నాంగులై. 136

శా. [3]ఉష్ణాంశుండు తమంబుఁ దోలుక్రియ నీవుగ్రాహవక్షోణిలోఁ
గృష్ణా! వైరులఁ దోలినాఁడవు రణక్రీడావిశేషంబులన్
నిష్ణాతుండవు సప్తగోవృషములన్ నేఁ డాజి భంజించి రో
చిష్ణుత్వంబున నేఁడు సేకొనుము మాశీతాంశుబింబాననన్. 137

వ అని నగ్నజిత్తు దన కూఁతువివాహంబునకు జేసిన సమయంబు సెప్పిన విని 138

చ. కనియె నఘారి వత్సబకకంసవిదారి ఖలప్రహారి దా
ఘనతరకిల్బిషంబుల నగణ్యభయంకరపౌరుషంబులన్
సునిశితశృంగనిర్దళితశూరసమూహముఖామిషంబులన్
హననగుణోన్మిషంబుల మహాపరుషంబుల గోవృషంబులన్. 139

ఉ. చేలము సక్కఁ గట్టుకొని చిత్రగతిన్ వడి నేడుమూర్తులై
బాలుఁడు [4]దారురూపములఁ బట్టెడుకైవడిఁ బట్టి వీరశా
ర్దూలుఁడు గ్రుద్ది నేలఁ బడద్రోచి మహోద్ధతిఁ గట్టి యీడ్చె భూ
పాలకు లెల్ల మెచ్చ వృషభంబుల బర్వతసన్నిభంబులన్. 140

వ. ఇట్లు వృషభంబుల నన్నిటినిం గట్టి యీడ్చినం జూచి హరికి నగ్నజిత్తు నాగ్నజితి నిచ్చిన విధివత్ప్రకారంబునం బెండ్లియయ్యె; నా రాజసుందరు లానందం బొంది, రా సమయంబున బ్రాహ్మణాశీర్వాదంబులును, గీతపటహశంఖకాహళ భేరీమృదంగనినదంబులును, జెలంగె; నంత నా కోసలేంద్రుండు దంపతుల రథారోహణంబు సేయించి పదివేలధేనువులును విచిత్రాంబరాభరణభూషితలైన యువతులు మూఁడువేలును, దొమ్మిదివేలగజంబులును గజంబులకు శతగుణంబులైన రథంబులును. రథంబులకు శతగుణంబులైన హయంబులును, హయంబులకు శతగుణాధికంబైన భటసమూహంబును నిచ్చి పుత్తెంచిన వచ్చు నప్పుడు. 141

ఉ. [5]భూతి యెలర్పఁ గోసలునిపుత్రికకై చనుదెంచి తొల్లి యాఁ
బోతులచేత నోటువడి పోయిన భూపతు లెల్ల మాధవుం
డా తరుణిన్ వరించుట [6]చరావలిచే విని త్రోవసైన్యసం
ఘాతముతోడఁ దాఁకి రరిగర్వవిమోచనుఁ బద్మలోచనున్. 142

---

1. కడిమి-బలము, 2. కేడించి-తప్పుకొని, 3. ఉష్ణాంశుఁడు-సూర్యుఁడు, 4. దారురూపములు-కొయ్యబొమ్మలు, 5. భూతి-ఐశ్వర్యము, 6. చరావలి-గూఢచారులగుంపు.

ఉ॥ [1]దండి నరాతు లెల్ల హరిఁ దాఁకిన నడ్డమువచ్చి వీఁకతో
[2]ఖండనభూమియందుఁ దన బాంధవు లెల్లను సంతసింపఁగా
గాండివచాపముక్తవిశిఖంబుల వైరుల నెల్లఁ జంపె [3]నా
ఖండలనందనుండు శశకంబుల సింహము చంపుకైవడిన్. 143

వ. ఇట్లు హరి నగ్నజితిం బెండ్లియై [4]యరణంబు పుచ్చుకొని, ద్వారకానగరంబునకు వచ్చి సత్యభామతోడం గ్రీడించుచుండె; మఱియును. 144

మ. జనవంద్యన్ శ్రుతకీర్తినందయఁ దరుణిన్ సందర్శనక్షౌణిపా
ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలోలాపాంగఁ గైకేయి ని
ర్ధనయోన్నిద్రఁ బ్రపూర్ణ సద్గుణసముద్రన్ భద్ర నక్షుద్ర నా
వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహితవ్రాతంబు భీతంబుగన్ 145

వ. మఱియును. 146

చ. అమరులఁ బాఱఁదోలి భుజగాంతకుఁడైన ఖగేశ్వరుండు ము
న్నమృతముఁ దెచ్చుకైవడి మదాంధుల రాజుల నుక్కడంచి యా
కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్
సమదమృగేక్షణన్ నయవిచక్షణఁ లక్షణఁ బుణ్యలక్షణన్. 147

వ. ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ గాళిందియుఁ మిత్రవిందయు, నాగ్నజితియు, భద్రయు, మద్రరాజనందన యైన లక్షణయు ననంగా నెనమండ్రు భార్యలైరి మఱియు నరకాసురుని వధియించి త [5]న్నిరుద్ధకన్యల షోడశసహస్రకన్యల రోహిణి మొదలైన వారిం బరిగ్రహించె నని విని. 148

క. 'ధరకుం బ్రియనందనుఁ డగు నరకుని హరి యేల చంపె? నరకాసురుఁ డా
వరకుంతల లగు [6]చామీ కరకుంభస్తనుల నేల [7]కారం బెట్టెన్. 149

వ అనిన నరేంద్రునకు మునీంద్రుం డి ట్లనియె; నరకాసురునిచేత నదితి కర్ణకుండలంబులును; వరుణచ్ఛత్త్రంబును [8]మణిపర్వత మనియెడు నమరాద్రి స్థానంబును గోలుపడుటయు నింద్రుండు వచ్చి హరికి విన్నవించిన హరి నరకాసుర వధార్థంబు గరుడవాహనారూఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె. 150

---

1. దండ-శౌర్యము, 2. ఖండనము-యుద్ధము, 3. ఆఖండలనందనుండు-అర్జునుండు, 4, అరణంబు - కట్నము, 5. నిరుద్ధకన్యలు – చెఱలోనుంచబడిన కన్యకలు 6 చామీకరము-బంగారము. 7. కారియఁ-పాఠాంతరము, 8. గోలుపడుటయు నమరాచలంబు నెడుటయు-పాఠాంతరము.

-: శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁగూడ నరిగి నరకాసురుని వధించుట :-

శా. 'దేవా! నీవు [1]నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు సూడఁగోరుదుఁ గదా! ప్రాణేశ! మన్నించి న
న్నీ వెంటం గొనిపొమ్ము; నేఁడు కరుణన్ నేఁ జూచి యేతెంచి నీ
దేవీ [2]సంహతికెల్లఁ జెప్పుదు భవద్దీప్తప్రతాపోన్నతుల్'. 151

వ. అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డి ట్లనియె. 152

సీ. 'సమద [3]పుష్పంధయ ఝంకారములు గావు; భీషణకుంభీంద్ర బృంహితములు
వాయునిర్గతపద్మవనరేణువులు గావు; [4]తురగరింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణజలతరంగాసారములు గావు; శత్రుధనుర్ముక్త సాయకములు
గలహంససారకాసారములు గావు; దనుజేంద్రసైన్యకదంబకములు.
తే. గమలకహ్లార కుసుమసంఘములు గావు; చటులరిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య! నీవెడ? రణరంగగమన మేడ? వత్తు; వేగమ నిలువుము; వలదు వలదు'. 153

వ. అనినఁ బ్రియునకుం బ్రియంబు జనియింప డగ్గఱి. 154

ఉ. 'దానవులైన నేమి? మఱి దైత్యసమూహములైన నేమి? నీ
మానితబాహు దుర్గముల మాటున నుండఁగ నేమిశంక? నీ
తో నరుదెంతు' నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కె న
మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సరదృష్టిఁ జూడఁగన్. 155

వ. ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబుల గ్రుచ్చి యెత్తి తోడ్కొని గరుడా
రూఢుండై హరి గగనమార్గంబునం జని, గిరిశస్త్రసలిల దహనపవన దుర్గమంబై మురా
సురపాశ పరివృతం బయిన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి. 156

మ. గదచేఁ బర్వతదుర్గముల్ శకలముల్ గావించి సత్తేజిత
[6]ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయమున్ భంజించి చక్రాహతిం
బెదరన్ వాయుజలాగ్ని దుర్గముల నిశ్శేషంబులం జేసి భీ
ప్రదుఁడై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు ముర ప్రచ్ఛన్నపాశంబులన్. 157

వ. మఱియును. 158

1. నిశాటులు:- రాక్షసులు, 2. సంహతి-సమూహము, 3. పుష్పంధయము -
తుమ్మెద, 4. తురగరింఖ-గుఱ్ఱపుగిట్ట, 5. ప్రదరశ్రేణులు-బాణములగుంపులు.

శా. ప్రాకారంబు గదా ప్రహారముల [1]నుత్పాటించి యంత్రంబులున్
నాకారాతులమానసంబులును భిన్నత్వంబు సెందంగ న
స్తోకాకారుఁడు శౌరి యొత్తె విలయోద్ధూతాభ్ర నిర్ఘాతరే
ఖాకాఠిన్యముఁ బాంచజన్యము విముక్త ప్రాణిచైతన్యమున్. 159

వ. అంత లయకాల కాలాభ్రగర్జనంబు పగిదినొప్పు నమ్మహాధ్వని విని పంచశిరుండైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గి లేచి జలంబులు వెడలి వచ్చి హరింగని ప్రళయకాల కీలికై వడి మండుచు [2]దుర్నిరీక్ష్యుండై [3]కరాళించుచుం దన పంచముఖంబులం పంచభూతమయంబయిన లోకంబుల మ్రింగ [4]నప్పళించు చందంబునం గదిసి యాభీల కీలాజటాలంబగు శూలంబున గరుడుని వైచి భూనభోంతరంబులు నిండ నార్చుచు. 160

క. దురదురఁ బరువిడి బిరుసున 'హరి హరి! నిలునిలువు' మనుచు నసురయుఁ గదిసెన్
మురమురదివిజుల హృదయము మెరమెరయిదె యడఁగుననుచు మెఱసెన్‌హరియున్ 161

వ. అప్పుడు. 162

క. గరుడునిపైఁ బడ వచ్చిన మురశూలము నడుమ నొడిసి ముత్తునియలుగాఁ
గరముల విఱిచి ముకుందుఁడు మురముఖముల నిశితవిశిఖములు వడిఁ జొనిపెన్. 163

మ. గద వ్రేసెన్ మురదానవుండు హరిపైఁ; గంసారియుం దగ్గదన్
గదచేఁ ద్రుంచి సహస్ర భాగములుగాఁ గల్పించె; నాలోన వాఁ
డెదురై హస్తము లెత్తికొంచు వడి రా నీక్షించి లీలాసమ
గ్రదశన్ వాని శిరంబు లైదును వడిన్ ఖండించెఁ జక్రాహతిన్. 164

వ. ఇట్లు శిరంబులు చక్రిచక్రధారాచ్ఛిన్నంబులయిన వజ్రివజ్రధారాదళితశిఖరంబై కూలెడి [5]శిఖరిచందంబున మురాసురుండు బలంబులందుఁగూలిన, వానిసూనులు జనకవధజనిత శోకాతురులై జనార్దను మర్దింతు మని [6]రణకుర్దనంబునం దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు నన నేడ్వురు యోధులు సక్రోధులై కాలాంతక చోదితంబైన ప్రళయపవనసప్తకంబుభంగి నరకాసుర ప్రేరితులై రయంబునఁ బీఠుం డనియెడు దండనాథుం బురస్కరించుకొని, పఱతెంచి హరిం దాఁకి శరశక్తిగదాఖడ్గకరవాలశూలాదిసాధనంబులు ప్రయోగించిన. 165

ఉ. ఆ దనుజేంద్రయోధవివిధాయుధసంఘము నెల్ల నుగ్రతన్
మేదినిఁ గూల నేయుచు సమిద్ధనిరర్గళమార్గణాళిఁ [7]గ్ర

1. ఉత్పాటించి - పడఁగొట్టి, 2. దుర్నిరీక్ష్యుండు - చూడశక్యముకానివాఁడు, 3. కరాళించుచు-బొబ్బలుపెట్టుచు, 4. అప్పళించు-యత్నించు, 5. శిఖరి-పర్వతము, 6. రణకుర్దనంబు-యుద్ధక్రీడ, 7. క్రవ్యాదులు-రాక్షసులు,

వ్యాదకులాంతకుం డసురహస్త భుజాననకంఠజానుజం
ఘాదులఁ ద్రుంచివైచెఁ దిలలంతల ఖండములై యిలం బడన్. 166

వ. మఱియు హరిశరజాలచక్రనిహతులయి తనవారలు మడియుటకు వెఱంగుపడి రోషించి గరుడగమనుని దూషించి తన్ను భూషించుకొని సరకుసేయక నరకుండు వరకుండల ప్రముఖాభరణభూషితుండయి దానసలిలధారాసిక్త గండంబును మహోద్దండశుండంబులు నైన వేదండ [1]తండంబులు నడవ వెడలి ఖండనంబునకుం జని 167

మ. బలవంతుండు [2]ధరాసుతుండు గనె శుంభద్రాజబింబోపరి
స్థల[3]శంపాన్వితమేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయు ను
జ్జ్వలనీలాంగుఁ గనన్నిషంగుఁ [4]గుహనాచంగున్ రణాభంగునిన్. 168

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక విలోకించి సంభ్రమంబున 169

శా. వేణిం [5]జొల్లెము వెట్టి సంఘటితనీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండలమరీచీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దనప్రాణేశాగ్ర భాగంబునన్. 170

## -: సత్యభామ నరకాసురునితో యుద్ధంబు సేయుట :-

క. [6]జన్యంబున దనుజుల దౌర్జన్యము లుడుపంగఁ గోరి చనుదెంచిన సౌ
జన్యవతిఁ జూచి యదురాజన్యశ్రేష్ఠుండు సరసల్లాపములన్. 171

క. 'లేమా! దనుజుల గెలువఁగ లేమా? నీవేల కడఁగి లేచితి? విటు రా;
లే మాను మాన వేనిన్ లేమా విల్లందికొనుము లీలం గేలన్. 172

వ. అని పలికి. 173

క. హరిణాక్షికి హరి యిచ్చెను సురనికరోల్లాసనమును శూరకఠోరా
సురసైన్యత్రాసనమును బరగర్వనిరాసనమును బాణాసనమున్. 174

శా. ఆ విల్లందు బలంబు నొంది తదగణ్యానంతతేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీరాలోక దుర్లోకయై

---

1. తండంబులు-గుంపులు, 2. ధరాసుతుండు-నరకుఁడు, 3. శంప-మెఱుపు, 4. కుహనాచంగుఁడు-మోసమునేర్పరి, 5. చొల్లెము-జడముడి, 6. జన్యంబు-యుద్ధము.

తా వేగన్ సగుణంబుఁ జేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా
[1]గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడామహోత్కంఠతోన్. 175

క. నారి మొరయించె రిపుసేనారింభణ హేతువైన నాదము నిగుడన్
నారీమణి బలసంప [2]న్నారీభాదికము మూర్ఛ నంద నరేంద్రా! 176

సీ. సౌవర్ణ కంకణఝుణఝుణనినదంబు [3]శింజినీరవముతోఁ జెలిమి సేయఁ
దాటంక మణిగణధగధగదీప్తులు గండమండలరుచిఁ గప్పికొనఁగ
ధవళతరాపాంగధళధళరోచులు బాణజాల ప్రభాపటలి నడఁప
శరపాతఘుమఘుమశబ్దంబు పరపంథి సైనిక కలకలస్వనము నుడుప
తే. వీరశృంగార భయరౌద్ర విస్మయములు గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
[4]నిషువుఁ దొడుగుట దివుచుట యేయు టెల్ల నెఱుఁగ రాకుండ నని సేసె నిందువదన. 177

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపుఁ బరఁగం జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహమున్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్. 178

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ [5]బ్రత్యాలీఢ [6]పాదంబుతో
[7]నలికస్వేదవికీర్ణకాలకలతో నాకర్ణికానీతస
ల్లలిత జ్యానఖపుంఖదీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై. 179

సీ. 'బొమ్మపెండ్లిండ్లకుఁబోనొల్ల' నను బాల రణరంగమున కెట్లు రాఁ దలంచె
మగనారిఁ గనిఁగఁ దా మఱుఁగు జేరెడునింతి పగవారి గెల్వ నేపగిదిఁ జూచెఁ
బసిఁడియుయ్యేల లెక్క భయ మందు భీరువు ఖగపతిస్కంధ మేకడఁది నెక్కె
సఖులకోలాహలస్వనము లోర్వని కన్య పటహభాంకృతుల కెట్లోర్చె
ఆ. [8]నీలకంఠములకు నృత్యంబుఁ గఱపుచుఁ నడసి తలఁగి పోవు నలరుఁబోఁడి
యేవిధమున నుండె నెలమి [9]నాలీఢాది మానములను రిపులమాన మడఁప. 180

సీ. వీణెఁ జక్కఁగఁబట్టవెర వెఱుంగని కొమ్మ బాణాసనం బెట్లు పట్ట నేర్చె
మ్రాఁకునఁ దీగెఁ గూర్పంగ నేరనిలేమ గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
[10]సరవి ముత్యము గ్రువ్వఁజాలని యబల యే నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు సెప్పనేరని తన్వి యస్త్రమంత్రము లెన్నఁ దభ్యసించెఁ?

1. గ్రీవాసంఘము - మెడలగుంపు. 2 అరీభాదికము - శత్రువులయేనుఁగులు మున్నగునవి, 3. శింజిని-వింటినారి, 4. ఇషువు-బాణము, 5. ప్రత్యాలీఢపాదంబు-ఎడమ పాదమును ముందునకుంచి, కుడిపాదమును వంచుట, 6. మానంబుతో—పాఠాంతరము, 7. అలికము-నుదురు, 8. నీలకంఠములు-నెమిళ్ళు. 9. ఆలీఢము-కుడికాలు ముందునకు చాచి నిలుచుట, 10. సరవి-క్రమము.

ఆ. బలుకు మనినఁ బెక్కుపలుకని ముగుద యే గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామగుణధామ చారుసత్యభామ సత్యభాను. 181

శా. జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ [1]సారంగయూథంబుగా
నావి ల్లింద్రశరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగాఁ
దావిద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగాఁ
[2]బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిగాన్. 182

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు నీరజాతేక్షణనెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై యలరుఁ బూఁబోఁడిచేలాంచలంబు
భావజు [3]పరిధియై ప్రళయార్కపరిధియై మెఱయు నాకృష్టమై మెలఁత చాప
మమృతప్రవాహమై యనలసందోహమై తనరారు నింతిసందర్శనంబు
ఆ. హర్షదాయియై మహారోషదాయియై పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార వీరరసము లోలి విస్తరిల్ల. 183

వ. ఇవ్విధంబున. 184

క. శంపాలతాభ బెడిదపు టంపఱచే ఘోరదానవానీకంబుల్
పెంపఱి సన్నాహంబుల సొంపఱి భూసుతునివెనుకఁ జొచ్చెన్ విచ్చెన్. 185

వ. అయ్యవసరంబునం గంససంహారి మనోహారిణిం జూచి సంతోషకారియుం గరుణా రసావ
లోకనప్రసారియు మధురవచన సుధారసవిసారియుం దదీయసమర సన్నాహ నివారియునై
యిట్లనియె. 186

క. 'కొమ్మా? దానవనాథుని [4]కొమ్మాహవమునకుఁ దొలఁగె గురువిజయముఁ గై
కొమ్మా! మెచ్చితి నిచ్చెదఁ గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్. 187

వ. అనిపలికి సమ్మానరూపంబులును, మోహనదీపంబులును, దూరీకృతచిత్తవిక్షేపంబులునైన
సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దలికంబు సేసి, తత్కరకిసలయోల్లసిత బాణాస
నంబు మరల నందుకొనియె; నప్పుడు సురవైరి మురవైరి కిట్లనియె. 188

క. మగువ మగవారిముందఱ [5]మగతనములు సూప రణము మానుట నీకున్
మగతనముగాదు దనుజులు మగువలదెసఁ జనరు [6]మగలమగ లగుట హరీ! 189

వ. అనిన హరి యిట్లనియె. 190

---

1. సారంగము-చాతకము, 2. ప్రావృట్కాలము-వర్షకాలము, 3. పరిధి-సూర్య
చంద్రులచుట్టుచు కానవచ్చు సుడి, 4. కొమ్మ-సేన, 5. మగతనములు-పౌరుషములు,
6. మగలమగలు-వీరాధివీరులు,

క. 'నరకా! ఖండించెద మత్కరకాండాసనవిముక్తఘనశరముల భీ
కరకాయు నిన్ను సురకిన్నరకాంతలు సూచి నేఁడు [1]నందం బొందన్.' 191

వ. అని పలికి హరి నరకాసురయోధులమీఁద [2]శతఘ్నియను దివ్యాస్త్రంబు ప్రయోగించిన నొక్క వరుసను వార లదఱు మహావ్యథం జెందిరి; మఱియును. 192

మ. శరవిచ్ఛిన్నతురంగమై పటుగదాసంభిన్న మాతంగమై
యురుచక్రాహతవీరమధ్యపదబాహుస్కంధ [3]ముఖ్యాంగమై
[4]సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి హైన్యంబుతో
హరిమ్రోలన్ నిలువంగలేక పఱచెన్ హాహానినాదంబులన్. 193

వ. అప్పుడు. 194

ఆ. మొనసి దనుజయోధముఖ్యులు నిగిడించు శస్త్రసముదయముల జనవరేణ్య
మురహరుండు వరుస మూఁడేసి కోలల ఖండితంబు సేసెఁ గదనమందు. 195

క. వెన్నుని సత్యను మోచుచుఁ బన్నుగఁ బదనఖర [5]చంచుపక్షాహతులన్
భిన్నములు సేసె గరుడుఁడు పన్నిన గజసముదయములఁ బౌరవముఖ్యా! 196

వ. మఱియువిహగరాజపక్షవిక్షేపణసంజాత [6]వాతంబు సైరింపంజాలక హతశేషంబైన సైన్యంబు పురంబు సొచ్చుటం జూచి నరకాసురుండు మున్ను పవ్రాయుధంబుఁ దిరస్కరించినఁ దనచేతిశక్తిం గొని గరుడని వైచె; నతండును విరుల దండ వ్రేటునఁ జలింపని మదోద్దండ [7]వేదండంబునుంబోలె విలసిల్లె; నయ్యవసరంబున గజారూఢుండై కలహ రంగంబున, 197

మ. సమదేభేంద్రము నెక్కి భూమిసుతుఁడా చక్రాయుధుఁ వైవ శూ
లము చేఁబట్టినయంతలోన రుచిమాలాభిన్న ఘోరాసురో
త్తమచక్రంబగు చేతిచక్రమున దైత్యధ్వంసి ఖండించె ర
త్నమయోదగ్రవినూత్నకుండలసమేతంబైనతన్మూర్ధమున్. 198

శా. 'ఇల్లాలం [8]గిటి యైనకాలమున మున్నే నంచు ఘోషింతు వో
తల్లీ! నిన్నుఁ దలంచి యైన నిచటం దన్నుం గృపం గావఁదే!
చెల్లంబో! తలఁ ద్రెంచె' నంచు నిల [9]నాక్షేపించుచందంబునన్
దెల్లం బప్పుడు గాఁగ భూమిసుతుఁ డుద్దీప్తాహవక్షోణిపై. 199

1. నందంబు-సంతోషము, 2. శతఘ్ని-ఫిరంగి-నూర్గురను చంపునది, 3. ముఖ్యాంగము-శిరస్సు, 4. సురభిత్సైన్యము-రాక్షససేన, 5. చంచువు-ముక్కు, 6. వాతఁబు-గాలి 7. వేదండంబు-ఏనుఁగు, 8. కిటి-ఆదివరాహము, 9. ఆక్షేపించుట-నిందించుట,

క. 'కంటిమి నరకుడు వడఁగా [1]మంటిమి నేఁ' డనుచు వెస నమర్త్యులు మునులున్
మింటం బువ్వులు గురియుచుఁ బంటింపక పొగడి రోలిఁ బద్మదళాక్షున్. 200

వ. అంత భూదేవి వాసుదేవుని దగ్గఱ నేతెంచి జాంబూనదరత్నమండితంబైన కుండలంబులును వైజయంతి యను వనమాలయును వరుణదత్తంబైన సితచ్ఛత్రంబు నొక్క మహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తితాత్పర్యంబుల తోడం దేవదేవుని నిట్లని వినుతించె. 201

## —: భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట :—

సీ. 'అంభోజనాభున కంభోజనేత్రున కంభోజమాలాసమన్వితునకు
నంభోజపదున కనంతశక్తికి వాసుదేవునకును దేవదేవునకును
భక్తులు గోరినభంగి నేరూపైనఁ బొందువానికి నాది పురుషునకును
నఖిల [2]నిదానమై యాపూర్ణవిజ్ఞానుఁ డైనవానికిఁ బరమాత్మునకును
ఆ. ధాతఁ గన్న మేటితండ్రికి [3]నజునికి నీకు వందనంబు నే నొనర్తు
నిఖిలభూతరూప! నిరుపమ! యీశ! పరాపరాత్మ! మహిత! యమిత చరిత 202

వ. దేవా! నీవు లోకంబుల సృజియించుటకు రజోగుణంబును, రక్షించుటకు సత్త్వగుణంబును సంహరించుటకుఁ దమోగుణంబును ధరియింతువు; కాలమూర్తివి. ప్రధానపూరుషుండవు పరుండవు నీవ! నేనును [4]వారియు, ననిలుండు నాకాశంబుఁ, దన్మాత్రలు. నింద్రియంబులును, దేవతలును, మనంబును, గర్తయును, మహత్తత్త్వంబును, జరాచరంబైన విశ్వంబు నద్వితీయుండవైన నీయందు సంభవింతుము. 203

చ. దయ నిటు సూడుమా! నరకదైత్యునిబిడ్డఁడు వీఁడు నీదెసన్
భయమున నున్నవాఁడు గడు బాలుఁ డనన్యశరణ్యుఁ డార్తుఁ డా
శ్రయరహితుండు దండ్రిక్రియ శౌర్యము నేరఁడు నీపదాంబుజ
ద్వయిఁ బొడగాంచె భక్తపరతంత్రసువీక్షణ! దీనరక్షణా!' 264

వ. అని యిట్లు భూదేవి భక్తితోడ హరికిం బ్రణమిల్లి వాక్కుసుమంబులం బూజించిన నర్చితుండై భక్తవత్సలుండయిన పరమేశ్వరుండు నరక పుత్రుండయిన భగదత్తున కభయం బిచ్చి సర్వసంపద లొసంగి నరకాసురగృహంబు ప్రవేశించి యందు. 205

## { శ్రీకృష్ణుఁడు పదాఱువేలకన్నియల వరించి దేవలోకమునకుఁ బోయి పారిజాతముఁ దెచ్చుట }

ఉ. రాజకులావతంసుఁడు పరాజితకంసుడు సొచ్చి కాంచె [5]ఘో
రాజుల రాజులం బటుశరాహతి నొంచి ధరాతనూజుఁడు

1. మంటిమి-బ్రతికితిమి, 2. నిదానము - మూలకారణము, 3. అజుఁడు-పుట్టుకలేనివాఁడు, 4. వారి-నీరు, 5. ఘోరాజులు-భయంకరయుద్ధములు.

త్రేజితశక్తిఁ దొల్లి చెఱదెచ్చినవారిఁ బదాఱువేలధా
త్రీజనమాన్యలన్ గుణవతీవ్రతధన్యల రాజకన్యలన్. 206

మ. కని రా రాజకుమారికన్ పరిమళత్కౌతూహలాక్రాంతలై
దనుజాధీశచమూవిదారు, నతమందారున్, శుభాకారు, నూ
తనశృంగారు, వికారదూరు, సుగుణోదారున్, మృగీలోచనా
జనచేతోధనచోరు, రత్నమకుటస్ఫారున్, మనోహారునిన్. 207

వ. కని యతనిసౌందర్యగాంభీర్యచాతుర్యాదిగుణంబులకు మోహించి, తమకంబులు జనియింప,
ధైర్యంబులు సాలించి, సిగ్గులు వర్జించి, పంచశరసంచలిత హృదయలై, దైవయోగం
బునం బరాయత్తంబులైనచిత్తంబుల నమ్మత్తకాశినులు దత్తఱంబున మనోజుం [1]డుత్తల
పెట్ట నతండు దమకుఁ బ్రాణవల్లభుఁ డని వరియించి. 208

ఉ. 'పాపపురక్కసుండు సెఱపట్టె నటంచుఁ దలంతుఁ మెప్పడుం
బాపుఁడె? వానిధర్మువునఁ బద్మదళాక్షునిఁ గంటి మమ్మ! ము
న్నీ పురుషోత్తముం గదియ నేమి వ్రతంబులు సేసినారమో?
యా పరమేష్ఠి పుణ్యుఁడు గదమ్మ! హరిన్ మిముఁ గూర్చె నిచ్చటన్. 209

క. ఉన్నతి నీతఁడు గౌఁగిట మన్నింపఁగ నింక బ్రదుకు మానిని మనలో
ము న్నేమినోము నోఁచెనొ సన్నుతమార్గముల [2]విపినజలదుర్గములన్. 210

క. విన్నారమె యీచెలువముఁ? గన్నారమె యిట్టి శౌర్యగాంభీర్యంబుల్?
మన్నార మింతకాలముఁ గొన్నారమె యెన్నఁ డయినఁ గూరిమి చిక్కన్? 211

సీ. వనజాక్షి! నేఁ గన్క [3]వైజయంతికనైనఁ గదిసి వ్రేలుదు గదా కంఠమందు
బింబోష్ఠి! నేఁ గన్క బీతాంబరమనైన మెఱసి యుండుదుగదా యురమునందు!
గన్నియ! నేఁ గన్క గౌస్తుభమణినైన నొప్పుసూపుదు గదా మేను నిండఁ
బాలిక! నేఁ గన్కఁ బాంచజన్యమనైన మొనసి [4]చొక్కుదుఁ గదా మోవిఁ గ్రోలి!
ఆ. పద్మగంధి! నేను బర్హిదామమనైన జిత్రరుచుల నుందు శిరమునందు
ననుచుఁ బెక్కుగతుల నాడిరి కన్యలు గములు గట్టి గరుడగమనుఁ జూచి. 212

శా. భూనాథోత్తమకన్యకల్ వరుస 'నంభోజాతనేత్రుండు న
న్నే నవ్వెం, దగఁ జూచె, దగ్గఱియె. వర్ణించెన్, వివేకించె, స
మ్మానించెం, గరుణించెఁ, జే రడిగె, సన్మార్గంబుతోఁ బెండ్లి యౌ,
నేనే చక్రికి దేవినంచుఁ దమలో [5]నిర్ణీతలై రందఱున్. 213

1. ఉత్తలపెట్ట-తొందరపెట్టగా 2. విపినము-అడవి, 3. వైజయంతిక-విష్ణువు ధరించుపూమాలిక. 4. చొక్కుదును-పరవశమగుదును, 5. నిర్ణీతలు-నిశ్చయింపబడినవారు.

వ. ఇట్లు బహువిధంబులం దమతమ మన్ననలకు నువ్విళ్ళూరు కన్నియలం బదారువేల ధవళాంబరాభరణమాల్యానులేపనంబు లొసంగి [1]యందలంబుల నిడి వారలను నరకాసురభాండాగారంబునం గల నానావిధంబులయిన మహాధనంబులను, రథంబులను, దురంగంబులను, ధవళంబులై వేగవంతంబులై యైరావత [2]కులసంభవంబులైన [3]చతుర్దంతదంతావళంబులను, ద్వారకానగరంబునకుం బనిచి, దేవేంద్రునిపురంబునకుం జని, యదితిదేవిమందిరంబు సొచ్చి యా పెద్దమ్మకు మ్రొక్కి మణికిరణపటలపరిభావితభానుమండలంబులైన కుండలంబు లొసంగి శచీసమేతుండైన మహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై పిదప సత్యభామ కోరిన నందనవనంబు సొచ్చి, 214

మ. హరి కేలం బెకలించి తెచ్చి [4]భుజగేంద్రారాతిపైఁ బెట్టె సుం
దరగంధానుగతభ్రమద్భ్రమరనాదవ్రాతముం, బల్లవాం
కుర శాఖాఫలపర్ణపుష్పకలికాగుచ్ఛాదికోపేతమున్,
[5]గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచ [6]కాఖ్యాతమున్. 215

వ. ఇట్లు పారిజాతంబును హరించి యదువల్లభుండు వల్లభయుం దానును విహగవల్లభారూఢుం డయి చనుచున్న సమయంబున. 216

సీ. నరకాసురునిబాధ నలఁగి గోవిందునికడ కేఁగి తత్పాదకమలములకుఁ
దన కిరీటము సోఁక దండప్రమాణముల్ గావింప నా చక్రి కరుణ సేసి
చనుదెంచి భూసుతుఁ సమయించి తనవారిఁ దన్ను రక్షించుటఁ దలఁపఁ మఱచి,
యింద్రుండు బృందారకేంద్రత్వమదమునఁ 'బద్మలోచన; పోకు పారిజాత
ఆ. తరువు విడువు' మనుచు దాఁకె నడ్డమువచ్చి తఱిమి సురలు నట్ల దాఁకి రకట!
యెఱుకవలదె నిర్జరేంద్రత గాల్పనే? సురల [7]తామసమును జూడ నరిది. 217

వ. ఇట్లు దనకు [8]నొడ్డారించి యడ్డంబు వచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి. తన పురంబునకు జని నిరంతరసురభికుసుమమకరందమాధురీవిశేషంబులకుఁ జొక్కి చిక్కక నాకలోకంబున నుండి వెంట నరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మి దలంచుచున్న పారిజాతమ్ము నాశ్రితపారిజాతుండయిన హరి మహాప్రేమాభిరామయగు సత్యభామతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి, నరకాసురునియింటం దెచ్చిన రాజకన్యక లెంద ఱందఱకు నన్నినివాసంబులు కల్పించి గృహోపకరణంబులు సమర్పించి. 218

చ. అమితవిహారుఁ డీశ్వరుఁ డనంతుఁడు దా నొకనాఁడు మంచి ల
గ్నమునఁ బదాఱువేల భవనంబులలోనిఁ బదాఱువేల రూ

1. అందలంబులు-పల్లకీలు, 2. కులసంభవంబులు—వంశమునబుట్టినవి, 3. చతుర్దంతదంతావళంబులు - నాల్గుదంతములయేనుఁగులు, 4. భుజగేంద్రారాతి-గరుడుఁడు, 5. గిరిభిత్త్రాతము-ఇంద్రరక్షితము, 6. ఆఖ్యాతము-మిక్కిలిప్రసిద్ధము. 7. తామసము-అహంకారము, 8. ఒడ్డారించి-ఎదిరించి.

పములఁ బదాఱువేల నృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేల చం
దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె భూవరా! 219

ఉ. దానములందు సమ్మదవిధానములం దవలోకభాషణా
హ్వానములందుఁ నొక్కక్రియ నా లలితాంగుల కన్నిమూర్తులై
తా ననిశంబుఁ గానఁబడి తక్కువ యెక్కువ లేక యుత్తమ
జ్ఞానగృహస్థధర్మమునఁ జక్రి రమించెఁ బ్రపూర్ణకాముఁడై. 220

క. తరుణులు బెక్కండ్రయినను బురుషుఁడు మన లేఁడు సవతిపోరాటమునన్
హరి దాఁ బదాఱువేవురు తరుణులతో సమత మనియె [1]దక్షత్వమునన్ 221

శా. ఎన్నే భంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షించుచున్
ము న్నే దేవునిఁ జూడఁగానక తుదిన్ మోహింతు రా మేటి కే
విన్నాణంబుననో సతుల్ గృహిణులై విఖ్యాతి సేవించి ర
చ్ఛిన్నాలోకనహాసభాషణరతిశ్లేషానురాగంబులన్, 222

సీ. ఇంటికి వచ్చిన నెదురేఁగుదెంచుచు [2]నానీతవస్తువు లందుకొనుచు
సౌవర్ణమణిమయాసనములు వెట్టుచుఁ బదములు గడుగుచుఁ సక్తితోన
సంవాసితస్నానజలము లందిచ్చుచు సద్గంధవస్త్రభూషణము లొసఁగి
యిష్టపదార్థంబు లిడుచుఁ దాంబూలాదు లొసఁగుచు, విసరుచు నోజ మెఱసి.
తే. శిరము దువ్వుచు శయ్యపైఁ జెలువు మిగులనడుగు లొత్తుచు దాసీసహస్రయుక్త
లయ్యుఁ గొలిచిరి దాసులై హరి నుదారుఁ దారకాధిపవసనలు దారు దగిలి, 223

శా. 'నన్నే పాయఁడు; రాత్రులన్ దినములన్ నన్నే కృపం జెందెడిన్;
నన్నే [3]దొడ్డుగఁ జూచు [4]వల్లభలలో నాథుఁడు నాయింటనే
యున్నా' డంచుఁ బదాఱువేలు దమలో నూహించి సేవించి రా
యన్నుల్ గాఢపతివ్రతాత్వపరిచర్యాభక్తియోగంబునన్. 224

క. ఆ రామలతో నెప్పుడుఁ [5]బోరాములు సాల నెఱపి పురుషోత్తముఁడున్
గారామునఁ దిరిగెను సౌధారామలతాసరోవిహారముల నృపా! 225

క. ఏ దేవుఁడు జగముల నుత్పాదించును మనుచుఁ, జెఱుచుఁ బ్రాభవమున మ
ర్యాదారక్షణమునకై యా దేవుం డట్లు మెఱసె యాదవులందున్. 226

---

1. దక్షత్వము-సామర్థ్యము 2. అనీతము-తేఁబడినది, 3. దొడ్డుగా-గొప్పగా, 4. వల్లభలు-ప్రియలు; భార్యలు, 5. పోరాములు-స్నేహములు.

—:శ్రీకృష్ణుండు కేళిగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట:—

వ. అంత నొక్కనాఁడు రుక్మిణీదేవి లోఁగిట మహేంద్రనీలమరకతాదిమణిస్తంభవలభివిటంక పటలదేహళీకవాట విరాజమానంబును, శాతకుంభకుడ్యగవాక్షవేదికాసోపానంబును, విలంబమాన ముక్తాఫలదామ విచిత్రకౌశేయవితానంబును, వివిధమణిదీపికావిసరవిభ్రాజమానంబును, మధుకరకులకలితమల్లికాకుసుమమాలికాభిరామంబును, జాలకరంధ్రవినిర్గతకర్పూరాగరుధూపధూమంబును, [1]వాతాయనవిప్రకీర్ణశిశిరకిరణస్తోమంబును, పారిజాతవనామోదపరిమిళిత పవనసుందరంబునయిన లోపలిమందిరంబున శరచ్చంద్రచంద్రికాధవళపర్యంక మధ్యంబున జగదీశ్వరుండయిన హరి సుఖాసీనుండై యుండ సఖీజనంబులుం దాను దగ్గఱి కొలిచి యుండి. 227

సీ. కుచకుంభములమీఁది కుంకుమతోరాయు హారంబు లరుణంబు లగుచు మెఱయఁ
గరపల్లవము సాఁచి కదలింప నంగుళీయకకంకణప్రభ లావరింపఁ
గదలిన బహురత్న కలితనూపురముల గంభీరనినదంబు గడలుకొనఁగ
గాంచనమణికర్ణికామయూఖంబులు గండపాలికలపై గంతు లిడఁగ
తే. గురులు నర్తింపఁ బయ్యెద కొంగు దూఁగ [2]బోటిచే నున్న చామర పుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి సేర నరిగి వేడ్క లిగురొత్త మెల్లన వీవఁ దొడఁగె. 228

వ. అప్పుడు. 229

మ. పతి యేరూపము దాల్చినం [3]దదనురూపంబైన రూపంబుతో
సతి దా నుండెడునట్టి రూపవతి నా చంద్రాస్య నా లక్ష్మి నా
సుతనున్ రుక్మిణి నా యనన్యమతి నా శుద్ధాంతరంగం గళా
చతురత్వంబున శౌరి యి ట్లనియెఁ జంచన్మందహాసంబుతోన్. 230

మ. బల శౌర్యంబుల భోగమూర్తి కులరూపత్యాగసంపద్గుణం
బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ పూర్ణుల్ ఘనుల్; వారికిన్
నెలఁతా! తల్లియుఁ దండ్రియున్ [4]సహజుఁడున్ నిన్నిచ్చినం బోక యీ
[5]బలవద్భీరుల [6]వార్ధిలీనుల మముం బాటింప నీ కేటికిన్? 231

సీ. లోకులనడవడిలోనివారము గాము; పరులకు మాజాడ బయలు పడదు;
బలమదోపేతులు పగగొండ్రు మాతోడ; రాజపీఠములకు రాము తఱచు;
శరణంబు మాకు నీ జలరాశి సతతంబు; [7]నిష్కించనుల మేము; నిధులు లేవు;
కలవారు చుట్టాలు గారు; నిష్కించనజనబంధులము ముక్తసంగ్రహులము;

---

1. వాతాయనము-గవాక్షము, 2. బోటి-చెలికత్తె, 3. తదనురూపంబు-దానికి తగినట్టిది, 4. సహజుఁడు-సోదరుఁడు, 5. బలవద్భీరులు-బలవంతులవలన భయపడువారు, 6. వార్ధిలీనులు-సముద్రమునఅణఁగియుండువారు, 7. నిష్కించనులము-దరిద్రులము.

ఆ. గూఢవర్తనులము; గుణహీనులము; భిక్షులైనవారిఁ గాని నాశ్రయింప
మిందుముఖులు దగుల; రిటివంటి మముబోఁటి వారి నేల దగుల వారిజాక్షి! 232

క. సిరియును వంశము రూపును సరియైన వివాహసఖ్య సంబంధంబుల్
జరగును; సరి గాకున్నను జరగవు; లోలాక్షి! యెట్టి సంసారులకున్. 233

క. తగ దని యెఱుఁగవు మమ్ముం దగిలితివి మృగాక్షి! దీనఁ ద ప్పగు? నీకుం
దగిన మనుజేంద్రు నొక్కనిఁ దగులుము; గుణహీనజనులఁ దగునే' తగులన్? 234

సీ. సాల్వజరాసంధచైద్యాది రాజులు చెలఁగి నన్ వీక్షించి [1]మలయుచుండ
నది గాక రుక్మి నీయన్నయు గర్వించి వీర్యమదాంధుఁడై వెలయుచున్న
వారి గర్వంబులు వారింపఁగాఁ గోరి చెలువ ని న్నొడిచి తెచ్చితిమి; గాని
[2]కాంతాతనూజార్థకాముకులము గాము; కామమోహాదులఁ గ్రందుకొనము
తే. విను; ముదాసీనులము; క్రియావిరహితులము; పూర్ణులము మేము: నిత్యాత్మబుద్ధితోడ
వెలుఁగుచుందుము గృహదీపవిధము మెఱసి; నవలతాతన్వి! మాతోడ నవయవలదు. 235

వ. అని యిట్లు భగవంతుడైన హరి దన్నుఁ బాయక సేవించుటం బ్రియురాలను పట్టంపుదేవి
ననియెడి రుక్మిణి దర్పంబు నేర్పున నుపసంహరించి యూర కుండిన నమ్మానవతి యప్రి
యంబులు [3]నపూర్వంబులునైన మనోవల్లభు మాటలు విని దురంతంబైన చింతాభరం
బున సంతాపంబు నొందుచు. 236

సీ. కాటుక నెఱయంగఁ గన్నీరు వరదలై కుచకుంభయుగళకుంకుమము దడియ
విడువక వెడలెడు వేఁడినిట్టూర్పుల లాలితాధరకిసలయము గందఁ
జెలువంబు నెఱిదప్పి చిన్న వోవుచు నున్న వదనారవిందంబు వాడు దోఁప
మారుతాహతిఁ దూలు మహిత కల్పకవల్లివడువున మేన్ వడవడ వడంకఁ
తే. జిత్త మెఱియంగఁ జెక్కిటఁ జెయ్యి సేర్చి కౌతుకం [4]బేది పదతలాగ్రమున నేల
వ్రాసి పెంపుచు మో మరవాంచి వగలఁ బొందె [5]మవ్వంబు గందిన పువ్వుఁబోలె. 237

చ. అలికులవేణి తన్నుఁ బ్రియుఁ డాడిన యప్రియభాష లిమ్మెయిన్
సొలవక కర్ణరంధ్రముల సూదులు చొన్పినరీతి గాఁగ బె
ట్టులి రొద విన్న లేడి క్రియఁ బొల్పఱి చేష్టలు దక్కి నేలపై
వలసటి వ్రాలెఁ గీ లెడలి వ్రాలిన [6]పుత్తడిబొమ్మకై వడిన్. 238

వ. ఇట్లు వ్రాలిన. 239

---

1. మలయుచుండ-ఉద్రేకించుచుండఁగా, 2. ఇక్కడినుండియు వెలిగందల నారయ కవిత్వమని వ్రాఁతప్రతులలోనున్నదఁట! 3 అపూర్వంబులు-ఇదివఱకు లేనివి, 4. ఏది-నసించి, 5. మవ్వంబు-సౌకుమార్యము, 6. పుత్తడిబొమ్మ-బంగారుబొమ్మ.

మ. ప్రణతామ్నాయుఁడు కృష్ణుఁడంతఁ గదిసెన్ బాష్పావరుద్ధారుణే
క్షణ విస్రస్తవినూత్నభూషణ దురుక్తక్రూర [1]నారాచశో
షణ నాలింగితధారుణిన్ నిజకులాచారైక సద్ధర్మ చా
రిణి విశ్లేషిణిఁ వీతతోషణి [2]బురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్. 240

సీ. కని సంభ్రమంబునఁ దనువునం [3]దనువుగా ననువునఁ జందనం బల్ల నలఁది
కన్నీరు పన్నీటఁ గడిగిఁ కర్పూరంపుఁ బలుకులు సెవులలోఁ బాఱ నూఁది
కరమొప్ప ముత్యాలసరులచిక్కెడలించి యురమునఁ బొందుగా నిరువుకొలిపి
తిలకంబు నునుఫాలఫలకంబుపైఁ దీర్చి వదలినభూషణావలులు దొడిగి
తే. కమలదళచారు [4]తాలవృంతముల విసరి పొలుచు పయ్యెదఁ గుచములఁ బొందుపఱచి
చిత్త మిగురొత్త నొయ్యన సేదఁదేర్చి బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నిమిరి. 241

తే. [5]నెరులు గలమరునీలంపుటురులసిరుల నరులుగొనఁ జాలి నరులమ మరులు గొలిపి
యిరులు గెలిచిన తుమ్మెద గఱులఁ దెగడు కురుల నులిదీర్చి విరు లిడి గొప్పవెట్టి 242

క. మురసంహరుఁ [6]డిందిందిర గరుదనిలచలత్ప్రసూనకలికాంచితసుం
దరశయ్యఁ జేర్చె భీష్మక వరపుత్రిన్ నుతచరిత్ర వారిజనేత్రన్. 243

వ. ఇట్లు పానుపునం జేర్చి మృదుమధురభాషణంబుల ననునయించిన. 244

-: రుక్మిణీదేవి శ్రీకృష్ణలాలితయై యతని స్తుతించుట :-

క. పురుషోత్తమముఖకోమల సరసిజ మయ్యిందువదన సవ్రీడాహా
సరుచిస్నిగ్ధాపాంగ స్ఫురదవలోకనము లొలయఁ జూచి ట్లనియెన్. 245

క. మురహర! దివసాగమ [7]దళదరవిందదళాక్ష! తలఁప నది యట్టిద లే;
నిరవధికవిమలతేజో వరమూర్తివి; భక్తలోకవత్సల! యెందున్. 246

తే. [8]సంచితజ్ఞానసుఖబలైశ్వర్యశక్తు లాదిగాఁ గల సుగుణంబు లమరు నీకు;
నేను దగుదునె? సర్వలోకేశ్వరేశ! లీలమై సచ్చిదానందశాలి; వనఘ! 247

సీ. రూఢిమైఁ బ్రకృతిపూరుషకాలములకు నీశ్వరుఁడవై భవదీయచారుదివ్య
లలితకళాకౌశలమున నభిరతుఁడై కడఁగు నీరూప మెక్కడ? మహాత్మ!

1. నారాచములు-బాణములు, 2. పురంధ్రీగ్రామణి-ఉత్తమయువతి. 3. అనువుగా-బాగుగా, 4. తాలవృంతములు-వీవనలు, 5. నెరులు-వంకరలు, 6. ఇందిందిరములు-తుమ్మెదలు, 7. దళదరవింద-వికసించుచున్న తామరపూవు, 8. సంచితము-ఇది వఱలో కూడఁబెట్టఁబడినది.

సత్త్వాదిగుణసముచ్చయయుక్త మూర్ధాత్మ నయిన నే నెక్కడ? ననఘచరిత!
కోరి నీ మంగళగుణభూతి దానంబు సేయంగఁబడు నని చెందు భీతి

తే. నంబునిధిమధ్యభాగమం దమృతఫేన పటలపాండురనిభమూర్తి! పన్నగేంద్ర
భోగశయ్యను బవ్వళింపుచును దనరు నట్టి యున్నతలీల దివ్యంబు దలఁప. 248

వ. శబ్దస్పర్శరూపరసగంధంబు లనియెడు గుణంబులచేతఁ బరిగ్రహింపఁబడిన మంగళసుందర విగ్రహుండవై యజ్ఞానాంధకార నివారకం బైన రూపంబుఁ గైకొని భవదీయులైన సేవకులకు ననుభావ్యుండవైతి; భవత్పాదారవింద మకరందరసాస్వాద లోలాత్ములైన యోగీంద్రులకైనను భవన్మార్గంబు స్ఫుటంబు గా; ద ట్లగుటంజేసి యీ మనుజ పశువులకు [1]దుర్విభావ్యం బగుట యేమి సెప్ప? నిట్టి యీశ్వరుండవైన నీకు నిచ్ఛ స్వతంత్రంబు గావున నదియును నా కధికంబు గావున నిన్ను నే ననుసరింతు; దేవా! నీ [2]వకించనుడవైతేని [3]బలిభోక్తలయిన బ్రహ్మేంద్రాదు లెవ్వనికొఱకు బలిసమర్పణంబు సేసిరి? నీవు సమస్తపురుషార్థమయుండవనియును ఫలస్వరూపి వనియును నీయందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞాన దీపాంకురంబున నిరస్తసమస్త దోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి సుమతులు భవదీయదాన సంగంబు గోరుచుండుదు; రట్లు సేయ నేరక నిజాధికారాంధకారమగ్నులైన వారు భవత్తత్త్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసార చక్రంబునం బరిభ్రమింతు రదియునుం గాక. 249

ఆ. వరమునీంద్రయోగివరసురకోటిచే వర్ణితప్రభావవై భవంబు
గలిగి యఖిలచేతనులకు విజ్ఞాన ప్రదుండ వగుదు వభవ! దురితదూర! 250

వ దేవా? భవదీయకుటిలభ్రూవిక్షేపోదీరిత కాలవేగంబుచేత విధ్వస్త మంగళులగు కమలభవ భవపాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయచిత్తంబున. 251

చ. నిను వరియించినం బెలుచ నీరజలోచన! శార్ఙ్గసాయకా
సననినదంబులన్ సకలశత్రుధరాపతులన్ జయించి బో
రనఁ బశుకోటిఁ దోలు మృగరాజు నిజాంశము భూరిశక్తిఁ గై
కొనిన విధంబునన్ నను నకుంఠితహూరతఁ దెచ్చి తీశ్వరా! 252

ఉ. అట్టి నృపాల [4]కీటములు నాజి నెదుర్పఁగ లేనివానియ
ట్లొట్టినభీతిమై నిటు పయోధిశరణ్యుఁడ వైతి వింతయున్
నెట్టన మాయ గాక యివి నిక్కములే? భవదీయభక్తులై
నట్టి నరేంద్రమౌళిమణు లంచిత రాజ్యబుభుషల్ ముదంబునన్. 253

---

1. దుర్విభావ్యంబు-ఊహింపరానిది, 2. అకించనుండు-దరిద్రుఁడు, 3. బలి-పూజాద్రవ్యము, 4. కీటములు-పురుగులు.

ఆ. వితతరాజ్యగరిమ విడిచి కాననముల నాత్మలందు మీ పదాబ్జయుగము
[1]వలఁతి గాఁగ నిలిపి వాతాంబుపర్ణాశ నోగ్రనియతు లగుచు నుందు రభవ! 254

మ. విమలజ్ఞాననిరూఢులైన జనముల్ వీక్షింప మీపాదకం
జమరందస్ఫుటదివ్యసౌరభము నాస్వాదించి [2]నిర్వాణరూ
పము సత్పూరుషవాగుదీరితము శోభాశ్రీనివాసంబునౌ
మిము సేవింపక మానవాధముని దుర్మేధాత్ము సేవింతురే? 255

వ. మఱియును దేవా! భూలోకమునందును నిత్యనివాసంబునందును సకల ప్రదేశంబులందును జగదీశ్వరుండవయిన నిన్ను నభిమతంబు లయిన కామరూపంబులు గైకొని వరియింతు; భవదీయచరణారవిందమకరందాస్వాదనచాతుర్య ధుర్యభృంగియైన కామినియతిహేయంబైన త్వక్శ్మశ్రురోమనఖకేశంబుల చేతఁ గప్పంబడి యంతర్గతంబయిన మాంసాస్థిరక్తక్రిమివిట్కఫపిత్తవాతంబు గల జీవచ్ఛవంబయిన నరాధముని మూఢాత్మయై కామించునే? యదియునుం గాక. 256

సీ. [3]నీరదాగమమేఘనిర్యత్పయఃపానచాతకం బేఁగునే చౌటి [4]పడెకుఁ
బరిపక్వ [5]మాకందఫలరసంబులు గ్రోలు కీరంబు సనునె [6]దుత్తూరములకు
ఘనరవాకర్ణనోత్కలికమయూరము గోరునే కఠిన [7]ఝిల్లీరవంబుఁ
గరికుంభపిశితసద్గ్రాసమోదితసింహ మరుగునే శునకమాంసాభిలాషఁ
తే. బ్రవిమలాకార! భవదీయపాదపద్మ యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁగ? భక్తమందార! దుర్భవభవవిదూర! 157

క. వాసవవందిత! భవకమలాసనదివ్యప్రభాసభానలి కెపుడున్
నీ సమధికచారిత్రకథాసురుచిరగాన మవితథం బయి చెల్లున్. 258

క. ధరణీనాథులు దమతమ వరవనితామందిరముల వసియించుచు గో
ఖరమార్జాలంబులగతి స్థిరబద్ధు లగుదురు నిన్నుఁ దెలియనికతనన్. 259

ఆ. జలజనాభ! సకలజగదంతరాత్మవై నట్టి దేవ! నీ పదారవింద
యుగళి సానురాగయుక్తమై నా మదిఁ గలుగునట్లుగాఁగఁ దలఁపు మనఘ' 260

ఆ. పృథురజోగుణప్రవృద్ధ మైనట్టి నీ దృష్టిచేత నన్నుఁ దేరకొనఁగఁ
జూచు టెల్ల బద్మలోచన! నామీఁద ఘనదయార్ద్రదృష్టిగాఁ దలంతు 261

---

1. వలఁతి-గొప్పది, 2. నిర్వాణము-మోక్షము, 3. నీరదాగమము-వర్ష కాలము, 4. పడె-పడియ; గుంట, 5. మాకందము-మామిడి, 6 దుత్తూరము-ఉమ్మెత్త 7.ఝిల్లి-ఈలపురుగు.

వ. అదియునుంగాక, మధుసూదనా! నీవాక్యంబులు మిథ్యలు గావు; తల్లి వచనంబు కూఁతున కభిమతంబు గాదె? యౌవనారూఢమదంబున స్వైరిణియగు కామిని పురుషాంతరాసక్త యగుట విచారించి పరిజ్ఞాని యైనవాఁడు విడుచు; నవివేకియయిన పురుషుం డింద్రియ లోలుండై రతిం దగిలి దాని విడువనేరక పరిగ్రహించి యుభయలోకచ్యుతుండగు; నట్లు గావున. నీయెఱుంగని యర్థంబుగలదే? యని విన్నవించిన రుక్మిణీదేవివచనంబులకుఁ గృష్ణుండు సంతసిల్లి యిట్లనియె. 262

## —: కృష్ణుండు రుక్మిణీదేవి నూఱడించుట :—

చ. "అలికులవేణి! నవ్వులకు నాడిమాటల కింత నీమదిం
గలఁగఁగనేల? వేఁటలను గయ్యములన్ రతులందు నొవ్వఁగా
బలికినమాట లెగ్గు లని పట్టుదురే? భవదీయచిత్తముం
దెలియఁగోరి యేఁ బలికితిన్ మదిలో నిటు [1]గుంద నేటికిన్? 263

వ. అదియునుంగాక. 264

ఉ. [2]కింకలు ముద్దుఁబల్కులును గెంపుఁగనుంగవ తియ్యమోవియున్
[3]జంకెలు తేఁటిచూపు లెకసక్కెములున్ నెలవంకబొమ్మలుం
గొంకక వీడనాడుటలుఁ గూరిమియుం గల కాంతఁ గూడుటల్
[4]అంకిలిలేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా!" 265

వ. అని మఱియు నిట్లనియె. 266

ఉ. 'నీవు పతివ్రతామణివి నిర్మలధర్మవివేకశీలస
ద్భావవు నీ మనోగతులఁ బాయక యెప్పుడు నస్మదీయసం
సేవయ కాని యన్యము భజింపవు పుట్టిననాఁటనుండి నీ
భావ మెఱింగి యుండియును బల్కిన తప్పు సహింపు మానినీ!' 267

వ. అని వెండియు నిట్లనియె; "నీ వాక్యంబులు శ్రవణసుఖంబులు గావించె: నీవు వివిధంబులైన కామంబులు గోరితివేని, నవి యన్నియు నాయంద యుండుటం జేసి యేకాంతసేవా చతురవైన నీకు నవి యన్నియు నిత్యంబులై యుండు; నీ పాతివ్రత్యంబును నాయందలి స్నేహంబు నతివిశదంబు లయ్యె; నావాక్యంబులచేత భవదీయచిత్తంబు చంచలంబుగాక. నాయందులబుద్ధి దృఢం బగుంగావున సకలసంపద్విలసితంబైన ద్వారకాదినగర దివ్యమందిరంబులందు నీదు భాగ్యంబునం జేసి సంసారికైవడి నీయందు బద్ధానురాగుండనై వర్తింతు; దక్కిన ఘ్రాణేంద్రియపరవశత్వంబున వికృతశరీరధారిణియైన సతి నన్నుం జెందుట

2. కుంద నేటికిన్-విచారింపనేల? 2. కింకలు-కోపములు, 3. జంకెలు-బెదరింపులు
4. అంకిలి-ఆటంకము

దుష్కరం; బదియునుం గాక మోక్షప్రదుండనైన నన్నుఁ గామాతురలైన [1]యల్పమతులు వ్రతతపోమహిమలచేత దాంపత్య యోగంబుకై సేవింతు, రదియెంతయు నామాయా విజృంభితంబు; దానంజేసి వారు మందభాగ్యలై [2]నిరయంబు నొందుదు; రట్లు గావున నీ సమానయైన కాంత యేకాంతలందైనఁ గలదె? నీవివాహకాలంబున ననేక రాజన్యవరులఁ గైకొనక భవదీయ మధురాలాపశ్రవణాత్మకుండ నయిన నాసన్నిధికి 'నాశరీరం బితర యోగ్యంబు గాదు; నీకు [3]శేషంబ నయి యున్నదాన' నని యేకాంతంబునన్ బ్రాహ్మణుం బుత్తెంచిన నేనును జనుదెంచి నీ పరిణయవిషయంబున భవత్సహోదరుం బట్టి విరూపుం గావించిన నది గనుంగొనియును నాయందుల [4]విప్రయోగంబున నూరకుండితి; వది గావున బహుప్రకారంబులై వర్తించు నీ సద్గుణంబులకు సంతసింతు' నని యివ్విధంబున దేవకీసుతుండు నరలోక [5]విడంబనంబుగ గృహస్థునిభంగి నిజగృహకృత్యంబు లాచరించు చుండెనని శుకుండు మఱియు నిట్లనియె. 268

శ. అని యిట్లు కృష్ణుఁ డాడిన వినయవివేకానులాపవితతామృతసే
చనముదితహృదయయై యవ్వనితామణి వికచవదనవనరుహ యగుచున్. 269

క. నగ [6]వామతించు చూపులు నగధరుమొగమునను నిలిపి నయమునఁ గరముల్
మొగిచి వినుతించె గృష్ణున్ ఖగవాహున్ రుచిరదేహుఁ గలితోత్సాహున్. 270

చ. అతులవిరాజమానముఖుఁడై వివిధాంబరచారుభూషణ
ప్రతతులతోడఁ గోరినవరంబులు దద్దయు నిచ్చెఁ గృష్ణుఁ డు
న్నతశుభమూర్తి దేవగణనందితకీర్తి దయానువర్తియై.
యతిమృదువాణికిం గిసలయారుణపాణికి నీలవేణికిన్. 271

వ. ఇట్లు సమ్మానించి కృష్ణుండు రుక్మిణియుం దానును దదనంతరంబ. 272

చ. ఎలమి ఘటింపఁగాఁ గలసి యీడెలనీడల మల్లికాలతా
వలిఁ గరవీరజాతి విరవాదులవీథులఁ గమ్మదెమ్మరల్
వొలయు నవీనవాసములఁ బొన్నెలఁ దిన్నెలఁ బచ్చరచ్చలం
గొలఁకుల లేఁగెలంకులను గోరిక లీరక లొత్తఁ గ్రొత్తలై. 273

క. ఆరామభూములందు విహారామలసౌఖ్యలీల నతిమోదముతో
నా [7]రామానుజుఁ డుండెను నారామామణియుఁ దాను నభిరామముగన్. 274

వ. మఱియు ననేకవిధవిచిత్రమణివితానాభిశోభితప్రాసాదోపరిభాగంబులను. లాలితనీలకంఠ కలకంఠ కలవింక శుకకలాపకలితమకరందపానమదవదిందిందిర ఝుంకారసంకుల కమల

1. అల్పమతులు-బుద్ధిహీనులు, 2. నిరయంబు-నరకము, 3. శేషఁబు-అంశము, 4. విప్రయోగంబు-ఎడఁబాటు, 5. విడంబనంబు-అనుకరించుట, 6. ఆమతించు-పుట్టు, 7. రామానుజుఁడు-శ్రీకృష్ణుఁడు.

కహ్లార సుధాసార నీహారపూరిత కాసారతీరంబులను. ధాతు [1]నిర్ఝరరంజిత ధానుదేశగిరి కుంజపుంజంబులును గృతకశైలంబులును, క్రీడాగృహంబులనుం జెలంగిఁ నందనంద నుండు విదర్భరాజనందనం దగిలి కందర్పకేళిలోలాత్ముం డయ్యె; ననంతరం బా సుందరీ లలామంబువలనఁ బ్రద్యుమ్నుఁడు చారుదేష్ణుండు సుచారువు చారుదేహుండు చారుగు ప్తుండు భద్రచారువు చారుచంద్రుడు విచారువు చారువు ననియెడు పదుగురు తనయులం బడసె; నట్లు సత్యభామాజాంబవతీ నాగ్నజితి కాళిందీమాద్రీమిత్రవిందాభద్రలకు వేఱువేఱ పదుగురేసి భద్రమూర్తులైన కుమారు లుదయించి రివ్విధంబున మఱియును. 275

చ. అనఘ! పదాఱువేల సతులందు జనించిరి వేఱువేఱ నం
దనదశకంబు తత్సుతవితానము గాంచి రనేకసూనుల
న్ననయఁగ నిట్లు పిల్లచెఱ కీనినకై వడిఁ బుత్త్రపౌత్త్రవ
ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ముదంబునం [2]దామరతంపరై భువిన్. 276

తే అట్లు యాదవవృష్ణిభోజాంధకాది నామధేయాంతరముల నెన్నంగ నూట
యొక్కటై చాల వర్ధిల్లు నక్కులంబు నృపకుమారులఁ జదివించు నేర్పు గలుఁగు. 277

తే. గురుజనంబులు విను మూఁడుకోట్లమీఁద నెనుబదెనిమిదివేలమై నెసఁగనూర్వు
రన్నఁ దద్బాలకావలి నెన్నఁదరమె శూలికైనను దామరచూలికైన? 278

వ. అందు గోవిందనందనుండైన ప్రద్యుమ్ననకు రుక్మికూతువలన ననిరుద్ధుండు సంభవించె ననిన మునివరునకు భూవరుం డిట్లనియె. 279

క. బవరమునఁ గృష్ణుచే ము న్నవమానము నొంది రుక్మి యచ్యుతు గెలువం
డివురుచుఁ దన సుత నరిసంభవునకు నెట్లిచ్చె? నెఱుఁగఁ బలుకు మునీంద్రా! 280

సీ. నావుడు శుకయోగి 'నరనాయకోత్తమ! నీవు చెప్పినయట్ల నెమ్మనమునఁ
బద్మాయతాక్షుచేఁ బడిన [3]బన్నమునకుఁ గనలుచునుండియు ననుజతోడి
నెయ్యంబునను [4]భాగినేయున కిచ్చెను గూఁతు నంచితపుష్పకోమలాంగిఁ
దనపూన్కి దప్పిన దగ విదర్భేశుఁడు విను మెఱిగింతు నవ్విధము దెలియఁ
తే. బరఁగ 'రుక్మవతీస్వయంవరమున కొగి నరుగుదెం' డని భీష్మభూవరసుతుఁడు
వరుస రప్పించె రాజన్యవరకుమారవరుల ననువర్త కలరి యా హరిసుతుఁడు. 281

చ. పరమణిభూషణప్రభలవర్గ మనర్గలభంగిఁ బర్వ ప్ర
స్ఫురితరథాధిరోహణవిభూతి దలిర్ప మనోహరై కసు

---

1. నిర్ఝరము-ప్రవాహము, 2. తామరతంపర-అభివృద్ధి, 3. బన్నము-అవమా నము, 4. భాగినేయుఁడు-మేనల్లుడు.

స్థిరశుభలీల నేఁగె యదుసింహకిశోరము రాజకన్యకా
పరిణయవైభవాగతనృపాలకకోటికి రుక్మివీటికిన్. 282

చ. చని పురిఁ జొచ్చి వృష్ణికులసత్తముఁ డచ్చట మీఁగి యున్న య
మ్మనుజవరేణ్యనందనులు [1]మానము దూలి భయాకులాత్ములై
చనఁగ ననేక చండతరసాయకసంపదఁ జూపి రుక్మిగం
దనఁ గొని వచ్చి వేడ్క నిజధామము సొచ్చె నవార్యశౌర్యుఁడై. 283

వ. ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరిణనయనం బరిణయంబయిన యనంతరంబ. 284

క. ధీరుఁడు కృతవర్మని సుకుమారుఁడు వరియించె రుచిరమండనయుత నం
భోరుహముఖి రుక్మిసుతం జారుమతీకన్యఁ బ్రకటసజ్జనమాన్యన్. 285

తే. [2]ప్రకటచరితుండు భీష్మభూపాలసుతుఁడు మనము మోదింపఁ దనకూర్మిమనుమరాలి
రుక్మలోచన నసమాన [3]రుక్మకాంతిఁ జెలిమి ననిరుద్ధునకు బెండ్లి సేయు నపుడు. 286

క. [4]పొలుపుగ రత్నవిభూషోజ్జ్వలులై శుభవేళ నవ్వివాహార్థము ని
ర్మలబహువైభవశోభన కలితవిదర్భావనీశకటకంబునకున్. 287

చ. హరియును రుక్మిణీసతియుఁ గా బలభద్రుఁడు [5]శంబరారియున్
నరిమదభేరి సాంబుఁడును నాదిగ రాజకుమారకోటి సిం
ధురరతనాజిసద్భటులతోఁ జని యందు సమగ్రవైభవా
చరిత వివాహయుక్తదివసంబులు వేడుకఁ బుచ్చి యంతటన్. 288

క. ఒకనాఁడు యదుకుమారకు లకలంకసమగ్రవైభవాటోపమహో
త్సుకులై యుండఁగఁ [6]జూపోపక యెకసక్కెమున నవనిపాలురు వరుసన్. 289

ఉ. ఎచ్చరికం గళింగధరణీశుఁడు రుక్మి మొగంబు సూచి 'నీ
[7]యొచ్చెముఁ దీర్చుకో నిదియ యొప్పగువేళ బలుండు జూద మం
దిచ్చ గలండు; గాని పొలు పెక్కిన నేర్పరి గాఁడు; గాన నీ
కిచ్చు నవశ్యమున్ జయము [8]నీఁగుము తొల్లిటఁ బద్ద [9]బన్నమున్. 290

క. అని పురికొల్పన రుక్మియుఁ దనచేటు దలంపలేక తాలాంకునితో
డను జూదమాడఁ దివిరెను వనజాసనుకృతము గడచువా రెవ్వ రిలన్? 291

---

1. మానము-గౌరవము, 2. ప్రకటము-ప్రసిద్ధము, 3. రుక్మము-బంగారము,
4. పొలుపుగా-అందముగా. 5. శంబరారి-ప్రద్యుమ్నుఁడు, 6. చూపోపక-ఓర్వలేక
7. ఒచ్చెము-అవమానము, 8. నీఁగుము-పోఁగొట్టుకొనుము, 9. బన్నము-అవమానము,,

వ. అంత. 292

క. కోరి విదర్భుఁడు కుటిలవిహారుండై పిలిచె జూద మాడ జితారిన్
హారిన్ సన్నుతసూరిన్ సీరిన్ రైవతసుతార్ద్రచిత్తవిహారిన్. 293

ఆ. 'పూని మనము గొంత ప్రొద్దువోకకు రామ; [1]నెత్త మాడ నీవు నేర్తు వనఁగ
విందు; మిపుడు గొంత వెల యొడ్డియాడుద' మనిన బలుఁడు లెస్స యని చెలంగి. 294

క. మదిలోని చలము డింపక పణి యిఱువది నూఱు వేయి పదివే లిదె ప
న్నిద మని యొడ్డుచు నాడిరి మదమున నిద్దఱును దురభిమానము పేర్మిన్. 295

ఉ. ఆడిన యాట లెల్లను హలాయుధుం దోడిన రుక్మి గెల్చుడున్
దోడినృపాలకోటి పరితోషముఁ జెందఁ గళింగభూవిభుం
'డోడె బలుం డటంచు బ్రహసోక్తుల నెంతయు రాముఁ జుల్కఁగా
నాడెను దంతపంక్తి వెలి యై కనుపట్టఁగఁ జాల నవ్వుచున్. 296

తే. బలుఁడు కోపించి యొకలక్షపణము సేసి యాడెఁ బ్రకటంబుగా జూద మపుడు గెల్చె:
గెల్చినను రుక్మి 'యిది నేను గెల్చియుండ గెలువు నీ దని కికురింప నలవి యగునె?' 297

క. అనవుడు హలధరుఁ డచ్చటి జనపాలకసుతుఁ జూచి సత్యము వలుకుం
డని యడిగిన వారలు రుక్మనిహితులై పలుకరైరి మొగమోటమునన్. 298

ఉ. అప్పటియట్ల యొడ్డి ముసలాయుధు దేపున నాడి జూదముం
జొప్పడ గెల్చి యీ గెలుపు సూడఁగ నాదియొ; వీనిదో జనుల్
దప్పక చెప్పుఁ' డన్న విదితధ్వనితో నశరీరవాణి తా
'నిప్పటియాట రాముఁడె జయించె విదర్భుఁడె యోడె నావుడున్ 299

వ. విని సకలజనంబులు నద్భుతానందనిమగ్నమానసులైరి. కుటిలస్వభావులయిన భూవరులు రుక్మిం [2]గైకొల్పిన నతండు తన తొల్లింటి పరాభవము దలంచి యెదిరిం దను నెఱుంగక బలాబలవివేకంబు సేయనేరక విధివశానుగతుండై చలంబున బలునిం గని "యిప్పటి యాటయు నేన గెల్చి యుండ వృథాజల్పకల్పనుండవయి నీవు 'గెల్చితి' నని పల్కెద; వక్షవిద్యానైపుణ్యంబు గల భూపకుమారులతోఁ బసులకాపరు లెత్తువత్తురే?" యని క్రొవ్వున నవ్వుచుం బలికిన నప్పలుకులు సెవులకు [3]ములుకులక్రియం దాఁకినఁ గోపోద్దీపితమానసుండై పెటపెటఁ బండ్లుగొఱుకుచుం గన్నుల నిప్పు లుప్పతిల్ల గినుకం దోఁక ద్రొక్కిన మహోరగంబునోజ రోఁజుచు దండతాడితంబయిన పుండరీకంబులీల హుమ్మని

1. నెత్తము - పాచికలయాట, 2. గైకొల్పిన - ప్రేరేపఁగా, 3. ములుకులు - బాణములు.

మ్రోయుచుఁ బ్రచండబాహుదండంబులు సాఁచి పరిఘం బందుకొని పరిపంథియైన రుక్మిని నతని కనుకూలంబయిన రాజలోకంబును బడలుపడ నడిచె, నయ్యవసరంబున. 300

క. మును దంతపంక్తి వెలిగా దను నవ్విన యక్కళింగుఁ దల వట్టి రయం
బునఁ బడవిగిచి వదన మేపున బెడచే వ్రేసి దంతములు వెస డులిచెన్. 301

క. అంతం బోవక రుక్మిని దంతంబులు మున్ను [1]డులిచి తను [2]వగలింపన్
అంతకుపురి కేఁగెను వాఁ డెంతయు భయ మంది రాజు లెల్లం గలఁగన్. 302

వ. అట్లు చేసి యయ్యాదవసింహం బసహ్యవిక్రమంబునం జెలంగె; నంత. 303

క. భూవర పద్మాక్షుఁడు దన బావ హతుండగుట గనియుఁ బలుకక యుండెన్
భావమున రుక్మిణీబలఁదేవుల కే మనఁగ [3]నెగ్గు దేరునొ? యనుచున్. 304

వ. అంత నా విదర్భానగరంబు నిర్గమించి. 305

క. పరమానురాగరససంభరితాంతఃకరణు లగుచుఁ బాటించి వధూ
వరులను రథమం దిడి హలధరహరిరుక్మిణులఁ గొల్చి తగ యదువీరుల్. 306

ఉ. మంగళతూర్యఘోషము లమందగతిం జెలఁగంగ మత్తమా
తంగితురంగసద్భట[4]కదంబముతోఁ జని కాంచి రంత నా
రంగలవంగలుంగవిచరన్మదభృంగసురంగనాదస
త్సంగతరంగిణీకలితసంతతనిర్మల నాకుశస్థలిన్. 307

వ ఇట్లు పురోపవనోపకంఠంబునకుం జని. 308

క. అందు వసించిరి నందిత చందనమందారకుందచంద్రదలసన్మా
కందములనీడ హృదయానందము సంధిల్ల నందనందనముఖ్యుల్. 309

వ. తదనంతరంబ పురప్రవేశంబు సేసి' రని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షి న్నరేంద్రున కిట్లనియె. 310

## —: బాణాసురుం డీశ్వరప్రసాదంబు నొందుట :—

తే. అనఘ! బలినందనులు నూర్వు రందులోన [5]నగ్రజాతుండు బాణుఁ డత్యుగ్రమూర్తి
చిరయశోహారి విజితపూజితపురారి యహితతిమిరోష్ణకరుఁడు సహస్రకరుఁడు. 311

1. డులిచి - రాల్చి, 2. వగలింపన్ - వేధింపఁగా, 3. ఎగ్గు - అనాదరము,
4. కదంబము-సమూహము, 5. అగ్రజాతుండు-పెద్దవాఁడు.

క. బాణుఁడు విక్రమజితగీర్వాణుఁడు సని కాంచె భక్తివశుఁడై సగణ
స్థాణున్ నిర్దళితాసమబాణుం దాండవధురీణు భక్తత్రాణున్. 312

క. కని యనురాగవికాసము దనమనమునఁ గడలుకొనఁగ ధరఁ జాఁగిలి వం
దన మాచరించి మోదము దనరఁగఁ దాండవము సలుపుతఱి నయ్యభవున్. 313

ఉ. సంచితభూరిబాహుబలసంపద పెంపున [1]నారజంబు వా
యించి యనేకభంగుల నుమేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మె
చ్చించి [2]ప్రమోదియై నిజవశీకృతనిశ్చలితాంతరంగుఁ గా
వించి తదాననాంబురుహవీక్షణుఁడై తగ మ్రొక్కి యిట్లనున్. 314

ఉ. 'శంకర! భక్తమానసవశంకర! దుష్టమదాసురేంద్రనా
శంకర! పాండునీలరుచిశంకరవర్ణనిజాంగ! భోగిరా
ట్కంకణ! పార్వతీహృదయ [3]కైరవకైరవమిత్ర! యోగిహృ
త్పంకజపంకజాప్త! నిజతాండవఖేలన! భక్తపాలనా! 315

వ. అని వినుతించి. 316

ఉ. 'దేవ! మదీయవాంఛితము తేటపడ న్నిటు విన్నవించెదన్
నీవును నద్రినందనయు నెమ్మిని నా పురికోటవాకిటం
గావలి యుండి నన్నుఁ గృపఁ గావుము భక్తఫలప్రదాత! యో
భావభవారి! నీ చరణపద్మము లెప్పుడు నాశ్రయించెదన్.' 317

వ. అని [4]యభ్యర్థించినం బ్రసన్నుండై భక్తవత్సలుండగు పురాంతకుండు గౌరీ సమేతుండై తారకాంతకాదిభూతగణంబులతోడ బాణనివాసం బగు శోణపురంబు వాకిటం గాఁపుండెఁ; బదంపడి యొక్కనాఁ డబ్బలినందనుండు. 318

తే. దర్పమునఁ బొంగి రుచిరమార్తాండదీప్త మండలముతోడ మార్పడు మహితశోణ
మణికిరీటము త్రిపురసంహరునిపాద వనజములు సోఁక మ్రొక్కి యిట్లని నుతించె. 319

సీ. 'దేవ! జగన్నాథ! దేవేంద్రవందిత! వితతచారిత్ర! సంతతపవిత్ర!
హాలాహలాహార! యహిరాజకేయూర! బాలేందుభూష! సద్భక్తపోష
సర్వలోకాతీత! సద్గుణసంఘాత! పార్వతీహృదయేశ! భవవినాశ
రజతాచలస్థాన! గజచర్మపరిధాన! సురవైరివిధ్వస్త! శూలహస్త!
తే. లోకనాయక! సద్భక్తలోకవరద సురుచిరాకార! మునిజనస్తుతవిహార
భక్తజనమందిరాంగణపారిజాత! నిన్ను నెవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ? 320

1. నారజంబు—పాఠాంతరము, 2. ప్రమోది-సంతోషించినవాఁడు, 3. కైరవకైరవమిత్ర-కలువలకుఁ జంద్రుఁడగువాఁడా! 4. అభ్యర్థించిన-కోరఁగా.

వ. అని స్తుతియించి. 321

మ. [1]అనిలో నన్ను నెదిర్చి బాహుబలశౌర్య స్ఫూర్తిఁ బోరాడఁజా
లినవీరుం డొకఁడైన బందెమునకున్ లేఁ డయ్యె భూమండలి
[2]న్ననయంబున్ భవదగ్రదత్తకరసాహస్రంబు [3]కండూతి వా
యు నుపాయంబును లేద యీ భరము నెట్లోర్తు న్నమానాయకా! 322

సీ. హుంకారకంకణక్రేంకారశింజినీటంకారనిర్ఘోషసంకులంబు
చండదోర్దండభాస్వ [4]న్మండలాగ్రప్రకాండఖండిత రాజమండలంబు
శూలాహతక్షతోద్వేల [5]కీలాలకల్లోలకేళీసమాలోకనంబు
శుంభదున్మదకుంభికుంభిస్థలధ్వంససంభూతశౌర్యవిజృంభణంబు
తే. గలుగు నుద్దామభీమసంగ్రామకేళి ఘనపరాక్రమవిక్రమక్రమము గాఁగ
జరపలేనట్టి కరములు కరముదుఃఖకరము లగుఁగాక సంతోషకరము లగునె? 323

ఉ. కాన మదీయచండభుజగర్వపరాక్రమకేళికిన్ సముం
డీ నిఖిలావనిం గలఁడె యిందుకళాధర! నీవు దక్కఁగా?
నా నిటలాంబకుండు దనుజాధిపుమాటకుఁ జాల రోసి లో
నూనినరోషవార్ధి గడ లొత్తఁగ నిట్లని పల్కె భూవరా! 324

క. 'విను మూఢహృదయ! నీకేతన మెప్పు డకారణంబ ధారుణిపైఁ గూ
లును నపుడ నీభుజావలి దునియఁగ నాయంతవానితో నని గల్గున్.' 325

వ. అని పలికిన నట్లు సంప్రాప్తమనోరథుండై నిజభుజవినాశకార్యధురీణుండగు బాణుండు సంతుష్టాంతరంగుం డగుచు నిజనివాసంబునకు జని, తన ప్రాణవల్లభల యుల్లంబులు పల్లవింపంజేయుచు నిజధ్వజనిపాతంబు నిరీక్షించుచుండెఁ; దదనంతరంబ. 326

సీ. ఆ దానవేశ్వరుననుఁగుఁగుమారి యుషాకన్య విమలసౌజన్యధన్య
రూపవిభ్రమకళారుచిరకోమలదేహ యతనునాఅవబాణ మనఁగఁ బరఁగు
సుందరీరత్నంబు నిందునిభానన యలినీలివేణి పద్మాయతాక్షి
యొకనాఁడు రుచిరసౌధోపరివేదికాస్థలమున మృదుశయ్య నెలమిఁ గూర్కి
తే. మున్ను దన [6]చౌల నెన్నఁడు విన్న యతఁడుఁ గన్నులారంగఁ దాఁ బొడగన్నయతఁడుఁ
గాని యసమానరూపరేఖావిలాస కలితు ననిరుద్ధు నర్మిలిఁ గవసినటుల. 327

చ. కల గని యంత మేలుకని కన్నుల బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవలెఁ గాక నిశ్చయముగాఁ గమనీయవిలాసవిభ్రమా

1. అని-యుద్ధము, 2. అనయంబు-ఎల్లప్పుడు, 3. కండూతి-దురద, 4. మండలాగ్రప్రకాండము-కత్తుల సమూహము, 5. కీలాలము-రక్తము, 6. చౌలు-చెవులు అనుటకు.

కలితతదీయరూపము ముఖంబున వ్రేలినయట్లు తోఁచినం:
గళవళ మందుచుస్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్. 328

వ. మఱియును. 329

చ. సరసమృదూక్తులుం గుసుమసాయకకేళియు శాటికాకచా
[1]కరషణముల్ నఖక్రియలుఁ గ్రమకపోలలలాట మేఖలా
కరకుచబాహుమూలములుఁ గైకొనియుండుట లాదిగాఁ దలో
దరి మది గాఢమై తగిలె దర్పకుఁ డచ్చున నొత్తినట్లయై. 330

సీ. కలికిచేష్టలు భావగర్భంబు లైనను బ్రియుమీఁదికూరిమి బయలఁపఱుపఁ
బిదపిదనై లజ్జ మదిఁ బద నిచ్చినఁ జెలిమేనఁ బులకలు చెక్కు లొత్త
మదనాగ్ని సంతప్తమానస యగుటకు గురుకుచహారవల్లరులు గందఁ
జిత్తంబు నాయకాయత్తమై యుంటకు మఱుమాట లాడంగ మఱపు గదుర
తే. నతివమనమున సిగ్గు మోహంబు భయముఁ బొడమ నునుమంచు నెత్తిమ్మిఁ బొదువుమాడ్కిఁ
బ్రథమచింతాభరంబునఁ బద్మనయన కోరి [2]తలచీర వాటింప నేరదయ్యె. 331

వ. ఇట్లు విరహవేదనాదూయమానమానసయై యుండె; నంత నెచ్చెలులు డాయం జనుదెంచినం
దన మనంబునం [3]బొడము మనోజవికారంబు [4]మఱుఁ వెట్టుచు నప్పుడు. 332

చ. పొరిఁబొరిఁ బుచ్చు నూర్పుగమిఁ బుక్కిట నుంచి కువాగ్రసీమపై
బెరసిన సన్న లేఁజెమటబిందువు లొయ్యన నార్చుఁ గన్నులం
దొరఁగెడు బాష్పపూరములు దొంగలిఱెప్పల నాని చుక్కలం
దఱుఁబులు రండు చూత మని తా మొగ మెత్తును గూఢరాగయై. 333

వ. ఇవ్విధంబునం జరియించుచుండె నట్టియెడ. 334

తే. అంతకంతకు సంతాప మతిశయించి వలుఁదచన్నులు గన్నీటివఱదఁ దడియఁ
జెలులదెసఁ జూడఁ జాల లజ్జించి మొగము వాంచి పలుకక యుండె నవ్వనరుహాక్షి. 335

వ. అంత. 336

తే. బలితనూభవుమంత్రి కుంభాండుతనయ తన బహిఃప్రాణ మిది యనఁ దనరునట్టి
కామినీమణి ముఖపద్మకాంతివిజిత [5]శిశిరకరచారుకళారేఖ చిత్రరేఖ. 337

వ. కదియ వచ్చి యుబ్బాల నుపలక్షించి. 338

---

1. ఆకరషణము-ఆకర్షణము-లాగుట, 2. దలచీర-మేలిముసుగు. 3. పొడము-పుట్టు
4. మఱుపెట్టుచు-దాఁచుచు, 5. శిశిరకరుఁడు-చంద్రుడు.

తే. [1]భామినీమణి సొబగుని బయల వెదకు విధమునను నాత్మవిభుఁ బాసి విహ్వలించు
వగను జేతికి లోనైనవానిఁ బాసి భ్రాంతి బొందిన భావంబు ప్రకట మయ్యె. 339

తే. వనిత నాకన్న [2]నెనరైనవారు నీకుఁ గలుగ నేర్తురె? నీకోర్కిఁ దెలియఁ జెప్పు
కున్న మీయన్నతో డన్నఁ గన్నుఁగవను నలరు నునుసిగ్గుతో నగ [3]వామతింప. 340

వ. ఇవ్విధంబునఁ జిత్రరేఖం గనుంగొని యిట్లనియె. 341

చ. 'చెలి కలలోన నొక్కసరసీరుహనేత్రుఁడు హారరత్నకుం
డలకటకాంగుళీయకరణన్మణినూపురభూషణుండు ని
ర్మలకనకాంబరుండు సుకుమారతనుండు వినీలదేహుఁ డు
జ్జ్వలరుచి నూతనప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్. 342

చ. నను బిగియారఁగౌఁగిట మనం బలరారఁగఁ జేర్చి మోదముం
దనుకఁగ నంచితాధరసుధారస మిచ్చి మనోజకేళికిం
బనుపడఁజేసి మంజుమృదుభాషలఁ దేలిచి యంతలోననే
చనియెను దుఃఖవార్ధిఁ బెలుచన్ ననుఁ ద్రోచి సరోరుహాననా! 343

వ. అనుచు నమ్మత్తకాశినిచిత్తంబు చిత్తజాయత్తంబయి తత్తఱంబున విరహానలం బుత్తలపెట్టఁ గన్నీరు [4]మున్నీరుగా వగచుచు విన్ననయిన వదనారవిందంబు వాంచి యూరకున్నఁ జిత్రరేఖ దనమనంబున నయ్యింతిసంతాపంబు చింతించి యిట్లనియె. 344

చ. 'సరసిజనేత్ర! యేటికి విచారము? నా [5]కుశలత్వ మేర్పడన్
నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరవరముఖ్యులం బటమునన్ లిఖియించినఁ జూచి నీ మనో
హరుఁ గని 'వీడె పో' మ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్.' 345

వ. అని యొడంబఱిచి మిలమిలని మంచుతోడం [6]బురుడించు ధళధళ మను మెఱుంగులు [7]దుఱంగలిగొను పటంబు నాపటంబు సేసి, వజ్రంబున మేదించి, పంచవన్నియలు వేఱు వేఱ కనకరజతపాత్రంబుల నించి కేలందూలిక ధరించి యొక్క విజనస్థలంబునకుం జని ముల్లోకంబులం బేరు గలిగి వయోరూపసంపన్నులయిన పురుషముఖ్యుల నన్వయగోత్రనామధేయంబులతోడ వ్రాసి, [8]యాయితంబయిన యప్పటంబు దనముందటఁ దెచ్చిపెట్టి

1 తే. పడఁతినీ విప్పు సొబగుని బయల వెదకు, విధమునను నాత్మ విభుఁడని వేడ్కఁబిలిచి వాని చేతికి లోనైనవానిఁ బాసి, భ్రాంతినొందిన భావంబు ప్రకటమయ్యె—పాఠాంతరము, 2. నెనరైనవారు-ప్రీతికలవారు, 3. ఆమతింప-గౌరవింపగా, 4. మున్నీరు-సముద్రము, 5. కుశలత్వము నేర్పు. 6. పురుడించు-పోలు, 7. తుఱంగలిగొను-ప్రకాశించునట్టి, 8, ఆయితంబు-సిద్ధముగా నున్నది.

'యప్పటంబునం దగులనివారు లేరు; వారిం జెప్పెద; సావధానంబుగ నాకర్ణింపు' మని
యిట్లనియె. 346

సీ. కమనీయసంగీతకలితకోవిదులు కింపురుషగంధర్వకిన్నరులు వీరె
సతతయౌవనయదృచ్ఛావిహారులు సిద్ధసాధ్యచారణనభశ్చరులు వీరె
ప్రవిమలసౌఖ్యసంపద్వైభవులు సుధాశనమరుద్యక్షరాక్షసులు వీరె
నిరుపమరుచికళాన్వితకామరూపులై పొగడొందునట్టి పన్నగులు వీరె
తే. చూడు' మని నేర్పు దీపింపఁ జూపుటయును జిత్తము నిజమనోరథసిద్ధి వడయఁ
జాలకుండిన మధ్యమక్ష్మాతలాధి పతులఁ జూపుచు వచ్చె నప్పద్మనయన. 347

ఉ. మాళవ కొంకణ ద్రవిడ మత్స్య పుళింద కళింగ భోజ నే
పాళ విదేహ పాండ్య కురు బర్బర సింధు యుగంధ రాంధ్ర బం
గాళ కరూశ టేంకణ త్రిగర్త సుదేష్ణ మరాట లాట పాం
చాల నిషాధ ఘూర్జరక సాళ్వ మహీశులు వీరె కోమలీ! 348

ఉ. [1]సింధురవైరివిక్రముఁడు శీతమయూఖమరాళికాపయ
స్సింధుపటీరనిర్మలవిశేషయశోవిభవుండు శౌర్యద
ర్పాంధరిపుక్షితీశనికరాంధతమఃపటలార్కుఁ డీ జరా
సంధునిఁ జూడు మాగధుని సద్బృహదశ్వసుతుం గృశోదరీ! 349

మ. సకలోర్వీతలనాథసన్నుతుఁడు శశ్వద్భూరిబాహాబలా
ధికుఁ డుగ్రాహవకోవిదుండు త్రిజగద్విఖ్యాతచారిత్రకుం
డకలంకోజ్జ్వలదివ్యభూషుఁడు విదర్భాధీశ్వరుండైన భీ
ష్మకభూపాలకుమారుఁ జూడు మితనిన్ మత్తద్విరేఫాలకా! 350

ఉ. సంగరరంగనిర్దళితచండవిరోధి [2]వరూధినీశమా
తుంగతురంగసద్భటరథప్రకరైకభుజావిజృంభణా
భంగపరాక్రమప్రకటభవ్యయశోమహనీయమూర్తి కా
ళింగుఁడు వీఁడె చూడు తరళీకృతచారుకురంగలోచనా! 351

మ. సుగుణాంభోనిధి పాలలోచను నుమేశు న్నాత్మ మెప్పించి శ
క్తిగరిష్ఠంబగు శూలముం బడసె నక్షీణప్రతాపోన్నతిన్
జగతిన్ మిక్కిలి మేటివీరుఁడు రణోత్సాహుండు భూపొత్తుఁ డీ
భగదత్తుం గనుఁగొంటె! పంకజముఖీ! ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్. 352

మ. వికచాంభోరుహపత్రనేత్రుఁ డగు గోవిందుండు దాఁ బూనుసం
దకచక్రాబ్జగదాదిచిహ్నములచేతన్ వాసుదేవాఖ్య ను

1. సింధురవైరి-సింహము, 2. వరూధినీశుఁడు-సేనాధిపతి.

త్సుకుఁడై యెప్పుడు [1]మచ్చరించు మదిఁ గృష్ణుం డన్న నేమేటి పౌం
డ్రకుఁ గాశీశసముం గనుంగొనుము వేడ్కం జంద్రబింబాననా! 353

మ. ద్విజశుశ్రూషయుఁ [2]సూనృతవ్రతము సద్వృత్తిన్ భుజాగర్వమున్
విజయాటోపముఁ జూపనై పుణియుం ధీవిస్ఫూర్తియుం గల్గు నీ
రజనీనాథకులప్రదీపకులఁ బాఱం జూడు పద్మాక్షి! ధ
ర్మజభీమార్జునమాద్రినందనుల సంగ్రామైకపారీణులన్. 354

మ. బలిమిన్ సర్వనృపాలురఁ [3]న్నదిమి కప్పంబుల్ దగం గొంచు ను
జ్జ్వలతేజోవిభవాతిరేకమున భాస్వత్కీర్తి శోభిల్లఁగాఁ
బొలుపొందం దను రాజరా జన మహాభూరిప్రతాపంబులుం
గల దుర్యోధనుఁ జూడు సోదరయుతుం గంజాతపత్త్రేక్షణా! 355

వ. అని యిట్లు సకలదేశాధీశ్వరులగు రాజవరుల నెల్లఁ జూపుచు యదువంశసంభవులైన శూర
సేనవసుదేవోద్ధవాదులం జూపి మఱియును, 356

ఉ. శారదనీరజాబ్జఘనసారసుధాకరకాశచంద్రికా
సార [4]పటీరవర్ణు యదుసత్తము నుత్తమ నాయకుం బ్రమ
త్తారినృపాలకాననహుతాశనమూర్తిఁ బ్రలంబదైత్యసం
హారునిఁ గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా. 357

సీ. కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రుఁ వసుధాకళత్రుఁ బావనచరిత్రు
[5]సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు నతపన్నగాకల్పు నాగతల్పుఁ
గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు శ్రితజనపోషు నంచితవిశేషు
నీలనీరదకాయు నిర్జితదైతేయు ధృతపీతకౌశేయు నతవిధేయు
తే. నఘమహాగదవైద్యు వేదాంతవేద్యు దివ్యమునిసన్నుతామోదుఁ దీర్ఘపాదు
[6]జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ జూడు దైతేయకులబాల! సుభగలీల! 358

చ. స్ఫురదళిశింజినీరవవిభూషితపుష్పధనుర్విముక్తభా
స్వర నవచూతకోరకనిశాతశిలీముఖపాతభీతపం
కరుహభవాదిచేతననికాయు మనోజనిజాంశు రుక్మిణీ
వరసుతు రాజకీరపరివారుని మారుని జూడు కోమలీ! 359

వ. ఇవ్విధంబునం జూపిన. 360

---

1. మచ్చరించు-అసూయవడును, 2. సూనృతవ్రతము-సత్యవ్రతము, 3. అదిమి-లొంగదీసుకొని, 4. పటీరము-చందనము, 5 నగజాతజల్పు నున్నత సత్యసంకల్పు—పాఠాంతరము, 6. జిష్ణువు-జయశీలుఁడు.

మ. వనితారత్నము కృష్ణనందనుని భావప్రౌఢిఁ దాఁ జూచి [1]గ
ద్దనఁ ద న్నర్థి వరించి చన్న సుగుణోత్తంసంబ కా నాత్మలో
ననుమానించి యనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాక్షు నూ
తన చేతోభవమూర్తిఁ జూచి మది సంతాపించుచు న్నిట్లనున్. 361

ఉ. ఇంతి మదీయమానధన మెల్ల హరించిన మ్రుచ్చు నిమ్మెయిం
బంత మెలర్ప వ్రాసి పటభాగనిరూపితుఁ జేసినట్టి నీ
యంతటి పుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె? నీచరిత్రముల్
వింతలె నాకు? నీ మహితవీరకులంబు బలంబుఁ జెప్పుమా;' 362

చ. అనవుడుఁ జిత్రరేఖ జలజాక్షికి నిట్లను 'నీ కుమారకుం
డనఘుఁడు యాదవాన్వయసుధాంబుధిపూర్ణ సుధాకరుండునాఁ
దనరిన కృష్ణపౌత్త్రికుఁ డుదార చరిత్రుఁడు భూరిసింహసం
హననుఁ దరాతిసైన్యతిమిరార్కుఁడు; పే రనిరుద్ధు డంగనా!' 363

వ. అని చెప్పి యే నతిత్వరితగతిం జని యక్కుమారరత్నంబుఁ దోడ్కొనివత్తు, నంతకు సంతాపింపకుండు' మని యా క్షణంబ [2]వియద్గమనంబునం జని ముందట. 364

క సరసిజముఖి గనుఁగొనె శుభ భరితనివిలోకన [3]విధూతభవవేదనమున్
బరసాధనమును సుకృత స్ఫురణాపాదనముఁ గృష్ణు[4]పుటభేదనమున్. 365

వ. కని డాయంజని తదీయసుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుం గామినీచరణ [5]రణితమణినూపుర ఝణంఝుణధ్వనితమణిగోపురంబును నతి విభవవిజితగోపురంబును నగు ద్వారకాపురంబు నిశాసమయంబునం [6]బ్రచ్ఛన్న వేషంబునం జొచ్చి కనకకుంభకలితసౌధాగ్రంబున మణిదీపనిచయంబు ప్రకాశింపఁ జంద్రకాంతశిలాభవనంబున [7]సుధాధామరుచినిచయంబు నపహసించు హంసతులికాతల్పంబున నిజాంగనారతిశ్రమంబున నిద్రాసక్తుండై యున్న యనిరుద్ధుఁ జేరి తనయోగవిద్యామహత్త్వంబున నతని నెత్తుకొని మనోవేగంబున శోణపురంబునకుం జని బాణాసురనందన యగు నుషాసుందరీ తల్పంబునం దునిచి యిట్లనియె. 366

క. 'వనజాక్షి చూడు నీ విభు ననిమిషనగధీరు సూరు నభినవమారున్
వనధిగభీరు నుదారుని ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్. 367

1. గ్రద్దన - శీఘ్రముగా, 2. వియద్గమనంబు - ఆకాశగమనము, 3. విధూత - పోగొట్టఁబడిన, 4. పుటభేదనము - పట్టణము. 5. రణిత-ధ్వనిచేయు, 6. ప్రచ్ఛన్న వేషంబు-మాఱువేషము, 8. సుధాధాముఁడు-చంద్రుఁడు.

క. అనిన నుషాసతి దనమనమున [1]ననురాగిల్లి మేనఁ బులకాంకురముల్
మొనయఁగ నానందాశ్రులు గనుఁగవ జడి గురియ ముఖవికాస మెలర్పన్. 368

వ. ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని నయ్యింతి యిట్లనియె. 369

సీ. 'అతివ! నీ [2]సాంగత్య మను భానురుచి నాకుఁ గలుగుటఁ గామాంధకార మడఁగెఁ
దరలాక్షి! నీసఖిత్వం బను నావచేఁ గడిఁదివియోగాబ్ధిఁ గడవఁ గంటి
నబల; నీ [3]యనుబంధ మను సుధావృష్టిచే నంగజసంతాప మార్పఁ గంటి
వనిత నీచెలితనం బను రసాంజనముచే నా మనోహర [4]నిధానంబుఁ గంటిఁ
తే. గలలఁ దోఁచిన రూపు వ్రక్కన లిఖంచు వారు 'నౌ' నన్నఁ దోడ్తెచ్చువారు గలరె?
నీటిలో జాడఁ బుట్టించు నేర్పు నీక కాక గల్గునె మూఁడు లోకములయందు? 370

వ. అని వినుతించి చిత్రరేఖను నిజమందిరంబునకుఁ బోవం బనిచినం జనియె; నంత [5]వింత
జనుల కెవ్వరికిం బ్రవేశింపరాని యంతఃపురసౌధాంతరంబున ననిరుద్ధుండు మేల్కని
యయ్యింతిం గనుంగొని యప్పుడు. 371

క. సురుచిరమృదుతల్పంబునఁ బరిరంభణసరసవచనభావకళాచా
తురి మెఱసి రాకుమారుఁడు తరుణీమణిఁ బొందె మదనతంత్రజ్ఞుండై. 372

వ. ఇవ్విధంబున నతిమనోహరవిభవాభిరామంబులగు దివ్యాంబరాభరణమాల్యా నులేపనంబులఁ
గర్పూరతాంబూలంబుల వివిధాన్నపానంబుల సురుచిర మణిదీప నీరాజనంబుల సుగంధ
బంధురాగరుధూపంబుల నాటలఁ బాటల వీణావినోదంబులం బరితుష్టిం బొంది కన్యాకుమా
రకు లానందసాగరాంతర్నిమగ్నమానసులై, యుదయాస్తమయనిరూపంబు సేయనేరక,
ప్రాణంబు లొక్కటియైన తలంపులం గలసి యిష్టోపభోగంబుల సుఖియించుచుండి;
రంత. 373

క. ఆలోనన యతిచిర మగు కాలము సుఖలీల జరగఁగా వరుస నుషా
బాలాలలామ కొయ్యన చూ లేర్పడి గర్భ మొదవె సురుచిరభంగిన్. 374

క. ఆచిన్నె [6]లంగజాలలు సూచి భయాకులత నొంది స్రుక్కుచుఁ దమలో
'నో చెల్ల! యెట్టులో? యీ రాచూలికిఁ జూలు నిలిచెరా! యిబ్బంగిన్.' 375

క. అని [7]గుజగుజవోవుచు 'నిప్పని దప్పక దనుజలోక పాలునితోడన్
వినిపింపవలయు' నని వే చని బాణునిఁ జేరి మ్రొక్కి సద్వినయమునన్. 376

---

1. అనురాగిల్లి - ప్రేమనుపొంది, 2. సాంగత్యము - స్నేహము, 3. యనుబంధి యును - పాఠాంతరము, 4. నిధానంబు - నిధి, 5. వింతజనులు - క్రొత్తవారు, 6. అంగజాలలు - కంచుకులు, 7. గుజగుజవోవుచు - గుసగుసలాడుకొనుచు.

క. మంతనమున దేవరకన్యాంతఃపుర మేము గాచి యరయుచునుండన్
వింతజనములకుఁ జొరఁగ [1]దురంతము విను పోతుటీఁగకైన సురారీ! 377

తే. ఇట్టిచోఁ గావలున్న మేమెవ్వరమును నేమి కనుమాయయో కాని, యెఱుఁగ మధిప!
నీకుమారిక గర్భంబు నివ్వటిల్లి యున్న'దన్నను విని రోషయుక్తుఁ డగుచు 378

వ. అట్టియెడ దానవేంద్రుండు రోషభీషణాకారుండై కటము లదర, బొమలు ముడివడం, గనుంగవల ననలకణంబు లుప్పతిల్ల, [2]సటలు వెటికినం జటులగతి నెగయుసింగంబు విధంబున లంఘించుచు భీకరకరవాలంబు గేలం దాల్చి సముద్దండగతిం గన్యాసౌధాంత రంబునకుం జని. 379

—: బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధునిఁ జేయుట :—

సీ. కనియె శుభోపేతుఁ గందర్పసంజాతు మానితదేహు నాజానుబాహు
మకరకుండలకర్ణు మహితప్రభాపూర్ణుఁ జిరయశోల్లాసుఁ గౌశేయవాసుఁ
గస్తూరికాలిప్తు ఘనకాంతికుముదాప్తు హారశోభితవక్షు నంబుజాక్షు
యదువంశతిలకు మత్తాలినీలాలకు నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు
తే. నభినవాకారు నక్షవిద్యావిహారు మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ
గలితపరిబుద్ధు నఖిలలోకప్రసిద్ధుఁ జతురు ననిరుద్ధు నంగనాజననిరుద్ధు. 380

చ. కని [3]కన లుగ్గలింప సురకంటకుఁ డుద్ధతి సద్భటావళిం
గనుఁగొని 'యీ నరాధమునిఁ గట్టుఁడు; పట్టుఁడు; కొట్టుఁ' డన్న వా
రనుపమ[4]హేతిదీధితు లహర్పతితేజము మాయఁజేయ, డా
సిన నృపశేఖరుండు మదిఁ జేవయు లావును నేర్పు దర్పమున్. 381

చ. కలిగి మహోగ్రవృత్తిఁ [5]బరిఘంబు గరంబున లీలఁ దాల్చి దో
ర్బలఘనవిక్రమప్రళయభైరవుభంగి విజృంభణక్రియా
కలన నెదిర్చి దానవనికాయముతోఁ [6]దలపాటుఁ బోటునుం
జలము బలంబు ధైర్యమును శౌర్యము ప్రేటును వాటుఁ జూపుచున్. 382

చ. పదములు బాహులుం దలలు ప్రక్కలు సెక్కలు జానుయుగ్మముల్
రదములు గర్ణముల్ మెడ లురంబులు మూఁపులు వీఁపు లూరువుల్
[7]చిదురుపలై ధరం దొరఁగఁ జిందఱవందఱ సేయ, సైనికుల్
కదనపరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱిరి [8]కాందిశీకులై. 383

---

1. దురంతము - అసాధ్యము, 2. సటలు - జూలు, 3. కనలు-కోపము, 4. హేతి దీధితులు-ఆయుధముల కాంతులు, 5. పరిఘంబు - ఇనుపకట్లగుదియ, 6. తలపాటు-తాఁకుట, 7. చిదురుపలు-చిన్నచిన్నముక్కలు, 8. కాందిశీకులు-భయపడినవారు.

వ. ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబు నొంది వెఱచియుం బఱచియు వచ్చియుం జచ్చియుఁ గలంగియు నలంగియు విఱిగియు సురిఁగియుఁ జెదరియున్ బెదరియుఁ జేవ దఱిఁగి [1]నుఱుములై తనమఱుఁగు సొచ్చిన బాణుండు శౌర్యధురీణుండును గోపోద్దీపితమానసుండునై కదిసి యేసియు వ్రేసియుఁ బొడిచియు నడచియుఁ బెనంగి 384

క. క్రుద్ధుండై యహిపాశనిబద్ధుం గావించె నసురపాలుఁడు రణస
న్నద్ధున్ శరవిద్ధు న్ననిరుద్ధున్ మహితప్రబుద్ధు రూపసమృద్ధున్. 385

వ. ఇట్లు కట్టి త్రోచిన నుషాసతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంత. 386

క. [2]నీలపటాంచితమై సువిశాలంబై వాయునిహతిఁ జండధ్వని నా
భీలమగు నతనికేతన మాలోన నకారణంబ యవనిం గూలెన్. 387

క. అది చూచి దనుజపాలుఁడు [3]మదనాంతకుఁ డాడినట్టి మాట నిజముగాఁ
గదనంబు గలుగు ననుచు న్నెదురెదురే చూచుచుండె నెంతయుఁ బ్రీతిన్. 388

వ. అంత నక్కడ. 389

క. ద్వారకలో ననిరుద్ధకుమారునిపోకకును యదుసమాజము వగలం
గూరుచు నొక వార్తయు విననేరర చింతింప నాల్గునెల లరిగె నృపా! 390

వ. అయ్యవసరంబున, 391

—: { నారదుని వలన వృత్తాంతమును విని కృష్ణుఁడు బాణాసురునిపై దండెత్తుట } :—

క. శారదకోమలనీరద పారదరుచిదేహుఁ డతులభాగ్యోదయుఁ డా
నారదముని యేతెంచె నపారదయామతి మురారి భజన ప్రీతిన్. 392

వ. ఇట్లు సనుదెంచిన యద్దివ్యమునికి నిర్మలమణివినిర్మితసుధర్మాభ్యంతరమున యదువృష్ణిభోజాంధకవీరులు గొలువం గొలువున్న గమలలోచనుండు [4]ప్రత్యుత్థానంబుచేసి. యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి. సముచితకనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్తతేజోనిధిం బొగడి యనిరుద్ధ వృత్తాంతం బెఱుఁగం దేటపడ నెఱింగించి యప్పుండరీకాక్షునిచేత [5]నామంత్రణంబు వడసి యంతర్ధానంబు నొందెఁ; దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వ్రేయించి బలంబుల వెడలింప బ్రద్దలవారిం బనిచి తాను [6]గట్టాయితం బయ్యెఁ; నంత. 393

1. వడవడలై; నఱువులై—పాఠాంతరములు, 2. ఇయ్యదియు, దీనిని ద్వాతి పద్యమును కొన్ని ప్రతులలో లేవు, 3. మదనాంతకుఁడు-శివుఁడు, 4 ప్రత్యుత్థానంబు చేసి-ఎదుర్కొని, 5. ఆమంత్రణంబు-వీడ్కోలు, 6. కట్టాయితంబు-సర్వసిద్ధము.

సీ. హారకిరీటకేయూరకంకణకటకాంగులీయకనూపురాదివివిధ
భూషణప్రతతిచేఁ బొలుపారి కరముల ఘనగదాశంఖచక్రములు దనర
సురభిచందనలిప్తసురుచిరోరస్థలిఁ బ్రవిమలకౌస్తుభప్రభలు నిగుడ
జెలువారుపీతకౌశేయచేలము కాసె వఱనుగా రింగులువాఱఁగట్టి
తే. శైబ్యసుగ్రీవ మేఘపుష్పకవలాహకములఁ బూన్చినతేరు రాయితముగఁ జేసి
దారుకుఁడు దేర నెక్క మోదం బెలర్ప భానుఁ డుదయాచలం బెక్కు పగిది మెఱయ. 394

వ. ఇట్లు రథారోహణంబు సేసి, భూసురాశీర్వచనపూతుండును, మహితదుర్వాంకురాలంకృతుండును, లలితపుణ్యాంగనాకరకిసలయకలితశుభాక్షత విన్యాసభాసుర మస్తకుండును, మాగధమంజులగానానుమోదితుండును, బాలకపఠనరవవికాసితహృదయుండును నయి వెడలునవసరంబున. 395

సీ. బలభద్రసాత్యకిప్రద్యుమ్నముఖయదువృష్ణిభోజాంధకవరులు
దుర్వారపరిపంథిగర్వభేదనకళాచతురబాహాబలోత్సాహలీల
[1]వారణస్యందనవాజిసందోహంబు సవరణ సేయించి సంభ్రమమున
సముచితప్రస్థానచటులభేరీభూరిఘోష మంభోనిధిఘోష మడఁప
తే. ద్వాదశాక్షౌహిణీబలోత్కరము లోలి నడచెఁ గృష్ణునిరథము [2]వెన్నడి చెలంగి
పృథులగతి మున్ భగీరథురథమువెనుక ననుగమించు [3]వియన్నది ననుకరించి. 396

వ. ఇవ్విధంబునం గదలి కతిపయప్రయాణంబుల శోణపురంబు సేరం జని [4]వేలాలంఘనంబు సేసి యదువీరు లంత. 397

మ. సరిదారామసరోవరోపవనయజ్ఞస్థానముల్ మాపి వే
[5]పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ ద్రొబ్బి, గో
పురముల్ గూలఁగ ద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారముల్
ధరణిం గూల్చి కవాటముల్ విఱిచి రుద్దండక్రియాలోలురై. 398

వ. ఇట్లనేకప్రకారంబుల గాసిచేసి, పురంబు నిరోధించి పేర్చి యార్చినం జూచి యాగ్రహసమగ్రోగ్రమూర్తియుం బోలె సమరసన్నాహసంరంభవిజృంభమాణుండై బాణుండు సంగరభేరి వ్రేయించిన. 399

సీ. ఆచక్రవాళానలాచక్ర మంతయు బలిసి కుమ్మరసారెపగిదిఁ దిరిగె
ఘనఘోణిఖురకోటిఘట్టితోదకములకరణి నంభోనిధుల్ గలఁగి పొరలెఁ

---

1. వారణము-ఏనుఁగు, 2. వెన్నడి-వెంబడి, 3. వియన్నది-ఆకాశగంగ, 4. వేలాలంఘనంబు-పొలిమేరదాటుట, 5. పరిఖల్-అగడ్తలు.

గాలరుద్రాఖీలకరశూలహతి రాలు పిడుగుల గతి [1]నుడుబృంద మెడలెఁ
జటులానిలోద్ధూతశాల్మలీతూలంబుచాడ్పున మేఘముల్ సదలఁ దూలె
తే. గిరులు వడఁకాడె దివి పెల్లగిల్లె సురల గుండె లవిసె రసాతలక్షోభ మొదవె
దిక్కులురిసె విమానముల్ దెరలిచెదరెఁ గలఁగెగ్రహరాజచంద్రులగతులు దప్పె. 400

వ. అట్టి సమరసన్నాహంబునకుఁ గట్టాయితంబై మణిఖచితధర్మవర్మనిర్మలాంశుజాలంబులును, శిరస్త్రాణకిరీటకోటిఘటితవినూత్నరత్నప్రభాపటలంబులును, గనక కుండలగ్రైవేయహారకంకణతులాకోటివివిధభూషణవ్రాత రుచినిచయంబులును, బ్రచండచాపదండసహస్రంబు వెలుంగుచు శరశరాసనశక్తిప్రాసతోమరగదాకుంత ముసల ముద్గర భిందిపాల కరవాలపట్టిసశూలక్షురికాపరశుపరిఘాది నిశాతహేతివ్రాతదీధితులును వియచ్చరకోటి నేత్రంబులకు మిఱుమిట్లు గొలుపఁ గనకాచలశృంగసముత్తుంగం బగు రథంబెక్కి యరాతివాహినీ సందోహంబునకుం దుల్యంబైన నిజసేనాసమూహంబు లిరుగడల నడవ బాణుం డక్షీణప్రతాపంబు దీపింప ననికి వెడలె; నయ్యవసరంబున. 401

—: బాణాసురునికి సహాయభూతుండగు శివునకు కృష్ణునకు యుద్ధముగుట :—

చ. వరదుఁ డుదారభక్తజనవత్సలుఁడైన హరుండు బాణునిం
గర మసురక్తి [2]నాత్మజులకంటె దయామతిఁ జూచు గాన తా
దురమొనరించువేడ్కఁ బ్రమధుల్ గుహుడుఁన్ నిజభూతకోటియున్
సరస భజింప నుజ్జ్వలనిశాతభయంకరశూలహస్తుఁడై. 402

సీ. ఖురపుటాహతి రేఁగు ధరణీపరాగంబు పంకేరుహాప్తబింబంబుఁ బొదువ
విపులవాలాటోపవిక్షేపజాతవాతాహతి వారివాహములు విరియఁ
గురుచతిన్నని వాఁడికొమ్ముల జిమ్మిన బ్రహ్మాండభాండకర్పరము వగుల
నలవోకవలె ఖణిల్లని అంకె వైచిన రోదసీకుహరంబ భేదిలంగ
తే. గలచలద్ఘర్మఘంటికాఘణఘణప్రఘోషమున దిక్తటంబు లాకులత నొంద
లీల నడతెంచు [3]కలధౌతశైల మనఁగ నుక్కు మిగిలిన వృషభేంద్రు నెక్కి వెడలె. 403

వ. ఇట్లు వెడలి సమరసన్నాహసముల్లాసంబు మొగంబులకు వికాసంబు నాపాదింపం బ్రతిపక్షబలంబులతోడం దలపడిన ద్వంద్వయుద్ధం బయ్యె. నప్పు దప్పురాతనయోధుల [4]యాయోధనంబు జూచువేడ్కం జనుదెంచిన సరసిజసంభవ ప్రముఖ నిఖిలసురముని యక్ష రాక్షస సిద్ధసాధ్యచారణ గంధర్వ కిన్నర కింపురుష గరుడోరగాదులు నిజవిమానారూఢులై వియత్తలంబున నిలిచి: రట్టియెడం గృష్ణుండును హరుండును, మారుండును గుమారుండును, గూపకర్ణకుంభాండులును గామపాలుండును బాణుపుత్రుండగు బలుండును సాంబుండును

1. ఉడుబృందము-చుక్కలగుంపు, 2. ఆత్మజులు-కుమారులు, 3 కలధౌతశైలము-కైలాసపర్వతము, 4. అయోధనంబు-యుద్ధము.

సాత్యకియును బాణుండును, రథికులు రథికులును, నాశ్వికులు నాశ్వికులును, గజారోహకులు గజారోహకులును బదాతులు పదాతులుం, దలపడి [1]యితరేతర హేతిసంఘట్టనంబుల [2]మిడుంగుఱులు సెదరం బరస్పరాహ్వానబిరుదాంకిత సింహనాదహుంకారశింజనీటంకార వారణఘీంకార వాజిహేషారవంబులును, బటహకాహళభేరీ మృదంగశంఖతూర్యఘోషంబులను బ్రహ్మాండకోటరంబు పరిస్ఫోటితం బయ్యె; నయ్యవసరంబున. 404

చ. జలరుహనాభుఁ డార్చి నిజశార్ఙ్గశరాసనముక్తసాయకా
వలి నిగిడించి నొంచెఁ బురవైరిపురోగములన్ రణక్రియా
కలితుల గుహ్యకప్రమథకర్బురభూతపిశాచడాకినీ
బలవదరాతియోధులును [3]బమ్మెరపోయి కలంగి పాఱఁగన్. 405

వ. ఇట్లేసి యార్చిన కుంభినీధరుభుజావిజృంభణసంరంభంబునకు సహింపక నిటలాంబకుం డనలకణంబు లుమియు నిశితాంబకంబులం బీతాంబరుని నేసిన వాని నన్నింటి నడుమన ప్రతిబాణంబు లేసి చూర్ణంబులు సేసినం గనుంగొని మఱియును. 406

మ. అనలాక్షుండు త్రిలోకపూజ్యమగు బ్రహ్మాస్త్రం [4]బరింబోసి యా
వనజాతేక్షణుమీఁదఁ గ్రోధమహిమవ్యాకీర్ణుఁడై యేసె; నే
సినఁ దద్దివ్యశరంబుచేతనె మఱల్చెం గృష్ణుఁ డత్యుద్ధతిన్
జనితాశ్చర్యరసాబ్ధిమగ్ను లగుచున్ శక్రాదు లగ్గింపఁగన్. 407

శా. వాయవ్యాస్త్ర ముపేంద్రుపై నలిగి దుర్వారోద్ధతి న్నేయ దై
తేయధ్వంసియుఁ బార్వతాశుగముచేఁ ద్రెంచెం [5]గ్రతుధ్వంసి యా
గ్నేయాస్త్రం బదరించె నుగ్రగతి లక్ష్మీనాథుపై దాని వే
మాయం జేసెను నైంద్రబాణమునఁ బద్మాక్షుండు లీలాగతిన్. 408

వ. మఱియును. 409

ఉ. పాయని కిన్కతో హరుఁడు పాశుపతాస్త్రము నారిఁ బోసినన్
దోయరుహాయతాక్షుఁడును దోడన లోకభయంకరోగ్రనా
రాయణబాణరాజము రయంబున నేసి మరల్చె దానిఁ జ
క్రాయుధుఁ డిత్తెఱంగునఁ బురారిశరావలి రూపుమాపినన్. 410

క. ఊహ కలంగియు విగతోత్సాహుండగు హరునిమీఁద జలజాక్షుఁడు స
మ్మోహన [6]శిలీముఖం బవ్యాహతజయశాలి యగుచు నదరించె నృపా! 411

1. ఇతరేతరము-పరస్పరము, 2. మిడుంగుఱులు-నిప్పురవలు, 3. బమ్మెరపోయి-దిగ్భ్రాంతిపొంది, 4. అరింబోసి-సంధించి, 5. క్రతుధ్వంసి-దక్షుయాగమును ధ్వంసముచేసినవాఁడు-శివుఁడు, 6. శిలీముఖంబు-అస్త్రము.

వ. అట్లేసిన. 412

క. జృంభణశరపాతముచే శంభుఁడు నిజతనువు పరవశం బయి సోలన్
జృంభితుఁడై ఘననిద్రారంభమున వృషేంద్రుమూఁపురముపై వ్రాలెన్. 413

వ. ఇట్లు వ్రాలినం జక్రపాణి పరబలంబుల నిశితబాణపరంపరలం దునిమియు, నొక్కయెడం గృపాణంబులం [1]గణికకలు సేసియు, నొక్కచోట గదాహతులం దుత్తుమురుగా మొత్తియు, నివ్విధంబునఁ బీనుంగుఁబెంటలు గావించె; నంత. 414

చ. తఱిమి మురాంతకాత్మజుఁ డుదాత్తబలంబున [2]బాహులేయుపైఁ
[3]గరికరిఁ దాఁకి తీవ్రశితకాండపరంపర లేసి నొంపఁగా
[4]నెఱఁకులు గాఁడి పైఁ దొరఁగు నెత్తుట జొత్తిలి వైరు లార్వఁ దాఁ
బఱచె మయూరవాహనముఁ బైకొని తోలుచు నాజిభీతుఁడై. 415

ఉ. పంబి రణక్షితిన్ శరవిపాటితశాత్రవవీరుఁడైన యా
సాంబుఁడు హేమపుంఖశితసాయకజాలము లేర్చి భూరికో
పంబున నేసినన్ బెదరి బాణతనూభవుఁ డోడి పాఱె శౌ
ర్యంబును బీరముం దగవు [5]నాఱడివోవ బలంబు లార్వఁగన్. 416

మ. వరబాహాబలశాలి యా హలి రణావష్టంభసంరంభవి
స్ఫురదుగ్రాశనితుల్యమైన ముసలంబుం బూన్చి వ్రేసెన్ బొరిం
బొరిఁ గుంభాండక కూపకర్ణులు శిరంబుల్ వ్రస్సి మేదంబు నె
త్తురుఁ గర్ణంబుల వాతసుం దొరఁగ సంధుల్ వ్రీలి వే చాపఁగన్. 417

వ. అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొంది యనాథం బయి చెడి, విఱిగి పాఱినం గని బాణుండు సాత్యకిం గేడించి ప్రళయాగ్నియుంబోలె విజృంభించి చెయి వీచి బలంబుల మరలం బురికొల్పి తానును ముంగలియై నడచె; నప్పు డుభయ సైన్యంబు లన్యోన్యజయ కాంక్షం దలపడు దక్షిణోత్తర సముద్రబుల రౌద్రంబున [6]వీఁకం దాఁకినం బోరు ఘోరం బయ్యె; నట్టియెడ గదల నడిచియుఁ, గుఠారంబులఁ బొడిచియు, సురియలం గ్రుమ్మియు, శూలంబులం జిమ్మియు, శక్తుల నొంచియుఁ, జక్రంబులం ద్రుంచియు, ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల నొత్తియుఁ, గుంతంబుల గ్రుచ్చియుఁ. బంతంబు లిచ్చియుఁ, బరిఘంబుల నొంచియుఁ, బట్టిసంబులం ద్రుంచియు, శరంబుల నేసియుఁ, గరవాలంబుల వ్రేసియు, [7]సత్రాసులై పాసియు, [8]విత్రాసులై డాసియుఁ బెనఁగినం, దునిసిన శిరంబులును

1. కణికలు—ముక్కలు, 2. బాహులేయుఁడు-కుమారస్వామి, 3. కరకరి-పట్టుదల, 4. నెఱఁకులు-ఆయువుపట్టులు, 5, ఆఱడివోవ-వ్యర్థము కాఁగా, 6. వీఁక-పరాక్రమము, 7. సత్రాసులు-భయముతోఁగూడినవారు, 8. విత్రాసులు-భయము లేనివారు.

దునుకలైన కరంబులును, దెగిన కాళ్ళును, ద్రెస్సిన వ్రేళ్ళును, దుమురులైన యెముకలును ప్రోవులైన ప్రేవులును, నులిసిన మేనులును, నలిసిన జానువులును, నొగిలిన వర్మంబులును, బగిలిన చర్మంబులును, వికలంబులయిన సకలావయవంబులును, విశీర్ణంబులయిన కర్ణంబులును, విచ్ఛిన్నంబులైన నయనంబులును, వెడలు రుధిరంబులును, బడలుపడు బలంబులును, గొండలవడువునం బడు మాంసఖండంబులును, వాచఅచు [1]కొఅప్రాణంబులును, వ్రాలిన తేరులును, గూలిన కరులును, నొఅలిన గుఱ్ఱంబులును, దెరలిన [2]కాలుబలంబులును. గలిగి పలలఖాదనకుతూహలజనిత మదాంధీభూతపిశాచడాకినీ భూతబేతాళ సమూలోల కోలాహల భయంకరారావ బధిరీకృత సకలదిశావకాశం బయి సంగరాంగణంబు భీషణం బయ్యె; నయ్యవసరంబున. 418

చ. శరకుముదంబు లుల్లసితచామర ఫేనము లాతపత్రభా
సురనవపుండరీకములు శోణితతోయము లస్థిసైకతో
త్కరము భుజాభుజంగమనికాయము కేశకలాపశైవల
స్ఫురణ రణాంగణం బమరెఁ బూరితశోణనదంబుపోలికన్. 419

వ ఆట్టియెడ బాణుండు [3]గట్టలుకం గృష్ణునిపైఁ దన రథంబుఁ బఱపించి, యఖర్వబాహాసహస్రదుర్వారగర్వాటోపప్రదీప్తుండై కదిసి. 420

మ. ఒక యేనూఱుకరంబులన్ ధనువు లత్యుగ్రాకృతిం దాల్చి త
క్కక యొక్కొక్కట సాయకద్వయము వీఁకం బూన్చ నాలోన నం
దకహస్తుండు తదుగ్రచాపచయవిధ్వంసంబుఁ గావించి కొం[4]
జక తత్సారథిఁ గూలనేసి రథముం జక్కాడి శార్ఙోద్ధతిన్. 421

తే. ప్రళయజీమూతసంఘాతభయదభూరి భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య
మఖిలజనులు భయభ్రాంతులై చలింపఁ గడఁగి నిర్భిన్నరాక్షసీగర్భముగను. 422

వ. అట్టి యవక్రవిక్రమపరాక్రమంబునకు వెగడుపడి బాణుండు లేటమొగంబు వడి సేయునది లేక విన్ననయి యున్నయెడ. 423

సీ. అత్తఱిఁ గోటర యను బాణజనయిత్రి సుతుఁ గాచు మతము సన్మతిఁ దలంచి
వీడి శిరోజముల్ వ్రేలంగ నిర్ముక్తపరిధానయై మురాసురవిభేది
యెదురు నిల్చినఁ జూడ మది జాల రోసి పరాఙ్ముఖుఁడై యున్న నసువు వేచి
తల్లడించుచు బాణుఁ డుల్లంబు గలఁగంగఁ [5]దలచీర వీడ యాదవులు నవ్వ
తే. నవ్యకాంచనమణిభూషణములు రాలఁ బాదహతి నేలఁ గంపింపఁ బాటి యాత్మ
పురము వడిఁజొచ్చె నప్పుడు భూతిగణము లాకులతతోడ నెక్కడే నగుగుటయును. 424

---

1. కొఅప్రాణంబులు-కొనయూపిరులు, 2. కాలుబలంబులు-పదాతులు, 3. కట్టలుక-ఎక్కువకోపము, 4. కొంజక-సంకోచింపక, 5. తలచీర-తలపాగ.

క. శిరములు మూఁడును ఘనభీకరపదములు మూఁడుఁ గలిగి కనలి మహేశ
జ్వర మురుఘోరాకృతితో నరుదేరఁగఁ జూచి కృష్ణుఁ డల్లన నగుచున్. 425

చ. పరువడి వైష్ణవజ్వరముఁ బంచిన నయ్యుభయజ్వరంబులున్
[1]వెరవును లావుఁ [2]జేవయును వీరము బీరముఁ గల్గి ఘోరసం
గర మొనరింప నందు [3]గరకంఠకృతజ్వర ముగ్రవైష్ణవ
జ్వరమున కోడి పాఱె ననివారణ వైష్ణవి వెంట నంటఁగన్. 426

తే. పాఱి యేదిక్కుఁగానక ప్రాణభీతి నెనసి యేడ్చుచు నాహృషీకేశుపాద
కంజములఁ బడి 'ననుఁగావు కావు' మనుచు నిటలతటఘటితాంజలిపుటయు నగుచు. 427

వ. ఇట్లు వినుతించె. 428

సీ. 'అవ్యయు ననఘు ననంతశక్తిని బరులై నట్టిబ్రహ్మరుద్రామరేంద్ర
వరుల కీశ్వరుఁడైనవాని సర్వాత్మకు జ్ఞానస్వరూపు సమానరహితు
వరదుని జగదుద్భవస్థితిసంహార హేతుభూతుని హృషీకేశు నభవు
బ్రహ్మచిహ్నంబులై పరఁగుసుజ్ఞానశక్త్యాదుల నొప్పుబ్రహ్మంబు నీశు
ఆ. నజు షడూర్మిరహితు నిజయోగమాయావిమోహితాఖిలాత్ము ముఖ్యచరితు
మహితతేజు నాదిమధ్యాంతహీనుని జిన్మయాత్ము నిను భజింతుఁ గృష్ణ! 429

వ. అదియునుంగాక లోకంబున దైవం బనేక ప్రకారంబులై యుండు; నది యెట్టి దనినం గలా కాష్ఠాముహూర్తంబు లనంగల కాలంబును, సుకృతదుష్కృతానుభవరూపంబులైన ప్రకృతియును, సుఖదుఃఖాశ్రయంబైన శరీరంబును, జగజ్జంతు నిర్వాహకంబైన ప్రాణంబును, సకలపదార్థపరిజ్ఞానకారణంబైన యంతఃకరణంబును, మహదహంకారశబ్దస్పర్శరూపరస గంధతన్మాత్రతత్కార్యభూత గగనపవనానలసలిలధరాదిపంచభూతంబు లాదిగాఁగల ప్రకృతివికారంబులును, నన్నింటిసంఘాతంబును, బీజాంకురన్యాయంబునం గార్యకారణ రూప ప్రవాహంబునునై, జగత్కారణశంకితంబై యుండు; నది యంతయు భవదీయ మాయావిడంబనంబుగాని, యున్నది కాదు; తదీయమాయానివర్తకుండ వైన నీవు నానా విధదివ్యావతారాదిలీలలంజేసి దేవగణంబులను, సత్పురుషులను, లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు, లోకహింసాప్రవర్తకులైన దుష్టమార్గగతులం గ్రూరాత్ముల హింసించుచుందువు; విశ్వ [3]విశ్వంభరాభారనివారణంబు సేయుటకుఁ గదా! భవదీయ దివ్యావతార ప్రయోజనంబు; గావున నిన్ను శరణంబు వేఁడెద. 430

సీ. శాంతమై మహితతీక్ష్ణసుదుస్సహంబై యుదారమై వెలుగొందు తావకీన
భూరిభాస్వత్తేజమునఁ దాప మొందితిఁ; గడుఁ గృశించితి ; నన్ను గరుణఁ జూడుఁ

---

1. వెరవు-ఉపాయము, 2. చేవ-బలము, 3. గరకంఠుఁడు-శివుఁడు. 4. విశ్వంభర-భూమి,

మితరదేవోపాస్తిరతి మాని నీపాదకమలముల్ సేవించు విమలబుద్ధి
యెందాక మది దోఁప దందాఁకనే కదా ప్రాణులు నిఖిలతాపములఁ బడుట
తే. యవిరళానన్యగతికుల నరసి ప్రోచు బిరుదు గల నీకు నినుఁ గాచు [1]టరుదె? దేవ!
ప్రవిమలాకార! సంసారభయవిదూర! భక్తజనపోషపరితోష! పరమపురుష! 431

చ. అనిన, బ్రసన్నుఁడై హరి యనంతుఁడు దైత్యవిభేది దాని కి
ట్లనియె 'మదీయసాధన మనన్యనివారణ మౌట నీమఱిం
గని నను నార్తిఁ [2]జొచ్చితివి గావున మజ్జ్వరతీవ్రదాహవే
దన నినుఁ బొంద దింకఁ బరితాపము దక్కఁ-ము నీమనంబునన్' 432

వ. అని మఱియు నప్పుండరీకాక్షుం డిట్లను; 'నెవ్వరేని నీ యుభయజ్వరవివాదంబును, నీవు మత్ప్రపత్తిం జొచ్చుటయుఁ జిత్తంబుల దలంతు రట్టి పుణ్యాత్ములు శీతోష్ణజ్వరాది తాపంబులఁ బొరయ' రని యానతిచ్చిన నమ్మహేశ్వరజ్వరంబు పరమానందభరితహృదయంబై యా రథాంగపాణికి సాష్టాంగదండప్రణామం బాచరించి నిజేచ్ఛం జనియె నంత బాణాసురుండు నక్కడ. 433

—: బాణాసురుఁడు రెండవసారి యద్ధమునకు వచ్చుట :—

సీ. కమనీయకింకిణీఘంటికాసాహస్రఘణఘణధ్వనిచేత గగన మగల
నన్యజనాలోకనాభీలతరశోగ్రకాంచనధ్వజపతాకలు వెలుంగఁ
బృథునేమిఘట్టనఁ బృథివి కంపింపంగ వలనొప్పఁ బటుజవాశ్వములఁ బూన్చి
నట్టియున్నతరథం బత్యుగ్రగతిఁ నెక్కి కరసహస్రమున భీకరతరాసి
తే. శరశరాసనముఖదివ్యసాధనములు దనరఁ జలమును బలము నుత్కటము గాఁగ
హర్షఁ మిగురొత్తఁ గయ్యంపుటాయితమునఁ బురమువెలువడె బలిపుత్రుఁ [3]డురుజవమున

క. చని రణభూమిని మధ్యందినమార్తాండప్రచండదీప్తాకృతితోఁ
దనరుచుఁ బరిపంథిబ[4]లేంధనదవశిఖియైన కృష్ణుఁ దాఁకెం బెలుచన్. 435

ఉ. తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పను నేర్పడంగ నా
కూఁకున వేయిచేతుల మహోగ్రశరావళి పింజ పింజతోఁ
దాఁకఁగ నేసినన్ మురవిదారుఁడు తోడన నచ్చరావళి
[5]న్నాఁక గానంగఁ ద్రుంచె నిశితార్ధశశాంకశిలీముఖంబులన్. 436

వ. అంత. 437

1. అరుదు-వింత, 2. చొచ్చితివి-శరణువేడితివి, 3. ఉరుజవము-ఎక్కువవేగము, 4. ఇంధనము-వంటకట్టె, 5. ఆఁక-నిరోధము—అడ్డు.

చ. నుతనవపుండరీకనయనుం డన నొప్పు మురారి రోష [1]ఘూ
ర్ణితమహితారుణాబ్జదళనేత్రుఁడు దా నటు పంచె దైత్యుపై
దితిసుతకాననప్రవరదీపితశుక్రము, రక్షితాంచితా
శ్రితజనచక్రమున్ సతతసేవితశక్రము దివ్యచక్రమున్. 438

వ. మఱియును బ్రచండమార్తాండమండల ప్రభా[2]విడంబితంబును, భీషణశతసహస్ర కోటి దంభోళినిబిడనిశితధారాసహస్ర ప్రభూతజ్వలనజ్వాలికాపాస్తసమస్తకుటిల పరిపంథి దుర్వారబాహాఖర్వ గర్వాంధకారంబును, సకలదిక్పాలదేవతాగణజేగీయమానంబును, సమదదానవజనశోకకారణభయంకర దర్శనంబును, సమంచిత సజ్జనలోకప్రియంకరస్పర్శనంబును నగు సుదర్శనం బసురాంతక ప్రేరితంబై చని [3]యారామకారుండు కదళికాకాండంబుల [4]నేర్పు చందంబున బేర్చి సమదవేదండశుండాదండంబుల విడంబించుచుఁ గనకమణివలయకేయూరకంకణాలంకృతంబు నగు తదీయబాహాసహస్రంబుఁ [5]గరచతుష్టయావశిష్టంబుగాఁ దునుము నవసరంబున. 439

—: శివుండు బాణుని రక్షింప శ్రీకృష్ణుని స్తుతించుట :—

తే. కాలకంఠుఁడు బాణుపైఁ గరుణ [6]గలఁడు గాన యఖిలాండపతిఁ గృష్ణుఁ గదియ వచ్చి
పురుషసూక్తంబు సదివి సంపుటకరాబ్జుఁ డగుచుఁ బద్మాయతాక్షు నిట్లని స్తుతించె. 440

వ. 'దేవా, నీవు బ్రహ్మస్వరూపంబగు జ్యోతిర్మయుండవు; నిఖిలవేదవేదాంతనిగూఢుండవు; నిర్మలుండవు, సమానాధికరహితుండవు; సర్వవ్యాపకుండవైన నిన్ను నిర్మలాంతఃకరణులైనవార లాకాశంబుపగిది నవలోకింతు; రదియునుంగాక పంచోపనిషన్మయంబయిన భవదీయదివ్యమంగళమహావిగ్రహపరిగ్రహంబు సేయునెడ నాభియం దాకాశంబును, ముఖంబునం [7]గృశానుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబుల దిశలును, నేత్రంబుల సూర్యుండును, మనంబునఁ జంద్రుండును బాదంబుల వసుంధరయు, నాత్మయం దహంకారంబును, జఠరంబున జలధులును, రేతంబున నంబువులును, భుజంబుల నింద్రుండును, రోమంబుల మహీరుహౌషధివ్రాతంబులును, శిరోజంబుల బ్రహ్మలును, జ్ఞానంబున సృష్టియు నవాంతరప్రజాపతులును, హృదయంబున ధర్మంబును గలిగి మహాపురుషుండవై లోకకల్పనంబుకొఱకు నీ యకుంఠిత తేజంబు గుప్తంబుసేసి జగదుద్భవంబుకొఱకుఁ గైకొన్న భవదీయదివ్యావతారవైభవం బెఱిఁగి నుతింప నెంతవారము? నీవు సకల చేతనాచేతననిచయంబులకు నాద్యుండవు; నద్వితీయుండవు పురాణపురుషుండవు; సకలసృష్టి హేతు భూతుండవు; నీశ్వరుండవు; దినకరుఁడు [8]కాదంబినీ కదంబావృతుండగుచు భిన్నరూపుండైన బహువిధచ్ఛాయలం దోఁచువిధంబున నీ యఘటితఘటనానిర్వాహకంబైన సంకల్పంబునఁ ద్రిగుణాతీతుండ వయ్యును సత్త్వాదిగుణవిధానంబుల ననేక

---

1. ఘూర్ణిత-త్రిప్పఁబడిన, 2 విడంబితఁబు-అనుకరించునది, 3. ఆరామకారుండు-తోఁటమాలి, 4 ఏర్పుచందఁబున-కాల్చువిధమున, 5. కరచతుష్టయావశిష్టఁబుగాఁ-నాల్గు చేతులు మిగులునట్లు. 6. కలఁడు-కలవాఁడు, 7. కృశానుండు-అగ్ని, 8. కాదంబినీ-మేఘమాలిక,

రూపుండవై గుణవంతులైన సత్పురుషులకుఁ దమోనివారకంబైన దీపంబురూపంబునం బ్రకాశించుచుందువు; భవదీయ మాయావిమోహితు లయిన జీవులు పుత్రదారగృహక్షేత్రాది సంసారరూపంబైన పాప[1]పారావారమహావర్తగర్తంబున మునుంగుచుం దేలుచుందురు; దేవా! భవదీయదివ్యరూపానుభవంబు సేయంజాలక యింద్రియ పరతంత్రుండై భవత్పాద సరసీరుహంబులఁ జేర నెఱుంగని మూఢాత్ముం డాత్మవంచకుం డనంబడు; విపరీత బుద్ధింజేసి ప్రియుండవైన నిన్ను నొల్లక యింద్రియార్థానుభవంబు సేయుట యమృతంబు మాని హాలాహలంబు సేవించుట గాదె? జగదుదయపాలనలయ లీలాహేతువై, శాంతుండవయి, సుహృజ్జనభాగధేయుండవై సమానాధికవస్తుశూన్యుండ వైన నిన్ను నేనును బ్రహ్మయుం [2]బరిణతాంతఃకరణులైన మునిగణంబులును భజియించుచుందుము మఱియును. 441

తే. అవ్యయుండ; వనంతుండ; వచ్యుతుండ; వాదిమధ్యాంతశూన్యుండ; వఖిలధృతివి
నిఖిలమం దెల్ల వర్తింతు నీవు దగిలి నిఖిల మెల్లను నీయంద నెగడుఁ గృష్ణ! 442

సీ. అని సన్నుతించిన హరి యాత్మ [3]మోదించి మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్త
లలితబాలేందుకళామౌళి కిట్లను 'శంకర! నీమాట సత్య మరయ
నేది నీ కిష్టమై యెసఁగెడు దానిన వేడుము నీ కిత్తు వీఁ డవధ్యుఁ
డిది యెట్టి దనినఁ బ్రహ్లాదుండు మద్భక్తుఁ డతనికి వరము 'నీ [4]యన్వయమున
తే. జననమందిన వారలఁ జంప' ననుచుఁ గడఁక మన్నించితిని యది కారణమున
విశ్వవిశ్వంభరాభారవిపులభూరి బలభుజాగర్వ మడఁపంగ వలయుగాన. 443

క. కరములు నాలుగు సిక్కం బరిమార్చితి వీఁడు నీదుభక్తుల కగ్రే
సరుఁడై పొగడొందిజరామరణాదిభయంబుఁ దక్కి మను నిటమీఁదన్. 444

వ. అని యాన తిచ్చిన నంబికావరుండు సంతుష్టాంతరంగుం డయ్యె; నబ్బలినందనుం డట్లు రణరంగవేదిం గృష్ణదేవతాసన్నిధిం బ్రజ్వలితచక్రకృశాను శిఖాజాలంబులందు నిజబాహాసహస్ర శాఖాసమిత్ప్రచయంబును దత్షతోద్వేలకీలాల మహితాజ్యధారాశతంబును బరభయంకరవీరహుంకారమంత్రంబుల తోడ వేల్చి పరిశుద్ధిం బొంది విజ్ఞానదీపాంకురంబున భుజాఖర్వగర్వాంధకారంబు నివారించి యనవరతపూజితస్థాణుండగు నబ్బాణుండు భువనవిచ్ఛేదజనితనిరూపితస్థాణుండయ్యును దదీయవరదానకలితానందహృదయారవిందుం డగుచు గోవిందచరణారవిందంబులకుఁ బ్రణామంబు లాచరించి యనంతరంబ. 445

—: ఉషానిరుద్ధసహితుండై కృష్ణుండు ద్వారకాపురంబున కరుగుట :—

క. పురమున కేఁగి యుషాసుందరికిని ననిరుద్ధునకు ముదంబున భూషాం
బరదాసదాసికాజన వరవస్తువితాన మొసఁగి వారనిభక్తిన్. 446

1. పారావారమహావర్తగర్తంబు – సముద్రములోని పెద్దసుడిగుండపు గొయ్యి, 3. పరిణతాంతఃకరణులు–పరిపక్వములైన మనస్సులుకలవారు, 4. మోదించి–సంతోషించి, 5. అన్వయము–వంశము,

క. కనకరథంబున నిడికొని ఘనవైభవ మొప్పఁ గన్యకాయుక్తముగా
ననిరుద్ధుని గోవిందుం డనుమోదింపంగఁ దెచ్చి యర్పించె నృపా! 447

ఉ. అంత మురాంతకుండు త్రిపురాంతకు వీడ్కొని బాణు నిల్పి య
త్యంతవిభూతిమై నిజబలావలితోఁ జనుదేర నా [1]యుషా
కాంతుఁడు మున్నుగాఁ బటహకాహళతూర్యనినాదపూరితా
శాంతరుఁడై వెసం జనియె నాత్మ పురీముఖుఁడై ముదంబునన్. 448

మ. కనియెన్ గోపకుమారశేఖరుఁడు రంగత్ఫుల్లరాజీవకో
కనదోత్తుంగతరంగసంగతలసత్కాసారకన్ భూరిశో
భననిత్యోన్నతసౌఖ్యభారకను శుంభద్వైభవోదారకన్
జనసంతాపనివారకన్ సుజనభాస్వత్తారకన్ ద్వారకన్. 449

వ. కని డాయం జని పురలక్ష్మి కృష్ణసందర్శనకుతూహలయై [2]చేసన్నలం జీరు చందంబున నందంబు నొందు నుద్ధూతతరళవిచిత్రకేతుపతాకాభిశోభితంబును, మహనీయ మరకతతోరణమండితంబును, గనకమణీవినిర్మితగోపురసౌధప్రాసాదవీథికావిలసితంబును, మౌక్తికవితానవిరచితమంగళరంగవల్లీవిరాజితంబును, శోభనాకలితవిన్యస్త కదళికాస్తంభసురభికుసుమమాలికాక్షతాలంకృతంబును, గుంకుమ సలిలసిక్తవిపణిమార్గంబును, శంఖదుందుభిభేరీ మృదంగ పటహకాహళాది మంగళారావకలితంబును,వందిమాగధసంగీత ప్రసంగంబునునై యతిమనోహరవిభవాభిరామంబైన యప్పురవరంబు సచివ పురోహితసుహృద్బాంధవముఖ్యు లెదురుకొన భూసురాశీర్వాదంబులను బుణ్యాంగనాకరకలితలలితాక్షతలను గైకొనుచుం గామినీ మణులు గర్పూర నీరాజనంబులు నివాళింపం బ్రవేశించి నిజమందిరంబునకేఁగి యప్పుండరీకాక్షుండు పరమానందంబున సుఖం బుండె; నంత. 450

క. శ్రీకృష్ణునివిజయం బగు నీ కథఁ బఠియించువార లెప్పుడు జయముం
గైకొని యిహపరసౌఖ్యము లాకల్పోన్నతి వహింతు రవనీనాథా!' 451

క. అని చెప్పిన శుకయోగికి జననాయకుఁ డనియెఁ 'గృష్ణచరితము విన నా
మన మెపుడుఁ [3]దనియ దింకను విన వలతుం గరుణఁ జెప్పవే మునినాథా!' 452

వ. అనిన బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 453

## —: నృగమహారాజు చరిత్రము :—

సీ. ధరణీశ! యొకనాఁడు హరితనూజలు [4]రతీశ్వరసాంబగదచారుచారుభాను
లాదిగా యదుకుమారావలి యుద్యానవనమున కతివైభవమున నేఁగి

1. ఉషాకాంతుఁడు-అనిరుద్ధుఁడు, 2. చేసన్నలు-చేతిసైఁగలు. 3. తనియదు-తృప్తినిపొందదు, 4. రతీశ్వరుఁడు-ప్రద్యుమ్నుఁడు.

వల నొప్ప నిచ్చానువర్తులై సుఖలీలఁ జరియించి ఘనపిపాసలను జెంది
[1]నెఱి దప్పి సలిల మన్వేషించుచును వేగ వచ్చుచో నొకచోట వారిరహిత

తే. కూపమును నందులో నొకకొండవోలె విపుల మగుమేని యూసరవెల్లిఁగాంచి
చిత్తముల విస్మయం బంది తత్తఱమున దాని వెడలించువేడుక దగులుటయును 454

చ. పరువిడి పోయి తెచ్చి ఘనపాశచయంబుల నంటఁగట్టి య
గ్గురుభుజు లందఱుం గదిసి కోయని యార్చుచు దాని నెమ్మెయిం
దరలఁగఁ దీయ లేక [2]దగ దట్టముగా మది దుట్టగిల్ల నొం
డొరుఁ గడవంగ వేచని పయోరుహనాభున కంతఁ జెప్పినన్. 455

ఉ. విని సరసీరుహాక్షుఁ డతివిస్మితుఁడై జలశూన్యకూప మ
ల్లన కదియంగ నేఁగి [3]కృకలాసము నొక్క-తృణంబుఁబోలె గొ
బ్బున వెడలించె వామకరపద్మమున న్నది యంతలోనఁ గాం
చనరుచి మేనఁ గల్గు పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్. 456

వ. చూచి కృష్ణుం డతని వృత్తాంతం బంతయు నెఱింగియు నక్కడిజనంబులుం గుమారవర్గం
బును దెలియుకొఱకు నతనిచేతఁ దద్వృత్తాంతం బంతయు నెఱిఁగించువాఁడై యిట్లనియె. 457

చ. కనదురురత్నభూషణనికాయుఁడవై మహనీయమూర్తివై
యనుపమకీర్తిశోభితుఁడవై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం
పొనరిన నీకు నేమిగతి [4]నూసరవెల్లితనంబు చొప్పడెన్
విన నిది చోద్య మయ్యె సువివేక చరిత్ర; యెఱుంగఁ జెప్పుమా!' 458

క. అని యడిగిన మురరిపుపదవనజంబులఁ దనకిరీటవరమణు లొరయన్
వినయమున మ్రొక్కి యిట్లను ఘనమోదముతోడ నిటలఘటితాంజలి యై.' 459

తే. విశ్వసంవేద్య! మహిత యీవిశ్వమందుఁ బ్రకటముగ నీ వెఱుంగని దొకటి గలదె
యైన నాచేత విన నిష్టమయ్యె నేని నవధరింపుము వినిపింతు నంబుజాక్ష! 460

శా. ఏ నిక్ష్వాకుతనూజుఁడన్ నృగుఁడు నా [5]నేపారు భూపాలుఁడన్
దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరిత్రీనాయకుల్ గొల్చి స
మ్మానింపం జతురంతభూభరణసామర్థ్యుండనై సంతత
శ్రీ నిండారినవాఁడ నుల్లసితకీర్తిస్ఫూర్తి శోభిల్లఁగన్. 461

చ. పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతక మందు ర టుండెఁ [6]దారకా
వలి సికతావ్రజంబు హిమవారికణంబులు లెక్కవెట్టఁగా

1. నెఱి-సామర్థ్యము, 2. దగ-దప్పి, 3. కృకలాసము-తొండ, 4. ఊసరవెల్లి తనంబు-తొండయగుట, 5. ఏపారు-విలసిల్లు, 6. తారకావలి-చుక్కలగుంపు.

నలవడుఁ గాని యేను వసుధామరకోటికి దాన మిచ్చు గో
వుల గణుతింప ధాతయును నోపఁడు మాధవ! యేమి సెప్పుదున్? 462

వ. అదియునుంగాక. 463

చ. పొలుచు వివర్ణశృంగఖురముల్ దనరం దొలుచూలు లై సువ
త్సలు గల పాఁడియావుల నుదాత్తతపో వ్రతవేదపాఠముల్
గలిగి కుటుంబులై విహితకర్మములం జరియించువేదవి
ప్రులకు సదక్షిణంబుగ విభూతి దలిర్పఁగ నిత్తు నచ్యుతా! 464

వ. మఱియు న్యాయసముపార్జితవిత్తమ్ముల గోభూహిరణ్యరత్ననివాస హస్తివాజివాజికన్యా సరస్వతీవస్త్రతిలకాంచనరజతశయ్యాబహువిధదానంబు లనూనంబులుగా ననేకంబులు సేసితిఁ [1]పంచమహాయజ్ఞంబు లొనరించితి; వాపీకూప తటాకవననిర్మాణంబులు సేయించితి; నివ్విధంబునం జేయుచో నొక్కనాఁడు. 465

క. అనఘా! [2]మునుపడఁ గశ్యపుఁ డను విప్రున కే నకల్మషాత్ముఁడనై యి
చ్చిన గోవు దప్పి నామందను గలసినఁ దెలియక తగ నా గోవున్. 466

క. ఒండొకభూమీసురకులమండనునకు దాన మీయ మసలక యా వి
ప్రుండా గోవుం గొని చను చుండన్ మును [3]ధారగొన్న యుర్వీసురుఁడున్. 467

క. మది రోష మొదవ దోవతి వదలిన బిగియించికొనుచు వడిఁ గది 'సిది నా
మొదవు నడివీథి దొంగిలి వదలక కొనిపోయె దిట్టివారుం గలరే?' 468

చ. అనవుడు నాతఁ డిట్లనియె నాతనితో 'నిపు డేను దీని నీ
జనపతిచేత ధారగొని సాధుగతిం జన నీది యంట యె?'
ట్లనిన నతండు 'నేనును ధరాధిపుచే మును ధారగొన్న యా'
వని వినిపింప నిద్దఱకు నయ్యె నపారవివాద మచ్చటన్. 469

వ. ఇట్లు విప్రు లిద్దఱుం దమలో నంతకంతకు [4]మచ్చరంబు పెచ్చుపెరిఁగి కలహించి నా యున్నయెడకుం జనుదెంచిరి; మున్ను నా చేత గోదానంబు గొన్న బ్రాహ్మణుం డిట్లనియె.

సీ. 'మనుజేంద్ర! ప్రజ లధర్మప్రవర్తనముల నడవకుండఁగ నాజ్ఞ నడపు నీవు
మనమున నే ధర్మ మని యాచరించితి? మును నాకు నిచ్చిన మొదవు దప్పి
వచ్చి నీ మందలోఁ జొచ్చిన నిప్పు డీ భూసురునకు ధార వోసి యిచ్చి
తగవు మాలితివి దాతవు నపహర్తవు నైన నిన్నేమందు? నవనినాథ!

1. పంచమహాయజ్ఞంబులు - దేవ, పితృ, మనుష్య, భూత, ఋషి:యజ్ఞములు, 2. మునుపడ-ముందుగా, 3. ధారగొన్న-దానముగా గ్రహించిన, 4. మచ్చరంబు-అసూయ.

తే. యనిన మాటలు సెవులు సోఁకినఁ గలంగి 'భూసురోత్తమ! యజ్ఞానపూర్వకముగ
నిట్టిపాపంబు దొరసె నే నెఱిఁగి సేయఁ గొనుము నీ కిత్తు నొకలక్ష గోధనంబు.' 471

క. అని మఱియును నవ్విప్రుని సునయోక్తుల ననునయించుచును నిట్లంటిన్
'ననుఁ గావు నరకకూపంబునఁ బడఁగా జాలఁ బురుషపుంగవ!' యనుచున్. 472

తే. ఎంత వేఁడిన మచ్చరం బంత పెరిఁగి 'మొదల నాకిచ్చినట్టి యీ [1]మొదవెకాని
యెనయ నీ రాజ్య మంతయు నిచ్చితేని నొల్ల' నని విప్రుఁ డచ్చట నుండ కరిగె. 473

వ. అట్లతం డరిగిన నా రెండవబ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును జలంబు డిపంక [2]పదివే
లేఱి కోరిక పాఁడిమొదవుల నిచ్చిన నైనను 'దీనిన కాని యొల్ల'నని నిలువక చనియె;
నంతఁ గాలపరిపక్వంబైన నన్ను దండధరకింకరులు గొనిపోయి [3]వైవస్వతుముందటం
బెట్టిన నతండు నన్ను నుద్దేశించి యిట్లనియె. 474

మ. 'మనుజేంద్రోత్తమ! వంశపావన! జగన్మాన్యక్రియాచార! నీ
ఘనదానక్రతుధర్మముల్ త్రిభువనఖ్యాతంబులై చెల్లెడిన్
మును దుష్కర్మఫలంబు నొంది పిదపం బుణ్యానుబంధంబులై
చను సౌఖ్యంబులఁ బొందు పద్మజునియాజ్ఞం ద్రోవఁగా వచ్చునే?' 475

వ. అని వేగంబున [4]ద్రొబ్బించిన నేను బుడమిం బడునపుడ యీ నికృష్టంబయిన యూసర
వెల్లిరూపంబుఁ గైకొంటి; నింతకాలంబు తద్దోషనిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ
బ్రాణులకుఁ బుణ్యపాపంబు లనుభావ్యంబులుగాని, యూరక పోనేరవు; నేఁడు సమస్త
దురితనిస్తారకంబయిన భవదీయ పాదారవిందసందర్శనంబునంజేసి యీ ఘోరదుర్దశలం
బాసి నిర్మలాత్మకుండ నైతినని పునఃప్రణామంబు లాచరించి మఱియు నిట్లనియె. 476

ఆ. 'కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ! యప్రమేయ! వరద! హరి! ముకుంద!
నిన్నుఁ జూడఁ గంటి నీకృపఁ గనుఁగొంటి నఖిలసౌఖ్యపదవు లందఁ గంటి.' 477

వ. అని యనేకభంగులం గొనియాడి గోవిందుని పాదారవిందంబులు దన కిరీటంబు సోఁకం
బ్రణమిల్లి 'దేవా! భవదీయపాదారవిందంబులు నా హృదయారవిందబునం బాయకుండు
నట్లుగాఁ బ్రసాదింపవే?' యని తదనుజ్ఞాతుండై యచ్చటి జనంబులు సూచి యద్భుతా
నందంబులం బొంద నతుల తేజోవిరాజితదివ్య విమానారూఢుండై దివంబున కరిగె; నంత
నమ్మాధవుండు నచ్చట నున్న పార్థివోత్తములకు ధర్మబోధంబుగా నిట్లనియె. 478

సీ. నరనాథకుల కాననము దహించుటకును నవనీసురుల విత్త మగ్నికీల;
జననాయకుల నిజైశ్వర్యాబ్ధి నింకింప బ్రాహ్మణక్షేత్రంబు [5]బాడబంబు;

---

1. మొదవు-ఆవు, 2. పదివేల నెరుకొంటి పాఁడిమొదవుల— పాఠాంతరము,
3. వైవస్వతుఁడు-యముఁడు, 4. ద్రొబ్బించిన-త్రోయింపఁగా, 5. బాడబంబు-బడబాగ్ని.

పార్థివోత్తముల సంపచ్ఛైలములఁ గూల్ప భూసురధనము దంభోళిధార;
జగతీవరుల కీర్తి చంద్రిక మాప విప్రోత్తము ధనము సూర్యోదయంబు;
తే. విప్రతతి సొమ్ము కంటెను విషము మేలు గరళమునకును [1]ప్రతికృతి గలదు గాని
దాని మాన్పంగ భువి నౌషధములు లేవు గాన [2]బ్రహ్మస్వములు గొంట గాదు పతికి. 479

క. ఎఱుఁగమినైనను, భూసురవరుల ధనం బపహరింప వలవదు పతికిన్
మఱుపున ననలము ముట్టిన దరికొని వెసఁ గాల్పకున్నె తను వెరియంగన్? 480

వ. మఱియు దన ధనంబు పరులచేతఁ [3]గోల్పడిన విప్రుండు దుఃఖమున రోదనంబు సేయ రాలిన యశ్రుకణంబుల నవని రేణువు లెన్ని తడియు నన్ని వేలేండ్లు తదుపేక్షాపరుండైన పతి దారుణ వేదనలు గల కుంభీపాక నరకంబులం బొందు; మఱియు నతనితోడఁ గ్రిందటఁ బది తరంబుల వారును, ముందటఁ బది తరంబుల వారును మహానరక వేదనలం బొందుదురు. స్వదత్తంబైనఁ బరదత్తంబైన నర్థలోభంబునంజేసి దుశ్శీలుండై బ్రాహ్మణ క్షేత్ర సంభూత ధాన్యధనాదికంబు భుజించు నప్పాపాత్ముం డఱువది వేల సంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబున వర్తించు; న ట్లగుట యెఱింగి విప్రు డెంతదప్పు చేసిన, నెన్ని గొట్టిన, నెన్ని దిట్టిన, నతని కెదురు పలుకక వినయంబున వందనం బాచరించు పుణ్యాత్ములు నాదు పాలింటివా; రదియునుం గాక యేనును బ్రతి దినంబును భూసురుల నతి వినయంబునఁ బూజింతు; నిట్లు సేయక విపరీత వర్తనులైన [4]తామసుల నేను వెదకి దండింతు; నది గావున మీరలు బ్రాహ్మణ జనంబుల వలనం బరమ భక్తి గలిగి మెలంగుం డని యాన తిచ్చి యాదవ ప్రకరంబులు సేవింప నఖిలలోక శరణ్యుండైన యప్పుండరీకాక్షుండు నిజ నివాసంబునకుం జనియె' నని చెప్పి శుకుం డి ట్లనియె.

క. ఈ కథఁ జదివినవారలుఁ గైకొని వినువారు విగత కలుషాత్మకులై
లౌకిక సౌఖ్యము నొందుదు రా [5]కైవల్యంబుఁ [6]గరతలామలకమగున్. 482

—బలరాముండు సుహృద్బంధుజనదర్శనార్థమై వ్రేపల్లెకుఁబోవుట—

సీ. నరనాథ! విను మొకనాఁడు [7]తాలాంకుండు చుట్టాల బంధులఁ జూచువేడ్క-
సుందర కాంచన స్యందనారూఢుఁడై భాసిల్లుచున్న వ్రేపల్లె కరిగి
చిరకాల సంగత స్నేహులై గోపగోపాంగనానికర మాలింగనములు
సముచిత సత్కృతుల్ సలుపఁ గైకొని మహోత్సుకలీల నందయశోదలకును

---

1. ప్రతికృతి-ప్రతీకారము-తిరుగు, 2. బ్రహ్మస్వములు-బ్రాహ్మణ ధనములు.
3. కోల్పడు-పోఁగొట్టుకొనునట్లు చేయఁబడు, 4. తామసులు-అహంకారము కలవారు,
5. కైవల్యంబు-మోక్షము, 6. కరతలామలకము-అఱచేతిలోని యుసిరికకాయ-స్పష్టము,
7. తాలాంకుండు-బలరాముఁడు.

తే. వందనం బాచరించిన, వారు మోద మంది బిగియారఁ గౌగిళ్ల నొందఁ జేర్చి
సమత దీవించి యంకపీఠమునఁ జేర్చి శిరము మూర్కొని [1]చుబుకంబుఁ గరము పుణికి

వ. మఱియు నానంద బాష్పధారాసిక్త కపోలయుగళంబులతోడం గుశల ప్రశ్నంబుగా ని ట్లని 'రన్నా! నీవును నీ చిన్నతమ్ముండగు వెన్నుండును లెస్సయున్నవారె? మమ్మెప్పుడు నరసి రక్షింపవలయు; మాకు నేడు గడయు మీర కాక యొరులు గలరే?' యని సముచిత సంభాషణంబులం బ్రొద్దు పుచ్చుచుండు నంత. 484

క. గోపాలవరులు ప్రమదం [2]బాపోవని మది నివర్తితాఖిల గేహ
వ్యాపారు లగుచు హలధరు శ్రీపాదంబులకు నతులు సేసిరి వరుసన్. 485

క. సీరియు వారికిఁ గరుణోదారుండై నడపె సముచిత క్రియ లంతం
గోరి తనయిాడు గోపకుమారులఁ జేఁ జఱచి బలుఁడు మందస్మితుఁడై. 486

క. నిజసుందర దేహద్యుతి రజతాచలరుచులఁ దెగడ రాముఁడు వారల్
భజియింప నేఁగి యొకచో విజనస్థలమున వసించి విలసిల్లునెడన్. 487

కవిరాజవిరాజితము. చరణములం గనక స్ఫుటనూపురజాలము గల్లనుచుం జెలఁగం
గరములఁ గంకణముల్ మొరయన్ నళికా నసియాడఁ గుచాగ్రములన్
సరులు నటింపఁ గురుల్ గునియన్ విలసన్మణికుండల కాంతులు వి
స్ఫురితకపోలములన్ బెరయన్ వ్రజసుందరు లంద అమందగతిన్. 488

కవిరాజవిరాజితము. చని బలభద్రుని శౌర్య సముద్రుని సంచిత పుణ్యు నగణ్యునిఁ జం
దన ఘనసార పటీర తుషార సుధారుచికాయు విధేయు [3]సుధా
శనరిపుఖండను సన్మణిమండను సారవివేకు నశోకు మహా
త్మునిఁ గని గోపిక లోపిక లేక యదుప్రభు ని ట్లని రుత్కలికన్. 489

చ. 'హలధర! నీ సహోదరుఁ డుదంచితకంజవిలోచనుండు స
ల్లలితపురాంగనా జనవిలాసవిహారసమగ్ర సౌఖ్యముల్
గలిగి సుఖించునే? మము నొకానొక వేళనయేని బుద్ధిలోఁ
దలఁచునొ? నూతన ప్రియలఁ దార్కొని యేమియుఁ బల్కకుండునో? 490

క. జననీ జనకుల ననుజుల దనుజుల బంధువుల మిత్రతతుల విడిచె నె
మ్మనమున నొకడు దలంపక తను నమ్మినవారి విడువఁదగునే హరికిన్? 491

సీ. సలలిత యామునసైకత స్థలముల నుండి మమ్మే మని యూఱడించె
విమల బృందావనవీథి మా చుబుకముల్ పుడుకుచు నే మని బుజ్జగించెఁ

1. చుబుకము-గడ్డము, 2. ఆపోవని-తృప్తితీఱని 3. సుధాశనరిపులు-రాక్షసులు.

బుష్పవాటికలలోఁ బొలుచు మా కుచయుగ్మ మంటుచు నే మని యాదరించెఁ
గాసారముల బొంతఁ గౌఁగిట మముఁ జేర్చి నయ మొప్ప నే మని నమ్మఁ బలికె

తే. నన్నియు మఱచెఁగ (బోలు వెన్నుఁడాత్మఁ గోరి తాఁ జాయఁగానైన వారి విడుచు
నట్టి కృష్ణుఁడు దము నట్టు వెట్టు ననక యేల నమ్మిరి పురసతుల్ బేల లగుచు' 492

మ. అని యిబ్బంగి సరోజలోచనుని [1]నర్మాలాపముల్ నవ్వులు
న్నను బంధుల్ పరిరంభణంబులు రతి వ్యాసంగముల్ భావముల్
వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యువ్వీఖ్యారు చిత్తంబులన్
జనితానంగశరాగ్ని చేత దురవస్థం బొంది శోకించినన్. 493

వ. అంత బలభద్రుండు వారల మనంబుల్ల సంతాపంబులు వాయ నుపాయంబు లగు సరస చతుర వచనంబులఁ గృష్ణుని సందేశంబులు నెప్పి [2]విగతఖేదలఁ జేసి యచ్చట మాసద్వయంబు నిలిచి వసంతవాసరంబులు గడుపుచుఁ గాళిందీ తీరంబున. 494

సీ. మాకంద జంబీర మందార ఖర్జూర ఘనసారశోభితవనములందు
నేలాలతాలోలమాలతీమల్లికావల్లీమతల్లికావాటికలను
దరళతరంగశీకర సాధుశీతలసైకతవేదికా స్థలములందు
మకరందరసపానమదవ దిందిందిరపుంజ రంజితమంజుకుంజములను
తే. విమలరుచి గల్గు సానుదేశములయందు లలితశశికాంతఘనశిలాతలములందు
లీల నిచ్ఛావిహారవిలోలుఁ డగుచు సుందరీజనములు గొల్వఁ జూడనొప్పె. 495

తే. అట్లు విహరింప వరుణుని యాజ్ఞఁ జేసి వారుణీదేవి మద్యభావంబు నొంది
నిఖిల [3]తరుకోటరములందు నిర్గమించి మించువాసనచేత వాసించె వనము. 496

వ. అట్టియెడ. 497

మ. కర మొప్పారు నవీనవాసనల [4]నాఘ్రాణించి గోపాలసుం
దరులుం దానును డాయ నేఁగి యతిమోదం బొప్ప సేవించి యా
తరళాక్షుల్ మణిహేమకంకణఝుణత్కారానుకారంబులై
కరతాళంబులు మ్రోయఁ బాడుచును వేడ్క న్నాడుచున్ సోలుచున్. 498

సీ. తనమీఁది బిరుదాంకితములైన గీతముల్ పాడుచు రా బలభద్రుఁ డంత
మహిత [5]కాదంబరీమధుపానమదవిహ్వలాక్షుండు లలితనీలాలకుండు

---

1. నర్మాలాపముల్-ఛలోక్తులు, 2. విగతఖేదలు-దుఃఖములేనివారు, 3. తరుకోటరములు-చెట్టుతొఱ్ఱలు, 4. ఆఘ్రాణించి-వాసనచూచి, 5. కాదంబరి-మద్యము, .

నాలోలనవపుష్పమాలికోరస్స్థలుఁ డనుపమమణికుండలాంచితుండు
[1]ప్రాలేయసంయుక్త పద్మంబుగతి నొప్పు సలలితాననఘర్మజలకణుండు
తే. నగుచు వనమధ్యమున సలిలావగాహ శీలుఁడై జలకేళికిఁ జేరి యమున
నిందు రమ్మని పిలువఁ గాళింది యతని మత్తుఁడని [2]సడ్డసేయక మసలుటయును. 499

చ. ఘనకుపితాత్ముఁడై యమునఁ గన్గొని రాముఁడు వల్కెఁ 'డాయఁ జీ
రినఁ జనుదేక తక్కితి పురే! నిను నిందఱుఁ జూడ మద్భుజా
సునిశితలాంగలాగ్రమున సొంపఱ నిప్పుడు నూఱు త్రోవలై
చన వెసఁ జించివైతు' నని చండపరాక్రమ మొప్ప నుగ్రుఁడై. 500

వ. అట్లు కట్టలుక రాముం డుద్దామంబగు బాహుబలంబున హలంబు సాఁచి, య[3]మ్మహావాహి
నిం దగిల్చి పెకలి రాఁ దిగిచిన నన్నది భయభ్రాంతయై సుందరీ రూపంబు గైకొని యతి
రయంబునం జనుదెంచి యయ్యదువంశతిలకుండగు హలధరుని పాదారవిందంబులకు వంద
నం బాచరించి యి ట్లనియె. 501

మ. 'బలరామా! ఘనబాహా! నీ యతులశుంభద్విక్రమం బంగనల్
దెలియం జాలెడివారె యీ యఖిలధాత్రీభారధౌరేయని
శ్చలసత్త్వుండగు [4]కుండలీశ్వరుఁడునుం జర్చింపం నీ సత్కళా
కలితాంశ ప్రభవుండు; నీ గురుభుజా గర్వంబు సామాన్యమే?' 502

చ. అని వినుతించి 'యేను భవదంఘ్రి సరోజము లాశ్రయించెదన్
ననుఁ గరుణింపు' మన్న యదునందనుఁ డన్నదిఁ 'బూర్వమార్గవై
చను' మని కామినీనికరసంగతుఁడై జలకేళి సల్పె నిం
పెనయఁ గరేణుకాయుతమదేభముచాడ్పున నమ్మహానదిన్. 503

తే. అంత జలకేళి సాలించి సంతసంబు నందుచుండ వినీలవస్త్రాభిరత్న
మండనంబులుఁ గాంచనమాలికయును దెచ్చి హరి కిచ్చి చనె నా నదీలలామ 504

క. అవి యెల్లఁ దాల్చి హలధరుఁ డవిరళగతి నొప్పి వల్లవాంగనలును దా
దివిజేంద్రుఁ బోలి మహితోత్సవమున వర్తించుచుండె సౌఖ్యోన్నతుఁడై. 505

క. అవనీశ! యిట్లు హలమునఁ దివిచిన కాళింది [5]వ్రయ్య దెలుపై నేఁడున్
భువి నుతి కెక్కెను రాముని ప్రవిమలతరమైన బాహుబలసూచకమై, 506

వ. అంత బలభద్రుండు వ్రజసుందరీసమేతుండై నందఘోషంబునం బరితోషంబు నొందు
చుండె! నంత నక్కడఁ గరూశాధిపతి యైన పౌండ్రకుండు తనదూతం బిలిచి యిట్ల
నియె. 507

1. ప్రాలేయము-మంచు. 2. సడ్డసేయక—లక్ష్యముచేయక, 3. మహావాహిని-గొప్ప నది, 4. కుండలీశ్వరుఁడు-శేషుఁడు, 5. వ్రయ్య-చీలిక.

—:కృష్ణుండు పౌండ్రకవాసుదేవునిమీఁద దండెత్తిపోయి వానిఁ జంపుట:—

సీ, మనుజేశ ! బలగర్వమున మదోన్మత్తుఁడై 'యవనిపై వాసుదేవాఖ్యఁ దనగ
నే నొక్కరుఁడఁ గాక యితరుల కీనామ మలవడునే?' యని [1]యదటు మిగిలి
తెగి 'హరి దా వాసుదేవుఁడ ననుకొనునఁట ! పోయి వల' దను మనుచు దూత
బద్మాయతాక్షుని పాలికిఁ బొమ్మన్న నరిగి వాఁ డంబుజోదరుఁడు పెద్ద
తే. కొలువుఁ గైకొని యుండ సంకోచపడక 'వినుము మారాజుమాటగా వనజనాభ !
యవని రక్షింప వాసుదేవాఖ్య నొంది యట్టి యే నుండ సిగ్గు లేఁ దట్టి నీవు 508

క. నాపేరును నాచిహ్నము లేపున ధరియించి తిరిగె దిది పంతమె? యిం
తే పో! మదిఁ బరికించిన నే పంత మెఱుంగు గొల్లఁ దేమిట నైనన్? 509

ఆ ఇంతనుండి యైన నెదిరిఁ ద న్నెఱిఁగి నా చిన్నె లెల్ల విడిచి చేరి కొలిచి
బ్రదుకుమనుము కాక పంతంబు లాడెనా యెదురు మనుము ఘోర[2]కదనమునకు. 510

క. అను [3]దుర్భాషలు సభ్యులు విని యొండొరుల మొగము సూచి విస్మితు లగుచున్
'జనులార యెట్టి క్రొత్తలు వినఁబడియెడు నిచట? లెస్స వింటిరె?' యనఁగన్. 511

వ. అట్టియెడ కృష్ణుండు వాని కిట్లనియె. 512

మ.'వినరా! మీ నృపు డన్న చిహ్నములు నే వే వచ్చి ఘోరాజిలోఁ
దనమీఁదన్ వెస వైవఁ [4]గంకముఖగృధ్రవ్రాతముల్ మూఁగఁగా
ననిలో దర్పము దూలి కూలి వికలంబై [5]సారమేయాలికి
న్ననయంబున్ శరణంబ వయ్యె' దను మే నన్నట్లుగా వానితోన్. 513

క, అని యుద్రేకమునగా నాడిన మాటల కులికి వాఁడు డెందము గలఁగం
జని దన యేలిక కంతయు వినిపించెను నతనిమదికి విరసము గదురన్. 514

వ. అంత గృష్ణుండు దండయాత్రోత్సుకుఁడై వివిధాయుధకలితంబును విచిత్రకాంచనపతాక కేతువిలసితంబును నగు సుందరస్యందనంబుఁ బటుజవతురంగంబులఁ బూన్చి దారుకుండు దెచ్చిన నెక్కి, యతిత్వరితగతిం గాశికానగరంబున కరిగినం బౌండ్రకుండును రణోత్సాహంబు దీపింప నక్షౌహిణీద్వితయంబుతోడం బురంబు వెడలె: నప్పు డతనిమిత్రుండైన కాశీపతియును మూఁడక్షౌహిణులతోడం దోఁడుపడువాడై వెడలె; ని ట్లాప్తయుతుండై వచ్చువాని. 515

---

1. అదటు-పొగరు, 2. కదనము-యుద్ధము, 3. దుర్భాషలు-చెడ్డమాటలు,
4. కంకము-రాబందవు, 5. సారమేయాలి-కుక్కలగుంపు.

సీ. చక్రగదాశంఖశార్ఙ్గాదిసాధనుఁ గృత్రిమగౌస్తుభశ్రీవిలాసు
మకరకుండలహారమంజీరకంకణమణిముద్రికావనమాలికాంకుఁ
దరళవిచిత్రపతంగపుంగవకేతుఁ జెలువొందు పీతకౌశేయవాసు
[1]జవనాశ్వకలిత కాంచనరథారూఢుని రణకుతూహలు లసన్మణికిరీటు
తే. నాత్మసమవేష రంగవిహారకలిత నటసమానునిఁ బౌండ్రభూనాథుఁ గాంచి
హర్ష మిగురొత్త నవ్వె పద్మాయతాక్షుఁ డంత వాదును సుద్వృత్తుఁ డగుచు నదరి. 516

క. పరిఘశరాసనపట్టిస శరముద్గరముసలకుంతచక్రగదాతో
మరభిందిపాలశక్తి క్షురికాసిప్రాసపరశుశూలముల వెసన్. 517

చ. [2]పరువడి వైచినన్ దనుజభంజనుఁ డంత యుగాంత కాలభీ
కరమహితోగ్రపావకునికైవడి [3]నేచి విరోధిసాధనో
త్కరముల నొక్కటన్ శరనికాయములన్ నిగిడించి త్రుంచి భా
స్వరగతి నొత్తె సంచలితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్. 518

ఉ. వారని యల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్యముల్
మారిమసంగినట్లు నుఱుమాడినఁ బీనుఁగుఁబెంటలై వెసం
దేరులు వ్రాలె నశ్వములు ద్రెళ్ళె గజంబులు మ్రొగ్గె సద్భటుల్
ధారుణిఁ గూలి రిట్లు [4]నెఱి దప్పి చనెన్ హతశేషసైన్యముల్. 519

వ. అట్టియెడ రుధిర ప్రవాహంబులును, మేదోమాంసపంకంబునునై సంగరాంగణంబు ఘోర భంగి యయ్యె; నయ్యవసరంబునం గయ్యంబునకుఁ గాలు ద్రవ్వు నప్పౌండ్రకునిం గనుంగొని హరి సంబోధించి యిట్లనియె. 520

మ. 'మనుజేంద్రాధమ! పౌండ్రభూపసుత! నీ మానంబు బీరంబు నేఁ
డనిలో మాపుదు నెద్దు గ్రొవ్వి పెలుచ న్నాఁబోతుపై నంకె వై
చిన చందంబున దూతచేత నను నాక్షేపించి వద్దన్న పే
రును జిహ్నంబులు నీపయిన్ విడుతు నర్చుల్ పర్వ నేఁ డాజిలోన్. 521

క. అది గాక నీదుశరణము పదపడి యేఁ జొత్తు నీవు జలవిక్రమసం
పద గల [5]పోటరి వేనిం గదలక నిలు' మనుచు నిశితాకాండము లంతన్. 522

మ. చల మొప్పన్ నిగిడించి వానిరథముం జక్కాడి తత్సారథిం
దల వే త్రుంచి హయంబులన్ నఱికి యుద్దండప్రతాపక్రియం

1. జవనాశ్వకలితము-వేగవంతములగు గుఱ్ఱములతోఁ గూడినది, 2 పరువడి-మిగుల వేగముగా. 3. ఏచి-విజృంభించి, 4. నెఱి దప్పి-పరాక్రమము తప్పి, 5. పోటరి-వీరుఁడు,

ప్రళయార్కప్రతిమాన చక్రమున నప్పౌండ్రుడున్ వెసం ద్రుంప వా
డిలం గూలెం [1]కులిశాహతి న్నొరగు శైలేంద్రాకృతిన్ భూవరా! 523

చ. మడవక కాశికావిభుని మస్తక ముద్ధతిం ద్రుంచి బంతికై
వడి నది పింజ పింజ గఱవన్ విశిఖాళి నిగిడ్చి వానియే
లెడిపురిలోన వైచె నవలీల మురాంతకుం డిట్లు వైరులం
గడంగి జయించి చిత్తమునం గౌతుకముం జిగురొత్త నత్తఱిన్. 524

క. సురగంధర్వనభశ్చరగరుడోరగసిద్ధసాధ్యగణము నుతింపన్
మరలి చనుదెంచి హరి నిజపురమున సుఖముండె [2]నతివిభూతి దలిర్పన్. 525

క. వనజోదరుచిహ్నంబులు [3]గొనకొని ధరియించి పౌండ్రకుండు [4]మచ్చరియై
యనవరతము హరి దన తలపున గలుగుటం జేసి ముక్తిం బొందె నరేంద్రా! 526

సీ. అక్కడం గాశిలో నా రాజు మందిరాంగణమునం గుండలకలిత మగుచుం
బడి యున్న తలం జూచి పౌరజనంబులు దమరాజుతలయ కాం దగ నెఱింగి
చెప్పిన నా నృపుజీవితేశ్వరులును సుతులు బంధువులును హితులు గూడి
మొనసి హాహాకారముల నేడ్చి రత్తఱిం దత్తనూభవుండు సుదక్షిణుండు
తే. వెలయం దండ్రికిం బరలోకవిధు లొనర్చి జనకు ననిలో వధించిన చక్రపాణి
నదరి మర్దింపందగు నుపాయంబు దలంచి చతురుండగునట్టి తన పురోహితునిం బిలిచి. 527

క. అతండుం దానును జని పశుపతిపదసరసిజములకును బ్రమదముతో నా
నతుండై యద్దేవుని బహుగతులం బూజింప నతండు కరుణాన్వితుండై. 528

క. 'మెచ్చితి నే వర మైనను నిచ్చెద నను వేండు' మనిన 'నీశ్వర! నిన్నున్
[5]నచ్చిన రక్షింతువు పౌర పొచ్చెము సేయక మహేశ! పురహర! యభవా! 529

క. దేవా! మజ్జనకుని వసుదేవాత్మజుం డాజిలో వధించెను నే నా
గోవిందుని ననిలోపల నే విధమున గెలుతు నానతీవె పురారీ!' 530

తే. అనిన శంకరుం డతనికి ననియె 'ననఘ! నీవు ఋత్విజులును భూసురావళియును
బ్రీతి [6]నభిచార మొనరింప భూతయుక్తుం డగుచు ననలుండుదీర్చు నీయభిమతంబు.' 531

తే. అనిన నా చంద్రమౌళివాక్యములభంగి భూరినియమముతో నభిచారహోమ
మొనరం గావింప నగ్ని యథోచితముగం జెలంగి [7]దక్షిణవలమానశిఖల వెలింగె. 532

---

1. కులిశము-వజ్రాయుధము, 2. అతివిభూతి-గొప్ప యైశ్వర్యము, 3. కొనకొని - పూనికవహించి, 4. మచ్చరి - అసూయాపరుండు, 5 నచ్చిన-నమ్మినయెడల, 6. అభిచారము-క్షుద్రహోమము, 7. దక్షిణవలమానశిఖలు-దక్షిణమువైపు తిరుగుచున్న జ్వాలలు,

వ. అందుఁ దామ్రశ్మశ్రుకేశకలాపంబులును, నళనిసంకాశంబులైన నిడుకోఱలును, నిప్పులుప్పతిల్లు చూడ్కులును, ముడివడిన బొమలును, జేవుఱించిన మొగంబును గలిగి కృత్యయతిరౌద్రాకారంబునఁ బ్రజ్వరిల్లుచుఁ గుండంబు వెలువడి యనుదిననిహన్యమానప్రాణిరక్తారుణమృత్యుకరవాలంబులీలం జూపట్టు నాలుకను సెలవుల నాకికొనుచు, నగ్నికీలాభీలంబగు శూలంబు గేలం దాల్చి, భువనకోలాహలంబుగా నార్చుచు, నుత్తాలతాలప్రమాణపాదద్వయహతులం దూలు [1]పెందూళి నింగిముంగ, భూతంబులు సేవింప, నగ్నవేషయై నిజవిలోచనసంజాత సముద్ధూత నిఖిల భయంకరజ్వాలికా జాలంబున దిశాజాలంబు నోలిం బ్రేల్చుచు, నుద్వేగగమనంబున నగధరు నగరంబున కరుగుదేరఁ, బౌరజనంబులు భయాకులమానసులై దావదహనునిం గని పఱచు వనమృగంబులచాడ్పునం బఱచి, సుధర్మాభ్యంతరంబున జూదంబాడు దామోదరునిం గని 'రక్షర'క్షేతిరవంబుల నార్తులయి 'కృష్ణ కృష్ణ! పెనుమంటలం బురంబు గాల్పం బ్రళయాగ్ని సనుదెంచె' నన వారిం జూచి 'యోడకోడకు' డని భయంబు నివారించి, సర్వరక్షకుండైన పుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునఁ దద్వృత్తాంతం బంతయుఁ దన దివ్యచిత్తంబున నెఱింగి కాశీరాజపుత్రప్రేరితయైన యమ్మహాకృత్యను నిగ్రహింపం దలంచి నిజపార్శ్వవర్తియై యున్న య[2] ద్దివ్యసాధనంబు గనుంగొని యప్పుడు. 533

సీ. భీమమై బహుతీవ్రధామమై హతరిపుస్తోమమై సుమహితోద్దామ మగుచుఁ
జండమై విజితమార్తాండమై పాలితాజాండమై విజయప్రకాండ మగుచు
దివ్యమై నిఖిలగంతవ్యమై సుజనసంభావ్యమై సద్భక్తసేవ్య మగుచు
నిత్యమై నిగమసంస్తుత్యమై వినమితాదిత్యమై నిర్జితదైత్య మగుచు
తే. విలయసమయసముద్భూతవిపులభాస్వ [3]దళికలోచనలోచనానలసహస్ర
ఘటితపటుపటాజ్వాలికాజటిలసర్వ భయదచక్రంబు కృత్యపైఁ బంపె శౌరి. 534

వ. అదియును బ్రళయవేళాసంభూతజీమూతసంఘాతప్రభూత ఘుమఘుమాటోప నినదాధరీకృత మహాదుస్సహ కహకహ నిబిడనిస్వన నిర్ఘోషపరిపూరిత బ్రహ్మాండకుహరంబును, [4]నభ్రంలిహకీలా సముత్కటపటు చిటచిట స్ఫుటస్ఫుట [5]ద్విస్ఫులింగ విసరంబును, సకలదేవతాగణజయజయశబ్దకలితంబును, ననంతతేజోవిరాజితంబును నగుచుం గదిసినం బంటింపక కంటగించు కృత్యను గెంటి వెంట నంటిన నది తనతోంటి రౌద్రంబు విడిచి మగిడి కాశీపురంబు సొచ్చి పౌరలోకంబు భయాకులతం బొంది వాపోవ, రోషభీషణాకారంబుతో నప్పుడు ఋత్విజ్నికాయయుతంబుగా సుదక్షిణుని దహించె, నత్తఱిఁ జక్రంబును దన్నగరంబు సౌధప్రాకారగోపురాట్టాలకాదివివిధవస్తువాహన నికరంబుతో భస్మంబు గావించి మరలి యమరులు వెఱఁగందఁ గమలలోచన పార్శ్వవర్తియై నిజప్రభాపుంజంబు వెలుఁగొందఁ గొల్చి యుండె నని చెప్పి మఱియు ని ట్లనియె. 535

1. పెందూళి-పెద్దదుమ్ము, 2. దివ్యసాధనంబు-చక్రాయుధము, 3. అళికలోచనుఁడు-శివుఁడు, 4. అభ్రంలిహ-ఆకాశమునంటుచున్న, 5. విస్ఫులింగము-అగ్నికణము,

క. మురరిపునిజయాంకితమగు చరితము సద్భక్తిఁ దగిలి చదివిన వినినన్
[1]దురితములఁ బాసి జను లిహపరసౌఖ్యము లతనిచేతఁ బడయుదు రధిపా! 536

వ. అనిన శుకయోగికి రాజయోగి యిట్లనియె. 537

—: బలరాముండు ద్వివిదుడను వానరుని సంహరించుట :—

క. 'బలభద్రుఁ డప్రమేయుం డలఘుఁ డనంతుండు నతనియద్భుతకర్మం
బులు వినియు, దనియ దింకను దెలియఁగ నా కానతిమ్ము దివ్యమునీంద్రా!' 538

వ. అనిన రాజునకు శుకుం డిట్లనియె. 539

క. 'జననాయక! విను సుగ్రీవునిసచివుఁడు మైందునకు సహోదరుఁ డనఁగా
వినుతికి నెక్కిన ద్వివిదుం డను [2]ప్లవగుఁడు నరకసఖుఁ డతిదర్పితుఁడై. 540

సీ. చెలికానిపగఁ దీర్పఁ దలంచి కృష్ణుం దేలు పురములు [3]జనపదంబులు దహించి
సరదుపవనసరోవరములు [4]గోరాడి మందలఁ గొందలమందఁ జేసి
ప్రాసాదములు ద్రొబ్బి పరిఖలు [5]మాయించి చతురంగబలముల సమయఁ జేసి
పురుషుల సతులను భూధరగుహలలోఁ బెట్టి వాకిలి గట్టి బిట్టు నొంచె
తే. ఫలితతరువులఁ ద్రుంచి సాధుల నలంచి కోట లగలించి పడుచుల నీట ముంచి
ధరణి నిబ్బంగిఁ బెక్కుబాధలఁ జలంబు పరఁగఁజేయుచు నొకనాఁడు ప్లవగవరుఁడు. 541

క. చతురమృదుగీతరవ మున్నతి వీతెంచినఁ జెలంగి నగచరుఁ డా రై
వతగిరి [6]కందరమున కాయతగతిఁ జని యందు నెత్తమాడెడువానిన్. 542

చ. లలితవినీలవస్త్రుని విలాసవతీయుతుఁ జంద్రచంద్రికా
కలితమహోన్నతాంగు మణికాంచనదివ్యవిభూషణోన్నతున్
విలసితవారుణీసమదవిహ్వలలోచనుఁ గాంచె సీరని
ర్దళితరిపుక్షితీశనిజధాముని రాముని గామపాలునిన్. 543

సీ. కనుఁగొని తత్పురోగమభూమిరుహశాఖ లెక్కియూఁచుచుఁ జాల వెక్కిరించుఁ
[7]గికురించుచును బండ్లిగిల్చి చూపుచు వెసఁ గొమ్మకొమ్మకు నుఱుకుచు నదల్చుఁ
దోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు వెడవెడ నాలుక వెడలఁ బెట్టు
[8]బరుల నఖంబుల గిరగిర గోఁకుచుఁ బోరిఁ బోరి ఫలములు గఱచివైచు

---

1. దురితములు-పాపములు, 2. ప్లవగుఁడు-వానరుఁడు, 3 జనపదంబులు-పల్లెలు 4. గోరాడి-కుమ్మి, 5. మాయించి-పూడ్చి, 6. కందరము-గుహ, 7. కికురించుచు-తప్పించుకొనుచు, 8. బరులు-ప్రక్కలు.

